శ్రీ

# భారతీయ మహాశిల్పము

## 7, 8, 9 భాగములు




గ్రంథకర్త :
విమర్శకాచార్య, శిల్పకళాకోవిద
స్వర్ణ సుబ్రహ్మణ్యకవి





ప్రచురణకర్త :
డా॥ స్వర్ణ వాచస్పతి B. V. Sc.



Tirupathi Tirumala Devasthanams,
Aid to author's scheme, financial assistance for religious,
Publications.
Rc No. Edit. 5/903/97 Dt. 14-8-97

ప్రథమ ముద్రణ : 1997_98
ప్రతులు : 1000
స్వర్ణశ్రీ గ్రంథమాల
పంచమ కుసుమము

వెల రు. 165–00



ప్రతులకు : 1) డా॥ స్వర్ణ వాచస్పతి, బి వి యస్. సి.
రిటైర్డు వెటనరీ అసిస్టెంట్ సర్జన్
ఫోన్ : (08649) 57902
నారాయణపురం - దాచేపల్లి
గుంటూరుజిల్లా - 522 414

2) గూడవల్లి చంద్రమోహన్, బి. కాం.
డోర్ నెం. 6 5-22
మార్వాడిగుడి ఎదురుబజారు
తెనాలి - 522 201

మరియు విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
4-1-435, విజ్ఞానభవన్ బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాదు - 500 001

విశాలాంధ్ర బుక్‌హౌస్
హైదరాబాదు, విజయవాడ, విశాఖపట్నం,
గుంటూరు, తిరుపతి, హనుమకొండ, అనంతపురం,
కాకినాడ.

గ్రంథకర్త



విమర్శకాచార్య, శిల్పకళాకోవిద

బ్రహ్మశ్రీ స్వర్ణ సుబ్రహ్మణ్యకవిగారు

1901 - 1983

# పరిచయము

మా తండ్రిగారైన కీ॥ శే॥ విమర్శకాచార్య-శిల్పకళాకోవిద స్వర్ణ సుబ్రహ్మణ్యకవిగారు కాశ్యపశిల్పము, మానసారము, శిల్ప రత్నము, సమరాంగణ సూత్రధార, అపరాజితపృచ్ఛ, విశ్వకర్మ ప్రకాశ, విశ్వకర్మీయ శిల్పము, శిల్ప సంగ్రహము, మయవాస్తు, మయమతము, ఆత్రేయ శిల్పము, నారదీయశిల్పము, గార్గేయాగ మము, పరశివ విశ్వకర్మాగమము, మున్నగు నెన్నియో ప్రాచీన గ్రంథములు పరిశీలించి వాటి నొక పద్ధతిప్రకారము 16 భాగములు గల "భారతీయ మహాశిల్పము" అను మహాగ్రంథముగ తయారు జేసిరి. అందు 16వ భాగము శిల్పపదములతో గూర్చిన నిఘంటువు. వారు 1951 లో రచించిన మహాకవి కందుకూరి రుద్రయ్య ప్రణీత నిరంకుశోపాఖ్యానము యొక్క సుధాతరంగిణీవ్యాఖ్య యెందరో మహా పండితుల ప్రశంసలను బొందినది. ఆ గ్రంథమును రచించిన పిమ్మట నెంతయో కష్టపడి మా తండ్రిగారు పై గ్రంథము లన్నియు సేకరించి "భారతీయ మహాశిల్పము"ను రచించిరి. వారు "భారతీయ మహాశిల్పము" 1,2,3 భాగములకు వ్రాసిన పీఠికను జూచిన, వారా గ్రంథముల సేకరించుటకు, వ్రాయుటకు, ముద్రించుటకు బడిన శ్రమ విదితము కాగలదు. వారంతటి శ్రమ దీసికొనియు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారి ఆర్థికసహాయముతో నా గ్రంథము నందలి 1, 2, 3 భాగములను 1971 లో ముద్రించగలిగిరి. మా తండ్రిగారు 1983లో పరిమపదించిరి. నేను 1992 లో పదవీవిరమణ గావించిన పిమ్మట మా తండ్రిగారు రచించిన "భారతీయ మహాశిల్పము" నందలి 4,5,6 భాగములను శ్రీ తిరుపతి తిరుమల దేవస్థానమువారి ఆర్థిక సహాయ ముతో ముద్రించుట జరిగినది. తరువాత 1997 లో శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారిని 7, 8, 9 భాగముల ముద్రణకు ఆర్థిక సహాయముకొఱకు అర్థించగా వారు పదిహేనువేల రూపాయల ఆర్థికసహాయమును మంజూరు చేసిరి.

భారతీయ మహాశిల్పము 7, 8, 9 భాగముల ముద్రణకు ఆర్థికసహాయ మొనరించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము కార్య నిర్వహణాధికారి వారికి, సకాలములో ముద్రణ పూర్తి గావించిన తెనాలి న్యూ విజయా ఆర్టుప్రెస్, తిరుమల ప్రింటర్సు, విజయలక్ష్మి ప్రింటర్సు వారికి, కృతజ్ఞతలు తెలియజేయుచు భగవంతుడు వారిని ఆశీర్వదించుగాక యని కోరుచున్నాను.

—స్వర్ణ వాచస్పతి.

# స్వర్ణ సుబ్రహ్మణ్య కవిగారి జీవిత చరిత్రము

స్వర్ణ సుబ్రహ్మణ్య కవిగారు నేటి ప్రకాశము జిల్లాలోని ఒంగోలు చిలకలూరిపేట మార్గములో గల కోనంకి గ్రామమునకు దగ్గఱలోనున్న కోళ్ళపూడి గ్రామములోని కోటేశ్వరరావు-లక్ష్మమ్మ దంపతులకు క్రీ॥ శ॥ 1901 సం॥న జన్మించిరి. వీరికి బాల్యముననే పితృ వియోగము కలుగుటచే తండ్రియొక్క మేనమామల గ్రామమగు మురికిపూడిలో నివసించుచుండెడివారు. వారచట ప్రాథమిక పాఠశాలలో విద్య నభ్యసించుచు నొకదినమున గృహమునుండి పాఠశాల కేగుచుండగా మార్గమధ్యమున వృద్ధ దంపతులు కన్పించి వారి కేద్దియో నుపదేశించి "నిత్యము దీనిని మననము జేసికొనుము. నీకు మేలు కలుగును" అని వచించి యదృశ్యమై పోయిరనియు, పిమ్మట వారే గ్రంథముల జూచినను నవియన్నియు నంతకుమునుపు జూచినట్లే యుండి జ్ఞాపకముండెడివనియు కవిగారు వారి కాత్మీయులగు దీవి లక్ష్మీకాంతరావుగారితో జెప్పిరి.

సుబ్రహ్మణ్య కవిగారు ప్రాథమిక పాఠశాల విద్యను బూర్తి చేసిన యనంతరము వారితల్లి సుబ్రహ్మణ్యముగారిని, వారి చెల్లెలు శ్యామలాంబను దీసికొని మురికిపూడి నుండి బయలుదేరివచ్చి గుంటూరుజిల్లా పొన్నూరు మండలములోని పెదపాలెము గ్రామములో స్థిరనివాస మేర్పఱచుకొనెను. అతి బాల్యముననే కుటుంబ భారము వహించిన కవిగారు స్వర్ణకార వృత్తి నవలంబించి (ఆవృత్తినిగూడ నెచట నభ్యసించలేదు) కుటుంబమును బోషించుచు తెలుగు సంస్కృత గ్రంథముల నొక్కొక్కదానిని కొని తానే స్వయముగ చదువుకొను చుండెడివారు. తరువాత నా గ్రామములో పదిశెంట్ల స్థలమునుకొని గృహమును నిర్మించుకొనుచు నా గృహమునకు గావలసిన ద్వారములు, కిటికీలు, తలుపులు తానే స్వయముగ

తయారుచేసికొనెను. ఇట్లు వడ్రంగమును స్వాయముగ నభ్యసించి, క్రమముగ నా గ్రామములో వడ్రంగపుపనులు చేయుచు స్వర్ణకార వృత్తికి దూరమయ్యెను. ఈవిధముగ వడ్రంగము జేయుచు వాస్తు-జ్యోతిష విద్యల నభ్యసించి క్రమముగ నా పరిసరగ్రామములలో వాస్తు సిద్ధాంతిగ ప్రసిద్ధిని బొందిరి.

యుక్తవయస్కుడగు కవిగారు బాపట్ల చెంతగల కంకటపాలెము గ్రామములో నివసించుచున్న ఓలేటి పుల్లయ్య – శ్యామలాంబా దంపతుల కనిష్ఠ పుత్రికయగు రాజ్యలక్ష్మిని 1925 సం॥లో వివాహమాడెను. అప్పటికి కవిగా, వాస్తు సిద్ధాంతిగ గుంటూరు, ప్రకాశము జిల్లాలలో ప్రఖ్యాతిని బొందిన కవిగారు వడ్రంగపు బనికి గూడ దూరమైరి. క్రమముగా పాండిత్యము నందును ప్రసిద్ధి వహించి యానాటి 'పంచానన' 'అరుణోదయ' మొదలగు పత్రికలకు 'అప్పకవీయము' వంటి గ్రంథములను విమర్శించుచు వ్యాసములను వ్రాయుచుండిరి. ఆనాటి ప్రఖ్యాత కవియైన వడ్డెపాటి నిరంజన శాస్త్రిగారు స్వర్ణ సుబ్రహ్మణ్య కవిగారిని కొలదికాలము తనయొద్ద నుంచుకొని వారిచే 'విశ్వకర్మకులోత్సాహ' మొదలగు గ్రంథముల నాంధ్రీకరింపజేసిరి. ది. 5—12—1925 న బాపట్ల చెంతనున్న నరసాయపాలెము గ్రామములో ,హవిర్గ్రీవ్యాదు లెవరి కేయే సందర్భమున జెందవలయున'ను యంశముపై, గ్రామస్థులు బారిష్టరు త్రిపురనేని రామస్వామి చౌదరిగారి యధ్యక్షతన సభ నేర్పాటు చేసిరి. ఆ సభయందు కవిగారు ధర్మశాస్త్రములలోని శ్లోకములను, అందలి వివరములను విపులీకరించుచు వాదించగా ప్రతిపక్షులెవరును వారి వాదములను ఖండింపలేకపోయిరి. అప్పుడు త్రిపురనేని రామస్వామి చౌదరిగారిని విశ్వబ్రాహ్మణుల వాదనను సమర్థించుచు తీర్మానించిరి. ఈ విధముగ ప్రఖ్యాతిని గాంచిన కవిగా రనేక గ్రంథములను రచించిరి.

# కవిగారి రచనలు

1. పార్వతీ పరిణయము - హరికథ. దీనిని 1929 లో ముద్రించుట జరిగినది. ఇందు కవిగారే ప్రతికీర్తనకు రాగ - తాళములు వ్రాసిరి. ఈ గ్రంథము 'బాలకవి'గా ప్రసిద్ధిగాంచిన కవిగారి తొలిరచనమైననను నది ప్రౌఢకవిత్వము.

2. ఆధ్యాత్మ వీరబ్రహ్మంగారి చరిత్రము. దీనిని ప్రథమముగ 1934 లో ముద్రించుట జరిగినది. తరువాత ననేకులనేక మారులు ముద్రించుటయు జరిగెను.

3. మహాకవి కందుకూరి రుద్రయ ప్రణీతంబగు నిరంకుశోపాఖ్యానమునకు సుధా తరంగిణీ వ్యాఖ్యానము. ఈ గ్రంథము 1951 లో ముద్రించుట జరిగినది. కవిగారికి సంస్కృతాంధ్రముల యందుగల పాండితీ ప్రతిభ నీ గ్రంథము వెల్లడించుచున్నది. ఈ వ్యాఖ్యానమున కవిగారు, నన్నయ-తిక్కన, శ్రీనాథుడు మున్నగు ప్రముఖ కవుల 219 గ్రంథముల నుదహరించిరి. అప్పకవివంటి ప్రముఖుల ప్రయోగముల నుదాహరణములతో విమర్శించిరి. ప్రస్తుత మీ గ్రంథమును తెలుగు విశ్వవిద్యాలయమువారు పునర్ముద్రించుచున్నారు.

4. 'అమరుకావ్యము' నకు తాత్పర్యమును వ్రాసిరి. ప్రచురణ 1974 సం॥రము.

5. ఈశ్వరమ్మగారి కాలజ్ఞానము ప్రచురణ 1979 సం॥రము.

6. బాణాల శరభకవికృత 'శ్రీకాళహస్తి శతకము' పరిశీలించి వ్రాయబడినది. ప్రచురణ 1979 సం॥రము.

7. శ్రీ సనారీ విశ్వేశ్వరస్వామివారి మహిమలు : ప్రచురణ 1979. ఈ గ్రంథమున కవిగారి చినతాత కుమారుడైన శ్రీ అమరలింగస్వామివారి జీవిత చరిత్ర, వారి మహిమలు వివరింపబడినవి.

8. విశ్వబ్రాహ్మణులకు ప్రథమ సత్కారార్హత : ప్రచురణ 1979 సం॥రము. ఇందు వేదముల నుండియు, ఉపనిషత్తుల నుండియు, పురాణములనుండియు ననేకవివరము లీయబడినవి.

9. విశ్వకర్మ వ్రతకల్పము : ముద్రణ 1980 మరియు 1992.

10. యలవర్తి ఆంజనేయ శాస్త్రిగారి జీవిత చరిత్ర.

11. భారతీయ మహాశిల్పము : ఈ గ్రంథమునం దనేక శిల్ప గ్రంథము లుదహరింపబడియున్నవి. ఈ గ్రంథము పదియారు భాగములుగల మహద్గ్రంథము. ఇందు 1, 2, 3 భాగములు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారి ఆర్థిక సహాయముతో 1971 లో ముద్రించబడినవి. 4, 5, 6 భాగములు తిరుమల-తిరుపతి దేవస్థానమువారి ఆర్థిక సహాయముతో 1996 సం॥రములో ముద్రించబడినవి. మిగిలిన పది భాగము లముద్రితములు.

12. మనుసూత్రము.

13. నాగరఖండము : టీకాతాత్పర్య సహితము
14. ఈశ్వరశతకము : తాత్పర్య సహితము
15. పరవస్తు చిన్నయసూరిగారు రచించిన 'శబ్ద లక్షణ సంగ్రహము' వ్యుత్పత్త్యుదాహరణ సహితము.

(13–15) } అముద్రితములు

16. ఆంజనేయ శాస్త్రిగారి ప్రార్థనా శ్లోకములు సంస్కృతములో రచించిరి. అవి ప్రతిరోజు విద్యార్థులచే పఠింపబడుచుండును.

## సంతానము - భార్యావియోగము

కవిగారికి 1931 వ సం॥న విశ్వనాథాచారి, 11-9-1933 శ్రీముఖ సం॥ము భాద్రపద బ॥సప్తమి సోమవారము రాత్రి 12-00 గం॥కు మృగశిర 1వ పాదమున వాచస్పతి, 1935లో కోటేశ్వరరావు జన్మించిరి.

రాజ్యలక్ష్మి-అక్క - బావగారలైన వడ్డేపాటి కోటమ్మ-హనుమయ్య గార్లకు సంతానము లేనందున, విశ్వనాథాచారిని వారు దత్తతగ స్వీకరించిరి.

కవిగారి భార్య 1949వ సం॥లో ప్రసవమునకై పొన్నూరు లోని అమెరికన్ హాస్పిటలులో చేర్చబడి, మృతశిశువును ప్రసవించి యచటనే స్వర్గస్థురాలయ్యెను.

## సన్మానములు

కవిగారికి నంద్యాల మున్నగు ననేక చోటుల ఘనసన్మానములు జరుపబడెను. అళ్ళగడ్డలో 1978 సం॥న కనకాభిషేకము జరిగెను. 17—12—1966న గుంటూరు హిందూకాలేజి హైస్కూలులో ఆనాటి అమాత్యులు యస్. ఆర్. అప్పారావుగారి సమక్షమున గుంటూరుజిల్లా విద్యాశాఖాధికారిగారు సన్మానించిరి.

దేవాలయ ప్రతిష్ఠలు : సుబ్రహ్మణ్య కవిగారు గుంటూరు ప్రకాశం జిల్లాలలో ననేక గ్రామములందు వివిధ దేవతా ప్రతిష్ఠలు జేసిరి.

## అంత్యదశ

కవిగారు చివరగ నొక వారమురోజు లనారోగ్యముతో బాధపడి 1983 లో పరమపదించిరి.

# వంశప్రతిష్ఠ

కవిగారి చినతాత కుమారుడైన "అమరలింగము"తి బాల్యము ననే పాఠశాలయందు విద్యాబుద్ధు లభ్యసింపలేదు. పండ్రెండు సంవత్సరముల ప్రాయముననే బ్రహ్మజ్ఞాన సంపన్నుడై తాను నివసించు ముప్పవరము(ఒంగోలు-చిలకలూరిపేట మార్గములోనున్నది) గ్రామములోను, రామకూరు కొండపైనను, అనేక మహాత్మ్యము లను జూపి శ్రీశైలమునకు తపస్సుకై వెళ్ళుచున్నానని వచించి వెళ్ళిపోయెను.

కవిగారు కేవలము ప్రాథమిక పాఠశాలయందు విద్య నభ్యసించియు స్వయముగ సంస్కృతాంధ్రములయందపార పాండిత్యము గడించి వాస్తు-జ్యోతిష-సాహిత్యములయం దనేక గ్రంథములను రచించెను. అప్పకవి వంటి మహాకవులను విమర్శించి తన పాండితీ ప్రతిభను విద్వత్ లోకమున చాటెను

కవిగారి రెండవ కుమారుడగు వాచస్పతి పశువైద్య శాస్త్రమునందు పట్టాపుచ్చుకొని, పదవీ విరమణానంతరము మహా కవియగు వాల్మీకి రచించిన రామాయణము నింతవఱ కేకవి యూహించని రీతిలో ముఖ్యమగు శ్లోకములు, వాని తాత్పర్యము, వాటి వివరణ వ్రాసి, "ఇదియే రామాయణము నందలి సహజకథ" అని యెల్లరు ప్రశంశించే విధముగా 'వాల్మీకి రామాయణసారభాలు' రచించి పండిత పామరుల మన్ననలను పొందెను.

## ఈ గ్రంథమును గురించి కొందఱి అభిప్రాయములు.

"విమర్శకాచార్యులు, శిల్పకళా కోవిదులు బ్రహ్మశ్రీ స్వర్ణ సుబ్రహ్మణ్య కవీంద్రుల పుత్రులు డా॥ వాచస్పతిగారు విరచించిన "వాల్మీకి రామాయణ సౌరభాలు" అనే విమర్శనాత్మక గ్రంధాన్ని పట్టినపట్టు విడవకుండా ఆమూలాగ్రంగా పఠించాను. అమందమైన

ఆనందం కలిగింది. విమర్శించటంలో సుబ్రహ్మణ్యకవుల సునిశిత దృష్టి కుమారులకు సంక్రమించింది. వాచస్పతిగారు సభాతో సభ విఖ్యాతి అన్నట్లు వాల్మీకి రామాయణ సౌరభాలను గుబాళింప జేశారు......" డా॥ కన్నెగంటి రాజమల్లాచారి **M. A. Ph. D.** తెలుగు లెక్చరర్ **S. V. K. P.** కళాశాల, మార్కాపురం.

"ఇన్నాళ్ళకు వాల్మీకి రామాయణ సౌరభాలు అనే మంచి గ్రంథం చదివినందుకు ఆనందిస్తున్నాను. ముందుగా డా॥ స్వర్ణ వాచస్పతిని అభినందిస్తున్నాను. నిజాన్ని నిర్భయంగా నిస్సంకోచంగా ఆవిష్కరిస్తున్నందుకు- మతమాఢ్యంనుంచి గతజాడ్యం నుంచి శృతశ్శృంఖలాలు తుప్పును వదిలించడానికి వచ్చినదీ గ్రంథం ...... ఈ గ్రంథం చక్కని విశ్లేషణతోనూ- వివరణాత్మకంగా ఉదాహరించిన తీరు బాగుంది......"

ఆచార్య గుజ్జర్లమూడి కృపాచారి, తెలుగు శాఖాధిపతి, నాగార్జున విశ్వవిద్యాలయం, గుంటూరు.

వాల్మీకి రామాయణాన్ని క్షుణ్ణంగా పరిశీలించి మీబుద్ధి కందిన సూక్ష్మాంశాలను పొందుపరచినందుకు సంతోషం. గతాను గతికరీతిలో గాకుండా వాల్మీకి రామాయణాన్ని కొత్తకోణాల్లోంచి చూసిన మీ ప్రయత్నం ప్రశంసనీయం. రామాయణ జిజ్ఞాసువులు అవశ్యం చదవవలసిన గ్రంథం మీది......

జ్ఞానపీఠ పురస్కార గ్రహీత, పద్మభూషణ్-

**డా॥ సి. నారాయణరెడ్డిగారు.**

మరియు నెందరో ప్రముఖులు ప్రశంసించిరి. ఈ గ్రంథ రచనను పురస్కరించుకొని డా॥ స్వర్ణ వాచస్పతిగారికి 25-12-95 న గుంటూరులో సన్మానంచేయుట జరిగినది.

ఇవన్నియు వ్రాయుటలోని ముఖ్యోద్దేశం ఒక్కటే. మనం ఈనాడు విద్యను డిగ్రీలతో కొలుస్తున్నాం. స్వర్ణ సుబ్రహ్మణ్య

కవిగారి చదువు ప్రాథమిక పాఠశాల వఱకే పరిమితమైనది. కాని వారు సంస్కృతాంధ్ర పండితు లాశ్చర్యపడే విధముగా ననేక గ్రంథములను రచించిరి. వారు రచించిన "నిరంకుశోపాఖ్యాన సుధాతరంగిణీవ్యాఖ్య"ను గుఱించి తమ అభిప్రాయము వ్రాయుచు శతావధాని చల్లా పిచ్చయ్యశాస్త్రిగారు "సుధాతరంగిణ్యాఖ్య (స్వర్ణ సుబ్రహ్మణ్య కవి కర్తృక) యుభయ వాఙ్మయ రసపిపాసకలవా రనుభవింపదగియున్నది. ఇందు సందర్భోచితముగా వివిధ నిఘంటువులు వ్యాకరణాలంకారాది శాస్త్రములు, సకల గీతాభి నయభరత కలా లక్షణ గ్రంథములు పెక్కులుదహరింపబడినవి. "కవిసమయములు" "ప్రకృతిసాక్షాత్కృతి" "కవిహృదయము" లోకోక్తులు" "న్యాయములు"మున్నగు కవితాసామగ్రి సమగ్రముగా, హృదయంగమముగా వివరించి సంధానింపబడినది. దీనిని జాగ్రత్తగా బఠించి, ధారణజేసినకలార్థి కొక యాంధ్రభాషయందేగాక, సంస్కృతభాషా కావ్యము లన్వయించుటయందును నిరాఘాట పాండిత్యము తప్పక చేకూరగలదు......"

అదేవిధముగా డా॥ స్వర్ణ వాచస్పతి పశువైద్య శాస్త్రము నందు పట్టభద్రుడై సాహిత్యమునందు వాల్మీకివంటి మహాకవుల గ్రంథములను విమర్శించి పండితుల మన్నన లందుకొనుట ప్రశంసనీయము.

డా॥ స్వర్ణ వాచస్పతిగారు తన తండ్రిగారిచే వ్రాయబడి అముద్రితములుగ నున్న గ్రంథములను ముద్రించుటకు జేయుచున్న కృషి ప్రశంసనీయము.

వేదాగమ సంస్కృత పండితులు
పురోహిత సామ్రాట్
**శ్రీ పామర్తి నాగభూషణశర్మ, తెనాలి.**
గాంధీనగర్-శ్రీ యలవర్తి ఆంజనేయశాస్త్రి
వేదసంస్కృత పాఠశాల, ప్రధానోపాధ్యాయులు

# పీఠిక

1951 సంవత్సర ప్రాంతమున వాస్తుమథనామృతము, శిల్పమథనామృతము, భారతీయ శిల్పము అను మూడు గ్రంథములను వేర్వేఱుగా రచింప దలచి **వాస్తుమథనామృతమును భారతీయ శిల్పమును** వ్రాసితినిగాని యవి ముద్రింపబడలేదు. ఇంతలో మన్నేటికోట వాస్తవ్యులగు గోనుగుంట బ్రహ్మయాచార్యులుగారు నా యొద్దకువచ్చి వాస్తుమథనామృతము నందలి 300 లకు పైగానున్న యంశములనుజూచి యచ్చెరువంది యివి యన్నియు వ్రాసికొనిన బాగుండునుగాని సుమారు రు. 3000-00 లతో గాని యీ గ్రంథము ముద్రించుటకు వీలుపడదనియెంచి గణితముల వరుసను మాత్రము కొంతవఱకు వ్రాసికొని ముద్రించిరి. ఆ గ్రంథమే "**గృహవాస్తు గణితరత్నావళి**"గా ప్రచారములోనున్నది. శిల్పమథనామృతమును వ్రాయబూనగా ప్రయాగ విశ్వవిద్యాలయమున చరిత్రాచార్యులుగానున్న శ్రీ ప్రసన్న కుమారాచార్యులు, ఎం. ఏ. పిహెచ్.డి., గారిచే సంస్కరింపబడి లండన్ ఆక్స్ఫర్డు యూనివర్సిటి ప్రెస్సు వారిచే ముద్రితమై బొంబాయి, కలకత్తా, మద్రాసు, చీనా, జపాన్, న్యూయార్కు వఱకు వ్యాపించిన **మానసారమను** వాస్తుశాస్త్రము బీహారు నలందా కాలేజి ప్రొఫెసర్ ఫణీంద్రనాథబోస్, యం. ఏ. గారిచే పరిష్కరింపబడి బెనారస్‌లో ముద్రింపబడిన **ప్రతిమాలక్షణము, శిల్పశాస్త్రము** అను గ్రంథములు ఇండియా, యూరోప్, అమెరికాలకు వ్యాపించినవి. నాసికక్షేత్రనివాసి శిల్పకళానిధి వఝె కృష్ణశర్మగారిచే సంశోధితమై పూనా ఆనందాశ్రమ ప్రెస్సులో ముద్రింపబడిన **కాశ్యపశిల్పము.** త్రివేంద్రము మహామహోపాధ్యాయ

టి. గణపతిశాస్త్రి పరిశోధితమై అనంతశయన గ్రంథావళిగ ప్రకటింపబడిన **మయమతము శిల్పరత్నము** రెండు భాగములు, మహామహోపాధ్యాయ టి. గణపతిశాస్త్రి సంపాదితమై బరోడా గైక్వార్ మహారాజాగారి లైబ్రరీ కొసంగబడి బి. భట్టాచార్య యం. ఏ. పిహెచ్. డి. పరిశోధితముగా ప్రకటింపబడిన **సమరాంగణ సూత్రధార** నామవాస్తుశాస్త్రము **అపరాజిత పృచ్ఛ,** తంజావూరు సరస్వతీ గ్రంథాలయమునుండి వ్రాయించి తెప్పించిన **విశ్వకర్మీ శిల్పము,** మున్నగు గ్రంథములు మహాపండితులచే సంస్కరింపబడి నప్పటికిని శిల్పవృత్తి నవలంబించి చేయువారలకు సరియైనయర్థము లందు గోచరింపక యొక్కొక్కచోట చిక్కుతీగెలతో బెనవేసికొన్న మహారణ్యమధ్యప్రదేశమువలె నభేద్యముగ నుండుటను గారణము శిల్పపద నిఘంటువులు లేకపోవుటచేతను, సంస్కృత గ్రంథముల నాంధ్రీకరించక యొకవైపునకు త్రోసిపుచ్చుచు వచ్చుటచేతను, శిల్పులకు పారంపర్య క్రమశిక్షణ లభించకుండుటచేతను, కలిగిన ట్లూహించవలసియున్నది. మహర్షులచే వ్రాయబడిన యీ గ్రంథములయందు నాకుగల యభిరుచియే యేమాత్రము వెనుకంజ వేయ నీయక స్థిరచిత్తముతో నుంచుటచే పరమేశ్వరానుగ్రహమువలన దీనిని వ్రాయజాలితిని. శిల్పశాస్త్రమనినను, వాస్తు శాస్త్రమనినను సమానమను భావముతోనే ప్రాచీనులు వ్రాసియుండిరి. ఇప్పుడు మాత్రము కొందఱు శిల్పము వేఱు వాస్తు వేఱు అని భావించు చుండిరి. ఆధునికులలోను శ్రీ ఫణీంద్రనాథబోసుగారు గృహాస్తు వాస్తు శాస్త్రమును శిల్పశాస్త్రమనియే వ్యవహరించిరి. ఇట్టిస్థితిలో వాస్తు మధనామృతము, శిల్పమధనామృతము, భారతీయ శిల్పమను చరిత్రము. ఈ మూడును - భారతీయ మహాశిల్పమునందలి షోడశ

కళలుగా నిర్ణయింపబడి యందిమిడియున్నవి. ఇవి క్రమక్రమముగా నుత్తరోత్తరోత్కర్షములై వివిధాంశముల నిముడ్చుకొనియున్న శిల్పరూప చిత్రములతో నేత్రానందమును, హృదయానందమును గలిగించు చుండుటచేతనే వయోధికుడనగు నేనింతటి మహత్తర గ్రంథమును లిఖించగలిగితిని.

ఆంధ్రజ్యోతి ఎడిటర్ శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారి కీసచిత్ర భారతీయ మహాశిల్ప భాగములు చూపగా వారు సంతోషించి "యేతన్ముద్రణమునకు దగినయత్నము చేయుదము. తలపెట్టిన పనిని ఆపవలదని యభయమొసంగుచు, శిల్పపదములకు తగిన నిఘంటువు లేనియెడల మీ శ్రమ కొంత వ్యర్థముగా గనుపించును. చదువువారలకు బోధపడునంతటి తాత్పర్యమున్నను నిఘంటువును గూడ వ్రాయుట ముఖ్య"మనిరి. అటులే చేయుదునని నిర్ణయించితిని. నేనింతటి భారమును వహించుటచూచి యెడనెడ ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి మున్నగు పత్రికలలో దర్శనాచార్య శ్రీ కొండూరి వీరరాఘవాచార్యులుగారు వ్యాసములు వ్రాయుచు భారతీయ మహాశిల్పమును గుఱించిన సమస్త విషయములు లోకమునకును ప్రభుత్వమునకును తెలియజేయుచు వచ్చిరి. 1963 లో గ్రంథముద్రణకు సహాయార్థమై ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారి నర్థించితిమి. అప్పటికి రిజిష్టరుగా లేక నామమాత్రముగానున్న ఆంధ్రశిల్ప కళా పరిషత్తునుగూడ ప్రభుత్వదృష్టికి తెచ్చితిమి. వారు సంఘము రిజిష్టరయినదా? అని ప్రశ్నించినంతనే నేను బాధ్యతవహించి నాస్వంత ధనముతో 1964 లో రిజిష్టరు చేయించి దరిమిలా లలితకళా ఎకాడమీ అనుబంధ సంస్థగా నుండునట్లు కోరగా శ్రీవారు అనుమతించి ఆంధ్రశిల్ప కళాపరిషత్తును దయాదృష్టితో చూచుచునే యుండిరి.

## గ్రంథరచనా వివరములు

మొదటిభాగమున :- వాస్తు హోమము ఉపపీఠ భేదములు, అధిష్ఠానభేదములు మున్నగు 104 విషయములు కూర్పబడినవి.

రెండవ భాగమున :- నాలప్రతిష్ఠ స్తంభ, వేదికా, జాలక, తోరణ, కుంభలతాది లక్షణభేదములు మున్నగు 41 విషయము లుగ్గడింపబడినవి.

మూడవ భాగమున:- గర్భన్యాసము ఒక్క అంతస్తు మొదలు అయిదంతస్తుల వఱకుగల దేవాలయభేదములు - మున్నగు 122 విషయములు చెప్పబడినవి.

నాల్గవ భాగమున :- ఆఱంతస్తులు మొదలు పదునాఱంతస్తుల వఱకుగల దేవాలయభేదములు, వైరాజ్య ప్రాసాదభేదములు, అందుత్ర్యంగ, పంచాంగ, సప్తాంగ, నవాంగాదిభేదములు- రుచకము మొదలగు 64 భేదములు-మున్నగు 138 విషయములు కూర్పబడినవి.

ఐదవభాగమున:- సాంధారభేదములు, నాగరోద్భవ విమాన ప్రాసాదభేదములు, కైలాసజాతి ప్రాసాదభేదములు, విమాన నాగరచ్ఛందజ పుష్పకాది ప్రాసాదభేదములు, శ్రీధరాది శుద్ధఛంద భేదములు, మేరుజాతిభేదములు మున్నగు - 160 విషయములు చెప్పబడినవి.

ఆఱవ భాగమున :- మేరుభేదములు, లాసభేదములు, పుష్పక భేదములు, మణికభేదములు, త్రివిష్టపభేదములు, భూమిజప్రాసాద భేదములు, ఉదయకలాసక్సంధి రేఖాభేదములు ద్రావిడప్రాసాద భేదములు - వరాటప్రాసాద భేదములు, మున్నగు 134 విషయము లుగ్గడింపబడినవి.

ఏడవభాగమున:- వరాటప్రాసాదభేదములు, విమానప్రాసాద భేదములు, నాగరసాంధార ప్రాసాదభేదములు, రుచకజాతి సాంధార ప్రాసాదభేదములు, లతినజాతి ప్రాసాదభేదములు, మిశ్రజాతి ప్రాసాదభేదములు, శ్రీసంజ్ఞ కవలభి ప్రాసాదభేదములు, సింహావలోకన ప్రాసాదభేదములు, నాగరజాతి బ్రహ్మవిష్ణ్వాది ప్రాసాదములు, ద్వారదేవతలు, ప్రాకార విధానము మున్నగు 178 విషయము లుక్తములైనవి.

ఎనిమిదవ భాగమున :- ప్రాకారవిధానము, పరివారదేవతలు గోపురభేదములు, మండపభేదములు, మున్నగు 34 విషయములు వాకొనబడినవి.

తొమ్మిదవ భాగమున:- శిలాలక్షణములు, రత్నలక్షణములు, స్వాయంభులింగ భేదములు, శివరూప భేదములు, గణపతి భేదములు, సూర్యలక్షణము, గ్రహలక్షణములు మున్నగు 124 విషయములు వివరింపబడినవి.

పదియవ భాగమున :- విష్ణురూప భేదములు, దేవీరూప భేదములు, దిక్పాలక లక్షణములు, నానావిధ దేవతల లక్షణములు, ఋషి లక్షణ భేదములు, యక్ష రాక్షస గంధర్వ అప్సర కిన్నరాది రూపభేదములు, జైనబౌద్ధాది లక్షణములు మున్నగు 144 విషయములు చెప్పబడినవి.

పదునొకండవ భాగమున :- ప్రతిమావిధానము, ఉత్తమ మధ్యమ కనిష్ఠదశతాల భేదములు, నవతాల భేదములు, అష్టతాల భేదములు, సప్తతాల భేదములు, షట్తాల భేదములు, పంచతాల భేదములు, చతుస్తాల భేదములు, త్రితాల భేదములు, ఏకతాల లక్షణము, మున్నగు 33 విషయము లుక్తములు.

పదిరెండవభాగమున:- దేవదానవాది ప్రతిమానభేదములు, ముఖభేదములు, పంచపురుష భేదములు, ఋజ్వాగతాది స్థానక భేదములు, పతాకాది చతుఃషష్టిహస్త భేదములు, రసదృష్టి భేదములు, ఆయుధభేదములు చిత్రలేఖనాదికము, మున్నగు 167 విషయములు వివరింపబడినవి.

పదుమూడవ భాగమున:- భూమిలక్షణములు, గ్రామలక్షణములు, ఏకశాల భేదములు, ద్విశాలభేదములు, త్రిశాలభేదములు, చతుశ్శాలభేదములు, మున్నగు 200 విషయములు వివరింపబడినవి.

పదునాల్గవ భాగమున:- సప్రయోగ సర్వదేవదా ప్రతిష్ఠాగమము శైవవైష్ణవ శాక్తేయముల కుపయోగించుజీర్ణోద్ధారాదులు, మున్నగు విషయములు చెప్పబడినవి.

పదునైదవ భాగమున:- వివిధ యంత్ర రహస్యములు, చిత్రశిల్పము, వేదకాలమునుండి నేటివఱకుగల శిల్పచరిత్రము, అందలి మహత్తర చమత్కారములు మున్నగు 200 విషయముల వాకొనబడినవి.

పదునాఱవ భాగమున:- సమస్త శిల్పగ్రంథముల నుండి గ్రహింపబడిన పదివేల శబ్దములుగల నిఘంటువు కూర్చబడినది. ఇట్లు దాదాపు రెండువేల ముఖ్యవిషయములతో గూడిన యిమ్మహాగ్రంథముద్రణమునకు శ్రీ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు భాగమునకు వెయ్యిరూపాయలుగా అంచనావేసి ప్రస్తుతము మొదటి మూడు భాగములకు రు. 3000-00 లు 1966 మార్చి నెలలో ఆర్థిక సహాయమొనరించిరి.

గేయప్రబంధమగు పార్వతీపరిణయ రచనా కాలమునుండి నిరంతరశోపాఖ్యాన ముద్రణసమయమునకు భారతీయ మహాశిల్ప

ముద్రణ ప్రయత్నమునను, సమయానుకూలముగ తగు సహాయ మొనర్చుచున్న మత్సోదరతుల్యుఁడగు శ్రీ దీవి లక్ష్మీకాంతరావు గారికిని, నా రచనలయందలి యభిరుచిని లోకమునకు ప్రకటించుచున్న దర్శనాచార్య శ్రీ కొండూరి వీరరాఘవాచార్యులుగారికిని, 1964లో గుంటూరు విద్యాశాఖాధికారిగా నుండి యీ భారతీయ మహాశిల్ప ముద్రణ మత్యవసరమని ప్రభుత్వమువారికి సూచించుటయేగాక, పలువిధముల ప్రోత్సాహ మొసగుచున్న త్రిభాషాకవులు శ్రీ పులివర్తి శరభాచార్యులు బి. ఏ. బి. ఇడి. గారికిని ఏతద్రచనా మధ్యకాలమున ధైర్యదాన మొసంగిన ఆంధ్రజ్యోతి ఎడిటర్ శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారికిని, 1965 లో గోవా దేశాంతవర్గత కాంసరపాలక్షేత్రస్థ కాళికాలయమున సహస్ర చండీమహాయజ్ఞము నకు నన్నాహ్వానించి అగ్రసన్మాన మొసంగిన శ్రీ దైవజ్ఞ బ్రాహ్మణ సంఘమువారికిని, శిల్పగ్రంథోపయోగాదులనెల్ల గుర్తించిన సంస్కృత శాఖామాత్యులగు శ్రీ యం. ఆర్. అప్పారావుగారికిని, శ్రీ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారికిని, ప్రభుత్వాదేశప్రకారము గుంటూరు హిందూకాలేజి హైస్కూలు భవనములో 17-12-1966న సన్మానసభ జరిపించి రెండు దుశ్శాలువలు నూటపదాఱు రూపాయలు ఇచ్చి సన్మానించిన గుంటూరు డిస్ట్రిక్టు యెడ్యుకేషనల్ ఆఫీసరు శ్రీ డి. వెంకటస్వామి యం. బి. ఇ. డి. గారికిని నా కృతజ్ఞతను ప్రకటించుచు ధన్యవాదము లర్పించుచున్నాను.

స్వర్ణ సుబ్రహ్మణ్యకవి
1951 గ్రంథకర్త



శ్రీ

# భారతీయ మహాశిల్పము

## 7 వ భాగము



రచయిత:

విమర్శకాచార్య, శిల్పకళాకోవిద

స్వర్ణ సుబ్రహ్మణ్యకవి



ప్రచురణకర్త:

డా॥ స్వర్ణ వాచస్పతి B. V. Sc.

# 7వ భాగం విషయసూచిక

| | | | | |
|---|---|---|---|---|
| కాశ్యప శిల్పము 43 | శిల్ప రత్నము 40 | సమరాం. 64 వరాట 59 విమానజాతి 60 నాగరసాంధారజాతి 61 ద్రావిడసాంధార జాతి. 32శ్లో.మొ. అధ్యాయాంతము | అపరాజీత 172-165-166-169-176-177-179 164-133-134 | విశ్వకర్మ వాస్తు శాస్త్రము |

శ్రీ

# భారతీయ మహాశిల్పము

## సప్తమ కళ

శ్రీవిరాడ్విశ్వకర్మణే నమః

## 1. ఇష్టదేవతాస్తుతి

శ్లో॥ దేవః సపాతు భువనత్రయ సూత్రధార
స్త్వాం బాలచంద్ర కలికాంకిత జూటకోటిః।
ఏతత్ సమగ్రమపి కారణమంతరేణ
కార్త్స్న్యాదసూత్రిత మసూత్ర్యత యేన విశ్వమ్॥ (సమరాం)
ఉత్పత్తి రక్షణలయాన్ జగతాం ప్రకుర్వన్
భూవారి వహ్ని మరుతో గగనంచ సూతే।
నానాసురేశ్వర కిరీట విలోలమాలా
భృంగారపీఠ చరణాంబురుహం నమామి॥ (మానసార)

శ్లో॥ జయతి వరదమూర్తిర్మంగలం మంగలానాం
జయతి సకలసంధ్యా భారతీ బ్రహ్మరూపా।
జయతి భువన మాతా చిన్మయా మోక్షరూపా
దిశతు మయ మహేశో వాఙ్మయః శబ్దమాపమ్॥ (విశ్వకర్మ ప్రకాశ)

శ్లో॥ అభీప్సితార్థ సిద్ధ్యర్థం పూజితోయః సురైరపి।
సర్వవిఘ్నచ్ఛి దేతస్మై గణాధిపతయే నమః॥ (అపరాజిత)

శ్లో॥ మహాదేవం శశిధరం సర్వలోకైక నాయకమ్।
మహేంద్ర మధ్యగం శాంతం పార్వతీసహితం పరమ్॥
దేవదానవ సిద్ధాద్యైః సేవితం సురపూజితమ్।
ప్రణమ్య దేవచరణ మేవం బ్రూయాత్స కశ్యపః॥ (కాశ్యప)

శ్లో॥ మాయావైభవ కల్పితాగుణమయా బ్రహ్మాండభాండాంతరే।
జీకాఘస్త దధిష్ఠితాశ్చ వివిధాయత్ సంస్థితాయన్మయాః॥

ఆత్మానం పరమంతమౌపనిష ద్వైర్వ్యాకైర్యాః సదాస్వ స్తికై
రన్విష్టం భువనైకనాథ మమలం వందే విరించాధిపమ్॥

శ్లో॥ పారుఖ్యాంగో యేన చాదౌ యుగానాం వాస్యా తప్టాన్నిర్గతాం।
ప్రాపితోర్కః నిత్యదేవైరర్చితో విశ్వకర్మా సోఽయం భూయాత్
సర్వలోకోదయాయ॥

త్రిపుర పురత్రయ రచనా యుత్కర్మయోః కర్మచాతురీజాతా।
శిల్పివరంతం దనుజై చర్చిత చరణం మయంవందే॥ (శిల్పరత్నమ్)

## 2. వరాటప్రాసాదములు-మఱియొక పద్ధతి

## అందు దిగ్భద్రము

సమరాంగణ 64వ అధ్యాయము :

శ్లో॥ ప్రాసాదమథవారాటం వక్ష్యామో నామలక్షణైః।
లక్షణాంస్తేషు దిగ్భద్రః శ్రీవత్సో వర్ధమానకః॥ 1
నంద్యావర్తశ్చతుర్థః స్యాత్ పంచమో నందివర్ధనః।
విమానశ్చ తథా పద్మో మహాభద్రాఖ్య ఏవచ॥ 2
శ్రీవర్ధమానకాఖ్యశ్చ మహాపద్మాభిధోఽపివా।
ఏకాదశః పంచశాలో ద్వాదశః పృథివీజయః॥ 3
తత్రప్రాగేవ దిగ్భద్ర లక్షణం ప్రతిపాద్యతే।
చతురశ్రీ కృతే క్షేత్రే నవభాగ విభాజితే॥ 4
కోణో ద్విభాగ విస్తారః ప్రత్యంగౌభాగికౌస్మృతౌ।
శాలా భాగత్రయాకార్యా నాసికాత్రయ శోభితా॥ 5
పరస్పరం వినిష్క్రాస మర్ధభాగేన కారయేత్।
కోణ ప్రత్యంగయోరంతః శాలాప్రత్యంగయో స్తథా॥ 6
షోడశాంశేన కుర్వీత సర్వతః సవిలాంతరమ్।
సీమాస్య దశభిర్భాగైః ప్రవిభజ్య విధీయతే॥ 7
పదికాగర్భ పాదైః షడ్ భిత్తయః స్యుర్ద్విభాగికాః।
ఊర్ధ్వమాన మథబ్రూమో విస్తారాద్ ద్విగుణం హితత్॥ 8

ద్వౌభాగౌ వేదికాబంధో జంఘాజ్ఞేయా చతుష్పదా।
అంతః పత్రః కపోతాలీ సార్ధభాగం సముచ్ఛ్రితా॥ 9
సార్ధభాగ సముచ్ఛ్రాయా కార్యా ప్రథమభూమికా।
ద్వితీయా భూమికాజ్ఞేయా సార్ధభాగత్రయోదయా॥ 10
తృతీయాచ విధేయాస్యాత్ సార్ధభాగద్వయోచ్ఛ్రితా।
ఉచ్ఛాలకంచ జంఘాచ భూమికార్ధం విధీయతే॥ 11
కూటంతేచార్ధతో దేయం కర్మశో భాసమన్వితమ్।
ఘంటా భాగత్రయోత్సేధా బహుభిశ్చ్రశిఖిర్యుతా॥ 12
కలశం స్థాపయే దూర్ధ్వం భాగద్వయ సముచ్ఛ్రితమ్।
బీజపూరక సంయుక్తం వర్తులం పల్లవావృతమ్॥ 13
శిఖరార్ధస్య కుర్వీత సపాదముదయం తదా।
ఇమందిగ్భద్ర సంజ్ఞం యః ప్రాసాదం కారయేత్ పుమాన్॥ 14
శతక్రతు ఫలంసోఽపి లభతేనాత్ర సంశయః॥

తా॥ వరాటప్రాసాదములయొక్క నామములును లక్షణములును చెప్పుచున్నాడు. 1. దిగ్భద్రము, 2. శ్రీవత్సము, 3 వర్ధమానము 4. నంద్యావర్తము, 5. నందివర్ధనము, 6 విమానము, 7. పద్మము 8. మహాభద్రము, 9. శ్రీవర్ధమానము, 10. మహాపద్మము, 11. పంచశాల, 12. పృథివీజయము. వీనిలో ముందు దిగ్భద్రముయొక్క లక్షణమును చెప్పుచున్నాడు. చతురశ్రప్రదేశమును 9 భాగములు చేసి కర్ణము 2 భాగములును, ప్రత్యంగములు 1-1 భాగమును, శాల 3 భాగములు, నాసికములు 3 ను చేయవలెను. ఒక్కొక్క దానియొక్క నిర్గమము $\frac{1}{3}$ భాగము చేయవలెను. కోణ ప్రత్యంగముల మధ్యను, శాలా ప్రత్యంగముల మధ్యను, జలమార్గము 16వ భాగము చేయవలెను. సీమను 10 భాగములుచేసి అందు మధ్య 6 భాగములు గర్భమును, చుట్టూ 2 భాగములు గోడయును రచించవలెను. విస్తారమునకు రెట్టింపుగా ఎత్తును చేయవలెను. అనగా 20 భాగములు. అందు వేదిక 2 భాగములు, జంఘ 4 భాగములు, అంతర పత్రము కపోతములవరుస $1\frac{1}{2}$ భాగము, మొదటి అంతస్తు ప్రస్తరము $1\frac{1}{2}$ భాగము, రెండవ అంతస్తు $3\frac{1}{2}$ భాగములు, మూడవ అంతస్తు $2\frac{1}{2}$ భాగములు, ఉచ్ఛాలమును జంఘయును కలసి $1\frac{1}{4}$ భాగములు చేయవలెను.

కూటము $\frac{1}{2}$ భాగము చేయవలెను. ఘంట 3 భాగములు చేయవలెను. ఆ ఘంట అనేకమైన దలములతో నుండవచ్చును. ఇట్లు 20 భాగములుచేసి ఆ పైన కలశము 2 భాగముల యెత్తున రచించవలెను. కలశము బీజ పూరకముతోను గుండ్రముగాను పల్లవములతోను రచించవలెను. శిఖర ములో సగము యెత్తున నుండవలెను. మిగిలిన సగముగాని లేక $1\frac{1}{4}$ భాగ ముగాని చివరయుండవలెను. ఇట్లు రచించిరేని దిగ్భద్రప్రాసాదమగును. దీని వలన నూరుయజ్ఞములు చేసిన ఫలము లభించును.

(అనుబంధము 1, 2 పటములు చూడుడు)

# 3. శ్రీవత్సము

సమరాంగణ 64వ అధ్యాయము :

శ్లో॥ లక్ష్మశ్రీవత్స సంజ్ఞస్య ప్రాసాదస్యాభిధీయతే॥ 15
చతురశ్రీ కృతే క్షేత్రే భక్తం పంచదశాంశకైః।
అస్యోచ్ఛ్రాయోంశ కాస్త్ర్యంశం కోణః స్యాద్యంశకైస్త్రిభిః॥ 16
కర్ణశాలాంతరే కార్యో ద్వ్యంశౌ ప్రతిరథావుభౌ స్యాత్తయో।
రుభయోశ్చార్ధం పాదం మార్గో నివేశయేత్॥ 17
భాగమేకం ప్రవిష్టాచ శాలా భాగత్రయాత్మికా।
నిర్గమః స్యాత్ పదార్ధేన గర్భస్తు నవభాగికః॥ 18
త్రిపదాచ భవేద్భిత్తి రూర్ధ్వ మస్యాథ కథ్యతే।
శ్రీవత్సః కీర్తితః సంప్ర త్యుచ్యతే వర్ధమానకః॥ 19

తా॥ శ్రీవత్స ప్రాసాదలక్షణమును చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశమును 15 భాగములుచేసి కర్ణము విస్తారము 3 భాగములును యెత్తు 3 భాగములును చేయవలెను. మధ్యశాల 3 భాగములుచేయవలెను. శాల కర్ణము ఈ రెంటి మధ్య ప్రతిరథమును 2 భాగములు చేయవలెను. ఈ 4 సందులలో $\frac{1}{2}$ భాగము చొప్పునగాని లేక $\frac{1}{4}$ భాగము చొప్పునగాని జలమార్గములను రచించవలెను. శాల యొక్క ప్రవేశము 1 భాగమును నిర్గమము $\frac{1}{2}$ భాగము చేయవలెను. దిగువకూడ 15 భాగములుచేసి మధ్య 9 భాగములు గర్భమును చుట్టూ 3 భాగములు గోడయును రచించవలెను.

విస్తారమునకు రెట్టింపుగా యెత్తును చేయవలెను. మిగిలిన వన్నియును. దీనిని శ్రీవత్సమందురు. (అనుబంధము 3, 4 పటములు చూడుడు)

# 4. వర్ధమానము

సమరాంగణ 64వ అధ్యాయము :

శ్లో॥ చతురశ్రీ కృతే క్షేత్రే గోత్రేందు భాగకల్పితమ్ ।
ఛేదాదిగిరి పత్ర్యంతం దద్యాత్పూర్వ క్రమేణతు॥ 20
ద్విస్తరాత్రి స్తరాచాపి కర్తవ్యా వేదికామతా ।
స్తరమేకంభ వేచ్ఛేదః కంఠస్త ద్విగుణో భవేత్॥ 21
పట్టికాంగిరి పత్రించ తస్యైవార్థే నకారయేత్ ।
దశస్తరా తతో ఘంటా యదివామల సారకమ్॥ 22
ద్విస్తరం స్యాత్తతః పద్మం ద్విగుణః కలశస్తతః ।
తదూర్ధ్వం భూమికాకార్యా సపీఠా లక్షణాన్వితా॥ 23
స్తరైఃస్యాత్పంచ దశభిః పీఠం జంఘాపితావతా ।
చతుః స్తరా భవేన్మాలా లశునంతు స్తరద్వయమ్॥ 24
తస్యాప్యర్ధేన భరణం కుంభం కుర్వీత తత్సమమ్ ।
తస్య ద్విగుణ ముచ్ఛాలం గండమే స్తరంభవేత్॥ 25
పట్టం ద్విగుణమే తస్మాత్ కుర్యా దర్ధేన పట్టికామ్ ।
పట్టికాయాః ప్రమాణేన కర్తవ్యాగిరి పత్రికా॥ 26
వరండీ త్రిస్తరాకార్యా శూరసేనై రలంకృతా ।
ఏకస్తరస్త తశ్ఛేదః కంఠస్తు ద్విగుణస్తతః॥ 27
పట్టికాగిరి పత్రీచ విధాతవ్యే స్తరస్తంరమ్ ।
ఉభౌ స్తరౌ ఖురిహిరం భవేచ్ఛేదః స్తరం తతః॥ 28
తథైవ కంఠస్తద్వచ్చ పట్టికాగిరి పత్రికే ।
వరండికా ద్విస్తరాస్యా చ్ఛేషం పూర్వవదాచరేత్॥ 29
ఉభౌ స్తరౌఖురిసారం ఛేదం కుర్వీత భాగికమ్ ।
కంఠశ్చ పత్రికాచైవ గిరిపత్రీచ పూర్వవత్॥ 30

ద్విస్తరా వేదికాకార్యా హ్యర్ధపాదికయాయుతా ।
ఛేదమేకం స్తరం కుర్యాత్ కంఠం తత్ ద్విగుణం తతః॥ 31
పత్రికాం గిరి పత్రీంచ తస్యైవార్ధే నకారయేత్ ।
స్తరాష్టకేన ఘంటాస్యాద్ యదివామలసారకమ్॥ 32
భవేత్పద్మం స్తరం సార్ధం కలశో ద్విగుణస్తతః ।
స్తరమేకం భవేద్గ్రీవా కర్ణం కుర్వీత తత్సమమ్॥ 33
ద్విగుణం బీజపూరంతు సర్వత్రాప్యేవ మాచరేత్ ।
సృష్ట సప్తదశాంశకైః కర్ణః భాగైస్త్రిభిర్భవేత్॥ 34
ద్విభాగికః ప్రతిరథః శాలాస్యాత్పంచభాగికా ।
శాలా ప్రత్యంగయో రంతర్భాగార్ధేనోదకాంతరమ్॥ 35
పరస్పరం వినిష్క్రాసః పాదహీనం పదం భవేత్ ।
గర్భః స్యాద్దశభిర్భాగై ర్భిత్తిః సార్ధ పదత్రయాత్॥ 36
చతుర్భిర్వేదికాబంధో జంఘాస్యా దష్టభిః పదైః ।
సార్ధైః పంచభిరాద్యాభూః కపోతాలీ సమన్వితా॥ 37
ద్వితీయ భూమికాచాస్య కర్తవ్యా పంచభిః పదైః ।
సార్ధైర్భవేత్తృతీయాపి చతుర్భిర్భూమికా పదైః॥ 38
చతుర్థీ భూమికా భాగైశ్చతుర్భిః కీర్తితా పదైః ।
ఘంటాచ త్రిపదా కార్యా కూట భక్త్యాది పూర్వవత్॥ 39
శుకనాసాది కుంభాది పూర్వవత్సముదాహృతమ్ ।
ఉక్తోఽయం వర్ధమానాఖ్యః ప్రాసాదః శుభలక్షణః॥ 40

తా॥ చతురశ్రప్రదేశమును 17 భాగములుచేసి భేదములు మొదగిరి పత్రిక వఱకు వరుసగా రచించవలెను. వేదిక 2 భాగములుగాని 3 భాగములు గాని చేయవలెను. భేదము 1 భాగము, కంఠము 2 భాగములు, పట్టిక ½ భాగము, గిరిపత్రిక ½ భాగము, అపైన ఘంట 10 భాగములు, అమలసారకము చేసినచో 2 భాగములు పద్మమును, 4 భాగములు అపైన కలశమును రచించవలెను. అటుపైన పీఠముతో గూడిన భూమికను రచించవలెను. 15 భాగములు పీఠమును జంఘయును రచించవలెను. మాల 4 భాగములు, లశునము 2 భాగములు, దానిపై భరణము ½ భాగము, కుంభము

$\frac{1}{2}$ భాగము, ఉచ్ఛాలము 1 భాగము, గండము 1 భాగము, పట్టము 2 భాగములు, పట్టిక $\frac{1}{2}$ భాగము, గిరిపత్రిక $\frac{1}{2}$ భాగము, వరండి 3 భాగములు, శూరసేన పద్ధతితో రచించవలెను ఛేదము 1 భాగము, కంఠము 2 భాగములు, పట్టిక 1 భాగము, గిరిపత్రి 1 భాగము, ఖిరిహిరం 2 భాగములు, ఛేదము 1 భాగము, కంఠము 1 భాగము, పట్టిక 1 భాగము, గిరిపత్రిక 1 భాగము, వరండిక 2 భాగములు, మిగిలిన పనులన్నియును మునుపటి వలెనే చేయవలెను. ఖిరిహిరము 2 భాగములు, ఛేదము 1 భాగము, కంఠము 1 భాగము, పత్రిక 1 భాగము, గిరిపత్రిక 1 భాగము, వేదిక $2\frac{1}{2}$ భాగములు, ఛేదము 1 భాగము, కంఠము 2 భాగములు, పత్రిక $\frac{1}{2}$ భాగము, గిరిపత్రిక $\frac{1}{2}$ భాగము, ఘంటి 8 భాగములు, అమలసారక మైతే పద్మము $1\frac{1}{2}$ భాగము, దానిపైన కలశము 3 భాగములు, గ్రీవ 1 భాగము కర్ణము 1 భాగము, బీజపూరము 2 భాగములు, అంతటను ఇట్లు రచించెను. 17 భాగములుగా చేసి అందులో కర్ణము 3 భాగములు, ప్రతిరథము 2 భాగములు, శాల 5 భాగములు, శాల ప్రతిరథము వీని మధ్య జలమార్గము $\frac{1}{2}$ భాగము, ఒక్కొక్క దాని నిర్గమము $\frac{3}{4}$ భాగము చేయవలెను. గర్భము 10 భాగములు, గోడ $3\frac{1}{2}$ భాగములు, వేదికా బంధము 4 భాగములు, జంఘ 8 భాగములు, మొదటి భూమి $5\frac{1}{2}$ భాగములు, కపోతముల యొక్క వరుసతో గూడ రచించవలెను రెండవ భూమి 5 భాగములు, మూడవ భూమి $4\frac{1}{2}$ భాగములు, నాల్గవభూమి 4 భాగములు ఆపైన ఘంట 3 భాగములు, మొదలైనవి పూర్వము చెప్పబడినట్లు చేయవలెను. శుకనాసలును, కుంభము మొదలైనవియును మునుపటివలె చేయవలెను. దీనిని వర్ధమాన ప్రాసాదమందురు.

(అనుబంధము 5, 6 పటములు చూడుడు)

## 5. నంద్యావర్తము

సమరాంగణ 64వ అధ్యాయము :

శ్లో॥ నంద్యావర్త మథ బ్రూమః క్షేత్రే సప్తదశాంశకే।
కోణాంశ్చ తుష్పదాత్ కుర్యాత్ పంజరం సార్ధభాగికమ్॥

షడ్భిర్భాగై ర్భవేచ్ఛాలా గర్భస్తు దశాభాగికః।
సార్ధ త్రిభాగికా భిత్తి రూర్ధ్వమానం తుద్విగుణ్య॥
వేదీ చతుష్పదో త్సేధా జంఘా భాగాష్ట క్రోచ్ఛ్రితా।
షట్పదా భూమికాస్యా ద్ద్వితీయా పంచపదాయతా॥
స్యాత్సంపదే చతుర్భాగా తృతీయా న్యాపదోఛ్రితా।
ఘంటా సార్ధ ద్వయాంశః స్యాత్ పూర్వవత్ కలశాదికాః॥
నంద్యావర్తోఽయమాఖ్యాతః ప్రాసాదః సర్వకామదః॥

తా॥ చతురశ్ర ప్రదేశమును 17 భాగములుచేసి అందు కర్ణము 4 భాగములు, పంజరము $1\frac{1}{2}$ భాగము, శాల 6 భాగములు చేయవలెను. మఱియు గర్భము 10 భాగములును, చుట్టూ గోడ $3\frac{1}{2}$ భాగములును చేయవలెను. విస్తారమును రెట్టింపు యెత్తును చేయవలెను. వేదిక 4 భాగములు, జంఘ 8 భాగములు, మొదటి భూమిక 6 భాగములు, రెండవ భూమిక 5 భాగములు, మూడవ భూమిక 4 భాగములు, ఆపైన ఘంట $2\frac{1}{2}$ భాగములు, కలశము పూర్వము చెప్పబడినట్లు చేయవలెను. దీనిని నంద్యావర్త ప్రాసాదమందురు.

## 6. నందివర్ధనము

సమరాంగణ 64 వ అధ్యాయము :

శ్లో॥ అథాతః సంప్రవక్ష్యామః ప్రాసాదం నందివర్ధనమ్॥ 45
చతురశ్రీ కృతే క్షేత్రే పదాష్టా దశకాంకితే।
కోణస్త్రి పదవిస్తారః ప్రత్యంగంస్యాత్ పదద్వయమ్॥ 46
శాలా చతుష్పదా ప్రోక్తా చిత్ర కర్మోప శోభితా।
పాదోన భాగమానేన నిర్గమః స్యాత్ పరస్పరమ్॥ 47
కోణ ప్రత్యంగయోర్మధ్యే శాలా ప్రత్యంగయో స్తథా।
భాగేన విస్తృతం కార్యం సర్వత్ర సలిలాంతరమ్॥ 48
గర్భః స్యాద్ దశభిర్భాగై ర్భిత్తిర్భాగ చతుష్టయాత్।
ఊర్ధ్వ మానమథ బ్రూమో ద్విగుణం తత్ప్రకీర్తితమ్॥ 49

వేదీ బంధోఽశకాః పంచజంఘాస్యా దష్టభాగికా।
ప్రథమాభూమికా కార్యా కపోతాపీ సమన్వితా॥ 50
సపాదైః పంచభిర్భాగై ద్వితీయా తద్వదేన హి।
తృతీయాతుభవతస్య భూమికా పంచభాగికా॥ 51
చతుర్థీ భూమికాజ్ఞేయా సార్థభాగ చతుష్టయా।
ఘంటా తస్యోర్ధ్వతః కార్యా పదత్రయ సముచ్ఛ్రితా॥ 52
శుకాగ్రా శూరసేనశ్చ స్తంభికా కూట భక్తయః।
కలశస్యోదయస్తస్య విధేయాశ్చాస్య పూర్వవత్॥ 53
అముంయః కారయేదన్యః ప్రాసాదం నందివర్ధనమ్।
సనంది గణసామాన్యో జాయతే నాత్ర సంశయః॥ 54

తా॥ చతురశ్ర ప్రదేశములను 18 భాగముచేసి, అందు కోణము 3 భాగములును, ప్రత్యంగము 2 భాగములును, శాల 4 భాగములు చిత్ర కర్మసహితముగను, వీనియొక్క నిర్గమము $\frac{3}{4}$ భాగమును చేయవలెను. కోణ ప్రత్యంగముల మధ్యను, శాలా ప్రత్యంగముల మధ్యను, జలమార్గము 1 భాగము చొప్పున రచించవలెను. గర్భము 10 భాగములును చుట్టూ గోడ 4 భాగములును చేయవలెను విస్తారమునకు రెట్టింపుగా యెత్తును చేయవలెను. వేదీబంధము 5 భాగములు, జంఘ 8 భాగములు, మొదటి అంతస్తు $5\frac{1}{4}$ భాగములు, రెండవ అంతస్తు $5\frac{1}{4}$ భాగములు, మూడవ అంతస్తు 5 భాగములు, నాల్గవ అంతస్తు $4\frac{1}{2}$ భాగములు ఆపైన ఘంట 3 భాగములు, శుకనాస శూరసేన పద్ధతితోను, స్తంభములు, కూటవిభాగములు, కలశము యెత్తు మొదలైనవి పూర్వమువలెనే చేయవలయును ఇట్లు నందివర్ధన ప్రాసాదమును నిర్మించినవారు ప్రమథులతో సమానముగా శివ సన్నిధియందు చిరకాలముందురు. (అనుబంధము 10, 11, 12 పటములు చూడుడు)

## 7. విమాన లక్షణము

సమరాంగణ 64వ అధ్యాయము :

శ్లో॥ అతః పరమథ బ్రూమో విమానం శుభలక్షణమ్।
చతురశ్రీ కృతే క్షేత్రే వింశత్యా భాజితే పదైః॥ 55

కోణాః పంచపదాః కార్యా మధ్యేచ సవిలాంతరమ్।
కర్ణికా సార్ధభాగేస భాగార్ధము దకాంతరమ్॥ 56
శాలా షట్పద విస్తీర్ణా సార్ధభాగేన నిర్గతా।
కోణస్య చార్ధభాగేన కర్ణికా నిర్గమః స్మృతః॥ 57
గర్భశ్చాస్య విధాతవ్యో ద్వాదశాంశక విస్తృతః।
భిత్తిశ్చతుష్పదా కార్యా దిక్షు సర్వాస్వవస్థితా॥ 58
ఊర్ధ్వమాన మథైతస్య బ్రూమ స్తద్ ద్విగుణం భవేత్।
వేదీ బంధోఽంశకాః పంచజంఘా నవ పదోచ్ఛ్రితా॥ 59
ప్రథమాభూమికా కార్యా భాగైః షడ్భిః సముచ్ఛ్రితాః।
శతపత్రాం కపోతాలీం మధ్యేచా స్యాః ప్రకల్పయేత్॥ 60
ద్వితీయా భూమికాచాస్య విధేయా పంచభిః పదైః।
అర్ధేఽస్యాః స్తంభకోచ్ఛాలం కూటం చార్ధవ్యవస్థితమ్॥ 61
పరస్పరం పదార్ధేన హీనా స్త్రిస్రోఽన్య భూమికాః।
స్తంభికా కూటభరణ శూరసేనాః సఘంటకాః॥ 62
కలశస్యో దయశ్చాత్ర ప్రాగ్వత్ కార్యా విపశ్చితాః।
య ఇమంకార యేచ్ఛక్త్యా విమానాఖ్యం నృపుంగవః॥ 63
ఇహ భోగాన్ సలభతే తథా సత్క్రమదం విధే॥

తా॥ చతురశ్ర ప్రదేశమును 20 భాగములుచేసి కర్ణము 5 భాగములు, జలమార్గము మధ్య చేయవలెను. కర్ణిక $1\frac{1}{2}$ భాగము, జలమార్గము $\frac{1}{2}$ భాగము, శాల 6 భాగములు, నిర్గమము $1\frac{1}{2}$ భాగము, కర్ణమునకును కర్ణికకును నిర్గమము $\frac{1}{2}$ భాగము చేయవలెను. గర్భము 12 భాగములు చుట్టూ గోడ 4 భాగములు రచించవలెను. విస్తారమును రెట్టింపు యెత్తు చేయవలెను. వేదబంధము 5 భాగములు, జంఘ 9 భాగములు, మొదటి అంతస్తు 6 భాగములు, శతపత్రమును కపోత ముల వరుసను మధ్యను రచించవలెను రెండవ అంతస్తు 5 భాగములు, అందులో సగము స్తంభములను, ఉచ్చాలము, కూటము కలిసి సగమును చేయవలెను. మూడవ అంతస్తు $4\frac{1}{2}$ భాగములు, నాలుగవ అంతస్తు 4 భాగములు, ఐదవ అంతస్తు

3½ భాగములు చేయవలెను. స్తంభములు, కూటములు, భరణములు, ఇవి శూరసేన పద్ధతితో రచించవలెను. ఘంట 3 భాగముల యెత్తుండ వలెను. కలశము పూర్వము వలెనే చేయవలెను. ఈ విమాన ప్రాసాద మును భక్తితో రచించినవారు సమస్త భోగముల ననుభవింతురు.

# 8. పద్మ లక్షణము

సమరాంగణ 64వ అధ్యాయము :

శ్లో॥ అథ పద్మః ప్రియ ప్రీతిజననః పద్మ ఉచ్యతే॥ 64
చతురశ్రీ కృతే క్షేత్రే భక్తే షోడశభిః పదైః।
కోణా శ్చతుష్పదాః కార్యాః సలిలాంతర భూషితాః॥ 65
ద్విపదః పంజరోజ్ఞేయో గర్భే కోణాశ్చతుష్పదాః।
భాగస్య షోడశాంశేన తదంతే సలిలాంతరమ్॥ 66
గర్భః స్యా న్నవభిర్భాగై ర్భిత్తిః సార్ధ పదత్రయమ్।
ఊర్ధ్వ మానమథ బ్రూమ స్తదస్య ద్విగుణం భవేత్॥ 67
ప్రథమా భూమికా భాగైః సార్ధైః పంచభి రుచ్ఛ్రితా।
అన్యోన్యంతు పదార్ధేన హీనంస్యా ద్భూమికా న్వయమ్॥ 68
స్తంభికా కూటభరణ శుకాగ్రా శూరసేనకాః।
ఘంటాకలశ విస్తారా భవంత్యేతస్య పూర్వవత్॥ 69
పద్మ ప్రాసాదమేనం యఃకారయేద్భక్తి సంయుతః।
స శ్రీపతి రివశ్రీశో భవత్యవని మండనః॥ 70

తా॥ లక్ష్మీదేవికి ప్రియమగు పద్మప్రాసాదముయొక్క లక్షణమును చెప్పుచున్నాడు చతురశ్ర ప్రదేశమును 6 భాగములుచేసి అందు కర్ణ ములు 4 భాగముల చొప్పున జలమార్గములతోను, పంజరములు 2 భాగ ముల చొప్పునను మధ్య కర్ణములు 4 భాగముల చొప్పునను, అందు జల మార్గము 16వ భాగము రచించవలెను గర్భము 9 భాగములును, చుట్టూ గోడ 3½ భాగములు రచించవలెను. విస్తారమునకు రెట్టింపు యెత్తును చేయవలెను. వేదీబంధము 5 భాగములు, జంఘ 9 భాగములు, మొదటి అంతస్తు 5½ భాగములు, రెండవ 5 అంతస్తు భాగములు, మూడవ అంతస్తు

4½ భాగములు, ఘంట 3 భాగములు చేయవలెను. శేషించిన పనులన్నియును పూర్వమువలెనే చేయవలెను. ఇట్లు పద్మప్రాసాదమును నిర్మించినవారు విష్ణువుతో సమానముగా శ్రీమంతులై యుందురు.

(అనుబంధము 16, 17, 18 పటములు చూడుడు)

## 9. మహాభద్రము

సమరాంగణ 64వ అధ్యాయము :

శ్లో॥ మహాభద్ర మథబ్రూమః ప్రాసాద మతిసుందరమ్।
చతురశ్రీ కృతే క్షేత్రే వింశత్యాసైకయాంకితే॥ 71
కోణా శ్చతుష్పదాః సార్ధ ద్వ్యంశాః ప్రత్యంగకాః స్మృతాః।
శాలా పంచపదాకార్యా దిక్షు సర్వాస్వవస్థితా॥ 72
పాదోన భాగవిస్తారం కర్తవ్యం సవిలాంతరమ్।
గర్భస్త్రయో దశపదో భిత్తయశ్చ చతుష్పదాః॥ 73
ఊర్ధ్వమాన మథైతస్య బ్రూమ స్తద్ ద్విగుణం భవేత్।
వేదీ చతుష్పదోత్సేధా జంఘాస్యా దష్టభాగికా॥ 74
సప్తభాగ సముత్సేధా విధేయాచాది భూమికా।
మధ్యేసాంతర పత్రస్యాః కపోతాపీ పదత్రయమ్॥ 75
ద్వితీయ భూమికాచాస్య సార్ధైషడ్భిః పదైః స్మృతాః।
భాగభాగ విహీనాస్తు తిస్రోఽన్యా భూమిస్తకాతః॥ 76
ఘంటా భాగత్రయోయోత్సేధా పద్మ పత్రికయా సహ।
స్తంభికా కూటభరణ శుకాగ్రా శూరసేనకాః॥ 77
కలశః కుంభం తథా న్యాశ్చ ప్రాగ్వత్ తస్య భవంత్యమీ।
మహాభద్ర మిమంయోఽత్ర కారయేచ్ఛక్తిమాన్నరః॥ 78
స స్వర్గే సురనారీభిః సేవ్యతే మదనాజ్ఞయా॥

తా॥ మహాభద్ర ప్రాసాదము యొక్క లక్షణమును చెప్పుచున్నాడు చతురశ్ర ప్రదేశమును 21 భాగములుచేసి కర్ణము 4 భాగములు, పంజరము 2½ భాగములు, శాల 5 భాగములు, జలమార్గము ¾ భాగము, ఇట్లు 21 భాగముచేసి గర్భము 13 భాగములును, చుట్టూ గోడ 4 భాగ

ములును రచించవలెను. విస్తారమునకు రెట్టింపు యెత్తు చేయవలెను. వేదిక 4 భాగములు, జంఘ 8 భాగములు, మొదటి అంతస్తు 7 భాగములు, మధ్య అంతర పత్రమును కపోతముల వరుసయును 3 భాగములు చేయవలెను. రెండవ అంతస్తు $6\frac{1}{2}$ భాగములు, మూడవ అంతస్తు $5\frac{1}{2}$ భాగములు, నాల్గవ అంతస్తు $4\frac{1}{2}$ భాగములు, ఐదవ అంతస్తు $3\frac{1}{2}$ భాగములు, ఆపైన ఘంట 3 భాగములు, పద్మపత్రికతో కూడ రచించవలెను స్తంభము, కూటము, భరణము, శుకనాస. ఇవన్నియు శూరసేన పద్ధతితో రచించవలెను. కలశము కుంభము అన్నియును మునుపటి వలెనే చేయవలెను. ఇట్లు మహాభద్రమును రచించినవారు స్వర్గమున దేవతా స్త్రీలతో సేవించ బడుదురు. (అనుబంధము 19, 20, 21 పటములు చూడుడు)

# 10. శ్రీ వర్ధమానము

సమరాంగణ 64వ అధ్యాయము :

శ్లో॥ అథశ్రీ వర్ధమానస్య లక్ష్మ సాంప్రత ముచ్యతే॥ 79
చతురశ్రీ కృతే క్షేత్రే చతుర్వింశతి భాజితే।
కోణాః షడ్భాగికాః కార్యాః శాలాః స్యుర్నవ భాగికాః॥ 80
సార్ధం పథద్వయం కార్యః శాలా నామత్ర నిర్గమః।
కుర్యా జ్జలాంతరం తత్ర మధ్యతః కోణశాలయోః॥ 81
విస్తృతం సార్ధభాగేన ప్రవిష్ట మపి భాగతః।
కోణ మధ్యే విధాతవ్యం భాగే నైవోదకాంతరమ్॥ 92
నవాం శ ప్తశాలాయాః ప్రత్యంగౌ ద్వావుదాహృతౌ।
భాగద్వితయ విస్తారౌ భాగే నైకేన నిర్గతౌ॥ 83
చతుర్దశ పదో గర్భో భిత్తిః పంచపదా స్మృతా।
ఊర్ధ్వమాన మథబ్రూమ స్తదస్య ద్విగుణం భవేత్॥ 84
వేదికా షట్పదోత్సేధా జంఘైకా దశభిః పదైః।
ప్రథమా భూమికాచాస్య కార్యా సప్తాంశకోచ్ఛ్రితా॥ 85
పాదోనైః స ప్తభిర్భాగై ర్ద్వితీయా భూమికేష్యతే।
తృతీయా భూమికా షడ్భిః సపాదైర్జాయతే పదైః॥ 86

పాదోన షట్క భాగేన చతుర్థీ భూమికా స్మృతా।
భాగం భాగం విధాతవ్యః ప్రవేశః ప్రతిభూమికమ్॥ 87
సపాదైః పంచభిర్భాగైః కార్యో ఘంటా సముచ్ఛ్రయః।
భాగత్రయ సముత్సేధస్త దూర్ధ్వే కలశో భవేత్॥ 88

తా॥ శ్రీ వర్ధమాన లక్షణమును చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశమును 24 భాగములుగా చేసి అందు కర్ణము 6 భాగములు, శాల 9 భాగములు, శాల యొక్క నిర్గమము $2\frac{1}{2}$ భాగములు, శాల కర్ణము ఈ రెంటి మధ్య జలమార్గము $1\frac{1}{2}$ భాగము, కర్ణమధ్య జలాంతరము 1 భాగము చేయువలెను. శాలయొక్క 9 భాగములలో 2 భాగముల చొప్పున ఇరు వైపుల పంజరములను రచించవలెను. పంజరముల నిర్గమము 1 భాగము చేయువలెను. గర్భము 14 భాగములును చుట్టూ గోడ 5 భాగములును రచించవలెను. విస్తారమునకు రెట్టింపుగా యెత్తును చేయవలెను. వేదిక 6 భాగములు, జంఘ 11 భాగములు, మొదటి అంతస్తు 7 భాగములు, రెండవ అంతస్తు $6\frac{3}{4}$ భాగములు, మూడవ అంతస్తు $6\frac{1}{4}$ భాగములు, నాల్గవ అంతస్తు $5\frac{3}{4}$ భాగములు, ప్రతి అంతస్తుకు ఒక్కొక్క భాగము ప్రవేశము చేయువలెను. ఘంటయొక్క $5\frac{1}{4}$ భాగములు. ఇట్లు 48 భాగములు, సరి చేసి ఆపైన ఘంట 3 భాగములు చేయువలెను.

(అనుబంధము 7, 8, 9 పటములు చూడుడు)

## 11. మహాపద్మము, పంచశాల, పృథివీజయము

ఇచట మాతృకయందు 233వ పత్రము లుప్తమని సమరాంగణ సూత్రధారయందు జెప్పబడియున్నది. అందువలన ఆ మహాపద్మము యొక్కయు, పంచశాల యొక్కయులక్షణములు తెలియబడుటలేదు.

సమరాంగణ 64వ అధ్యాయము :

శ్లో॥ ..........................పదాః స్మృతాః।
భాగద్వితయ విస్తారాః కర్తవ్యా చాలపంజరాః॥
శాలా షడ్భాగ విస్తీర్ణా భాగత్రితయ ముచ్ఛ్రితా।
కోణ ప్రత్యంగయో ర్మధ్యే శాలా ప్రత్యంగయోస్తథా॥

కక్షాంతరే విధాతవ్యం భాగికం సవిలాంతరమ్।
గర్భః స్యాద్ దశభిర్భాగై ర్భిత్తిః కార్యాస్య షట్పదా॥ ...............
షట్పదా స్యాత్ తృతీయాత్ర పంచభాగో(చ్ఛ్రితా।
పరా కర్ణశ్చభాగత స్త్రిస్రో ఘంటాచాష్ట పదోచ్ఛ్రితా॥
కూటై రలంకృతా కార్యా శుకాగ్రాదిచ పూర్వవత్।
సర్వేషామపిచై తేషాం ప్రాసాదార్ధేన కారయేత్॥
ఘంటాంతు సంహతాం శ్లక్ష్ణాం బంధనైరుప శోభితామ్।
యాదృశీక్రమ యోగేన కూటష్వేషాం విధీయతే॥
భద్రేషు తాదృశీకార్యా కృత్స్న ప్రాసాద సిద్ధయే।
య ఇమం కారయేద్రాజా ప్రాసాదం పృథివీజయమ్॥
భునక్తి నిఖిలాం పృథ్వీం స సప్తాంభోధి మాలినీమ్।
ఇతిరితా ద్వాదశమస్య గర్తే ప్రాసాద ముఖ్యాః శుభలక్ష్మియుక్తాః।
వారాట సంజ్ఞా స్తదమూన్ విదిత్వా లభేత పూజాం స్థపతిర్నృపేభ్యః॥
ఇతి సమరాంగణ సూత్రధారనామ్ని వాస్తు।
శాస్త్రే వరాట ప్రాసాదో నామ చతుః షష్టితమోఽధ్యాయః॥

తా॥ విస్తారమును 22 భాగములుచేసి, అందు కర్ణము 4 భాగములు, పంజరములు 2 భాగముల చొప్పున చిన్నవిగా రచించవలెను. శాల 6 భాగముల విస్తారమును ఎత్తు 3 భాగములును రచించవలెను. కోణపంజరముల మధ్యను శాలా పంజరముల మధ్యను జలమార్గము 1 భాగము చొప్పున రచించవలెను. గర్భము 10 భాగములును, చుట్టూ గోడ 6 భాగములును చేయవలెను విస్తారమునకు రెట్టింపు యెత్తును చేయవలెను. వేదిక 4 భాగములు, జంఘ 6 భాగములు, మొదటి అంతస్తు 8 భాగములు, రెండవ అంతస్తు 7 భాగములు, మూడవ అంతస్తు 6 భాగములు, నాల్గవ అంతస్తు 5 భాగములు, కర్ణముల యెత్తు 3 భాగములు, ఘంట యెత్తు 8 భాగములు, కూటములు అలంకారముగ రచించవలెను శుకనాస మొదలైనవి పూర్వమువలెనే ప్రాసాదములో సగము యెత్తున రచించవలెను. ఘంట క్రమముగా సన్నముగాను బంధనములతో చక్కగాను

రచించవలెను. కూటములు భద్రములు ఒక్కటే పనితో రచించవలెను ఇట్లు పృథివీ జయప్రాసాదమును రచించిన వారు సార్వభౌమ సుఖముల ననుభవింతురు. శిల్పాచార్యుడును రాజపూజితుడగును.

(అనుబంధము 22, 23, 24 పటములు చూడుడు)

## 12. విమాన జాతిప్రాసాదములు, 64 భేదములు అందు విమానము మొదలు 8 ప్రాసాదములు

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ విమాన మథవక్ష్యామః ప్రాసాదం శుభలక్షణమ్।
స్వర్గ పాతాల మర్త్యానాం త్రయాణా మపి భూషణమ్॥ 1
సర్వేషాం గృహవాస్తూనాం ప్రాసాదానాంచ సర్వతః।
ప్రాసాదో మూలభూతోఽయం తథాచ పరికర్మణామ్॥ 2
ఏకాశీతి పదం వాస్తు విమానే పంచభూమికే।
కర్ణాంతయోః శతపదం ప్రాసాదేష్వపదేషుతు॥ 3
బ్రహ్మ సృజత్ పంచభౌమ విమానాని పురారవేః।
మూలకర్ణాను గైర్భద్రైః ద్విగుణోచ్ఛ్రాయ వంతిచ॥ 4
శేషం భద్రస్య నిష్కాసో భద్రాదేవ చతుష్టయమ్।
ఆకాశే దేవతాధారం యథా దిక్షు విదిక్షుచ॥ 5
దశధా కృత విస్తారో విమానేత్రప్రకీర్తిత।
పంచమభాగ ప్రమాణశ్చ గర్భే భిత్తి స్తదర్ధతః॥ 6
ప్రాగ్గ్రీవం భిత్తి విస్తారం గర్భాయా మాత్తథాగ్రతః।
తతః ప్రాగ్గ్రీవ విస్తారః క్షోభణీయః కరాంగులైః॥ 7
భాగికోరథ విస్తారః కర్ణికాచార్ధ భాగికీ।
భాగపంచక విస్తారం భద్రం యత్ తత్ ప్రకీర్తితమ్॥ 8
భూషణస్త్వా వహేత్తస్య నిర్గమో భాగికః స్మృతః।
భాగార్ధేన విధాతవ్యః క్షోభణో జలవర్త్మనః॥ 9
కర్ణికాం జలమార్గంచ సమసూత్రేణ మాపయేత్।
అథోచ్యతే భూమికానాం స్తంభానాంచేహ లక్షణమ్॥ 10

విస్తారాద్ ద్విగుణ స్కంధః సర్వస్మిత్ శుద్ధనాగరే।
ప్రథమా పంచభాగస్యా జ్జంఘా స్య సముచ్ఛ్రితః॥ 11
తిలకానాంతథోచ్ఛ్రాయో విధాతవ్యో ద్విభాగికః॥
తిలకస్య శిరో ఘంటాం చైక సూత్రేణ మాపయేత్॥ 12
జంఘామాన త్రిభాగేన ఖురపిండీం ప్రకల్పయేత్।
ఖురకం వేది బంధంచ సమసూత్రేణ మాపయేత్॥ 13
ద్వితీయ భూమికోత్సేధం సింహకర్ణం విభూషయేత్।
మస్తకే ఘంటయా యుక్తా చతుర్భాగోచ్ఛ్రితాచసా॥ 14
తతస్తృతీయ భూత్సేధః పదతుర్యాంశ వర్జితః॥
చతుర్థీ భూమికా కార్యా సార్ధభాగత్రయోచ్ఛ్రసా॥ 15
మంజరీ స్తంభయోర్మధ్యే సవాతాయన మేఖలా।
ద్వితీయాభూమికాయాసా సింహకర్ణై రలంకృతా॥ 16
తస్యా ద్వారం విధాతవ్యం కపాట ద్వయ సంయుతమ్॥
స్వావర్తాత్పాటితం ద్వారం తృతీయా యాం సదా భువి॥ 17
పాదోన ద్వితయోత్సేధా తదూర్ధ్వం వేది మేఖలా।
కైరవాణాంద వైర్యుక్తా కర్తవ్యా దృష్టి హారిభిః॥ 18
వేదికా పంచవిస్తారా కార్యా భాగ సముచ్ఛ్రితా।
గ్రీవార్ధ భాగికోత్సేధా ఘంటైకం భాగ ముచ్ఛ్రితా॥ 19

తా॥ విమానజాతి ప్రాసాదములు 64. అందు మొదటిది యగు విమానప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. అన్ని ప్రాసాదములలో ప్రధానమైనదియును స్వర్గ మర్త్యపాతాల లోకముల యందు అలంకార మైనదియును, 5 అంతస్తులు కలదియును అగు విమానప్రాసాదమునకు విస్తారమును 9-9 భాగములు చేయవలెను. ఇతరములకు కర్ణములపైన 10-10 భాగములు చేయవలెను. ప్రధాన కర్ణము ననుసరించిన భద్ర ములు విస్తారమునకు రెట్టింపుగా యెత్తు కలిగియుండవలెను. భద్రము యొక్క నిర్గమము భద్రమునుండి నలువైపుల రచించవలెను గగన మున దేవతాధారము ననుసరించి దిశలయందును మూలల యందును

భాగనిర్ణయములకు 10-10 భాగములు చేయవలెను. గర్భము 5 భాగములును, చుట్టూ గోడ 2½ భాగములును చేయవలెను. గర్భము యొక్క విస్తారముతో సమానముగా ముందు ప్రాగ్గ్రీవమును రచించవలెను. తరువాత ప్రాగ్గ్రీవముయొక్క విస్తారమును హస్తాంగులములచేత క్షోభింప జేయవలెను. రథము యొక్క విస్తారము 1 భాగము, కర్ణిక ½ భాగము, భద్రము 5 భాగములు అలంకారయుతముగా రచించవలెను. నిర్గమము 1 భాగము చేయవలెను. జలమార్గమునకు క్షోభణము ½ భాగము, కర్ణికయును జలమార్గమును సమసూత్రముతో రచించవలెను.

ఇంక స్తంభము యొక్కయు, అంతస్తుల యొక్కయు లక్షణములను చెప్పుచున్నాడు. అన్నిటికిని శుద్ధనాగర పద్ధతియును విస్తారమునకు రెట్టింపుగా స్కంధము యొక్క యెత్తును చేయుటయును ముఖ్యము మొదటి జంఘ 5 భాగములు, తిలకముల యెత్తు 2 భాగములుండవలెను. తిలకము యొక్క శిఖరమును ఘంటయును ఒక్కటే సూత్రముతో కొలుచుచుండవలెను జంఘయొక్క పాదవులో 3వ వంతు ఖురమును రచించవలెను. ఖురమును వేదిబంధమును సమాన సూత్రముతో రచించవలెను. రెండవ అంతస్తును సింహకర్ణముతో అలంకారముగా చేయవలెను. 4 భాగముల యెత్తును తలపై ఘంటయును కలిగియుండవలెను. మూడవ అంతస్తు 3¾ భాగములును, నాల్గవ అంతస్తు 3½ భాగములును, మంజరి స్తంభము ఈ రెంటి మధ్య గవాక్షమును మేఖలయును రచించవలెను. మఱియు రెండవ అంతస్తున సింహకర్ణములే కాక ద్వారమును ఱెక్కల తలుపులును చేయవలెను. మూడవ అంతస్తున ద్వారము తనంతటనే తలుపు మూసికొనుట తెఱచికొనుట కలిగియుండవలెను చూపును కను పడకుండ చేయునట్టి పద్మదలములను రచించవలెను. వేదిక యొక్క విస్తారము 5 భాగములును, ఎత్తు 1 భాగమును చేయవలెను. గ్రీవ ½ భాగమును, ఘంట 1 భాగమును చేయవలెను.

శ్లో॥ పంచభాగ విస్తారా ఘంటా కోటి ద్వ్యధీయతే।
కుముదం వేదిబంధంచ ఘంటాగ్రం మస్తకోదయమ్॥ 20
మాపయేత్ సమసూత్రేణ సమంతాద్భూమి పంచకే।
వ్యాసార్ధ హస్త సంఖ్యాని ప్రవేశః ప్రథనుం క్షితేః॥ 21

అంగులాని తథాద్వ్యర్ధో ద్వితీయాయాః ప్రకీర్తితాః।
సంయోగా దనయోర్యః స్యాత్ తృతియా యాస్తి మాదిశేత్॥ 22
తదధ్యర్ధశ్చతుర్థ్యాస్తు పంచమ్యాః శేష ఈరితః।
స్వమూల విస్తృతేర్భాగ స్తృతీయో వేదికోర్ధ్వతః॥ 23
లతాయా విస్తృతిర్భద్రే యుక్త్యా స్యాజ్జలవర్త్మనః।
వేదికోగ్రే విధాతవ్యం శీర్షం సార్ధాదశ విస్తృతమ్॥ 24
మంజర్యాః స్తంభ సీమానం క్షిభయే న్మ్త్రష్టిమానతః।
వేద్యాం భాగస్తు శాలాయాం నిర్గమో మూలకోణతః॥ 25
స్థానై ర్విచిత్రరూపైః స్యాత్ సింహకర్ణైశ్చ భూషితః।
పంచవ్యాసేన సూత్రేణ రేఖామస్య సమాలిఖేత్॥ 26
ఏ తద్విమానం లలితం దేవ దేవస్య కారయేత్॥

తా॥ ఘంటయొక్క కొప్పు 5 భాగముల విస్తారముతో రచించవలెను. కుముదము, వేదీబంధము, ఘంటయొక్క చివర, మస్తకము యొక్క పై భాగము, ఇవి యన్నియును ఒక్క సూత్రముతో నుండవలెను. 5 అంతస్తులును ఇటులే సమసూత్రముతో నుండవలెను. విస్తారములో సగము హస్తముల సంఖ్యతో మొదటి అంతస్తుగ ప్రవేశములను కలిగించవలెను రెండవ అంతస్తున $2\frac{1}{2}$ అంగులములను చేయవలెను. మూడవ అంతస్తున యీరెండు అంతస్తుల ననుసరించిన సూత్రము ప్రకారము రచించవలెను. $1\frac{1}{2}$ యును, ఐదవ అంతస్తునను సూత్రప్రకారము రచించవలెను. వేదిక యొక్క పైభాగమున దాని మొదలు విస్తారములో 3 వంతు కలిగియుండవలెను. భద్రమున శిఖరము యొక్క విస్తారమును జల మార్గమును ఆలోచనతో చేయవలెను. వేదికపైన శిఖరము - $1\frac{1}{2}$ భాగము విస్తారములుండవలెను. మంజరి యొక్క స్తంభప్రదేశమున 3 అంగులములు ఏటవాలుగా తగ్గించవలెను. వేదియందు శాలయొక్క నిర్గమము మూలకోణమునుండి 1 భాగము చేయవలెను. విచిత్రరూపములచేతను సింహకర్ణములచేతను ఆ యా స్థలములను అలంకారముగ రచించవలెను. విస్తారమునకు 5 రెట్లుగల సూత్రముతో రేఖను రచించవలెను. ఇట్లు చక్కగా రచింపబడిన విమానమును దేవ దేవునకు వినియోగించవలెను.
"విమానః సర్వతో భద్రో గజపృష్ఠోఽథ పద్మకః వృషభో ముక్తికోణశ్చ

నలినో ద్రావిడ స్తథా (6) ఇత్యేతేఽష్టౌ సముద్దిష్టాః ప్రాసాదా స్త్రి పుర ద్రుహః" (సమరాంగణ 58 అధ్యాయము)

(అనుబంధము 25 నుండి 30 వఱకు గల పటములు చూడుడు)

# 13. సర్వతోభద్రము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ సంస్థానం సర్వతో భద్ర స్యేదానీ మభిధీయతే॥ 27
జఠరం బాహ్య సీమాచ తథా భిత్త్యంధకారికా।
జంఘోత్సేధశ్చ కర్ణౌచ యథా మేరో స్తథా భవేత్॥ 28
తథైవ భద్ర విస్తారః షడ్భాగేన సమంతతః।
దధికేచ ద్విభాగే స్తః కోణసంజ్ఞేచ పార్శ్వయోః॥ 29
ముష్టిప్రమాణ విస్తారం కర్తవ్యము దకాంతరమ్।
విస్తారాద్ ద్విగుణః స్కంధస్యోచ్ఛ్రాయో భాగవింశతిః॥ 30
పంచభాగ సముత్సేధా జంఘాకార్యా సదా బుధైః।
మేఖలాంతర పత్రంచ సార్ధభాగ సముచ్ఛ్రితమ్॥ 31
శృంగం భాగత్రయోత్సేధం సగ్రీవా మలసారకమ్।
మూలశృంగస్య గర్భేణ న్యస్యేదు పరిభూమికామ్॥ 32
ద్వితీయ భూమి విస్తారం దశధా ప్రవిభాజయేత్।
ద్వౌభాగౌ శృంగవిస్తారో విధేయః పార్శ్వయోర్ద్వయోః॥ 33
సగ్రీవా మలసారస్య తైః శృంగస్యోదయ స్థితిః।
తస్య శృంగస్య గర్భేణ కర్తవ్యో పరిభూమికా॥ 34
తస్యా భూమేస్తు విస్తారం దశధాభాజయేత్పునః।
యః శేషః శిఖరాయామో తద్ద్వితీయే వినిర్దిశేత్॥ 35
విభజేద్ వర్ధమానం వా రుచకం వాస్తు శోభనమ్।
కర్ణాంతరే భద్ర మధ్యే వలభీం తత్ర కారయేత్॥ 36
భూమికా శిఖరేణోర్ధ్వం నవభూమిం విభేదయేత్।
వేదికా మధ్య సూత్రస్య కర్ణతోర్ధ్వ భువ స్తథా॥ 37

భూమికోర్ధ్వ భువశ్చైవ విస్తారం దశధా భజేత్।
మూలసీమాను సారేణ స్యాచ్ఛేదావధి సంహృతిః॥ 38
గ్రీవా మూలార్ధ భాగేన భాగేనా మలసారకమ్।
చంద్రికా చార్ధభాగేన కలశో భవేత్॥ 39

సర్వతో భద్రప్రాసాదము యొక్క లక్షణమును చెప్పుచున్నాడు. గర్భము, గోడ, అంధకారిక, వెలుపలి ప్రదేశము, జంఘయెత్తు, కర్ణముల యెత్తు, ఇవి యన్నియును మేరు ప్రాసాదవలెనే చేయవలెను భద్రము యొక్క విస్తారమును 6 భాగములు చేయవలెను. రధికలు 2 భాగముల చొప్పున మూలలయందును ప్రక్కలను రచించవలెను. అన్నిటికిని జల మార్గములు 3 అంగులములు చేయవలెను. విస్తారమునకు రెట్టింపుగా స్కంధము యొక్క యెత్తును చేయవలెను. దానిని 20 భాగములుచేసి జంఘ 5 భాగములును, మేఖల, అంతరపత్రము $1\frac{1}{2}$ భాగమును, శిఖరము 3 భాగముల యెత్తును. అందు గ్రీవ, ఆమలసారకము, కలిగియుండవలెను. ప్రధానశిఖరము యొక్క గర్భముతో కలిపి రెండవ అంతస్తును రచించవలెను. రెండవ అంతస్తు విస్తారమును 10 భాగములుచేసి శృంగము యొక్క విస్తారము 2-2 భాగములు ప్రక్కలను, గ్రీవ,ఆమలసారము, కలిసి శిఖరముయొక్క కొలతయుండవలెను. మరల ఆ శిఖరము యొక్క గర్భమును కలుపుకొని దానిపై అంతస్తును రచించవలెను. మూడవ అంతస్తు యొక్క విస్తారమును 10 భాగములుచేసి లోగడ రెండవ అంతస్తున చేసినట్లే చేయవలెను. దానిపైన వర్ధమాన పద్ధతిగా నైనను, లేక రుచక పద్ధతిగా నైనను అందముగా నుండునట్లు రచించవలెను. కర్ణముల సందునను, భద్రము యొక్క నడుమను వలభిన రచించవలెను. ఒక అంతస్తుయొక్క శిఖరముపైన మఱియొక అంతస్తును విభజించవలెను. వేదిక మధ్య సూత్రమునకును కర్ణములనుండి పై అంతస్తునకును సమానము చేయవలెను. అంతస్తు యొక్క పై ప్రదేశమున మరియొక అంతస్తునకు విస్తారమును 10 భాగములు చేసి మొదటి అంతస్తున యెటులో అటులే అన్నిటికిని రచించవలెను గ్రీవ $\frac{1}{2}$ భాగమును, ఆమలసారకమును 1 భాగమును చంద్రిక $\frac{1}{2}$ భాగమును, కలశము 1 భాగమును చేయవలెను. దీనిని సర్వతో భద్రమందురు.

# 14. గజప్రాసాదము, పద్మప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ గజస్య సంస్థాన మథ ప్రాసాదస్యాభి ధీయతే।
చతుః షష్టిపదం వాస్తు ప్రాసాదస్య విభాజయేత్॥ 40
తతః సీమార్ధ సూత్రేణ పృష్ఠతో వృత్తమా లిఖేత్।
పంచభాగమితా జంఘా మేఖలా సార్ధభాగికీ॥ 41
అగ్రతః సూరసేనః స్యాత్ పృష్ఠతః కుంజరాకృతిః।
సీమానమష్టధా కృత్వా విభజేన్నందనే యథా॥ 42
ద్వౌద్వౌచ కర్ణయోర్భాగౌ భద్రేషు చతురో విదుః।
విస్తారార్ధేన జంఘా స్యాద్ రథికాయాః పృథక్ పృథక్॥ 43
భాగత్రయోచ్ఛ్రితం శృంగం కర్ణదేశే విధీయతే।
సప్తభాగ సముత్సేధా వలభి మధ్య సంశ్రితా॥ 44
సమంతాద్ భద్ర సంస్థానా రేఖా గ్రీవాండకాదిభిః।
సింహకర్ణైశ్చభద్రేషు ప్రాసాదో గజ ఉచ్యతే॥ 45
వృత్తసాధ్య విహీనేన కర్తవ్యః స్వస్తికే యథా।
సర్వం పద్మవత్ తస్యస్యః పద్మపత్ర నిభాః సమాః॥ 46
విస్తారోఽప్యథ జంఘాచ లతిని స్వస్తికే యథా।
ఉదకాంతర కం కుర్యాత్ శ్రీవత్సే నందనే యథా॥ 47

తా॥ గజ ప్రాసాదమునకు 8-8 భాగములు నలుచదరముగాచేసి తరువాత విస్తారములో సగముగల సూత్రముచేత వెనుకవైపున గుండ్రముగా గీయవలెను. జంఘ 5 భాగములు, మేఖల 1½భాగము, ముందువైపున సూరసేన పద్ధతియును, వెనుకవైపున ఏనుగు యొక్క ఆకారమును చేయవలెను చతురశ్ర ప్రదేశమును 8 భాగములుచేసి నందనమువలె కర్ణములు 2-2 భాగములును, భద్రము 4 భాగములును, చేయవలెను. విస్తారములో సగము జంఘయును, రథికలు కర్ణమునందు 3 భాగముల యెత్తును, వలభిమధ్య 7 భాగముల యెత్తును, అంతటను భద్రములు రేఖగ్రీవ, అండకములు, భద్రముల యందు సింహకర్ణములును, కలది గజ ప్రాసాదమగును. మఱియు స్వస్తిక ప్రాసాదము చేసినట్లు కొలతలతో

గుండ్రముగా అన్నియును కర్ణములను రచించి పద్మపత్రములవలె సుంద రముగా రచించినచో పద్మప్రాసాదమగును. విస్తారమును జంఘయును, లతిన ప్రాసాదములలోని స్వస్తికమువలెనే రచించవలెను. శ్రీవత్సము నందును నందనమునందును రచించినట్లు జలమార్గములను రచించవలెను. (ఇందు గల వృష్ఠప్రాసాచాంతమునను, పద్మప్రాసాదారంభమునను కొంత శిథిలమైనట్లు దోచుచున్నది)

# 15. వృషభప్రాసాదము

సమరాంగణ 59 వ అధ్యాయము ।

శ్లో॥ బ్రూమోఽథ వృషభంస స్యాత్ పూర్వోక్తైః రూపకర్మభిః॥
చతుర్భద్రశ్చ తుర్ద్వారో విమానో వృషభాకృతిః॥ 48
తే వృద్ధిస్తత్ప్రమాణాశ్చ సీమశిఖరోదయైః।
కర్ణవేది కపోతాపి జంఘాగ్రే మస్తకేనచ॥ 49
సార్ధద్విభాగ విస్తారౌ రథకౌ వామదక్షిణౌ।
కార్యౌ భద్రం చతుర్భాగం భాగార్ధం సలిలాంతరమ్॥ 50
స్తంభద్వయం భవేత్తస్య సర్వభూమ్యంతరేషు చ।
ఏకః స్తంభో విమానే స్యాద్ ద్వౌ స్తంబౌ వృషభే పునః॥ 51
ఏష భేదః సమాఖ్యాతో విమానస్య వృషభస్య చ।

తా॥ వృషభప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. పూర్వము చెప్పిన ప్రకారము అన్నియు చేసి 4 భద్రములును, 4 ద్వారములును, వృషభమువలె విమానమును రచించవలెను. లోగడచెప్పిన నానికంటె శీమ శిఖరము ఇవి యెత్తుగా నుండవలెను. కర్ణము, వేదిక, కపోతముల వరుస జంఘ, శుకనాస శిఖరము, వాని ననుసరించి చేయవలెను రథ ములు ఇరువైపుల $2\frac{1}{2}$ భాగముల విస్తారముతోను, మధ్యభద్రము 4 భాగ ములును, జలమార్గములు $\frac{1}{2}$ భాగము చొప్పునను, ఇట్లు 10 భాగములతో రచించవలెను. భద్రమునకు 2-2 స్తంభముల చొప్పున అన్ని అంతస్తుల యందును రచించవలెను. విమానప్రాసాదమునకు 1-1 స్తంభమును,

వృషభప్రాసాదమునకు 2-2 స్తంభములును, ఇంతే భేదము అని తెలియ వలెను.

## 16. ముక్తకోణము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ ముక్తకోణ మథబ్రూమ స్తంభాగైరష్టభి ర్భజేత్॥ 52
మూలకర్ణావుభౌ భాగౌ భవతో వామదక్షిణౌ।
మధ్య శృంగం చతుర్భాగం ప్రమాణం జఠరస్య చ॥ 53
కర్ణశృంగాంతయోర్మధ్యే కుర్వీత సలిలాంతరమ్।
రథకౌ పార్శ్వయోః పూర్ణౌ భద్రదేశే జలాంతరమ్॥ 54
విస్తారోత్సేధ జంఘాశ్చ సగ్రీవామల సారకః।
లతినామివ కర్తవ్యాః ప్రమాణే సమంతతః॥ 55

తా॥ ముక్తకోణ ప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. విస్తారమును 8 భాగములుచేసి ప్రధాన కర్ణములు 2-2 భాగములును, మధ్య శృంగము 4 భాగములును చేయవలెను. గర్భము 4 భాగములును చుట్టూ గోడ 2 భాగములును చేయవలెను. పై జెప్పిన కర్ణములు శిఖరము వీనియొక్క నడుమ జలమార్గమును రచించవలెను. రథము యొక్క ప్రక్కలను, భద్రమునను జలమార్గమును కల్పించవలెను. విస్తారము, ఎత్తు, జంఘ, గ్రీవ, ఆమల సారకము, ఇవి యన్నియును లతినమునందు జెప్పబడిన కొలతతో చేయ వలెను.

## 17. నలినప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ బ్రూమోఽథ నలినంతస్య ప్రమాణం లక్షణాన్వితమ్।
తస్మింస్తు భాగతః స్యాచ్చ దేవగర్భః సుదాలయః॥ 56
భిత్తి విస్తృతిరాయామో ముక్తకోణే యథా తథా।
మధ్య దేశేతు యచ్ఛృంగం భద్రం కర్ణాంతరేచయేత్॥ 57
ముక్తకోణే యథాతచ్చ భేదః కర్మవిభేదనాత్।
చతురశ్రే స్మృతో మధ్యే కర్ణ శృంగే విచక్షణైః॥ 58

తా॥ నలిన ప్రాసాదలక్షణమును చెప్పుచున్నాడు. విస్తారమును, గర్భమును, గోడయును, మొదలైనవి అన్నియును ముక్తకోణమువలెనే చేయవలెను. కర్ణము, భద్రము, శిఖరము, ఇవి యన్నియును కొలతలో సమానమేకాని. నలినమునకు 8 కోణములుగాను, ముక్తకోణమునకు నలుచదరముగాను రచించవలెను.

## 18. మణిక ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ బ్రూమోఽథ మణికంతస్య శాలాలిందే సముద్గతా।
అలిందకార్థ సీమాయాం సర్వతః స్యాచ్చతుష్కికా॥ 59

శ్రేయః పుష్టి సుఖార్థోఽయం మణికోఽత్ర విమానవత్।
దశధాక్షేత్ర సీమ్నాః స్యాత్ విభాగః సర్వతో దిశమ్॥ 60

రథకౌ కర్ణికార్థంచ జలవర్త్మాథ భద్రకమ్।
మూలగర్భ స్తథో త్సేధో ఘంటా స్తంభాంత విస్తృతా॥ 61

భూమి జంఘా సముత్సేధః కపోతా ద్వార నిర్గమః।
సింహకర్ణా విమానాని స్తంభ చిత్రాదికా స్తథా॥ 62

తోరణాన్యథమాల్యాని తస్యాలంకరణానిచ।
నీలోత్పలదలాకారా మంజర్యః సర్వశోభనాః॥ 63

విమాన మపరం హ్యేతత్ యోనిరేక స్తయోర్ద్వయోః।
కేవలం భద్ర భేదేన మణికో ద్రావిడోఽప్యయమ్॥ 64

తా॥ మణిక ప్రాసాదలక్షణమును చెప్పుచున్నాడు. అలిందముతోగూడిన శాలయును, అలిందములో సగము ప్రదేశమున 4 స్తంభములను అంతటను రచించవలెను. ఈ మణిక ప్రాసాదము విమాన ప్రాసాదమువలెనే 10-10 భాగములతో నలుదిశలును, రథములును, రథికలు అందులో సగము గను, జలమార్గములును, భద్రములును, ప్రధానగర్భమును, ఎత్తును, ఘంట స్తంభాంతము వఱకు విస్తారముగను, అంతస్తు జంఘ యెత్తును, కపోతమునుండి ద్వారము యొక్క నిర్గమమును, సింహకర్ణములును,

విమానములును, స్తంభముల యందలి చిత్రములును, తోరణములును, మాలలును, వాని వాని యొక్క అలంకారములును, నల్లకలువరేకులవలె మంజరులు అన్ని విధములైన ప్రకాశములతో నుండవలెను. ముఖకమును విమానమును ఒక్కటే కొలతతో రచించవలెను. అయితే ముఖకమునకు భద్రములు ద్రావిడ పద్ధతితో చాల అందముగా నుండును. ఈ 8 శివ ప్రాసాదములు.

## 19. గరుడ ప్రాసాదము మొదలగు 8 విష్ణుప్రాసాదములు

సమరాంగణ 59 వ అధ్యాయము :

శ్లో॥ ప్రాసాద మథ వక్ష్యామో గరుడం సర్వసుందరమ్।
దశధాక్షేత్ర విస్తారం తస్య పూర్వం విభాజయేత్॥ 65

ద్వౌభాగౌ రథికాః కార్యా మూలకర్ణాద్ వినిస్సృతాః।
భద్రం షడ్భాగ విస్తారం పక్షవంశాది భేదితమ్॥ 66

అలింద నిర్గమః కార్యః సీమార్ధేన చతుర్దిశమ్।
మూలసీమాతు కర్తవ్యా సలిలాంతర వర్జితా॥ 67

స్యా న్మూలసీమ విస్తారాత్ స్కంధః స్యాద్ ద్విగుణోచ్ఛ్రితిః।
ప్రాసాదస్య సముచ్ఛ్రాయాత్ త్రిభాగేన సమేఖలామ్॥ 68

జంఘా మంతర పత్రేణ కుంభయుక్తం కుర్వంత్యసౌ।
హీరకం వేదిబంధంచ భాగత్రయ సముచ్ఛ్రితమ్॥ 69

అలిందానాం సముత్సేధం శిఖరార్ధే నకారయేత్।
షడ్భాగం స్కంధ విస్తారం విదధీత విచక్షణః॥ 70

గ్రీవార్ధ భాగముత్సేధాత్ భాగమా మలసారకమ్।
కుముదంచార్ధ భాగేన కుంభః స్యాదేక భాగికః॥ 71

తా॥ గరుడ ప్రాసాదలక్షణమును చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశమును 10 భాగములుచేసి ప్రధాన కర్ణమునుండి రథికలు 2 భాగములును నిర్గమములును చేయవలెను భద్రముయొక్క విస్తారము 6 భాగములును అందు పక్షము, వంశము అను భేదములును, అలిందము యొక్క నిర్గ

మము విస్తారములో సగము నలువైపుల కల్పించవలెను. నలువైపుల ప్రస్తరముపైన సీమను రచించవలెను. జలమార్గము అక్కరలేదు. ముఖ్య ప్రదేశము యొక్క విస్తారమునకు రెట్టింపుగా స్కంధము యొక్క యెత్తును చేయవలెను. ప్రాసాదము యొక్క యెత్తునుండి 3వ భాగము మేఖలములను రచించవలెను. జంఘయందు అంతరపత్రము, కుంభము, హీరము చేయవలెను. అయితే హీరమును వేదిబంధమును 3 భాగములు చేయవలెను. అలిందముల యెత్తు శిఖరము యెత్తులో సగముండవలెను. స్కంధము యొక్క విస్తారము 6 భాగములుండవలెను. గ్రీవ $\frac{1}{2}$ భాగమును, ఆమలసారకము 1 భాగము, కుముదము $\frac{1}{2}$ భాగము, కుంభము, 1 భాగము చేయవలెను. దీనిని గరుడమందురు. 'గరుడో వర్ధమానశ్చ శంఖావర్తోఽథ పుష్పకః' (7) గృహరాత్ స్వస్తి కశ్చైక రుచకః పుణ్యవర్ధనః కార్యా జనార్దనస్యాష్టౌ ప్రాసాదాః పురభూషణాః (8) సం.రా 58 అ)

## 20. వర్ధమాన ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ అథోచ్యతే వర్ధమానో దశధాతం విభాజయేత్।
పాటోనాంశ ద్వయం కుర్యాత్ పార్శ్వయోః కర్ణ విస్తృతిమ్॥ 72

సపాద పద విస్తారౌ రథికౌవామదక్షిణౌ।
చతుర్భాగోన్మితం భద్రం విస్తారేణ ప్రకీర్తితమ్॥ 73

విస్తారాద్ ద్విగుణోచ్ఛ్రాయం స్కంధం యావత్ ప్రకల్పయేత్।
ఖురకస్యాథ జంఘాయా మంజరీ స్కంధకోపరి॥ 74

గ్రీవామలసారకాదేః ప్రమాణం గరుడే యథా॥

తా॥ వర్ధమాన ప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. విస్తారమును 10 భాగములుచేసి అందు కర్ణము $1\frac{3}{4}$ భాగములును, రథికలు $1\frac{1}{4}$ భాగము విస్తారమును, మధ్య భద్రము 4 భాగములును చేయవలెను. విస్తారమునకు రెట్టింపుగా స్కంధము ఎత్తును చేయవలెను. పీఠము, జంఘ, మంజరి స్కంధముపైన గ్రీవ, అపైన మస్తకము ఇవి యన్నియును గరుడ ప్రాసాదమున జేసినటులే చేయవలెను.

# 21. శంఖావర్తప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ ద్వావింశతి కరాయామః శంఖావర్తోఽథకథ్యతే॥ 75

మూలసీమా వృత్తనాహ స్తస్య స్యాత్ పద్మకే యథా।
భిత్తి గర్భస్య విస్తారః పాదే నార్ధేనచ క్రమాత్॥ 76

అలింద మగ్రతః కుర్యాత్ సింహకర్ణ విభూషితమ్।
ఉత్సేధత్ర్యంశతో జంఘా వేదీం తత్ర విభాగతః॥ 77

ఆ స్కంధం వేదికా బంధాద్ వి స్తృతేర్ద్విగుణోచ్ఛ్రితిః॥
మేఖలాంతర పత్రంచ జంఘా మధ్యే విధీయతే॥ 78

భ్రామయేత్కర్ణ సూత్రేణ బహిర్వృత్తం సమంతతః।
కర్ణ దిక్పాలయోర్మధ్యం వృత్త సూత్రేణ వర్తయేత్ 79

అవశిష్టం తలచ్ఛందం స్వస్తిక స్యైవ కారయేత్।
గ్రీవా మలసారంచ కలశం వారి నిర్గమమ్॥ 80

కుర్వీత స్వస్తిక స్యైవ విస్తారోత్సేధ మానతః।
మూలసీమానుసారేణ చ్ఛేదే సంవరణం భవేత్॥ 81

తద్రూపమేవ లతినం వర్తయే ద్వలనాకృతిమ్॥

తా॥ శంఖావర్తప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. ప్రస్తరముపైన వృత్తముయొక్క చుట్టుకొలత పద్మప్రాసాదమువలెనే చేయవలెను. విస్తారమును 4 భాగములుచేసి అందులో సగము మధ్య గర్భమును చుట్టూ ఒక భాగము గోడయును చేయవలెను ముందు అలిందమును సింహకర్ణములతో రచించవలెను. ఎత్తులో 3వ వంతు జంఘయును, జంఘయందు భాగముల ప్రకారము వేదికను రచించవలెను. వేదీబంధమునుండి స్కంధమువఱకు యెత్తు విస్తారమునకు రెట్టింపుగా నుండవలెను. జంఘలో మేఖల అంతరపత్రములను రచించవలెను. కర్ణసూత్రముతో వెలుపలి అంచువఱకు గుండ్రముగా గీయవలెను. మఱియు నాలుగు మూలలను వృత్తరేఖలను అందులో 3వ వంతుగా గీయవలెను. మిగిలిన దానిని

స్వస్తిక ప్రాసాదమువలె అంతస్తు భాగములను చేయవలెను. గ్రీవ, మస్తకము, కలశము, జలమార్గము, అన్నియును స్వస్తికమున జేసినట్లే విస్తారము, ఎత్తు, మొదలైనవి చేయవలెను. మొదటి అంతస్తు ననుసరించి సంవరణమును చేయవలెను. లతినమునందు జేసినట్లే గుండ్రని యాకారములో అన్ని రూపములను రచించవలెను దీనిని శంఖావర్తమందురు.

## 22. పుష్పకప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ బ్రూమోఽథ పుష్పకం నస్యాత్ విమాన సదృశాకృతిః॥ 82
తావత్ ప్రమాణ స్తద్ వృద్ధిః పంచభూశ్చతురశ్రకః।
విమానే యన్మానయుక్త మంజర్యా యచ్చ లక్షణమ్॥ 83
తత్కార్య మత్ర మంజర్యా నతు కార్యం జలాంతరమ్॥

తా॥ పుష్పక ప్రాసాదలక్షణమును చెప్పుచున్నాడు. విమాన ప్రాసాదమునకు జేసిన కొలతలు లక్షణములు చేయవలెను. అయితే 5 అంతస్తులును నలుచదరమును కలిగియుండవలెను. మంజరి మాత్రము విమాన ప్రాసాదమున జేసినట్లే చేయవలెను. జలమార్గములను కల్పించ నవసరము లేదు. ఇది పుష్పకప్రాసాదము.

## 23. గృహరాజప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ గృహరాజ మథ బ్రూమః నస్యాత్ కైలాస సన్నిభః॥ 84
విటంక నిర్గమాధార నిర్వ్యూహైః సర్వతోవృతః।
వలభ్యా భూషితో మధ్యే గవాక్ష ద్వారసంయుతః॥ 85
కపోత స్తంభ పర్యంతః శాలభంజీ విరాజితః।
వేదికా ఖండబాలాద్యం కవాటైః పరితో భవేత్॥ 86
కుర్వీత మల్లకచ్ఛాద్యైః సింహకర్ణైశ్చ భూషితః।
అలింద భేదతః ప్రాహు ర్గృహరాజ మిదం బుధాః॥ 87

కైలాసస్యైవ సంస్థానం స్యాదస్యోర్ధ్వ మధోఽపిచ॥

తా॥ గృహరాజ ప్రాసాదముయొక్క లక్షణమును చెప్పుచున్నాడు. కైలాస ప్రాసాదముతో సమానముగా నుండి శృంగనిర్గమమును, అధిష్ఠాన నిర్గమమును, మధ్య వలభియును, గవాక్షులును, ద్వారములును, కలిగి కపోత స్తంభముల వరకు సాలభంజికలును, వేదిక, జాలకములు, కవాటములచేత కప్పబడినవిగాను, మల్లచ్ఛాద్యమును, సింహకర్ణములతో అలంకారములును, అలిందములయొక్క భేదములును, కల్గియుండెనేని దీనిని గృహరాజమందురు. దీని యెత్తును విస్తారమును అన్నియును కైలాస ప్రాసాదమున జేసినట్లే చేయవలెను.

## 24. స్వస్తికప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ బ్రూమోఽథ స్వస్తికం తస్య పూర్వ వన్మానలక్షణమ్॥ 88
తేనైవ లతినం సర్వం కుర్వీతైనం విచక్షణః।
యథా మూలే విభక్తాః స్యుర్లతిన స్వస్తికాదయః॥ 89
తథైషాం స్కంధ భక్తానాం మధ్యే రేఖాం ప్రకల్పయేత్।
ప్రాసాదః స్వస్తికోనామ స్యా దేవం లక్షణాన్వితః॥ 90
శుకనాసార దయః స్వస్య కర్తవ్యాః సమభాగికః।
స్కంధం యావత్స ముత్సేధో విస్తారాద్ ద్విగుణో భవేత్॥ 91
తత్రి భాగోచ్ఛ్రితా జంఘా మేఖలా చార్ధభాగికీ।
మధ్యశాలా ద్విభాగాశ్చ మూలసూత్ర విభాగతః॥ 92
కర్ణా ద్విభాగికాశ్చైవం జలమార్గస్తు షోడశ।
అష్టౌ శాలా భవంత్యస్మిన్ కర్ణాశ్చాష్టౌ సమంతతః॥ 93
ప్రాగ్గ్రీవం బాహ్యతః కుర్యాత్ ముఖభాగే విచక్షణః।
కలశశ్చాండక గ్రీవా తద్వదామల సారకః॥ 94
ఊర్ధ్వ ఊర్ధ్వ ప్రమాణంచ యథైవాద్య స్తథా భవేత్॥

తా॥ స్వస్తిక ప్రాసాదలక్షణమును చెప్పుచున్నాడు లతినమునందు జెప్పబడిన ప్రకారమే అన్ని కొలతలు చేయవలెను లతినమునందు జెప్పబడినట్లే విస్తారమునకు రెట్టింపుగా స్కంధము చేయవలెనని యిందు జెప్పబడుచున్నది. మధ్యరేఖను కల్పించవలెను. ఎత్తులో 3వ భాగము జంఘను చేయవలెను. మేఖల ½ భాగమును, మధ్యశాల 2 భాగములును, చుట్టూ గోడ 1 భాగమును చేయవలెను. కర్ణములు 2-2 భాగములును, పూర్వపు ప్రమాణమున శాలలును, జలమార్గము 16ను, శాలలు 8యును, కర్ణములు 8యును, ముఖభాగమున ప్రాగ్గ్రీవమును, కలశము, అండకము గ్రీవ, మస్తకము రచించవలెను. మొదటి అంతస్తున జేసినట్లే అన్ని అంతస్తుల యందును చేయవలెను.

## 25. రుచక ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ రుచకం బ్రూమహేతస్య విభాగో దశధా భవేత్॥ 95

భాగద్వయ మితౌ కర్ణౌ భద్రం షడ్భాగ సమ్మితమ్।
తేషాం వినిర్గమం విద్యా ద్ధస్తమాత్రం ప్రమాణతః॥ 96

కుర్యా దుదక మార్గాంశ్చ ప్రాసాదే రుచకే క్వచిత్।
స్కంధా వశిష్టముత్సేధో విస్తారాద్ ద్విగుణో భవేత్॥ 97

వేదికాయాస్తు విస్తారః స్కంధే షడ్భాగికః స్మృతః।
తృతీయాంశేన కుర్వీత జంఘా మూర్ధ్వం ఖురో దయాత్॥ 98

జంఘా యాశ్చ త్రిభాగేన కార్యా ఖురవరండికా।
మేఖలాంతర పత్రంచ కుర్యా దధ్యర్ధ భాగికమ్॥ 99

సార్ధత్రిగుణ సూత్రేణ పూర్వా కర్కటనా భవేత్।
చతుర్గుణేన సూత్రేణ మధ్య కర్కటనా స్మృతా॥ 100

విభజ్య దశధా స్కంధ విస్తారం తైః ప్రకల్పయేత్।
భద్రం చతుర్భిః కర్ణాంస్తు కుర్యాద్భాగై స్త్రిభి స్త్రిభిః॥ 101

స్వేచ్ఛయా భూమికాః కార్యాయా వామూలార్ధ భాగికీః।
భాగేనా మలసారంచ కుముదం చార్ధభాగికమ్॥ 102

కుంభం భాగేన కుర్వీత ప్రాసాదే రుచకే బుధః।
సాధారణోఽయం సర్వేషాం ప్రాసాదస్తు దివౌకసామ్॥ 103

తా॥ రుచక ప్రాసాదలక్షణమును చెప్పుచున్నాడు. విస్తారమును 10 భాగములుచేసి కర్ణములు 2 భాగములు, మధ్య భద్రము 6 భాగములు, భద్రముయొక్క నిర్గమము 1 హస్తము, జలమార్గమును కూడ కల్పించవలెను. స్కంధము వరకు యెత్తు విస్తారమునకు రెట్టింపుగా నుండవలెను. స్కంధమునందు వేదికయొక్క విస్తారము 6 భాగములు చేయవలెను, ఖురమునకు పైన ఎత్తులో 3వ వంతు జంఘను చేయవలెను. జంఘలో 3వ వంతు అధిష్ఠానమును చేయవలెను. మేఖల అంతర పత్రము 1½ భాగము కలిగియుండవలెను. 3½ భాగములుగల సూత్రముతో మొదటి వృత్తరేఖను రచించవలెను 4 భాగముల విస్తారముగల సూత్రముతో మధ్య వృత్తమును గీయవలెను. స్కంధము యొక్క విస్తారము 10 భాగములుచేసి భద్రము 4 భాగములను, కర్ణములు 3 భాగముల చొప్పునను రచించవలెను. అంతస్తులను ఇష్టము వచ్చినట్లుచేసికొనవచ్చును 1 భాగము వేదికయును, అమలసారము 1 భాగము, కుముదము ½ భాగము, కుంభము 1 భాగము చేయవలెను. ఇది సాధారణ పద్ధతి దీనిని రుచక ప్రాసాద మందురు.

## 26. పుణ్యవర్ధన ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ పుణ్యవర్ధనకం బ్రూమః ప్రాసాదం వల్లభం హరేః।
భ్రామయేన్మూల సీమా స్ప్రృగ్ వృత్తమాదౌ సమంతతః॥ 104

తచ్ఛాలా కర్ణసంయుక్తం కర్తవ్యం సర్వతో దిశమ్।
యచ్ఛందః స్వస్తికే సస్యాద్ ద్విగుణః పుంద్రవర్ధనే॥ 105

జంఘోదకాంత భద్రాణా ముచ్ఛ్రాయో విస్తృతిశ్చయా।
స్వస్తికే కథితాసైవ విజ్ఞేయా పుణ్యవర్ధనే॥ 106

తా॥ చతురశ్రప్రదేశమున వృత్తరేఖను గీయవలెను. స్వస్తిక ప్రాసాదమున జెప్పబడిన కొలతల ప్రకారము నాలుగు దిశలయందు శాలలును, నాలుగు మూలలయందు కర్ణములను రచించవలెను. అధిష్ఠానము, జంఘ, జలమార్గము, భద్రముల యెత్తు విస్తారము, మొదలైనవి అన్నియును స్వస్తిక ప్రాసాదమునజేసినట్లే చేయవలెను. దీనిని పుణ్యవర్ధన ప్రాసాదమందురు.

## 27. మేరు ప్రాసాదము మొదలగు 8 బ్రహ్మ ప్రాసాదములు

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ అథాభి ధీయతే మేరు ర్దశధాత్ర భాజయేత్।
సీమానంతస్య కుర్వీత శృంగం చాపి విభాగికమ్॥ 108
శేషం విభాగికం భద్ర మాయామేన విధీయతే।
పదస్య షోడశాంశేన కర్తవ్య ముదకాంతరమ్॥ 109
పద్మైః షోడశభిర్గర్భో విధాతవ్యః పదంపదమ్।
భిత్తిరం ధాదికాబాహ్య భిత్తిశ్చాస్య విధీయతే॥ 110
భాగషట్కోచ్ఛ్రితా జంఘా మేఖలా చైకభాగికీ।
శృంగంచ త్రిపదోత్సేధం శిఖరం స్యార్ధశోచ్ఛ్రితమ్॥ 111
కర్తవ్యం వాస్తుశాస్త్రజ్ఞై స్తస్యైకా దశభూమికమ్।
సార్ధ పంచమ విస్తారః స్కంధో గ్రీవార్ధ భాగికా॥ 112
ఉచ్ఛ్రాయేణ విధాతవ్యా భాగికోత్సేధ మండకమ్।
భాగార్ధ కంచకుముదం భాగికా కలశోచ్ఛ్రితిః॥ 113
షడ్గుణో నైవ సూత్రేణ రేఖాతస్య ప్రకీర్తితా।
మేరుం మేరుగిరి ప్రఖ్య మేవం యఃకారయేదిమమ్॥ 114
శిలాభిరిష్టకాభిర్వా సమహత్పుణ్య మాప్నుయాత్॥

తా॥ మేరు ప్రాసాదముయొక్క లక్షణమును చెప్పుచున్నాడు. విస్తారమును 10 భాగములుచేసి శిఖరమును చేయవలెను. మిగిలినది భద్ర

మును రచించవలెను. ఒక భాగములో పదునాఱవ వంతు జలమార్గమును చేయవలెను. గర్భము 4 భాగములును, గోడ 1 భాగమును, అంధారిక 1 భాగమును, వెలుపలి గోడ 1 భాగమును చేయవలెను. జంఘ 6 భాగములు, మేఖల 1 భాగము, శృంగము యెత్తు 3 భాగములు, శిఖరము యెత్తు 10 భాగములు, అంతస్తులు 11 చేయవలెను. స్కంధముయొక్క విస్తారము 5½ భాగములుండవలెను. గ్రీవ ½ భాగము, అండకము యెత్తు 1 భాగము, కుముదము ½ భాగము, కలశము యెత్తు 1 భాగము, విస్తారమునకు 6 రెట్లుగల సూత్రముతో రేఖను రచించవలెను. దీనిని మేరు ప్రాసాదమందురు. 'మేరుమందర కైలాసా హంసాఖ్యో భద్ర ఏవచ ఉత్తుంగో మిశ్రకశ్చైవ తథా మాలాధరోఽష్టమః (9) ఇత్యష్టౌ బ్రహ్మణః ప్రోక్తాః ప్రాసాదాః పురమధ్యగాః (9) (సమరాంగణ 58 అ.).

## 28. మందర ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ లక్షణం మందరస్యాథ ప్రాసాదస్యాభి ధీయతే॥ 115

గర్భస్యార్ధేన నిష్క్రాంతం భద్రం కుర్వీత మందరే।
మందరం మేరు సంకాశం విన్యసేత్సర్వతో దిశమ్॥ 116

వలభీ మధ్య దేశేతు శిఖరోర్ధ్వ సముద్ధృతా।
సర్వమన్యత్ప్రమాణంతు మేరో రివభవే దిహ॥ 117

తా॥ మందర ప్రాసాదముయొక్క లక్షణమును చెప్పుచున్నాడు. గర్భములో సగము నిర్గమముతో భద్రమును రచించవలెను. అన్నివైపుల భద్రములను మేరువున రచించినట్లు రచించవలెను. దాని నడుమ వలభిని శిఖరముతో సమానముగా యెత్తున రచించవలెను. అన్ని కొలతలను మేరువున జేసినట్లే చేయువలెను.

## 29. కైలాస ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ కైలాస మథవక్ష్యామో దశధాతం విభాజయేత్।
భద్రం షడ్భాగ విస్తారం మధ్యదేశే వినిః సృతమ్॥ 118

కర్ణా ద్విభాగ విస్తారాః సలిలాంతర వర్జితాః।
గర్భస్యార్ధేన నిష్క్రాసః కార్యో భద్రస్య సర్వతః॥ 119

లతినస్య మధ్యే శిఖరార్ధ సమోదయమ్।
భిత్తి గర్భ భ్రమంతినాం జంఘా మేఖలయోరపి॥ 120

విస్తార ముదయం చాస్మిన్ విదధ్యాత్ స్కంధ శృంగయోః।
మేరో రివాస్మిన్ ప్రాసాదే విద్యాద్గ్రీవాం డకస్య చ॥ 121

తా॥ కైలాస ప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. విస్తారమును 10 భాగములుచేసి అందు కర్ణములు 2-2 భాగములును, మధ్యభద్రము 6 భాగములును చేయవలెను. కర్ణములకు జలమార్గ మక్కరలేదు. భద్రమునకు నిర్గమము అందులో సగము చేయవలెను. లతినమునందు జేసినట్లే శిఖరములో సగము యెత్తు చేయవలెను. గోడ, గర్భము, భ్రమంతిక, జంఘ, మేఖల, ఇవియన్నియును లతినమునజేసి నటులే చేయవలెను శిఖరమునకు జేసినట్లే విస్తారమునకు రెట్టింపుగా స్కంధమును రచించవలెను. గ్రీవ అండకము మొదలైనవి మేరు ప్రాసాదమున రచించి నట్లే రచించవలెను. దీనిని కైలాస ప్రాసాదమందురు.

## 30. హంస ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ బ్రూమోఽథ హంసమస్యాద్ విభాగో రుచకే యథా।
జలాంతరం విశేషోఽత్ర శేషం రుచకవద్భవేత్॥ 122

తా॥ హంసప్రాసాదముయొక్క కొలతలు రుచకప్రాశాదము కొలతలతో సమానముగా నుండును. ఇందు జలమార్గము మాత్ర మధికము. మిగిలిన వన్నియును రుచకమువలెనే చేయువలెను. దీనిని హంసప్రాసాద మందురు.

## 31. భద్ర ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ భద్రస్య లక్షణం బ్రూమో దశధాతం విభాజయేత్।
గర్భ విస్తారమానేన స్యా దస్మిన్ భద్ర విస్తృతిః॥ 123

సార్ధ ద్విభాగ విస్తారౌ రథకౌ వామదక్షిణౌ।
గర్భార్థ తుల్య మాయామాత్ ప్రాగ్గ్రీవంచే హకారయేత్॥ 124

ప్రాగ్గ్రీవస్య సముత్సేధం శిఖరార్ధే నకారయేత్।
వలభీం మధ్యదేశేఽస్య సింహకర్ణ సమన్వితామ్॥ 125

లతాజాల గవాక్షాద్యైశ్చ తుషాృభిశ్చతుర్దిశమ్।
భద్రో భవతిశేషంతు స్యాదత్ర రుచకే యథా॥ 126

తా॥ భద్రప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు విస్తారమును 10 భాగములుచేసి గర్భముతో సమానముగా భద్రమును రచించవలెను. 2½ భాగముల చొప్పున కుడి యెడమలను రెండు రథములను కల్పించవలెను. నడుమ భద్రమును ప్రాగ్గ్రీవమును రచించవలెను అ ప్రాగ్గ్రీవము యెత్తు శిఖరములో సగముండవలెను. మధ్య వలభిని సింహకర్ణములతో రచించవలెను. శిఖరములు, కిటికీలు, మొదలైన వానితో నలువైపుల భద్రములను రచించవలెను. మిగిలిన పనులన్నియును రుచకముతో సమానముగా నుండవలెను.

## 32. తుంగప్రాసాద లక్షణము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ అథ తుంగం ప్రవక్ష్యామో ఽప్యేతి యోహ్యేష మందరః॥
భూషయే త్సింహకర్ణైస్తం లతా మూర్ధ్వంచ కారయేత్॥ 127

భూమి భూమి సముత్సేధః స్తంభ చిత్రాదికం తథా।
మేరోరివాత్ర మధ్యేతు మంజర్యః సర్వతో దిశమ్॥ 128

తా॥ తుంగప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. మందర ప్రాసాదమును సింహకర్ణములతో నలంకారముగాజేసి పైన శిఖరమును రచించవలెను. అంతస్తు అంతస్తు యొక్క యెత్తును స్తంభముల యందలి చిత్రములును, అన్ని దిశలయందు మంజరులును, నడుమ శిఖరము మేరువువలెను రచించవలెను.

## 33. మిశ్రక ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ బ్రూమోఽథ మిశ్రకం సస్యాన్మాన సంస్థాన లక్షణైః॥
భౌమ్యో విమానవన్మధ్యే శృంగం కైలాసవద్భవేత్॥ 129

తా॥ మిశ్రకప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. అన్ని అంతస్తులును విమాన ప్రాసాదమువలెను మధ్య శిఖరమును మాత్రము కైలాస ప్రాసాదమువలెను రచించిరేని మిశ్రక ప్రాసాదమగును.

## 34. మాలాధరము-గవయము మొదలు 5 సూర్య ప్రాసాదములు

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ అథమాలా మాకారంతు వం కృత్వా గవాక్షై రుపశోభయేత్।
యత్కించిన్మాన మధ్యంతు తదాద్యస్యైవ కల్పయేత్॥ 130

తా॥ (ఇచట మాలాధరము యొక్కయు, గవయ ప్రాసాదము యొక్కయు లక్షణములు మూలమున సమగ్రముగా లభించలేదు)

గవయము మొదలు సూర్యప్రాసాదములు "గవయశ్చిత్రకూటశ్చ కిరణః సర్వసుందరః (10) శ్రీమత్సః పద్మనాభశ్చ వైరాజో వృత్త ఏవచ ఏతే కార్యా రవేరష్టౌ ప్రాసాదాః శుభలక్షణాః॥ (11) (సమరాం. 58 అ.)

## 35. చిత్రకూటప్రాసాద లక్షణము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ చిత్రకూట మథబ్రూమో దశధాతం విభాజయేత్।
ప్రాగ్గ్రీవ నిర్గమం తస్య గర్భమానేన కారయేత్॥ 131

సార్ధద్వయాదో విస్తారాం స్తత్కర్ణాన్ వామదక్షిణాన్।
ఉత్సేధస్య త్రిభాగేన జంఘోత్సేధం ప్రకల్పయేత్॥ 132

జంఘోత్సేధ త్రిభాగేన విన్యసేత్ ఖురపిండికామ్।
కపోతాంతర పత్రంచ తత్రస్యాదర్ధ భాగికమ్॥ 133
శిఖరోత్సేధ మానం యత్ తత్ త్రయోదశభిః పదైః।
తత్రభూమా స్తదుత్సేధం కల్పయేదను సారతః॥ 134
స్యాత్ స్తంభతో భిత్తిః కుర్యా న్మక్రాశ్చ పగికర్మణా।
కూటచ్ఛేదేన తత్క్రర్మ విన్యస్యేత్ సర్వతో దిశమ్॥ 135
భక్తమంతర పత్రేణ తలచ్ఛందం తదూర్ధ్వతః।
ద్వేద్వే కూటే తతో న్యస్యేత్ వామదక్షిణ కర్ణయోః॥ 136
శాలా మధ్యేతు చత్వారి (నామే) కూటాని సర్వతః।
భూమికాః సింహకర్ణాశ్చ కపాట ద్వార ఘట్టనాః॥ 137
శిఖరాణాం సముత్సేధో యథైవాద్యే తథా భవేత్॥

తా॥ చిత్రకూట ప్రాసాదలక్షణమును చెప్పుచున్నాడు. విస్తారమును 10 భాగములుచేసి గర్భముతో సమానముగా ప్రాగ్గ్రీవమును కల్పించ వలెను. కర్ణములు 2½ భాగముల చొప్పున రెండువైపుల రచించవలెను. విస్తారమునకు రెట్టింపుగా యెత్తున్ను ఎత్తులో 3వ వంతు జంఘను చేయ వలెను. జంఘ యెత్తులో 3వ భాగము అధిష్ఠానమును చేయవలెను. కపోతమును అంతరపత్రమును ½ భాగము చేయవలెను. శిఖరము యొక్క యెత్తు 13 భాగములుచేసి దానిని యెన్ని అంతస్తులు చేయదలచితే అన్ని అంతస్తులకు భాగములను నిర్ణయించవలెను. స్తంభమునుండి గోడను అన్నివైపుల చక్కని పనులును చేసి కూటములను అంతరపత్రముతో అంతస్తుల విభాగములును, చేయుచు 2-2 కూటములను కుడి యెడమల నుండు కర్ణముల యందు రచించవలెను. మధ్యశాలలు నలువైపులను రచించుచు ఆ శాలలకు గూడ శృంగములను, అన్ని అంతస్తుల యందు సింహకర్ణములను ద్వారములును, తలుపులును రచించవలెను. శిఖరముల యెత్తు మొదట యెట్లు రచించిరో తరువాత కూడ అటులనే రచించవలెను. దీనిని చిత్రకూట ప్రాసాదమందురు.

## 36. కిరణ ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ కిరణః కథ్యతే సస్యాత్ పద్మతుల్య ప్రమాణతః॥ 138
ద్వాత్రింశ ద్విస్తరాత్త స్మిన్ విదధ్యాత్ షోడశాథవా।
శాలా సుభేదః కర్ణైస్స్యా చ్ఛేషం మాలాధరో యథా॥ 139

తా॥ కిరణప్రాసాదముయొక్క లక్షణమును చెప్పుచున్నాడు. విస్తారమును పద్మప్రాసాదమునకు జేసినట్లుచేసి దానిని 32 భాగములుగాని లేక 16 భాగములుగానిచేసి మధ్యశాలయును, దాని కిరువైపుల రథములను కల్పించి యిట్లు నలువైపుల రచించి మిగిలిన పనులన్నియును మాలాధరప్రాసాదమువలె చేయవలెను. దీనిని కిరణప్రాసాదమని చెప్పుదురు.

## 37. సర్వాంగసుందర ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ సర్వాంగసుందరం బ్రూమః కర్మభేదైవనే కథా।
నానా శిల్పలతాధారం ప్రాసాదైర్బహు భిర్యుతమ్। 140
తలచ్ఛంద తులాన్యాస లియుక్తం బహులక్షణమ్।
నానాచిత్ర కలాయుక్తం ప్రాసాదే సర్వసుందరే॥ 141
తోరణైః సింహకర్ణైశ్చ సంయుక్తం పరికర్మభిః।
ప్రమాణ మిహ యత్కించిత్ సర్వం విద్యాత్ తదాద్యవత్॥ 142

తా॥ సర్వాంగసుందర ప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు అనేక విధములైన శిల్పములతో గూడిన శిఖరములును, అనేక ప్రాసాదములును, అంతస్తులును వాని వాని కర్మభేదములను, చిత్రశిల్పములును, కల్గి తోరణములచేతను, సింహకర్ణములచేతను ప్రకాశించుచు సర్వాంగసుందర ప్రాసాదమని యెన్నదగిన ఈ ప్రాసాదమునకు కొలతలు అన్నియును కిరణ ప్రాసాదముతో సమానముగ నుండును.

## 38. శ్రీవత్స ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ శ్రీవత్స మథవక్ష్యామో దశధాతం విభాజయేత్।
భాగత్రయేణ కుర్వీత శాలాం తత్ర విచక్షణః॥ 143
సార్ధభాగ ప్రవిస్తారౌ రథకౌ వామదక్షిణౌ।
మూలకర్ణా భవం త్యత్ర భాగద్వితయ విస్తృతాః॥ 144
ప్రాసాదే హస్త మాత్రాభిః ప్రత్యేకం భద్ర నిర్గమః।
ద్వ్యంగులం త్ర్యంగులం వాపి చతురంగుల మేవవా॥ 145
వలీ మధ్యేతు మంజర్యః కార్యా పద్మదలోపమాః॥
సర్వతః పరికర్మస్యాద్ రథికా కర్ణసంశ్రయా॥ 146
అలిందచంద్ర శాలాభిః స్కంధాంతం పరిపూరయేత్।
ఖురపిండీ చ జంఘాచ కుంభాగ్రం శిఖరాది చ॥ 147
యత్కించిత్త ప్రమాణేన వర్ధమాన సమం భవేత్॥

తా॥ శ్రీవత్స ప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు విస్తారమును 10 భాగములుచేసి మధ్యశాల 3 భాగములు, దాని కిరువైపుల రథములు 1½ భాగము చొప్పునను, మూలలయందు రథములు 2-2 భాగముల చొప్పునను రచించవలెను. భద్రముల యొక్క నిర్గమము 1 హస్తము కలిగి యుండవలెను. మంజరియొక్క వళిక మధ్యమమున 2, 3, 4 అంగులము లలోనే పద్ధతిలోనైనా పద్మదలాకారమును చేయవలెను. కర్ణములయందలి రథములు అంతటను చక్కని పనితనము కలిగియుండవలెను. అలిందములు చంద్రశాలలు స్కంధము యొక్క చివరవఱకుండవలెను. అధిష్ఠానము, జంఘ, కుంభాగ్రము, శిఖరము మొదలైనవి అన్నియును వర్ధమానముతో సమానమైన కొలతలు కలిగియుండవలెను. దీనిని శ్రీవత్స ప్రాసాదమందురు.

## 39. వలభ్య ప్రాసాదము మొ॥ 2 చండికా ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము ,

శ్లో॥ బ్రూమో వలభ్యం స భవేద్ గృహరాజస్య సన్నిభః॥ 148
ఆయతశ్చతురశ్రోవా ప్రమాణేనైకతః సమః॥
చతురశ్రస్తు విస్తారా దుదయే ద్విగుణో భవేత్॥ 149

ఊర్ధ్వేతస్య పునశ్చార్ధః స్కంధే చ్ఛాయా ద్విధీయతే।
విస్తారం దశధా సమ్యక్ చతురశ్రం సమంతతః॥ 150
విభాగేస్యా త్తతో మానం పూర్వప్రాసాద సన్నిభమ్।
స్వరూపం తస్య వక్ష్యామః శ్రీవత్స మివతం భజేత్॥ 151
యద్వా విమాన రుచక వర్ధమానాది సద్మనా।
ఛందే నైకస్య కస్యాపి ప్రాసాదస్య విభాజయేత్॥ 152
భూ స్తంభ పరికర్మాణి విస్తారోత్సేధ మేఖలాః।
సింహకర్ణ రథా ఘంటా తథా కుంభాగ్ర షండికమ్॥ 153
యత్కించిత్ తత్ప్రమాణేన యథైవాద్యం తథా భవేత్॥

తా॥ గృహరాజముతో సమానమైన వలభ్యప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. సమాన చతురశ్రమైనను దీర్ఘ చతురశ్రమైనను చేయ వచ్చును. సమచతురశ్రమునకు రెట్టింపుగా యెత్తును చేయవలెను. మఱియు స్కంధముపైన విస్తారము పీఠవిస్తారములో సగముండవలెను. విస్తారమును 10 భాగములుచేసి గృహరాజమువలెగాని శ్రీవత్సమువలెగాని భాగములు చేయవచ్చును. విమానము, రుచకము, వర్ధమానము, మొద లగు వాని కన్నిటికిని ప్రమాణము యొక్కటియేకాని అధిష్ఠానము, స్తంభ ములు, విస్తారము, ఎత్తు, మేఖలలు, సింహకర్ణములు. రథములు, ఘంట, కుంభముపైన కాడ మొదలగునవి యన్నియును మొదటిదానికెట్లో అన్ని టికి అటులే చేయవలయును. ఇది వలభ్యప్రాసాదము "నంద్యావర్తో ముఖ్యశ్చ సుపర్ణః సింహ ఏవచ విచిత్రో యోగ పీఠశ్చ ఘంటానాద పతాకి నౌ" (12) అష్టారేతే విధాతవ్యా శ్ఛండికాయాః సురాలయాః॥ (సమరాంగణ 58వ అధ్యాయము)

## 40. సుపర్ణ ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ సువర్ణస్య స్వరూపంచ ప్రమాణం చాభిధీయతే॥ 154
విభక్తం సింహరూపేణ సర్వభద్రం నివేశయేత్।
భాగైశ్చతుర్భి ర్నిష్క్రాంతం భద్రం గవయుత్వ సమమ్॥ 155

ద్వౌభాగౌ మూలకర్ణౌతు షడ్భాగా భద్ర విస్తృతిః।
పంచభాగోచ్ఛ్రితా జంఘా మేఖలా తస్య భాగికా॥ 156
మూలజంఘా త్రిభాగేన ఖురవేది సముచ్ఛ్రితిః।
తస్య మధ్యేతు శృంగేద్వే కర్తవ్యే వామదక్షిణే॥ 157
ఉచ్ఛ్రాయాద్ ద్విపదే స్యాతాం విభక్తే సర్వతో దిశమ్।
మూలకర్ణేషు శృంగాణాం త్రిపదా స్యాత్ సముచ్ఛ్రితిః॥ 158
.... .... .... సేవాపి చతురంగుల మేవవా।
కుర్యా జ్జలాధ్వ విస్తారం శ్రీవత్సే నందనే యథా॥ 159
విస్తారాద్ ద్విగుణోత్సేధః స్కంధః షడ్భాగ విస్తృతః।
ఉత్సేధస్య త్రిభాగేన జంఘోత్సేధో విధీయతే॥ 160
తృతీయాంశేన జంఘాయాః కుర్వీత ఖురపిండికామ్।
మేఖలాంతర పత్రంచ విదధ్యాత్ సార్ధభాగికమ్॥ 161
విభజ్య దశభిర్భాగైః పూర్వవత్ స్కంధ విస్తృతిః।
సార్ధ ద్విగుణ విస్తృత్యా పూర్వా కర్కటనా భవేత్॥ 162
చతుర్గుణేన సూత్రేణ మధ్యా కర్కటనా భవేత్।
గ్రీవార్ధ భాగముత్సేధాత్ కుముదం కుంభకం పునః॥ 163
అస్మిన్నా మలసారంచ యథా చాద్యే తథా భవేత్॥

తా॥ సుపర్ణప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. సింహప్రాసాదమువలె భాగములనుచేసి అన్ని భద్రములను రచించవలెను. భద్రము యొక్క నిర్గమము 4 భాగములును గవయప్రాసాదముననుంచినట్లు రచించవలెను. కర్ణకూటములు 2 భాగములును, మధ్యభద్రము 6 భాగములును చేయవలెను. జంఘ 5 భాగములుచేసి అందు మేఖల 1 భాగము చేయవలెను. జంఘయొక్క ప్రమాణములో 3వ వంతు అధిష్ఠానమును చేయవలెను. దానియొక్క మధ్యను ఇరువైపులను రెండు శృంగములను రచించవలెను. ఎత్తు 2 భాగములుండునట్లు అన్నివైపులను చేయవలెను. కర్ణకూటముల యెత్తు 3 భాగములు చేయవలెను. ఒక్క భాగములో 8వ వంతుగాని లేక 4 అంగులములుగాని జలమార్గమును చేయువలెను. శ్రీవత్సమునందును నందనమునందును చూచి చేయువచ్చును. విస్తారమునకు రెట్టింపుగా స్కంధము యెత్తును విస్తారము 6 భాగములును

చేయవలెను. మొత్తము యెత్తులో 3వ వంతు జంఘను చేయవలెను. జంఘలో 3వ వంతు ఖురపిండికను చేయవలెను. (అనగా లావులో) మేఖల అంతరపత్రము 1½ భాగము చేయవలెను. విస్తారమును 10 భాగములు చేసి స్కంధము యొక్క విస్తారము మునుపటివలెనేచేసి 2½ భాగముల విస్తారముతో పూర్వవృత్తరేఖను గీయవలెను. 4 భాగముల విస్తారముగల సూత్రముతో మధ్యవృత్తమును గీయవలెను. గ్రీవ ½ భాగము, కుముదము కుంభము, ఆమలసారము. ఇవి యన్నియును పూర్వమువలెనే చేయవలెను దీనిని సుపర్ణ ప్రాసాదమందురు.

# 41. పద్మనాభ ప్రాసాదము మొదలు 3 సూర్య ప్రాసాదములు

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ పద్మనాభ మథ బ్రూమః పద్మశాలాభిరన్వితమ్॥ 164
ద్వితీయః పద్మకోహ్యేష పద్మమాలాధరః శుభః।
సర్వమన్యత్ప్రమాణంతు పద్మ స్వస్తికయోర్యథా॥ 165

తా॥ పద్మనాభ ప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. పద్మప్రాసాదమువలెను స్వస్తికప్రాసాదమువలెను. పద్మశాలలతోను రచించవలెను అన్నికొలతలు పద్మస్వస్తికములవలెనని తెలియవలెను. దీనినే పద్మ మనియును మాలాధరమనియును చెప్పుచుందురు.

# 42. వైరాజ ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ వైరాజ మథ వక్ష్యామి సవిజ్ఞేయో విమానవత్।
రూపశాఖా సముత్సేధ స్తంభ గ్రీవాండ రూపకమ్॥ 166
సభాతోరణ నిర్వ్యూహ సింహకర్ణైశ్చ తాదృశైః।
సాధారం చతురశ్రంచ తం కుర్యాత్ పంచభూమికమ్॥ 167
విమాన సదృశాకారో వైరాజోఽయ ముదాహృతః॥

తా॥ వైరాజప్రాసాదముయొక్క లక్షణమును చెప్పుచున్నాడు.

ద్వారశాఖ స్తంభము, గ్రీవ, అండకము, విశాలము, తోరణము, నిర్గమము, సింహకర్ణములు. మున్నగునవి అన్నియును విమానప్రాసాదమువలెనే చేయవలెను. అధిష్ఠానము మొదలుకొని 5 అంతస్తులుగాను నలుచదరము గాను శిఖరము వరకు రచించిరేని వైరాజప్రాసాద మగును.

## 43. వృత్త ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ బ్రూమోఽథ వృత్తకం మూలే చతురశ్రః ప్రకీర్తితః॥ 168
జంఘా మూలే తతోఽష్టాశ్రి ర్వృత్తోభాగ తృతీయకే।
మూల మధ్యాగ్రతః పూర్ణం తం కుర్యా త్సర్వతో దిశమ్॥ 169
భద్రాకారం చ భద్రేషు విభాగే చతురశ్రకే।
అష్టాశ్రౌ వజ్రకాకారం వృత్తే స్వస్తిక సన్నిభమ్॥ 170
యథా మూలవిభాగేన లతినః స్వస్తికోదయః।
తథా వృద్ధి ప్రమాణాభ్యా మయమప్యాద్యవద్భవేత్॥ 171

తా॥ వృత్తప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. మొదట నలుచదరమును జంఘయొక్క మూలమున ఎనిమిది కోణములును, దాని తరువాత గుండ్రమును ఇట్లు అన్ని వైపుల రచించవలెను. భద్రములు భద్రాకారముగ, నలుచదరముగను, అష్టకోణములు వజ్రాకారముగను, వృత్తములు స్వస్తికములవలెను రచించవలెను. ఈ భాగములన్నియును లతినమున జెప్పబడినట్లు చేయవలెను అన్నియును మొదట జెప్పబడినటులే చేయవలెను.

## 44. నంద్యావర్త ప్రాసాదము మొదలు 6 చండికా ప్రాసాదములు

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ నంద్యావర్త మథ బ్రూమో దశధాతం విభాజయేత్।
పాదేన ద్వ్యంశ విస్తారౌ కర్ణౌ కుర్వీత పార్శ్వయోః॥ 172
చతుర్భాగ ప్రవిస్తారం భద్రమస్య ప్రకల్పయేత్।
సపాద పదికం కుర్యాచ్ఛాలా కర్ణాంతరే రథమ్॥ 173

జలాధార రథం కర్ణశాలాంతేషు యథేష్టతః।
షడంశః శిఖరాయామ స్తన్మధ్యే వలభీ భవేత్॥ 174
జలమార్గం చ కుర్వీత శాలా కర్ణాంత మూలయోః।
ప్రమాణ మన్యథా కించిద్ భూ సింహస్యేవ కారయేత్॥ 175

తా॥ నంద్యావర్త ప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. విస్తారమును 10 భాగములుచేసి కర్ణకూటములు $1\frac{3}{4}$ భాగములును, మధ్య భద్రము 4 భాగములున్ను, రథములు $1\frac{1}{2}$ భాగములును, చేయవలెను. జలమార్గములను ఇష్టము వచ్చినట్లు చేయవచ్చును. స్కంధముయొక్క విస్తారము 6 భాగములును, దాని నడుమ వలభియును రచించవలెను సింహప్రాసాదమువలె అంతస్తులును శేషించిన పనులును చేయవలెను. ఇది నంద్యావర్త ప్రాసాదము.

## 45. సింహప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ ప్రమాణ మథ సింహస్య లక్షణంచాభి ధీయతే।
దశధాక్షేత్ర విస్తారం విభజేత్ సర్వతః సమమ్॥ 176
ద్విభాగౌ మూల కర్ణౌతు కర్తవ్యౌ వామదక్షిణౌ।
మూలభద్రస్య విస్తారః షడ్భిర్భాగైర్వి ధీయతే॥ 177
విస్తారో ద్విగుణః కార్యః స్కంధోత్సేధ ప్రమాణతః।
పంచభాగోచ్ఛ్రితా జంఘా మేఖలా సార్ధభాగికీ॥ 178
ఖురకం వేదిబంధం చ తత్త్రి భాగేన కల్పయేత్।
భాగత్రయోచ్ఛ్రితాని స్యుః శృంగాణిచ చతుర్దిశమ్॥ 179
సింహస్య కర్ణవన్మధ్యే వలభ్యా భూషయేద్బుధః।
సర్వమన్యత్ ప్రమాణంచ సర్వతోభద్ర వద్భవేత్॥ 180

తా॥ సింహప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. విస్తారమును 10 బాగములుచేసి కర్ణకూటములు 2 భాగముల చొప్పునను, మధ్యశాల 6 భాగములును చేయవలెను. విస్తారమునకు రెట్టింపుగా స్కంధము యెత్తును చేయవలెను. జంఘ యెత్తు 5 భాగములు, మేఖల $1\frac{1}{2}$ భాగము

జంఘలో 3వ భాగము అధిష్ఠానమును వేదిబంధమును చేయవలెను. నలువైపుల శృంగములు 3 భాగముల యెత్తుండవలెను సింహముయొక్క తలలతోను వలభితోను భద్రములను అలంకారముగా రచించవలెను. సర్వతోభద్ర ప్రాసాదమువలె మిగిలిన పనులన్నియును చేయవలెను. ఇది సింహప్రాసాదము.

## 46. విచిత్రకూటప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము ;

శ్లో॥ విచిత్రకూటం వక్ష్యామో దశధాతం విభాజయేత్।
షడ్భాగో మూలభద్రః స్యాత్ హస్తతుల్యాంగులో భవేత్॥ 181
శాలా మధ్యప్రదేశేతు వలభీం సన్నివేశయేత్।
కూటేద్వే సర్వతో న్యస్యే చ్ఛ్లిష్టేస్యా న్మూల కర్ణయోః॥ 182
ఏషభేదః సముద్దిష్టః శాలాస్యాత్కూట వర్జితా।
ప్రమాణ మన్యత్ సర్వంతు విజ్ఞేయం చిత్రకూటవత్॥ 183

తా॥ విచిత్రకూట ప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. విస్తారమును 0 భాగములుచేసి అందు మధ్యభద్రము 6 భాగములును, ఆ భద్రమునకు వలభియును, మూలలయందు 2 భాగముల చొప్పున కూటములును, రచించవలెను. కూటములులేనిది శాలయగును. కూటములు కలది విచిత్రకూటమగును. కొలతలు మాత్రము అన్నియును సమానమే, మిగిలినవన్నియును చిత్రకూటమునందు చేసినట్లే చేయవలెను.

## 47. యోగపీఠప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ యోగపీఠ మథ బ్రూమ స్త్రి విష్టపమిదోత్తమమ్।
విభజేద్భాగ వింశత్యా చతురశ్రం సమంతతః॥ 184
కోష్ఠాన్యద్భాగ విస్తారా త్కుర్యాద్ దిక్షు విదిక్షుచ।
భాగికౌ జలమార్గౌచ విదధ్యా ద్వామదక్షిణౌ॥ 185
విస్తారాత్తేషు గర్భః స్యాద్ భాగత్రితయ సంమితః।
పంచభాగోచ్ఛ్రితా జంఘా కపోతాంతర వర్జితా॥ 186

ఖురకం వేదిబంధంచ కుర్యా ద్భాగత్రయోచ్ఛ్రితమ్।
విస్తారాద్ ద్విగుణోచ్ఛ్రాయః కార్యోఽయం పంచభూమికః॥ 187
సింహకర్ణై రథై ర్ఘంటా భ్రమికాస్తంభ తోరణైః॥
రచనాస్య విధాతవ్యా కథితా పుష్పకే యథా॥ 188
సాంధారః కేవలం కార్యః ప్రాసాదోఽయం విచక్షణైః

తా॥ యోగపీఠ ప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. త్రివిష్టపము వలె శ్రేష్ఠమైనది. విస్తారమును 20 భాగములుచేసి అందు మధ్య గర్భము 3 భాగములును, దాని చుట్టూ గోడ 2½ భాగములును, నాలుగు దిశల యందును నాలుగు మూలలయందును కోష్ఠములు ఒక్కొక్కటి 3 భాగముల చొప్పున 8యును, దానిచుట్టూ వెలుపలి గోడ 3 భాగములు చేయవలెను ఇది సాంధార పద్ధతి. జంఘ 5 భాగములును, కపోతము అంతర పత్రము అవసరములేదు. అధిష్ఠానమును వేదిబంధమును కలిపి 3 భాగములు చేయవలెను. విస్తారమునకు రెట్టింపుగా యెత్తును చేయవలెను. మొత్తము 5 అంతస్తులతో రచించవలెను. సింహకర్ణములును, రథములును, ఘంట, భ్రమిక, స్తంభములు, తోరణములు, మొదలైనవి పుష్పక ప్రాసాదమున రచించినట్లు రచించవలెను. చుట్టూ కోష్ఠములు లేకుండ కేవలము సాంధారముగా గూడ రచించవచ్చును. దీనిని యోగపీఠ ప్రాసాదమందురు.

## 48. ఘంటానాద ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ ఘంటానాద మథ బ్రూమః సభవేత్ పంచభూమికః॥ 189
అష్టాశ్రికోణః కర్తవ్యః సంస్థానాత్ పుష్పకోఽపరః।
భైరవో భద్రకాలీచ స్థాప్య చాత్ర వరాటకే॥ 190

తా॥ ఘంటానాద ప్రాసాదముయొక్క లక్షణమును చెప్పుచున్నాడు. 5 అంతస్తులును కర్ణకూటములు 8 కోణములతోను పుష్పకప్రాసాదమువలె రచించవలెను. ఇది కాలభైరవుడు, భద్రకాళి దేవతలకు ముఖ్యమైనది.

శ్లో॥ ఇదానీం వేణుకం ప్రబ్రూమ శ్చతురశ్రం సమం శుభం।
న కుర్యాద్భద్ర నిష్క్రామ మత్రచ్ఛాద్యాత్మకం శుభమ్॥ 201
విస్తార ద్విగుణోచ్ఛ్రాయః కుంభాగ్రంచ యథోదితమ్।
శిఖా ద్విగుణ మానస్య జంఘాత్ర్యంశేన కల్ప్యతే॥ 202
జంఘా త్రిభాగముత్సేధాత్ కార్యా ఖురవరండికా।
కపోంతర పత్రంచ కర్తవ్యం సార్ధభాగికమ్॥ 203
చతుర్భాగేన సూత్రేణ వేణుకోశం సమా లిఖేత్।
సర్వతః శోభనం కుర్యాత్ తం కపోతని నిర్గమే॥ 204
ముఖేఽస్య సింహకర్ణాః శ్చంద్రశాలా వివర్జితాః।
ప్రమాణమస్య యత్కించిద్ వేణుకేచ విధీయతే॥ 205

తా॥ వేణుక ప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. నలుచదరముగా చేసి పైజెప్పిన కొలత ప్రకారమే చేసి భద్రమునకు నిర్గమము లేకుండ ఛాద్యమును కల్పించి విస్తారమునకు రెట్టింపుగా యెత్తును చేసి కుంభము పైభాగము వఱకు పూర్వము చెప్పబడినట్లు చేయవలెను. శిఖరము వఱకు జేయబడిన యెత్తులో 3వ వంతు జంఘను చేయవలెను ఆ జంఘ యెత్తులో 3వ వంతు అధిష్ఠానమును చేయవలెను. కపోతము అంతరపత్రము $1\frac{1}{2}$ భాగము చేయవలెను. విస్తారమునకు 4 రెట్లుగల సూత్రముతో శిఖరముయొక్క వృత్తమును చేయవలెను. అంతటను చక్కగా కపోతముల వరుసను రచించవలెను. ముఖభాగమున సింహకర్ణములను రచించవలెను. చంద్రశాల అవసరములేదు. లతినమునందు జెప్పబడిన వేణుకముయొక్క కొలతలతోనే రచించవలెను

## 53. కుంజర ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ ఇదానీం కుంజరం ప్రబ్రూమో గజలక్షణ లక్షితమ్।
అర్ధసూత్రేణ తత్ సీమ్నః పృష్ఠతో వృత్తమా లిఖేత్॥ 206
చతుర్భాగే భవే జ్జంఘా మేఖలా చార్ధభాగికా।
వృత్తాకారం పృష్ఠదేశే తం కుర్వీత విచక్షణః॥ 207

శాలా సుసింహ కర్ణాః స్యుః పార్శ్వతః పృష్ఠతోఽగ్రతః।
కర్ణాశ్చ తస్య కర్తవ్యాః శృంగైః సర్వే పూరితాః॥ 208
మధ్యప్రదేశే వలభీ కర్తవ్యా చాతి శోభనా।
యత్కించిత్త త్ప్రమాణంతు యథై వాద్యే తథా భవేత్॥ 209

తా॥ కుంజర ప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. విస్తారములో సగము సూత్రముతో వెనుక గుండ్రముగా గీయవలెను. జంఘ 4 భాగములు, మేఖల $\frac{1}{4}$ భాగమును, వెనుక గుండ్రముగాను, రచించవలెను. నలువైపుల శాలలును వానియందు సింహకర్ణములును, కర్ణకూటములును. ఆ కర్ణకూటములకు శృంగములును, మధ్యప్రదేశమున వలభియును మిగుల సౌందర్యముగా రచించవలెను. లతినమునందువలెనే అన్ని ప్రమాణములు తెలిసికొనవలెను.

## 54. హర్షణ ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ అథహర్షం ప్రవక్ష్యామ శ్చతురశ్రం మనోరమమ్ ।
విస్తారాత్ సార్ధఉత్సేధః స్యాద్ఘంటాం మస్తకావధేః॥ 210
భాద్యరూపంచకుర్వీత చతురశ్రం చతుర్దిశమ్ ।
శుకనాసం సుఖాతేన శోభితం పరికర్మణా॥ 211
జంఘామేఖలయోశ్చాపి ఖురపిండస్యచోచ్ఛ్రితిః
ఘంటాగ్రంచంద్రశాలాచ భాద్యకం చయదృచ్ఛయా 212
కుర్యాత్ప్రమాణమన్యచ్చ యథైవమనసః ప్రియమ్॥

తా॥ హర్షణ ప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. నలుచదరముగాను విస్తారమునకు అర్ధభాగమును అధికముచేసి మస్తకము యొక్క పై భాగము వఱకు ఘంటను చేయవలెను. నలువైపుల కప్పును రచించవలెను శుకనాసను చక్కగా కల్పించవలెను. జంఘ, మేఖల, అధిష్ఠానము, ఘంట యొక్క పైభాగము, చంద్రశాల, భాగ్యము, ఇవి యన్నియును లతినమునందు జెప్పబడిన కొలతలతో గాని లేక యిష్టము వచ్చినట్లు అలంకారముగా గాని చేయవచ్చును.

## 55. విజయ ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ ఇదానీం విజయంబ్రూమః ప్రాసాదంచాతి శోభనమ్॥ 213
లతినేవర్ధమానేన ప్రమాణేన విభాజయేత్ ।
శుకనాసోదయం న్యస్యే దంశోన శిఖరోదయాత్ 214
అగ్రప్రాగ్గ్రీవకౌ కార్యౌ రథకౌవామదక్షిణౌ ।
కర్తవ్యోర్ధ్వ తలచ్ఛాయం పూరయేత్సర్వపోదిశమ్॥ 215
విటయోవర్ధమానశ్చ ప్రమాణేన సమావుభౌ।
అవిందభేదాన్నామాస్య కృతం విజయఇత్యదః॥ 216

తా॥ విజయ ప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. లతినములలో వర్ధమానమునకు జెప్పబడిన కొలతలననుసరించినవ స్తమును చేయవలెను శిఖరము యొక్క యెత్తుకంటె ఒక్కభాగము తక్కువగా శుకనాసను రచించవలెను. ముందు భాగమున ప్రాగ్గ్రీవములను కుడియెడమల రథమును రచించి ఆపై అంతస్తులు కూడ అటులే చేయవలెను ఇట్లు నాలుగు వైపుల రచించవలెను. వర్ధమానము విజయము ఈ రెంతు ఒక్కటే పద్ధతితో నుండును. అవింద భేదములవలన విజయప్రాసాదమనబడినది.

## 56. ఉదకుంభము, మోదకము, మహాపద్మము

పై జెప్పబడిన ఉదకుంభ మోదక మహాపద్మములకు సంబంధించిన శ్లోకములు గలితములు.

## 57. హర్మ్యప్రాసాదము మొదలగు 8 లక్ష్మిప్రాసాదములు

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ బ్రూమోఽథహర్మ్యంప్రాసాదం తంకుర్యాదేకభూమికమ్।
దారుజంతురశంచ పట్టుతులా భిత్తిభిః॥ 217

దండచ్ఛాద్యం కుర్వీత సమంతాచ్చ చతుష్కికామ్।
ఊర్ధ్వతస్తుంబికాక్రాంతం పద్మఖండవిభూషితమ్॥ 218
ముఖేపత్రైర్గవాక్షైశ్చ వేదికాస్తుంభతోరణైః।
వలభీశాలభంజీభిః సింహకర్ణైశ్చ భూషయేత్॥ 219
విస్తారమస్యహర్మ్యస్య కుర్యాదుచ్ఛ్రాయ సంమితమ్॥

తా॥ హర్మ్య ప్రాసాదముల యొక్క లక్షణమును చెప్పుచున్నాడు. ఇది దారువుతో నలుచదరముగాను ఒక్కటే అంతస్తుగాను రచించవలెను. దూలము గోడ దండము ఛాద్యము అంతటను చేయవలెను. పైన 4 తుంబిక యను పేరుగల గుజ్జులను నాటవలెను పద్మఖండముతోను ముఖభాగమున పత్రములతోను, గవాక్షములతోను, వేదికతోను, స్తంభములతోను, తోరణములతోను, వలభితోను, సాలభంజికలతోను, సింహకర్ణములతోను అలంకారముగా రచించవలెను, విస్తారమును ఎత్తును పూర్వోక్తలక్షణ హర్మ్య ప్రాసాదములవలెనే చేయువలెను "మహాపద్మస్తథాహర్మ్యముజ్జయంతస్తథాపరః గంధమాదన సంజ్ఞశ్చ శతశృంగానవద్యకౌ" (15) సువిభ్రాంతోమనోహరీత్యష్టౌలక్ష్మ్య ప్రకీర్తితాః
సమరాంగణ 58వ అధ్యాయము :

## 58. ఉజ్జయంత ప్రాసాదము

సమరాంగణ 58వ అధ్యాయము :

శ్లో॥ ఇదానీముజ్జయంతస్య లక్షణంసంప్రచక్ష్మహే॥ 220
కుర్యాద్భూహర్మ్యమానేఽత్ర ద్వారిమండప భూషితమ్।
చతుర్ద్వారంచకుర్వీత సర్వతోమండపాన్వితమ్॥ 221
ప్రమాణమన్యదప్యస్య హర్మ్యస్యేవాఖిలం భవేత్॥

తా॥ ఉజ్జయంత ప్రాసాదలక్షణమును చెప్పుచున్నాడు. అంతస్తులును ద్వారమునందు మండపమును ఇట్లు నలువైపుల ద్వారములును మండపములును కల్పించవలెను. లతినమునందు జెప్పబడిన ఉజ్జయంత ప్రమాణములతో నన్నియును చేయువలయును.

## 59. గంధమాదన ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ ఇదానీమభిధాస్యామో గంధమాదన లక్షణమ్॥ 222
హర్మ్యమానేనకర్తవ్యః ప్రాసాదోగంధమాధనః
అగ్రతః పృష్ఠదేశేచ మంఠపంతస్యకారయేత్॥ 223
చతుష్క్రజాలపక్షాద్యా పామదక్షిణభాగయోః
ప్రమాణమస్యకర్తవ్యం యథాహర్మ్యస్య కీర్తితమ్॥ 224

తా॥ గంధమాదన ప్రాసాదలక్షణమును చెప్పుచున్నాడు. లతినము నందు జెప్పబడిన గంధమాదనము యొక్క ప్రమాణములే దీనికి ఉప యోగపడును. ముందు భాగమునను వెనుక భాగమునను మంఠపములను రచించవలెను. 4 గవాక్షులను కుడి యెడమ దిశలయందు కన్పించవలెను. మిగిలిన పనులన్నియును పూర్వోక్త పద్ధతితో రచించవలెను.

## 60. శతశృంగ ప్రాసాదము. నిరవద్య ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ బ్రూమోఽథశతశృంగఁస త్రివిష్టప సమోభవేత్।
విభజేద్భాగవింశత్యా పంచభౌమంచ కారయేత్॥ 225
ద్విద్విభాగానికూటాని సైకమంఠతశం భవేత్।
భూమౌభూమౌచ శృంగాణి భూవిస్తారదశాంశతః॥ 226
ప్రమాణమస్యయత్కించిత్ తత్త్రివిష్టపవద్భవేత్॥

తా॥ శతశృంగ ప్రసాద లక్షణమును చెప్పుచున్నాడు. త్రివిష్టప ప్రసాదమువలె విస్తారమును 20 భాగములు చేసి 2 2 భాగముల చొప్పున కూటములను 101 యగునట్లు రచించవలెను. ప్రతి అంతస్తున శృంగములు అవిస్తారములో 10వ వంతున నుండవలెను. అన్ని కొలతలను త్రివిష్టపమున చేసినట్లే చేయవలెను నిరవద్య ప్రాసాదము యొక్క లక్షణముగవితము,

# 61. విభ్రాంత ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ విభ్రాంతమథవక్ష్యామః సర్వతోభద్రసన్నిభమ్॥ 227
సాంధారంతంప్రకుర్వీత సర్వతోమండపైర్యుతమ్।
గవాక్షవేదిజంఘాద్యాః కుర్యాద్దిక్షుచతుష్కికాః॥ 228

తా॥ విభ్రాంతప్రాసాదలక్షణమును చెప్పుచున్నాడు. ఇది సర్వతోభద్రముతో సమానముగనుండును. సాంధారముగను అంతటను మండపములతోను గవాక్షులు వేదిక జంఘ మొదలైనవి నలుదిశలయందు రచించవలెను.

# 62. మనోహర ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ మనోహరమథబ్రూమః సభవేన్మండపోయథా ।
సచ్ఛాద్యతోరణైర్దిక్షు చతుర్ద్వారః సమండపః॥ 229
వేదిషండాంబుమార్గాద్యైః ప్రతోలీద్వారజాలికైః
సింహపీఠతలన్యాసైః కలశైః పరీపూరితః॥ 230
వృత్తస్తంభస్తులాచ్ఛన్నో బహిచ్ఛాద్యేనభూషితః।
సింహవ్యాలగజైః పత్రైర్ముఖేస స్తంభతోరణైః॥ 231
పునఃకార్యంప్రమాణంతు యథాశోభం విధీయతే॥

తా॥ మనోహర ప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. మండపమువలె ఛాద్యము, తోరణము, నలువైపుల ద్వారములు, ఆ ద్వారముల మంటపములును, వేదిక, షండము, జలమార్గము, వీధి, ద్వారములు, గవాక్షములు, అంతస్తులయందు సింహ పీఠములు, పైన కలశములు, గుండ్రని స్తంభములు, దూలములును, ఆ దూలములపైన కప్పును వెలుపల కప్పును సింహములు, వ్యాళములు, ఏనుగులు, పత్రములు, మొదలు మునవి ముఖభాగములందును స్తంభములు తోరణములు మొదలగు అలంకారములును అన్ని అంతస్తులయందు చేయవలెను. ఇష్టము వచ్చిన కొలతలతో రచించ వచ్చును.

# 63. వృత్త ప్రాసాదము-వృత్తాయత ప్రాసాదము

## 8. సమస్త దేవతలకు

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ వృత్తవృత్తాయతౌ బ్రూమస్తయోః కంబుసమాకృతిః॥ 232
వృత్తస్తత్రతలన్యాస చతురస్రూఽంశ పంచకమ్।
వృత్తాద్యమూర్ధ్వతోవృత్తం యథాశోభంసముత్థితమ్॥ 233
కుర్యాన్ముఖాయతంచాన్యం సింహకర్ణాన్వితంముఖే।

తా॥ వృత్త ప్రాసాదముల యొక్కయు వృత్తాయత ప్రాసాదముల యొక్కయు లక్షణములను చెప్పుచున్నాడు. వృత్తము యొక్క అంతస్తునకు దిగువ అధిష్ఠానము నలుచదరముగాను, లేక మొదటి నుండి చివర వఱకు గుండ్రముగాను రచించ వచ్చును. మఱియు వృత్తాయత ప్రాసాదమునకు అధిష్ఠానము విస్తారము 4 భాగములును, ఆయతము 5 భాగములును చేసి ముఖభాగము యెక్కువగా నుండునట్లును, ఆ ముఖ భాగమునందు సింహకర్ణములుండునట్లును రచించవలెను. పైన శిఖరముకూడ వృత్తాయతముగానే యుండవలయును- "వృత్తోవృత్తాయతశ్చైత్యః కింకిణీలయనాధః (16) పట్టిశోవిభవాఖ్యశ్చ తీతస్తారాగణోఽష్టమః కుర్వీత సర్వ దేవానాం ప్రాసాదాన్వాస్తు శాస్త్రనితో....(17) (సమరాం — 58 అ.)

# 64. చైత్య ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :-

శ్లో॥ చైత్యస్యలక్షణంబ్రూమః సస్యాచ్ఛాద్యత్రయాన్వితః॥ 234
ఆస్యాకారఃప్రమాణంచ యథావృత్తేతథాభవేత్॥

తా॥ చైత్య ప్రాసాదము అన్ని లక్షణములను వృత్తప్రాసాదమును పోలియుండును. మఱియు 3 అంతస్తులుగ రచించవలెను.

# 65. కింకిణీ ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ కింకిణీకమథ బ్రూమః పంచాండం నవభూమికమ్॥ 235
వృత్తాకూటాః శుభాః కార్యాః సర్వేఽమీశుభలక్షణాః॥

తా॥ కింకిణీక ప్రాసాదము 9 అంతస్తులతోను గుండ్రని కూటముల తోను 5 అండకములతోను చాల అందముగా నుండును.

## 66. లయనీ ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ ఇదానీంలయనంబ్రూమః సశైలఖననాద్భవేత్॥ 236
నిఃశ్రేణ్యారోహసోపాన నిర్వ్యూహకగవాక్షకాన్।
వేదీభ్రమవిటంకాశ్చ ప్రతోలీద్వార సంయుతాన్॥ 237
ఉత్కీర్ణానాచరేతర ప్రాగ్గ్రీవన్మానంచ॥

తా॥ లయన ప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. పర్వతప్రదేశమున పల్లముగా నున్నచోట నిచ్చెనమాదిరిగా గాని లేక మెట్లుగాని యేర్పఱచి నిర్గమముగవాక్షులు వేది, భ్రమము, శృంగము, పీథి, ద్వారము, మొదలైనవి చేసి పైన కప్పును రచించి ప్రాగ్గ్రీవముయొక్క యెత్తును-

## 67. పట్టిస ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ ఇదానీంపట్టిసంబ్రూమః ప్రాసాదం వప్రసంభవమ్॥ 238
రోహణోజాలపాదైశ్చ వేదీషండైశ్చమండితమ్।
కూర్మపృష్ఠంప్రదాతవ్య మిచ్ఛతాశుభలక్షణమ్॥ 239

తా॥ పట్టిస ప్రాసాదము యొక్క లక్షణమును చెప్పుచున్నాడు. కొండనెత్తమున దేవాలయమును రచించి మెట్లు గవాక్షములు, స్తంభములు వేదిక, కాడ మొదలగునవి రచించి తాబేలు వీపువలె నడుము మెరకగా జేయవలెను- ఇష్టమువచ్చిన కొలతతో చేయవచ్చును.

## 68. విభవ ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ విభవః కథ్యతేసస్యాత్ కుర్యాదన్యసమాశ్రయః।
దారవేదారవోయోజ్యః శైలజే శైలసంభవః॥ 240
మృన్మయేమృన్మయః కార్య శ్చయనేచయనోద్భవః।
ప్రత్యంత గ్రామఖేటేషు దారుస్తంభైర్విధీయతే॥ 241
విభవస్యానుసారేణ సకార్యోధార్మికైస్త్రిభిః॥

తా॥ విభవ ప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. దీనిని లతినము నందు చెప్పబడిన కొలత ప్రకారము చేయవచ్చును. దారువుతో జేయునపుడు దారువులను, ఱాతితో నిర్మించునపుడు ఱాలను, మట్టితో రచించునపుడు మన్నుతోను, పుష్పపత్రాదులతో రచించునపుడు పుష్పపత్రాదులును జతపఱుపవలెను. చిన్న కొండమీదగాని, గ్రామములోగాని, చిన్న యూరిలోగాని, వారి వారి ఇష్టానుసారము దారుస్తంభములతో రచించవచ్చును. ఎవరి శక్తిననుసరించి వారు చేయవచ్చును కనుక దీనికి విభవ ప్రాసాదమని పేరిడిరి.

## 69. తారాగణ ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ తారాగణమథబ్రూమః సభవేన్మండపాకృతిః॥ 242
వస్త్రచీరతూలశౌండై డోలాక్రీడా భ్రమైర్గృహైః।
వస్త్ర జైశ్చిత్రరూపాద్యై ర్ఘంటాదర్పణ తోరణైః 243
ధ్వజచ్ఛత్రవిమానాద్యైం కింకిణీ భిర్విరాజితమ్।
యత్కించిత్ సుందరంసర్వం తవత్ర వినివేశయేత్॥ 244

తా॥ తారాగణ ప్రాసాదలక్షణమును చెప్పుచున్నాడు. ఇది మండపమువలె నుండును. నూలువస్త్రము, నారవస్త్రము, దూది మొదలగు వానితోను, మనుష్య పశుపక్ష్యాది సంచారము, వివిధ క్రీడలు, చిత్రరూపములు ఘంట, అద్దము, తోరణము, ధ్వజము, ఛత్రము, విమానము, చిరుగంటలు మొదలగు పలువిధములైన అలంకారములతో రచించవలెను,

శ్లో॥ అష్టాష్టకైర్వ్యేచవిశేషయోగాత్ ప్రాసాదషష్టిశ్చతురన్వితైషా।
విమానముఖ్యాః కథితాయపితాన్ జానాత్యసాశిల్పిగణాగ్రణీః
స్యాత్॥ 245

ఇతి సమరాంగణ సూత్రధారాపరనామ్ని వాస్తుశాస్త్రే విమానాదిచతుః షష్టి ర్నామైకోనషష్టితమోఽధ్యాయః.

# 70 శ్రీకూటము మొదలు

# 36. నాగరసాంధార ప్రాసాదములు

సమరాంగణ 60వ అధ్యాయము :

శ్లో॥ షట్త్రిశంతమథ బ్రూమః ప్రాసాదాన్ నాగరక్రియాన్।
సాంధారాన్ప్రథమస్తేషు శ్రీకూటః శ్రీముఖ స్తతః॥ 1
శ్రీధరోవరదశ్చైవతథాన్యః ప్రియదర్శనః
కులనందోఽంతరిక్షశ్చ। పుష్పభాసోవిశాలకః॥ 2
సంకీర్ణోఽథమహానందో నంద్యావర్త స్తథాపరః।
సౌభాగ్యశ్చ విభంగశ్చ విభవ స్తదనంతరమ్॥ 3
బీభత్సకోఽథశ్రీతుంగో మానతుంగస్తథాపరః
సర్వతోభద్ర సంజ్ఞశ్చ భవేద్బాహ్యోదరస్తతః॥ 4
నిర్వ్యూహోదర సంజ్ఞోఽన్య స్తతో జ్ఞేయః।
సమోదరః నందిభద్రోభద్రకోశ శ్చిత్రకూటస్తతః పరమ్॥ 5
విమలోహర్షణో భద్ర సంకీర్ణ స్త దనంతరమ్।
తతోభద్రవిశాలాఖ్యో భద్రవిష్కంభ ఏవచ॥ 6
ఉజ్జయంతాభి ధానశ్చ సుమేరురథమందరః।
కైలాసః కుంభకాఖ్యశ్చ గృహరాజశ్చ నామతః॥ 7
ఏతేషట్త్రింశదుదిష్టా లక్షణం కథ్యతేఽధునా॥

తా॥ నాగరపద్ధతితో నిర్మించునట్టి సాంధారజాతి 36 భేదముల యొక్క నామములు, శ్రీకూటము, శ్రీముఖము, శ్రీధరము, వరదము, ప్రియదర్శనము, కులనందము, అంతరిక్షము, పుష్పభాసము, విశాలము, సంకీర్ణము, మహానందము, నంద్యావర్తము, సౌభాగ్యము, విభంగము, విభవము, బీభత్సము, శ్రీతుంగము, మానతుంగము, సర్వతోభద్రము, బాహ్యోదరము, నిర్వ్యూహోదరము, సమోదరము, నందిభద్రము, భద్రకోశము, చిత్రకూటము,

విమలము, హర్షణము, భద్రసంకీర్ణము, భద్రవిశాలము, భద్రవిష్కంభము, ఉజ్జయంతము, సుమేరువు, మందరము, కైలాసము, కుంభకము, గృహరాజము, వీనియొక్క లక్షణములను చెప్పుచున్నాడు.

శ్లో॥ చతురశ్రీకృతేక్షేత్రే ద్వాదశాంశ విభాజితే॥ 8
ప్రాసాదంవిభజేత్ప్రాజ్ఞః శ్రీకూటంనామశోభనమ్।
జ్యేష్ఠః స్యాద్వింశతిర్హస్తా మధ్యమోదశ పంచచ॥ 9
కనీయాన్దశవిజ్ఞేయః ప్రమాణం హస్తసంఖ్యయా।
భద్రంషడ్భాగికాయామం కర్ణాః కార్యాద్విభాగికాః॥ 10
తిలకంభాగికంకార్యం భాగేనైకేన నిర్గతమ్।
తస్మాద్భాగేన నిష్క్రాంతం భద్రమస్య విధీయతే॥ 11
భాగికీబాహ్యభిత్తిః స్యాచ్ ద్విపదాచాంధకారికా।
భాగికీగర్భభిత్తిశ్చ గర్భఃకార్యశ్చతుష్పదః॥ 12
అథచ్ఛందః సముద్దిష్ట ఊర్ధ్వచ్ఛందోఽభిధీయతే।
విస్తారార్ధేనజంఘాస్యాన్మేఖలాచైక భాగికా॥ 13
భాగత్రయోచ్ఛ్రితం శృంగం ద్వితీయమపితాదృశమ్।
పూర్వశృంగస్య మధ్యేత ద్విధాతవ్యం విచక్షణైః 14
సార్ధభాగోదయః కార్యస్తిలకోఽన్యశ్చ తాదృశః ।
ద్వితీయతిలకస్యోర్ధ్వం సుశ్లిష్టారూప సంయుతా॥ 15
స్యాదురోమంజరీ సప్తభాగోత్సేధా షడాయతా ।
స్యాద్భాగికమథచ్ఛాద్యం మంజర్యాయాతువిస్తృతిః॥ 16
దశధాప్రవిభజ్యాసా శేషం శ్రీవత్సవచ్చ వేత్।
స్కంధః షడ్భాగవిస్తారో గ్రీవాభాగార్ధముచ్ఛ్రితా॥ 17
అండకంభాగికంకార్యం కుముదం చార్ధభాగికమ్।
సార్ధభాగేనకలశో బీజపూరక సంయుతః॥ 18
ద్వితీయకర్ణ శృంగస్య స్యాదూర్ధ్వం మూలమంజరీ।
సప్తభాగేనవిస్తారా అష్టభాగ సముచ్ఛ్రితా॥ 19

శ్రీవత్సవ ద్విభాగోఽస్యాః స్కంధగ్రీవాదికే భవేత్ ।
ఏవంశ్రీకూటసంజ్ఞోఽయం ప్రాసాదః పరికీర్తితః॥ 20
యంకృత్వాత్రిసహస్రాణి దివ్యానిది విమోదతే॥

తా॥ చతురస్ర ప్రదేశమును 12 భాగములుచేసి అందు భద్రము 6 భాగములును, కర్ణములు 2 భాగముల చొప్పునను, తిలకమును 1 భాగమును దానియొక్క నిర్గమము 1 భాగమును, దానికంటె 1 భాగము నిర్గమముతో భద్రమును రచించవలెను. 20 హస్తములు జ్యేష్ఠము 15 హస్తములు మధ్యమము 10 హస్తములు కనీసము ఇట్లు ప్రమాణము చెప్పబడి యున్నది. వెలుపలిగోడ 1 భాగమును, అంధకారిక 2 భాగములును, గర్భమునందలి గోడ 1 భాగమును, గర్భము 4 భాగములును చేయవలెను ఎత్తును చెప్పుచున్నాడు. విస్తారములో సగము జంఘయును, మేఖల 1 భాగము, శృంగము 3 భాగములు, రెండవ అంతస్తునకూడ అటులే చేయవలెను. మొదటి శృంగము యొక్క నడుమ దానినుంచవలెను. తిలకము $1\frac{1}{2}$ భాగము యెత్తు చేయవలెను. రెండవ తిలకముపైన చక్కగా రూపసంపదతోను విస్తారము 6 భాగములును, ఎత్తు 7 భాగములును ఉండునట్లు ఉరోమంజరిని రచించవలెను. కప్పు 1 భాగము చేయవలెను. మరల విస్తారమును 10 భాగములు చేసి మిగిలినన్నియును శ్రీవత్సమునందు జేసినట్లే చేయవలెను. స్కంధము యొక్క విస్తారము 6 భాగములును, గ్రీవ యెత్తు $\frac{1}{2}$ భాగమును, అండకము1 భాగమును, కుముదము $\frac{1}{2}$ భాగమును కలశము $1\frac{1}{2}$ భాగమును, బీజపూరకముతో కూడ రచించవలెను. రెండవ కర్ణశృంగము యొక్క పైభాగమునుండి మూలమంజరిని రచించవలెను. విస్తారము 7 భాగములును, ఎత్తు 8 భాగములును కలిగి యుండవలెను. అన్ని కొలతలను శ్రీవత్సమున చేసినట్లే చేయవలెను. స్కంధము గ్రీవ మొదలైనవి శ్రీవత్సమువలెనే చేయవలెను. దీనిని శ్రీవత్సమందురు. దీని వలన 3 వేల దివ్యవర్షములు స్వర్గప్రాప్తి కలుగును.

## 71. శ్రీకూట ప్రాసాదము

సమరాంగణ 60వ అధ్యాయము :

శ్లో॥ అథలక్ష్మంతు శ్రీకూట ప్రాసాదస్యాభి ధీయతే॥ 21
తుల్యం ప్రసాదమానేన విదధ్యాదిహమండపమ్।
ముఖాయామేనతిర్యక్తు చతురశ్రం ప్రకల్పయేత్॥ 22
షడ్భాగం భద్రవిస్తారః కర్ణాశ్చతిలకస్తథా।
మధ్యేచతుష్కికాకార్యా భద్రవిస్తారసమ్మితా॥ 23 ని.... ... ....
విధాతవ్యస్తుమండపే।
జంఘాప్రాసాద జంఘాయాః సమోత్సేధా విధీయతే॥ 24
మేఖలాభాగికాకార్యా వేదీఘంటాచ పూర్వవత్।
స్తంభత్ర్యం సోచ్ఛ్రితం భాగం వేదీఘంటాత్రిభాగికా॥ 25
క్రమాశ్రయోయవాః పంచ సింహకర్ణ... ... .. ।
శోభితాః సింహకర్ణైశ్చ నృచ్ఛాద్యాంగాతి భూషితాః॥ 26
మండపంకారయేదేవం శ్రీకూటస్య విచక్షణః॥

తా॥ శ్రీకూట ప్రాసాదలక్షణమును చెప్పుచున్నాడు. ప్రాసాదముతో సమానముగా మండపమును రచించవలెను. అనగా ముఖము యొక్క పొడవుతో సమానముగా వెడల్పును చేసి నలుచదరముగా రచించవలెను. భద్రము 6 భాగములును, కర్ణములును తిలకములను భద్రము యొక్క విస్తారముతో సమానముగా 4 రచించవలెను. నిర్గమము పూర్వోక్త ప్రకారము మండపమునకు గూడ నుంచవలెను. ప్రాసాదముయొక్క జంఘతో సమానముగా మండపము యొక్క జంఘను రచించవలెను, మేఖల 1 భాగమును, వేదికయును ఘంటయును మునుపటివలెనే చేయవలెను. స్తంభములో 3వ వంతు వేదికను చేయవలెను. ఘంట 3 భాగములుచేయ వలెను.

## 72. శ్రీముఖ, శ్రీధర, వరద ప్రాసాదములు

సమరాంగణ 60వ అధ్యాయము :

శ్లో॥ అలిందేతు యదాస్యైవ క్రియతే భద్రవేదికా॥ 27
ప్రాసాదః శ్రీముఖోనామ తదాసింస్యాత్సుఖావహః॥
యదాకర్ణరమస్యైవ। చతురశ్రమధోభవేత్॥ 28

తదాస్యాచ్ఛ్రీధరోనామ ప్రాసాదోదేవతాశ్రయః।
అస్యైవతు యదాలిందః క్రియతే భద్రవర్జితా॥ 29
భవేత్తదానీం వరదః ప్రాసాదః శుభదాయకః॥

తా॥ పైజెప్పిన శ్రీకూట ప్రాసాదమునకు అలిందమునందు భద్రవేదికను రచించినచో శ్రీముఖ ప్రాసాదమగును. దానినే నలుచదరముగా జేసి పైన తలను కల్పించినచో శ్రీధర ప్రాసాదమగును. పైచెప్పిన దానికే భద్రము లేకుండ అలిందమును రచించినయెడల వరద ప్రాసాదమగును.

## 73. ప్రియదర్శన-కులనందన ప్రాసాదములు

సమరాంగణ 60వ అధ్యాయము :-

శ్లో॥ విధీయతే యదాస్యైవ భద్రమేకం వినిర్గతమ్॥ 30
నిర్వ్యూహశ్చతదాసస్యాత్ ప్రాసాదః ప్రియదర్శనః।
విధీయతే యదాస్యైవ। నంద్యావర్తో వినిర్గమః॥ 31
కులనందస్తదాజ్ఞేయః ప్రాసాదః సుఖకారకః॥

తా॥ పై చెప్పిన శ్రీకూట ప్రాసాదమునకు భద్రము నిర్గమముతో రచించినయెడల ప్రియదర్శనమగును. దానినే నిర్గమము లేకుండ రచించి రేని నంద్యావర్తమగును. ఇవి శ్రీకూటమునందలి 6 భేదములు.

## 74. అంతరిక్ష ప్రాసాదము

సమరాంగణ 59వ అధ్యాయము :

శ్లో॥ అంతరిక్షమధభ్రూమః సస్యాద్ద్వాదశ భాగికః॥ 32
షడ్వింశత్యాకరైర్జ్యేష్ఠః కనీయాన్దశభిర్భవేత్।
మధ్యమో మధ్యమానేన హస్తసంఖ్యేయమీరితా॥ 33
పంచభాగాయతం భద్రం కర్ణాః కార్యాద్విభాగికాః
విస్తారస్తిలకానాంస్యాదంతరం భద్ర కర్ణయోః॥ 34
నిర్గమః సార్ధభాగః స్యాద్భద్రస్య తిలకస్యచ।
గర్భః షోడశభాగః స్యాద్ భాగికీభిత్తి విస్తృతిః॥ 35

ప్రదక్షిణాతుభాగౌద్వౌ బాహ్యాభిత్తిః పదం భవేత్।
కథితోఽయమథశ్ఛందో బ్రూమశ్ఛంద మథోర్ధ్వతః॥ 36
జంఘాషడ్భాగికోత్సేధా భాగోత్సేధాచమేఖలా।
వేదీభాగత్రయోత్సేధే శిఖరంప్రథమం తథా॥ 37
ద్వితీయం తత్సమంచోర్ధ్వం తిలకస్యోపరిస్థితమ్
అథస్తా.... ....। ఛాద్యంతుభాగికమ్॥ 38
శిఖరం గర్భవిస్తారం కర్తవ్యం షట్పదోచ్ఛ్రితమ్।
అర్ధేనగర్భవిస్తారాత్ స్కంధస్య విస్తృతి-స్తథా॥ 39
ద్వితీయశిఖరస్యోర్ధ్వం ప్రాగుక్తామూలమంజరీ।
ఇత్యేషకథితః సమ్యగంతరిక్షస్య లక్షణమ్॥ 40
అంతరిక్ష ప్రియాదేవాః సర్వేవైమానికాయతః॥

తా॥ అంతరిక్ష ప్రాసాదలక్షణమును చెప్పుచున్నాడు. 26 హస్తములు ఉత్తమము. 18 హస్తములు మధ్యమము 10 హస్తములు కనీసము. విస్తారమును 12 భాగములుచేసి భద్రము 5 భాగములును, కర్ణములు 2 భాగముల చొప్పునను, తిలకములు $1\frac{1}{2}$ భాగమును నిర్గమము భద్రముల కును తిలకములకును $1\frac{1}{2}$ భాగమును, చేయవలెను. గర్భము 4.4 భాగము లును గోడ1 భాగమును, అంధారిక 2 భాగములును, వెలుపలిగోడ 1 భాగ మును చేయవలెను. జంఘ 6 భాగములును, మేఖల, 1 భాగమును, వేది 3 భాగములును, మొదటి శిఖరము 3 భాగములును, రెండవ శిఖరము అదే ప్రకారము చేయవలెను. తిలకముపైన రెండవ శిఖరమును రచించవలెను, అడుగున.... .... .... ....ఛాద్యము 1 భాగమును, శిఖరము గర్భ ముతో సమానముగా విస్తారమును, ఎత్తు 6 భాగములును, గర్భవిస్తారములో సగము స్కంధము యొక్క విస్తారమును చేయవలెను. రెండవ శిఖరము పైన పూర్వము చెప్పబడినట్లు మూలమంజరిని రచించవలెను. అంత రిక్ష ప్రాసాదము యొక్క లక్షణమిట్లు చెప్పబడినది. ఇది దేవతలకు ప్రియమైనది.

## 75. పుష్పభాసము. విశాలకము, సంకీర్ణకము, మహానందము, నంద్యావర్తము.

సమరాంగణ 60వ అధ్యాయము :

శ్లో॥ భాగైరష్టభిరత్రైవజే క్రియతేఽలింద సంయుతః॥ 41
పుష్పభాసస్తదాజ్ఞేయః ప్రాసాదశ్చారుదర్శనః॥
అథాస్యక్రియతేభద్ర మలిందా.... .... ...॥ 42
విశాలకోనామతదా ప్రాసాదోజాయతేశుభః॥
అథాస్యక్రియతేభద్ర యుక్తస్యాలింద వర్జితః॥ 43
తదాసంకీర్ణకోనామ ప్రాసాదః పరికీర్తితః॥
యదాసంకీర్ణకస్యైవ నందికాసమభాగినీ॥ 44
క్రియతేనిర్గమేణైవ మహానందస్తదా భవేత్।
విస్తారేణసమశ్చస్యా న్నందికానిర్గమోయదా॥ 45
నంద్యావర్త ఇతిజ్ఞేయః ప్రాసాదః స తదాబుధైః॥

తా॥ విస్తారమును 8 భాగములు చేసి అలిందములతో రచించిన యెడల పుష్పభాసమగును. దానినే భద్రములు అలిందములు కలుగునట్లు రచించిరేని విశాలకమగును. పైజెప్పిన దానినే భద్రములు మాత్రమే రచించి అలిందములు లేకుండ చేసినచో సంకీర్ణకమగును. సంకీర్ణకమునకు సమానభాగములతోనందికలను నిర్గమములతో రచించిన యెడల మహానందమగును. మఱియు విస్తారముతో సమానముగా నందికలయొక్క నిర్గమమును చేసిన యెడల నంద్యావర్తమగును. ఇవి అంతరిక్షమునందలి 6 భేదములు.

## 76. సౌభాగ్య ప్రాసాదము

సమరాంగణ 60వ అధ్యాయము :

శ్లో॥ సౌభాగ్య మథవక్ష్యామః సస్యాద్ ద్వాదశభిః పదైః॥ 46
ఉత్తమోవింశతిర్హస్తా మధ్యమోదశ పంచచ ।
కనీయాన్ దశమానేన సౌభాగ్యోమానతస్త్రిధా॥ 47

గర్భశ్చతుర్భిర్భాగైః స్యాద్భద్రంతద్ విస్తృతేః సమమ్।
భద్రస్యార్ధేనతిలకాః కర్ణాః కార్యాద్విభాగికాః॥ 48
ద్వేద్వేపదేవిధాతవ్య స్తథైకైకస్య నిర్గమః।
భద్రాణాం నిర్గమం యద్వా విదధ్యాదేకభాగికమ్॥ 49
భాగికాగర్భభిత్తిస్తు ద్విపదాచ ప్రదక్షిణా।
భాగికీబాహ్యభిత్తిః స్యాజ్జంఘోచ్ఛ్రాయః పదానిషత్॥ 50
భాగికామేఖలాప్రోక్తా తన్మధ్యేశిఖరం భవేత్।
మల్లచ్ఛాద్యంచ మధ్యేస్యాచ్ఛృంగస్య శిఖరస్య చ॥ 51
ఏకభాగోచ్ఛ్రితంతచ్య మంజర్యాస్త్విహవిస్తృతిః।
గర్భభిత్తి సమాకార్యా సప్తభాగా సముచ్ఛ్రితిః॥ 52
ఊర్ధ్వంద్వితీయ శృంగస్య పూర్వవన్మూలమంజరీ।
అండకాద్యం యథోక్తంస్యాత్ సౌభాగ్యోఽయం ప్రకీర్తితః॥ 53

తా॥ సౌభాగ్య ప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. విస్తారమును 12 భాగములు చేయవలెను. 20 హస్తములు ఉత్తమము- 15 హస్తములు మధ్యమము, 10 హస్తములు కనీసము అని తెలియవలెను పై జెప్పిన 12 భాగములలో మధ్య గర్భము 4 భాగములు గోడ 1 భాగము, అంధకారిక 2 భాగములు, వెలుపలిగోడ 1 భాగము చేయవలెను భద్రము 4 భాగములు, తిలకములు 2 భాగముల చొప్పునను, కర్ణములు 2 భాగముల చొప్పునను రచించవలెను తిలకములకును కర్ణములకును నిర్గమము 2 భాగముల చొప్పునను, భద్రములకు నిర్గమము 1.1 భాగమును చేయవలెను. జంఘ యెత్తు 6 భాగములు, మేఖల 1 భాగము, దానిమధ్య శిఖరమును రచించవలెను. శృంగమునకు గాని శిఖరమునకు గాని మధ్య మల్లచ్ఛాద్యమును రచించవలెను. 1 భాగము యెత్తున మల్లచ్ఛాద్యముండవలెను. గర్భభిత్తితో సమానముగా అనగా 6 భాగముల విస్తారముతోను, ఎత్తు 7 భాగములతోను ఉరోమంజరిని రచించవలెను. రెండవ శృంగము యొక్క పై భాగమున మునుపటివలెనే మూలమంజరిని కల్పించవలెను. అండము మొదలైనవి పూర్వము చెప్పబడినట్లు చేయవలెను. దీనిని సౌభాగ్య ప్రాసాదమందురు

## 77. విభంగకము, విభవము, బీభత్సము, శ్రీతుంగము. మానతుంగము

సమరాంగణ 60వ అధ్యాయము :

శ్లో॥ విధీయతేయదాస్యైవ వినాభద్రమలిందకః ।
తదావిభంగకోనామ ప్రాసాదః స్యాత్సుశోభనః॥ 54
యదిభద్రస్య నిష్క్రాసః క్రియతేఽస్య తదాపునః।
ప్రాసాదోవిభవోనామ జాయతే పరమోత్తమః॥ 55
భాగద్వితయా నిష్క్రాంతా నందికాక్రియతే యది
తదావదంతి భీభత్స సంజ్ఞంప్రాసాద ముత్తమమ్॥ 56
యదానిర్గమ విస్తార సమాభవతి నందికా।
శ్రీతుంగ ఇతివిజ్ఞేయ స్తదాప్రాసాదసత్తమః॥ 57
యదాత్వవిందకోఽస్యైవ క్రియతేన వినిర్గతః।
ప్రాసాదో మానతుంగాఖ్య స్తదానీముపజాయతే॥ 58

తా॥ సౌభాగ్య ప్రాసాదమునకు భద్రములు లేకుండ అలిందములను రచించిరేని విభంగకమగును. మఱియు భద్రములకు నిర్గమములను కల్పించినచో విభవమగును. నందికలకు 2 భాగముల చొప్పున నిర్గమమును కల్పించిన యెడల బీభత్సమగును నందికలయొక్క విస్తారమును నిర్గమమును సమానముగా నుండెనేని శ్రీతుంగమగును. అలిందములకు నిర్గమము లేకుండ రచించినచో మానతుంగమగును. ఇవి సౌభాగ్య ప్రసాదము నందలి 6 భేదములు-

## 78. సర్వతోభద్ర ప్రాసాదము

సమరాంగణ 60వ అధ్యాయము :

శ్లో॥ బ్రూమోఽథ సర్వతోభద్రం దశధాతం విభాజయేత్।
షడ్వింశత్యా భవేజ్జ్యేష్ఠః కనీయాన్ దశభిః కరైః 59
హస్తైస్తథాష్టదశభిర్మధ్యమః పరికీర్తితః।
కర్ణాద్విభాగికాః కార్యా అలిందా షట్ప్రదోన్మితాః॥ 60

చతుర్భాగాని భద్రాణి ద్విభాగస్త ద్వినిర్గమః।
గర్భభిత్తిర్బహిర్భిత్తి రంధా రీచపదంపదమ్॥ 61
గర్భస్తుషోడశేపద ఇత్యేవంఛం దహారితః।
విస్తారార్ధేన జంఘాస్యాన్మేఖలాచైక భాగికా॥ 62
ప్రథమం కల్పయేచ్ఛృంగం విస్తారాత్ సార్ధముచ్ఛ్రితమ్:
ద్వితీయ శృంగం తత్త్రాల్యం పూర్వశృంగస్తమధ్యగమ్॥ 63
సప్తోచ్ఛ్రితాషడాయామా ఉరః శిఖరమిష్యతే।
కర్తవ్యం మూలశిఖరం తద్ద్వయోపరి శృంగయోః॥ 64
మంజర్యా విభజేద్భాగం విస్తారం దశధాబుధః।
స్కంధః షడ్భాగ విస్తారో ధనుర్గ్రీవాండ కాదికమ్॥ 65
శ్రీవత్సస్యైవ తత్కార్యం మంజరీభాగ మానతః।
క్రమార్ధంవా పంచసింహా।.... ....రూసైర్విభూషితా॥ 66
ఇత్యుక్తః సర్వతోభద్రః సర్వకల్యాణ కారకః॥

తా॥ సర్వతోభద్ర ప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. విస్తారమును 10 భాగములు చేసి కర్ణములు 2 భాగముల చొప్పునను, అలిందములు 6 భాగములును చేయవలెను. 26 హస్తములు ఉత్తమము. 18 హస్తములు మధ్యమము 10 హస్తములు కనీసము అని తెలియవలెను. భద్రము 4 భాగములును, నిర్గమము 2 భాగములును, చేయవలెను. గర్భము 4 భాగములు, గోడ 1 భాగము, అంధారిక 1 భాగము, వెలుపలి గోడ 1 భాగము కలిగి యుండవలెను. విస్తారములో సగము యెత్తు జంఘయును, మేఖల 1 భాగము, మొదటి శృంగము విస్తారము నుండి 1½ భాగము యెత్తు రెండవ శృంగము దానికంటె తక్కువగను మొదటి శృంగము యొక్క నడుమనుండి ఉరః శృంగము విస్తారము 6 భాగములును ఎత్తు 7 భాగములును చేయవలెను. ప్రధాన శిఖరము ఆ రెండు శిఖరములపై రచించవలెను మంజరి యందు విస్తారము 10 భాగములు. స్కంధము విస్తారము 6 భాగములు, వేదిగ్రీత అండకము మొదలైనవి శ్రీవత్సవమువలెనే చేయవలెను. మంజరి యొక్క భాగముల ప్రకారము 5 సింహములు గాని రూపములుగాని రచించవలెను. దీనిని సర్వతోభద్ర మందురు.

# 79. బాహ్యోదరము, నిర్యూహోదరము, సమోదకము. నందిభద్రము, భద్రకోశము

సమరాంగణ 60వ అధ్యాయము :

శ్లో॥ అలిందశోభితం భద్రం యదాస్యైవ విధీయతే॥ 67
తదా బాహ్యోదరో నామ ప్రాసాద ప్రవరో భవేత్।
యద్యలిందోనభవతి భద్రమేకంతు నిర్గతమ్॥ 68
స్యాన్నిర్యూహోదరోనామ ప్రాసాద ప్రవరస్తదా।
యదానతత్రభద్రంస్యా న్నందికానిర్గమో భవేత్॥ 69
భద్రకోశం తదావిద్యాత్ షష్ఠంప్రాసాద ముత్తమమ్॥

తా॥ పై జెప్పిన దానినే అలిందములు భద్రములు రచించపడెనేని బాహ్యోదర మందురు. అలిందములు లేకుండ భద్రములను మాత్రమే రచించిన యెడల నిర్యూహోదర మగును. సమోదరమునకును నందిభద్రమునకును లక్షణశ్లోకములుచ్యుతమైనవి. భద్రములు లేకుండ నందికలు నిర్గమములతో రచింపబడెనేని భద్రకోశమగును. ఇవి సర్వతో భద్రము నందలి 6 భేదములు.

# 80. చిత్రకూట ప్రాసాదము

సమరాంగణ 60వ అధ్యాయము :

శ్లో॥ చిత్రకూట మథబ్రూమ స్తంభజేదష్టభిః పదైః॥ 70
కుర్యాత్క్రరేభ్యోఽష్టాభ్యాస్తం యావత్స్యాద్దస్త వింశతిః।
కర్ణాభాగిక విస్తారాః శేషంచాలింద విస్తృతిః॥ 71
భద్రంచతుష్పదం విద్యాద్ భాగేనైకేన నిర్గతమ్।
భాగేననిర్గతోఽలిందో భిత్త్యాంధార్యః పదంపదమ్॥ 72
ద్విపదోఽస్య భవేద్గర్భ స్తలచ్ఛందమితీరితమ్।
విస్తారార్ధం భవేజ్జంఘా భాగంతత్రైవ మేఖలా।
అండకం భాగికంకార్యం క్రమాచ్ఛక్రమ సంవృతా॥ 73

ఊర్ధ్వస్తు ద్వితీయ శృంగస్య కర్తవ్యా మూలమంజరీ।
సప్తభాగో దయా ప్రాగ్వత్ భాగషట్కాంత థాయతా॥ 84
ప్రాసాదమేదృశం కుర్యా చ్చిత్రకూటం ప్రమాణతః

తా॥ చిత్రకూట ప్రాసాద లక్షణమును చెప్పుచున్నాడు. 20 హస్తములుత్తమము. 14 హస్తములు మధ్యమము, 8 హస్తములు కనీసము. విస్తారమును 8 భాగములు చేసి కర్ణములు 1 భాగము చొప్పునను, మిగిలిన 6 భాగములు అలిందములును, భద్రములు 4 భాగములును, వాని నిర్గమము 1 భాగమును, అలింద నిర్గమము 1 భాగమును, చేయవలెను. గర్భము 2 భాగములును, గోడ 1 భాగమును, అంధారిక 1 భాగమును. వెలుపలిగోడ 1 భాగమును చేయవలెను. విస్తారములో సగము జంఘ యెత్తును అందు మేఖల 1 భాగమును, అండకము 1 భాగమును, ఇట్లు వరుసగా రచించవలెను రెండవ శృంగము యొక్క పైభాగము నుండి మూలమంజరి విస్తారము 6 భాగములు. ఎత్తు 7 భాగములు చేయవలెను. దీని చిత్రకూటమందురు.

## 81. విమలము, హర్షణము, చిత్ర సంకీర్ణము, భద్రవిశాలము, భద్ర విష్కంభము

సమరాంగణ 60వ అధ్యాయము :-

శ్లో॥ భద్రాలింద వినిష్క్రాంతం తస్యైవతు యదాభవేత్॥ 75
ప్రాసాదో విమలోనామ తదానీముపజాయతే।
అలిందస్తు యదాస్యైవ భద్రహీనో విధీయతే॥ 76
తదానీంహర్షణోనామ ప్రాసాదః సవిజాయతే,
క్రియతేతు యదాస్యైవ కర్ణరంభాగ నిర్గమమ్॥ 77
తదానీం భద్రసంకీర్ణః ప్రాసాదోజాయతే శుభః।
అస్యైవతు యదాభద్రం భాగేనైకేన నిర్గతమ్॥ 78
భవేత్తదానీం ప్రాసాదో నామ్నాభద్ర విశాలకః।
అలిందం భద్రయోశ్చవినా యదాత్వేష విధీయతే॥ 79
తదానీం భద్రనిష్కంభః ప్రాసాదః స్యాత్ సుఖప్రదః॥

తా॥ పై జెప్పబడిన దానికి భద్రములును అలిందములును రచించినచో విమలమగును. భద్రములు లేకుండ అలిందములను కల్పించిన యెడల హర్షణమగును. తల 1 భాగము నిర్గమముతో రచించిరేని భద్ర సంకీర్ణ మగును. మఱియు దానికే భద్రము 1 భాగము నిర్గమముతో రచించిన యెడల భద్ర విశాలమగును. అలిందము లేకుండ భద్రమును మాత్రమే రచించినచో భద్రవిష్కంభ మగును. ఇవి చిత్రకూటమునందలి 6 భేదములు.

## 82. ఉజ్జయంత ప్రాసాదము

సమరాంగణ 60వ అధ్యాయము :

శ్లో॥ చతురశ్రీ సమేక్షేత్రే విభక్తేఽష్టభిరష్టకైః 80
ప్రాసాదం రచయేద్విద్వాన్ ఉజ్జయంతం సుశోభనమ్।
పదమేకం భవేత్కర్ణ స్తిలకం తావదేవచ॥ 81
సభిత్తిగర్భమానేన భద్రం కుర్యాద్విచక్షణః।
బాహ్యభిత్తి భవేద్భాగం భాగమేకం ప్రదక్షిణా॥ 82
భాగికాగర్భభిత్తిశ్చ గర్భం మధ్యే చతుష్పదమ్।
పంచభాగోన్నితా జంఘా భాగంతత్త్రైవ మేఖలా॥ 83
కర్తవ్యం భాగికం శృంగ మండకంచార్ధ భాగికమ్।
ద్వితీయం సాండకం శృంగం తత్సమం పదమధ్యగమ్॥ 84
మల్లచ్ఛాద్యం విధాతవ్య ముత్సేధేనార్ధ భాగికమ్।
పదోత్సేధంచ శిఖరం గర్భభిత్తి సమంభవేత్॥ 85
భాగికః కలశః కార్యో ధ్వజశృంగస్య తత్సమః।
ఏతస్యమూల శిఖరం కుర్యాత్ షడ్భాగ విస్తృతమ్॥ 86
భాగాధిక సముత్సేధం కార్యం కల్యాణ మిచ్ఛతా।
ఊర్ధ్వం తిలక శృంగస్య శిఖరం స్యాత్పదోచ్ఛ్రితమ్॥ 87
పంచాంశ విస్తృతం శేషం శ్రీవత్సస్యేవ కారయేత్।
ఇత్యేషకధితః శమ్య గుజ్జయంతోఽభిధానతః॥ 88
కార్యోఽయం సర్వదేవస్య ప్రాసాదః శుభలక్షణః॥

తా॥ చతురశ్ర ప్రదేశమును 8.8 భాగములు చేసి కర్ణము 1భాగము తిలకము 1 భాగము, భద్రము 4 భాగములు వెలుపలిగోడ 1 భాగము, అంధారిక 1 భాగము, లోపలిగోడ 1 భాగము, గర్భము 2 భాగములు చేయవలెను. జంఘ 5 భాగములు, అందులో మేఖల 1 భాగము, శృంగము 1 భాగము, అండకము ¾ భాగము చేయవలెను. రెండవ శృంగము అండకముతో గూడస్థాన మధ్యమమున అదే కొలతతో రచించవలెను. మల్లచ్ఛాద్యము ½ భాగము చేయవలెను. శిఖరము 1 భాగము చేయవలెను. విస్తారము 4 భాగములు కలిగి యుండవలెను. కలశము యెత్తు 1 భాగము' ధ్వజముయొక్క శృంగము దానితో సమానముగా నుండవలెను. ప్రధాన శిఖరము యొక్క విస్తారము 6 భాగములు ఎత్తు 7 భాగములును చేయవలెను. తిలకము యొక్క శృంగముపైన 1 భాగము యెత్తున శిఖరమును రచించవలెను. ఆ శిఖరముయొక్క విస్తారము 5 భాగము లుండవలెను. మిగిలిన పనులన్నియును శ్రీవత్స ప్రాసాదమున రచించినట్లే రచించవలెను దీనిని ఉజ్జయంత ప్రాసాదమందురు.

## 83. మేరువు, మందరము, కైలాసము, కుంభము, గృహరాజము

సమరాంగణ 60వ అధ్యాయము :

శ్లో॥ చిత్రకూటాద్యధోత్పన్నాః ప్రాసాదా విమలాదయః॥ 89
ఉజ్జయంతాత్తథాపంచ మేరుప్రభృతయో మతాః।
మేరుశ్చ మందరశ్చైవ కైలాసః కుంభ ఏవచ॥ 90
గృహరాజ ఇతిప్రోక్తాః ప్రాసాదాస్తే సులక్షణాః।
అష్టోత్తర మిహోద్దిష్టం ప్రాసాదానాంశతం బుధైః 91
జ్యేష్ఠ మధ్య కనిష్ఠానాం సాంధారాణాం తథైవచ।
తేష్వాలిందైర్యుతాకేచిత్ భద్రైః కేచిచ్చ వేష్టితాః॥ 92
కేచిత్కర్ణసమాః కార్యాః ప్రాసాదాః సర్వశోభనాః।
సర్వేఽప్యేతే విధాతవ్యా నిజభాగ ప్రతిష్ఠితాః॥ 93

కోణానవిషమాః కార్యా వర్గభేదశ్చనేష్యతే।
ఏకహస్తా ద్విహస్తాచ త్రిహస్తా యే ప్రకీర్తితాః॥ 94
యక్ష నాగగ్రహాదీనాం రక్షసాంచ భవంతితే।
భాగేన.... .. ....। సత్సుత్రేధా వినిర్దిశేత్॥ 95
జ్యేష్ఠం మధ్యం కనీయశ్చ జ్ఞేయం తచ్చాంశ మానతః।
జ్యేష్ఠం సార్ధత్రి హస్తంస్యాత్ త్రిహస్తం మధ్యమం విదుః॥ 96
సార్ధహ స్తద్వయమితం కనీయస్త ద్విధీయతే।
త్రిహస్తం జ్యేష్ఠమపరం మధ్యం హస్తసమన్వితమ్॥ 97
అర్ధహస్తం కనీయశ్చ మానం భాగస్య కీర్తితమ్।
జ్యేష్ఠోభాగో ద్విహస్తః స్యాత్ పాదోనం మధ్యమః కరమ్॥ 98
కనీయాన్ మధ్య మార్ధేన భాగమానమిదం కరైః॥
షడన్వితాస్త్రింశదమీ విచిత్రాః శ్రీకూటకాద్యాః కథితాయథావత్
ప్రాసాదముఖ్యా ఇహషట్ ప్రభేదా భిన్నాశ్చ కేచిత్
సహమండపైశ్చ॥ 99½

ఇతి సమరాంగణ సూత్రధారా పరనామ్ని వాస్తుశాస్త్రే॥ శ్రీకూటాది
షట్ప్రపలశత్ప్రాసాద లక్షణం నామషష్ఠితమోఽధ్యాయః

తా॥ చిత్రకూటమునందు విమలము మొదలైన 5 ప్రాసాదము లుత్పన్నమైనట్లే ఉజ్జయంతము నందును మేరువు మొదలైన 5 ప్రాసాద ములు కలిగినవి. మొత్తము 108 ప్రాసాదములు పూర్వము చెప్పబడినవి. ఉత్తమము. మధ్యమము, కనీసము అను కొలతల ప్రకారమును సాంధార ములుగను, అందు కొన్ని అలిందములతోను కొన్ని భద్రములతోను, కొన్ని కర్ణములతో సమానముగను, రచించవలెను. అన్నియును వానివాని భాగ ముల ప్రకారము రచించవలెను. కోణములను సమసంఖ్యగా రచించ వలెను. వర్గభేదము చేయరాదు, 1 2 3 హస్తములు కలవి యక్షులు, నాగులు, గ్రహములు, రక్షోగణము మొదలగువాని కుపయోగించును. ఉత్తమ, మధ్యమ, కనీసములు చెప్పబడియున్నవి. అవి వరుసగా మొద టిది 3 ½- 3.2½ హస్తములని తెలియవలెను. రెండవ పద్ధతి 3.1½ హస్తము

లును, మూడవ పద్ధతి $2\frac{3}{4}$- 3/8 హస్తములును అని తెలియవలెను. ఈ అధ్యాయమున జెప్పబడినవి 36 ప్రాసాదములని తెలియవలెను.

## 84. ద్రావిడ సాంధారములు- 5 భేదములు

## పద్మతలచ్ఛందము

సమరాంగణ 61వ అధ్యాయము :

శ్లో॥ ప్రాసాదానథ వక్ష్యామ స్తలచ్ఛందాదనంతరమ్।
తత్రపద్మో మహాపద్మో వర్ధమానస్త థాపరః॥ 32
స్వస్తికః సర్వతోభద్రః ప్రాసాదాః పంచకీర్తితాః।
చతురశ్రీ కృతేక్షేత్రే కర్ణసూత్రం ప్రసాదయేత్॥ 33
కర్ణస్యార్ధం తతః కృత్వా గర్భార్ధాత్తు బహిర్న్యయేత్।
తదగ్రయోః సూత్రపాతాత్ స్యాదన్య చతురశ్రకమ్॥ 34
కూటంకుర్యాద్ ద్విభాగేన సమసూత్రాద్ విచక్షణః।
సూకరానన సంస్థానం కుర్వీత సలిలాంతరమ్॥ 35
ఏవం సర్వేషు కూటేషు సలిలాంతర మిష్యతే।
యదాయుతం భవేత్సూత్ర చతురాగ్ర విభాజితే॥ 36
గర్భోద్విభాగికస్తేన భాగికాభిత్తిరుచ్యతే।
గర్భకర్ణార్ధమాదాయ కోణాంతం లాంఛయేత్ పునః॥ 37
అష్టసూత్రస్య మధ్యేస్యా దేవం ... ...బహిః।
ఏవం పద్మతలచ్ఛందో విధాతవ్యో విచక్షణైః 38

తా॥ ద్రావిడ ప్రాసాదములలో సాంధారములుగను నిరంధారములుగను చేయదగిన 5 ప్రాసాదములకు తలచ్ఛందములను జెప్పుచున్నాడు. అందు మొదటిది పద్మతలచ్ఛందము చతురశ్ర ప్రదేశమున కర్ణసూత్రమునుపట్టి అందులోసగము చేసి గర్భమునుండి వెలుపలకు చేయవలెను. ఆ చివరల యందు సూత్రముచేత మఱియొక చతురశ్రమును చేయవలెను. కూటము 2 భాగములు సమానసూత్రముతో రచించవలెను, జలమార్గమును పంది ముట్టెవలెరచించవలెను. అన్ని కూటములకు జలమార్గమటులె చేయు

వలెను. సూత్రముయొక్క పొడవును 4 భాగములు చేసి గర్భము 2 భాగములును చుట్టూగోడ 1 భాగమును చేయవలెను. గర్భమును కర్ణములో సగమును తీసికొని కోణముయొక్క చివరకు గుర్తుచేయవలెను. మరల 8సూత్రముల యొక్క మధ్యను... గర్భము వెలుపల ...ఇట్లు పద్మప్రాసాదమునకు తలచ్ఛందమును చేయవలెను. ఎత్తు ఒక అంతస్తుగల మొదలుకొని అన్నిటికిని పూర్వము చెప్పబడియున్నవి. సాంధారపద్ధతి ముందు చెప్పబోవు చున్నాము.

## 85. మహాపద్మ తలచ్ఛందము

**సమరాంగణ 61వ అధ్యాయము :**

శ్లో॥ మహాపద్మతలచ్ఛంద మధునాసంప్రచక్ష్మహే।
పూర్వోం యఃకీర్తితచ్ఛందః సంపాతా సూత్రయోః కృతాః॥ 39
తేషుసంపాతయేత్సూత్రం చతుర్దిగ్విదిగంతరే।
కర్ణార్ధందాపయేత్తత్ర బాహ్యాభాగ వినిర్గతమ్॥ 40
ఐంద్ర్యాగ్నేయ్యో దిశోర్మధ్యే లాంఛనంయద్ వ్యవస్థితమ్।
నైరృతీయామ్యయోర్మధ్యే తస్మాత్తత్ర ప్రసారయేత్॥ 41
నైరృతీయామ్యయోర్మధ్యాత్ వాయ్వంబు పదిగంతరే।
వాయ్వంబు పదిశోర్మధ్యా దీశసోమదిగంతరే॥ 42
తృతీయాం.... .... ...। కూటస్య జలాంతరమ్
కూటయోరుభయోర్మధ్యే సూకరావన సన్నిభమ్॥ 43
మహాపద్మ తలచ్ఛందః ప్రోక్తోఽయం రాజపూజితః॥

తా॥ మహాపద్మ ప్రాసాదము యొక్క తలచ్ఛందమును చెప్పుచున్నాడు. అష్టసూత్రములనుపట్టి కర్ణములో సగమును కొలిచి అంతవరకు వెలుపలికి నిర్గమమును చేయవలెను. తూర్పు అగ్నేయముల యొక్క మధ్యను, గుర్తుపెట్టవలెను. అటులే నైఋతి దక్షిణముల మధ్యను గుర్తుపెట్టవలెను. పడమర వాయవ్యముల నడుమ గుర్తుపెట్టవలెను. ఉత్తరము ఈశాన్యముల మధ్యను గుర్తుపెట్టవలెను. ఇదే ప్రకారము శేషించిన గుర్తులను గూడ పెట్టవలెను. జలమార్గములన్నియును పందిముట్టెలవలె నుండవలెను. ఇది మహాపద్మము యొక్క తలచ్ఛందము.

## 86. వర్ధమాన తలచ్ఛందము

సమరాంగణ 61వ అధ్యాయము :

శ్లో॥ ఇదానీం వర్ధమానస్య తలచ్ఛందోఽభిధీయతే॥ 44
చతురశ్రం భజేత్పంచ దశధా క్షేత్రమాదితః।
కూటంద్విభాగికం కుర్యాద్భాగికం సలిలాంతరమ్॥ 45
పంజరం సార్ధభాగం స్యాద్భాగికం సలిలాంతరమ్।
చతుర్భాగా భవేచ్ఛాలా విదధ్యాత్ పంజిరే మః॥ 46
అర్ధభాగం ప్రవేశస్తు శాలాసత్వ జలాధ్వనః।
అష్టాంగుల వినిష్క్రాంతే బాహ్యతః శుభదర్శనే॥ 47
భాగపాదం ప్రవేశః స్యాత్ పంజరాంతర్జలాధ్వనః।
అర్ధభాగం ప్రవేశస్తు కూటస్యాంతర్జలాధ్వనః 48
జలాంతరం తృతీయంచ కర్తవ్యం భాగసమ్మితమ్।
అనంతరం ప్రకుర్వీత పంజరం సార్ధభాగికమ్॥ 49
(ఇచట కొంత గ్రంధి పాదముగ గన్పట్టైతిని)

తా॥ వర్ధమానము యొక్క తలచ్ఛందమును చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రవేశమును 15 భాగములుచేసి కూటము 2 భాగములు, జలమార్గము 1 భాగము, పంజరము $1\frac{1}{2}$ భాగము, మరల జలమార్గము 1 భాగము. మధ్యశాల 4 భాగములు, శాలయందు జలమార్గము $\frac{1}{2}$ భాగము ప్రవేశమును 8 అంగుళముల నిర్గమమును, పంజరమున జలమార్గము 1/4 భాగము ప్రవేశమును చేయవలెను. కూటమునందు జలమార్గము 1 భాగము ప్రవేశము 1 భాగము చేయవలెను. అటుతర్వాత పంజరము $1\frac{1}{2}$ భాగము చేయవలెను.

## 87. స్వస్తిక తలచ్ఛందము

సమరాంగణ 61వ అధ్యాయము ।

శ్లో॥ స్వస్తికస్య తలచ్ఛందో యథావదభిధీయతే।
చతురశ్రం సమం క్షేత్రమష్టా వింశతిధా భజేత్॥ 50

కుర్యాత్ కూటం చతుర్భాగం ద్విభాగం సలిలాంతరమ్।
త్రిభాగం పంజరం తద్వద్ ద్విభాగం సలిలాంతరమ్॥ 51
శాలాంషడ్భాగికీం కుర్యా జ్జలమార్గం ద్విభాగికమ్।
త్రిభాగం పంజరం భూయశ్చంద్రశాలా విభూషితమ్॥ 52
పునర్ద్విభాగికం కుర్యాచ్చతుర్థం సలిలాంతరమ్।
విదధీత చతుర్భాగం రథకంచ సుశోభనమ్॥ 53
ఏవందిక్షు సమస్తాసు సమైర్భాగైః ప్రకల్పయేత్।
చతుర్భాగేతతః క్షేత్రే గర్భం కుర్యాద్ ద్విభాగికమ్॥ 54
స్వస్తికే వర్ధమానేచ భాగికోభిత్తయః స్మృతాః।
స్వస్తికోఽయం తలచ్ఛందః కథితోఽతి మనోహరః। 55

తా॥ స్వస్తికము యొక్క తలచ్ఛందమును చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశమును 28 భాగములు చేసి కర్ణము 4 భాగములు, జలమార్గము 2 భాగములు, పంజరము 3 భాగములు మరల జలమార్గము 2 భాగములు, మధ్యశాల 6 భాగములు శాలవెంబడి జలమార్గము 2 భాగములు దానిప్రక్క పంజరము 3 భాగములు, పంజరములు చంద్రశాలలతో నలంకరింపబడ వలెను. మరల జలమార్గము 2 భాగములు, తదుపరి రథము 4 భాగములు, ఇట్లు నలువైపుల సమాన భాగములతో రచించవలెను. విస్తారమును 4 భాగములు చేసి గర్భము 2 భాగములును చుట్టూ గోడ 1 భాగమును చేయవలెను.

## 88. సర్వతోభద్ర తలచ్ఛందము

సమరాంగణ 61వ అధ్యాయము :

శ్లో॥ ఇదానీం సర్వతోభద్ర తలచ్ఛందోఽభిధీయతే।
చతురశ్రీ కృతేక్షేత్రే గర్భంకుర్యాద్ ద్విభాగికమ్॥ 56
కుర్యాత్ త్రిభాగికం కూటం జలమార్గం ద్విభాగికమ్।
త్రిభాగికం తతః కూటం తోయమార్గం ద్విభాగికమ్॥ 57
శాలాష్టభాగికీ కుర్యాజ్జల వర్త్మద్విభాగికమ్।
భూయస్త్రిభాగికం కూటం ద్విభాగం సలిలాంతరమ్॥ 58

త్రిభాగికీచరథికా భవేద్దిక్షు చతుర్భుజ చతురశ్రీ
కృతం క్షేత్రం అష్టావింశతిధా భజేత్॥ 59
కుర్యాత్త్రిభాగికం కూటం చతుర్ధా ప్రవిభాజితే।
భాగిర్యోభిత్తయః కార్యా స్తథాగర్భో ద్విభాగికః॥ 60
ఇత్యేష సర్వతోభద్ర స్తలచ్ఛందో విధీయతే।
ఏతేప్రోక్తా నిరంధారాః సాంధారాంస్తు ప్రచక్ష్మహే॥ 61
చతురశ్రీ కృతం క్షేత్రం భజేద్ద్వాదశభిః పదైః।
చతుర్భాగో భవేద్గర్భో భాగిక్యోభిత్తయః స్మృతాః॥ 62
భాగికాంధారికా తద్వద్ ద్విభాగా బాహ్యభిత్తయః॥
ఏవమేతే తలచ్ఛందాః పద్మాద్యాః పరికీర్తితాః॥ 63
పీఠాన్యుక్తాన్యేవ మేతాని పంచప్రాసాదానాం నామభిర్లక్షణైశ్చ
పంచప్రోక్తాయే తలచ్ఛందభేదా స్తైర్యాజ్ఞాతైః పూజ్యవామేతిలోకే॥ 64
ఇతి సమరాంగణ సూత్రధారా పరనామ్ని వాస్తుశాస్త్రే
పీఠపంచకార్యా యోనామైక షష్టితమః॥

తా॥ సర్వతోభద్రము యొక్క తలచ్ఛందమును చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశమును 4 భాగములు చేసి అందు గర్భము 2 భాగములు చుట్టూ గోడ 1 భాగము చేయవలెను, మఱియు ప్రస్తరముపైన 28 భాగములు చేసి కర్ణకూటము 3 భాగములు, జలమార్గము 2 భాగములు మరల రథము 3 భాగములు, జలమార్గము 2 భాగములు, మధ్యశాల 8 భాగములు, మరల జలమార్గము 2 భాగములు, రథము 3 భాగములు, మరల జలమార్గము 2 భాగములు. కర్ణకూటము 3 భాగములు. ఇట్లు నలువైపుల రచించవలెను. ఇవి నిరంధారములు. సాంధారములకు విస్తారమును 12 భాగములు చేసి గర్భము 4 భాగములు, గోడ 1 భాగము, అంధారిక 1 భాగము, వెలుపలిగోడ 2 భాగములు. ఇట్లు పద్మము మొదలు 5 ప్రాసాదములు రచించవలెను. ఇట్లు శాస్త్రోక్త ప్రకారము రచించిన శిల్పి లోకమున పూజింపబడును.

## 89. విమానజాతి మఱికొన్ని ప్రాసాదములు అందు విమానము

అపరా. 106

శ్లో॥ భూమిజచ్ఛందకాఖ్యాతా స్తలైశ్చ చతురశ్రకాః।
రథోపరథ భద్రాద్యైః విమానాః సర్వకామదాః॥

తా॥ చతురశ్రములును, రథములు, ఉపరథములు, భద్రములు, అంతస్తులు, కలవి విమానజాతి యగును.

అపరా 172వ సూత్రము- విశ్వకర్మోవాచ

శ్లో॥ విమానాంశ్చ ప్రవక్ష్యామి ప్రాసాదాన్ శిఖరోత్తమాన్।
నాగరచ్ఛంద ఆఖ్యాతో భూమిజః శిఖరోద్గమః॥ 1
విమానో గరుడో ధ్వజో విజయో గంధమాదనః।
హిమవాన్ హేమకూటశ్చ కైలాసస్త్రిపురోద్భవః॥ 2
శ్రియోహంసో హంసపక్ష ఉద్యోతోవజ్ర సంభవః।
పురాఖ్యః సుందరశ్చైత్యో విశాలో భద్ర సంజ్ఞకః॥ 3
మందరః కూర్మ సౌమ్యోచ ఐరావతో మాలాధరః।
మేరుర్విమానాన్వయజాః ప్రాసాదాః పంచవింశతిః 4
నవధాభాజితే క్షేత్రే ద్విభాగః కర్ణవిస్తరః
పంచభాగం భవేద్భద్ర మేకభాగేన నిర్గతమ్॥ 5
భాగార్ధం క్షోభయేత్పార్శ్వే నిర్గమశ్చార్ధభాగికః।
చతుర్భాగంచ విస్తారే ముఖభద్రం విధీయతే। 6
కర్ణేశృంగం వారిమార్గై భూమిజానామనుక్రమైః।
ఘంటా కలశ సంయుక్తో విమానః పంచభూమికః। 7

తా॥ నాగర పద్ధతితో కొలతలను శిఖరములును కల విమాన జాతి ప్రాసాదములను చెప్పుచున్నాడు విమానము, గరుడము, ధ్వజము, విజయము, గంధమాదనము, హిమవంతము, హేమకూటము, కైలాసము, త్రిపురోద్భవము, శ్రియము, హంసము, హంసపక్షము, ఉద్యోతము, వజ్రసంభవము, పురాఖ్యము, సుందరము, చైత్యము, విశాలము, భద్రము, మందరము, కూర్మము, సౌమ్యము, ఐరావతము, మాలాధరము, మేరువు అను 25 భేదములు కలవు. అందు విమానమునకు విస్తారమును 9 భాగములు చేసి కర్ణము 2 భాగముల చొప్పునను, భద్రము 5 భాగములును

భద్రము యొక్క నిర్గమము 1 భాగము, ప్రక్కలను ½ భాగము క్షోభము చేయవలెను, నిర్గమము ½ భాగముండవలెను విస్తారములో 4వ భాగము ముఖభద్రమును రచించవలెను కర్ణమున శృంగమును జలమార్గమును కల్పించవలెను. ఘంట, కలశముతో 5 అంతస్తులుగా రచించవలెను. దీనిని విమాన ప్రాసాదమందురు.

## 90. గరుడ, ధ్వజ ప్రాసాదములు

అపరా. 172వ సూత్రము

శ్లో॥ ప్రాగ్గ్రీవాశ్చ చతుర్భద్రే గరుడః సర్వకామదః।
చతుర్ద్వారైర్ధ్వజో నామ సర్వదేవ సుఖావహః॥ 8

తా॥ పైజెప్పిన దానినే నాలుగు భద్రముల యందు ప్రాగ్గీవములు రచించినచో గరుడ ప్రాసాదమగును. లేక 4 ద్వారములును రచించిరేని ధ్వజ ప్రాసాదమగును.

## 91. విజయము, గంధమాదనము

అపరా. 172వ సూత్రము.

శ్లో॥ రుద్రాంశైర్వాజితే ఛందే భాగాస్యాత్పక్ష కర్ణికా।
విధేయం పూర్వవచ్ఛేషం విజయః సర్వకామదః॥ 9

కర్ణికాభిశ్చోర్ధ్వ శృంగం సభవేద్గంధమాదనః।
భక్తేద్వాదశధా ఛందే ప్రరథః సార్ధభాగతః॥ 10

తా॥ విస్తారమును 11 భాగములు చేసి భద్రమునకు రెండువైపుల 1-1 భాగము కర్ణికను రచించినట్లయిన విజయ ప్రాసాదమగును. మఱియు విస్తారమును 12 భాగములు చేసి భద్రమున ఇరువైపుల ప్రరథములను 1½ భాగము చొప్పునను కర్ణికలను పైన శృంగములను రచించిన యెడల గంధమాదనమగును.

## 92. హిమవంతము. హేమకూటము, కైలాసము, త్రిపురోద్భవము

అపరా. 172వ సూత్రము

శ్లో॥ కర్ణే ప్రతిరథైశ్చైవ శిఖరే పంచభూమికః।
అఖ్యాతోహిమవాన్ హేమకూటస్తు సమనిర్గమః 11
కర్ణత్యాగే భవేద్రేఖా కైలాసః పంచభూమికః।
భద్రకర్ణేచ కుముదః సభవేత్ త్రిపురోద్భవః॥ 12

తా॥ అయిదంతస్తులును కర్ణములును, ప్రతిరథములును మాత్రమే కలది హిమవంతము-కూటములు సమాన నిర్గమముతో రచించిరేని హేమకూటము. మఱియు కర్ణములను లేకుండ చేసి భద్రములను మాత్రమే కల్పించిన యెడల 5 అంతస్తులు కలది కైలాసమగును. భద్రముయొక్క కర్ణమునకు ముదమును రచించినచో త్రిపురోద్భవమగును.

## 93. శ్రియము, హంసము, హంసపక్షము, ఉద్యోతము

అపరా. 172వ సూ.

శ్లో॥ మత్తాలంబో ముఖభద్రే శ్రియో వైసర్వ కామదః।
శిఖరేవైలతా కార్యా హంసనామాస ఉచ్యతే॥ 13
ప్రాగ్గ్రీవాస్తస్య మధ్యేచ హంసపక్షిస్తు బ్రహ్మజః।
చతుర్ద్వార సమాయుక్త ఉద్యోత ఉదయోద్భవః॥ 14

తా॥ ముఖభద్రమున మత్తాలంబమును, రచించినచో శ్రీ ప్రాసాదమగును. శిఖరము నలతను కల్పించిన యెడల హంస ప్రాసాదమగును. లేక మధ్యను ప్రాగ్గ్రీవములను కల్పించినయెడల హంసపక్ష ప్రాసాదమగును. నాలుగు ద్వారములు నలువైపులనుండునట్లు రచించినచో ఉద్యోత ప్రాసాదమగును.

## 94. వజ్రసంభవము-పురాఖ్యము

అపరా. 172వ సూ.

శ్లో॥ సాంధారో మధ్య అఖ్యాతో భద్రే చంద్రావలోకనా।
వజ్రసంభవ అఖ్యాతః కర్తవ్యః సర్వశాంతిదః॥ 15

భక్తే ఛందేచ మన్వంశైః స్తంభకః సార్ధభాగతః।
హిమవత్పూర్వకం శేషం పురాఖ్యః సర్వకామదః॥

తా॥ సాంధారమును భద్రమున చంద్రావలోకనమును
వజ్రసంభవ ప్రాసాదమగును. విస్తారమును 14 భాగములు చే
ములను 1½ భాగము చొప్పున రచించి మిగిలిన పనులన్నియు
వంతమువలె చేసినచో పురాఖ్యమగును.

## 95. సుందరము. చైత్యము. విశాలము. భద్రం మందరము, కూర్మము, సౌమ్యము

అపరా. 172వ సూ.

శ్లో॥ సుందరః ప్రాగ్గ్రీవయుక్త శ్చైత్యోవారాట శృంగతః।
విశాలో హీన ప్రాగ్గ్రీవః సాంధారే భద్ర సంజ్ఞకః॥
ద్రావిడేపక్ష శృంగాణి మందరః సర్వకామదః।
లతాయుక్తస్తు కూర్మాఖ్యః సౌమ్యోమత్తావలంబకైః॥

తా॥ పైజెప్పిన దానికే ప్రాగ్గ్రీవములను రచించిరేని సుంద
వరాట పద్ధతితో శృంగములను రచించిన యెడల చైత్యమగును
ములు లేకుండ జేసినచో విశాలమగును. సాంధారముగ నిర్మించి
భద్రమగును. పక్షశృంగములు ద్రావిడ పద్ధతితో రచించిరేని
మగును భద్రములను రచించిన యెడల కూర్మమగును. మ
మును రచించిన యెడల సౌమ్యమగును.

## 96. ఐరావతము, మాలాధరము, మేరువు

అపరా. 172వ సూ.

శ్లో॥ ఐరావతశ్చ ప్రాగ్గ్రీవై శ్చతుర్వక్త్రైరాలాధరః।
సాంధారశ్ఛంద ఆఖ్యాతో భద్రే చంద్రావలోకనా॥
మేరుః ప్రాసాద ఆఖ్యాతః కర్తవ్యః సర్వదేవతే।
కర్తాశివపురంయాతి కౌబేరం పదమాప్నుయాత్॥

ఇతి సూత్ర సంతాన గుణకీర్తి ప్రకాశ ప్రోక్త శ్రీ భువన
దేవాచార్యోక్తా పరాజితపృచ్ఛాయాం విమాన ప్రాసాద
లక్షణాధికారో నామశ్చో సప్తత్యుత్తర శతతమం సూత్రమ్-

తా॥ పైజెప్పిన దానికి ప్రాగ్గ్రీవములున్నచో ఐరావతమగును- నలు వైపుల ద్వారములున్న యెడల మాలాధరమగును. సాంధారముగ రచించి భద్రమున చంద్రావలోకనమును రచించినయెడల మేరు ప్రాసాదమగును. ఇది సమస్త దేవతల కుపయోగించును. ఇట్లు రచించినవారు శివలోక మున కుబేర పదవి నందుదురు.

## 97. రుచకజాతిలోని సాంధారములు 25 భేదములు

విశ్వకర్మోవాచ

అపరా. 165వ సూ.

శ్లో॥ అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి ప్రాసాదానాంతు లక్షణమ్।
భక్త్యాఛంద్రై స్తథాకారై ర్నాగరా భూధరాదయః॥ 1
భూధరోభద్ర కశ్చైవ నందీశో నందివర్ధనః।
పుష్పకోమందరశ్చైవ గరుడో వృషభస్తథా॥ 2
ఐరావతో రాజహంసః సుభద్రః పృథివీజయః
ఇంద్రనీలో మహాపద్మో వైడూర్యః సింహ ఏవచ॥ 3
త్రివిష్టపస్తు విజ్ఞేయః కైలాసః పుణ్యవర్ధనః।
వర్ధమానో గిరికూటః హంసః సర్వాంగ సుందరః 4
శ్రీనివాసః శ్రియానందో మేరుః ప్రాసాదనాయకః।
పంచవింశతిరాఖ్యాతా జాతశుద్ధాశ్చ నాగరాః॥ 5
చతుర్భేదైస్తలోర్ధ్వేతు ప్రాసాదాః పంచవింశతిః ।
ఇమ పంచాష్టఘుస్త్రాత ప్రయుక్తావాస్తువేదిభిః॥ 6
భూధరే వర్ధమానేతు భద్రం వైచతురంశకమ్।
మందరేచ సుభద్రేచ త్రిభాగో భద్రవిస్తరః॥ 7

తా॥ నాగరపద్ధతితోను అదే కొలతలతోను జేయదగిన 25 ప్రాసాదములను వాని నామములను చెప్పుచున్నాడు. భూధరము, భద్రకము, నందీశము, నందివర్ధనము, పుష్పకము, మందరము, గరుడము, వృషభము, ఐరావతము, రాజహంసము, సుభద్రము, పృథివీజయము, ఇంద్రనీలము, మహాపద్మము, వైడూర్యము, సింహము, త్రివిష్టపము, కైలాసము, వర్ధమానము, గిరికూటము, హంసము, సర్వాంగసుందరము, శ్రీనివాసము, శ్రియానందము, మేరువు, అను నామములు కలవి తలచ్ఛందసులు నాలుగు భేదములతోను శుద్ధ నాగరపద్ధతితోను రచించవలెను. 5 5-8-7 ఇట్లు భేదము తెలియవలెను. భూధరము వర్ధమానము, ఈ రెండింటికిని భద్రము 4వ భాగమును మందరము సుభద్రము ఈ రెండింటికిని 3 వ భాగమును చేయవలెను.

శ్లో॥ కేశరీ పూర్వవజ్ఞేయః పంచాండక విభూషితః॥
మత్తాలంబయుతం భద్రం భూధరోనామనామతః॥ 8
భద్రశృంగే భద్రకంచ ద్వితీయేనందిశాలకః।
భద్రేత్యక్తంచ కర్ణోర్ధ్వే దద్యాత్స్యాన్నందివర్ధనః॥ 9
తథైవచ యదా శృంగం మత్తాలంబోఽగ్ర భద్రకే।
పుష్పకోనామ విజ్ఞేయః సర్వకామ ఫలప్రదః॥ 10
నవభక్తే తలచ్ఛందే నందికాభాగమేవచ ।
భద్రేకర్ణే ద్విద్విశృంగం నంద్యాం శృంగేతు మందరః॥ 11
భద్రే శృంగం తృతీయంచ గరుడో విష్ణుమందిరమ్।
భద్రే కర్ణేయదా శృంగం మత్తాలంబే వృషస్తథా॥ 12
తథైవ భద్రేచేశృంగం శుభఐరావతోమతః।
చతుర్థేభద్ర శృంగేతు బ్రహ్మోక్తో రాజహంసకః॥ 13

తా॥ పూర్వము కేశరి పద్ధతితో జెప్పినట్లును, 5 అండకములును భద్రము మత్తాలంబముగను రచించిరేని భూధరమగును. భద్రమున శృంగమును కల్పించినచో భద్రకమగును భద్రమున 2 శృంగములున్నచో నందిశాలకమగును. భద్రమున శృంగములు లేకుండ కర్ణములపై శృంగములను రచించిన యెడల నందివర్ధనమగును. ముందలిభద్రమున

శృంగమును మిగిలినది మత్తాలంబమును చేసిరేని పుష్పకమగును. విస్తార మును 9 భాగములు చేసి నందిక 1 భాగము, భద్రమునను కర్ణమునను 2.2 శృంగములను నందికయందు ఒక్క శృంగమును రచించిన యెడల మందరమగును. మరియు భద్రమున 3 శృంగములు కల్పించిరేని గరుడ మగును. భద్రమునను, కర్ణమునను శృంగములును మత్తాలంబమును రచించిరేని వృషభమగును. భద్రమున శృంగము మాత్రమే రచించిన యెడల ఐరావతమగును భద్రమున 4 శృంగములను రచించిరేని రాజ హంసకమగును.

శ్లో॥ విభక్త మేకాదశభి ర్నందికాయాం ద్విశృంగకమ్।
నందనశ్చతథాకర్ణే శ్రీవత్సస్తుతదూర్ధ్వతః॥ 14
నందికాయాం తతః శృంగం ద్వితీయే తిలకం భవేత్।
మత్తాలంబస్త్రి భద్రేషు సుభద్రోనామనామతః॥ 15
పృథ్వీజయోభద్ర శృంగే ఇంద్రనీలో ద్వితీయకే।
తృతీయకే మహాపద్మో వైడూర్యశ్చ చతుర్థకే॥ 16
త్యక్త్వంభద్రే నంది శృంగం సింహోవైసర్వకామదః
తస్యభద్రేయదా శృంగం తదానామ త్రివిష్టపః॥ 17
స్యాత్కర్ణేచ యదాశృంగం భవేత్పంచాండ కంతథా।
కైలాసోనామ విజ్ఞేయ ఈశ్వరస్య సదాప్రియః॥ 18
త్రయోదశ విభక్తేచ ద్విభాగః కర్ణవిస్తరః।
సార్ధభాగః ప్రతిరథో, భాగతస్త్వైవనందికా॥ 19
చతుర్భాగం భవేద్భద్రం ముఖభద్ర విభూషితమ్
చత్వారోమందారాః కర్ణే కేశరీ చతదూర్ధ్వతః॥ 20
పంచాండకం ప్రతిరథే నంద్యాంచ తిలకం తథా।
త్రిమత్తాలంబ ప్రభద్రం వర్ధమానః స ఉచ్యతే॥ 21

తా॥ విస్తారమును 11 భాగములుచేసి నందికయందు 2 శృంగము లును, కర్ణమున నందనమువలెను ఆపైన శ్రీవత్సమువలెను రెండవ నందిక యందు శృంగమును తిలకమును. భద్రములు మూడింటి యందును

మత్తాలంబమును, రచించినయెడల సుభద్రమగును. భద్రమున శృంగ
మును రచించిరేని పృథివీజయమగును. భద్రమున 2వ శృంగమును
రచించినచో ఇంద్రనీలమగును. భద్రమున 3 శృంగములుంచిన యెడల
మహాపద్మమగును. భద్రమున 4 శృంగములు రచించినట్లయిన వైడూర్య
మగును. భద్రమున శృంగములు లేకుండ చేసి నందికయందు శృంగము
లుంచిన యెడల సింహమగును. నందికయందే కాక భద్రముననుశృంగ
మును కల్పించినచో త్రివిష్టపమగును. కర్ణమున శృంగమును 5 అండక
ములును రచించిరేని కైలాసమగును. విస్తారమును 13 భాగములుచేసి
కర్ణము 2 భాగములు, ప్రతిరథము $1\frac{1}{2}$ భాగమును. నందికము 1 భాగ
మును, భద్రము 4 భాగములును భద్రమునకు ముఖభద్రములు నాలు
గును మందర పద్ధతిలో నుంచి కర్ణములును ఆపైనను కేశరి పద్ధతితో
రచించి 5 అండకములును, నందిక యందును ప్రతిరథమునందును
భద్రమును రచించి మత్తాలంబములు మూడును, ప్రభద్రమును రచించి
నచో వర్ధమానమగును.

శ్లో॥ గిరికూటో భద్రశృంగే ద్వితీయే హంస ఏవచ।
తృతీయేచ భవేచ్ఛృంగం నామ్నా సర్వాంగసుందరః॥ 22
చతుర్థ శృంగే కుర్వీత్తు శ్రీనివాసంత థోత్తమమ్।
త్యక్తభద్రం నందిశృంగం శ్రియానందస్తతో భవేత్॥ 23
చతుర్థే భద్ర శృంగేతు మేరుః స్యాద్భువనోత్తమః ।
ప్రాసాదానాం సమస్తానాం మేరురాజా విధీయతే॥ 24
సాంధారకా ఇమే కార్యాః సభ్రమాభ్రమవర్జితాః।
దశహస్తాద్యదాహీనం నకుర్యాద్భ్రమ సంయుతమ్॥ 25

ఇతి సూత్ర సందాన గుణకీర్తి ప్రకాశ ప్రోక్త శ్రీ భువనదేవాచా
ర్యోక్త పరాజిత పృచ్ఛాయాం భూధరాది ప్రాసాద లక్షణాధీకారో నామ
పంచషష్ట్యుత్తర శతతమం సూత్రమ్.

తా॥ భద్రమున 1-1 శృంగములను కల్పించిన యెడల గిరికూట
మగును. భద్రమున 2 శృంగములను రచించినచో హంసమగును. భద్ర

ముఖ 3 శృంగముల చొప్పున రచించిన యెడల సర్వాంగసుందరమగును. భద్రమున 4 శృంగములను కల్పించినయెడల శ్రీనివాసమగును. భద్రములు లేకుండ సందికములయందు శృంగములను రచించినచో శ్రియానందమగును, భద్రమున 4 శృంగములును కర్ణములయందును శృంగములను రచించినయెడల మేరు ప్రాసాదమగును. ఇవి యన్నియును సాంధారములు. నిరంధారములుగా రచించునప్పుడు 10 హస్తములకు తక్కువ విస్తారమును చేయవచ్చునుగాని సాంధారములకు పనికిరాదు.

శ్లో॥ తలచ్ఛంద విభక్తాశ్చ గర్భభిత్తి బ్రమంతికాః ।
బ్రభమణీ క్రమయోగేన సాంధారాః శిఖరైర్యుతాః॥

అని పూర్వము చెప్పబడి యున్నది.

## 98. ప్రశస్తలతినజాతి 25 భేదములు
## అందు సురతరు ప్రాసాదము

విశ్వకర్మోవాచ :

అపరాజిత 166వ సూత్రము

శ్లో॥ అథాతః సంప్రవక్ష్యామి ప్రాసాదానాంతు లక్షణం।
నామపాద ప్రమాణంచ సంస్థానోన్మాన లక్షణమ్॥ 2
సురతరుః శ్రియానందః సురానందస్తృతీయకః।
నందాఖ్యో నందనశ్చైవ హ్యమృతోద్భవ ఏవచ॥ 3
పృథ్వీజయశ్చ వైడూర్యో ముకుటోజ్జ్వల ఏవచ।
లక్ష్మీభూషణ నామాచ తథా సర్వాంగ భూషణః 4
భువనమండనశ్చైవ శ్రీరథః పుణ్యవర్ధనః।
మందరో హిమవాంశ్చైవ రాజహంసో మనుప్రభః॥ 5
సురవల్లభస్త్రైలోక్యః సిద్ధార్థశ్చ రతిప్రభః।
మహాకాంతః పద్మరాగో మేరుశ్చ త్రిదశాలయః॥ 6
పంచవింశతి రిత్యుక్తా మహాప్రాసాద నాయకాః।
వక్ష్యామి లక్షణంతేషాం ప్రస్తారచ్ఛంద నిర్ణయమ్॥ 7

చతురశ్రీ కృతేక్షేత్రే త్రయోదశ విభాజితే।
త్రిభాగోభద్ర విస్తారః కర్ణమానం ద్విభాగికమ్॥ 8
భద్రార్ధంచ ప్రతిరదో యుగ్మాకారావుభౌచతౌః
షడంశః పదనిష్కాసః సర్వేషాంచ సుఖావహః॥ 9
ఉదకాంతర సంయుక్తం ఘంటాకలశ భూషితమ్।
చతుర్వింశతి వల్లీక మేకాండక విభూషితమ్॥ 10
ప్రాసాదం సురతర్వ్యాఖ్య మమం యః కారయేన్నరః।
ఇచ్ఛితం లభతేరాజ్యం భుక్త్వాభోగాంశ్చ స్వర్వంతిః॥ 11

తా॥ ప్రశస్తమైన లతినజాతి మహాప్రాసాదములు 26 సురతరువు, శ్రియానందము, సురానందము, నందము, నందనము, అమృతోద్భవము, పృథివీజయము, వైడూర్యము, మకుటోజ్జ్వలము లక్ష్మీభూషణము సర్వాంగ భూషణము, భువనమండనము, శ్రీరథము, పుణ్యవర్ధనము, మందరము, హిమవంతము, రాజహంసము, మనుప్రభము, సురవల్లభము, త్రైలోక్యము సిద్ధార్థము, రతిప్రభము, మహాకాంతము, పద్మరాగము మేరువు, అనునవి వీనియొక్క విస్తారము యెత్తు మొదలైన లక్షణములను చెప్పుచున్నాడు. చతురశ్ర ప్రదేశమును 13 భాగములుచేసి మధ్యభద్రము 3 భాగములు, కర్ణములు 2 భాగముల చొప్పునను, ప్రతిరథము 1½ భాగము చొప్పున జంటలుగను. భద్రము మొదలైన వాని నిర్గమము విస్తారములో 6వ వంతున్ను చేయవలెను జలమార్గములును, ఘంట, కలశము, 24 లతలును, ప్రధాన శిఖరమును రచించిరేని సురతరువు అను ప్రాసాదమగును. మొత్తము 25 అండకములు దీనిని రచించిన వారికి కోరిక వీడేరి రాజ్య సుఖములనుభవించి యింద్రపదవి నందుదురు.

## 99. శ్రియానంద ప్రాసాదము

అపరా. 166వ సూ.

శ్లో॥ భద్రం కర్ణే భవేద్భాగం సపాదః ప్రరథస్తథా।
వల్లభః సర్వదేవానాం శ్రియానందః శుభంకరః॥ 12

తా॥ పైజెప్పిన దానినే కర్ణమున భద్రము 1 భాగమును, ప్రతి రథములు $1\frac{1}{4}$ భాగము చొప్పునను చేసి మిగిలిన పనులన్నియును పూర్వము వలెనే రచించిరేని శ్రియానందమగును.

## 100. సురానంద ప్రాసాదము

అపరా 166వ సూత్రము

శ్లో॥ కర్ణే శృంగం విధాతవ్యం రథికాభద్ర శోభితా ।
సురతరుస్తచ్ఛిఖరం సురానందః సఉచ్యతే॥ 13

తా॥ పైజెప్పిన దానికే కర్ణమున శృంగమును రథికయందు కూడ భద్రమును రచించి శిఖరము సురతరువు వలెనే చేసినయెడల సురానందమగును. మొత్తము 29 అండకములగును.

## 101. నందాఖ్య-నందన ప్రాసాదములు

అపరా. 166వ సూత్రము

శ్లో॥ భద్రేతు శిఖరం దేయం ఘంటాకలశ భూషితమ్।
సర్వతోభద్ర కాకారో నందాఖ్యోఽశాభవేత్తదా॥ 14
తద్రూపే తత్ప్రమాణేచ భద్రపక్షేతు కర్ణికా।
భద్రేకర్ణే ద్విశృంగంచ నందనః సర్వకామదః॥ 15

తా॥ పైజెప్పిన దానినే భద్రమున శిఖరమును, ఘంట, కలశముతోను, సర్వతోభద్రమువలె రచించిరేని నందాఖ్యమగును మఱియు నందాఖ్యము కొలత ప్రకారమే అన్నియును, చేయుచు భద్రము యొక్క రెండు ప్రక్కల కర్ణికలను కల్పించి భద్రమున 2 శృంగములును, కర్ణమున 2 శృంగములును రచించినచో నందమగును. 41 శృంగములగును

## 102. అమృతోద్భవ ప్రాసాదము

అపరా. 166వ సూ

శ్లో॥ అష్టధా భాజితేచైవ సమక్షేత్రే విచక్షణైః ।
ద్విభాగః కర్ణ ఇత్యుక్తః కర్ణికాచార్ధభాగతః॥ 16

తత్సమాచ ద్వితీయాచ నిర్గమేః స్త్రేతథా।
ద్విభాగం ముఖభద్రంచ అర్ధభాగేన నిర్గమః॥ 17
కర్ణే శృంగం విధాతవ్యం సఘంటం త్ర్యంశకోన్నతమ్।
తదూర్ధ్వేతిలకంచైవ ద్విభాగశ్చ తథోదయః॥ 18
కర్ణశృంగో భయపక్ష్యే కర్ణాభ్యాం శృంగం సయోదయమ్।
ద్విభాగమున్నతం కుర్యాచ్ఛృంగంచ ప్రతికర్ణకే॥ 19
భాగోన్నతాచరథికా తద్విస్తారో ద్విభాగికః।
షడ్భాగామూల రేఖాచ త్రిభాగాచోరు మంజరీ॥ 20
ద్వితీయాచద్విభాగాస్యా దేకభాగా తృతీయకా।
ద్వాదశైవోరు మంజర్యః శృంగాణాం వింశతి స్తథా॥ 21
చతుస్తిలక సంయుక్తం । త్రయస్త్రింశత్తథాండకా॥
అమృతోద్భవ నామాసా వందితస్త్రిదశైరపి॥ 22

తా॥ చతురశ్ర ప్రదేశమును 8 భాగములుచేసి కర్ణము 2 భాగములు కర్ణిక $\frac{1}{2}$ భాగము, మరల కర్ణిక $\frac{1}{2}$ భాగమును, భద్రము 2 భాగములు, నిర్గమము $\frac{1}{2}$ భాగము కర్ణమున శృంగమును చేయవలెను. ఘంటతో గూడ యెత్తు 3 భాగములుండవలెను. ఆపైన తిలకమును 2 భాగములు ఎత్తున రచించవలెను. కర్ణశృంగమున కిరువైపుల కర్ణికలయందు సమానమైన యెత్తులో శృంగము లుండవలెను. అన్ని కర్ణికలకును శృంగము యెత్తు 2 భాగములు చేయవలెను. రథిక 1 భాగము యెత్తును, విస్తారము 2 భాగములును ప్రధాన మంజరి విస్తారము 6 భాగములును, ఉరోమంజరి విస్తారము 3భాగములును, రెండవ ఉరోమంజరి విస్తారము 2భాగములును, మూడవ ఉరోమంజరివిస్తారము 1 భాగమును, ఇట్లు నలువైపుల 12 ఉరోమంజరులగును మొదటి కర్ణకూటముల యొక్క వరుస 12 ను, రెండవ వరుస 4ను, 3వ వరుస 4ను కలసి మొత్తము 20 అండకములు. ప్రధాన శిఖరముతోకూడ 33 అండకములను నాలుగు భద్రములను కలది అమృతోద్భవమగును.

## 103. పృథివీజయ ప్రాసాదము

అపరా. 166వ సూ

శ్లో॥ దశధా భాజితేక్షేత్రే ద్విభాగః కర్ణవిస్తరః।
అర్ధభాగా కర్ణికాచ సపాదాచ ద్వితీయకా॥ 23
అర్ధభాగా తృతీయాచ భద్రంస్యాత్సార్ధ భాగికమ్।
కర్ణే శృంగ ద్వయం కుర్యాత్ షడ్భాగా మూలమంజరీ॥ 24
కర్ణ శృంగే సంగతాప సార్ధద్వ్యంశోరు మంజరీ।
ద్విభాగాచ ద్వితీయోస్యాత్ ప్రత్యం గంచతదూర్ధ్వతః॥ 25
ఏకభాగాం మంజరికాం రథికోపరిదాపయేత్
పునరగ్రేచార్ధభాగాం చతుర్థీమురు మంజరీమ్॥ 26
చతుర్వింశతి శృంగాణి చోరః శృంగాణ షోడశ
లఘుకర్ణ్యాంచ తిలకం ప్రత్యంగేతు తదోఽష్టచ॥ 27
పృథ్వీజయస్త థైకోన పంచాశచ్ఛాండకై ర్భవేత్।
ఏకచ్ఛత్రంధ రారాజ్యం భవేజ్జన్మని జన్మని॥ 28

తా॥ విస్తారమును 10 భాగములుచేసి కర్ణము 2 భాగములు, కర్ణిక ½ భాగము. రెండవది 1 1/4 భాగము, మూడవది ½ భాగము, భద్రము 1½ భాగము చేయవలెను. కర్ణమున 2 శృంగములును, మూలమంజరి విస్తారము 6 భాగములును, కర్ణశృంగమును అనుకొని 2½ భాగముల విస్తారము ఉరోమంజరియును, రెండవ ఉరోమంజరి విస్తారము 2 భాగములును, దానిపైన ప్రత్యంగమును, దానిపైన మూడవ మంజరి 1 భాగమును రథికపైన రచించవలెను. దానిపైన 1/2 భాగము విస్తారముతో నాల్గవ ఉరోమంజరిని రచించవలెను ఇట్లు శృంగములు 24 ను, ఉరః శృంగములు 16ను, లఘుకర్ణికల యందు తిలకములును, భద్రముల యందు శృంగములు 8 యును ప్రధాన శిఖరముతో మొత్తము 49 అండకములు కలది పృథివీ జయమగును దీనిని రచించినవారు ఏకచ్ఛత్రాధిపత్యమును ప్రతిజన్మమున జేయుదురు.

## 104. వైడూర్య ప్రాసాదము

అపరా. 166వ సూత్రము.

శ్లో॥ క్షేత్రే ద్వాదశధాభక్తే ద్విభాగః కర్ణ విస్తరః॥
కర్ణికాచార్ధ భాగాస్యాత్ సార్ధః ప్రతిరథో భవేత్॥ 29
అర్ధభాగా పునః కర్ణీ తత్సమాభద్ర కర్ణికా ।
నిష్కాసావిస్తరసమః కర్ణికా ప్రరథే తథా॥ 30
ద్విభాగో భద్ర విస్తారో నిర్గమశ్చైక భాగికః ।
భాగోత్సేధా చరథికా భాగాస్యాచ్చోరు మంజరీ॥ 31
ద్వితీయకాతద్ద్విగుణా త్రిభాగాతు తృతీయకా।
చతుర్థీచ చతుర్భాగా తృతీయావత్ ప్రత్యంగకమ్॥ 32
ఉరుమంజర్యర్ధభాగా ప్రదాప్యారథి కోర్ధ్వతః॥
రథకర్ణ్యాం భవేచ్ఛృంగం ప్రత్యంగేచ ద్వికర్ణకమ్॥
కర్ణే ప్రతిరథేచైవ ద్విద్విశృంగం ప్రదాపయేత్॥ 33
చత్వారింశచ్చ శృంగాణ్యు రుమంజర్యశ్చ వింశతిః॥
ప్రత్యంగేచాష్ట మంజర్యః శేషంచతిలకాన్వితమ్॥ 34
ఖ్యాతో వైడూర్య ఏకోన పప్తత్యండకతో భవేత్।
కర్తాచావరకైః సార్ధం శివలోకే మహీయతే॥ 35

తా॥ చతురస్ర ప్రదేశమును 12 భాగములు చేసి కర్ణము 2 భాగములు, కర్ణిక 1/2 భాగము, ప్రతిరథము 1 1/2 భాగను, మరల కర్ణిక 1/2 భాగము, దానితో సమానముగా భద్రము ప్రక్కనుండెడి కర్ణిక 1/2 భాగము, వానియొక్క నిర్గమము విస్తారముతో సమానముగా నుండవలెను. ప్రరథమునకు గూడ అంతే. భద్రముయొక్క విస్తారము 2 భాగములు, నిర్గమము 1 భాగము, రథిక యెత్తు 1 భాగము, ఉరోమంజరి విస్తారము 1 భాగము, రెండవ ఉరో మంజరి విస్తారము 2 భాగములు, మూడవ ఉరోమంజరి విస్తారము 3 భాగములు, నాలుగవ ఉరోమంజరి విస్తారము 4 భాగములు, మూడవ ఉరోమంజరివలె భద్రమును ఉరోమంజరి 1/2 భాగమును రథికపైన రచించవలెను. రథకర్ణికయందు 1శృంగమును. భద్రమున రెండు కర్ణములును కర్ణమున 2 శృంగములును, ప్రతిరథమున 2 శృంగములును, ఇట్లు ఒక్కొక్క మూల 10 చొప్పున 40 శృంగములును ఉరోమంజరుల శృంగములు మొత్తము 20 యును, భద్రముల యందలి శృంగములు 8 యును, ప్రధాన శిఖరముతో గూడ 69 శృంగములగును ఇట్లు వైడూర్య ప్రాసాదమును రచించినవారు శివలోకమున నుందురు,

## 105. ముకుటోజ్జ్వల ప్రాసాదము

అపరా. 166వ సూ.

శ్లో॥ క్షేత్రే విభక్తే మన్వంశై ర్ద్విభాగః కర్ణవిస్తరః।
అర్ధభాగా కర్ణికాచ సార్ధః ప్రతిరథో భవేత్॥ 36
పునః కర్ణీచార్ధభాగా నందికాచైక భాగికా।
అర్ధాకర్ణీ విధాతవ్యా ద్విభాగోభద్ర విస్తరః॥ 37
కర్ణే ద్విశృంగం తిలకే ద్వేద్వేనంద్యాం ప్రతిరథే।
షట్త్రిద్విసార్ధైకార్ధ మురః శృంగాణి కల్పయేత్॥ 38
షోడశప్రత్యంగ యుక్తం శేషంవైకూటకం తథా॥
ముకుటోజ్జ్వల ఆఖ్యాతః కర్తవ్యః సర్వదైవతే. 39

తా॥ చతురశ్ర ప్రదేశమును 14 భాగములుచేసి కర్ణము 2 భాగములు, కర్ణిక 1/2 భాగము, ప్రతిరథము 1 1/2 భాగము, మరల కర్ణిక 1/2 భాగము, నందిక 1 భాగము, కర్ణిక 1/2 భాగము, భద్రము విస్తారము 2 భాగములు, కర్ణమున శృంగములు 2 ను, తిలకమున 2 ను, నందిక యందు 2 ను, ప్రతిరథమున 2 ను, చేయవలెను ఉరః శృంగములు 6-3-2-1 $1\frac{1}{2}$-$1\frac{1}{2}$ భాగములు చేయవలెను. ప్రత్యంగములు 16ను మిగిలిన వికూటములును చేయవలెను. దీనిని ముకుటోజ్జ్వల మందురు. దీనికి మొత్తము 73 శృంగములగు చున్నవి. సమరాంగణ 56వ అధ్యాయమున చెప్పబడిన ప్రకారము 81 ఉండవలెను

## 106. లక్ష్మీభూషణ ప్రాసాదము

అపరా. 166వ సూ.

శ్లో॥ చతుర్వింశతిభిర్భక్తే ద్విభాగాః కర్ణకానుగాః।
త్రిసంఘాటామధ్య కర్ణే శేషాభాగేన కల్పితాః॥ 40
ద్విభాగం పృథుభద్రంస్యా దర్ధేద్వేద్వేచ కర్ణికే।
ద్వ్యంశోదయాచరథికా సార్ధద్వ్యం శాతుకర్ణికా॥ 41
ద్వితీయాతు త్రిభాగాస్యా దర్ధయుక్తా తృతీయకా।
తత్తుల్యాతు చతుర్థ్యూర్ధ్వే తిలకం త్వేక భాగికమ్॥ 42
పంచమీచ చతుర్భాగా ద్విభాగం తిలకం తథా।
షష్ఠీ చతుర్ధీ విజ్ఞేయా ప్రత్యంగం తిలకోపరి॥ 43

చతుర్థీ పంచమీ షష్ఠీ త్రిసంఘాటం తదుచ్యతే।
స్యాత్కర్ణైరధికామధ్యే సంఘాటస్త్రప్రమాణతః॥ 44
శోషయేన్మధ్య కర్ణార్థం శోషయేత్పక్ష కర్ణికామ్।
తత్రప్రత్యంగే మధ్యకర్ణీం లఘుస్థావామ దక్షిణే॥ 45
ఏకద్విత్రిచతుఃషట్ అష్టస్యాదావు భౌ వ చ।
ఉరుమంజరీ త్యాగాని ద్విరష్టాంశస్యాన్మూల మంజరీ॥ 46
త్రిభాగముచ్ఛ్రితం శృంగం భాగాస్యాత్పద్మ పత్రికా
ద్రావిడే వరాటకూటం త్రిసంఘాటే ప్రకల్పయేత్॥ 47
కర్ణేప్రతిరథేచైవ త్రిత్రిశృంగం సముచ్ఛ్రితమ్।
షట్త్రింశ చ్ఛృంగాణి కర్ణ్యాం చతుః షష్టి స్తథైవచ॥ 48
అష్టావింశత్యురః శృంగం ప్రత్యంగాని చద్వాత్రింశత్।
శృంగాణి సర్వాణి శతం సప్తపంచాశదుత్తరమ్॥ 49
లక్ష్మీభూషణ నామా సా సర్వదేవ హితావహః।
కర్తృకార్యా ప్రాపయేత్తద్ యత్స్థానం దేవదుర్లభమ్॥ 0

తా॥ విస్తారమును 24 భాగములు చేసి కర్ణము 2 భాగములు మధ్య నుండి 3 కర్ణములు ఒక్కటే 6 భాగములతోను ఆ మూటిలో మధ్య కర్ణము 2 భాగములు లావుగను, దానికిరువైపుల 1.1 భాగముతో ఒక్కొక్క కర్ణమును అనగా మధ్య కర్ణము స్థూలముగను దానికిరువైపుల కృశము గాను రచించవలెను. ఆ మధ్యనున్న 4 భాగములలో 2 భాగముల చొప్పున 1.1 రథమును ఇట్లు రెండు వైపుల రచించవలెను. రథికయెత్తు 2 భాగములు, కర్ణిక 2 1/2 భాగములు, రెండవ కర్ణిక 3 భాగములు: మూడవ కర్ణిక 3 /2 భాగములు నాల్గవ కర్ణిక 3 1/2 భాగములు ఐదవ కర్ణిక 4 భాగములు, ఆఱవ కర్ణిక 4 భాగములు చేయవలెను. మఱియు నాల్గవ కర్ణిక యందు తిలకము 1 భాగమును, అయిదవ కర్ణికయందు తిలకము 2 భాగములు ఆఱవ కర్ణిక యందు తిలకమును ఆ తిలకముపై ప్రత్యంగమును రచించవలెను, మొదటి ఉరోమంజరి 1 భాగమును రెండవది 2 భాగములును, మూడవది 3 భాగములును, నాల్గవది 4 భాగములును, అయిదవది 6 భాగములును, ఆఱవది 7 భాగములును, ఏడవది 8 భాగములును విస్తారమును చేయవలెను. ప్రధాన మంజరియొక్క విస్తారము 16 భాగములు చేయవలెను. శృంగము యెత్తు 3 భాగములు, పద్మ

పత్రిక 1 భాగము ద్రావిడ పద్ధతితోను. కూటములు వరాట పద్ధతిగను, త్రిసంఘాటము నందు గూడ వరాట పద్ధతితోనే రచించవలెను. కర్ణము నను ప్రతిరథమునను 3,3 శృంగములును, ఇట్లు 36 శృంగములును, కర్ణికలయందు 64 శృంగములును, ఉరఃశృంగములు 28 యును, ప్రత్యం గములు 32 ను, అన్నియును కలసి ప్రధాన శృంగముతో సహ 157 శృంగ ములగును. దీనిని లక్ష్మీభూషణ ప్రాసాదమందురు. దీనిని రచించిన వారికి దేవతలకుకూడ పొంద శక్యముగాని పుణ్యలోక స్థానము లభించును.

(ఇందు ప్రత్యంగములలో పెద్దవానికి 2 కలశములును చిన్నవానికి 1 కలశము చొప్పునను అయితే 32 అగును. అప్పుడు మొత్తము 161 అయి నవి. ఉరః శృంగములలో చిన్నదానికి కలశము లేకున్నచో పైలెక్క సరి పోవును)

(అనుబంధము 31, 32 పటములు చూడుడు)

# 107. సర్వాంగ భూషణ ప్రాసాదము

అపరా. 166వ సూ.

శ్లో॥ అష్టావింశతి భక్తేచ ద్విభాగః కర్ణవిస్తరః ।
తత్సమశ్చ ప్రతిరథో నిర్గమస్త్వేక భాగికః ॥ 51
రథశ్చాను గతస్త్వేవ ద్విభాగం విస్తరేత్పృథక్ ।
సార్ధభాగానందికాచ తత్సమా ప్రతినందికా॥ 52
అర్ధమర్ధం విధాతవ్యా శ్చతస్రః కర్ణికా బుధైః ।
ద్విభాగోభద్ర విస్తారో నిర్గమశ్చార్ధ భాగికః॥ 53
రథికాంశోన్నతా సార్ధం కర్ణశృంగం సమున్నతమ్।
ద్విభాగం ద్వితీయంచైవ సార్ధద్వ్యంశం తృతీయకమ్॥ 54
త్ర్యంశోన్నతం చతుర్ధంచ చతురంశైస్తు పంచమమ్।
షష్ఠంచ తత్సమంజ్ఞేయ మూర్ధ్వే శృంగంతుద్వ్యంశకమ్॥ 55
అన్యాని సర్వశృంగాణి వేదాంశాని సముచ్ఛ్రితౌ।
త్రిభాగాచోచ్ఛ్రితా శృంగే భాగాస్యాత్పద్మ పత్రికా॥ 56

త్రిశృంగముచ్ఛ్రితం కర్ణే ద్వ్యంశం ప్రతిరథే తథా।
రథే కర్ణే సమంతాచ్చ ప్రరథేచ తథానుగా॥ 57
షట్పంచా శత్కర్ణ శృంగ మష్ట షష్టిర్దలాండకాః
ఉరః శృంగాణి ద్వాత్రింశత్ ప్రత్యంగాని తతోఽష్టభిః॥ 58
రేఖావింశతి భాగాశ్చ శృంగగర్భేచ మంజరీ।
పంచషష్ఠ్యు త్తరశత మండకానాం ప్రశస్యతే॥ 59
సర్వాంగ భూషణశ్చైవ ప్రాసాదః సురవల్లభః।
సురైః సహక్రీడయం తేయావదాహ్నుత సంప్లవమ్॥ 60

తా॥ విస్తారమును 28 భాగములు చేసి కర్ణము 2 భాగములు, ప్రతిరథము 2 భాగములు, నిర్గమము 1 భాగము, అనుసరించిన రథములు 2 భాగములు, నందిక $1\frac{1}{2}$ భాగము, ప్రతినందిక $1\frac{1}{2}$ భాగము, కర్ణికలు 1/2 భాగము చొప్పున నాలుగు రచించవలెను, భద్రము 2 భాగములు, నిర్గమము 1/2 భాగము, రథిక యెత్తు 1 భాగము, కర్ణిక శృంగము 1 1/2 భాగము, రెండవ కర్ణిక 2 భాగములు, మూడవ కర్ణిక $2\frac{1}{2}$ భాగములు, నాలుగవ కర్ణక 3 భాగములు, అయిదవ కర్ణిక 4 భాగములు, ఆఱవ కర్ణిక 4 భాగములు, పై శృంగము 2 భాగములు, ఇతర శృంగములు అన్నియును 4 భాగములు శృంగము యెత్తు 3 భాగములును పైన పద్మ పత్రిక 1 భాగమును చేయువలెను. కర్ణమున 3 శృంగములు, ప్రతిరథమున 2 శృంగములు రథమునను కర్ణమునను ప్రతిరథమునను కలసి 56 కర్ణ శృంగములును, దలఅండకములు 68 యును, ఉరః శృంగములు 32ను, ప్రత్యంగములు 8 యును, చేయవలెను. ప్రధాన శృంగము విస్తారము 20 భాగములును, శృంగము యొక్క నడుమ మంజరియును అండకములు మొత్తము 165. ఇట్లు రచించిరేని సర్వాంగభూషణ మగును. దీనివలన దివ్యలోక సుఖములనుభవింతురు.

(అనుబంధము 33, 34 పటములు చూడుడు)

## 108. భువనమండలము

అపరా 166వ సూ.

శ్లో॥ భద్రే శృంగం ప్రదాతవ్యం నామ్నా భువన మండనః
ప్రియశ్చ నిత్యం దేవానాం నవషష్టి శతాండకః॥ 61

తా॥ భద్రమున గూడ ఒక్క శృంగమును రచించిన ఎడల మొత్తము 169 అండకములతో భువనమండనమగును.

## 109. శ్రీరథము

అపరా. 166వ సూ.

శ్లో॥ విమానవత్సురతరౌ కర్ణేశృంగం త్రిభాగికమ్।
భద్రే రథోద్గమశ్చైవ శ్రీరథః సర్వకామదః॥ 62

తా॥ సురతరు ప్రాసాదమునందు విమానపద్ధతితో కర్ణములును, భద్రమునందు 3 భాగములు యొత్తును కల్పించినచో శ్రీరథమగును.

## 110. పుణ్యవర్ధనము

అపరా. 166వ సూ.

శ్లో॥ శ్రీవత్సేకర్ణ శృంగాణి విమానః పంచభూమికః।
రథికాభద్ర శోభాఢ్యో నామ్నాసౌపుణ్య వర్ధనః॥ 63

తా॥ శ్రీవత్స ప్రాసాదమునందు కర్ణశృంగములు విమాన పద్ధతితోను 5 అంతస్తులుగను రథికయందు భద్రమును రచించిరేని పుణ్యవర్ధన ప్రాసాదమగును.

## 111. మందరము

అపరా 166వ సూత్రము

శ్లో॥ సురానందం కర్ణశృంగే సర్వతోభద్ర మాలిఖేత్।
మందరోఽసౌ సమాఖ్యాతః సురూపోలక్షణాన్వితః॥ 64

తా॥ సురానంద ప్రాసాదమున కర్ణశృంగముల యందంతటను భద్రములను రచించిన యెడల మందరమగును.

## 112. హిమవంతము

అపరా. 166వ సూత్రము

శ్లో॥ విమానచ్ఛందం నందాఖ్యే శిఖరేచోరు మంజరీ।
హిమవాంశ్చతథానామ వందితస్త్రిదశైరపి॥ 65

తా॥ నందాఖ్యమున శిఖరమునందు ఉరోమంజరిని కల్పించిన యెడల హిమవంతమగును.

## 113. రాజహంసము

అపరా. 166వ సూ.

శ్లో॥ తద్రూపేతు ద్వితీయాచ త్రిభూమాచోరు మంజరీ।
రాజహంస స్తథానామ సిద్ధకిన్నర సేవితః॥ 66

తా॥ హిమవంతము నందింకొక ఉరోమంజరిని కల్పించి 3 అంతస్తులతో రచించిన యెడల రాజహంసమగును.

## 114. మనుప్రభము

అపరా. 166వ సూ.

శ్లో॥ అమృతే కర్ణశృంగంచ కర్తవ్యంతున వాండకమ్।
మనుప్రభస్తథానామ ప్రాసాదో దేవతాలయః॥ 67

తా॥ పూర్వము చెప్పిన అమృతోద్భవమునందు కర్ణశృంగములు 9 అండకములతో రచించిరేని మనుప్రభ నామము కల్గును.

## 115. సురవల్లభము

అపరా. 166వ సూత్రము

శ్లో॥ పృథ్వీజయే సర్వశృంగం కర్తవ్యంచ నవాండకమ్।
సురవల్లభ నామాసా విచ్ఛాభుక్తి ఫలప్రదః॥ 68

తా॥ పృథ్వీజయము నందు అన్ని శృంగములును 9 అండకముల చొప్పున రచించిరేని సురవల్లభమగును.

## 116. త్రైలోక్యము

అపరా. 166వ సూ.

శ్లో॥ వైడూర్యే సర్వశృంగాణి కర్తవ్యానిచ సర్వతః।
త్రైలోక్యస్తుతదానామ పూజ్యః సురనరోరగైః॥ 69

తా॥ వైడూర్య ప్రాసాదమునందు గల భూషణములన్నిటికిని శృంగము లను కల్పించిన యెడల త్రైలోక్యమగును.

## 117. సిద్ధార్థకము

అపరా. 166వ సూ.

శ్లో॥ ముకుటోజ్జ్వల వచ్ఛృంగం కర్తవ్యంచ నవాండకమ్।
సిద్ధార్థకస్తదానామ సిద్ధిభుక్తి ప్రదాయకః॥ 70

తా॥ శిఖరమును ముకుటోజ్జ్వలము వలెనేచేసి 9 అండములతో రచించినేని సిద్ధార్థకమగును.

## 118. రతిప్రభము

అపరా. 166వ సూ.

శ్లో॥ లక్ష్మీభూషణ శృంగంచ భూషణీయం నవాండకైః।
చతుర్ముఖో రతిప్రభః కామదేవ సుఖాలయః॥ 71

తా॥ లక్ష్మీభూషణము నందలి శృంగములు 9 అండకముతో రచించి నలువైపుల ద్వారములను రచించిన యెడల రతిప్రభమగును.

## 119. మహాకాంతము

అపరా. 166వ సూ.

శ్లో॥ సర్వాంగభూషణే శృంగం కర్తవ్యం సర్వతోభవమ్।
మహాకాంతస్తదానామ కర్తవ్యః సర్వదైవతే॥ 72

తా॥ సర్వాంగ భూషణమునందు శృంగమును రచించిన యెడల మహాకాంతమగును.

## 120. పద్మరాగము

అపరా. 166వ సూ.

శ్లో॥ నవాండకంచ కర్తవ్యం శృంగం భువనమండనే।
పద్మరాగస్తదానామ కర్తవ్యః పద్మయోనయే॥ 73

తా॥ భువనమండన ప్రాసాదము నందలి శృంగము 9 అండకములతో రచించినయెడల పద్మరాగమగును. ఇది బ్రహ్మకు ముఖ్యమైనది.

## 121. సహస్రాండక మేరువు

అపరా. 166వ సూ.

శ్లో॥ కేతకీ స్వర్ణలత స్తాదృశీచోరు మంజరీ।
విమానే నవశృంగాణి శిఖరేచోరు మంజరీ॥ 74
ప్రత్యంగాని విమానేచ మూలరేఖాచ శృంగతః।
లతాః పంచైకాదశాంశా మేరుర్దశ శతాండకః॥ 75

ఇతి సూత్ర సంతానగుణ కీర్తి ప్రకాశ ప్రోక్త శ్రీ భువన దేవాచార్యోక్తాపరాజిత పృచ్ఛాయాం సురతర్వాది ప్రాసాద లక్షణాధికారో నామషట్ షష్ట్యుత్తర శతతమం సూత్రమ్.

తా॥ మొగలి పువ్వులవలె బంగారుదలములతో ఉరోమంజరియును, విమానమున 9 శృంగములును, శిఖరమున ఉరోమంజరియును, విమానమున ప్రత్యంగములును, శృంగముల పైభాగమునుండి ప్రధాన శిఖరమును, లతలు, 5-11 భాగములును, 1000 అండకములును, కలది సహస్రాండక మేరువగును.

## 122. మిశ్రజాతి మఱికొన్ని ప్రాసాదములు అందు నాగరతిలకము

అపరా. 106వ సూ.

శ్లో॥ నాగరచ్ఛందకాఖ్యాతా స్తిలకైఃస్యురనేకధా।
మిశ్రకామిశ్రజాతాశ్చ కర్తవ్యాస్తిల కాంకితాః॥ 3

తా॥ నాగర పద్ధతిలో కొలతలు పనులు చేయబడినవి. తిలకములను పేరుతో కొన్ని ప్రాసాదములు కలవు.

విశ్వకర్మోవాచ-

అపరా. 169వ సూ.

శ్లో॥ అథాతః సంప్రవక్ష్యామి ప్రాపాదానాంతు లక్షణం।
విభక్తిచ్ఛంద తిలకై స్తిలకా, సాగరాదికాః॥ 1
క్షీరార్ణవ సముత్పన్నో నామ్నాతిలక సాగరః।
గౌరీ రుద్రాఖ్య తిలకో శ్రీహరిప్రియ పూర్వకౌ॥ 2
లక్ష్మీభూతిలకౌచైవ రంభేంద్ర తిలకౌతథా ।
మందరోహిమరాంశ్చైవ కైలాస తిలక స్తథా॥ 3
పృథివ్యాది స్త్రిభువన ఇంద్రనీలస్తథోత్తమః।
సర్వాంగ తిలకశ్చైవ తిలకః సురవల్లభః॥ 4
సింహోనక్రధ్వజశ్చైవ మంగలస్తిలకాఖ్యకః।
పద్మకః సోమవిజయో త్రైలోక్య తిలకస్తథా॥ 5
పంచవింశతి ఇత్యుక్తా స్తిలకాః సాగరాదికాః ।
ఛందాలంకార సంయుక్తాః కథ్యంతే త్వపరాజిత॥ 6
వైరాజ్యంచ చతుః స్తంభై ర్దిశావృత్యోరుమావృతమ్।
ఛాద్యఘంటా కూటయుక్తో నామ్నాతిలక సాగరః॥ 7

తా॥ క్షీరార్ణవమునుండి తిలకసాగరముత్పన్నమైనది గౌరీతిలకము, రుద్రతిలకము, శ్రీ తిలకము, హరితిలకము, లక్ష్మీతిలకము, భూతిలకము, రంభాతిలకము, ఇంద్రతిలకము, మందరతిలకము, హిమవంత తిలకము, కైలాసతిలకము, పృథివీతిలకము, త్రిభువనతిలకము, ఇంద్రనీలతిలకము, సర్వాంగ తిలకము, సురవల్లభ తిలకము, సింహ తిలకము, మకరధ్వజ తిలకము, మంగల తిలకము, తిలకాఖ్యము, పద్మతిలకము, సోమతిలకము, విజయతిలకము, త్రైలోక్య తిలకము, ఇట్లు 25 భేదములయినవి విశ్వకర్మ వాస్తుశాస్త్రమున "అవ్యక్తకూట సమాయుక్తం ఘంటాసింహ సముద్భవమ్, ఈదృశం కురుతేయస్తు సోలభేత్స్యాక్షయపదమ్॥ అని చెప్పబడి

యున్నది. వైరాజ్యజాతియందు 4 స్తంభములతోను. ఛాద్యము, ఘంటా, కూటము, మొదలయినవి కలది. తిలకజాతి దీనినిసాగర తిలకమందురు.

## 123. గౌరీతిలకము

అపరా. 169వ సూత్రము

శ్లో॥ అష్టౌతిలక సంఘాతాః కర్ణగర్భోర్ధ్వరేఖికా ।
దిక్తిలకార్ధ నిష్క్రాసో గౌరీ తిలక ఈరితః॥ 8
విశ్వకర్మవాస్తు శాస్త్రమున "కర్ణశృంగోర్ధ్వ రేఖాయుతీ।
దిశతిలకం నిస్త్రంశం ? కర్తుః శాంతిసుఖావహాః" అనియున్నది.

తా॥ తిలకములు 8 కర్ణము, గర్భముపైన రేఖ దిశలయందు తిలకములు ½ భాగము నిర్గమము కలది గౌరీ తిలకము,

## 124. రుద్రతిలకము

అపరా. 169వ సూ.

శ్లో॥ కేశరీ పూర్వవ జ్ఞేయః శృంగేచ తిలకం భవేత్।
ఖ్యాతోఽసౌరుద్ర తిలకః కర్తవ్యః సర్వదైవతే॥ 9

తా॥ కేశరి ప్రాసాదమున శృంగమున తిలకమును రచించినచో రుద్ర తిలకమగును.

## 125. శ్రీతిలకము

అపరా. 169వ సూ.

శ్లో॥ కర్ణశృంగోర్ధ్వ తిలకం భద్రోర్ధ్వే సింహకర్ణకః।
కర్తుః శాంతి శ్రీప్రదోఽసౌ ఖ్యాత శ్రీతిలకాభిధః॥ 10

తా॥ కర్ణశృంగములపై తిలకమును, భద్రములపై సింహ కర్ణములను రచించిన మొదల శ్రీతిలకమగును, తలవిభక్తి 8 భాగములు, అండకములు 5 తిలకములు 4 అని తెలియవలెను.

## 126. హరతిలకము

అపరా. 169వ సూ

శ్లో॥ భద్రేశృంగం ప్రదాతవ్యం నందనాకారవత్తథా।
తిలకాంతో హరినామా సిద్ధకిన్నర సేవితః॥ 11

తా॥ భద్రమున శృంగమును తిలకముపైన సింహములును నంద నమువలె మిగిలిన పనులన్నియును చేయవలెను దీనిని హరి తిలక మందురు. విశ్వకర్మ వాస్తు శాస్త్రమున "భద్రే శృంగం యదాతస్య నందికా కారపూర్వవత్" అనగా తలచ్ఛందము 8 భాగములు, భద్రములయందలి 4తో గూడ అండకములు 9 తిలకములు 4 అని తెలియవలెను.

## 127. లక్ష్మీతిలకము

అపరా. 169వ సూ.

శ్లో॥ భద్రే శృంగం ద్వితీయంచ స్థాపయేత్ రథికోర్ధ్వతః
లక్ష్మీతిలక ఆఖ్యాతః క్రీడాహేతుశ్చ శ్రీపతేః॥ 12

తా॥ భద్రమున 2 శృంగములును రథికల యొక్క పైభాగమున ప్రధాన శృంగమును రచించిన యెడల లక్ష్మీతిలకమగును. విశ్వకర్మ వాస్తుశాస్త్రమున "రథికోర్ధ్వం సంస్థాపయేత్ శ్రియా ప్రకృతి హేతవే" అని యున్నది, తలచ్ఛందము 8 భాగములును, తిలకములు 12ను, అండక ములు 13ను చేయవలెను. దీనిని లక్ష్మీతిలకమందురు.

## 128. భూతిలకము

అపరా. 169వ సూ.

శ్లో॥ నందనస్యచ సంస్థానే కర్ణోర్ధ్వే తిలకం న్యసేత్।
ప్రత్యంగే పార్శ్వే కర్ణీచ సస్యాద్భూతిలకోఽర్థదః॥ 13

తా॥ నందనమునకు కర్ణములపైన తిలకమును, భద్రమునకు రెండు వైపుల కర్ణికలును రచించిన యెడల భూతిలకమగును. విశ్వకర్మ వాస్తు శాస్త్రమున.

"చతురశ్రీ కృతేక్షేత్రే దశధాభాజితే పునః ।
కర్ణోభాగద్వయః కార్యః సార్ధభాగేన చానుగః॥ 20

శాలార్ధం సార్ధభాగేన పాదోనో నిర్గమస్తథా।
ప్రథమ పంక్తికోణేషు శృంగం తత్రనియోజయేత్॥ 21
రథోపరితు తిలక మూర్ధ్వరేఖా ప్రకీర్తితా।
అనుగేషు చతుర్దిక్షు శృంగమేకం నియోజయేత్॥ 22
తస్యోర్ధ్వేతు తిలకం ప్రత్యంగావా మదక్షిణే।
భద్రే శృంగ ద్వయంప్రోక్తం దిశాయాం స్థాపయేద్బుధః॥ 23
తిలకా నిద్వాదశైవ చాండాన్యేకోన త్రింశతిః।
భూతిలకః సమాఖ్యాతః సర్వకామార్ధసాధకః॥ 24

అనగా విస్తారమును 10 భాగములుచేసి కర్ణము 2 భాగములు ప్రతిరథము1½ భాగము, శాల 3 భాగములు, శాలయొక్క నిర్గమము 3/4 భాగము, మొదటివరుస మూలలయందు శృంగములను రచించవలెనుఆపైన తిలకమును, తిలకములపైన ప్రధాన శిఖరమును ప్రతిరథములను నలువైపుల శృంగమును 1.1 దానిని కల్పించవలెను. ఆపైన తిలకమును, కుడి యెడమల ప్రతిరథములును. భద్రమున 2 శృంగములును, నలువైపుల రచించవలెను. ఇట్లు తిలకములు నలువైపుల 12ను, అండములు 29యును, కలది భూతిలకమగును.

## 129. రంభాతిలకము

అపరాజిత 169వ సూత్రము

శ్లో॥ కర్ణేశృంగద్వయం కుర్యాత్ ప్రరథే తిలకం తథా।
రంభా తిలక అఖ్యాతః కర్తవ్యః శాంతిమిచ్ఛతా॥ 14

తా॥ కర్ణమున 2 శృంగములును, ప్రతిరథమున తిలకమును రచించినచో రంభాతిలకమగును "విస్తారము 10 భాగములు, తిలకములు 8 అండకములు 33 చేయవలెను. (విశ్వకర్మవాస్తుశాస్త్రము)

## 130. ఇంద్రతిలకము

అపరా. 169వ సూ.

శ్లో॥ శృంగం ప్రతిరథేచైవ కర్ణోర్ధ్వే తిలకం న్యసేత్।
నామ్నాసావింద్ర తిలకః పూజ్యం సురనరో రగైః॥ 15

తా॥ ప్రతిరథమున గూడ శృంగమును కర్ణముపైన తిలకమును రచించిరేని అది యింద్ర తిలకమగును. విశ్వకర్మవాస్తు శాస్త్రమున విస్తార భాగములు 10 తిలకములు 4 అండకములు 37, చెప్పబడియున్నవి.

# 131. మందర తిలకము

అపరా. 169వ సూ.

శ్లో॥ మందరః పూర్వవజ్ఞేయ స్తిలకం ప్రరదోర్ధ్వతః ।
ప్రత్యంగంనష్ట కర్ణంచ భద్రేశృంగత్రయం తథా॥ 16

తా॥ ఇంద్రతిలకమునందు ప్రతిరథమునగూడ తిలకమును రచించి ప్రత్యంగమున కర్ణము లేకుండచేసి భద్రమున 3 శృంగములుంచిన ఎడల మందరమగును. విశ్వకర్మ వాస్తు శాస్త్రమున

"మందరంచ ప్రవక్ష్యామి సూర్యభాగైర్విభాజయేత్।
భద్రంభాగద్వయంకార్యం చానుగంచ ద్విభాగికమ్॥ 27
కర్ణంభాగద్వయం కృత్వా చతుర్ధిక్షుని యోజయేత్।
కర్ణశృంగద్వయం స్థాప్యం చానుగే శృంగమేవచ॥ 28
ద్వితీయక్రమే తిలకం భద్రేత్రీణి తథైవచ ।
భద్రేచరథికాకార్యా శృంగత్రయం తదూర్ధ్వతః॥ 29
ప్రత్యంగాయది ప్రత్యంగ ఊరుశ్చవామదక్షిణే।
తదూర్ధ్వే మంజరికార్యా పద్మాకారానువర్తితా॥ 30
చతుర్వింశతి తిలకైః సప్తత్రింశద్భిరండకైః।
నానారూపధరోఃవ్యో మందరోమందరోపమః॥ 31

అనగా తలచ్ఛందము 12 భాగములును, మధ్య భద్రము 2 భాగములు అనుసరించి యిరువైపుల కలసి 2 భాగములు, కర్ణము 2 భాగములు, ప్రత్యంగము 2 భాగములు, ఇట్లు నలువైపుల రచించవలెను. కర్ణమున శృంగములు 2ను, ప్రతిరథమున 1 శృంగమును, రెండవ వరుసయందు తిలకమును, భద్రమున 3 శృంగములును, భద్రమున రథికయును, ఆపైన 3 శృంగములును, దానికిరువైపుల రథమునైనను రథికనైనను చేయు

వచ్చును. ఆపైన ప్రధాన శిఖరమును కల్పించవలెను. పద్మాకారముతో గుండ్రముగా నుండవలెను. తిలకములు 24 అండకములు 37 కలిగి యుండవలెను. దీనిని మందరమని చెప్పుదురు.
(అనుబంధము 35, 36పటములు చూడుడు)

## 132. హిమవంత తిలకము

అపరా. 169వ సూ.

శ్లో॥ కర్తవ్యం తిలకేశృంగం కర్ణోర్ధ్వే తిలకం న్యసేత్।
హిమవానితినామాసౌ కర్తవ్యః సర్వశాంతిదః॥ 17

తా॥ తిలకమున శృంగమును, కర్ణముపైన తిలకమును రచించిన యెడల హిమవంత తిలకమగును విశ్వకర్మవాస్తు శాస్త్రమున "ప్రతిరథోర్ధ్వేచ శృంగాణి కర్ణోర్ధ్వే తిలకంన్యసేత్॥ 32 తలచ్ఛందము 12 భాగములు. తిలకములు 20 అండకములు 41 రచించిరేని హిమవత్ప్రాసాదమగును.

## 133. కైలాస తిలకము

అపరా. 169వ సూ

శ్లో॥ భద్రకర్ణోద్గమే శృంగం తిలకం ప్రరథోర్ధ్వతః।
కర్ణోర్ధ్వేఽపియదా శృంగం నామ్నా కైలాస సంభవః॥ 18

తా॥ భద్రము యొక్క కర్ణమునందలి శృంగముయెత్తుగాను ప్రతిరథముపైన తిలకమును, కర్ణముపై శృంగమును, రచించిరేని కైలాస తిలకమగును.

## 134. పృథివీ తిలకము

అపరా. 169వ సూ

శ్లో॥ కర్ణోర్ధ్వేతు తిలకంస్యాచ్ఛృంగం ప్రతిరథోర్ధ్వతః।
పృథ్వీతిలకనామాసౌ పృథివీతీర్థపుణ్యదః॥ 19

తా॥ కర్ణముపైన తిలకమును, ప్రతిరథముపైన శృంగమును, కలది పృథివీ తిలకమగును.

# 135. త్రిభువన తిలకము

అపరా. 169వ సూ.

శ్లో॥ పృథ్వీజయస్య సంస్థానే నందికోర్ధ్వేతు కర్ణికా।
తద్రూపా కర్ణపార్శ్వేచ ద్విశృంగం కర్ణానుగే॥ 20
కర్ణ్యాంచ శృంగతిలకం భద్రే శృంగం చతుర్భవమ్।
ప్రత్యంగేచాష్టకార్యాణి రేఖోర్ధ్వే తిలకం తథా॥ 21

తా॥ భూతిలకమున నందికపైన కర్ణికమును, కర్ణముయొక్క ఇరు వైపుల కర్ణానుగతములగు 2 శృంగములును, కర్ణికయందు శృంగమును తిలకమును, భద్రశృంగములు 4ను, ప్రత్యంగమున 8యును, రేఖపైన 1 శృంగమును, రచించినచో త్రిభువన తిలకమగును. విశ్వకర్మవాస్తు శాస్త్రమున

"చతురశ్రీ కృతేక్షేత్రే అష్టావింశతి భాజితే।
చతుర్భాగైశ్చశాలార్ధం ద్విపదో నిర్గమస్తథా॥ 35
నందికాపద మాత్రేణ నిర్గమస్తు తథైవచ।
చతుర్భిశ్చానుగస్తస్య విస్తరేనిర్గమేణచ॥ 36
భాగైకాకర్ణికాకార్యా నిర్గమో పూర్వమానతః।
చతుర్భిర్భాగైః కర్ణంతు చతుర్ధిక్షుహి స్థాపయేత్॥ 37
శ్రీవత్సస్త్వేవరథికాః తిలకంచ తృతీయకమ్।
కర్ణేచ ప్రతికర్ణేచ కుర్యాచ్చైవం చతుర్దిశి॥ 38
శ్రీవత్సతిలకంచైవ నందికాయాం క్రమద్వయమ్।
భద్రేవైరథికాకార్యా సురూపాలక్షణాన్వితా॥ 39
తదూర్ధ్వే చతుర్భిర్భాగైః ప్రత్యంగౌ వామదక్షిణౌ।
తస్యోర్ధ్వే మంజరీజ్ఞేయా పద్మాకారానువర్తితా॥ 40
షట్త్రింశద్భిస్తుతిలకే కూటాకారః సుశోభనః।
పంచషష్టిభిరండకైః నామ్నాత్రిభువనస్మృతః॥ 41

తా॥ విస్తారమును 28 భాగములుచేసి మధ్య 8 భాగములు శాలయును, శాలయొక్క నిర్గమము 2 భాగములును, దానియిరు వైపుల నంది

కలు 1 1 భాగము విస్తారమును 1.1 భాగము నిర్గమమును, వానిననుస సరించి వరుసగా 4 రథికలు కుంభములవలెను, వాని ప్రక్కను కర్ణిక 1 భాగమును నిర్గమము 1 భాగమును, కర్ణము 4 భాగములును, ఇట్లాం నలువైపుల రచించవలెను. రథికలు శ్రీవత్సమువలె గుండ్రముగాను, చేయు వలెను. మొదటి భద్రమునకు 4 శృంగములును పైభద్రమునకు 3 శృంగ ములును, దానికి ప్రత్యంగములయందు 1.1 శృంగమును కలసి నలు వైపుల 36 తిలకములగును, నందికయందు 2ను, కర్ణమున 2ను, రథికల యందు 1.1 చొప్పునను నలువైపుల మొత్తము అండకములు 64ను శిఖర ము తోగూడ 65ను అగును. దీనిని త్రిభువన తిలకమని చెప్పుదురు. (అనుబంధము 37, 38 పటములు చూడుడు)

## 136. ఇంద్రనీల తిలకము

అపరా. 169వ సూ.

శ్లో॥ తథైవ తుర్యాచ్ఛృంగంచ తిలకం ప్రరథోర్ధ్వతః ।
ఇంద్రనీలస్తదానామ కర్తవ్యః శాంతిమిచ్ఛతా॥ 22

తా॥ పూర్వము చెప్పిన త్రిభువన తిలకమునందు ప్రతిరథమున తిలకమును శృంగమును రచించిన యెడల యింద్రనీల తిలకమగును. విశ్వకర్మవాస్తు శాస్త్రమున "తృతీయ క్రమతః శృంగం తిలకం ప్ర థోద్భవమ్॥ 42 అనగా మూడవ వరుసను శృంగమును ప్రతిరథముపైనను రచించిన యెడల యింద్రనీలమగును. విస్తారము 28 భాగములు 32 తిలక ములును 69 అండకములును కలిగి మిగిలిన పనులన్నియును త్రిభువన తిలకమువలెనే యుండును.

## 137. సర్వాంగ తిలకము

అపరా. 169వ సూ.

శ్లో॥ భద్రేకర్ణేచ శృంగాణి శేషంవై పూర్వవత్ స్థితమ్ ।
సర్వాంగ తిలకోనామ కర్తవ్యః సర్వదైవతే॥ 23

తా॥ భద్రమునను శృంగములును మిగిలిన పనులన్నియును పూర్వమువలెనే చేయవలెను. ఇది సర్వాంగ తిలకము. విశ్వకర్మవాస్తు శాస్త్రమున

"శృణువత్స ప్రవక్ష్యామి సర్వాంగస్యచ లక్షణమ్।
చతురశ్రీకృతే క్షేత్రే ద్వాత్రింశత్పదభాజితే॥ 43
భద్రంచ షట్పదంవత్స చతుర్భాగేన నిర్గమః।
నందికాభాగమేకంస్యాద్ విస్తరేనిర్గమేణచ॥ 44
అగ్రేచ కర్ణికాకార్యా పూర్వమానేన కల్పితా।
శ్రీవత్సే ఇవతిలకం కర్తవ్యంచ చతుర్దిశి॥ 45
భద్రేచరథికాకార్యా తవంగాది విభూషితా।
తదూర్ధ్వే ఉరశ్చత్వారి ప్రత్యంగా వామదక్షిణే
తదూర్ధ్వే మంజరికార్యా సురూపాలక్షణాన్వితా॥ 50
ఘటమామల సారంచ పూర్వమానేన కారయేత్।
త్రిసప్తత్యండకైర్యుక్త స్తిలకాన్యష్ట వింశతిః॥ 51

తా॥ విస్తారమును 32 భాగములుచేసి భద్రము 6 భాగములను అందులో నాల్గవవంతు నిర్గమమును, నందిక 1 భాగమును, నిర్గమము 1 భాగమును, ముందు కర్ణికయును, పూర్వపు కొలతల ప్రకారము చేయవలెను. శ్రీవత్సమునందు జేసినట్లే తిలకములను, భద్రమున రథికలును, వానికి తవంగములును, ఆపైన ఉరోమంజరులను 4ను, కుడియెడమల ప్రత్యంగములును, ఆపైన మంజరియును, కుంభము, ఆమలసారము, మొదలైనవి పూర్వమువలెనే జేయవలెను. తిలకములు 28 యును, అండకము 73ను చేయవలెను. దీనిని సర్వాంగతిలక మందురు.

## 138. సురవల్లభ తిలకము

అపరా. 169వ సూ.

శ్లో॥ శృంగం ప్రతిరథోర్ధ్వేచ రేఖోర్ధ్వే తిలకం శుభమ్।
సురవల్లభ ఆఖ్యాతో ధర్మకామార్థసాధకః॥ 24

తా॥ ప్రతిరథముపైన శృంగమును రేఖపైన తిలకమును రచించినచో సురవల్లభమగును. మఱియు విశ్వకర్మ వాస్తుశాస్త్రమున "కర్ణేషు త్రీణి శృంగాణి త్రీణి ప్రతిరథేతథా। వల్లభశ్చసమాఖ్యాతః సర్వకామార్థ సాధకః 52 పైజెప్పిన రీతిగా విస్తారమును 32 భాగములుచేసి అదేవిధముగా అన్ని

యును చేయవలెను కర్ణమున 3 శృంగములును, ప్రతిరథమున 3 శృంగములును రచించిన యెడల సురవల్లభమగును. తిలకములు 24 ను, అండకములు 29 యును అగును.

## 139. సింహతిలకము

అపరా. 169వ సూ.

శ్లో॥ హర్మ్యాది తిలకే శృంగం కార్యాః పంచాండక స్తథా।
కర్తవ్యః సింహతిలకః పార్వత్యాః శాంతిమిచ్ఛతా॥ 25

తా॥ తిలకమున శృంగమును, 5 అండకములును రచించినచో సింహతిలకమగును. విశ్వకర్మ వాస్తుశాస్త్రమున,

"చతురశ్రీ కృతేక్షేత్రే అష్టభాగైర్విభాజితే ।
శాలార్ధం మధ్యభాగంచ భాగేనైకేననిర్గమః॥ 53
కర్ణౌద్విభాగ ఇత్యుక్త శ్చతుర్దిక్షు వ్యవస్థితః।
తదూర్ధ్వే శిఖరం కార్యం సర్వలక్షణ సంయుతమ్॥ 54
కేశరితిలకశ్చైవ ద్విక్రమాశ్చైవ కర్ణతః।
భద్రేరథికాకార్యా తహగా వామదక్షిణే॥ 55
తదూర్ధ్వే శృంగమేవంచ స్థాపయేచ్చ చతుర్దిశి।
తదూర్ధ్వే శిఖరం కార్యం పద్మాకారం సువర్తితమ్॥ 56
పంచవింశత్యండకైశ్చ చతుర్భి స్తిలకైస్తథా।
నామ్నాతు సింహతిలకః సర్వకామార్థ సాధకః॥ 57

తా॥ విస్తారమును 8 భాగములుచేసి మధ్యశాల 4 భాగములును కర్ణములు 2 భాగముల చొప్పునను చేయవలెను. శాలయొక్క నిర్గమము 1 భాగము చేయవలెను. కర్ణముల పైభాగమునుండి శిఖరమును చేయవలెను. కేశరివలె తిలకమును, రెండవ వరుస కర్ణములపైనను భద్రమున రథికయును ఇరువైపుల తదంగములును రచించవలెను. ఆపైన 1 శృంగమును, ఇట్లు నాలుగు ప్రక్కల రచించవలెను. ఆపైన శిఖరము గుండ్రముగా పద్మమువలెనుండవలెను. అండకములు 25ను, తిలకములు 4ను చేసిరేని సింహతిలకమగును.

# 140. మకరధ్వజ తిలకము

అపరాజిత 169వ సూత్రము

శ్లో॥ పూర్వం భవేద్ భూతిలకః శృంగం పంచాండకం తథా।
మకరధ్వజనామాచ కార్యోరతిపతేరసౌ॥ 26

తా॥ భూతిలకమున శృంగమును 5 అండకములును రచించిరేని మకరధ్వజ తిలకమగును. విశ్వకర్మవాస్తు శాస్త్రమున

"చతురశ్రీ కృతేక్షేత్రే దశదా ప్రవిభాజితే।
కర్ణో భాగద్వయం కార్యః సార్ధభాగేన చానుగః॥ 58
శాలార్ధం సార్ధభాగేన పాదోనభాగనిర్గమః।
కేసరితిలకశ్చైవ వ్యవస్థితః క్రమద్వయాత్॥ 59
ప్రరథం కర్ణమానేన కర్తవ్యం శాస్త్రపారగైః।
భద్రేవైరథికాకార్యా సర్వశోభా సమన్వితా॥ 60
ద్విశృంగం స్థాపయే దూర్ధ్వే ప్రత్యంగా వామదక్షిణే।
తదూర్ధ్వే మంజరీకార్యా సర్వశోభా సమన్వితా॥ 61
సప్తసప్తత్యండకైశ్చ ప్రాసాదో మకరధ్వజః।
తిలకైర్ద్వాదశభిశ్చ ఘంటా కూటసమన్వితః॥ 62
ప్రాసాదేయాదృశం ఛందో మండపేచతదేవహి।
ఈదృశంకురుతేయస్తు సలభేచాక్షయం పదమ్॥ 63

తా॥ విస్తారమును 10 భాగములుచేసి కర్ణములు 2 భాగములు ప్రతిరథము 1½ భాగము, శాల 3 భాగములు, నిర్గమము 3/4 భాగము, కేసరి ప్రాసాదమున జేసినట్లే తిలకములను రెండువరుసలు చేయవలెను. ప్రతిరథము కర్ణముతో సమానముగా యెత్తుండవలెను. భద్రమున రథికయును పైన 2 శృంగములును దాని ఉడియెడమల ప్రత్యంగములను పైన మంజరిని రచించవలెను. 77 అండకములును, 12 తిలకములును, ఘంటకూటము, మొదలయిన వానితో రచింపబడినది మకరధ్వజ తిలకమగును. ప్రాసాదమునకు నిర్ణయించిన కొలతల ప్రకారమే మండపమును గూడ రచించవలెను.

## 141. మంగల తిలకము

అపరా 169వ సూత్రము

శ్లో॥ రంభాతిలక శృంగేషు ప్రకర్తవ్యా నవాండకాః।
తిలకాంతో మంగలోఽసౌ కర్తవ్యః సర్వదైవతే॥ 27

తా॥ లోగడ జెప్పిన రంభాతిలకము యొక్క శృంగములయందు 9 అండకములను కల్పించినచో మంగల తిలకమగును. విశ్వకర్మ వాస్తుశాస్త్రమున-

"మకరధ్వజ ప్రాసాదే కర్తవ్యంతు నవాండకమ్।
కోణే ద్వితీయ శృంగంతు ప్రత్యంగా వామదక్షిణే॥ 64
తస్యోర్ధ్వే మంజరీ కార్యా పద్మాకారా సువర్తితా।
ప్రరథే తిలకంచైవ ఘంటాకూట వ్యవస్థితమ్॥ 65

అనగా మకరధ్వజ ప్రాసాదమున 9 అండకములును కర్ణమున 2వ శృంగమును కుడియెడమల ప్రత్యంగములును దానిపైన మంజరి పద్మమువలె గుండ్రముగను చేయవలెను. ప్రతిరథమున తిలకమును, ఘంట, కూటము మొదలైనవి చేయవలెను. 161 అండకములును 8 తిలకములును చేయవలెను.

## 142. తిలకాఖ్యము

అపరా. 166వ సూ.

శ్లో॥ శృంగాణి చేంద్రతిలకే కార్యాః పంచాండకస్తథా।
తిలకాఖ్య సదానామ కార్యః శాంతిమహోత్సవః॥ 28

తా॥ ఇంద్రతిలకమున శృంగములును 5 అండకములును రచించినచో తిలకాఖ్యమగును. విశ్వకర్మ వాస్తుశాస్త్రమున

"చతురశ్రీ కృతేక్షేత్రే దశభాగ విభాజితే ।
కర్ణేభాగద్వయం కార్యః సార్ధభాగేనచానుగః॥ 66
శాలార్ధం సార్ధభాగేన పాదోనో నిర్గమస్తథా।
తలమానం సమాఖ్యాత మూర్ధ్వమానంచ కథ్యతే॥ 67

కేసరి తిలకేచైవ కర్ణేస్యాత్తు క్రమద్వయం।
కేసరిణం కేసరిణి ప్రతిరథే నియోజయేత్॥ 68
భద్రేచరథికాకార్యా తవంగావామ దక్షిణే।
ఊర్ధ్వేశృంగ ద్వయంతస్య ప్రత్యంగావామదక్షిణే॥ 69
తదూర్ధ్వే మంజరీకార్యా సురూపాలక్షణాన్వితా।
సప్తదశాధికంశత మండకైస్త్రిలకాక్షయోః॥ 70
చతుర్భిస్త్రిలకైర్యుక్తో ఘంటాకూట సమన్వితః॥
ప్రాసాదేయాదృశం ఛందో మండపేచ తదేవహి॥ 71
ఈదృశం కురుతేయస్తు ప్రాసాదం సురవల్లభమ్।
సయాతిపరమం స్థానం యత్రదేవః సదాశివః॥ 72

తా॥ విస్తారమును 10 భాగములుచేసి కర్ణము 2 భాగములు, ప్రతిరథము 1½ భాగము, శాల 3 భాగములు, నిర్గమము ¾ భాగము, తిలకమున కేసరియును, కర్ణమున 2ను, ప్రతిరథమున గూడ కేసరియును భద్రమున రథికయును, వామదక్షిణములయందు తవంగములును, వానికిపైన 2 శృంగములును. కుడియెడమల ప్రత్యంగములును, ఆపైన మంజరియును, 117 అండకములును, 4 తిలకములును, ఘంట, కూటము, కలిగియుండవలెను. ప్రాసాదముయొక్క కొలతల ప్రకారము ముందు మండపమును గూడ రచించవలెను. ఇది పుణ్యలోక ప్రాప్తికరము.

## 143. పద్మతిలకము

అపరా. 169వ సూ.

శ్లో॥ తథా శృంగేషు కర్తవ్యాః సర్వభద్ర నవాండకాః॥
పద్మకోహితదానామ కర్తవ్యః శాంతి శ్రీప్రదః॥ 29

తా॥ తిలకాఖ్యమున చెప్పబడిన 5 అండకములు కాకుండ 9 అండకములును, అంతట భద్రములును రచించిరేని పద్మతిలక ప్రాసాదమగును-

# 144. సోమతిలకము

**అపరాజిత 169వ సూత్రము**

శ్లో॥ మందరే తిలకే శృంగం కర్తవ్యాశ్చ నవాండకాః।
తదాతుసోమ తిలకః కర్తవ్యః సర్వదైవతే॥ 30

తా॥ మందరతిలకమున 9 అండకములతో శృంగమును, శేషించిన పనులన్నియు పూర్వమువలెనే చేసిరేని సోమతిలకమగును. విశ్వకర్మ వాస్తుశాస్త్రమున

"చతురశ్రీకృతే క్షేత్రే సూర్యభాగవిభాజితే।
భాగద్వయం చశాలార్థం చానుగంచ ద్విభాగకమ్॥ 74

కర్ణంద్విభాగ మిత్యుక్తం స్థాపయే ద్విదిశిదిశి।
తలమానం సమాఖ్యాత మూర్ధ్వమానంచ కథ్యతే॥ 75

కర్ణేక్రమద్వయంకార్యం సర్వతోభద్రమేవచ।
సర్వతోభద్ర తిలకం ప్రతిరథం నియోజయేత్॥ 76

కర్ణికాభద్రకోణేచ తిలకైకం నియోజయేత్।
విచిత్రారథికాభద్రే తవంగా వామదక్షిణే॥ 77

తదూర్ధ్వే ఉరః శృంగాణి ప్రత్యంగా వామదక్షిణే।
తదూర్ధ్వేమంజరీకార్యా పద్మాకారా సువర్తితా॥ 78

శతాగ్రే పంచషష్టిశ్చ హ్యండానాం సోమతిలకే।
చతుర్వింశతి తిలకై ర్ఘంటాకూటసమన్వితః॥ 79

తస్యాగ్రేమండఉపః కార్యః ప్రాసాదస్యాంగమాశ్రితః।
ఉర్ధ్వే సంవరణాకార్యా ఘంటాతిలకశోభితా॥ 80

ఈదృశం కురుతేయస్తు ప్రాసాద చ సుశోభనం।
సయాతిపరమం స్థానం యత్రదేవః సదాశివః ॥ 81

తా॥ విస్తారమును 12 భాగములు చేసి శాల 4 భాగములు, ప్రతిరథము 2 భాగములు, కర్ణము 2 భాగములు, ఇట్లు 8 దిక్కులయందును చేయవలెను. కర్ణములు రెండు వరుసలును, భద్రములు కూడ 2 వరు

సలు చేయవలెను. అన్ని భద్రములకు తిలకములును, ప్రతిరథములను కల్పించవలెను. భద్రముయొక్క మూలలయందు కర్ణికలును, తిలకమును ఒక్కదానిని రచించవలెను. భద్రమున విచిత్రమైన రథికను రచించవలెను. కుడియొడమల తవంగములను కల్పించవలెను. అపైన ఉరః శృంగమును దానికిరువైపుల 2 ప్రత్యంగ ములును చేయవలెను. అపైన ప్రధాన శిఖరమును, పద్మమువలె గుండ్రముగా రచించవలెను. 165 అండకములును, 24 తిలకములును, ఘంట, కూటము, మొదలైన వానితో రచించవలెను. దానిముందు మండపమును ప్రాసాదము యొక్క కొలతల ప్రకారమే రచించవలెను. పైన సంవరణను కల్పించవలెను. ఘంట, తిలకము కలిగియుండవలెను. ఇట్లు చక్రగాప్రాసాదమును రచించిరేని వారికి పరమపదము లభించును.

## 145. విజయతిలకము

అపరాజిత పృచ్ఛయందు విజయతిలకము యొక్క లక్షణము ఛందము చెప్పబడలేదు.

విశ్వకర్మ వాస్తుశాస్త్రమున

"శృణువత్స ప్రవక్ష్యామి విజయస్యాతు లక్షణం।
కర్ణాంతాద్గర్భ పర్యంతం భాగాన్ విభక్త్యా యోజయేత్॥ 82
చతురశ్రీ కృతే క్షేత్రే దివాకర విభాజితే।
శాలార్థం ద్విభాగం కార్యం భాగేనైకేన నిర్గమః॥ 83
ద్విభాగశ్చానుగోజ్ఞేయో విస్తరే నిర్గమేణచ।
కోణం ద్విభాగమిత్యుక్తం స్థాపయే ద్విడిశిదిశి॥ 84
తలమానం సమాఖ్యాత మూర్ధ్వమానంచ కథ్యతే।
సర్వతోభద్రతిలకే కర్ణశ్చైవ క్రమద్వయాత్॥ 85
క్రమద్వయం ప్రరథేచ సర్వతోభద్రకాండకమ్।
కేసరీచ సమాఖ్యాతః శృంగం భద్రకర్ణోద్భవమ్॥ 86
అనేనైవతు భాగేన భద్రం గవాక్షభూషితమ్।
మత్తావరణ సంయుక్త మిల్లికాతోరణైర్యుతమ్॥ 87
తస్యోర్ధ్వే రథికాకార్యా చిత్రాగవాక్ష భూషితా।
సంవరణాభిః సంయుక్తా ఘంటాకూట సమన్వితా॥ 88

తస్యోర్ధ్వే ఉరశ్శ్రృంగాణి సురూపా లక్షణాన్వితా।
ప్రత్యంగాయదీ ప్రత్యంగ ఊరుశ్చవామదక్షిణే॥ 89
తదూర్ధ్వే మంజరీకార్యా తవంగైర్బహు కైర్భూషితా।
ప్రాసాదే యాదృశం ఛందో మండపేచ తదేవహి॥ 90
తదూర్ధ్వే సంవరణాచ ఘంటాతిలక సంయుతా।
గజసింహ సమాకీర్ణా నానాభరణభూషితా॥ 91
నవాశీతిః శతాగ్రేచ విజయేచాండకానిచ।
తిలకైర్వింశతిభిశ్చ ఘంటాకూట సమన్వితే॥ 92
ఈదృశంకురుతేయస్తు ప్రాసాదం జయకారకమ్।
విజయం సర్వకార్యేషు శివపుర్యాంస గచ్ఛతి॥ 93

తా॥ విస్తారమును 24 భాగములు చేసి మధ్యశాల 4 భాగములును కర్ణము 2 భాగముల చొప్పున 2.2 కర్ణములును, ప్రతిరథము 2 భాగముల చొప్పున 2.2 ప్రతిరథములును నిర్గమము కూడ 2 భాగములుండవలెను. శాలయొక్క నిర్గమము 1 భాగమును, సర్వతోభద్రము యొక్క తిలకము నందు కర్ణములు 2ను. ప్రతిరథములు కూడ 2ను సర్వతోభద్రములు అండకములతోను కేసరులను రచించవలెను. భద్రకర్ణములకు శృంగము లును, భద్రములకు గవాక్షులును, మత్తావరణమును, ఇల్లికా తోరణము లును, ఆపైన రథికయును చిత్రమైన గవాక్షులతోను, సంవరణలతోను, ఘంట, కూటములతోను రచించవలెను. ఆపైన ఉరశ్శృంగములు 3ను, రెండువైపుల ప్రత్యంగములును, ఆపైన ప్రధానశిఖరమును అనేక తవంగ ములతోను, రచించవలెను ప్రాసాదము కొలతలతో సమానముగ ముందు వైపున మండపమును కల్పించవలెను దానిపైన సంవరణ ఘంటతిలకము ఏనుగులు, సింహములు, అనేకమైన అలంకారములు కలిగి యుండవలెను. కర్ణమునకు 9 చొప్పున 72ను. ప్రతిరథమునకు 5 చొప్పున 80 యును, మంజరులకు 3 చొప్పున 36 ను, ప్రధాన శిఖరమునకు 1యును మొత్తము 189 అండకములును, భద్రమునకు 5 చొప్పున 20 తిలకములును రచించ వలెను. దీనిని విజయ తిలకమందురు ఇది యెల్లప్పుడు జయము నిచ్చు టయేకాక శివలోక ప్రాప్తికరము.

# 146. త్రైలోక్య తిలకము

అపరా. 169వ సూ.

శ్లో॥ పృథ్వీజయేతు శృంగేషు ప్రకర్తవ్యాన వాండకాః।
నామ్నాత్రైలోక్య తిలకః కర్తవ్యః శాంతిమిచ్ఛతా॥ 31

తా॥ పృథ్వీజయము యొక్క శృంగములందు 9 అండకములును రచించిరేని త్రైలోక్య తిలకమగును. విశ్వకర్మ వాస్తుశాస్త్రమున

"శృణువత్స ప్రవక్ష్యామి త్రైలోక్యస్యచ లక్షణమ్।
చతురశ్రీ కృతేక్షేత్రే ద్వాత్రింశత్పదభాజితే॥ 94
కర్ణాంతోగర్భ పర్యంతం విభాగ ఇతి నిశ్చయః।
భద్రంతురసభాగైశ్చ యుగభాగశ్చ నిర్గమః॥ 95
నందికాచంద్రభాగేన విస్తరే నిర్గమేణచ।
ప్రతిరదో వేదభాగైర్నిర్గమేణ తద్దైవచ॥ 96
కర్ణికా ఇందుభాగేన నిర్గమేచేందు భాగికా।
కర్ణంతుయుగ భాగైశ్చ స్థాపయే ద్విదిశిదిశి॥ 97
పీఠోపరిచ సంస్థాప్య భద్రం గవాక్ష భూషితమ్।
మత్తవారణ సంయుక్త మిల్లికావలభైర్యుతమ్॥ 98
ఈదృశంకారయేద్యస్య భద్రం ప్రాసాద భూషణమ్।
తలమానం సమాఖ్యాత మూర్ధ్వమానంచ కథ్యతే॥ 99
కేసరీ సర్వతో భద్రోనందనశ్చ తృతీయకః।
అనుక్రమేణ సంస్థాప్యాః కోణమధ్యే వ్యవస్థితాః॥ 100
నందికాకర్ణికాయాంతు కేశరిణం నియోజయేత్।
తపంగాండైశ్చ సంయుక్త మూర్ధ్వేచ తిలకం భవేత్॥ 101
కేసరీ సర్వతోభద్రో నందనశ్చ తృతీయకః।
ప్రతిరథేచ సంస్థాప్యా చతుర్దిక్షు వ్యవస్థితాః॥ 102
భద్రోర్ధ్వేరథికాకార్యా భద్రం గవాక్ష భూషితమ్।
ఊర్ధ్వే సంవరణాకార్యా ఘంటాతిలక సంయుతా॥ 103

ప్రత్యంగాయది ప్రత్యంగ ఊరుశ్చ వామదక్షిణే।
తదూర్ధ్వే మంజరీకార్యా పద్మాకారానువర్తితా॥ 104
ద్వాత్రింశత్పదమధ్యాచ్చ వింశతి పదభాజితే।
ఏతేభాగాః సమాఖ్యాతా రేఖావిస్తరమాదిశేత్॥ 105
రేఖావిస్తరమానేన సపాదేన తదుచ్ఛ్రయః।
తవంగాండైశ్చ సంయుక్త ఉద్గమోరుభిరాకులమ్॥ 106
ఘటంసామలసారంచ కర్తవ్యంతు సుశోభనమ్।
పతాకాం కర్కరీం దృష్టిం పూర్వమానేన కల్పయేత్॥ 107
ప్రాసాదే యాదృశం ఛందో మండపేచ తదేవహి।
ఊర్ధ్వే సంవరణా కార్యా ఘంటాకూటైశ్చ సంయుతా॥ 108
గజసింహమరాలైస్తు మునివిద్యాధరైర్యుతమ్।
ఈదృశంచైవ సంధ్యస్తు ప్రాసాదం భువనోపమమ్॥ 109
అథర్వవేదలోకేన కర్తుః కారాపకైః సమః।
అతిసాకామ్యవాప్నోతి స్వర్గోత్పత్తిశ్చ దేవతా॥ 110
అన్యథాకురుతేయస్తు సశిల్పేచాల్పబుద్ధిమాన్॥ 111

తా॥ చతురశ్ర ప్రదేశమును 32 భాగములుచేసి కర్ణము యొక్క తుదినుండి గర్భమువరకు భాగములు చేయువలయును. భద్రము 6 భాగములును 4 భాగములు నిర్గమమును, నందిక 1 భాగమును, నిర్గమము 1 భాగమును, ప్రతిరథము 4 భాగములును నిర్గమము 4 భాగములును కర్ణిక 1 భాగమును నిర్గమము 1 భాగమును, కర్ణము 4 భాగములును, ఇట్లు నలువైపుల మూలలయందు నిలుపవలెను. ముందుగా పీఠమును రచించి దానిపై భద్రమును గవాక్షములతోసహా రచించవలెను. భద్రము పైన మత్తవారణమును ఇల్లిక చుట్టూ రచించవలెను. మొదటి వరుస కేసరి పద్ధతియును, రెండవవరుస సర్వతోభద్ర పద్ధతియును, మూడవ వరుస నందన పద్ధతియును, ఇట్లు కర్ణములను రచించవలెను. నందికలు కర్ణికలు కేశరి పద్ధతితోనే చేయువలెను. తవంగము అండకములతో రచించ వలెను. పైన శృంగమునుంచవలెను. ప్రతిరథములకు కేసరి, సర్వతోభద్ర నందన, ఈమూడు పద్ధతులు 3 వరుసలయందు నలువైపుల రచించ

వలెను. భద్రముపైన రథికయును భద్రమున గవాక్షములును పైన సంవరణములు ఘంట, కలశమును రచించవలెను. ఉరోమంజరి యొక్క యిరువైపుల రథములును గాని రథికలను గాని రచించవలెను. ఆపైన పద్మమువలె గుండ్రముగా ప్రధానశిఖరమును రచించవలెను. దాని మధ్యను 20 భాగములు చేసి దిగువ రేఖను విస్తరము చేయవలెను. రేఖా విస్తారమానమునకు పాతికవంతు యెక్కువచేసి యెత్తును చేయవలెను తవంగము అండకములు కలిగి యుండవలెను, ఎత్తైన ఉరోమంజరులను కల్పించవలెను. కుంభము. అమలసారముతోసహ రచించవలెను, పతాకను పైబొమిడికమును పూర్వము చెప్పినట్లే గట్టిగా నిర్మించవలెను. మఱియు ప్రాసాదము యొక్క కొలతలను బట్టి ముందు మండపమును రచించవలెను. పైన సంవరణ, ఘంటకూటము, ఏనుగులు, సింహములు, హంసలు మునులు, విద్యాధరులు మొదలగు నానావిధాలంకారములతో నుండవలెను. ఇట్లు రచించబడిన ప్రాసాదము త్రైలోక్య తిలకమనిపించుకొనును. దీనిని నిర్మించినవారు ఇష్టసిద్ధులను పొందుటయేకాక పుణ్యఫలమునను భవింతురు. శాస్త్రమునను సరించక నిర్మించిన శిల్పి అల్పబుద్ధి గలవాడనిపించుకొనును. (అనుబంధము 30, 40 పటములు చూడుడు)

## 147. స్త్రీసంజ్ఞ కవలభీ ప్రాసాదములు 25 అందు 1 అంతస్తు కలవి 6

అపరా. 169వ సూ.

శ్లో॥ అయుతశ్చండకాః కార్యా అఘంటో భూమికాక్రమః॥
గజపృష్ఠాకృతికుటీ వలభీ సర్వకామదా॥ 37

తా॥ విస్తారమును భాగములును ఎత్తును పూర్వపు కొలతల ప్రకారమే చేసి ఘంటలేకుండ ఏనుగుయొక్క వీపువలె నడుము మెరకగాను పైన బుడిపియును రచించిరేని వలభిప్రాసాదమగును.

విశ్వకర్మోవాచ.

అపరా. 170వ సూ

శ్లో॥ అథాతః సంప్రవక్ష్యామి స్త్రీసంజ్ఞానమరాలయాన్।
వలభ్యన్వయ విఖ్యాతా నాయతాన్ శుభలక్షణాన్॥ 1
నందినీ హస్తినీచైవ శాంతాచకుముదోద్భవా।
హంసినీ హంసతిలకా శృంగారాచాబ్జ మంజరీ॥ 2
కుముదాస్వస్తికారమ్యా మాహేంద్రీ పర్యంతకే।
అశోకాచంపకా ఖ్యాతా వసంతానక్రకేతకీ॥ 3
గాంధారీ సర్వతోభద్రా వర్ధమానీశ్రీ శైలజా।
నంద్యావర్తీ మహాకాంతి ర్మేరుకూటాభిధానకా॥ 4
త్రైలోక్య తిలకాచైవ విఖ్యాతాః పంచవింశతిః।
ఇత్యుక్తావలభీ సంజ్ఞాః స్త్రీలింగాశ్చ ప్రకీర్తితాః॥ 5

తా॥ వలభీ ప్రాసాదములు **25.** చతురాశ్రాయతములు కలవి. నందిని, హస్తిని, శాంత, కుముదోద్భవ, హంసిని, హంసతిలక, శృంగార, అబ్జమంజరి, కుముద, స్వస్తిక, రమ్య, మాహేంద్రి, పర్యంతకి, అశోక, చంపక, వసంత, నక్రకేతకి, గాంధారి, సర్వతోభద్ర, వర్ధమాని. శ్రీశైలజ, నంద్యావర్తి, మహాకాంతి, మేరుకూట, త్రైలోక్యతిలక అను నామములు కలవి. వానియొక్క లక్షణములను చెప్పుచున్నాడు. అందు ఒక్క అంతస్తు కలవి 6. ఏవియనగా-

శ్లో॥ చతుర్భాగశ్చ విస్తార ఆయతం పంచభాగికమ్।
భిత్తిర్భాగా శుభోరమ్యో గర్భః షట్పద ఉచ్యతే॥ 6
గర్భతుల్యా స్కంధవేదీ ఘంటాస్కంధా కృతిర్భవేత్।
వేద్యూర్ధ్వేచైవ వలభీ గజపృష్ఠాకృతిర్భవేత్॥ 7
త్రిభాగం పృష్ఠ భద్రంచ ద్విభాగం పక్షభద్రకం।
హస్తినీచ సమాఖ్యాతా కర్తవ్యా సర్వకామదా॥ 8
వామదక్షిణతోలేఖ్యా పురః పృష్ఠేత కారికా।
శుకనాసాగ్రతః ఖ్యాతా నందినీ సర్వకామదా॥ 9
కర్ణే వార్యంతరం కార్యం భద్రేభద్రేత కారికా।
శాంతాసాచసమాఖ్యాతా కూటాక్ష సర్వకామదా॥ 10

వార్యంతరం భద్రమధ్యే సాభవేత్కుముదోద్భవా।
యథా భద్రేతథా కర్ణేహంసినీ సర్వకామదా॥ 11
పృష్ఠభద్రే ముఖభద్రం సాహంసతిలకామతా।
తలచ్ఛందేషుచాద్యేషు వలభీషట్కమేవచ॥ 12

తా॥ విస్తారము 4 భాగములును, ఆయతము 5 భాగములును చేసి చుట్టూగోడ 1 భాగము రచించిరేని మధ్య 2 భాగములు విస్తారమును 3 భాగముల పొడవునుగల గర్భమగుచున్నది. ఆ గర్భముతో సమానముగా స్కంధవేదికను ఘంటస్కంధము వలెను రచించవలెను వేదికపైన వలభి యేనుగుయొక్క వీపువలె మిట్టుగా నుండవలెను, చుట్టూ నలువైపుల తకార రూపములను చిత్రించవలెను. ముందు శుకనాసను రచించిరేని. నందినియగును. వెనుకవైపున 3 భాగములు భద్రమును 2 భాగములు ప్రక్కలయందు భద్రములను రచించినయెడల హస్తినియగును. కర్ణము నందు జలమార్గమును కల్పించి కర్ణములను గుండ్రముగాను చేసి అన్ని భద్రములందును తకారికలను కల్పించినచో శాంతయగును. భద్రము యొక్క నడుమ జలమార్గమును కల్పించునచో మేముదోద్భవయగును. అటులే కర్ణములందును జలమార్గములను కల్పించిరేని హంసినియగును. వెనుక భద్రమున ముఖభద్రమును రచించినయెడల హంసతిలకయగును ఈ 6ను ఒక్క అంతస్తు కలవి.

## 148. మూడంతస్తులుగల ప్రాసాదములు 7

అపరా. 176వ సూ.

శ్లో॥ షడ్భాగశ్చైవ విస్తార ఆయామోఽష్టాంశ ఏవచ।
సార్ధభాగాభవేద్భిత్తిః శేషం గర్భగృహం భవేత్॥ 13
కర్ణకూటాని కార్యాణి భూమికాత్రయమేవచ।
తదూర్ధ్వేవేదికాస్కంధో వలభ్యశ్చతదూర్ధ్వతః॥ 14
చతుర్భాగం పృష్ఠభద్రం తదర్ధం వామదక్షిణే।
అర్ధభాగస్తునిష్కాసః కర్ణేస్యాదుదకాంతరమ్॥ 15

భద్రే భద్రే చవలభీ వారాటాకూట ఘంటికా।
శృంగారాచతదానామ దుర్లభాదేవదానవైః॥ 16
అర్ధభాగాభద్ర కర్ణీ భవేత్కుముదమంజరీ।
ఇద్రేఽంబుమార్గైఃకుముదా స్వస్తికా కర్ణసాదృశైః॥ 17
పృష్ఠభద్రేముఖభద్రం రమ్యానామతథోచ్యతే।
పక్షభద్రేముఖభద్రం మాహేంద్రీ సర్వకామదా॥ 18
పృష్ఠభద్రేప్రతిభద్రం నామ్నాపర్యంతకీమతా।
ద్వితీయ తలచ్ఛందేషు వలభీ సప్తకం తథా॥ 19

తా॥ విస్తారము 6 భాగములు, పొడవు 8 భాగములుచేసి చుట్టూ గోడ $1\frac{1}{2}$ భాగము చేయగా శేషించినది గర్భమగును. (3.5 భాగముల గులు) కర్ణములందు కూటములను మూడు అంతసులు చేసి ఆపైనవేదిక స్కంధము పైన వలభిని చేయవలెను. వెనుకవైపున భద్రము 4 భాగములును. కుడియెడమల 2.2 భాగముల చొప్పునను నిర్గమము $\frac{1}{2}$ భాగమును, కర్ణమున జలమార్గమును అన్నిభద్రములందు వలభియును, వరాటపద్ధతితో కూటములు ఘంటయును, రచించిరేని శృంగారయగును. భద్రములయందు కర్ణికలు $\frac{1}{2}$ భాగమును చేసిరేని కుముదమంజరియగును భద్రమున జలమార్గమును కల్పించినచో కుముదయగును. కర్ణములతో సమానముగా చేసిన జలమార్గములు కలది స్వస్తికయగును. పృష్ఠము నందలి భద్రమున ముఖభద్రమును రచించినయెడల రమ్యయగును. ప్రక్కలియందలి భద్రములకు ముఖభద్రములను రచించినచో మాహేంద్రి యగును. వెనుక భద్రమునందు ప్రతిభద్రమును రచించినయెడల పర్యంతకి యగును. ఈ 7ను మూడంతస్తులుగల ప్రాసాదములు.

## 149. అయిదంతస్తులుగల ప్రాసాదములు 6

అపరా. 176వ సూ.

శ్లో॥ అష్టభాగశ్చ విస్తార ఆయామోదశ భాగికః।
ద్విభాగోభిత్తి విస్తారః శేషంగర్భగృహం భవేత్॥ 20

ద్విభాగః కర్ణవిస్తార ఉదకాంతర భూషితః।
త్రిభాగం భద్రమిత్యుక్తం భద్రార్ధే ప్రరధో భవేత్॥ 21
భాగార్ధం నిర్గమం కుర్యాద్ రధే ప్రతిరథేఽథవా।
త్రిభాగం కుక్షిభద్రం చ భాగార్ధేపక్ష కర్ణికా॥ 22
గర్భతుల్యోచ్ఛ్రితావేదీ పంచభూమాహితా తథా।
రధోపరథకర్ణేతు కూటైశ్చ వివిధైః క్రమాత్॥ 23
వేదూర్ధ్వేవలభిచైవ హ్యాలేఖ్యా వామదక్షిణే।
అశోకానామ విఖ్యాతా సంసారశోకత్రాసినీ॥ 24
వార్యంతరం ప్రతిరథే చంపకా సర్వకామదా।
భద్రోదకైర్వసంతాస్యాతి కర్ణే మకరకేతకీ॥ 25
పునః కార్యం ప్రతిరథే గాంధారీ సర్వకామదా।
భద్రే భద్రే ప్రతిభద్రం సర్వతోభద్రికా భవేత్॥ 26

తా॥ విస్తారము 8 భాగములు, నిడుపు 10 భాగములుచేసి చుట్టూ గోడ 2 భాగములుచేయగా 4 భాగముల వెడల్పును 6 భాగముల పొడవునుగల గర్భమేర్పడును. కర్ణము 2 భాగములు; జలమార్గముతోను, భద్రము 3 భాగములు, ప్రతిరథము $1\frac{1}{2}$ భాగమును, భద్రమునకును ప్రతిరథమునకును నిర్గమము $\frac{1}{2}$ భాగమును, ప్రక్క భద్రము 3 భాగములును, దాని ప్రక్క కర్ణికలు $\frac{1}{2}$ భాగము చొప్పునను, గర్భముతో నమానముగా వేదికయును అయిదంతస్తులును, భద్రము, ఉపరథము, కర్ణము వీనియొక్క శిఖరములు అనేక విధములుగా చేయువచ్చును. వేదిక పైన వలభియును, దానికిరువైపుల అలేఖ్యమును. కలది అశోక యగును. ప్రతిరథమున జలమార్గమున్నచో చంపకయగును, భద్రమున జలమార్గము కలది వసంతయగును. కర్ణమున జలమార్గము కలడి మకరకెతకియగును. ప్రతిరథమునగూడ జలమార్గము కల్పించినయెడల గాంధారి యగును. భద్రములన్నిటి యందును ప్రతిభద్రములు కలిగినచో సర్వతోభద్ర యగును. ఈ 6ను అయిదంతస్తులు గల ప్రాసాదములు.

## 150. ఏడంతస్తుల ప్రాసాదములు 6

అపరా. 176 సూ,

శ్లో॥ దశభాగశ్చ విస్తార ఆయామశ్చ ద్విసప్తకమ్।
త్రిభాగాచ భవేద్భిత్తిః శేషంగర్భగృహం భవేత్॥ 27

ద్విభాగః కర్ణవిస్తారః సార్ధః ప్రతిరథో భవేత్।
ద్వితీయస్తే నమానేన భద్రం వేదాంశ విస్తరమ్॥ 28
త్రిభాగోభద్ర విస్తారో భాగార్ధం పక్ష కర్ణికా।
కుక్షిభద్రంత్రిభిర్భాగై స్తదర్ధః ప్రరథో భవేత్॥ 29
గర్భతుల్యోర్ధ్వ వేదీచ భూమికాసప్తచోచ్ఛ్రితాః।
వరాటైర్ద్రావిడైః కూటై ర్నాగరైశ్చ విశేషతః॥ 30
వర్ధమానీతదానామ వందితా త్రిదశైరపి।
భద్రోదకైః శ్రీశైలజా నంద్యావర్తి కర్ణోదకైః॥ 31
వార్యంతరం ప్రతిరథే మహాకాంతిశ్చ కామదా।
మేరుకూటాభిధానంచ కర్ణేకుర్యాచ్చ భద్రకమ్॥ 32
త్రైలోక్య తిలకాఖ్యాతా భద్రే చేత్త్రతి భద్రకమ్।
స్త్రీసంజ్ఞకాశ్చ ప్రాసాదా వలభ్యః పంచవింశతిః॥ 33
వరాటేకూటోదయత ఊర్ధ్వమానం విభజ్యతే।
ఏషాం యుక్త్యా విధాతవ్యాః ప్రాసాదాః సర్వకామదాః॥ 34

ఇతిసూత్ర సంతానగుణ కీర్తిప్రకాశప్రోక్త శ్రీ భువనదేవాచార్యోక్త పరాజిత పృచ్ఛాయాం స్త్రీసంజ్ఞక వలభీప్రాసాదాధికారో నామషట్ సప్తత్యుత్తర శతతమం సూత్రమ్.

తా॥ విస్తారము 10 భాగములు, ఆయామము 14 భాగములు చేసి చుట్టూ గోడ 3 భాగములు రచించినయెడల లోపల విస్తారము 4 భాగములును పొడవు 8 భాగములునుగల గర్భమేర్పడును. కర్ణము 2 భాగములు ప్రతిరథము $1\frac{1}{2}$ భాగము చొప్పున రెండును భద్రము 4 భాగములు చేయవలెను. మఱియు భద్రమును 3 భాగములుచేసి దాని ప్రక్కల కర్ణికలు $\frac{1}{2}$ భాగము చొప్పున రచించవలెను. ప్రక్కభద్రము 3 భాగములును, ప్రతిరథము $1\frac{1}{2}$ భాగమును చేయవలెను గర్భముతో సమానముగా పైన వేదికను రచించవలెను. 7 అంతస్తులుండవలెను వరాటపద్ధతిగాని, ద్రావిడపద్ధతిగాని, నాగరపద్ధతిగాని శిఖరములకు చేయవచ్చును. ఇట్లు చేయబడినది వర్ధమానియగును. దానికే భద్రముల జలమార్గముంచినచో శ్రీశైలజ

యగును. కర్ణమున జలమార్గమున్నయెడల నంద్యావర్తయగును. ప్రతిరథమున జలమార్గమును కల్పించినచో మహాకాంతియగును. కర్ణమున భద్రమును రచించిన యెడలమేరు కూటయగును. భద్రమున ప్రతి భద్రమును రచించినయెడల త్రైలోక్య తిలకయగును. ఈ 6ను ఏడంతస్తుల ప్రాసాదములు. ఇట్లు మొత్తము 25 స్త్రీసంజ్ఞగల ప్రాసాదములు విభజింపబడి యున్నవి. (అనుబంధము 41 నుండి 46 వఱకుగల పటములు చూడుడు)

# 151 సింహావలోకన ప్రాసాదములు 25

## అందు పుష్పకము మొదలగు 5

విశ్వకర్మోవాచ.

అపరా. 177వ సూ

శ్లో॥ ప్రాసాదాన్ సంప్రవక్ష్యామి జాత్యాసింహావలోకనాన్।
ఛాద్యోద్గమేషు ఘంటాభిః సింహకర్ణైరనేకధా॥ 1
పుష్పకోభద్ర పద్మాఖ్యౌ నందశ్చనంద్యావర్తకః।
సర్వతోభద్ర సింహౌచ మందరః పుష్పభద్రకః॥ 2
కైలాసశ్చజయః కాంతో మనోహృచ్చారు వర్ధనః।
సంభవోరత్న కూటశ్చ తారాగణ సులోచనౌ॥ 3
హిమవాన్ హేమకూటశ్చ పృథ్వీజయ సుమిశ్రకౌ।
ఐరావతోహంస పక్షః పక్షిరాటో పుష్పకోదయః॥ 4
దారుకర్మాణరాజితాశ్చ దారుజాః పంచవింశతిః।
ద్వారచ్ఛాద్యవలామపాత ఘంటాద్యైః సింహకర్ణకైః॥ 5
చతురశ్రీ కృతేక్షేత్రే చాష్టధాప్రవిభాజితే ।
భాగోభాగాభ్రమోభిత్తి స్తథా స్యుర్మధ్యభిత్తయః॥ 6
శేషంగర్భగృహం కుర్యాద్ విస్తారసముచ్ఛ్రితమ్।
మధ్యగర్భంభిత్తిసూత్రే భ్రమంతి స్తంభమోక్షయోః॥ 7
సూత్రమానాయుతం కుర్యా న్మండపంసమసూత్రకైః।
ఏకం ద్వారంత్రిణివాఽపి భద్రే చంద్రావలోకనమ్॥ 8

తత్రఛాద్య త్రయంకార్యం చత్వారః సింహకర్ణకాః,
ఊర్ధ్వేఘంటాతథైవైక పుష్పకః సర్వకామదః॥
ద్విభాగః కర్ణవిస్తారో భద్రంభాగ చతుష్టయమ్।
నిర్గమంచైక భాగేన సర్వ భద్రేష్వయం విధిః॥ ]
అష్టైవసింహకర్ణాశ్చ ప్రతికర్ణాష్ట కంతథా।
భద్రకోనామ విఖ్యాతః సర్వదాభద్రకారకః॥ ]
భద్రంతు కర్ణికాయుక్తం చతుర్భిః సింహకర్ణకైః
పద్మకస్తు సమాఖ్యాతః కర్తవ్యః సర్వదైవతే॥ ]
నిర్గమోభద్రభాగశ్చ సీమామానేన విస్తరః।
నందనః ససమాఖ్యాతో నంద్యావర్తః ప్రభద్రకే॥ ]

తా॥ సింహావలోకన ప్రాసాద లక్షణము. "ఛాద్యఛాద్యోర్ధ్వః ఊర్ధ్వం సింహకర్ణైర్విభాషితాః. ఘంటాఘంటా కృతిం కుర్యాదిత్థం సిం: వలోకనాః" (అని అపరా. 10వ సూ. 39వ శ్లో) అంతస్తులు వరుస గావి చుచు సింహకర్ణములనుపైన ఘంటయును రచింపబడునవి సింహావలోక ప్రాసాదములు. పుష్పకము, భద్రము, పద్మము, నందము, నంద్యావర్తమ సర్వతోభద్రము, సింహము, మందరము, పుష్పభద్రము, కైలాసమ జయము, కాంతము, మనోహరము, చారువర్ధనము, సంభవము, రత కూటము, తారాగణము, సులోచనము, హిమవంతము, హేమకూటమ పృథివీజయము, మిశ్రకము, ఐరావతము, హంసపక్షము, గరుడము, అ: 25 నామములు కలిగియున్నవి. ఇవి దారుకర్మజములు. చతురశ్ర ప్రదే మును 8 భాగములుచేసి గోడ 1 భాగము, భ్రమము 1 భాగము, లోప గోడ 1 భాగము, మిగిలిన 2 భాగములు గర్భము చేయవలెను. విస్తా ముతో సమానముగా యెత్తును చేయవలెను. గోడలతో సమానము సూత్రమునుపట్టి స్తంభములను కల్పించి నలుచదరముగా అదే కొలత మండపమును ముందు భాగమున రచించవలెను. ద్వారము 1 గాని లే 3 గాని చేయవచ్చును. భద్రమున చంద్రావలోకనమును, ఛాద్యము 3ను, సింహకర్ణములు 4ను రచించవలెను. అపైన ఘంటను రచించిరే పుష్పకమగును. కర్ణముయొక్క విస్తారమును 2 భాగములుచేసి భద్రవ

4 భాగములును నిర్గమము 1 భాగమును, ఇట్లునలువైపుల రచించి సింహ కర్ణములు 8 కల్పించినయెడల భద్రమగును. భద్రముల యందు కర్ణిక లను రచించి 4 సింహకర్ణములను చేసినచో పద్మమగును. భద్రమున 1 భాగము నిర్గమముచేసి సీమను కల్పించిన యెడల నందనమగును. భద్ర మున ప్రతిభద్రమును రచించినట్లయిన నంద్యావర్తమగును.

## 152. సర్వతోభద్రము మొదలగు 4

అపరా. 177వ సూ.

శ్లో॥ విభక్తేదశధాఛందే ద్విభాగః కర్ణవిస్తరః ।
త్రిభాగంచ భవేద్భద్రం భద్రార్ధం ప్రరథ స్తథా॥ 15
భాగోభాగాభ్రయోభిత్తిః శేషంగర్భగృహంమతమ్।
మండపంపూర్వ మాఖ్యాతం స్తంభానాంగర్భ సూత్రతః॥ 15
సింహకర్ణాస్తతశ్చాష్టౌ ప్రతికర్ణాశ్చషోడశ।
పంచఘంటా సమాయుక్తం సర్వతోభద్రలక్షణమ్॥ 16
మల్లచ్ఛాద్యంఖ్యాతమూర్ధ్వే సింహనామః స ఉచ్యతే।
మందరోనవ ఘంటాఢ్యః పుష్పభద్రః ప్రభద్రకే॥ 17

తా॥ విస్తారమును 10 భాగములు చేసి కర్ణము 2 భాగములును భద్రము 3 భాగములును, ప్రతిరథము $1\frac{1}{2}$ భాగమును చేయవలెను. గోడ 1 భాగమును, భ్రమము. 1 భాగమును, లోపలిగోడ 1 భాగమును, చేయుగా మధ్య 4 భాగమును గర్భమగును దానిముందు మండపమును గర్భముతో సమానముగా నూలుపట్టి స్తంభములను నిలుపవలెను. సింహ కర్ణములు 8 ప్రతికర్ణములు 16 ఘంటలు 5. ఇట్లు రచించిరేని సర్వతో భద్రమగును. పైన మల్లచ్ఛాద్యమును రచించినయెడల సింహమగును, ఘంటలు 9 రచించిరేని మందరమగును. భద్రములయందు ప్రతి భద్ర ములను రచించినచో పుష్పభద్రమగును

## 153. కైలాసము మొదలగు 3

అపరాజిత 177వ సూత్రము

శ్లో॥ భక్తే ద్వాదశధా ఛందే ద్విభాగో కర్ణవిస్తరః।
కర్ణతుల్యః ప్రతిరథః శేషం యుంజీత పూర్వవత్॥ 18
భద్రం వేదాంశ విస్తారః భద్రే చంద్రావలోకనం।
త్రిచ్ఛాద్యం మల్లచ్ఛాద్యోర్ధ్వే కైలాసోనవ ఘంటకః॥ 19
భద్రేదధ్యాత్ ప్రతిభద్రం సింహకర్ణాశ్చ షోడశ।
జయంతోనామ విఖ్యాతః కాంతః స్యాత్ ప్రతిభద్రకే॥ 20

తా॥ విస్తారమును 12 భాగములు చేసి కర్ణము 2 భాగములును. ప్రతిరథము 2 భాగములును, భద్రము 4 భాగములును చేయవలెను. గోడ 1 భాగము, భ్రమము 1 భాగము, లోపలిగోడ 1 భాగమునుచేసి మిగిలినది గర్భము చేయవలెను. భద్రమున చంద్రావలోకనమును, పైన 3 చాద్యములును మల్లఛాద్యము ఆపైన 9 ఘంటలును రచించిరేని కైలాస మగును. భద్రములందు ప్రతిభద్రములను 16 సింహకర్ణములను రచిం చినచో జయంతమగును. ప్రతిభద్రములకుగూడ సింహములను రచించిన యెడల కాంతమగును.

## 154. మనోహరము మొదలగు 6

అపరా. 17౭వ సూ.

శ్లో॥ చతుర్దశ విభక్తేచ ద్విభాగా బాహ్యభిత్తయః।
విధేయం పూర్వవచ్ఛేషం షడంశోభద్ర విస్తరః॥ 21
మల్లచ్ఛాద్యే పంచఛాద్యం శాంతిదః స్యాన్మనోహరః।
చారువర్ధనః ప్రభద్రే సంభవః పక్షకర్ణికః॥ 22
ప్రరథాంతే యదాకర్ణి రత్నకూటః సనామతః।
తారాగణో ద్విఘంటాస్యాద్ ద్వికర్ణశ్చ సులోచనః॥ 23

తా॥ విస్తారమును 14 భాగములుచేసి వెలుపలి గోడ 2 భాగము లును, భ్రమంతిక 1 భాగమును లోపలిగోడ 1 భాగమును చేయగా గర్భము 6 భాగములుగను భద్రము 6 భాగములును మిగిలినవి పూర్వము

వలెనే చేయవలెను. మల్లచ్ఛాద్యమున 5 ఛాద్యములును రచించిన యెడల మనోహరమగును. ప్రతిభద్రములను రచించినచో చారువర్ధనమగును. ప్రక్కలయందు కర్ణికలను కల్పించినచో సంభవ మగును. ప్రతిరథముల యొక్క చివర కర్ణికలుంచిన యెడల రత్నకూటమగును. రెండుఘంటలను రచించినయెడల తారాగణమగును. కర్ణములు 2.2 చొప్పున రచించిరేని సులోచనమగును.

# 155. హిమవంతము మొదలగు 7

అపరా. 177వ సూ.

శ్లో॥ భక్తేషోడశధాఛందే ద్విద్వ్యంశాభ్రమభిత్తయః।
శేషం గర్భం ప్రకుర్వీత పూర్వమాన ప్రకల్పితమ్॥ 24
మల్లచ్ఛాద్యే సప్తచ్ఛాద్యం ఘంటాః సప్తదశైవచ।
హిమవాంశ్చతదానామ పూజ్యఃసురసరోరగైః॥ 25
సింహకర్ణద్వికం కుర్యాత్ హేమకూటః ఉచ్యతే।
భద్రంచ కర్ణికాయుక్తం కామదః పృథివీజయః॥ 26
మిశ్రకోఽంబ్వంతరే కర్ణం భద్రే ఐరావతస్తథా।
భద్రార్ధేచైవ నిష్కాసో హంసపక్షస్తు నామతః॥ 27
ద్వినిర్గమః పక్షిరాజః కర్తవ్యః సర్వకామదః।
దారుచ్ఛందేషు చేత్యుక్తాః పుష్పాద్యాః పంచవింశతిః॥ 28

ఇతి సూత్ర సంతానగుణకీర్తి ప్రకాశప్రోక్త శ్రీ భావనదేవాచార్యోక్తా పరాజిత పృచ్ఛాయాం సింహావలోకన ప్రాసాదనిర్ణయాధికాలోనామ సప్తసప్తత్యుత్తర శతతమం సూత్రమ్.

తా॥ విస్తారమును 16 భాగములుచేసి భ్రమము 2 భాగములు గోడలు 2.2 భాగములు చేయగా మధ్య 4భాగములు గర్భముండును. మల్లచ్ఛాద్యమున 7 ఛాద్యములను కల్పించి 17 ఘంటలను రచించినచో హిమవంతమగును. అందు 2 సింహకర్ణములను చేసినయెడల హేమకూటమగును. భద్రమున కర్ణికలను కల్పించినట్లయిన పృథివీజయమగును.

జలాంతరములను రచించిన యెడల మిశ్రకమగును. భద్రమున శష్ట మున్న ఐరావతమగును, భద్రములో సగము నిర్గమమును చేసినయెడల హంసపక్షమగును. రెండు నిర్గమములను రచించినయెడల గరుడమగును. ఈ 25ను దారు నిర్మాణములు.

## 156. అపరాజితుని విమానజాతి 64 ప్రాసాదములు అందు శివప్రాసాదములు 8

అపరా. 106వ సూ.

శ్లో॥ భూమిజచ్ఛందకాఖ్యాతా స్తవైశ్చచతురశ్రకాః।
రథోపరథభద్రాద్యై విమానాః సర్వకామదః॥ 32

తా॥ భూమిజ ప్రాసాదముల కొలతలతోనే అంతస్తులును సమచతురస్ర మును కలిగి రథములు ప్రతిరథములు భద్రములు మొదలగువానితో రచింపబడినవి విమానజాతి యగును.

అపరా. 179వ సూ.

శ్లో॥ నామానికథితాన్యేషం లక్షణంశ్రుణు.సాంప్రతమ్।
విభక్తిభాగ సంఖ్యాశ్చ తలచ్ఛందోర్ధ్వమానతః॥ 17
దశధాభాజితేక్షేత్రే ద్విభాగః కర్ణవిస్తరః ।
పంచభాగం భవేద్భద్ర మర్ధభాగాతుకర్ణికా॥ 18
కర్ణేశృంగాణి కార్యాణి భూమిజానామనుక్రమైః॥
ఘంటాకలశ సంయుక్తో విమానః పంచభూమికః॥ 19
భద్రేచైవోద్గమాః పంచ కర్ణే శృంగాణిచాష్టహి।
నాగరచ్ఛందజః కార్యః సర్వభద్రోనవాండకః॥ 20
తస్యాపిభద్రజం శృంగం గజపృష్టస్తు కామదః।
ద్వ్యష్టకర్ణః పంచభూమో విమానభద్రః పద్మకః॥ 21
కేశరీపూర్వవజ్ఞేయః కర్ణేతిలక శృంగకైః।
విమానజంచ శిఖరం వృషభః సర్వకామదః॥ 22

సర్వాభద్రే కర్ణభద్రం నష్టాంగం మూలనాసికమ్,
ముక్తకోణః సవిజ్ఞేయః సర్వకామఫలప్రదః॥ 23
గజపృష్ఠే ద్వ్యురుశృంగం కర్తవ్యం సర్వకామదం।
నలినీకః సవిజ్ఞేయః కర్తవ్యస్త్రిపురాంతకే॥ 24
మల్లతలం భూమిజవద్ ద్రావిడకర్మ చర్చితః।
ద్రావిడస్తు తదానామ కర్తవ్యస్తు మహేశ్వరే॥ 25

తా॥ శివప్రాసాదములు 8 నిర్మించు లక్షణములను చెప్పుచున్నాడు విస్తారమును 10 భాగములుచేసి కర్ణము 2 భాగములు, భద్రము 5 భాగములు, కర్ణిక ½ భాగము, కర్ణమున శృంగములును, వరుసగా ఘంట, కలశము మొదలైనవి 5 అంతస్తులతో రచించి రేని విమానమగును. భద్రమున 5 శృంగములును, కర్ణములు 8యును, నాగర పద్ధతియును. 9 అండములును కలది సర్వతోభద్రమగును, భద్రమున శృంగమును రచించిన యెడల గజపృష్ఠమగును. కర్ణములు 16ను అంతస్తులు 5ను భద్రమున విమానమును రచించినయెడల పద్మకమగును. కేశరిని రచించి కర్ణమున తిలకమును శృంగమును. శిఖరము విమాన పద్ధతిగను రచించినచో వృషభమగును. కర్ణములు లేకుండ 4 భద్రములను రచించి ప్రధాన నాసికను కల్పించిన యెడల ముక్తకోణమగును. గజపృష్ఠమున ఊరః శృంగములు 2 రచించినచో నలినీకమగును. భూమిజమువలె మల్లతలమును ద్రావిడ పద్ధతితోను రచించిన యెడల ద్రావిడమగును. ఈ 8 శివప్రాసాదములని తెలియవలెను,

## 157. విష్ణుప్రాసాదములు 8

అపరా. 179వ సూ

శ్లో॥ వర్ధమానస్య సంస్థానే పక్షేకుర్యాత్త దూర్ధ్వతః।
కూటావృతంచ శిఖరం పక్షిరాజోగృహం శ్రియః॥ 26
యామ్యోత్తరేవినాపక్షం సభవేద్వర్ధమానకః।
శంఖనాభి సమాకారః శంఖావర్తస్తు స్పష్టితః॥ 27

శ్రీవత్సభద్ర కర్ణేషు కుర్యాత్తిలక శృంగకమ్।
ప్రరథః స్యాల్లతినజః పుష్పకః సర్వకామదః॥ 28

లతాఖ్య సర్వతోభద్రం తాదృక్ శృంగే గృహేశ్వరః।
అష్టభద్రశ్చాష్టకోణః స్వస్తికః పంచభూమికః॥ 29

చతురశ్రం వినాభద్రై రుచకః శిఖరేతథా।
అష్టభద్రోద్వ్యష్టకోణోఽశ్వభూమః పుణ్యవర్ధనః॥ 30

తా॥ వర్ధమానమున దక్షిణోత్తరములయందు పక్షములను రచించి ఆపైన కూటములతో శిఖరమును రచించిరేని గరుడమగును. పక్షములు లేకుండ రచించినయెడల వర్ధమానమే యగును. శంఖముయొక్క నాభితో సమానముగ శిఖరమును కల్పించిరేని శంఖావర్తమగును. శ్రీవత్స భద్రము యొక్క కర్ణములందు తిలకమును శృంగమును కల్పించి లతిన పద్ధతితో ప్రతిరథమును రచించినయెడల పుష్పకమగును. లతాఖ్యమున అంతటను భద్రములను రచించి శృంగములను నుంచిరేని గృహరాజమగును. భద్రములు 8 కర్ణములు 8 అంతస్తులు 5 రచించిన యెడల స్వస్తికమగును. భద్రములు లేకుండ శిఖరముతో నలుచదరముగా రచించినయెడల రుచక మగును. భద్రములు 8 కర్ణములు 16 అంతస్తులు 7 రచించిన యెడల పుణ్యవర్ధనమగును, ఈ 8 విష్ణుప్రాసాదములు. (అనుబంధము 47 నుండి 50 వరకు గల పటములు చూడుడు)

## 158. బ్రహ్మప్రాసాదములు 8

అపరా. 179వ సూ

శ్లో॥ కేసరిభద్రేత్రి శృంగం కర్ణేకుర్యాచ్చమందరమ్।
నవభూమ్యుచ్ఛ్రితారేఖా మేరుర్బ్రహ్మణోమతః॥ 31

భద్రేకర్ణే ద్విద్విశృంగమేకైకం ప్రరథే తథా।
మందరః స సమాఖ్యాతః పంచవింశతి కుంభకః॥ 32

నందిశాల కర్ణశృంగం కర్తవ్యంచ నవాండకమ్।
కైలాసశ్చ తదాః నామకర్తవ్యః పురమధ్యగః॥ 33

దేయం భద్రంచ రుచకే హంసః కర్ణోదకాంతరైః।
తత్రప్రాగ్గ్రీవాశ్చ కర్తవ్యాః సభవేద్భద్ర సంజ్ఞకః॥ 34
తస్యభద్రోద్గమాఃపంచ భవేదుత్తుంగ సంజ్ఞకః।
ఏకం శృంగం భద్రశృంగే విదుస్తం మిశ్రకాభిధమ్॥ 35
వృత్తం మాలాధరం కుర్యాద్ వలభ్యాకృతి శృంగకమ్।
ఘంటాఘటయుతాః సర్వే కర్తవ్యాః సర్వకామదాః॥ 36

తా॥ కేసరియొక్క భద్రమున 3 శృంగములును, మందరమువలె కర్ణములును, 9 అంతస్తులును, పైన శిఖరమును కలది మేరువగును. భద్రమున 2 శృంగములును, కర్ణమున 2 శృంగములును, ప్రతిరథమున 1.1 శృంగమును 25 కుంభములను కలది మందరమగును, నందిశాల యందు కర్ణములకు శృంగములును, 9 అండకములను కలది కైలాస మగును. రుచకమున భద్రమును జలమార్గములను రచించినయెడల హంసమగును. భద్రములకు ప్రాగ్గ్రీవములను రచించినయెడల భద్ర మగును. భద్రమునందు 5 శృంగములను రచించినయెడల ఉత్తుంగ మగును. భద్రమున 1 శృంగమును రచించినయెడల మిశ్రకమగును. గుండ్రముగా వలభివలె శృంగములును, ఘంటకుంభములతో అన్నిటిని రచించిరేని మాలాధరమగును. ఈ 8 యును బ్రహ్మ ప్రాసాదములు.

## 159. సూర్యప్రాసాదములు 8

అపరా॰ 179వ సూ.

శ్లో॥ విభక్తే చాష్టధాఛందే పంచాండః కర్ణశృంగకమ్।
పంచోద్గమయుతం భద్రం గవయో నామనామతః॥ 37
కర్ణో ర్ధ్వే తిలకందద్యా చ్చిత్రకూటస్స సంజ్ఞితః।
పంచభూమోవినాభద్రైః కిరణః సూర్యకర్ణతః॥ 38
ప్రాగ్గ్రీవాశ్చైవ భద్రేషు భవేత్సర్వాంగ సుందరః।
వర్ధమానేతు ప్రాగ్గ్రీవాః శ్రీవత్స ఉదకాంతరైః॥ 39
ద్వ్యష్టకర్ణా వినాభద్రం పద్మనాభోఽబ్జపత్రవత్।
రుచకేతు చతుర్ద్వారం సవైరాజ్యాభిధానకః॥ 40

వృత్తోవృత్తశ్చ కర్తవ్యః శిఖరం వలికాకృతిః
ఇత్యష్టౌచ ప్రకర్తవ్యాః ప్రాసాదాః సూర్యలోకజాః॥ 41

తా॥ విస్తారమును 8 భాగములుచేసి కర్ణశృంగము 5 అండకములును, భద్రమున 5 శృంగములును, శిఖరమును రచించినయెడల గవయమగును, కర్ణముపైన తిలకమును కల్పించినయెడల చిత్రకూటమగును. భద్రములు లేకుండ 5 అంతస్తులతో 12 కర్ణములను రచించరేని కిరణమగును. భద్రములకు ప్రాగ్గ్రీవములు రచించినయెడల సర్వాంగసుందరమగును. వర్ధమానమున ప్రాగ్గ్రీవములును జలమార్గములను రచించిరేని శ్రీవత్సమగును. భద్రములు లేకుండ 16 కర్ణములను పద్మపత్రములవలెను పైన శిఖరమును రచించిన యెడల పద్మనాభమగును. రుచకమునకు 4 ద్వారములు కల్పించరేని వైరాజ్యమగును. గుండ్రముగా శిఖరమును రచించినయెడల వృత్తమగును, ఈ 8 యును సూర్యప్రాసాదములు.

## 160. దేవీప్రాసాదములు 8

అపరా. 179వ సూ.

శ్లో॥ సీమాభద్రం రుచకస్య పదపాదేన నిర్గతమ్।
నంద్యావర్తస్తదానామ శిఖరం తకికర్ణకే॥ 42
తద్వచ్చైవాయతం కుర్యాద్ వలభీగజ పృష్ఠవత్।
సువర్ణః సర్వతోభద్రే త్రిభూమైః కర్ణశృంగకైః॥ 43
కేశరీచ భవేత్పూర్వం సింహః కర్ణేతుకూటకే।
కూటోర్ధ్వే తిలకంచద్యో ద్విచిత్ర ఇతి సంజ్ఞితః॥ 44
భద్రశృంగాణి భద్రేఽష్టి ప్రాగ్గ్రీవైర్యోగ పీఠకః।
వరాటుయుక్ సర్వభద్రో ఘంటానాదశ్చతుర్ముఖః॥ 45
కేశరీచ భవేత్పూర్వం కర్ణేకూటాని కారయేత్।
పంచకూటభవా రేఖాఽష్టమో భద్రరథోద్గమైః॥ 46

తా॥ రుచకముయొక్క భద్రమున సీమ $\frac{1}{4}$ భాగము నిర్గమమును, తకిలుగల కర్ణములును, శిఖరమును కలది నంద్యావర్తమగును. అదియే

దీర్ఘముగాను ఏనుగు యొక్క వీపువలె రచింపబడినది వలభియగును. భద్రములును కర్ణములందు శృంగములును కలది సువర్ణమగును. కేసరి యొక్క కర్ణములయందు కూటములను రచించినయెడల సింహమగును. కూటములపైన తిలకములను రచించిరేని విచిత్రమగును. భద్రముల యందు శృంగములును, భద్రములకు 4 ప్రాగ్గ్రీవములును కలది యోగ పీఠమగును. భద్రములన్నియును పరాటపద్ధతితోను 4 ద్వారములును రచించిరేని ఘంటానాదమగును. కేశరియొక్క కర్ణములందు కూటములును రేఖ 5 కూటములతోను భద్రములయందు శృంగములు రచించిరేని పతాకిన మగును. ఈ 8 దేవీ ప్రాసాదములు.

## 161. గణపతి ప్రాసాదములు 8

**అపరాజిత 179వ సూత్రము**

శ్లో॥ విభక్తేదశధాక్షేత్రే కారయేచ్చలతాఖ్యజమ్।
తస్యద్వితీయోరు శృంగం గుహాధారః స ఉచ్యతే॥ 47
భద్రకే కర్ణజారేఖా భద్రోద్గమలి భూషితా।
శలాకోనామ విజ్ఞేయో వేణుకోరుచకోద్భవైః॥ 48
ద్రావిడే త్వేక భూమిశ్చేత్ కుంజరః సర్వకామదః।
త్రిభూమోద్రావిడ త్ర్యంగో భవేద్ధర్షాభిధానకః॥ 49
లతినే వర్ధమానశ్చేద్ విజయోభద్రకోద్గమైః।
అష్టభద్రం వినాకర్ణైసుదకుంభస్సకామదః॥ 50
మోదకశ్చైత్యకాకారః శిఖరం వలికోఽన్వితః

తా॥ విస్తారమును 10 భాగములుచేసి లతాఖ్యమున 2వ ఉరః శృంగమును రచించినయెడల గుహాధారమగును. భద్రము ప్రక్కనుండి మంజరియును, భద్రముపైన శృంగములును కలది శలాకమగును రుచకమున భద్రములయందు శృంగములుండినచో వేణుకమగును. ద్రావిడమున ఒక్కటై అంతస్తుగా రచించినయెడల కుంజరమగును ద్రావిడమున 3 అంతస్తులును కర్ణము, భద్రము, విమానము ఈమూడును రచించినయెడల హర్షమగును. వర్ధమానము లతిన పద్ధతితో రచించ

భద్రములయందు ఉద్గమములున్నచో విజయమగును. కర్ణములు లేకుండ 8 భద్రములు రచించిరేని ఉదకుంభమగును. చైత్యమువలె గుండ్రముగాను శిఖరముతో రచించిరేని మోదకమగును. ఈ 8 గణపతి ప్రాసాదములు.

## 162. జినేంద్ర ప్రాసాదములు 8

అపరా. 179వ సూ.

శ్లో॥ ద్వ్యష్టకర్ణావినా భద్రైః సమహాపద్మ సంజ్ఞకః॥ 51
ద్విభూమిక గృహాకారః కూటే ఘంటా తృతీయకా।
విఖ్యాతోహర్మ్యనామ్నా జ్జయంతః ప్రత్యవిందకైః॥ 52
చత్వారోమండపాస్తస్య సభవేద్గంధమాదనః।
సప్తాంగోభూమిజః పంచ భూమః స్యాచ్ఛతశృంగకః॥ 53
నిరావేదస్తు ప్రాగ్గ్రీవై ర్విభ్రాంతశ్చ చతుర్ముఖః।
ఏకైకమురు శృంగంచ కామదః సమనోహరః॥ 54

తా॥ భద్రములు లేకుండ 16 కర్ణములును రెండు అంతస్తులును కలది మహాపద్మమగును. మూడు అంతస్తులును గృహమువలెను కూటము ఘంట కలది హర్మ్యమగును. ప్రత్యవిందములు కలచి ఉజ్జయంత మగును. మండపములు నలువైపుల 4 కలది గంధమాదనమగును. సప్తాంగములును 5 అంతస్తులును కలది శతశృంగకమగును. ప్రాగ్గ్రీవ ములుకలచి నిరావేదమగును. నలువైపుల ద్వారములు కలది విభ్రాంత మగును. నలువైపులఒక్కొక్క ఉరః శృంగము కలది మనోహరమగును. ఈ 8 జినేంద్ర ప్రాసాదములు.

## 163. సమస్త దేవతాప్రాసాదములు 8

అపరా. 179 సూ.

శ్లో॥ వృత్తోవృత్తాయతశ్చైవ చైత్యోవైవేద్యలం కృతః।
సుభద్రోభద్ర శృంగేషు కింకిణీనామ ప్రోచ్యతే॥ 55

భద్రోద్గమైశ్చలయనః పట్టిశ్చాద్యే వరండికః।
ద్వ్యాలిందకశ్చ విభవః పట్టిఘూర్నైస్తారాగణః॥ 56
చతుః షష్టిశ్చ కథితాః ప్రాసాదాః సర్వకామదాః।
పూజితాః సర్వదేశేషు సర్వదేవేసుఖావహాః॥ 57

ఇతి సూత్ర సంతానగుణకీర్తి ప్రకాశ ప్రోక్త శ్రీభువనదేవాచార్యోక్తా పరజితపృచ్ఛాయాం విమానాదిచతుః షష్టిప్రాసాదలక్షణాధికారో నామైకోనాశత్యుత్తర శతతమం సూత్రమ్.

తా॥ వృత్తము, వృత్తాయతము, చైత్యము, వేది అలంకారము గలది భద్రము, శృంగములు కలది కింకిణి. భద్రమునందు ఉద్గమములు కలది లయనము, ఛాద్యము, వరండిక కలది పట్టిశము రెండు అలిందములు కలది విభవము. ఈ 8 సమస్తదేవతలకు యోగ్యమైనవి.

## 164. నాగరజాతి బ్రహ్మప్రాసాదములు 5

విశ్వకర్మోవాచ

**అపరా. 164వ సూ.**

శ్లో॥ పూర్ణభద్రః సుభద్రశ్చ శ్రీశైలః కుముదోద్భవః।
సర్వతోభద్ర ఇత్యుక్తాః ప్రాసాదాః బ్రహ్మణః ప్రియాః॥ 1
విభక్తి తలచ్ఛందానా మూర్ధ్వమానం విశేషతః।
ప్రయుక్తా వివిధాశ్ఛందా వాస్తువేద సముద్భవాః॥ 6
భక్తేవింశతిధాక్షేత్రే త్రిభాగః కర్ణవిస్తరః।
తత్సమశ్చ ప్రతిరథో విస్తరేనిర్గమేతథా॥ 7
భాగానందీచ షడ్భద్రం ద్విభాగోభద్ర నిర్గమః।
చతుర్భాగాభవేద్భిత్తిః శేషంగర్భగృహం భవేత్॥ 8
కర్ణేద్విశృంగం తిలకం శిఖరం సూర్యవిస్తరమ్।
రథైకశృంగ తిలక మష్టాంశాచోరు మంజరీ॥ 9

నందికాయాంచ తిలక మురః శృంగం షడంశకమ్।
రథోద్గమస్తతోభద్రే పూర్ణభద్రస్య లక్షణమ్॥ 10
ఉరః శృంగంచ వేదాంశం భద్రే కుర్యాత్ తృతీయకమ్।
సుభద్రశ్చ తదానామ ప్రాసాదః క్షితిభూషణః॥ 11
భద్రే శృంగం పరిత్యజ్య నందీశృంగాణి కారయేత్।
శ్రీశైలశ్చ తదానామ కథితశ్చ విరించినా॥ 12
భద్రే శృంగం కుముదకః కర్తవ్యః శుభలక్షణః।
కర్ణేచ తిలకం శృంగం సర్వతోభద్ర లక్షణమ్॥ 13

తా॥ పూర్ణభద్రము మొదలగు 5 నాగర ప్రాసాదముల యొక్క లక్షణములను చెప్పుచున్నారు. విస్తారమును 20 భాగములుచేసి కర్ణము 3 భాగములు, ప్రతిరథము 3 భాగములు, నిర్గమము 1 భాగమును, నంది 1 భాగము, భద్రము 6 భాగములు, భద్రముయొక్క నిర్గమము 2 భాగములు చేయవలెను. గోడ 4 భాగములు చుట్టూ చేయుగా మిగిలినది గర్భము, కర్ణమున 2 శృంగములును, తిలకమును, శిఖరము యొక్క విస్తారము 12 భాగములును, ప్రతిరథము 1 శృంగమును తిలకమును, ఉరోమంజరి విస్తారము 8 భాగములును, నందికయందు తిలకమును. మరల ఉరః శృంగము 6 భాగములును; భద్రమునను రథమునను ఉద్గమములును కలది పూర్ణభద్రమగును. ఉరః శృంగముయొక్క విస్తారము 4 భాగములుచేసి భద్రమున 3వ ఉరః శృంగమును కల్పించిరేని సుభద్రమగును. భద్రమున శృంగములు లేకుండ నందియందు శృంగములను రచించిరేని శ్రీశైలమగును. భద్రమున శృంగము కలది కుముదమగును. కర్ణమున తిలకమును శృంగమును కల్పించినయెడల సర్వతోభద్రమగును. ఈ 5ను బ్రహ్మప్రాసాదములు.

## 165. నాగరజాతి విష్ణుప్రాసాదములు 5

అపరా. 164వ సూ.

శ్లో॥ కీర్తిపతాక రికూటౌ శ్రీవత్సో విజయస్తథా।
గరుడశ్చ సమాఖ్యాతాః ప్రాసాదాహరివల్లభాః॥ 2

క్షేత్రే ద్వావింశతిధా పూర్వవత్తల సంస్థితిః।
కర్ణప్రతరథమధ్యేచ నందికాచైక భాగికా॥ 14
కర్ణేప్రతిరథేచైవ ద్వేద్వేశృంగేచ కారయేత్।
త్రిభిర్భాగైశ్చ ప్రథమం సార్ధద్వ్యంశం ద్వితీయకమ్॥ 15
నందికాయాంతతః శృంగం, శృంగం షోడశవిస్తరమ్।
శిఖరోర్ధ్వే ఉరః శృంగం షడ్భాగంచ తదగ్రతః। 16
ప్రత్యంగం త్ర్యంశతః కీర్తిపతాకస్యచలక్షణమ్।
ఉరః శృంగం తృతీయంచ ఋషికూటః స ఉచ్యతే॥ 17
రేఖోర్ధ్వే తిలకం నంద్యాం శృంగం శ్రీవత్స ఉచ్యతే।
తతః శృంగేచ విజయః సర్వకామఫలప్రదః॥ 18
శృంగేకూటం నంది శృంగం కర్ణస్యోభయ పక్షతః।
పక్షిరాజః సమాఖ్యాతః ప్రాసాదోభవనోత్తమః॥ 19

తా॥ కీర్తిపతాకము మొదలగు 5 నాగరప్రాసాదముల యొక్క లక్షణములను చెప్పుచున్నాడు విస్తారమును 22 భాగములు చేసి కర్ణము ప్రతిరథము ఈ రెంటి మధ్య నందిక 1 భాగముచేసి మిగిలినవన్నియును పూర్వమువలెనే చేయవలెను. కర్ణమున 2 శృంగములును, ప్రతిరథమున 2 శృంగములును, చేయవలెను. మొదటి శృంగము 3 భాగములును. రెండవ శృంగము $2\frac{1}{2}$ భాగములును చేయవలెను నందికయందు శృంగమును కల్పించవలెను ప్రధాన శిఖర విస్తారము 16 భాగములును, శిఖరముపైన ఉరః శృంగము 6 భాగములును, దానిముందు ఉరః శృంగము 3 భాగములును కలది కీర్తిపతాకమగును. మూడవ ఉరః శృంగమును రచించినయెడల ఋషికూటమగును. రేఖపైన తిలకమును నందికయందు శృంగమును కలది శ్రీవత్సమగును విస్తారమైన శృంగములు కలది విజయమగును. కర్ణమునకూటమును, నందియందు శృంగమును. రెండు వైపుల పెంచి రచించినయెడల పక్షిరాజమగును. ఈ 5ను విష్ణుప్రాసాదములు.

## 166. నాగరజాతి జినేంద్ర ప్రాసాదములు 5

అపరా. 164వ సూ.

శ్లో॥ పద్మరాగో విశాలాక్షో విభవోరత్న సంభవః।
లక్ష్మీకోటర ఇత్యేవం పంచైతేతు జినాశయాః॥ 3
కర్ణేనందీప్రతిరథౌ పూర్వవచ్చసు సంస్థితౌ।
నందికాభాగ నిష్కాసా ద్విభాగం పార్శ్వశోభణా॥ 20
భాగానందీ పునః కార్యా వేదాంశోభద్ర విస్తరః।
నిష్కాసశ్చైక భాగస్తు కర్తవ్యః శుభలక్షణః॥ 21
చతుర్భాగం భవేద్భిత్తిః శేషంగర్భగృహం భవేత్।
కర్ణే శృంగద్వయం కార్యం క్రమతో భాగనిర్గతమ్॥ 22
షోడశాంశంచ శిఖర మురః శృంగం తదర్ధతః।
తత్పదోనంత దగ్రంచ తస్యాగ్రంచ యుగాంశకమ్॥ 23
కర్ణేప్రతిరదేతుల్యౌ ద్విక్రమాచైవ నందికా।
కర్ణేప్రతిరథే భద్రే శృంగాణి త్రీణి త్రీణిచ॥ 24
ద్వౌ ద్వౌ కూటౌ నందికాయాం ప్రత్యంగానితతోఽష్టభిః।
భద్రనంద్యేక కూటంచ పద్మరాగః స ఉచ్యతే॥ 25
భద్ర శృంగే విశాలాఖ్యో విభవంస తధాశృణు।
కర్ణకూటం నంది శృంగం నామ్నా వైవిభవస్తథా॥ 26
తతః శృంగే కామదస్తు కర్తవ్యో రత్న సంభవః।
భద్రోవేన్నందికా త్యక్త్వా లక్ష్మీకోటర ఉచ్యతే॥ 27

తా॥ పద్మరాగము మొదలు 5 నాగరజాతి జినేంద్రప్రాసాదముల యొక్క లక్షణములను చెప్పుచున్నాడు. పైన చెప్పిన ప్రాసాదమున కర్ణమున నంది ప్రతిరథము మునుపటివలెనేచేసి నందిక నిర్గమము 1 భాగ ముచేసి ప్రక్కలయందు శోభణ 2 భాగములు చేయవలెను. మరల నంది 1 భాగమును భద్రము 4 భాగములును, భద్రముయొక్క నిర్గ మము 1 భాగమును, చేయవలెను. గోడ నలువైపుల 4 భాగముల చొప్పున చేయుగా మిగిలినది గర్భము. కర్ణమున 2 శృంగములును, నిర్గమము 1 భాగమును, శిఖరము యొక్క విస్తారము 6 భాగములును, 1 ఉరః

ము 8 భాగములును, దానిముందు ఉరఃశృంగము 6 భాగములును.
ముందు ఉరః శృంగము 4 భాగములును, కర్ణమునను ప్రతిరథము
2.2 నందికలును. కర్ణమునను, ప్రతిరథమునను, భద్రమునను,
శృంగములును, నందికయందు 2.2 కూటములును, ఉరోమంజరుల
ను 8 చొప్పునను, భద్రమునందలి నందియందు 1 కూటమును,కలది
రాగమగును. భద్రమున శృంగమును రచించినయెడల విశాలమగును.
మన కూటము, నందియందు శృంగము కలది విభవమగును. విస్తార
శృంగములు కలది రత్నసంభవమగును. భద్రమున నందికను తీసి
యెడల లక్ష్మీకోటరమగును. ఈ 5ను జినేంద్ర ప్రాసాదములు.

## 167. నాగరజాతి సూర్యప్రాసాదములు 5

ా. 164 సూ.

హంస ఐరావతశ్చైవ త్రిముఖః పద్మకస్తథా।
స్వస్తికశ్చ సమాఖ్యాతాః పంచైతేభాను వల్లభాః॥ 4
తద్రూపంచ తదాకారం భద్రంషడ్భాగ విస్తరమ్।
ద్వౌద్వౌనందీ పార్శ్వతశ్చైకైకభాగ ప్రకల్పితౌ॥ 28
చతుష్పదారథకర్ణాః శృంగం షోడశవిస్తరమ్।
ఉరః శృంగం తథాష్టాంశం షడంశం తస్యచాగ్రతః॥ 29
చతుర్భాగమురః శృంగం భద్రేకుర్యాత్తథోద్గమమ్।
కర్ణేప్రతిరథేచైవ శృంగాణి త్రీణి త్రీణిచ॥ 30
నందికాయామేవ శృంగం శేషేకూటాని కారయేత్।
ఇతిశస్తగుణైర్యుక్తో హంసనామాస ఉచ్యతే॥ 31
భద్రే శృంగం పునర్దద్యాత్ స్యాదైరావతలక్షణమ్।
త్యక్తం నందిద్వయం భద్రే త్రిముఖః సర్వకామదః॥ 32
భద్రశృంగే పద్మకస్తు కర్తవ్యోలక్షణాన్వితః।
శృంగం త్యక్త్వాభద్ర నందీ స్వస్తికస్తు భవేత్తదా॥ 33

తా॥ హంసము మొదలగు 5 నాగరజాతి ప్రాసాదముల యొక్క
ణములను చెప్పుచున్నాడు. పైన జెప్పిన ప్రాసాదమున భద్రమును

6 భాగములును, దాని రెండువైపుల 1.1 భాగము చొప్పున రెండేసి నందికలును, కర్ణము 2 భాగములును ప్రతిరథము 2 భాగములును, వానిమధ్య నందికలు 1.1 భాగము చొప్పున రెండును చేయవలెను. ప్రధాన శృంగము యొక్క విస్తారము 16 భాగములును, ఉరః శృంగము 8 భాగములును, దానిముందు రెండవ ఉరః శృంగము 6 భాగములును, మూడవ ఉరః శృంగము 4 భాగములును, భద్రమున ఉద్గమములును, కర్ణమునను ప్రతిరథమునను 3 3 శృంగములును, నందికయందు 1 శృంగమును, మిగిలినవి కూటములుచేయవలెను. దీనిని హంసమందురు. భద్రమున శృంగమును రచించినయెడల ఐరావతమగును భద్రమునందు నందికలు రెండును తీసివేసినయెడల త్రిభుజమగును. భద్రమున శృంగమును రచించినయెడల పద్మకమగును. శృంగమును తీసివేసి నందికలకు భద్రమును కల్పించినయెడల స్వస్తికమగును. ఈ 5ను సూర్యప్రాసాదములు.

## 168. నాగరజాతి శివప్రాసాదములు 5

అపరాజిత 164వ సూత్రము

శ్లో॥ వృషభోగిరి కూటశ్చ కైలాసశ్చామరస్తథా।
మహేంద్రశ్చ సమాఖ్యాతాః పంచైతే శివవల్లభాః॥ 5
చతురశ్రీ కృతే క్షేత్రే ద్వావింశతి విభాజితే।
చతుష్పదారథకర్ణా ఏకైకాంశాచ నందికా॥ 34
షడ్భాగంచ భవేద్భద్రం ద్వ్యద్వ్యంశాయుగ్మ నందికాః।
భద్రే శృంగత్రయం కార్యం ద్వావింశత్యంశ శృంగకమ్॥ 35
కర్ణే ప్రతిరథే కుర్యాద్ ద్వాదశాంశోరు మంజరీ।
తథానందౌ ద్వితిలకం ప్రత్యంగం స్యాద్యుగాంశకమ్॥ 36
రథే శృంగం తిలకంతు నందావష్టాంశ మంజరీ।
భద్రనంద్యాం ద్వితిలకం షడంశం చోరుమంజరీ॥ 37
భద్రే శృంగం చతుర్ధంచ చతుర్భాగైస్తు విస్తరః।
ఏవం విధః ప్రకర్తవ్యః ప్రాసాదోవృషభాభిధః॥ 38

భద్రనంద్యామేక శృంగం గిరికూటస్య లక్షణమ్।
కర్ణోర్ధ్వేచతతః శృంగం కైలాసః సర్వకామదః॥ 39
తథైవ తిలకం కుర్యాద్ ద్విశృంగారథ నందికా।
అమరోఽసౌ సమాఖ్యాతః కర్తవ్యః సర్వకామదః॥ 40
తతః శృంగేతు మాహేంద్రః కర్తవ్యః శాంతిమిచ్ఛతా ।
ప్రాసాద పంచకం చైతత్ కర్తవ్యం శివవల్లభమ్॥ 41

ఇతి సూత్ర సంతాన గుణకీర్తి ప్రకాశప్రోక్త్య శ్రీ భువనదేవాచార్యోక్తాపరాజిత పృచ్ఛాయాం పూర్ణభద్రాది నాగర ప్రాసాద లక్షణాధికారో నామ చతుః షష్ట్యుత్తర శతతమం సూత్రమ్.

తా॥ వృషభము మొదలగు 5 నాగర ప్రాసాదముల యొక్క లక్షణములను చెప్పుచున్నాడు. విస్తారమును 22 భాగములుచేసి రథము 4 భాగములు, కర్ణము 4 భాగములు, నందికలు 1,1 భాగము. భద్రము 6 భాగములు 2 2 భాగములు జంట నందికలు, భద్రమున 3 శృంగములు, ప్రధాన శృంగము విస్తారము 22 భాగములు, కర్ణమునను ప్రతిరథమునను శృంగములును, ఉరోమంజరి విస్తారము 12 భాగములు, నందియందు 2 తిలకములు, ఉరోమంజరి 4 భాగములు, రథమున శృంగమును 1 తిలకములును, నందికయందు మంజరి విస్తారము 8 భాగములును, భద్రనందికయందు 2తిలకములును, ఉరోమంజరి 6 భాగములును, భద్రమున 4శృంగములును విస్తారము 4 భాగములును, రచించిరేని వృషభమగును. భద్రనందిక యందు 1 శృంగమునే రచించిన యెడల గిరికూటమగును. కర్ణముపైన యెత్తైన శృంగమును రచించిరేని కైలాసమగును. కర్ణమున తిలకమును రథమునకును నందికకును 2.2 శృంగములు కలది అమరమగును. విస్తారమైన శృంగములు కలది మహేంద్రమగును. ఈ 5ను శివ ప్రాసాదములు.

## 169. శివాలయమున ద్వారదేవతలు

విశ్వకర్మోవాచ

అపరా. 133వ సూ.

శ్లో॥ నందీచైవ మహాకాలో హేరంబో భృంగి ఏవచ।
దుర్ముఖః పాండురశ్చైవ సితశ్చాసిత ఏవచ॥ 1
వేదాంశా ద్వారపాలాః స్యుర్గంగాయము నాన్యాసతః॥
తత్పరేచామరధరా ఊర్ధ్వం మృణాల భూషితాః॥ 2
పద్మపత్రం సుశోభాఢ్యం స్తంభంచై వేల్లి కాన్వితమ్।
మృణావైర్భూషయే దూర్ధ్వం కుర్యాత్క్రందస్య మహ్యాతః॥ 3
కందవేధం యదాకుర్యా స్తదా కుప్యంతి దేవతాః।
సమూలాంశ్చ వినశ్యంతి కర్తృకారకాం స్తథా॥ 4
శాఖాస్యాను క్రమేణైవ క్రమాత్ పట్టోత్తరం గయోః।
రూపస్తంభద్వయంచైవ కంఠకూట సమన్వితమ్। 5
వృషస్థం శంకరం వింద్యాత్ బ్రహ్మాణం హంససంస్థితమ్।
విష్ణుంచ గరుడారూఢం శ్రీకంఠం నృత్యసంస్థితమ్॥ 6

తా॥ శివాలయముయొక్క తూర్పువాకిట నంది, మహాకాలుడు, దక్షిణపువాకిట గణపతి, భృంగి, పడమరవాకిట దుర్ముఖుడు, పాండురుడు ఉత్తరపువాకిట సితుడు, అసితుడు, ఇట్లుండవలెను ద్వారము యొక్క యెత్తులో 4వ వంతు ద్వారపాలకుల యెత్తు దిగువ గంగ, యమునలు. ఆపైన చామరధరులు. పైన తామరకాడ, తామరపుష్పము అందముగాను స్తంభమున ఇల్లికాతోరణమును, పైన తామరకాడతో అలంకారమును, కందము యొక్క వెలుపల చేయవలెను. కందవేధము లేకుండ నుండ వలెను. కందవేధమువలన దేవతలకు క్రోధము కలుగును. అందువలన యజమానుడు మొదలగు వారందఱును నశింతురు. ద్వారశాఖలనను సరించి పైన పట్టము ఉత్తరాశి నిర్మించవలెను. రూపస్తంభములు రెండును కంఠకూటములతో నుండవలెను. ఈశ్వరుడు వృషభముపైనున్న ట్లును, బ్రహ్మ హంసపై నున్నట్లును, విష్ణువు గరుత్మంతునిపై నున్నట్లును మరియు ఈశ్వరుడు నృత్యము చేయుచున్నట్లును, ఇట్లు తూర్పుమొదలుగ నాలుగువైపులయందుత్తరాశి యందు కల్పించవలెను.

# 170 విష్ణుదేవాలయమున ద్వారదేవతలు

అపరా. 133వ సూ.

శ్లో॥ శంఖచూడః ప్రచండశ్చ జయశ్చ విజయస్తథా।
ధాతాచైవ విధాతాచ సుభద్రోభద్ర ఏవచ॥ 7
దక్షిణోత్తర క్రమేణ గంగాచ యమునాస్థితే।
ఉత్తరంగే భవేల్లక్ష్మీః క్షేత్రపాలా ఉదుంబరే॥ 8
కంఠకేమాతరః కార్యా గ్రహాస్త్రి పురుషస్తథా।
వాసుదేవాది భేదాంశ్చ ద్వారేషు పరికల్పయేత్॥ 9
వాసుదేవం సంకర్షణం ప్రద్యుమ్నంచా నిరుద్ధకమ్।
చతుర్యుగ ప్రభేదేషు ద్వారేషు పరికల్పయేత్॥ 10
యేషాం పరికాయేస్యుస్తాంస్తద్ ద్వారేషుకల్పయేత్।
భవేయుః సుఖదానిత్యం కర్తుశ్చాపర కస్యతు॥ 11

తా॥ కేశవాలయమున తూర్పువాకిట చండ ప్రచండులు, దక్షిణమున జయవిజయులు, పడమర ధాత విధాతలు, ఉత్తరమున సుభద్ర భద్రులు ఉండవలెను. ద్వారదక్షిణ శాఖయందు గంగ, ఉత్తరశాఖయందు యమున ఉత్తరాశియందు లక్ష్మి, ఆపై దూలమున క్షేత్రపాలుడు. కంఠమున మాతృకలు, నవగ్రహములు, బ్రహ్మ, విష్ణు, శివరూపములు, వాసుదేవుడు మొదలగు విష్ణురూప భేదములు, కృతయుగాది నాలుగు యుగములందలి యవతార భేదములును అందుకు దగిన పరికరములును నాలుగు ద్వారములయందు కల్పించవలెను.

# 171· బ్రహ్మాలయమున ద్వారదేవతలు

అపరా. 133వ సూ.

శ్లో॥ సత్యోధర్మః క్రమోజయో విజయోయజ్ఞ భద్రకః।
భవశ్చ విభవశ్చైవ బ్రహ్మణః ప్రతిహారకః॥ 12
ఋషీణామాశ్రయః కార్యో దేవతానాంతు పార్శ్వతః।
చతుర్వేద సమాయుక్తం బ్రహ్మణం సర్వశాంతిదమ్॥ 13

తా॥ బ్రహ్మదేవుని ఆలయము యొక్క తూర్పువాకిట సత్యుడు, ధర్ముడు, దక్షిణపువాకిట జయుడు, విజయుడు, పడమటివాకిట యజ్ఞుడు, భద్రుడు, ఉత్తరపు వాకిట భవుడు, విభవుడు, ఇట్లు 8 మందిని, బ్రహ్మ, విష్ణువు,శివుడు, వీరికి రెండువైపుల మరీచి మొదలగు మహర్షులును, నాలుగు వేదములతో శాంతరూపముగ బ్రహ్మయును ఇట్లు నలుదిశలయందుండ వలెను.

## 172. సూర్యాలయమున ద్వారదేవతలు

అపరా. 133వ సూ.

శ్లో॥ దండీచ పింగలశ్చైవ అనందాశ్చాంతకస్తథా।
చిత్రోవిచిత్రో జ్ఞాతవ్యాః కిరణాఖ్యః సులోచనః॥ 14
భాస్కరస్య సమాఖ్యాతా అష్టైతేప్రతిహారకాః।
పూర్వదిక్ క్రమతః ప్రోక్తాః ప్రాచ్యాదిషు ప్రదక్షిణమ్॥ 15
భాస్కరేషు ద్వాదశసు ఏషాంకార్యాశ్చ మూర్తయః।
సుప్రశస్తాః పరికరాః శాంతిదాః సర్వకామదాః॥ 16

తా॥ సూర్యుని ఆలయమున తూర్పువాకిట దండి పింగళుడు, దక్షిణపు వాకిట అనందుడు, అంతకుడు. పడమటి వాకిట చిత్రకుడు, విచిత్రకుడు. ఉత్తరపు వాకిట కిరణుడు, సులోచనుడు. ఇట్లు 8మంది ద్వారపాలకులు నలుదిశల నుండవలెను సూర్యుని 12 రూపములును అయా రూపములకు దగిన పరికరములును నాలుగు వాకిండ్ల యందు పైభాగమును రచించవలెను.

## 173. గణేశాలయమున ద్వారదేవతలు

అపరా. 133వ సూ.

శ్లో॥ అవిఘ్నో విఘ్నరాజశ్చ సువక్త్రోబలవానథ।
గజకర్ణశ్చగోకర్ణః సుసౌమ్యః శుభదాయకః॥ 17
దిగ్ద్వారస్థాయుగ్మతశ్చ ఏతేవిఘ్న వినాశనాః।
ఇత్యష్టౌచ గణేశస్య ప్రతిహారాః శుభప్రదాః॥ 18

తా॥ గణపతి అలయము యొక్క తూర్పువాకిట అవిఘ్నుడు, విఘ్నరాజు, దక్షిణపు వాకిట సుముఖుడు, బిలుడు. పడమటి వాకిట గజ కర్ణుడు, గోకర్ణుడు ఉత్తరపు వాకిట సౌమ్యుడు, శుభుడు. ఇటు నలుదిశల యందు 8 మంది ద్వారపాలకులుండుట శుభకరము.

## 174. పార్వతి ఆలయమున ద్వారదేవతలు

అపరా. 133వ సూ.

శ్లో॥ జయాచ విజయాచైవ అజితాత్వపరాజితా।
విభక్తామంగలాకార్యా మోహినీ స్తంభినీతథా॥ 19
కర్తవ్యాశ్చేచ్ఛతాశాంతి మిత్యష్టా ప్రతిహారికాః।
గౌర్యాది నవమూర్తీనాం కుర్యాత్ పరికరాం స్తథా॥ 20

తా॥ పార్వతియొక్క ఆలయము తూర్పు వాకిట జయ, విజయ. దక్షిణపు వాకిట అజిత, అపరాజిత. పడమటి వాకిట విభక్త, మంగల, ఉత్తరపు వకిట మోహిని, స్తంభిని. ఇట్లు 8 మంది ద్వారపాలిక దేవతలను ఉత్తరాసికై గౌరి మొదలగు 9 రూపములును ఆయా రూపములకు దగిన పరికరములను రచించవలెను.

## 175. చండికాలయమున ద్వారదేవతలు

అపరా. 133వ సూ.

శ్లో॥ వేతాలః కరటశ్చైవ పింగాక్షోభృకుటిస్తథా।
ధూమ్రకః కంకటశ్చైవ రక్తాక్షశ్చ సులోచనః॥ 21
ఇత్యష్టాప్రతిహారాశ్చ చండికాజ్ఞాకరాస్సదా ।
ఉక్తోద్వార క్రమశ్చేతి శస్తః పరికరే సదా॥ 22

తా॥ చండికయొక్క గుడియందు తూర్పువాకిట బేతాళుడు, కరటుడు. దక్షిణపు వాకిట పింగాక్షుడు, భ్రుకుటి. పడమటి వాకిట ధూమ్రకుడు, కంకటుడు. ఉత్తరపు వాకిట రక్తాక్షుడు సులోచనుడు. ఇట్లు 8 మంది ద్వారపాలికులును. నాలుగు దిశలయందు చండికయొక్క రూపములును పరికరములును రచించవలెను.

## 176. జినేంద్రాలయమున ద్వారదేవతలు

అపరాజిత 133వ సూత్రము

శ్లో॥ హరాదివీతరాగాంతం దేవానాం క్రమ యోగతః।
అష్టషోడశ ద్వాత్రింశచ్చతుః షష్టిక మేవచ॥ 23
ఇంద్రశ్చేంద్ర జయశ్చైవ మహేంద్రో విజయ స్తథా।
ధరణేంద్రః పద్మకశ్చ సునాభః సురదుందుభిః॥ 24
ఇత్యష్టౌ ప్రతిహారాశ్చ వీతరాగేఽతిశాంతిదాః।
అనుక్రమేణ సంస్థాప్యాః ప్రాచ్యాదిషు ప్రదక్షిణమ్॥ 25
లాంఛనం సింహాసనంచ చామరం కుసుమాంజలిః।
ప్రభామండలాశోకాశ్చ దుందుభిశ్చిత్రకత్రయమ్॥ 26
వీతరాగేఽతి విఖ్యాతా దేవానాంతు ప్రతిక్రమాః।
యక్షశాసనదేవీశ్చ కుర్యాదుభయ పార్శ్వతః॥ 27

ఇతి సూత్ర సందానగుణకీర్తి ప్రకాశప్రోక్తృ శ్రీభువనదేవాచార్యోక్తాపరాజిత పృచ్ఛాయాం ప్రాసాదద్వార ప్రతీహారాను క్రమాధికారోనామ త్రయుంస్త్రింశ దుత్తర శతతమం సూత్రమ్.

తా॥ ఈశ్వరుడు మొదలు వీతరాగులవరకు వరుసగా 8, 16, 32, 64 సంఖ్యగల దేవాది రూపములను చుట్టూ రచించవచ్చును. తూర్పు వాకిట ఇంద్రుడు, ఇంద్రజయుడు. దక్షిణపు వాకిట మహేంద్రుడు, విజయుడు. పడమటివాకిట ధరణేంద్రుడు, పద్మకుడు ఉత్తరపు వాకిట సునాభుడు, సురదుందుభి. ఇట్లు 8 మందిని రచించవలెను. సింహాసనము చామరము, కుసుమాంజలి, ప్రభామండలము, అశోకము, దుందుభి, చిత్రకత్రయము. యక్షశాసన దేవీరూపములు ఇరుప్రైపులను రచించవలెను.

## 177. దేవతా ముఖముల దిశలు

విశ్వకర్మోవాచ

అపరా. 134వ సూ.

శ్లో॥ యతోముఖశ్చయోదేవో యథాస్యైయత్రపశ్యతి।
తదహంకథయిష్యామి దృష్ట్వాశాస్త్రార్థ నిశ్చయమ్॥ 1
నోత్తరాభిముఖాః కార్యాన దేవాదక్షిణముఖాః।
ఆదిదిశోన్ముఖః కార్య ఆదిదేవో దివాకరః॥ 2
చతుర్దిశాముఖోబ్రహ్మ కార్యోవాపూర్వదిఙ్ముఖః।
శంభుర్బాణస్తథాఘాట్యో ముఖలింగం సనాతనమ్॥ 3
వ్యక్తావ్యక్త రూపకస్య విశ్వేశః సర్వదిఙ్ముఖః।
సర్వత్ర సర్వతోభద్ర శ్చతుర్ద్వారః శివాలయః॥ 4
మూర్తిభేదేన యోజ్ఞేయ శ్చతుర్ద్వారః ప్రకీర్తితః।
హోమశాలాచకర్తవ్య చతుర్ద్వారోప శోభితా॥ 5
యక్షరాజం రమమాణం విదుర్దక్షిణ దిఙ్ముఖమ్।
పూర్వాపర ముఖాయేచ వక్ష్యంతే తేయథార్థతః॥ 6
బ్రహ్మవిష్ణుః శివః సూర్య ఇంద్రస్కంద హుతాశనాః।
పూర్వాపరముఖాహ్యేతే వాస్తుశాస్త్రేషు కీర్తితాః॥ 7
గణేశశ్చైవ నాగేశః క్షేత్రపోభైరవ స్తథా।
ధనాధ్యక్షశ్చ గంధర్వాగ్రహ మాతృగణస్తథా॥ 8
నకులీశశ్చ చండీశః కార్యాదక్షిణ దిఙ్ముఖాః।
ఏవంతిదిఙ్ముఖాః కార్యా నాన్యేచైవదివౌకసః॥ 9
నైరృత్యాభిముఖః స్థాప్యో హనూమాన్ బలబుద్ధిమాన్।
రౌద్ర ఏకాదశోరుద్రో రాక్షసక్షయకారకః॥ 10
ఊర్ధ్వమూలమధోఽగ్రంచ విలోమంద్వాః కపాటికమ్॥
వరుణోత్తర పూర్వేణ స్థిత్వాచైవ సుఖాసనః॥ 11
తథాయామ్యా ముఖంద్వారం కర్తవ్యం శాస్త్రపారగైః।
దేవాశ్చ ద్వారాభిముఖా ఇతి శాస్త్రార్థ నిశ్చయః॥ 12
దక్షిణోత్తరాముఖేన ప్రాచ్యాం వైవరుణోతథా।
వీతరాగస్య ప్రాసాదః పురమధ్యే సుఖావహః॥ 13

ప్రశస్తంచ సముత్సేధే గృహస్యార్ధ భూరంగకః॥
శ్రియంశాంతి మిష్టితంచ కర్తృకావరకావుభౌ॥ 14

తా॥ సమస్త దేవాలయములకు ప్రధానముఖము వివరించుచున్నాడు దేవతలు ఉత్తర ముఖముగాను, దక్షిణముఖముగాను ఉండరాదు. ప్రధాన దేవుడగు సూర్యుడు తూర్పుముఖముగా నుండవలెను. బ్రహ్మ నాలుగు ముఖములు కలవాడైనను ఒక్కటే ద్వారము పెట్టినపుడు తూర్పుముఖము గానే యుండవలెను. శివస్వరూపములైన బాణలింగము, ముఖలింగము మొదలైనవి వ్యక్తముగాని సర్వదిఙ్ముఖములు కలవి కనుక శివాలయము నకు నలువైపుల ద్వారములుండవలెను మూర్తి భేదములున్నను 4 ద్వార ములుండవలెను. హోమశాలకును నలువైపుల ద్వారము లుండవలెను. కుబేరునకు దక్షిణ ముఖము అని చెప్పబడి యున్నది. బ్రహ్మ, విష్ణువు శివుడు, సూర్యుడు, ఇంద్రుడు, అగ్నిహోత్రుడు, ఈ 6 గురును తూర్పు ముఖముతోగాని, పడమర ముఖముతోగాని ఉండవలెను. గణపతి, నాగే శుడు, క్షేత్రపాలుడు, భైరవుడు, కుబేరుడు, గంధర్వులు, గ్రహములు, మాతృకా దేవతలు, నకులీశుడు, చండీశ్వరుడు వీరందఱును దక్షిణముఖ ముగ నుండవలెను. హనుమంతుడు నైరృతి ముఖముగా నుండవలెను. ఏకాదశ రుద్రులును నైరృతి ముఖముగనే యుండవలెను. ద్వారమునందు తలుపు తెక్కలు మొదలుపైకి చివర క్రిందకు గలవి పడమరను ఈశాన్య మునను కల్పించినచో సుఖప్రదము. దక్షిణ ముఖద్వారమును అటులనే చేయవలెను. దేవతలు ద్వారమున కెదురుగా నుందురు. వరుణదేవుడు దక్షిణముఖముగను, ఉత్తరముఖముగను లేక తూర్పు ముఖముగనుండ వలెను జైన దేవతలు మొదలగువారి ఆలయములు గ్రామ మధ్యమున నుండుట సుఖప్రదము. ఆలయము యొక్క యెత్తులో సగము మధ్య రంగమును కల్పించవలెను. సంపదలు, శాంతి, ఇష్టసిద్ధి కలుగును.

## 178. ప్రాకార విధానము 1

కాశ్యప. 43వ పటలము.

శ్లో॥ అథవక్ష్యే విశేషేణ ప్రాకారాణాంచ లక్షణమ్।
రక్షార్థం శోభనార్థంచ శాలాయాః సదనస్యచ॥ 1
ప్రాసాదస్య విశాలార్ధం గుణభాగైక మేవవా।
చతుర్భాగైక భాగంవా అంతర్మండల విస్తృతమ్॥ 2
అంతరర్థావిశాలంతు తద్బాహే ద్విగుణం హితత్।
మధ్యహార విశాలంతు బాహ్యంతం మండలత్రయమ్॥ 3
మధ్యాదేస్తు విశాలంచ బాహ్యాత్వాది చతుర్గుణమ్।
మహామర్యాది విస్తార అద్రైర్యః పంచగుణోభవేత్॥ 4
ప్రాసాదచరణాద్విప్ర హోమాద్వా ప్రథమస్యతు।
ప్రథమాద్ ద్వితీయ నీవ్రంతు ద్వితీయాత్తృతీయనీవ్రకమ్॥ 5
తృతీయాచ్చతుర్థం నిష్క్రాంతం తస్మాన్నీవ్రంచ పంచమమ్।
ప్రాకారం ప్రతినిష్క్రాంతం తస్మాన్నీవ్రంతు పంచమమ్॥ 6
(తన్నీవ్రంకుడ్య సీమకమ్)
కుడ్యమధ్యావసానంవా కుడ్యబాహ్యంతథాపివా।
అథవాశేష విప్రాణాం నీవ్రం హెూమాద్విధీయతే॥ 7
ప్రథమం ప్రకృతేస్తుల్యం తస్మాద్గుణాంగులంనతమ్।
ద్వితీయాద్యంతు పంచాంతం తద్వదేవనతం క్రమాత్॥ 8
కల్ప్యం వైహర్మ్యమానేన హస్తమానమథోచ్యతే।
త్రిపంచ సప్తహస్తేన ప్రథమంత్రి విధం భవేత్॥ 9
నవైకాదశహస్తంచ త్రయోదశం ద్వితీయకమ్।
త్రిపంచసప్త దశహస్తం తథైకోన వింశతిః॥ 10
మధ్యహారం త్రిధాప్రోక్తం మర్యాదాస్తుతతః శృణు।
ఏకవింశత్రయోవింశ పంచవింశకరం భవేత్॥ 11
సప్తవింశనవవింశ మేకత్రింశత్కరేణతు।
మహామర్యాది విస్తార ఏవంత్రి విధముచ్యతే॥ 12
ఏవమాఖ్యాసహర్మ్యాణాం వికల్పానాంచ కల్పయేత్।
(పంచహస్తం సమారభ్య త్రయస్త్రింశత్కరాంతకమ్)
సప్తహస్తం సమారభ్య పంచత్రింశావసానకమ్॥ 13

ప్రత్యేకం ప్రథమాదీనాం సాలానాంత్రి త్రిమానకమ్।
త్రిపంచ సంఖ్యయాప్రోక్తం హర్మ్యాణాంఛంద సంజ్ఞ
నవహస్తం సమారభ్య సప్తత్రింశావ సానకమ్।
ప్రాగ్వైసాల సమాఖ్యాతు హర్మ్యాణాంజాతి సంజ్ఞకా।
ప్రాగుక్త హార్మ్యమానైశ్చ శాలాద్యంత్యంగ సంమతమ్
పంచప్రాకారమేవంహి త్రిప్రాకార మథోచ్యతే॥

తా॥ ఆలయము యొక్కయు శాలయొక్కయు రక్ష
మును అలంకారము కొఱకును ప్రాకారములను నిర్మించు
చెప్పుచున్నాడు. ఆలయముయొక్క విస్తారములో సగముగాని
లలో 1 భాగముగాని, 4 భాగములలో 1 భాగముగాని, లోపల
చేయవలెను. లోపల ప్రదేశముయొక్క విస్తారమునకు
వెలుపల ప్రదేశమును కల్పించవలెను. 3 రెట్లు వెలుపలి
చేయవలెను దాని తరువాత ప్రదేశమును 4 రెట్లు విస్తారము
పలి ప్రదేశమును 5 రెట్లు విస్తారముతోను చేయవలెను. ఆల
స్తంభమునుండి గాని లేక అధిష్ఠానమునకు దిగువ ప్రదేశ
మొదటి ఆవరణమునకును, దానినుండి రెండవ ఆవర
రెండవదానినుండి 3వ ఆవరణమునకును, మూడవ దానినుం
ణమునకును నాల్గవదానినుండి 5వ ఆవరణమునకును ని
చేయవలెను ఇట్లు గోడలిలోపలి అంచు లేక నడుము లేక
ఇట్లు 3 విధములు, మొదటి ఆవరణము ప్రకృతితో సమానమ
దానికంటె 3 అంగులములు పల్లము. ఇట్లు ఒక్కొక్క ఆవర
అం. చొప్పున తగ్గించుచు ఐదు ప్రాకారములను కల్పించవల
మానము చెప్పుచున్నాడు మొదటి అవరణము 3,5. 7 హ
రెండవది 9, 11, 13 హస్తములతోను మూడవది 15, 17, 19
తోను నాల్గవది 21, 23, 25 హస్తములతోను, అయిదవది
హస్తములతోను. ఇట్లు ఆభాస హర్మ్యములకును, 5 హస్తముల
33 హస్తములతో వికల్ప హర్మ్యములకు ఛంద హర్మ్యములక
ములు మొదలుకొని 35 హస్తముల వరకును, జాతి హ

9 హస్తములు మొదలు 37 హస్తములవరకును ప్రాకారమును కల్పించ వలెనుఇది పంచప్రాకార విధానము- శిల్పరత్నము 40వ అ. 16 మొ. 26వశ్లోకము వరకు పై అర్థమునే చెప్పబడియున్నది.

ఇక మూడు ప్రాకారముల పద్ధతి చెప్పబోవుచున్నాడు.

శ్లో॥ ద్వితీయం తృతీయసాలంచ చతుర్థం ప్రగృహ్యతామ్।
యత్రయద్విహితం సాలం హర్మ్యవృత్తంతు లక్షయేత్॥ 17

తస్యముఖే ముఖాయామం కల్పయేచ్ఛిల్ప విత్తమః।
బీజాత్పాదబీజంత్వర్ధం త్రిపాదం చ సమంతువా ॥ 18

ద్విగుణం త్రిగుణంవాఽథ చతుః పంచగుణంతువా।
కల్పయేత్తు ముఖాయామం బీజమూర్ధ్వం ద్విజోత్తమ ॥ 19

అంతర్మండలభిత్తేస్తు విస్తారోవ్యోనహస్తకః।
తస్మాత్ త్రిమాత్ర వృద్ధ్యావా షణ్మాత్రంవాఽథవర్ధయేత్॥ 20

సార్ధహస్త ద్విహస్తంతు మహామధ్యావ సానకమ్।
భిత్తివ్యాసంసమాఖ్యాత ముత్సేధంశృణుసువ్రత ॥ 21

తద్వ్యాసత్రి చతుష్పంచ గుణం వాసాలతుంగకమ్।
అథవోత్తర సీమాంతం నీవ్రాంతం వాజనాంతకమ్ ॥ 22

ప్రస్తరేషుగతేవాఽథ సాలతుంగముదాహృతమ్।
ఋజుబీజతలోపేతం బాహ్యేత్వభ్యంతరార్జవమ్ ॥ 23

కుడ్యమూలస్య విస్తారాత్ వస్వంశోనాగ్ర విస్తరమ్।
మూలాదగ్రంక్రమాత్క్షీణం వస్వంసాంశే ద్విజోత్తమ ॥ 24

అథవాహస్తమానేన సాలోత్సేధం వదామ్యహం।
ప్రథమం కలశాం తంతు ద్వితీయం ఫలకాన్వికమ్ ॥ 25

బోధ్వంశం స్యాత్ తృతీయంతు చతుర్థం మంచకాంతకమ్।
పంచమంతు కపోతాంతం పంచసాలోదయం క్రమాత్॥ 26

ఏతద్ధి పంచసాలేషు తాసాముక్తోహ్యయం విధిః।
అవృతం మాలికావాస్యాత్ సహకార మథాపివా ॥ 27

మండపాకృతికం వాఽథ ఋజుమధ్యమథాపివా ।
భూతవేదగుణం పక్షి వ్యోమభూ్యామ మథోచ్యతే ॥ 28

కుడ్యస్యో పరికుడ్యం స్యా త్పాదం పాదోపరిన్యసేత్ ।
తలం ప్రతి తలం కుర్యాత్ పాదం ప్రత్యల్పనాసికా॥ 29

వక్ష్యేఽహం పాదమానంచ పంక్తి మానం ద్విజోత్తమ।
మూల హర్మ్యేతు హోమాది ఉత్తరాంతం యదున్నతమ్ ॥ 30

తన్మానం సప్తధా భజ్య పక్షాంశం సుధరాతలమ్ ।
పంచాంశంపాద దీర్ఘంతు పాదం సవ్యాంగ సంయుతమ్॥ 31

ధరాతలం తదుక్తంవా ఋజుమంవా ప్రకల్పయేత్।
మూలహర్మ్యేతు హెూమాది ఉత్తరాంతం నవాంశకే ॥ 32

ధరాతలం ద్విభాగంస్యాత్ సప్తాంశంచ రణోదయమ్।
ఉత్తరాంతం తు హెూమాది రుద్రభాగ విభాజితే॥ 33

అధిష్ఠానం గుణాంశంస్యాచ్ఛేషం పాదోదయుంభవేత్ ।
మూల ప్రాసాదతుల్యం వా చరణం చ ధరాతలమ్॥ 34

పాదోత్సేధాంశ మానంతు షట్ సప్తాష్టాతువా భజేత్।
ఏకాంశం పాదవిష్కంభం దారవాశ్మమయంతువా॥ 35

తత్త్రిభాగం ద్విభాగంవా త్రిపాదంవాఽర్ధ ఏవవా।
కుడ్యం పాదస్య విస్తారం సర్వత్ర పరికల్పయేత్॥ 36

తా॥ ఏ ఆలయమునకేది అనుకూలమో దానిననుసరించి 2, 3, 4 ప్రాకారములను రచించుచుండవలెను. ఆలయ ముఖమునకు దగిన పాడవుతో ఆయా అవరణములకు ముఖా యామములను కల్పించవలెను. బీజమునుండి పాదబీజమును, అర్ధబీజమును, ముప్పాతిక బీజమును. సమానమును, రెట్టింపును, 3 వంతులును, 4.5 వంతులును. ఇట్లు ముఖా యామమును చేయవచ్చును. బీజముపైన గోడలలోపల నున్న విస్తారము 1 హస్తము. అక్కడ నుండి 3 అంగులములు వృద్ధితోగాని, 6 అంగులములు వృద్ధితోగాని వరుసగా అన్ని ప్రాకారముల గోడలు కల్పించవలెను

2½ హస్తములు మహామధ్యావసానము వరకు గోడయొక్క విస్తారమును ఎత్తును చెప్పుచున్నాడు. ఆ విస్తారముయొక్క 3-4-5 రెట్లు ప్రాకారము యెత్తు లేక ఉత్తరపట్టము వరకుగాని నిర్గమముయొక్క యెత్తుతో సమానముగాని, వాజనమువరకు గాని, లేక ప్రస్తరము యొక్క గలము వరకు గాని ప్రాకారము గోడ యెత్తు చేయవచ్చును. ఋజబీజ ప్రదేశములో వెలుపలను లోపలను ఆవరణముల చేయవలెను. గోడ మొదలుయొక్క విస్తారమును 8 భాగములుచేసి అందు 1 భాగమును తగ్గించి పై విస్తారమును కల్పించవలెను. మొదటి నుండి చివరకు వరుసగా తగ్గుచునుండవలెను. లేక హస్తముల కొలతతో ప్రాకారము యెత్తు చెప్పుచున్నాము. మొదట కలశము వఱకును, రెండవది ఫలకమువఱకును, మూడవది బోధిక వఱకును, నాల్గవది మంచకము వఱకును, ఐదవది కపోతము వఱకును, పంచప్రాకారముల యెత్తు ఇట్లు చేయవలెను, చుట్టూ హారము వలె ఒక్కొక్కటియైనను లేక ఒకదానికొకటి సంబంధముగా నైనను చేయవచ్చును మండపమువలెగాని, ఋజుమధ్యముతోగాని 5.4.3-2-1 భూములను జెప్పుచున్నాడు గోడపైన గోడను, స్తంభము మీద స్తంభమును అంతస్తుపైన అంతస్తును, చేయవలెను. స్తంభమున అల్పనాసికలు చేయవలెను. స్తంభమానమును చెప్పుచున్నాడు. హెూమము మొదలు ప్రధానాలయము యొక్క ఉత్తరమువఱకు గల యెత్తును 7 భాగములుచేసి 2 భాగములు ధరాతలమును, స్తంభముయొక్క నిడివి 5 భాగములును, ఇట్లు సవ్యమైన రూపములతో రచించవలెను. ధరాతలము చదరముగా గాని ఇంకను చెప్పబడిన పద్ధతులతోగాని రచించవలెను. ఆలయమును హెూమము మొదలు ఉత్తరము వఱకు 9 భాగములు చేసి ధర 2 భాగములు, స్తంభము 7 భాగములు, లేక పైదానినే 11 భాగములు చేసి అధిష్ఠానము 3 భాగములు, స్తంభము 8 భాగములు, లేక ఆలయముతో సమానముగాగాని చేయవచ్చును. లేక స్తంభము ఎత్తును 6-7-8 భాగములుచేసి విస్తారము 1 భాగముతో దారుస్తంభమును రచించవలెను. జాతితో జేయు

నపుడు ఎత్తులో సగముగాని లేక 3వ వంతుగాని విస్తారము కలిగియుండ వలెను. స్తంభముయొక్క విస్తారముతో సమానముగా గోడ విస్తారమును చేయవలెను. ఇట్లు అంతటను కల్పించవలెను.

శ్లో॥ త్రిచతుష్పంచ హస్తంవా పరితోమాలికాకృతిః।
హస్తద్వయం సమారభ్య పంచహస్తావసానకమ్ ॥ 37

గుణాంగుల ప్రవృద్ధ్యా చ పంక్త్యాయాం పంచవింశతి।
భేదేన కథితంవిప్ర సర్వత్ర సమపంక్తయః ॥ 38

యుగ్మా యుగ్మంతువా పంక్తిః సర్వత్ర పరికల్పయేత్।
మూలభాగ విశాలంతు ధర్మనం ద్వాష్టభాజితే॥ 39

ఏకాంశ రహితాగ్రంస్యా న్మూలాదగ్రం క్రమాత్కృశమ్ ।
అగ్రపాద విశాలంతు దండ ఇత్యభిధీయతే ॥ 40

దండం త్రిపాద మర్ధంచ క్రమాచ్ఛ్రేష్ఠాం తరాధమమ్ ।
ఉత్తరోత్సేధమాఖ్యాతం విస్తారం మూలపాదవత్ ॥ 41

మధ్యపాదసమం వాఽథ అగ్రపాదసమంతువా ।
ఉత్తరవ్యా సమాఖ్యాతం శ్రేష్ఠాంతరాధమం క్రమాత్ ॥ 42

ఉత్తరోచ్చత్రిభాగైకం వాజనోచ్చంతు నీవ్రకమ్ ।
ఉత్తరోత్సేధ తుల్యంతు తులానీవ్రము దాహృతమ్॥ 43

తదర్థం వాత్రిపాదం వా తస్య విస్తార మేవహి ।
వాజనేగుల్యకోర్ధ్వే వా తులాస్థాపన మాచరేత్॥ 44

తులార్ధనీవ్ర విస్తారం జయంతస్య తులోపరి।
జయంతార్ధ విశాలోచ్చం మనుమార్గముదాహృతమ్॥ 45

తులాంతరం తులోచ్చంతు జయంత్యాశ్చ తదంతరమ్।
మనుమార్గం తథాకల్ప్యం దండమానేష్ఠకాంతరమ్॥ 46

కపోతాదీనినీ వ్రాంగ ప్రస్తారోక్తవదా చరేత్।
అథవాతులో పరిష్టాత్తు ఇష్టకాస్తరణం కురు॥ 47

సుధయాగుడతోయైశ్చ ఇష్టకాస్తరణం భవేత్।
కరాలముద్గ తుల్మాషః కల్కచిక్కణ మాచరేత్ ॥ 48

ఇష్టకాస్తరణం హ్యేత చ్ఛిలాచేందుతలోపరి।
శైలజోత్పలకాభిశ్చ ఛాదయేత్తు విశేషతః॥ 49
వాజనోర్ధ్వేతువాఽఽసాద్య సుధాకర్మ సమాచరేత్।
ఏవమాది తలంప్రోక్త మూర్ధ్వ భూమిం వదామ్యహమ్॥ 50

తా॥ గోడను ఆలయము చుట్టూ 3-4-5 హస్తముల యెత్తున రచించవలెను. 2 హస్తములు మొ. 5 హస్తముల వరకు 3 అం. వృద్ధితో వరుసలుగా 25 భేదములతో అంతటను చుట్టూ సమాన వరుసలుగా నిర్మించు విధములు కలవు. జతలుగా గాని బేసి సంఖ్యలుగా గాని చేయవచ్చును. ప్రధాన భాగముయొక్క విస్తారము 10-9-8 భాగములుచేసి అందు 1 భాగము తీసివేసి స్తంభము చివర చేయవలెను. పై స్తంభము యొక్క విస్తారమును దండము అని చెప్పుదురు. ఆ దండమును ముప్పాతిక వంతును, సగమును, వరుసగా ఉత్తమ, మధ్యమ, అధమములుగా నెంతురు. మొదటి స్తంభమువలె పై స్తంభముయొక్క విస్తారమును యెత్తును చేయువచ్చును. లేక మధ్యస్తంభముతో సమానముగాగాని చివర స్తంభముతో సమానముగాగాని పైదానియొక్క విస్తారము చెప్పబడియున్నది. ఉత్తరముయొక్క విస్తారము 3 విధములు. ఉత్తరము యెత్తు 3 భాగములు చేసి అందు 1 భాగము వాజనము యెత్తును నిర్గమమును, ఉత్తరము ఎత్తుతో సమానము దూలముయొక్క నిర్గమము. అందులో సగముగాని ముప్పాతిక వంతుగాని దానియొక్క విస్తారము. వాజనము యొక్క గుల్మముపైన తులాస్థాపనము. దూలముపైన జయంతమునకు నిర్గమమును విస్తారమును దూలములో సగము. జయంతముయొక్క విస్తారములో సగము మనుమార్గముదాహృతము. దూలము మఱియొక దూలము యెత్తు జయంతికి ఆ తరువాత వాస్తుప్రకారము కల్పించవలెను. దండమానముచేత యిష్టకములతో భేదములను రచించవలెను. కొలతల ప్రకారము కపోతములు మొదలయినవాని నిర్గమములు శాస్త్రప్రకారమే చేయువలెను. లేక దూలముపైన ఇష్టకములను సున్నముతో పఱచవలెను

సున్నము పాకముచేసి అందులో బెల్లపురసమును, పెసరగంజియును. పోకలు నానబెట్టిన మడ్డియును, మొదలగునవి పోయువలెను. అట్టి పాక ముతో ఇటుకలను అంటించవలెను. మొదటి అంతస్తుపైన ఇట్లు చేసి పెద్ద జాతి పలకలను వానిపైన పఱచవలెను. వాజనముపైన నుంచవలెను. ఇట్లు మొదటి అంతస్తు నిర్మించవలెను. రెండవ అంతస్తు యొక్క విధానమును చెప్పుచున్నాడు.

శ్లో॥ మూలాగ్రస్తంభ తుంగంతు నందమూలాష్టభాజితే।
ఏకాంశ రహితాంఘ్రిశ్చ తథైవోర్ధ్వోర్ధ్వ భూమయః॥ 51

ప్రస్తరంచ తథార్ధావ మేకానేక తలేఽపిచ।
ప్రస్తరోపరికర్తవ్యం భిత్తిమేవ పరోదయమ్ ॥ 52

ఛత్రాకారం శిరోపేతం సదాకార మథాపివా ।
గోపావమథవా వాజం సదాకల్ప్యాంతరేద్విజ॥ 53

మృణ్మయైర్లోష్టకైర్వాఽథ సారదారుమయైస్తథా ।
గోపానంఛాదనం కుర్యా ల్లుప్రక్రియా శిరోఽన్వితమ్॥ 54

సభాకార మిదంఖ్యాతం యథేష్టంతేషు కల్పయేత్॥ 55

జాతిపంచతలంఖ్యాతం ఛందవేదతలం భవేత్। 56

వికల్పంత్రి తలంవిద్యా దాభాసేత్వేక భూమికం।
జాత్యాదీనాంతు హర్మ్యాణాం యోగ్యంసాల తలంకురు॥ 57

మర్యాదిసాలమాశ్రిత్య పావకే పచనాలయమ్।
నైరృత్య ఆయుధస్థానం వాయువ్యం శయనాహ్వకమ్॥ 58

శాంకరేయోగశాలాస్యాద్ భృశభాగేఽథవాపునః।
ఆగ్నేయ యామ్యయోర్మధ్యే కర్తవ్యం జననాలయమ్॥ 59

శక్రశాంకర యోర్మధ్యే మజ్జనాలయమేవహి।
ధాన్యస్థానం చతత్పార్శ్వే భృంగరాజపదేఽపివా॥ 60

నిర్ఋతి వరుణ యోర్మధ్యే పుస్తకానాం మహాలయమ్ ।
తత్పార్శ్వయోః ప్రకర్తవ్యం వ్యంజనాలయ ముత్తమమ్॥ 61

సోమవాయ వ్యయోర్మధ్యే వస్త్రాభిణామాలయం కురు।
సోమశంకర యోర్మధ్యే గౌర్యావా సంప్రకల్పయేత్॥ 62

తత్పార్శ్వేశయనస్థానం పర్యంకేన సమన్వితమ్।
పుష్పదంతపదేవాఽథ మాహేంద్రే పుష్పమండపమ్॥ 63

గృహక్షతపదే కుర్యాద్ధాన్యాలయంద్విజోత్తమ।
పరితోమౌలికాయాంచ ఏవమేవ ప్రకల్పయేత్॥ 64

మౌలికాంతేతు సోమాంశే కూపస్థానము దాహృతమ్।
అథవాఽన్య ప్రకారేణ వక్ష్యేసందేశ నిర్ణయమ్॥ 65

శక్రశాంకర యోర్మధ్యే విద్యాస్థాన ముదాహృతమ్।
శంకరశ్రీదయోర్మధ్యే ధనస్థానముదాహృతమ్॥ 66

యామ్యపావక యోర్మధ్యే పుష్పమండప ఉచ్యతే।
యామ్యనైరృతయోర్మధ్యే స్నానాంబు కోష్ఠముచ్యతే॥ 67

నిరృతివారుణ యోర్మధ్యే ధర్మశ్రవణమండపమ్।
వాయవ్య వారుణీమధ్యే ఆయుధ స్థానముచ్యతే॥ 68

వాయవ్యసౌమ్య యోర్మధ్యే శయనస్థానముచ్యతే।
ఈశానసౌమ్య యోర్మధ్యే యాగార్థం మండపం కురు॥ 69

జయంతే మజ్జనాగార మాగ్నేయే పచనాలయమ్।
పరితోమాలికాయాంతు సకలస్థానముచ్యతే॥ 70

తా॥ మొదటి అంతస్తున ముందటి స్తంభము 9 భాగములు దానిని 8 భాగములుచేసి 1 భాగము తగ్గించి 7 భాగములతో పై అంతస్తున స్తంభమును చేయవలెను. ఇట్లు అన్ని అంతస్తులకు వరుసగా చేయవలెను. ప్రస్తరము ½ భాగము చొప్పున తగ్గించుచుండవలెను. ప్రస్తరము పైన గోడనే మఱియొక అంతస్తునకు చివరగా ఎంచుకొనవలెను. శిఖరము గొడుగువలెగాని, నలుచదరముగాగాని, గోపానముగా గాని, వాజనముగా గాని, చేయవచ్చును. మట్టితోను, పెంకులతోను. సత్తువగల దారువులతోను,

గోపానమును కప్పవలెను. ఉపలు మొదలగువానితో శిఖరమేర్పరచి కప్ప వలెను. దీనిని సభాకారమందురు. ఇష్టము వచ్చినట్లు చేయవచ్చును. జాతియందు 5 అంతస్తులు, ఛందమున 4 అంతస్తులు, వికల్పమున 3 అంతస్తులు, ఒక్కటే అంతస్తు. పై జెప్పిన జాతి. మొదలగు ఆలయములకు అనుకూలమైన ప్రాకారము లను చెప్పుచున్నాడు. మర్యాది ప్రాకారము నానుకొని ఆగ్నేయమున పాకశాల, నైర్ఋతిన ఆయుధ నిలయము, వాయువ్యమున శయన గృహము ఈశాన్యమున యోగశాల లేక ఇంద్రాగ్నేయముల మధ్యనైన చేయ వచ్చును. ఆగ్నేయ దక్షిణములమధ్య ప్రసూతిశాల, ఇంద్ర-ఈశాన్యదిశల మధ్య స్నానగృహము దాని ప్రక్కను ధాన్యాగారము. లేక యమనిర్ఋతులమధ్యను, నిర్ఋతి వరుణుల మధ్య గ్రంథాలయము. దాని ప్రక్కను నాట్యశాల, కుబేర వాయవ్యముల మధ్య వస్త్రాలయము, కుబేర ఈశానుల మధ్య పార్వతీదేవి ఆలయము, దాని ప్రక్క శయన మండపము. లేక పుష్పదంత స్థానముననుచేయవచ్చును. ఇంద్ర దిశయందు పుష్పమండపము. మఱియు గృహక్షత పదముననుధాన్యాలయమును రచించ వచ్చును చుట్టూ మౌళికయందు ఈ ప్రకారము రచించవలెను. మౌళిక యొక్క అంతమున కుబేరస్థానమున బావిని కల్పించవలెను. శాస్త్రోక్త ప్రకారమరికొక దిశయందైనను రచించ వచ్చును, ఈశాన ఇంద్రుల మధ్య విద్యాశాల, ఈశాన కుబేరుల మధ్య ధనాదరము, యమాగ్నేయముల మధ్య పుష్ప మండపము, దక్షిణ నైరృతుల నడుమ స్నానమందిరము, నిర్ఋతి వారుణముల మధ్య పురాణ శ్రవణ మండపము, పడమర వాయవ్యముల నడుమ ఆయుధ స్థానము, వాయవ్య ఉత్తరములమధ్య శయన స్థానము, ఈశాన, కుబేర దిశల నడుమ యాగమండపము, ఈశాన ఇంద్రుల నడుమ స్నానాగారము, ఆగ్నేయమున పాకశాల, మాలికయందు చుట్టూ ఇట్లు నిర్మించవలెను. మఱియు సమస్త దేవతలకు స్థానములను చెప్పుచున్నాడు.

శ్లో॥ శాంకరే నృత్తమూర్తిస్తు ఆగ్నేయ్యాం వృషవాహనం।
స్కందం చ ఉమాహితం నైరృత్యేపరి కల్పయేత్॥ 71
కంకాలం వాయుదిగ్భాగే భిక్షాటనం జయంతకే।
సుఖాసనంతు సత్యాంశే । వితథేత్రి పురాంతకమ్॥ 72
సుగ్రీవే హరిహరం స్యాద్ గంధర్వే చంద్రశేఖరమ్।
శేషాంశే కామదహనం ముఖ్యే కాలారిమూర్తికమ్॥ 73
అదితేఽర్ధనారిమూర్తిస్తు ఇంద్రే కల్యాణ సుందరమ్।
క్షేత్రపాలంతు పర్జన్యే యామ్యే వైదక్షిణేశ్వరమ్॥ 74
వారుణే లింగముద్భూతం సౌమ్యేతుగజహారిణమ్।
ఇత్యర్ధ హర్మ్య ఈశాంశ్చ అంతరావేషు కల్పయేత్॥ 75
మూలహర్మ్యం సమీక్ష్యైవ । సకలస్థాపనం కురు।
ప్రాకారేషు చతుర్దిక్షు ద్వారశోభాది కల్పయేత్॥ 76
ప్రాకారతతిమధ్యేతు దీర్ఘమధ్యేతివేచనమ్।
అథవామూల హర్మ్యస్య మధ్యసూత్రాశ్రితం భవేత్॥ 77
ప్రధానద్వారమేకంవా ద్వయంవాఽన్యత్తు జాలకమ్।
ప్రాకారమే వమాఖ్యాతం బాహ్యే విధిర్విధీయతే॥ 78
ఏకద్విత్రి చతుష్పంచ దండం వాహాది విస్తృతమ్ ।
తద్బాహ్యేతుత్రయశ్రేణి మనేనవిజనాకురు॥ 79
శైవానాం పరివారాణాం ప్రాచ్యమావాసముచ్యతే।
ప్రాచ్యాంవా సౌమ్యదేశేవా దేశికావా సముచ్యతే॥ 80
దైవజ్ఞాంబష్ఠభిషజాం వాసస్థానంచ యామ్యకే।
నిబంధాహారజీవీనాం పశ్చిమేవాస ముచ్యతే॥ 81
సర్వేషామపిభక్తానాం వాసముత్తరపార్శ్వకే।
అగ్నౌ మహావ్రతస్థానం యామ్యే పాశుపతాలయమ్॥ 82
కాలాముఖంతు నైరృత్యే చోర్థ్వాలయంతు వారుణే।
వాయౌతు అర్హతస్థానే సౌమ్యేభూసుర సత్రకమ్॥ 83
జ్ఞావాభ్యాసాదధః కుర్యాద్వైశ్యానాంతు విశేషతః ।
తద్బాహ్యేత్వీశదిగ్భాగే కార్యామహాజలాశయమ్॥ 84
యామ్యపావక యోర్మధ్యే గోశాలాంశం ప్రకల్పయేత్।
దక్షిణేచోత్తురేవాఽపి స్థాపత్యాది నివాసకమ్॥ 85
వారుణీనైరృతీమధ్యే సూతికావాసముచ్యతే।
వారుణానిలయోర్మధ్యే రోగార్తానాం నివాసకమ్॥ 86

సౌమ్యవాయవ్య యోర్మధ్యే బాలశిక్షార్థ మండపమ్।
సోమశంకరయోర్మధ్యే ధాన్యమంజూషికా భవేత్॥ 87
తద్బాహ్యేబవలితేవిప్ర దాసీనాం గణికాదినామ్।
నృత్తగేయాభ్యాసనాంతు క్రయవిక్రయ జీవినామ్॥ 88
చక్రిణాంచాపకానాంచ కలాలానాంతథైవ చ।
మత్స్యమాంసోపజీవీనాం నృత్యకారక యోషితామ్॥ 89
నాపిత శూద్రకానాంతు గోపాలానాంచ వారుణమ్।
కరణానాం గృహశ్రేణీ చాపస్థాన పరిగ్రహమ్॥ 90
పరితః కల్పః యేద్ధీమాన్ పూర్వాదీశావసానకమ్।
తద్బాహ్యేత్వీశదిగ్భాగే శ్మశానం పరికల్పయేత్॥ 91
తాసాం బాహ్యేతు కర్తవ్యం రజకానాం నివాసకమ్।
తద్బాహ్యేక్రోశమాత్రేతు చండాలశ్రేణి రుచ్యతే॥ 92
ప్రాకారలక్షణం హ్యేవం ప్రోచ్యతే ద్విజసత్తమ॥ 93
ఇతి కాశ్యపశిల్పే ప్రాకారలక్షణం త్రిచత్వారింశః పటలః

ఈశాన్యమున నటేశ్వరుని, ఆగ్నేయమున వృషభారూఢుని, నైరృతిన పార్వతీషణ్ముఖులతోగూడిన శివుని, వాయవ్యమున కంకాలరూపుని, ఇంద్ర ఈశాన్యముల మధ్య భిక్షాటన మూర్తిని, తూర్పు ఆగ్నేయముల నడుమ సుఖాసన మూర్తిని, ఆగ్నేయ దక్షిణముల నడుమ త్రిపురాంతకుని, నైరృతి పడమరల నతిమ హరిహరమూర్తిని, నైరృతి దక్షిణముల నడుమ చంద్రశేఖరుని, పడమర వాయవ్యముల నడుమ మన్మథదునుని, వాయవ్య ఉత్తరముల నడుమ యముని హరించిన రూపముగాను, ఉత్తర ఈశాన్యముల నడుమ అర్ధనారీశ్వర రూపమును. తూర్పున కల్యాణ సుందర మూర్తి, ఈశాన ఇంద్ర దిశలమధ్య క్షేత్రపాలుని, దక్షిణమున దక్షిణా మూర్తిని, పడమర లింగస్వరూపమును, ఉత్తరమున గజాసురుని జయించిన రూపమును, ఇట్లు ఆలయముయొక్క సగము యెత్తులోపల ఈశ్వరునియొక్క రూపచిత్రములను కల్పించవలెను. ప్రధానాలయమునందలి భాగముల ప్రకారం విగ్రహములనుంచవలెను. ప్రాకారముయొక్క నలు దిశలయందు ద్వారశోభ మొదలగు వానిని రచించవలెను ప్రాకారముల నడుమును తప్పనీయరాదు లేక ప్రధానాలయము యొక్క మధ్యసూత్రమును బట్టి ప్రధాన ద్వారము 1 గాని, లేక 2 వైపుల 2 గాని, రచించవలెను ఇతరదిశలయందు కిటికీలను మాత్రముంచవలెను. వెలుపలి

నిర్మాణమును చెప్పుచున్నాడు. 1-2-3-4-5 దండములు వాహనశాల మొదలైనవి దాని వెలుపల 3 వరుసలు చెప్పబోవు విధముగా జేయవలెను. తూర్పున శివభక్తి గలవారియొక్క సేవకుల ఇండ్లను, తూర్పునగాని లేక దక్షిణమున గాని గురుపీఠమును, జ్యోతిష్కులు, అంబష్ఠులు, వైద్యులు, కూడ దక్షిణముననే యుండవలెను. వ్రతములు మొదలగు దీక్షలవలన ఆహారనిబంధము గలవారు పడమరను, మిగిలిన అన్ని కులములవారు ఉత్తరమున నుండవలెను. ఆగ్నేయమున వ్రతములుచేయు ప్రదేశమును, దక్షిణమున పాశుపతాలయమును, నైరృతిన కాలాముఖమును, పడమర ఊర్ధ్వమును, వాయవ్యమున గాని లేక ఉత్తరమునగాన తగినచోట బ్రాహ్మణులకు సత్రమును, జ్ఞానాభ్యాస మందిరమునకు దిగువ వైశ్యుల యిండ్లును, దానికి వెలుపల ఈశాన్యమున పెద్ద చెఱువును దక్షిణ ఆగ్నేయముల మధ్య పశుశాల భాగము చేయువలెను. దక్షిణమున గాని లేక ఉత్తరమునగాని శిల్పాచార్యుల యిండ్లను, పడమర నైరృతి దిశల మధ్య ప్రసూతి గృహమును, పడమర వాయవ్యలనడుమ రోగబాధితులు మొదలగు వారికి దగిన యిండ్లను- వాయవ్య ఉత్తరముల నడుమ బాలురకు పాఠశాలయును, ఉత్తర ఈశాన్యముల నడుమ ధాన్యము మొదలైనవి యుండవలెను. దాని వెలుపలి వలయమున దాసీజనమును వేశ్యలు మొదలగు వారును, నృత్త గేయాది అభ్యాసకులును, సరకులమ్ముకొనెడివారును తైలము దీయువారును, క్షురకర్మ చేయువారును, కుండలు చేయువారును చేపలమ్ముకొనువారును, నాట్యస్త్రీలును వాద్యములు వాయించువారును, శూద్రాదులును, గోవులను పోషించువారునూ, వీరందఱు పడమరనుండవలెను. కరణజాతి మొదలగువారు పైజెప్పబడియున్న అందరి ఇండ్ల చుట్టు వెలుపల నుండవలెను. దానికి వెలుపల ఈశాన్యమున శ్మశానమును కల్పించవలెను. దానికి వెలుపల గుడ్డలు మొదలైనవి ఉదుకువారి కుంట యుండవలెను దానికి వెలుపల 1 క్రోసు దూరమున జంతువధ మొదలయినవి చేసి జీవించువారును ఉండవలెను. శిల్పరత్నము 40వ అధ్యాయమున వ్రాయబడిన ప్రాకార లక్షణము కూడ యిదే పద్ధతిలో నున్నందున వ్రాయబడలేదు.

ఇది శ్రీ శ్రీమద్విశ్వకర్మ వంశమూలర్షి పంచకమధ్య మాహభూనన గోత్ర
పవిత్ర, స్వర్ణాచ్ఛమాంబా వేంకటశివార్యపౌత్ర, లక్ష్మాంబా కోటయ సుధీ
మణి పుత్ర, శ్రీమద్గాయత్రీ విరాడ్విశ్వకర్మ వరప్రసాద జనితకవితా
సుధారసపాత్ర, పదవాక్య ప్రమాణ నిధాన - విమర్శకాచార్య-
శిల్పకళాకోవిద-సర్వతంత్ర స్వతంత్ర- స్థపతి తిలకాది బిరుద
విరాజమాన, సుబ్రహ్మణ్యాభిధాన విరచిత నానావాస్తు
శిల్పాగమ శాస్త్ర పరిశీలనాత్మకాంధ్ర తాత్పర్య సహిత
భారతీయ మహాశిల్పమునందు వరాట ప్రాసాద
ములు, విమానజాతి ప్రాసాదములు, నాగర
సాంధారప్రాసాదములు, అపరాజితునివిమాన
జాతి, రుచిక జాతిలోని సాంధార ప్రాసా
దములు, ప్రశస్తలతన జాతిలోని
భేదములు, మిశ్రజాతి ప్రాసాద
ములు, స్త్రీ సంజ్ఞకవలభి
ప్రాసాదములు, సింహావ
లోకనప్రాసాదములు
అపరాజితుని
విమానజాతి
ప్రాసాదములు,
నాగరజాతి బ్రహ్మ
విష్ణ్వాదిప్రాసాదములు
ఆలయ ద్వార దేవతలు,
ప్రాకారవిధానముగల దేవా
లయభేదములు అను
సప్తమ కళ.

—o—

# అనుబంధము సప్తమ కళ

1వ పటము




దిగ్భద్ర ప్రాసాదము

2వ పటము



3వ పటము




5వ పటము




4వ పటము




6వ పటము



7వ పటము



నంధ్యావర్తము
17 భా.

9వ పటము



నంద్యావర్తము

8వ పటము



10వ పటము




12వ పటము

11వ పటము






నందివర్ధనము

## 13వ పటము



విమాన ప్రాసాదము
20 భా.

## 15వ పటము




## 14వ పటము



16వ పటము




17వ పటము




18వ పటము



పద్మ ప్రాసాదము

19వ పటము




20వ పటము






21వ పటము

మహాభద్ర ప్రాసాదము

22వ పటము

శ్రీవర్ధమానము

24 భా.



23వ పటము






24వ పటము

శ్రీవర్ధమానప్రాసాదము

25వ పటము




26వ పటము



29వ పటము



## 27వ పటము




## 28వ పటము




## 30వ పటము



విమానజాతి ప్రాసాదము

31వ పటము




32వ పటము




ఎత్తు 48 భా.

20 భా.

లక్ష్మీభూషణ ప్రాసాదము

## 33వ పటము




## 34వ పటము




ఎత్తు 56 భా.

22 భా

సర్వాంగభూషణ ప్రాసాదము

## 35వ పటము



## 36వ పటము

### మందర తిలక స్వరూపము

తలచ్ఛందము 12 భా.

తిలకములు 24

కర్ణ శృంగములు9 12

ప్రతిరధము శృంగము

దిగవ 16

పైన 8

ప్రధాన శృంగము 1

మొత్తం 61

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 2 | 2 | 1 | 2 | 1 | 2 | 2 |
| 2 | | | తలచ్ఛందము 12 భా. | | | 2 |
| 1 | | | తిలకములు 24 | | | 1 |
| 2 | | | కర్ణ శృంగములు 12 | | | 2 |
| 1 | | | ప్రతిరథ శృంగములు 2 వరు 16 | | | 1 |
| 2 | | | పైన 8<br>ప్రధాన శృంగము 1 | | | 2 |
| 2 | 2 | 1 | 2 | 1 | 2 | 2 |

37వ పటము

శ్రీభువన తిలక

స్వరూపము




38వ పటము



40వ పటము



39వ పటము

త్రైలోక్య తిలకము



41వ పటము




వలభికాతి

నిడివి - 10 భా.

వెడల్పు 8 భా.

గర్భము 6

42వ పటము




ప్రస్తరము పైన

44వ పటము

ఎత్తు 20 భా.

వలభీప్రాసాదము

5 అంతస్తులు



45వ పటము



వలభీ ప్రసాదము పొడవు
14 భా.
వెడల్పు 10 భా.
గర్భము పొ. 8, వె. 4 భా.

46వ పటము

2 | 1½ | 1½ | ½ | 3 | ½ | 1½ | 1½ | 2

1½ | 3 | 1½ | 2

ప్రస్తరము పై భాగములు

43వ పటము



వల్లభీ ప్రాసాదము
7 అంతస్థులు

2 ½ 5 ½ 2

## 47వ పటము

శివునకు

పద్మప్రాసాదము

10 భా.



## పద్మ ప్రాసాదము

## 48వ పటము

5 అంతస్థులు

ఎత్తు 20 భా.

## 35వ పటము



## 36వ పటము

### మందర తిలక స్వరూపము

తలచ్ఛందము 12 భా.

తిలకములు 24

కర్ణ శృంగములు9 12

ప్రతిరథము శృంగము

దిగవ 16

పైన 8

ప్రధాన శృంగము 1

మొత్తం 61

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 2 | 2 | 1 | 2 | 1 | 2 | 2 |
| 2 | | | | | | 2 |
| 1 | | | | | | 1 |
| 2 | | | | | | 2 |
| 1 | | | | | | 1 |
| 2 | | | | | | 2 |
| 2 | 2 | 1 | 2 | 1 | 2 | 2 |

37వ పటము

శ్రీభువన తిలక
స్వరూపము




38వ పటము



10 భా.

49వ పటము

విష్ణువునకు

పుణ్యవర్ధన ప్రాసాదము

50వ పటము

ఎత్తు 20 భా.

7 అంతస్థులు



శ్రీ

# భారతీయ మహాశిల్పము

## 8వ భాగము



రచయిత:

విమర్శకాచార్య, శిల్పకళాకోవిద

స్వర్ణ సుబ్రహ్మణ్యకవి



ప్రచురణకర్త:

డా॥ స్వర్ణ వాచస్పతి B. V. Sc.

8వ భాగము

# విషయసూచిక

| | | | |
|---|---|---|---|
| కాశ్యప 46<br>45-44 | శిల్పరత్నమ్<br>40-42-41<br>39 చూచి<br>వదలినారు. | మానసార 31<br>32-33-34 | విశ్వకర్మ ప్రకాశ<br>6- |

| | |
|---|---|
| సమరాంగణ<br>సూత్రధార<br>67-66 | అపరాజిత పృచ్ఛ<br>186-చూచి వదలినారు<br>187-188 |



# భారతీయ మహాశిల్పము

## అష్టమకళ

శ్రీ మద్విరాడ్విశ్వకర్మణేనమః

## 1. ఇష్టదేవతాస్తుతి

శ్లో॥ దేవః సపాతు భువనత్రయ సూత్రధార ।
స్త్వాం బాలచంద్ర కలికాంకితజూటకోటిః ।
ఏతత్ సమగ్రమపి కారణమంతరేణ ।
కాత్స్న్యాదసూత్రిత మసూత్ర్యతయేన విశ్వమ్॥ (సమరాం)

శ్లో॥ ఉత్పత్తి రక్షణలయాన్ జగతాం ప్రకుర్వన్ ।
భూవారి వహ్ని మరుతో గగనంచ సూతే ।
నానాసురేశ్వర కిరీట విలోలమాలా ।
భృంగావలీఢ చరణాంబురుహం నమామి ॥ (మానసార)

శ్లో॥ జయతి వరదమూర్తి ర్మంగలం మంగలానాం ।
జయతి సకలవంధ్యా భారతీ బ్రహ్మరూపా ।
జయతి భువనమాతా చిన్మయీ మోక్షరూపా ।

శ్లో॥ దిశతు మమ మహేశో వాఙ్మయః శబ్దరూపమ్ ॥ (విశ్వ. ప్ర)
అభీప్సితార్థ సిద్ధ్యర్థం పూజితోయః సురైరపి ।
సర్వ విఘ్నచ్ఛిదేతస్మై గణాధిపతయేనమః ॥ (అపరా)

శ్లో॥ మహాదేవం శశిధరం సర్వలోకైక నాయకమ్ ।
మహేంద్ర మధ్యగం శాంతం పార్వతీసహితంపరమ్ ॥
దేవదానవ సిద్ధాద్యైః సేవితం సురపూజితమ్ ।

ప్రణమ్య దేవచరణ మేవం బ్రూయాత్ సకశ్యపః ॥ (కాశ్య)

శ్లో॥ మాయావైభవ కల్పితాగుణమయా బ్రహ్మాండ భాండాంతరే।

జీవౌఘు స్తదధిష్ఠితాశ్చ వివిధాయత్ సంస్థితా యన్మయాః ।
ఆత్మానం పరమం తమౌపనిషదై ర్వాక్యైః సదాస్వస్తికై ।
రన్విష్టం భువనైకనాథ మమలంవందే విరించాధిపమ్ ॥

శ్లో॥ పారుష్యాంగోయేన చాదౌయుగానాం ।
వాస్త్యాతష్ట్వాస్నిగ్ధతాం ప్రాపితోఽర్కః ।
నిత్యం దేవై రర్చితో విశ్వకర్మాసోఽయం ।
భూయాత్ సర్వలోకోదయాయ ॥

శ్లో॥ త్రిపురపురత్రయ రచనా యత్కరయోః ।
కర్మచాతురీజాతా శిల్పివరంతం దనుజై రర్చిత ।
చరణం మయం వందే ॥ (శిల్పరత్నమ్)

## 2. ప్రాకార విధానము (2వ పద్ధతి)

మానసార 31వ అధ్యాయము :

శ్లో॥ బల్యర్థం పరివారార్థం శోభార్థం రక్షణార్థకమ్ ।
పంచప్రాకార హర్మ్యాణా మధునావక్ష్యతే క్రమాత్ ॥ 1
జాత్యాదిభేద హర్మ్యాణాం తన్మానేన తు విన్యసేత్ ।
జాతిప్రాకార సర్వేషాం హస్తమానేన యోజయేత్ ॥ 2
జాత్యాది సర్వసాలానాం ప్రాసాదాంశేన మానయేత్ ।
జాతీనాం జాతిసాలానాం హర్మ్యతారం విభాజితే ॥ 3
తదూర్ధ్వే వేదికాదీనాం గ్రీవమూర్ధ్ని శిఖాంతకమ్ ।
సమకంధరవృద్ధిః స్యాత్పంచ సాలావసానకమ్ ॥ 4
ఛందాది పంచసాలాంచ ఛందాద్యంశేన మానయేత్ ।
జాతిప్రాసాదవిస్తారే విన్యసేత్ సకలం పదమ్ ॥ 5
ఆదిశాలాం తతః కుర్యా దంతర్మండలమీరితమ్ ।
ద్వితీయమంత హారాచ మధ్యహారా తృతీయకమ్ ॥ 6

ప్రాకారం తచ్చతుర్థంచ కథితం తన్మర్యాదికమ్ ।
తతః పంచమసాలాచ మహామర్యాదా మీరితమ్ ॥ 7
పంచశాలామితి ప్రోక్తం తంత్రవిద్భిః పురాతనైః ।
తత్పీఠ పదవిన్యాస శ్చాదిశాల విశాలకే ॥ 8
తథా ద్వితీయ శావేతు స్థండిలపదం విన్యసేత్ ।
తత్తత్కుర్యాత్తు శాలాయాం తృతీయే భయచండితమ్ ॥ 9
సుసంహిత పదంమధ్యే మర్యాదాయా విశాలకే ।
మహామర్యాదావిస్తారే పదమీశ్వర కాంతకమ్ ॥ 10
ఏవం తు జాతిశాలాంచ కుర్యాద్ధర్మ్యవశా త్సుధీః ।
పేచకం మూలహర్మ్యేతు ఛందాదీనాం ప్రవక్ష్యతే ॥ 11
ప్రథమంతు మహాపీఠం ద్వితీయం మండూకం పదమ్ ।
తృతీయం భద్ర సంయుక్తం తతః శాలాబహిస్తథా ॥ 12
చతుర్థం సుప్రతీకాంతం పంచమం చేంద్రకాంతకమ్ ।
ఏతచ్ఛందం ప్రకర్తవ్యం వికల్పంత దిహోచ్యతే ॥ 13
ఛందప్రాకార విస్తారే సార్థార్థేన కరాధికమ్ ।
ప్రథమాత్పంచ మానంస్యా త్సార్థం యుగ్మకరాంతకమ్ ॥ 14
ఏవం వికల్పమానంస్యా త్పంచశాలాప్రకీర్తితాః ।
తదేవ పంచశాలానాం షడంగుల వివర్థనాత్ ॥ 15
సప్తపాదా వసానంస్యా త్ప్రథమాత్పంచ మానకమ్ ।
ఏవ మాభానం కర్తవ్యం హర్మ్య పాదంతు వర్థనాత్ ॥ 16
కేచిచ్ఛందక మానేతు త్రిత్రిహస్త వివర్థనాత్ ।
ప్రథమాత్పంచ మానంస్యా త్పంచదశ కరాంతకమ్ ॥ 17
ఏతత్ క్షుద్రవిమానేతు శాలాచ్ఛంద విమానకమ్ ।
కేవల హస్తమానేన జాతిప్రాకారం మానయేత్ ॥ 18
త్రిహస్తే నాదిసాలాది ద్విద్విహస్త వివర్థనాత్ ।
ప్రత్యేకం పంచశాలానాం పంచ పంచప్రమాణకమ్ ॥ 19

క్షుద్రాల్పమధ్య ముఖ్యానాం జాతిశాలాం ప్రకల్పయేత్ ।
ప్రాసాదార్ధవిశాలేన మధ్యముఖ్యాల్పమానకే ॥ 20
శాలానాం పంచధాద్యంతం మానయేత్పూర్వవద్భవేత్ ।
హర్మ్య పాదస్య బాహ్యేత్తు శాలాకుడ్యావసానకమ్ ॥ 21
అంతర్వాఽపి బహిర్వాఽపి కుడ్యమధ్యావ సానకమ్ ।
ఉపపీఠం చాంఘ్రికంవాఽపి హర్మ్యపాదస్య నిర్గమమ్ ॥ 22

తా॥ బలిని పెట్టుటకును, పరివారదేవతల నుంచుటకును, అలంకారముకొఱకును, రక్షణముకొఱకును 5 ప్రాకారములనుగూర్చి చెప్పుచున్నాడు. జాతి మొదలగు హర్మ్యములకు ప్రాసాదములను హస్తమానముతో చెప్పబడుచున్నది. జాతి ఆలయములకును, జాతి ప్రాకారములకును భాగములు చెప్పబడియున్నవి. ఆపైన వేదిక, గ్రీవ, శిఖరము, కలశము అంతము, కంధరముతో సమానమును వరుసగా 5 ప్రాకారములకు పెంపును. ఛందజాతి మొదలు 5 ప్రాకారములు ఛందాది భాగములతో రచించవలెను. జాతి ప్రాసాదమున పీఠముయొక్క విస్తారము 1 భాగముచేసి దానిచుట్టూ 1 భాగము విస్తారముతో అంతర్మండలమును, తరువాత చుట్టూ 2 భాగములతో రెండవ ఆవరణమును, తదుపరిచుట్టూ 3 భాగములతో మూడవ ఆవరణమును తరువాతచుట్టూ 4 భాగములతో నాల్గవ ఆవరణమును తరువాతచుట్టూ 5 భాగములతో ఐదవ ఆవరణమును చేయవలెను. పూర్వపు శాస్త్రజ్ఞులు 3.3 భాగములు నలుచదరముగాజేసి దానిని ఆదిశాలగను, రెండవశాల 7.7 భాగములు నలుచదరముగాను, మూడవశాల 13.13 భాగములు నలుచదరముగాను, నాల్గవశాల 21.21 భాగములు నలుచదరముగాను, ఐదవశాల 31.31 భాగములు నలుచదరముగాను ఇట్లు జాతి శాలలు రచించవలెను. ఛందమున పీఠమును 2.2 భాగములు నలుచదరముగాను, మొదటిశాల 4.4 భాగములు నలుచదరముగాను, రెండవ

శాలను 8.8 భాగములు నలుచదరముగను, మూడవశాలను 14.14 భాగములు నలుచదరముగాను, నాల్గవశాల 22.22 భాగములు నలుచదరముగాను, ఐదవశాల 32.32 భాగములు నలుచదరముగాను రచించవలెను. ఇది ఛందము. వికల్పమును చెప్పుచున్నాడు. మొదటి ఆవరణము $\frac{1}{2}$ హస్తము, రెండవ ఆవరణము 1 హస్తము, మూడవ ఆవరణము $1\frac{1}{2}$ హస్తము, నాల్గవ ఆవరణము 2 హస్తములు, ఐదవ ఆవరణము $2\frac{1}{2}$ హస్తములు చేయవలెను. కొందఱు మొదటి ఆవరణము $\frac{3}{4}$ హస్తములు రెండవ ఆవరణము 1 హ, మూడవ ఆవరణము $1\frac{1}{4}$ హ, నాల్గవ ఆవరణము $1\frac{1}{2}$ హ, ఐదవ ఆవరణము $1\frac{3}{4}$ హ, ఇట్లు ఆభాస హర్మ్యముల యొక్క స్తంభములను చేయుదురు. కొందఱు మొదటి ఆవరణమునుండి ఐదవ ఆవరణమువరకు 3.3 హస్తములు పెంచుచు 15 హస్తములవరకు చేయుదురు. ఇది క్షుద్ర విమానములయందు శాలాచ్ఛందము. జాతి ప్రాకారములు హస్తమానముతోనే చేయవలెను. మొదటి ప్రాకారము 3 హస్తములు, రెండవ ప్రాకారము 5 హస్తములు, మూడవ ప్రాకారము 7 హస్తములు, నాల్గవ ప్రాకారము 9 హస్తములు, ఐదవ ప్రాకారము 11 హస్తములు చేయవలెను. క్షుద్రశాలలు, అల్పశాలలు, మధ్యశాలలు, ప్రధానశాలలు, వీనికి జాతిశాలలు కల్పించవలెను. అవి ప్రాసాదములో సగము పరిమితి కలిగి యుండవలెను. ఆలయముయొక్క స్తంభమునుండి ప్రాకారముయొక్క గోడ వెలుపలి 3 భాగములను చేయవలెను. ఇట్లు 5 ప్రాకారములకు చేయవలెను. గోడలో అంచునగాని, గోడమధ్యనుగాని, గోడ వెలుపలికిగాని యిట్లు 3 విధములుగా రచించవచ్చును. ఉపపీఠమును స్తంభమును, ఆలయ స్తంభముయొక్క నిర్గమమును కల్పించవలెను.

శ్లో॥ తత్కుడ్య వేదికాంతర్వా సాలం ప్రాగుక్త మానకమ్ ।
హర్మ్యస్యార్ధా న్యతమానం యద్వా స్త్వాయామ మతత్సమమ్॥౨౩॥

తచ్చతుర్భాగి కైకేన వర్ధయేత్తన్ముఖాయతమ్ ।
విస్తారాత్పంచధాయామం పంచధావిపులాంతకమ్ ॥ 24
పంచశాలా ముఖాయామం ప్రత్యేకం పంచధాతతః ।
ఏకైకం వింశదాయామం పంచశాలాముఖాయతమ్ ॥ 25
షడంగులం సమారభ్య షట్ షడంగుల వర్ధనాత్ ।
రసహస్తావసానం స్యాత్ ప్రథమా త్పంచమాంతకమ్ ॥ 26
సాలానాంకుడ్య విస్తారం ప్రత్యేకం పంచధామతమ్ ।
విశాలోచ్చ సమంవాపి తచ్చతుర్థాంశవర్ధనాత్ ॥ 27
ప్రత్యేకం పంచసాలానాం కుడ్యానాం పంచధోదయమ్ ।
అథవాధిష్ఠానమానేన కుడ్యతుంగ మిహోచ్యతే ॥ 28
కుట్టిమోచ్చం సమారభ్య పంచవింశో దయాంతకమ్ ।
అంతర్మండల మారభ్య మహామర్యాది కాంతకమ్ ॥ 29
పంచకుడ్యస్య చోత్సేధం ప్రత్యేకం పంచధాభవేత్ ।
జన్మాది చోత్తరాంతంవా ప్రస్తరాంతం తదోదయమ్ ॥ 30
కుడ్యస్యాంత ప్రదేశేతు యుక్త్యాచా వృతమాలికమ్ ।
వేదికా (కయా) చోపపీఠేన పాదప్రస్తర భూషితమ్ ॥ 31
యథేష్ట భాగపాదేన యుగ్మాయుగ్మమథాపిచ ।
కుడ్యాంతః పరివారార్థం భద్రం సోపాన సంయుతమ్ ॥ 32
మాలికోపరివప్రంస్యా దధిష్ఠానం సమోదయం ।
అథవా ద్విగుణోత్తుంగం త్రిగుణం వాయథేష్టకమ్ ॥ 33
వజ్రాకృతి శ్చవప్రాగ్రం ఛత్రాకార మథాపివా ।
ఉత్తరం వాజనంచైవ ముష్టిబంధం త్రిధాన్వితమ్ ॥ 34
అధిష్ఠానాది వర్గాఢ్య మథవారజ్జుభిత్తికమ్ ।
ప్రస్తరస్యో పరిదేశే కర్ణహార్మ్యాది మండితమ్ ॥ 35
శైవేవాచేష్టకేవాఽపి దారౌవాఽథ ప్రకల్పయేత్ ।
శుద్ధం సంకీర్ణం మిశ్రంవా యథాశోభం యథాబలమ్ ॥ 36

యుక్త్యా ప్రచ్ఛాదనం కుర్యాత్సుధేష్టకాది గులోదకైః ।
పరివార విమానానాం మానంతద్వక్ష్యతేఽధునా ॥ 37
మూలహర్మ్య సమంవాఽపి త్రిపాదం వాఽర్ధమేవవా ।
ఏకభూమి ద్విభూమిర్వా మూలహర్మ్య కృతిస్తువా ॥ 38
మూలస్థలసమంవాఽపి తన్నిమ్నోన్నతమేవవా ।
చతుర్దిక్షు చతుర్ద్వారై ముపద్వార మంతరాలకే ॥ 39
దేవానాం చక్రవర్తీనాం మధ్యేద్వారం ప్రకల్పయేత్ ।
మహద్ద్వారమితి ప్రోక్తముపద్వారంతు చోక్తవత్ ॥ 40
భూసురాది నరాణాంచ మధ్యేద్వారం నయోజయేత్ ।
మధ్యసూత్రస్య వామేతు మహాద్వారం ప్రకల్పయేత్ ॥ 41
తద్బహిః పరితోపట్వా సప్తసాలాం ప్రకల్పయేత్ ।
నరావాసార్థం రథ్యాచ ప్రాకారద్వయమండితమ్ ॥ 42
తత్తద్విస్తారమానాని దండమానేన మానయేత్ ।
త్రిచతుర్దండ మారభ్య ద్విద్విదండ వివర్ధనాత్ ॥ 43
నవపంక్తి దండపర్యంతం సాంతరాది మహాంతకమ్ ।
ప్రత్యేకం తత్త్రిధామానం సప్తప్రాకార మీరితమ్ ॥ 44
శేషం ప్రాగుక్తవత్కుర్యాత్సర్వాలంకార సంయుతమ్ ।
చతుర్ద్వార సమాయుక్తం మహాగోపుర మాయతమ్ ॥ 45
దేవానాం మానుషాణాం చ గృహప్రాకార మీరితమ్ ।
ఏకద్వి త్రిచతుష్పంచ సాలం కుర్యాత్సభిత్తికమ్ ॥ 46
సంకులంచేత్తు సాలానాం సాంతరం భిత్తికంన్యసేత్ ।
ఏతానిసాలమానాని హీనాధిక్యం నకారయేత్ ॥ 47
ద్వ్యంగులంచ సమారభ్యచైకాంగుల వివర్ధనాత్ ।
షడంగులావసానంస్యాద్గోపురాపానతత్సమమ్ ॥ 49
ప్రాసాదాదన్య శాలాంతం జలప్రావార్థనిర్గతమ్ ।
కుర్యాత్తుభిత్తిమూలేతు జలద్వారం యథేష్టదిక్ ॥ 50

జాతిప్రాసాదకాద్యా ద్బహిరథపరితః సాలమానం కరాభ్యాం ।
తస్మిన్ విస్తారమానం ప్రథమం కరయుగా దేకమేకేన
వృద్ధ్యాత్ చత్వారింశత్కరాంతం మహతి చ ఇతి తత్పంచ
పంచ ప్రమాణం కుర్యాత్ క్షుద్రం క్రమాత్తత్కథితమితి
బుద్ధై ర్భిత్తికాంతావసానమ్ ॥ 52

ఇతి మానసారే వాస్తు శాస్త్రే ప్రాకార విధానం నామఏక
త్రింశోఽధ్యాయః ॥

తా॥ ఆలయమునుండి ప్రాకారముగోడ లోపలికిగాని మఱియే కొలత ప్రకారమో చేయవలెను. ఆలయముయొక్క చుట్టుకొలతలో సగము ప్రాకారాయామముతో సమానముగ నుండవలెను. దానిని 4 భాగములుచేసి అందు 1 భాగము అధికముతో ముఖముయొక్క పొడవును పెంచుచుండవలెను. విస్తారమునుండి పొడవును 5 భాగములుచేసి 5 ఖండములు చేయవలెను. పంచశాలల ముఖాయామములు ప్రత్యేకముగా 5 విధములుగ నుండవలెను. ఒక్కొక్కదాని పొడవు 20 పంచశాలలముఖాయతము. 6 అం. మొదలు 6.6 పెంచుచు 6 హస్తములవరకు మొదటినుండి ఐదవదానివఱకు ప్రాకారములయొక్క గోడవిస్తారము 5 విధములు. విస్తారముయెత్తు వీనితో సమానముగాని, దానిలో 4వ వంతు చేర్చిగాని, ప్రత్యేకముగా 5 ప్రాకారములయొక్క గోడయెత్తు 5 విధములుగా చెప్పబడినది. లేక అధిష్ఠానముయొక్క ప్రమాణముతో గోడయెత్తును చెప్పుచున్నాడు. కుట్టిమముయెత్తు మొదలుకొని 25 వఱకును అంతర్మండలము మొదలుకొని మహామర్యాదివఱకును, 5 గోడలయెత్తు విడివిడిగా 5 విధములుకలదు. జన్మస్థానము మొదలు ఉత్తరము వఱకుగాని, లేక ప్రస్తరాంతమువఱకుగాని, గోడయొక్క చివరప్రదేశమున ఆలోచనతోర చుట్టూ మాలికను రచించవలెను. వేదిక, ఉపపీఠము, వీనితో పాదప్రస్తరమును కల్పించవలెను. ఇష్టమువచ్చిన భాగము

లతో (సరిసంఖ్య లేక బేసిసంఖ్య) గోడలో పరివార దేవతలకు సోపానములతోగూడ భద్రమును రచించవలెను. మాలికపైన వప్రమును, అధిష్ఠానమును సమానమైన పాదవుతో కల్పించవలెను. లేక యెత్తు రెట్టింపుగాను, 3 రెట్లుగాను యిష్టమువచ్చినట్లు చేయవచ్చును. వప్రముయొక్క చివర వజ్రమువలెగాని, లేక గొడుగువలెగాని కల్పించవలెను. ఉత్తరమును వాజనమును ముష్టిబంధమును ఈ మూడింటితోను, అధిష్ఠానము మొదలగు వానితోను, లేక త్రాడుతో గోడను, ప్రస్తరముయొక్క పై భాగమున కర్ణహార్మ్యము మొదలగు వానితోను, పెద్ద జాతితోనుగాని, ఇటుకలతోగాని, దారువుతోగాని రచించవచ్చును. స్వచ్ఛమైన జాతిగాని, సంకీర్ణజాతిగాని, మిశ్రజాతిగాని, అందముగా నుండునట్లును, గట్టిగా నుండునట్లును చేయవచ్చును. పైనకప్పు ఆలోచనతో ఇటుకలు సున్నపుపాకము బెల్లపురసము మొదలగు వానితో రచించవలెను. పరివార దేవతలకు విమానములయొక్క ప్రమాణములను చెప్పుచున్నాడు. మొదటి ఆలయముతో సమానముగాని, లేక ముప్పాతికవంతుగాని, లేక సగముగాని, ఒక్క అంతస్తుగాని, రెండు అంతస్తులుగాని, మొదటి ఆలయముతో సమాన రూపముగాగాని, మొదటి ఆలయముతో సమానపట్టమునగాని, దానికంటె పల్లముగాగాని, మెరకగాగాని, 4 వైపుల 4 ద్వారములును లోపల ఉపద్వారములును, నుధ్యద్వారమును దేవతలకును చక్రవర్తికిని కల్పించవలెను. మహాద్వారముయొక్క స్థానమును చెప్పితిమి. ఉపద్వారమునుగూడ పూర్వము చెప్పబడిన ప్రకారము నిలుపవలెను. బ్రాహ్మణులు మొదలగు మానవులకు ఎవ్వరికిని మధ్య ద్వారమును కల్పించరాదు. మధ్యసూత్రముయొక్క యెడమ వైపున మహాద్వారము నుంచవలెను. దాని వెలుపలచుట్టూ మనుష్యులుండుటకు 6.7 ప్రాకారములను కల్పించవలెను. రెండు

ప్రాకారముల నడుమ వీధిని కల్పించవలెను. ఆ యా విస్తారము లుండవలసిన దండముల ప్రకారము నిర్మించవలెను. 3.4 దండములు మొదలుకొని 2.2 దండములు పెంచుచు 9.10 దండములవఱకు సాంతరము మొదలు మహాంతరమువఱకు విడివిడిగా 3 పద్ధతులు కలవు. ఇట్లు 7 ప్రాకారముల లక్షణము చెప్పబడినది. మిగిలిన పనులన్నియును పూర్వము చెప్పబడిన ప్రకారము చేయవలెను. మహాగోపురమునకు 4 ద్వారము లుండవలెను. దేవాలయ గోపురము ఎత్తుగానుండవలెను. మానవ గృహములకు ప్రాకారము 1.2.3.4.5 వఱకు గోడలతో నుండవచ్చును. ప్రాకారములు దగ్గఱగా కలిసియుండెనేని గోడను రచించవలెను. ఇవి ప్రాకారముల యొక్క కొలతలు. ఇంతకంటె తక్కువగాను, ఎక్కువగాను చేయరాదు. 2 అం. మొదలుకొని 1.1 అం. పెంచుచు 6 అం. వరకు అన్నిటికిని జలమార్గములను కల్పించవలెను. కొందఱు 1 అం. మొదలు 1 అం. పెంచుచు గోపురము యొక్క ఉపానముతో సమానముగా చేయుదురు. ఆలయమునుండి యింకొక శాలవఱకు జలము పోవుటకుగాను గోడ మొదట నిర్గమముతో జలద్వారమును యేదిశ నైన నుంచవచ్చును. జాతి ప్రాసాదములకు ప్రాకారముల విస్తారములను హస్తములతో 2 మొదలుకొని 1.1 పెంచుచు 40 హస్తములవఱకు గొప్ప ఆలయములకును, క్షుద్రములకు 5.5 హస్తములును చేయవలయును. ఇట్లు గోడలయొక్క కడపటివఱకు రచించవలెను. శిల్పరత్నము 40వ అధ్యాయము 1 మొదలు 16 శ్లోకమునవఱకు జాతి హర్మ్యములకు ప్రాకారముల విధానమును పై అర్థముతోనే చెప్పబడియున్నవి.



# 3. శివపరివారదేవతలు

కాశ్యపశిల్పము 46వ అధ్యాయము :

శ్లో॥ అథవక్ష్యే విశేషేణ పరివార విధింపరమ్ ।
అష్టౌచ షోడశం చైవం ద్వాత్రింశ చ్ఛ్రయథాక్రమమ్ ॥ 1
అంతర్మండలగైః సర్వైః పరివారం నకల్పయేత్ ।
సంకల్పాంతం చారధారా పరివారాష్టకంద్విజ ॥ 2
కలాఽస్య పరివారాస్తు మమహారే ప్రకల్పయేత్ ।
ప్రాకారేతు చతుర్థాతు ద్వాత్రిం శత్పరివారంకమ్ ॥ 3
తత్త్రత్ప్రాకారే మధ్యేవా సాలకుడ్యాశ్రితంతువా ।
ముఖాయామం వినాబీజం చతురశ్రీకృతేసతి ॥ 4
నవాంశం విభజేద్ద్విజ మర్థాంశే మూలహర్మ్యకమ్ ।
తథాదృష్టార్థభాగేషు పూర్వాది క్రమయోగతః ॥ 5
ప్రాచ్యాం వై వృషభంస్థాప్య అనలంత్వగ్ని గోచరే ।
ఆదిదుర్గాంతు వాయవ్యే వీరభద్రంతు దక్షిణే ॥ 6
మాతౄణాం సప్తకంతస్య వామేవిఘ్న వినాశకమ్ ।
కౌబేర్యాం చైవవాయవ్యేనైరృత్యాంగణ నాయకమ్ ॥ 7
కుమారం వారుణేదేశే జ్యేష్ఠా వై వాయుగోచరే ।
సౌమ్యేతు కేశవస్థానం తత్రికాత్యాయనీంతువా ॥ 8
భాస్కరం శాంకరేదేశే తే పీఠం ప్రతిమాంతువా ।
ప్రతిమాత్వాలయోపేతా పీఠం చేదాలయంవినా ॥ 9
ఇంద్రానల శివాంశస్థాః పశ్చిమదిఙ్ముఖస్థితాః ।
వాయువారుణ నైరృత్యాః సర్వాశ్చ ప్రాఙ్ముఖస్థితాః ॥ 10
విష్ణుశ్చేత్ ప్రాఙ్ముఖః సౌమ్యే దుర్గాచేద్దక్షిణాననా ।
మాతరః సౌమ్యవక్త్రాస్తు వీరేశః పశ్చిమాననః ॥ 11

మాతృవామస్థ విఘ్నేశః ప్రాచ్యామాన నముచ్యతే ।
ఆదావాద్వి త్రిసాలేవా అంశే చండేశ్వరాలయమ్ ॥ 12

త్రిదండే బలిపీఠాగ్రే వృషస్థానం పదం భవేత్ ।
అపరేధ్వజ దండేన తయోర్మధ్యేఽష్టభాజితే ॥ 13

నవధాస్యా త్పరస్థానం గోపురద్వార నిర్గతిః ।
మండపాద్వాఽథతన్నిత్రం వృత్తపీఠాంతరం భవేత్ ॥ 14

పరివారాష్టకంహ్యేవం షోడశం త్వధునాశృణు ।
బీజేతు పంచపంచాంశే శక్రభాగాదిషుక్రమాత్ ॥ 15

ఇంద్రాశ్వినౌ రోహితాశ్వ పితరశ్చాధయమస్తథా ।
రోహిణీ నిరృతి శ్చైవ అప్సరోగణఏవచ ॥ 16

వరుణోప్యృషయశ్చైవ వాయూరుద్ర స్తథైవచ ।
సోమశ్చ క్షేత్రపాలశ్చ ఈశానోద్భాస భాస్కరః ॥ 17

మూలగేహం సమీక్ష్యస్తే స్థాపయేత్తు ప్రదక్షిణమ్ ।
కర్ణకాంశగతాన్ దేవాన్ ప్రాగ్దేశే పశ్చిమాననాన్ ॥ 18

పశ్చిమే సౌమ్యే ప్రాగాస్యాః కల్పయేచ్ఛిల్ప విత్తమః ।
షోడశంహ్యే నమాఖ్యాతం ద్వాత్రింశ దధునోచ్యతే ॥ 19

చతుర్థం సాలఏజంతు నందనంద విభాజితే ।
బాహ్యేతు చతురష్టాంశే పూర్వాదిక్రమ యోగతః ॥ 20

తా॥ పరివారదేవతలు 8.16.32 సంఖ్యలతో లోపలను, మధ్యను, వెలుపలను రచించవలెను గాని దేవతలందఱిని లోపల నుంచరాదు. మొదటి వరుస 3×3=9 భాగములుచేసి అందులో సగము ప్రదేశము ప్రధాన దేవస్థానమును, మిగిలిన సగములో తూర్పున వృషభమును, ఆగ్నేయమున అగ్నిహోత్రుని, వాయవ్యమున మూలదుర్గను, దక్షిణమున వీరభద్రుని తదుత్తరమున సప్త

మాతృకలను వారికి ఉత్తరమున గణపతిని, ఉత్తరమునగాని వాయవ్యమునగాని, నైరృతినగాని, ప్రత్యేక గణపతిని, కుమారస్వామిని పడమరను, వాయవ్యమున జ్యేష్ఠాదేవిని, ఉత్తరమున కేశవుని, లేక గౌరిని, ఈశాన్యమున సూర్యుని, ఈదేవత లందఱకు పీఠమును వారి వారి రూపములును, ఆలయములును కల్పించవలెను. ఆలయములు లేకుండ పీఠములపై విగ్రహములనే ప్రతిష్ఠింతురేని తూర్పు, ఈశాన్యము, ఆగ్నేయము, ఈమూడు విగ్రహములు పడమర ముఖముల తోను, వాయవ్యము, పడమర, నైరృతి ఈ దిశలయందున్న విగ్రహములన్నియును తూర్పుముఖములతోను, ఉత్తరమున విష్ణువైనచో తూర్పు ముఖముతోను, పార్వతి యైనచో దక్షిణముఖముతోను, మాతృకాదేవతలు త్తరముఖముతోను, వీరభద్రుడు పడమర ముఖముతోను, మాతృకల యెడమ ప్రక్కనున్న గణపతి తూర్పు ముఖముతోను, ఉండవలెను. మొదటి వరుసలోగాని లేక రెండవ వరుసలోగాని మూడవ వరుసలోగాని చండేశ్వరుడుండవలెను. 3 దండములు బలిపీఠముముందు వృషభస్థానము తరువాత ధ్వజ దండము 8 భాగము లుండవలెను. దాని తరువాత 9 భాగములు గోపురద్వారము యొక్క నిర్గమము, మండపమునుండియైన అదియే నిర్గమము, లేక గుంద్రని పీఠములైన జేయవచ్చును. ఇట్లు 8 మంది పరివారదేవతల లక్షణము చెప్పబడినది. ఇక 16 మంది పరివార దేవతలనుంచు పద్ధతి చెప్పుచున్నాడు. రెండవ వలయమున 5-5-25 భాగములుచేసి పూర్వమువలెనే సూత్రము ప్రకారము ఒక్కొక్కస్థానమున ఒక్కొక్కరిని స్థాపించవలెను. తూర్పుననున్న 5 భాగములో ఈశాన్యమును వదలి 2వ స్థానమున ఇంద్రుని, మధ్య స్థానమున అశ్వినీదేవతలను, 4వ స్థానమున అగ్నిహోత్రుని, 5వ స్థానమగు ఆగ్నేయమున పితృగణమును, దానికి పడమర 6వ స్థానమున యముని, దక్షిణమున మధ్యస్థానము 7 రోహిణీదేవతను,

దానికి పడమర 8వ స్థానమున నిర్‌ృతిని, 9వ స్థానమగు నైర్‌ృతిన అప్సరసలను, 10 దానికి ఉత్తరమున వరుణుని, 11 పడమర మధ్య స్థానమున సప్తర్షులను, దానికి ఉత్తరమున 12వ స్థానమున వాయువును, 13 వాయవ్యమున రుద్రుని, 14 దానికి తూర్పున కుబేరుని, 15 ఉత్తరమున మధ్యక్షేత్రపాలుని, దానికి తూర్పున 16వ భాగమున ఈశానుని, ఈశాన్యమున మొదటి భాగమున సూర్యుని ప్రతిష్ఠించవలెను. ఈశాన్యము, ఆగ్నేయము ఈ రెండు మూలలయందుగల దేవతలకు పడమరముఖములును, పడమరను ఉత్తరముననుగల దేవతలకు తూర్పుముఖములును, (దక్షిణముననున్న దేవతలుకూడ తూర్పుముఖములతోనే యుండవలెను.) శిల్పరత్నము 42వ అ. 11-14 శ్లోకములు పరివారాష్టకమును ఇట్లే చెప్పుచున్నవి. మఱియు 15-17 శ్లోకములు షోడశపరివారములను ఇట్లు చెప్పుచున్నవి. ఇక 32 దేవతలను స్థాపించు పద్ధతి వివరముగ జెప్పుచున్నాడు.

శ్లో॥ అనిలాదిత్య విశ్వేచై శేష యక్షస్తథైవచ ।
గౌరీశర్వస్తథాబ్రహ్మా అగస్త్యాగ్ని భృగుస్తథా ॥ 21

ఈశానః కౌశికశ్చైవ ఏకాక్షోఽ విఘ్నఏవచ ।
సరస్వతీ తథాలక్ష్మీ రేకరుద్రస్తథైవచ ॥ 22

పశుపతి ర్వసుశ్చైవ మహాదేవ స్త్రిమూర్తిచ ।
ధనదోరుద్ర కాలాగ్ని శ్రీకంఠో నాగదేవతా ॥ 23

భీమశ్చ పృథివీచైవ శిఖండి మరుతస్తథా రాహుః ।
శనైశ్చరశ్చైవ ద్వాత్రింశత్పరివారకాః ॥ 24

అథవా పృథివీస్థానే గౌరీస్థాపన మాచరేత్ ।
గౌరీస్థానేన్యసేత్ పృథ్వీం శేషం పూర్వవదాచరేత్ ॥ 25

అభ్యంతరాననాన్ సర్వాన్ స్థాపయేత్తు విశేషతః ।
గౌర్యాస్తు వనమాలాఽథ విమానం వాఽథకల్పయేత్ ॥ 26

అన్యేషామపి దేవానాం విమానం వాఽథమండపం ।
మూలహర్మ్యత్రి పాదంవా అర్థం వాపాదమేవవా ॥ 27
గర్భగేహ సమంవాఽపి గర్భార్థంవాత్రి పాదకమ్ ।
త్రిచతుష్పంచ హస్తంవా పరివారాలయం భవేత్ ॥ 28
ఆభాససదనేతేన మానేనైవ సమాచరేత్ ।
శక్తికాదిషు యన్మూలం గేహమేవం తథైవహి ॥ 29
కారయేత్సదనం రమ్యం విపరీతం వికల్పకమ్ ।
త్రివర్గ మండపాకారం చతుర్ద్వార సమన్వితమ్ ॥ 30
ఉష్ణావాసం ప్రకర్తవ్యం శేషానాంతు యథోచితమ్ ।
పరివారాలయం ప్రోక్తం ప్రతిమాలక్షణం శృణు ॥ 31
పరివారాలయేద్వార గర్భమానం నయేద్బుధః ।
సకలానాంతు యన్మానం తన్మానం తత్ర గృహ్యతామ్ ॥ 32
సర్వస్య శయనం కుర్యాత్ దాసనం స్థానకంతువా ।
ద్వాత్రింశత్పరివారంతు జాతివార్మ్యే ప్రకల్పయేత్ ॥ 33
ఛందంతు షోడశం ఖ్యాతం శేషేష్వష్టకం భవేత్ ।
అథవా సర్వహర్మ్యేషు సర్వాంవా పరికల్పయేత్ ॥ 34

తా॥ మరుద్గణము, ఆదిత్యులు, విశ్వదేవతలు, శేషుడు, యక్షులు, గౌరి, శివుడు, బ్రహ్మ, మరీచి, అత్రి, భృగువు, ఈశానుడు, కౌశికుడు, ఏకాక్షుడు, గణపతి, సరస్వతి, లక్ష్మి, ఏకరుద్రుడు, పశుపతి, వసువులు, మహాదేవుడు, త్రిమూర్తిరూపము, కుబేరుడు కాలాగ్నిరుద్రుడు, శ్రీకంఠుడు, నాగదేవతలు, భీముడు, భూదేవత, శిఖండి, వాయువు, రాహువు, శని, ఇట్లు 32 దేవతలకు స్థానములను కల్పించవలెను. లేక ప్రథిపీ స్థానమున గౌరిని, గౌరీ స్థానమున పృథివిని స్థాపించవచ్చును. ఈ దేవతలందఱి యొక్క-

ముఖములు లోపలికే యుండవలెను. గౌరికి ఏక శిఖరముగాగాని మఱికొన్ని శిఖరములుగాగాని ఆలయమును కట్టవచ్చును. ఇతర దేవతలకు విమానములుగాని మండపములుగాని కట్టవచ్చును. మొదటి ఆలయములో ముప్పాతిక వంతుగాని, సగముగాని, పాతిక వంతుగాని, లేక గర్భాలయముతో సమానముగాని, గర్భాలయములో సగముగాని, గర్భములో ముప్పాతిక వంతుగాని, లేక 3-4-5 హస్తములుగాని పరివార దేవతాలయములను కల్పించవలెను. ఆభాసములకు ఈ ప్రకారము చేయవలెను. శక్తి మొదలగువానిని ప్రధానాలయమును బట్టి రచించవలెను. వికల్పమున రచించవలసిన పద్ధతి నాలుగు ద్వారములును త్రివర్గ మండపమును రచించవలెను. నందిమండపమునకు 4 ద్వారము లుండవలెను మిగిలినవి యిష్టానుసారముగ జేయవచ్చును. పరివారాలయము ద్వారగర్భముతో సమానమైన విస్తారముతో నుండవలెను. అన్ని ఆలయములకు స్థలగణితమును, చుట్టుకొలతల లెక్కయును, ఎత్తు లెక్కయును చేయవచ్చును. జాతి హార్మ్యములకు 32 దేవతలును, చందస్సున 16 దేవతలును, మిగిలినవానికి 8 దేవతలును, ఉండవలెను లేక అన్నివిధములైన ఆలయములకు 32 విగ్రహముల నుంచిన నుంచవచ్చును.

కాశ్య—48వ పటము

శ్లో॥ పశ్చిమాభిముఖే హర్మ్యే కించిద్భేదం వదామ్యహం ।
వృషస్థానే కుమారంతు కౌమారే విన్యసేద్ వృషమ్ ॥ 167
వారుణంతు మహాపీఠం శేషం పూర్వవదాచరేత్ ।
పరివారవిధిః ప్రోక్తః పశ్చాల్లింగస్య లక్షణమ్ ॥ 168

తా॥ దేవాలయము పడమరముఖముతో నిర్మించిరేని నంది స్థానమున షణ్ముఖుని, షణ్ముఖ స్థానమున నందిని ప్రతిష్ఠించవలెను. పడమర మహాపీఠమును కల్పించవలెను. మిగిలినవన్నియును మును పటివలెనే యుండవలెను. కాశ్యపశిల్పమున జెప్పినట్లుగాక 3వ వలయమున దేవతాన్యాసము చూపబడినది. (కాశ్యపశిల్పము నందలి దేవతానామములు అనుక్రమము సందేహకరముగా నున్నది.)

(అనుబంధము 1వ పటము చూడుడు)

# 4. మఱియొక పద్ధతి

మానసార 32వ అధ్యాయము :

శ్లో॥ సర్వేషామపి దేవానాం ప్రాకారాంతః ప్రవిష్టకే ।
పరితః పరివారాణాం లక్షణం వక్ష్యతేఽధునా ॥ 1

ఇంద్రాదా చాష్టదిగ్దేశే చాంతర్మండలసాలకే ।
పరితో భూత బల్యర్థం క్షుద్రపీఠం వినిక్షిపేత్ ॥ 2

తత్రాష్టకం పరివారాణాం కృత్వా చాంతనిహారకే ।
ద్వితీయేచ తృతీయేచ షోడశపరివారకమ్ ॥ 3

ద్వాత్రింశచ్చ తృతీయేవా కల్పయేత్పరివారకమ్ ।
తృతీయాత్పంచ సాలాంతం వినియోగాఖ్య మండపమ్ ॥ 4

క్రియేత శిల్పిభిః ప్రాజ్ఞైః పరివారమిహోచ్యతే ।
ఇంద్రేచ వృషభం స్థాప్య చాగ్నేయేచార్యకం తథా ॥ 5

యామ్యే తు సప్తమాతరంచ నైరృత్యేతు గణేశ్వరమ్ ।
పశ్చిమే సుబ్రహ్మణ్యంచ జ్యేష్ఠాదేవీం చ వాయవే ॥ 6

సౌమ్యేతు కేశవం స్థాప్య చైశాన్యే భాస్కరం తథా।
ఏవం చాష్టపరీవారం పూర్వద్వారాలయంభవేత్ ॥ 7

పశ్చిమద్వారహర్మ్యేషు పశ్చిమేతు వృషంక్షిపేత్ ।
అథవా వినాయకం ప్రోక్తం నైరృత్యే స్థాపయేత్సుధీః ॥ 8

సోమేశాన యోర్మధ్యే దివస్పతిం చ వినిక్షిపేత్ ।
వహ్న్యంతకద్వయోర్మధ్యే సుబ్రహ్మణ్యాలయం భవేత్ ॥ 9

యామ్యేకాత్యాయనీంవాఽథ ద్వారేవాఽథ ప్రకల్పయేత్ ।
యామ్య నైరృత్య యోర్మధ్యే వీరభద్రాలయం భవేత్॥ 10

నైరృత్యే తుగజముఖం పశ్చిమేతు పితామహమ్ ।
ప్రత్యక్ నైరృత్యయోర్మధ్యే చైకపాదేశ్వరాలయమ్ ॥ 11

పశ్చిమోత్తరతః స్థాప్యం చాశ్వినీ దేవతాలయమ్ ।
వాయుకోణే ప్రదేశేతు సరస్వత్యాలయం భవేత్ ॥ 12

వాయుచంద్ర ద్వయోర్మధ్యే మన ఉన్మంథాలయం భవేత్ ।
చంద్రస్థానేధనేశస్య చాలయం కల్పయేద్బుధః ॥ 13

సోమేశాన ద్వయోర్మధ్యే జనార్దనాలయం భవేత్ ।
ఈశేచక్షేత్ర పాలంచ వటుకంవా ప్రతిష్ఠయేత్ ॥ 14

బ్రహ్మేశానద్వయోర్మధ్యే భాస్కరస్యాలయం భవేత్ ।
అధవా వాయుకోణేతు షణ్ముఖస్యాలయం భవేత్ ॥ 15

పరివారం షోడశక మేవం ప్రోక్తం మునీశ్వరైః ।
ద్వాత్రింశత్పరివారస్య లక్షణం వక్ష్యతేఽధునా ॥ 16

ఇంద్రేచ వృషభం స్థాప్యం సత్యకే నందికేశ్వరమ్ ।
భృంగేశేచం భువనేశం చ కుర్యాదంతరిక్షకే ॥ 17

ఆగ్నేయేచ ధనస్థానం పూషస్థానేతు చేండిరామ్ ।
వితథే చైకదంతంస్యాత్ జలేశం స్యాద్గృహక్షతే ॥ 18

యామ్యే చాముండికాంస్థాప్య గంధర్వే పుష్పమండపమ్ ।
భృంగరాజపదేచైవ నైవేద్యార్పణవేశ్మకమ్ ॥ 19

మృశేచవస్త్రాలయంస్యా న్నైరృత్యేతు వినాయకమ్ ।
దౌవారికపదేచైవ మూర్తిశాలం సమర్చయేత్ ॥ 20

సుగ్రీవే చ త్రిమూర్తింస్యాత్ స్థాపయే దేకహర్మ్యకే ।
పుష్పదంతపదే చైవ పుష్పబంధన మండపమ్ ॥ 21

వరుణస్య పదేస్థాప్యం చార్ధ నారీశ్వరాలయమ్ ।
అసురస్య పదేచైవ కుర్యాత్తు రత్నమండపమ్ ॥ 22

దేవానాం భూషణావాసం స్థాపయేచ్చైవ భాగికే ।
పుస్తకావాసనం కుర్యాత్ రోగస్య చ పదేతథా ॥ 23

షణ్ముఖస్యాలయం కుర్యా ద్వాయుకోణే విచక్షణః ।
నాగస్య చ పదేచైవ కుర్యాత్తు రత్నమండపమ్ ॥ 24

దేవానాం భూషణావాసం స్థాప్యం చ ముఖ్యదేశకే ।
అథవా పార్వతీస్థాప్యా భల్లాటస్యపదేఽపి చ ॥ 25

సోమేచ విష్ణుం సంస్థాప్య మనోజస్యాలయంతు వా ।
భుజగే స్థాపనార్థం చ గంధ ద్రవ్యాది మండపమ్ ॥ 26

అదితే దక్షిణామూర్తి ముదితేచాంత దానవమ్ ।
ఈశేచ స్థాపయేదేకం రుద్రమూర్తే స్తథాలయమ్ ॥ 27

అథవాయజ్ఞశాలాం చ స్థాపయేద్భోగ మండపమ్ ।
పర్జన్యే మజ్జనార్థాయ జలపూరిత మండపమ్ ॥ 28

అథవారుద్రదేవస్య యాగమండపమేవచ ।
జయంతే భాస్కరంస్థాప్య చేశేపాశుపతం తథా ॥ 29

అథవాకామకోష్ఠం స్యాదాలయం కల్పయే త్సుధీః ।
ద్వాత్రింశన్మూర్తిరేవంస్యా త్కుర్యాత్తు పరివారకమ్॥ 30

తా॥ శివాలయమున ప్రాకారములోపల దేవతల నుంచు పద్ధతిని చెప్పుచున్నాడు. అంతర్మండలములో తూర్పు మొదలుగా 8 దిశలయందు భూత బలికొఱకు చుట్టును పీఠముల నుంచవలెను. అచ్చట 8 మంది పరివార దేవతల నుంచవలెను. రెండవ వలయమునగాని లేక మూడవ వలయమునగాని 16 మంది పరివారదేవతల నుంచవలెను. మఱియు మూడవ వలయమున 32 మంది పరివార దేవతల నుంచవచ్చును. 3 మొదలు 5వ ప్రాకారమువఱకు మండపములను రచించవలెను. మొదటి 8 మంది పరివారదేవతలు

తూర్పున నంది, ఆగ్నేయమున పార్వతి, దక్షిణమున మాతృకా దేవతలు, నైర్‌ృతిన గణపతి, పడమర సుబ్రహ్మణ్యుడు, వాయవ్యమున జ్యేష్ఠాదేవి, ఉత్తరమున కేశవుడు, ఈశాన్యమున సూర్యుడు, తూర్పువాకిలిగల దేవాలయమున నిట్లుండవలెను. పడమరవాకిలి గల దేవాలయమున పడమర నందిని తూర్పున సుబ్రహ్మణ్యుని ప్రతిష్ఠించవలెను. లేక తూర్పున వినాయకుని నైర్‌ృతిన షణ్ముఖుని ప్రతిష్ఠించవచ్చును. ఉత్తరము, ఈశాన్యము ఈ రెంటిమధ్య ఇంద్రుని ఆగ్నేయము, దక్షిణము ఈ రెంటిమధ్య షణ్ముఖాలయము దక్షిణమున పార్వతి లేక దక్షిణ ద్వారముననైన నుండవచ్చును. దక్షిణము, నైర్‌ృతి ఈ రెంటిమధ్య వీరభద్రాలయము, నైర్‌ృతిన గణపతి, పడమర బ్రహ్మ, పడమర నైర్‌ృతి ఈ రెంటినడుమ ఏకపాదేశ్వరాలయము, పడమర, ఉత్తరము ఈ రెంటిలో నొకచోట అశ్వినీ దేవతాలయము, వాయవ్యమున సరస్వతి ఆలయము, వాయవ్య - ఉత్తరముల మధ్య మన్మథాలయము, ఉత్తరమున కుబేరుడు, ఉత్తరము-ఈశాన్యము ఈ రెంటినడుమ విష్ణ్వాలయమును, ఈశాన్యమున క్షేత్రపాలుడును, లేక చండేశ్వరుడును, బ్రహ్మ ఈశానుడు వీరి నడుమ సూర్యాలయము, షణ్ముఖాలయము పూర్వము చెప్పినట్లుగాక వాయవ్యమున నుంచవచ్చును. (ఆగ్నేయమున పితృగణమును, తదుత్తరమున అగ్నిహోత్రుని) ఇట్లు 16 మంది పరివార దేవతల నుంచవలెను. ఇక 32 మంది పరివార దేవతల నుంచు పద్ధతిని చెప్పుచున్నాడు. ఇంద్రస్థానమున వృషభమును, సత్యస్థానమున నందికేశ్వరుని, భృంగ పదమున ఈశ్వరుని, అంతరిక్ష పదమున భువనేశ్వరుని, ఆగ్నేయమున ధనాగారమును, పూషపదమున లక్ష్మిని, వితథస్థానమున గణపతిని, గృహక్షత పదమున వరుణుని, దక్షిణమున చాముండికను, గంధర్వ స్థానమున పుష్పమండపమును, భృంగరాజ పదమున నైవేద్యమును అర్పించు

గృహమును, మృశస్థానమున వస్త్రాలయమును, నైరృతిన వినాయకుని, దౌవారికపదమున మూర్తి శూలమును, సుగ్రీవపదమున త్రిమూర్తి రూపమును, పుష్పదంతపదమున పూలదండలు రచించు మండపమును, వరుణపదమున అర్ధనారీశ్వరాలయమును, అసురపదమున రత్నమండపమును, మిగిలిన ప్రదేశమున దేవతల నలంకరించు మండపమును, రోగపదమున గ్రంథాలయమును, వాయవ్యమున షణ్ముఖాలయమును, నాగపదమున రత్నమండపమును, ముఖ్యపదమున దేవతల నలంకరించు గృహమును, లేక పార్వతీదేవ్యాలయము, భల్లాటక పదముననైనను దేవ్యాలయము రచించవచ్చును.

సోమస్థానమున విష్ణుదేవాలయమును, లేక మన్మథుని ఆలయమును, భుజగస్థానమున ప్రతిష్ఠకొఱకు గంధద్రవ్యాదులనుంచు మండపమును, అదితి పదమున దక్షిణామూర్తిని, దితిపదమున కాలభైరవుని ఈశపదమున ఏకరుద్రుని, లేక యజ్ఞశాలను, లేక భోగమండపమును, పర్జన్యపదమున స్నానమునకు జలముగల మండపము, లేక రుద్రదేవయాగ మండపము, జయంత పదమున సూర్యుని, ఈశాన్యమున పాశుపతాలయమును, లేక కామకోష్టమును, ఇట్లు 32 మంది పరివారదేవతల నుంచవలెను.

(అనుబంధము 2వ పటము చూడుడు)

శ్లో॥ తృతీయే సౌమ్యభాగేతు పానీయస్య జలం క్షిపేత్ ।
భృశేవాఽథ మహేంద్రేవా భక్తరూపం ప్రతిష్ఠయేత్ ॥ 31
ఛత్రం చ చామరాకారం జయంతస్య పదే తథా ।
తండుల మండపం యామ్యే పావకేపచనాలయమ్ ॥ 32
గృహక్షతే ధాన్యశాలా చైశేచ యాగమండపమ్ ।
గంధర్వే భృంగరాజే చ స్థాపకానామాలయం స్యాత్ ॥ 33

పూషేచ వితథేచైవ మాలయే పరివారకాన్ ।
సోమేభల్లాటే ముఖ్యేచ కల్పయేత్కోశ మండపమ్ ॥ 34

పుష్పదంతే మృగేచైవ శస్త్రమండప సంయుతమ్ ।
వరుణేవాఽసురేవాఽపి వస్తు నిక్షేప మండపమ్ ॥ 35

నాగేవాఽపి మృగేవాఽపి దేవభూషణ మండపమ్ ।
అదితౌ చదితౌ వాఽపి శయనార్థం చ మండపమ్ ॥ 36

ఆస్థానమండపంచైవ చతుర్దిక్షు విదిక్షుచ ।
స్నపనార్థ మండపంచాపి స్నానమండప మేవచ ॥ 37

గృహక్షతేయమేవాఽపి వాహనస్థాన మండపమ్ ।
మర్త్యాదిభిత్తి కస్యాంతం మండపం వానరాలయమ్ ॥ 38

శ్రద్ధాలింగం తథాస్థాప్య యథాదిక్షు విదిక్షుచ ।
అనలా నిలకోణేవా స్థాపత్యాలయ మేవచ ॥ 39

సత్యకేవాచాంతరిక్షే వాద్యకారాలయం భవేత్ ।
పూష్ణిచ వితథేచాపి నాట్యకారాలయం భవేత్ ॥ 40

గృహక్షతే మృశస్యాంతం గణికాదీనాం తథాలయమ్ ।
నైరృత్యాదా వరుణాంతం చ గణికస్యాలయం భవేత్ ॥ 41

వరుణా ద్వాయుపర్యంత మారామకారకాలయమ్ ।
వాయుకోణాది సోమాంతం నిత్యకర్మకరాలయమ్ ॥ 42

సోమాదీశాన పర్యంతం గాంధర్వాలయమేవచ ।
ఈశాదేరింద్ర పర్యంతం సంగీతార్థం చ మండపమ్ ॥ 43

తద్బాహ్యే తత్ప్రదేశేవా గోశాలాం పరికల్పయేత్ ।
ఈశస్థానేతు కూపంస్యాత్తటాకంవా ప్రకల్పయేత్ ॥ 44

చతుష్కోణే తపస్వీనాం సత్రావాసమఠం భవేత్ ।
సమీపే వీరభద్రాణాం గృహశ్రేణీం చ కల్పయేత్ ॥ 45

మహామర్యాది దేశేతు వర్ణానాం వాసయోగ్యకమ్ ।
పశ్చిమే విప్రసంఘః స్యా ద్దక్షిణే క్షత్రియస్యచ ॥ 46

ఉత్తరే వైశ్య సంఘః స్యాత్పూర్వేతు శూద్రసద్మకమ్ ।
తద్బాహ్యే సర్వజాతీనా మాలయం కల్పయే త్సుధీః ॥ 47

ద్వారస్యవామభాగేతు గజాశ్వాదే స్తథాలయమ్ ।
అదితేచేశ కోణేతు కల్పయేద్ధర్మ మండపమ్ ॥ 48

వాయుకోణేతు బాహ్యేవా పుష్పోద్యానంతు కల్పయేత్ ।
ప్రాకారద్వారే సర్వేషాం కల్పయేత్ వృషభాలయమ్ ॥ 49

వృషభస్యోపరిభాగేతు కల్పయేద్బలిపీఠకమ్ ।
గోపురస్య బహిర్వాఽపి స్థాపయేద్బలిపీఠకమ్ ॥ 50

ప్రాసాదాద్దండమానేన చైకంవాద్విత్రి దండకమ్ ।
గోపురాద్బలి పీఠాంతం సాంతరం మానయేత్సుధీః ॥ 51

ఏకద్విత్రి చతుష్పంచ హస్తం పీఠవిశాలకమ్ ।
ప్రాసాదార్థం త్రిభాగైకం పంచభాగ త్రిభాగికమ్ ॥ 52

అథవాత్రి ద్విభాగం స్యా త్పీఠవిస్తారమేవచ ।
పీఠతారసమోచ్చంవా పాదార్థాధికమేవచ ॥ 53

ఉపానాది పట్టికాంతం స్యా త్పీఠతుంగ ముదీరితమ్ ।
పీఠతుంగోదయార్థేన పద్మతుంగం ప్రకల్పయేత్ ॥ 54

వప్రేవాపట్టికేవాఽపి నిర్గమం పరికల్పయేత్ ।
విస్తారే పంచభాగేతు వేదార్థం పద్మవిస్తృతమ్ ॥ 55

పద్మతారత్రి భాగైకం కర్ణికావిస్తృతం భవేత్ ।
విస్తార సమముత్సేధం వృత్తంవా పట్టమేవవా ॥ 56

భద్రంవా పద్మసంయుక్తం తుంగం ప్రాగుక్తవన్నయేత్ ।
వృత్తంవా చతురశ్రంవా మూలప్రాసాదవద్భవేత్ ॥ 57

అధిష్ఠానాకారవత్పీఠం హర్మ్యాధిష్ఠానవద్భవేత్ ।
ద్వాదశాంగుల విస్తార ముత్సేధం క్షుద్రవిస్తరమ్ ॥ 58
ఉపాబ్జంకరి కర్ణయుక్తం కుర్యాత్తత్ క్షుద్రపీఠకమ్ ।
వృషభస్యాలయమానం పూర్వవత్పరికల్పయేత్ ॥ 59
మండపాకార వత్కుర్యా ద్యన్మానోరమ్య మానకమ్ ॥ 60

తా॥ మూడవ ఆవరణమున ఉత్తరభాగమున మంచినీరుండవలెను. భృశపదమునగాని మహేంద్రపదమునగాని అగస్త్యుడు అత్రి మొదలగు మహాభక్తుల రూపములుండవలెను, జయంత పదమున గొడుగు,వింజామరము లుండవలెను. దక్షిణమున బియ్యపు కొట్టు, ఆగ్నేయమున పాకశాల గృహక్షత పదమున ధాన్యపుకొట్టు ఈశాన్యమున యజ్ఞమండపము, గంధర్వపదమునను లేక భృంగ రాజ పదమునను, శిల్పాచార్యు లుండవలెను. పూషపదమునగాని వితథపదమునగాని పరివారకజనముండవలెను. సోమ, భల్లాట ముఖ్యపదములయందు ధనాగారము, పుష్పదంతపదమునగాని లేక మృగపదమునగాని ఆయుధాగారము, వరుణపదమునగాని, అసుర పదమునగాని సామగ్రికొట్టు, నాగపదమునగాని, మృగపదమునగాని దేవతలయొక్క ఆభరణాదు లుండెడి మండపము, అదితిపదమున గాని దితిపదమునగాని శయనమండపము, ఆస్థాన మండపము 8 దిశలలో ఎక్కడనైన నుండవచ్చును.

సంప్రోక్షణము అభిషేకముచేయు మండపము గృహక్షత పదమునను యమపదమున వాహనములుంచు మండపము, ప్రాకారముయొక్క గోడ వెలుపల యితరులకు యిండ్లుగాని మండపములు గాని కల్పించవచ్చును. శ్రద్ధాలింగమును ఏదిక్కుననైన ప్రతిష్ఠించు కొనవచ్చును. ఆగ్నేయమునగాని వాయవ్యమునగాని శిల్పాచార్యుల యిండ్లును, సత్యపదమునగాని, అంతరిక్ష పదమునగాని మంగళ

వాద్యములు కలవారియిండ్లును, పూషపదమునగాదని వితథపదమున గాని నాట్యముచేయువారి యిండ్లును, గృహాక్షతపదము మొదలు మృశపదము వఱకు వేశ్యలయొక్క యిండ్లును, నైరృతి మొదలు వరుణపదమువఱకు గణికల యిండ్లును, వరుణపదము మొదలు వాయుపదమువఱకు తోటలు బాగుచేయువారి యిండ్లును, వాయవ్యము మొదలు ఉత్తరమువఱకు దేవునకు నిత్యము పనులుచేయువారి యిండ్లును, ఉత్తరము మొదలు ఈశాన్యమువఱకు సంగీతముపాడు వారి యిండ్లును, ఈశాన్యము మొదలు తూర్పువఱకు సంగీతము కొఱకు మండపమును, దానికి వెలుపలగాని అచ్చటనేకాని గోవు లుండు యిల్లును, ఈశాన్యమునబావి, లేక చెఱువు, నాలుగు మూలలయందు రోగులుండుటకు మఠములుగాని, సత్రములుగాని, యిండ్లుగాని యుండవలెను. ఆ దగ్గఱలో మహావీరులగు రక్షక భటులయిండ్లును, దానికి వెలుపలి ప్రాకారమున అన్నికులములవా రుండవలెను. పడమర బ్రాహ్మణులు, దక్షిణమున క్షత్రియులు, ఉత్తరమున వైశ్యులు, తూర్పున శూద్రులు, దానికి వెలుపల అన్నికులములవా రుండవలెను. ద్వారముయొక్క యెడమ వైపున ఏనుగులు, గుఱ్ఱములు మొదలగువాని శాలలును, అదితిపదమున గాని, ఈశాన్యపదమునగాని పురాణాది ధర్మములను బోధించు మండపమును వాయవ్యమునగాని దానికి వెలుపలగాని పూలతోటను వేయవలెను. ప్రాకారముయొక్క ద్వారములన్నిటి యందునను నందిమండపముల నుంచవలెను. నందిపీఠముయొక్క పై భాగమున బలిపీఠము నుంచవలెను. ఆలయమునుండి 1, 2, 3 దండములు గోపురమునుండి బలిపీఠమువఱకు ప్రమాణమును, బలిపీఠముయొక్క విస్తారము 1, 2, 3, 4, 5 హస్తములును, ఆలయములో సగము 3 భాగములలో 1 భాగము లేక 5 భాగములలో 3 భాగములు, మఱియు 3 భాగములలో 2 భాగములు, ఇట్లు

పీఠ విస్తారమును కల్పించవచ్చును. పీఠముయొక్క విస్తారముతో సమానముగాని, లేక పాతికవంతు యెక్కువగాని, లేక సగమువంతు యెక్కువగాని యెత్తును చేయవచ్చును.

ఉపానము మొదలుపట్టిక వఱకు పీఠముయొక్క యెత్తు చెప్పబడినది. పీఠముయొక్క యెత్తులో సగము పద్మముయెత్తు చేయవలెను. వప్రమునగాని, పట్టికయందుగాని నిర్గమమును కల్పించవలెను. విస్తారము 5 భాగములుచేసి పద్మముయొక్క విస్తారము 4 భాగములు చేయవలెను. పద్మముయొక్క విస్తారమును 3 భాగములుచేసి అందు 1 భాగము కర్ణిక విస్తారమును చేయవలెను. విస్తారముతో సమానమైన యెత్తును గుండ్రముగాగాని లేక పలకలుగాగాని, భద్రముగాని పద్మముతోగూడ యెత్తును పూర్వము చెప్పిన ప్రకారము కల్పించవలెను. గుండ్రము-నలుచదరము, ఇట్లు మొదటి ఆలయమునుబట్టి రచించవలెను. పీఠముయొక్క ఆకారము అధిష్ఠానమువలెగాని హార్మ్యముయొక్క అధిష్ఠానమువలెగాని చేయవచ్చును. క్షుద్రపీఠ విస్తారము 12 అంగులములు ఎత్తు అదేమాదిరి ఉపపద్మము ఏనుగుతొండముతోగూడి యుండవలెను. వృషభ మందిరము మునుపటివలె రచించవలెను. మండపముయొక్క ఆకారమువలె యేకోలతతోనైన అందముగా జేయవలెను.

(అనుబంధము 3వ పటము చూడుడు)

## 5. విష్ణుపరివార దేవతలు

మాన. 32వ అధ్యాయము :

శ్లో॥ విష్ణ్వాలయ పరివార లక్షణం వక్ష్యతేఽధునా ।
పంచసాల మహాద్వారే ద్వారదేవాన్ ప్రకల్పయేత్ ॥ 61

ద్వారస్య దక్షిణేస్థాప్య చండరాక్షస రూపకమ్ ।
వామే ప్రచండ సంయుక్తం రూపం రాక్షసమేవచ ॥ 62
దక్షిణేచక్ర సంయుక్తం వామేతత్పాంచ జన్యకమ్ ।
దక్షిణేచ గణేశంచ వామే కాత్యాయనీం తథా ॥ 63
దక్షిణే భాస్కరంచైవ వామభాగే నిశాపతిమ్ ।
దక్షిణేచ భుజంగేశం ద్వారవామేదివస్పతిమ్ ॥ 64
ప్రథమాది పంచమాంతంస్యాత్ స్థాపయేత్ ద్వారపంచకే ।
ఏవంతుదశధా దేవాన్ ద్వారాణాముదితాన్ క్రమాత్ ॥ 65
ప్రముఖే వైనతేయః స్యాత్సాలాసాలాంతరా భవేత్ ।
ప్రముఖే చోత్తరేదేశే విష్వక్సేనాలయం భవేత్ ॥ 66
అంతర్మండలదేశేతు పూర్వనక్బలిపీఠకమ్ ।
ద్వారస్య దక్షిణేపార్శ్వే మార్కండకుర్యాద్దివస్పతే ॥ 67
యద్వైవాగ్నికోణేతు భార్గవాలయ మేవచ ।
యామ్యేకాత్యాయనీం ప్రోక్తం నైరృత్యేతు వినాయకమ్ ॥ 68
పశ్చిమే దిక్ష్వనంతంస్యా ద్వాయో వాసిష్టకాలయమ్ ।
ఉత్తరేధనదంచైవ ఈశాన్యే భాస్కరం తథా ॥ 69
కాత్యాయనీం వినాయామ్యే కుర్యాద్వాఽథ పితామహమ్ ।
ధనదంచ వినాసౌమ్యే శంకరస్యాలయంతువా ॥ 70
ఏవం చాష్టపరీవారం షోడశం పరివారకమ్ ।
పూర్వోక్తదేవతా సంఘైః కించిత్కించి ద్విశిష్యతే ॥ 71
ఆగ్నేయేచ గణేశంస్యా నైఋృత్యేతు గుహంక్షిపేత్ ।
వాయవ్యేతు మహాలక్ష్మీం చైశాన్యే చసుదర్శనమ్ ॥ 72
సోమేశానద్వయోర్మధ్యే శంకరాలయమేవచ ।
వాయుసోమో భయోర్మధ్యేవిష్ణుదుర్గాంతథాలయమ్ ॥ 73
ప్రత్యజ్ నైరృత్యయోర్మధ్యే చక్రమూర్తే స్తథాలయమ్ ।
యామ్యేచ బలభద్రంస్యా దనంతంచ జయంతకే ॥ 74

నైరృత్యేతు బౌద్ధంస్యా జ్జయంతే పైతృకాలయమ్ ।
శేషం ప్రాగుక్తవత్ స్థాప్య షోడశం పరివారకమ్ ॥ 75
ద్వాత్రింశత్పరివారస్య లక్షణం వక్ష్యతేఽధునా ।
చతుర్వింశతి మూర్తీనాం దిక్పాలకైః సహైవచ ॥ 76
ఏకానావరణైఃస్థాప్య చావతారాన్ దశానపి ।
మత్స్యం కూర్మం వినాకుర్యాత్తద్దిక్పాలాన్ వినాతథా ॥ 77
పూర్వోక్త మండపానాంచ ప్రోక్తదేవాన్ యథేష్టవత్ ।
కుర్యాద్విష్ణు పరివారం శేషం ప్రాగుక్త వన్నయేత్ ॥ 78
బౌద్ధంచ జినకంచైవ తత్తచ్ఛాస్త్రోక్తమార్గవత్ ।
తత్తద్వాహనం స్థాప్యం బలిపీఠంచ పూర్వవత్ ॥ 79
యక్షోయక్షీచ తీర్థాని కుర్యాత్తత్పరివారకమ్ ।
అన్యాన్యేషాంచ దేవానాం దేవీనాం పరివారకమ్ ॥ 80
తత్తద్వాహన పూర్వంచ భూతపైశాచకం తథా ।
గణేశక్షేత్రపాలాదీన్ కుర్యాత్తత్పరివారకమ్ ॥ 81
అంతర్బహిశ్చ బల్యర్థం కుర్యాత్పీఠంతు పూర్వవత్ ।
చాముండాసదనే విష్ణోరాలయే శంకరాలయే ॥ 82
బౌద్ధాలయేజినాలయే క్షుద్రాలయేఽపి సర్వశః ।
శాస్త్రాంతరే యత్కథితం కుర్యాత్తత్పరివారకమ్ ॥ 83
క్రమమనుతేకేఽపివినా కృత్వాతు సంపద్భవేత్ ॥ 84
యస్మాలహార్మ్య వృషభాది జనార్ధనాది సన్మండపాది
గరుడాదిచ గోపురాదీన్ తస్మాలహార్మ్య పరితః
స్థితదృశ్యతేఽస్మిన్ । కుర్యాత్తు సర్వపరివారమిదం
ప్రశస్తమ్ ॥ 85

ఇతి మానసారే వాస్తుశాస్త్రే పరివార విధానం
నామద్వాత్రింశోఽధ్యాయః

తా॥ విష్ణుదేవాలయమున 5 ప్రాకారముల యందుండవలసిన విధమును చెప్పుచున్నాడు ద్వారముయొక్క దక్షిణమున చండుడను రాక్షసుడును, ఉత్తరమున ప్రచండుడనురాక్షసుడు, కుడివైపునచక్రమును ఎడమవైపున శంఖమును, కుడివైపున వినాయకుడును, ఎడమవైపున పార్వతియును, కుడివైపున సూర్యుడును, ఎడమవైపున చంద్రుడును, కుడివైపున శేషుని, ఎడమ వైపున ఇంద్రుని, ఇట్లు మొదటినుండి 5 ద్వారముల యందును స్థాపించవలెను. ఎదురుగా అన్నిప్రాకారములలోను గరుత్మంతుని ప్రతిష్ఠించవలెను. ఉత్తరమున మొదటి ఆవరణమున విష్వక్సేనాలయమును రచించవలెను. లోపలి వరుసలో బలిపీఠము పూర్వమువలెనే రచించవలెను. ద్వారముయొక్క దక్షిణవైపున ఇంద్రుని ఆలయమును, ఆగ్నేయమున పరశురామాలయమును, దక్షిణమున పార్వతిని, నైరృతిన వినాయకుని, పడమర అనంతుని, వాయవ్యమున వసిష్ఠుని, ఉత్తరమున కుబేరుని, ఈశాన్యమున సూర్యుని, దక్షిణమున పార్వతిని గాకుండ బ్రహ్మను ప్రతిష్ఠించవచ్చును. ఉత్తరమున కుబేరుడు గాకుండ శివుని ప్రతిష్ఠించవచ్చును. ఇట్లు 8 మందిని ప్రతిష్ఠించవలెను. 16 మంది పరివారమైనచో మునుపు చెప్పబడిన స్థానములు కొంచెము కొంచెము భేదములుగ నుండును. గణపతి ఆగ్నేయమునను, నైరృతిన షణ్ముఖుడు, వాయవ్యమున లక్ష్మి, ఈశాన్యమున సుదర్శనము, ఉత్తరము ఈశాన్యము ఈ రెంటినడుమ శివాలయము, వాయవ్యము ఉత్తరము ఈ రెంటిమధ్య విష్ణు ఆలయముగాని దుర్గాలయముగాని ఉండవచ్చును. పడమర నైరృతి ఈ రెంటి నడుమ చక్రమూర్తియొక్క ఆలయము, దక్షిణమున బలరాముని ఆలయము, నైరృతిన బౌద్ధాలయము, ఈశాన్యము తూర్పు ఈ రెంటి నడుమ పితరులును, మిగిలిన స్థానములు పూర్వోక్త ప్రకారము స్థాపించవచ్చును. 32 మంది పరివారదేవతలను చెప్పుచున్నాడు. పైచెప్పిన

16 ను దిక్పాలిక రూపములు 8 యును, అవతారములలో మత్స్య కూర్మములను తీసివేసి మిగిలిన 8 యును మొత్తము 32 చేయవలెను. ఇందులో స్థానములను మార్చినను అవతారాది రూపములలో తప్పులేదు. మఱియు బౌద్ధాలయమున యక్షయక్షిణులును, జినాలయమున తీర్థంకరులును మొదలైన ఆ యా సంబంధములను పరివారములను కల్పించవలెను. దేవతలందఱికి వారివారి వాహనములు పరివారమును రచించవలెను. భూతగణమును, వినాయకుని, క్షేత్రపాలుని, వారివారి పరివారములతో రచించవలెను. ఆలయములన్నిటికి బలిపీఠములు లోపలను వెలుపలను ఉంచవలెను. ప్రధానాలయమెట్లు రచింపబడినదో తెలిసికొని ఆ ప్రకారము వృషభము మొదలుగాగాని, లేక విష్ణ్వాలయమైనచో గరుత్మంతుడు మొదలుగాగాని, దేవ్యాలయమైన యెడల ఆయవతారములుగాని క్రమముగా నలువైపులా స్థాపించవలెను. మండపములను గోపురములను కూడ అటులే మొదటి ఆలయము ననుసరించి రచించవలెను.

(అనుబంధము 4వ పటము చూడుడు)

## 6. గోపురలక్షణము తద్భేదములు

కాశ్యప 45వ పటలము :

శ్లో॥ అథవక్ష్యే విశేషేణ గోపురాణాంతు లక్షణమ్ ।
అంతర్మండలసాలాది విస్తృతం ప్రోచ్యతే క్రమాత్ ॥ 1
ద్వారశోభా ద్వారశాలా ద్వారప్రాసాద హర్మ్యకం ।
ద్వారగోపురమిత్యేతే క్రమాన్నామ్నా ప్రకీర్తితాః ॥ 2
ఏకద్విత్రి తలావాఽపి ద్వారశోభా ప్రకల్పయేత్ ।
ద్విభూమిర్వాత్రి భూమిర్వా చతుర్భూమిరథాపివా ॥ 3
ద్వారశాలాతుకర్తవ్యా సాలేస్యాత్తు ద్వితీయకే ।
త్రిచతుష్పంచ భూమిర్వా ద్వారప్రాసాదమారభేత్ ॥ 4

చతుష్పంచ తలంవాఽథ షట్తలంవాఽథ హర్మ్యకం ।
పంచషట్ సప్తభూమిర్వా ద్వారగోపురమిష్యతే ॥ 5
అథవా సర్వసాలేషు ఏకద్విత్రి తలంతువా ।
సోపపీఠ మధిష్ఠానం వినావాత్రోప పీఠికమ్ ॥ 6
తయోరుచ్ఛ్రయతః సర్వే తవపంచ వదామ్యహమ్ ।
మూలప్రాసాద విస్తారం సప్తాష్టనవభాజితే। 7
దశైకాదశభాగేచ ఏకాంశరహితం క్రమాత్ ।
శోభాది గోపురాంతానాం విపులం కీర్తితం క్రమాత్ ॥ 8
వికల్పాభాసహర్మ్యాణాం గోపురాణాం తత స్త్విమే ।
మూలాలయ విశాలంతు చతుష్పంచ షడంశకే ॥ 9
సప్తాష్టాంశేనహీనంతు ఛందశోభాదికం భవేత్ ।
మూలగేహత్రిభాగైకం భాగమర్ధాంశమేవవా ॥ 10
త్రిద్వ్యంశం చతురంశేతు గుణాంశంచ తథైవచ ।
పంచభాగేతు వేదాంశం సాలేషుప్రథమాదిషు ॥ 11
శోభాదిగోపురాంతానామేతి జాత్యాలయాయతమ్ ।
కల్ప్యైవం హర్మ్యమానంస్యా దథమానవశాత్తతః ॥ 12
ద్విహస్తాది ద్విరష్టాంత మేకహస్త వివర్ధనాత్ ।
శోభాదిగోపురాంతానాం ప్రత్యేకం త్రిత్రిమానకమ్ ॥ 13
వికల్పాభాసయోరేవ ఛందహర్మ్యేచ లక్ష్యతే ।
గుణహస్తం సమారభ్య సప్తదశకరావధి ॥ 14
ఏకహస్తవివృద్ధ్యాతు శోభాదీనాం త్రయంత్రయమ్ ।
చతుర్హస్తం సమారభ్య యావదష్టాదశంకరమ్ ॥ 15
శోభాదీనాం క్రమాద్వ్యాసం జాతిహర్మ్యే విధీయతే ।
ప్రత్యేకం త్రిత్రికరా నందపంచావదిర్భవేత్ ॥ 16

ఏతన్మానేన విస్తారం క్షుద్రాణామర్పకం క్రమాత్ ।
స్వస్వోదితం ప్రకర్తవ్యం విపరీతం విపత్కరమ్ ॥ 17
అథవాత్రి చతుష్పంచ షట్ సప్తాష్టనవంకరమ్ ।
దశైకాదశహస్తంతు అధమాదిత్ర యంత్రయమ్ ॥ 18
సర్వహర్మ్యే తథాసాలే యథేష్టం పరికల్పయేత్ ।
మహత్తరేతు శ్రేష్ఠాగ్ని త్వంతరే మధ్యమత్రయమ్ ॥ 19
క్షుద్రాల్పయోః ప్రశస్తాని కన్యశ సత్త్రైవముచ్యతే ।
సర్వసాలేషు కర్తవ్యం కర్తవ్యం సర్వదేశికే । 20
అథవాఽన్య ప్రకారేణ శోభాదీనాం చ విస్తరమ్ ।
పంచహస్తం సమారభ్య ద్విద్విహస్త వివర్ధనాత్ ॥ 21
త్రయోదశ కరాంతంతు శోభావ్యాసంతు కల్పయేత్ ।
త్రిధిహస్తం సమారభ్య త్రయోవింశత్కరావధి ॥
ద్విద్విహస్త వివృద్ధ్యాతు ద్వారశాలాంతు కల్పయేత్ ॥
పంచవింశత్కరారంభం త్రయస్త్రింశత్కరాంతకమ్ ॥ 22
ద్వారప్రాసాద విస్తారం పంచధాపరికీర్తితమ్ ।
పంచత్రింశత్కరారభ్యం చత్వారింశత్త్రియాధికమ్ ॥ 23
పంచధాద్వారహర్మ్యస్య విస్తారః పరికీర్తితః ।
సపంచ చత్వారింశత్త్రి పంచాశద్గోపురాంతకమ్ ॥ 24
ద్విద్విహస్తవివృద్ధ్యాతు పంచధాద్వార గోపురమ్ ॥

తా॥ ఐదు ప్రాకారములయందు నిర్మించవలసిన గోపురముల యొక్క లక్షణములను చెప్పుచున్నాడు. 1, 2, 3 అంతస్తులతో ద్వారశోభను రచించవలెను. 2, 3, 4 అంతస్తులతో ద్వారశాలను కల్పించవలెను, 3, 4, 5 అంతస్తులతో ద్వారప్రాసాదమును నిర్మించవలెను, 4, 5, 6 అంతస్తులతో ద్వారహర్మ్యమును రచించవలెను. 5, 6, 7 అంతస్తులతో ద్వారగోపురమును రచించవలెను. లేక

అన్ని ప్రాకారములయందు 1-2-3 అంతస్తులతో ఉపపీఠము అధిష్ఠానము మొదలగు వానితోగాని ఉపపీఠము లేకుండ అధిష్ఠానముతోగాని ద్వారశోభను రచించినను తప్పులేదు. మఱియు మొదటి ఆలయముయొక్క విస్తారమును 7-8-9-10-11 భాగములుచేసి అందు 1-1 భాగము తగ్గించుచు ఆవిస్తారములతో వరుసగా ద్వారశోభ ద్వారశాల, ద్వారప్రాసాదము, ద్వారహర్మ్యము, ద్వారగోపురములను రచించవలెను. వికల్పము, ఆభాసము, అను గోపురములకు ఈ కొలతలు చెప్పబడినవి. ఛందహర్మ్యముల ప్రాకారములయందు మొదటి ఆలయము యొక్క విస్తారములను 4-5-6-7-8 భాగములు చేసి వరుసగా అందు 1-1 భాగము తగ్గించుచు విస్తారములను కల్పించవలెను. లేక మొదటి ఆలయమును 3 భాగములుచేసి అందు 1 భాగము, ఒక్కభాగములో సగము, 3 భాగములలో 2 భాగములు, 4 భాగములలో 3 భాగములు, 5 భాగములలో 4 భాగములు, ఇట్లు జాత్యాలయములకు వరుసగా విస్తారములను కల్పించవలెను.

జాతిహర్మ్యములందు భాగములు చెప్పబడినవి. మఱియు 2 హస్తములు మొదలు 1-1 హస్తమును పెంచుచు అనగా 2-3-4 హ. ద్వారశోభ, 5-6 7 హ. ద్వారశాల, 8-9-10 హ. ద్వారప్రాసాదము, 11-12-13 హ. ద్వారహర్మ్యము, 14-15-16 హ. ద్వారగోపురము అను నైదు విధముల విస్తారములను చేయవలెను. ఈ కొలతలు వికల్పము, ఆభాసము అను వానికి సరిపడును.

ఛందహర్మ్యములకు 3 హస్తములు మొదలు 1-1 హస్తమును పెంచుచు 17 హస్తములవరకు పై విధముగానే విస్తారములను కల్పించవలెను.

జాతి హర్మ్యములకు 4 హస్తములు మొదలు 1-1 హస్త

మును పెంచుచు 18 హస్తములకు పై విధముగా విస్తారములను కల్పించవలెను.

లేక 3-4-5 హస్తములు అధమమధ్యమ ఉత్తమ శోభలకును, 4-5-6 హస్తములు అధమమధ్యమ ఉత్తమ శాలలకును,6-7-8హస్తములు అధమ మధ్యమ ఉత్తమ ప్రాసాదములకును, 7-8-9 హస్తములు అధమ మధ్యమ ఉత్తమ హార్మ్యములకును, 9-10-11 హస్తములు అధమ మధ్యమ శ్రేష్ఠగోపురములకును విస్తారమును చేయవచ్చును. ఈ ప్రకారము అన్ని దేశములయందును చేయుదురు. మఱియొకపద్ధతి 5 హస్తములు మొదలు 2-2 హస్తములు పెంచుచు 13 హస్తములవఱకు ద్వారశోభ యొక్క విస్తారమును 5 విధములుగాను, 15 హస్తములు మొదలు 2-2 హస్తములు పెంచుచు 23 హస్తముల వఱకు ద్వారశాలయొక్క విస్తారమును 5 విధములుగాను 25 హస్తములు మొదలు 2-2 హస్తములు పెంచుచు 33 హస్తముల వఱకు ద్వారప్రాసాదము యొక్క విస్తారమును 5 విధములుగాను, 35 హస్తములు మొదలు 2-2 హస్తములు పెంచుచు 43 హస్తముల వఱకు ద్వారహార్మ్యముయొక్క విస్తారమును 5 విధములుగాను 45 హస్తములు మొదలు 2-2 హస్తములు పెంచుచు 53 హస్తముల వఱకు ద్వారగోపురమును 5 విధములుగాను రచించవచ్చును.

శ్లో॥ విస్తారభేద మాఖ్యాతం ఆయతస్య విధింశృణు ॥ 25
సపాదం సార్ధం పాదోన ద్విగుణం ద్విగుణంతువా ।
సైకపాద ద్విభాగంతు సార్ధభాగ ద్విభాగికమ్ ॥ 26
శోభాది గోపురాంతానా మిష్టాయామం ప్రకృహ్యాతామ్ ।
తేషుకించి ద్విశేషోఽస్తి తం విశేషేణ వైశృణు ॥ 27
ద్విహస్తమానం విస్తారం గృహీత్వేన విశేషతః ।
ఆయామం పూర్వవత్కల్ప్య మనేకేష్విష్ట మాయతమ్ ॥ 28

హస్తచ్ఛందం ప్రవృద్ధ్యా వా చాన్యద్వా పూర్ణమాచరేత్ ।
ఆయాదిశోభనోపేతం హస్తమానేన కల్పయేత్ ॥ 29
తం వినాహర్మ్యమూలస్య వంశే ద్వే కల్పితస్యతు ।
వ్యాసాయామః సమాఖ్యాత స్తేషాంతుంగ మథోచ్యతే ॥ 30
విస్తారం సప్తధాభజ్య శోభోచ్ఛం రుద్రభాగయా ।
తారార్ధాధికతుంగంతు ద్వారశాలోచ్ఛ్రయం భవేత్ ॥ 31
సప్తభాగేతు రుద్రాంశం భాన్వంశంవా తృతీయకే ।
విస్తారేతు నవాంశేతు మధ్యమం స్యాచ్చతుర్దశం ॥ 32
విస్తారద్విగుణోత్సేధం మహాగోపుర ముచ్యతే ।
హోమాదిస్తూపిపర్యంతం మనోచ్ఛంతు ప్రకీర్తితమ్ ॥ 33
విస్తారాయామయోర్మాన సూత్రం ప్రాగ్బాహ్యముచ్యతే ।
తద్బాహ్యే కూటకోష్ఠాదిసీ్రం ప్రాసాదవద్భవేత్ ॥ 34
విస్తారస్య త్రిభాగైకం చతుర్భాగైకమేవవా ।
పంచభాగేత్రి భాగంవా ప్రాగ్బాహ్యేతు సనిర్గమః ॥ 35
సార్ధహస్తం సమారభ్య షట్షడంగుల వర్ధనాత్ ।
పంచహస్తావధిర్యావత్ క్షుద్రాణాం ద్వారవిస్తృతమ్ ॥ 36
అల్పానాంచ తథాప్రోక్తం మధ్యమానాం తతః ।
శృణుత్రిహస్తంతు సమారభ్య యావత్సప్తకరావధి ॥ 37
షడంగుల వివృద్ధ్యాతు ద్వారవ్యాసం ప్రకీర్తితమ్ ।
చతుర్హస్తం సమారభ్య యావన్నవకరాంతకమ్ ॥ 38
రసమాత్ర వివృద్ధ్యాతు మహతే ద్వార విస్తృతమ్ ।
తారే సప్తాంశేస శాంశం సప్తాంశేతు దశాంశకమ్ ॥ 39
అధ్యర్ధం పాదహీనంతు ద్విగుణం ద్విగుణోన్నతమ్ ।
సార్ధభాగంతు పాదంవా ద్వారోత్సేధంతు సప్తధా ॥ 40
లింగస్య మధ్యమద్వారం మధ్యమంతు వధామ్యహమ్ ।
శక్తేశ్చభూతయోర్మధ్యే నవాంశక విశేషతః ॥ 41

లింగమధ్యం తువామేతు ద్వారమధ్యం ప్రయోజయేత్ ।
శోభాదిగోపురాంతానాం ద్వారమధ్యం క్రమోదితమ్ ॥ 42
తన్మధ్యే గోపురాయామం స్తంభయోః పార్శ్వయోః సమమ్।
ద్వారయోగం కవాటంచ ద్వారలక్షణవత్ కురు ॥ 43
గుణపంక్తి సమారభ్యయావదే కోనవింశతిః ।
తావత్పంక్తిస్తు విస్తారే ష్వేవమేవం ప్రకల్పయేత్ ॥ 44
యావద్భింద్ర కృతిర్వ్యస్తా స్తావదేవాథపంక్తయః ।
విస్తారే పంచభాగేతు గుణాంశం గర్భగేహకమ్ ॥ 45
శేషంకుడ్య విశాలంస్యా దేకభూమాద్విజోత్తమ ।
పరితఃకుడ్య విస్తారం మానేనైవ ప్రకల్పయేత్ ॥ 46
ఏవమేక తలంఖ్యాతం ద్వితలంతు తథోచ్యతే ।
విస్తారే సప్తభాగంస్యా దాయామేఽపిత థైవచ ॥ 47
వేదాంశం గర్భగేహంతు సార్థాంశం కుడ్య విస్తృతమ్।
కర్ణకూటం తదేకాంశం శాలాదీర్ఘం విశాలకమ్ ॥ 48
హారాంతరం తదంశేన విస్తారేత్యేవ మేవచ ॥

తా॥ గోపురము విస్తారమునుబట్టి నిడివి చెప్పుచున్నాడు. $1\frac{1}{4}$-$1\frac{1}{2}$-$1\frac{3}{4}$-2-$2\frac{1}{4}$-$2\frac{1}{2}$ ఇట్లు యిష్టమువచ్చిన భాగమును నిర్ణయించుకొనవచ్చును. విస్తారము 2 హస్తములుచేసి ఆయామము మునుపటివలెనే చేయవలెను. లేక హస్తముల కొలతతోను ఆయశుద్ధికలిగి యుండునట్లుకూడ చేయవచ్చును. లేక మొదటి ఆలయమునుండి రెండు వంశరేఖలతోగూడ ఆయామమును కల్పించవచ్చును. ఆయామము చెప్పబడినది. ఎత్తును చెప్పుచున్నాడు.

విస్తారమును 7 భాగములుచేసి 11 భాగముల యెత్తుతో ద్వారశోభను, విస్తారము 8 భాగములును అందులో సగముయెత్తు

కలిపి ద్వారశాలను, విస్తారము 7 భాగములును ఎత్తు 11 భాగములుగాని లేక 12 భాగముల యెత్తుతోగాని ద్వారప్రాసాదమును, విస్తారము 9 భాగములును ఎత్తు 14 భాగములతో ద్వారహర్మ్యమును, విస్తారమునకు రెట్టింపుగా ఎత్తుతో ద్వార గోపురమును కల్పించవలెను. హోమము మొదలు స్థాపివఱకు కొలతను చేసికొనవలయును. విస్తారముయొక్కయు నిడివి యొక్కయు కొలతనూలు పూర్వ వెలుపల నుండవలెను. దాని వెలుపల కూటములయొక్కయు కోష్ఠముల యొక్కయు నిర్గమములను చేయవలెను. అన్నియును పూర్వము చెక్కబడిన దేవాలయముల కొలతలవలెనే చేయవలెను. విస్తారములో 3వ వంతుగాని, లేక పాతిక వంతుగాని, లేక 5 భాగములలో 3 భాగములుగాని, ప్రాగ్బాహ్యమున గోపురముయొక్క నిర్గమమును చేయవలెను. ద్వారముయొక్క విస్తారమును చెప్పుచున్నాడు.

$1\frac{1}{2}$ హ స్తము మొదలు $\frac{1}{4}+\frac{1}{4}$ పెంపుతో 5 హ స్తములవఱకు క్షుద్ర గోపురములయొక్క ద్వారము విస్తారముకలిగి యుండవలెను. 3 హ స్తములు మొదలు 6-6 అంగులముల పెంపుతో 7 హ స్తముల వరకు విస్తారముండునట్లు మధ్యమ గోపురముల యొక్క ద్వారములును, 4 హ స్తములు మొదలు 6-6 అంగులముల పెంపుతో 9 హ స్తములవఱకు విస్తారములతో ఉత్తమ గోపురములయొక్క ద్వారములను చేయవచ్చును. ద్వారములయొక్క ఎత్తును చెప్పుచున్నాడు.

విస్తారమును 7 భాగములుచేసి అందు 2 భాగములు కలిపి 9 భాగములతోను, విస్తారమును 7 భాగములుచేసి 10 భాగముల యెత్తుతోను, విస్తారము 7 భాగములును ఎత్తు అందులో సగమును అనగా $10\frac{1}{2}$ భాగముల యెత్తుతోను, విస్తారమునకు ముప్పాతికవంతు యెక్కువతోను, విస్తారమునకు రెట్టింపుతోను, విస్తారమునకు రెట్టిం

పును పైన ఒక పాతికవంతునుకలిపి ఆ యెత్తుతోను, విస్తారమునకు రెట్టింపును విస్తారములో సగమును కలిపి ఆ యెత్తుతోను, ఇట్లు 7 విధములుగా ద్వారములయెత్తు చేయవచ్చును.

లింగముయొక్క నడుమునుండి సూత్రమునుపట్టి ఆ ప్రకారము ద్వారమును చేయవలెను. శక్తియొక్కయు భూతముల యొక్కయు నడుమ 9 భాగములు లింగమధ్యమునుండి యెడమవైపు క్రమక్రమముగా పెంచుచు ద్వారములను కల్పించవలెను. ఇందుకు శిల్పరత్నము 41వ అధ్యాయమున- శ్లో॥ ద్వారోత్సేధం ప్రకర్తవ్యమం కర్మాంలతః క్రమాత్ । ఏకత్రిశరసప్తాంక మాత్రం సీత్వాఽథ నక్షిణే ॥ (38) క్రమేణ విన్యసేద్ ద్వారం బింబమధ్యాద్ యథోచితమ్ ॥ అని చెప్పబడి యున్నందున మొదటి ప్రాకారగోపుర ద్వారమును 1 అంగులమును, రెండవ ప్రాకారగోపుర ద్వారమును 3 అంగులములను, మూడవ ప్రాకారగోపురద్వారమును 5 అంగులములును, నాల్గవ ప్రాకారగోపురద్వారమును 7 అంగులములును, ఐదవ ప్రాకారగోపురద్వారమును 9 అంగులములును ఇట్లు క్రమముగా ఉత్తరమునకు జరిపి ద్వారములన్నియును ఈశాన్యముఖమునకు దిరుగునట్లు చేయవలెను. గోపురముయొక్క ఆయామము ద్వార మధ్యప్రదేశమునుండి యిరువైపుల సమముగా రచించవలెను. రెండువైపుల స్తంభముల వరుసలు సమానముగా నుండవలెను ద్వారబంధమును కవాటమును పూర్వము చెప్పబడిన ప్రకారము నిర్మించవలెను. విస్తారమున 3 వరుసలు మొదలు 19 వరుసల వఱకు రచించవచ్చును. ప్రధానాలయమునగల ఆకారమును బట్టియే యీ వరుసలు కల్పించవలసి యుండును. విస్తారమును 5 భాగములును దానికి దగిన ఆయతమును చేసి అందు 3 భాగములు గర్భగృహమును, మిగిలినది చుట్టూ 1 భాగము గోడయును కల్పించవలెను, ఇది ఒక్క అంతస్తుగల గోపురమునకు అని తెలియ

వలెను. రెండు అంతస్తులుగల గోపురమునకు విస్తారమును 7 భాగములు చేయవలెను. దీర్ఘము విస్తారము ననుసరించి చేయవలెను. అనగా 9 భాగములు అందులో గర్భము 4 భాగములును గోడ $1\frac{1}{2}$ భాగమును చేయవలెను కర్ణకూటము 1 భాగమును, హారము 1 భాగమును మధ్యశాల 3 భాగములును ఇట్లు విస్తారమున చేయవలెను.

శ్లో॥ శాలాదీర్ఘంతు పంచాంశ మాయామేతు ప్రకల్పయేత్ ॥ 49
హారాంతరంతు కూటంచ ఏకైకాంశేన కల్పయేత్ ।
కూటాంతర సమాయామం శేషం హారాంతరాన్వితమ్ ॥ 50
హారాంతరార్థమానేన భద్రంవా భద్రపంజరమ్ ।
ద్వితలం హ్యేవమాఖ్యా తంత్రితలంత్వ ధునోచ్యతే ॥ 51
నవాంశం విభజేద్వ్యాస మాయామంచతలం భవేత్ ।
గర్భగేహం గుణాంశం స్యాద్యంశేన గృహపిండికా ॥ 52
అలింద్రంత్వేక భాగేన హారవ్యాసం శివాంశకమ్ ।
కర్ణకూటం శివాంశేన శాలాదీర్ఘం గుణాంశకమ్ ॥ 53
ఏకాంశం పంజరంఖ్యాత మర్థాంశంహార యోంతరం ।
కల్పైవ్యవమాది భూమించ ద్వితలం పూర్వ వద్భవేత్ ॥ 54
అథవాన్య ప్రకారేణ త్రితలం శృణుసువ్రత ।
పూర్వభాగంతు విస్తారం రుద్రాంశంతు తదాయతమ్ ॥ 55
గుణాంశం గర్భగేహంతు గృహపిండ్యం శముచ్యతే ।
త్రితలం తత్సమాఖ్యాతం హారంభాగేన కల్పయేత్ ॥ 56
అలింద్రాంశంతు కుడ్యంవా గర్భగేహాన్వితంతువా ।
ఆయామే పంచభాగేన కోష్ఠదీర్ఘం ప్రకల్పయేత్ ॥ 57
శేషం పూర్వవదుద్దిష్టం ద్వితీయం ద్వితలోక్తవత్ ।
త్రితలంచైవ మాఖ్యాతం చతుర్భూమి మథోచ్యతే ॥ 58

విస్తారేతు దశాంశేతు తద్వాదాయామపంక్తయః ।
గర్భగేహంత్రిభాగం హి సార్ధాంశంకుడ్య విస్తృతమ్ ॥ 59
అలింద్రం శివభాగేన హారవ్యాసం తథైవచ ।
పంజరం కర్ణకూటంచ ఏకైకాంశేన కల్పయేత్ ॥ 60
కూటతార సమాయామం శేషం హారాదితోఽన్వితమ్ ।
శాలాయామేతు వేదాంశే అర్ధాంశం హారయోఽతరమ్ ॥ 61
ఆదిభూమ్యేవ మాఖ్యాత మూర్ధ్వం పూర్వవదాచరేత్ ।
విస్తారేతు దశాంశేతు భాన్వంశంతు తదాయతం ॥ 62
పూర్వేఽపరేచశాలాయాం పంచభాగేన కల్పయేత్ ।
శేషం పూర్వవదుద్దిష్టం చతుస్తలమిదం పరమ్ ॥ 63
తారమేకాదశాంశంతు ఆయామంతు తథైవహి ।
పూర్వేఽపరేచ పార్శ్వేచ శాలాపంచాంశమాయతమ్ ॥ 64
ఏకాంశం పంజరవ్యాసం కూటవ్యాసం శివాంశకమ్ ।
హారాంతరం తథార్ధాంశం కల్ప్యంవై ప్రథమంతలం ॥ 65
తస్యోర్ధ్వం భూమయః సర్వాః పూర్వవత్పరి కల్పయేత్ ।
తారమేకా దశాంశేతు తద్దీర్ఘంతు త్రయోదశే ॥ 66
గుణాంశం గర్భగేహంచ ద్విభాగంభిత్తి విస్తృతమ్ ।
అలింద్రం భాగతః కల్ప్యం హారంభాగేన కల్పయేత్ ॥ 67
పార్శ్వశాలాతు వేదాంశం షడంశం ముఖపృష్ఠయోః ।
హారాంతరం శివాంశంస్యాత్ వ్యోమం పంజరకూటయోః॥ 68
శేషం పూర్వవదుద్దిష్టం రసభూమ్యేవమేవతు ।
త్రయోదశాంశ విష్కంభే ఆయామేచ తథైవహి ॥ 69
భూతాంశం గర్భగేహంతు గృహపిండీ ద్విభాగయా ।
అలింద్రంతు శివాంశేన ఖండహర్మ్యం శివాంశకమ్ ॥ 70
కోష్ఠాయామంతు భూతాంశం శివాంశేనచ పంజరమ్ ।
కూటమంశేన కర్తవ్యం హారాంతరం తథైవచ ॥ 71

అథవాత్ర త్రయోదశాంశే చాయామంతు త్రిపంచకమ్ ।
ముఖే ముఖే మహాశాలా సప్తాంశేన ప్రకల్పయేత్ ॥ 72
పంచభాగేన కర్తవ్యం పార్శ్వయోః కోష్ఠదీర్ఘకమ్ ।
శేషం పూర్వవదుద్దిష్టం సర్వాలంకార సంయుతమ్ ॥ 73
సప్తభూమి సమాఖ్యాతం మహాగోపుర కంభవేత్ ।
అలింద్రం వా వినాఽలింద్రం కల్పయే చ్ఛిల్పవిత్తమః ॥ 74
వినాలింద్ర కృతంచేత్తు కుడ్యం గర్భగృహాంతువా ।
అలింద్రాంశంతు సంయోజ్య కారయేత్తు ద్విజోత్తమ ॥ 75
ఆదిభూమ్యేవ మాఖ్యాత మూర్ధ్వం పట్టల వద్భవేత్ ॥ 75½

తా॥ ఆయామమున శాలయొక్క దీర్ఘము 5 భాగములును' హారము 1 భాగము, కూటము 1 భాగము, పంజరము 1 భాగము' హారములో సగము భద్రముగాని భద్ర పంజరముగాని రచించవలెను. మిగిలిన పనులన్నియును ఏకతలమున జెప్పబడిన ప్రకారము పై అంతస్తున రచించవలెను. మూడంతస్తులుగల గోపురము రచించు విధానమును చెప్పుచున్నాడు.

విస్తారమును 9 భాగములుచేసి ఆయామమును 11 భాగములు చేయవలెను. విస్తారమున గర్భము 3 భాగములును, గోడ 1 భాగము, అలింద్రము 1 భాగము, హారము 1 భాగము. పైన కర్ణకూటము 1 భాగము, మధ్యశాల 3 భాగములు, పంజరము విస్తారము 1 భాగము, హారాంతరము 1/2 భాగము, ఇట్లు మొదటి అంతస్తున రచించి శేషించిన రెండు అంతస్తులును పూర్వము చెప్పిన కొలతల ప్రకారము రచించవలెను. మఱియొక పద్ధతి విస్తారము ఆయతము పూర్వమునవలెనేచేసి అలింద్రము కల్పించుచోట గోడను గాని లేక లోపల గర్భమున గోడగాని చేయువచ్చును. ఆయతమున కోష్ఠము 5 భాగములు చేయవలెను. మిగిలిన పనులన్నియును

రెండస్తుల యందు జెప్పబడిన ప్రకారము చేయవలెను. ఇది మూడంతస్తుల గోపురముపద్ధతి. నాలుగంతస్తుల గోపురమును నిర్మించుపద్ధతి చెప్పుచున్నాడు.

విస్తారమును 10 భాగములు చేయవలెను. ఆయతము 12 భాగము లుండవలెను. గర్భగృహము 3 భాగములు, గోడ 1⅛ భాగము, అలింద్రము 1 భాగము, హారము 1 భాగము, పైన కర్ణము 1 భాగము, పంజరము 1 భాగము, హారము 1 భాగము, మధ్యశాల 4 భాగములు, శాలయొక్క రెండువైపుల హారము 1/2 భాగము చొప్పున రచించవలెను. ఆయామము 12 భాగములుగల వైపున శాలవిస్తారము 5 భాగములు చేయవలెను. ఇట్లు మొదటి అంతస్తున చేసి మిగిలినవి మూడంతస్తులును పూర్వము చెప్పబడిన ప్రకారము చేయవలెను. ఇది నాలుగంతస్తుల గోపురముపద్ధతి. అయిదంతస్తుల గోపురమును నిర్మించుపద్ధతి చెప్పుచున్నాడు.

విస్తారము 11 భాగములును, ఆయతము 12 భాగములును చేయవలెను. నాలుగువైపుల శాల 5 భాగములు, పంజరము 1 భాగము, కర్ణకూటము 1 భాగము హారము 1/2 భాగము ఇట్లు చేయవలెను. ఇట్లు మొదటిఅంతస్తున రచించి మిగిలినవి నాలుగంతస్తుల గోపురముయొక్క కొలతలప్రకారము చేయవలెను. ఇది ఐదంతస్తుల గోపురముయొక్క పద్ధతి. ఆరు అంతస్తుల గోపురమును నిర్మించుపద్ధతి చెప్పుచున్నాడు. విస్తారము 11 భాగములును, ఆయతము 13 భాగములునుచేసి గర్భగృహము 3 భాగములు, గోడలావు 2 భాగములు, అలింద్రము 1 భాగము, హారము 1 భాగము చేయవలెను. పైనశాల 4 భాగములు, హారము 1 భాగము, పంజరము 1 భాగము, కర్ణకూటము 1 భాగము చేయవలెను. అయితే శాల ముందు వైపునను వెనుకవైపునను 6 భాగము లుండవలెను. ఇట్లు

మొదటి అంతస్తున రచించి మిగిలిన అంతస్తులన్నియును పూర్వము చెప్పిన ఐదంతస్తుల గోపురముయొక్క కొలతలతో రచించవలెను. ఇది ఆఱు అంతస్తుల గోపురముయొక్క విధానము. ఏడంతస్తుల గోపురమును రచించుపద్ధతి చెప్పుచున్నాడు.

విస్తారము 13 భాగములు ఆయామము 15 భాగములుచేసి గర్భము 5 భాగములు, గోడ 2 భాగములు, అలింద్రము 1 భాగము ఖండహర్మ్యము 1 భాగము, చేయవలెను ప్రస్తరముపై నకర్ణకూటము 1 భాగము, పంజరము 1 భాగము, హారము 1 భాగము, మధ్యశాల 5 భాగములు చేయవలెను. ముందువైపునను వెనుకవైపునను శాల 7 భాగములు చేయవలెను. ఇట్లు మొదటి అంతస్తును సమస్తమైన అలంకారములతో రచించవలెను. శేషించిన అంతస్తులన్నియును ఆఱవ అంతస్తున చెప్పబడిన ప్రకారము చేయవలెను. ఇట్లు ఏడంతస్తులుగల మహాగోపురమును రచించవలెను. శిల్పాచార్యుడు అలింద్రములతోగాని అలింద్రములు లేకుండగాని గోపురమును రచించవచ్చును. అట్టియెడ అలింద్రమువంతు కలుపుకొని గోడగాని గర్భగృహముగాని కల్పించవలెను. ఏడంతస్తులుగల మహాగోపురము యొక్క విధానము చెప్పబడినది.

శ్లో॥ సప్తభూమి సమాఖ్యాతం తేషాంగణ్య మనోచ్యతే ॥ 76
పాదాధిష్ఠాన యోస్తుంగం మూలప్రాసాద మూలకమ్ ।
చతుష్పంచ షడంశంవా సప్తాష్టనవ ఏవవా ॥ 77
దశైకాదశభాగంవా కృత్వైకాం శోపపీఠకమ్ ।
అథవాహస్తమానేన ద్వారమానం యథోచితమ్ ॥ 78
తదుచ్చంతు చతుష్పంచషట్ సప్తాష్టౌతువా భవేత్ ।
నవరుద్రాంశభాగంవా కృత్వైకాంశం విశేషతః ॥ 79

ఉపపీఠోన్నతం ఖ్యాతం శేషంతు గుణభాజితే ।
అధిష్ఠానం తదేకాంశం ద్విభాగం చరణాయతమ్ ॥ 80
హోమాదుత్తర సీమాంతం ద్వారమానం విధీయతే ।
పాదబంధ మధిష్ఠానం ద్వారశోభాదినాకురు ॥ 81
స్తూప్యంత ముత్తరాంతంచ గసభాగవిభాజితే ।
ప్రస్తరోచ్చం సపాదాంశం శర్త్యంశం గలమానకమ్ ॥ 82
పాదోన గుణభాగంతు శిరః శేషం శిఖోదయమ్ ।
ఏవమేకతలం ప్రోక్తం ద్వితలం శృణుసువ్రత ॥ 83
ఉత్తరాది శిఖాంతంచ నవభాగ విభాజితే ।
ప్రస్తరంతు సపాదాంశం ద్విభాగం చరణోదయమ్ ॥ 84
మంచమానం శివాంశంస్యాత్త త్సమం కంధరోదయమ్ ।
శిఖరం సార్థయుగ్మాంశం సపాదాంశం శిఖోదయమ్ ॥ 85
ద్వితలంహ్యేవ మాఖ్యాతం త్రితలం చాధునాశృణు ।
ఉత్తరాత్ స్తూపి పర్యంతం భానుభాగ విభాజితే ॥ 86
పాదం ప్రస్తరోత్సేధం సార్థద్వ్యం శాంఘ్రికోదయమ్ ।
ప్రస్తరం శశిభాగేన ద్విభాగం చరణోదయమ్ ॥ 87
మంచమానం శివాంశంస్యా దంశం గ్రీవోదయం భవేత్ ।
పక్షాంశం శిఖరంజ్ఞేయ మేకాంశంస్తూపిమానకమ్ ॥ 88
త్రితలంహ్యేవమాఖ్యాతం చతుర్భూమమథోచ్యతే ।
ఉత్తరాదిశిఖాం తంతు ద్వినవాంశ విభాజితే ॥ 89
పాదోనద్వ్యంశమం చోచ్చం గుణాంశం చరణోదయమ్ ।
తదర్థం ప్రస్తరోత్సేధం సార్థద్వ్యం శాంఘ్రికోదయమ్ ॥ 90
తదర్థం ప్రస్తరోత్సేధం యుగ్మమం శాంఘ్రితుంగకమ్ ।
తదర్థం మంచమానంస్యాత్సార్థాంశం గలమానకమ్ ॥ 91

సార్ధద్వ్యంశం శిరోత్సేధం శిఖామానం శివాంశకమ్ ।
చతుర్భూమం సమాఖ్యాతం పంచభూమ మథోశ్శృణు ॥ 92
శిఖాగ్రాదుత్తరాంతంతు త్రయోవింశతి భాజితే ।
ద్విభాగం ప్రస్తరోత్సేధం సార్ధద్వ్యం శాంఘ్రితుంగకమ్ ॥ 93
తదర్ధం మంచమానంస్యా త్పాదాయామం గుణాంశకమ్ ।
స్యార్ధం ప్రస్తరోత్సేధం సార్ధద్వ్యంశాంఘ్రి తుంగకమ్॥ 94
తదర్ధం మంచమానంతు ద్విభాగం చరణోదయమ్ ।
ప్రస్తరోచ్చం శివాంశేన కంధరోచ్చంత థైవచ ॥ 95
స్వార్ధద్వ్యంశం శిరోత్తుంగ మేకాంశంస్తూపిమానకమ్ ।
పంచభూమం సమాఖ్యాతం షడ్భూమంత్వధునాశ్శృణు ॥ 96
ఉత్తరాది శిఖాంతంచ ఏకోనత్రింశదంశకే ।
ద్విభాగం ప్రస్తరోత్సేధం పాదోచ్చం చతురంశకమ్ ॥ 97
సత్రిపాదశివాంశంతు భూమినామాన్య మీరితమ్ ।
సార్ధాగ్న్యం శాంఘ్రితుంగంతు తదర్ధం ప్రస్తరోదయమ్ ॥ 98
(వహ్న్యంశంచాంఘ్రితుంగంతు తదర్ధం ప్రస్తరోదయమ్ ।
పాదోచ్చంసార్ధ యుగ్మాంశం తదర్ధం ప్రస్తరం భవేత్ ॥
పాదమానం ద్విభాగంతు శివాంశం ప్రస్తరోదయమ్ ।
గలతుంగం శివాంశంతు సార్ధద్వ్యంశం శిరస్తథా ॥)
శివాంశంతు శిఖామానం సప్తభూమమథోచ్యతే ।
ఉత్తరాది శిఖాంతంతు మానం షట్త్రింశదంశకే ॥ 99
పాదద్విభాగం మంచోచ్చం సార్ధవేదాంశ మంఘ్రికమ్ ।
ద్విభాగం ప్రస్తరోత్సేధం వేదాంశం చరణోదయమ్ ॥ 100
పాదోదద్వ్యంశ మంచంస్యాత్ సార్ధాగ్న్యం శాంఘ్రిమానకమ్
పాదోనద్వ్యంశమం చోచ్చం గుణాంశం పాదమానకమ్ ॥ 101
తదర్ధం ప్రస్తరోత్సేధం సార్ధషడ్భాంఘ్రి తుంగకమ్ ।
తదర్ధం మంచమానంతు ద్విభాగం చరణాయతమ్ ॥ 102

ప్రస్తరంశశిభాగేన శివాంశం గలమానకం।
పాదహీనాగ్ని భాగంతు శిరఃశేషం శిఖోదయమ్ ॥ 103
ఏవం సప్తతలంఖ్యాత మలంకారస్స్వ థోచ్యతే ॥ (103½)

తా॥ అంతస్తులయొక్క కొలతలు చెప్పుచున్నాడు- మొదటి ఆలయముయొక్క యెత్తులో 4-5-6-7-8-9-10-11 భాగములుచేసి అందులో ఉపపీఠము 1 భాగము చేయవలెను. లేక హస్తముల కొలతతోను చేయవచ్చును. హస్తముల కొలతతో ద్వారమును నిర్మించి ఆయెత్తులో 4-5-6-7-8-9-11 భాగములలో 1 భాగముగాని ఉపపీఠము యెత్తు చేయవచ్చును. మిగిలినది 3 భాగములుచేసి అధిష్ఠానము 1 భాగము, స్తంభము 2 భాగములు, హోమమునుండి ఉత్తరసీమ వఱకు ద్వారము యెత్తు నిర్ణయింపబడినది. పాదబంధము అధిష్ఠానము ద్వారశోభ మొదలైనవి చేయవలెను. స్తూపికాంతము గాని లేక ఉత్తరమువఱకుగాని 6 భాగములుచేసి ప్రస్తరము యెత్తు 1¼ భాగము, గలము 1 భాగము, శిరస్సు 2¾ భాగములు, స్తూపిక 1 భాగము, ఇట్లు ఒక్క అంతస్తుగల దానిని రచించవలెను. రెండంతస్తులు గలదాని యెత్తును చెప్పుచున్నాడు.

ఉత్తరము మొదలు కొనిస్తూపిక వఱకు 9 భాగములుచేసి ప్రస్తరము 1¼ భాగము, స్తంభము 2 భాగములు, మరల ప్రస్తరము 1 భాగము, కంఠము 1 భాగము, శిఖరము 2½ భాగములు, స్తూపిక 1¼ భాగము. ఇట్లు రెండంతస్తుల గోపురమును రచించవలెను. మూడంతస్తుల గోపురమునకు యెత్తును చెప్పుచున్నాడు. ఉత్తరము మొదలు స్తూపిక వఱకు 12 భాగములుచేసి ప్రస్తరము 1¼ భాగము, స్తంభము 2½ భాగములు, మరల ప్రస్తరము 1 భాగము, మరల స్తంభము 2 భాగములు, ఆపైన ప్రస్తరము 1 భాగము, గ్రీవ 1 భాగము, శిఖరము 2 భాగములు, స్తూపిక

1 భాగము, ఇట్లు మూడంతస్తుల గోపురమును నిర్మించవలెను. నాలుగంతస్తుల గోపురము యెత్తును చెప్పుచున్నాడు.

ఉత్తరము మొదలు స్తూపిక వఱకు 18 భాగములుచేసి ప్రస్తరము $1\frac{3}{4}$ భాగమును, స్తంభము 3 భాగములు, ఆపైన ప్రస్తరము $1\frac{1}{2}$ భాగము, మరల స్తంభము $2\frac{1}{2}$ భాగములు, దానిపైన ప్రస్తరము $1\frac{1}{4}$ భాగము, మరల స్తంభముయెత్తు 2 భాగములు, ఆపైన ప్రస్తరము 1 భాగము, గలము $1\frac{1}{2}$ భాగము, శిఖరము $2\frac{1}{2}$ భాగములు, స్తూపిక 1 భాగము, ఇట్లు నాలుగు అంతస్తుల గోపురమును నిర్మించవలెను. అయిదంతస్తుల గోపురము యెత్తును చెప్పుచున్నాడు.

ఉత్తరము మొదలుకొని స్తూపిక వఱకు 23 భాగములుచేసి ప్రస్తరము 2 భాగములు, స్తంభము $3\frac{1}{2}$ భాగములు, ప్రస్తరము $1\frac{3}{4}$ భాగములు, రెండవస్తంభము 3 భాగములు, ప్రస్తరము $1\frac{1}{2}$ భాగము, మూడవ స్తంభము $2\frac{1}{2}$ భాగములు, ప్రస్తరము $1\frac{1}{4}$ భాగములు, నాల్గవ స్తంభము 2 భాగములు, ప్రస్తరము 1 భాగము, కంఠము 1 భాగము, శిఖరము $2\frac{1}{2}$ భాగములు, స్తూపిక 1 భాగము, ఇట్లు ఐదంతస్తుల గోపురమును రచించవలెను. ఆఱంతస్తుల గోపురము యెత్తును చెప్పుచున్నాడు.

ఉత్తరము మొదలు స్తూపిక వఱకు 29 భాగములుచేసి ప్రస్తరము 2 భాగములు, స్తంభము 4 భాగములు, మరల ప్రస్తరము $1\frac{3}{4}$ భాగము, రెండవ స్తంభము $3\frac{1}{2}$ భాగములు, ప్రస్తరము $1\frac{3}{4}$ భాగము, మూడవ స్తంభము 3 భాగములు, ప్రస్తరము $1\frac{1}{2}$ భాగము, నాల్గవ స్తంభము $2\frac{1}{2}$ భాగములు, ప్రస్తరము $1\frac{1}{4}$ భాగము, ఐదవ స్తంభము 2 భాగములు, ప్రస్తరము 1 భాగము, కంఠము 1 భాగము, శిఖరము $2\frac{1}{2}$ భాగములు, స్తూపిక 1 భాగము,

ఇట్లు ఆఱంతస్తుల గోపురమును రచించవలెను. ఏడంతస్తుల గోపురముయొక్క యెత్తు చెప్పుచున్నాడు.

ఉత్తరము మొదలుకొని స్తూపిక వఱకు 36 భాగములుచేసి ప్రస్తరము 2 భాగములు, స్తంభము $4\frac{1}{2}$ భాగములు, ప్రస్తరము 2 భాగములు, రెండవ స్తంభము 4 భాగములు, ప్రస్తరము $1\frac{3}{4}$ భాగములు, మూడవ స్తంభము $3\frac{1}{2}$ భాగములు, ప్రస్తరము $1\frac{3}{4}$ భాగములు, నాల్గవ స్తంభము 3 భాగములు, ప్రస్తరము $1\frac{1}{2}$ భాగము ఐదవ స్తంభము $2\frac{1}{2}$ భాగములు, ప్రస్తరము $1\frac{1}{4}$ భాగము, ఆఱవ స్తంభము 2 భాగములు, ప్రస్తరము 1 భాగము, కంఠము 1 భాగము శిఖరము $2\frac{3}{4}$ భాగములు, స్తూపిక $1\frac{1}{2}$ భాగము, ఇట్లు ఏడంతస్తుల గోపురమును నిర్మించవలెను. ఇక అలంకారములయొక్క పద్ధతులను చెప్పుచున్నాడు.

శ్లో॥ మండపాభాం యథాద్వార శోభాం కుర్యాద్ద్విజోత్తమ ॥ 104
మండపం ద్వారశాలాస్యాత్ ప్రాసాదం సదనాకృతిః ।
మాలికాకృతి కర్తవ్యం ద్వారహార్మ్యం ద్విజోత్తమ ॥ 105
శాలాకారం ప్రకర్తవ్యం ద్వారగోపురమేవవా ।
సర్వంతు గోపురాంతంవా కల్పయేచ్ఛిల్ప విత్తమం ॥ 106
తేష్వాదా ద్వారశోభాంతు వక్ష్యేఽహం ద్విజసత్తమ ।
ఏకద్విత్రితలంవాఽపి సర్వాలంకార సంయుతమ్ ॥ 107
ముఖేముఖే మహానాసీ పార్శ్వయోర్వంశనాసికా ।
స్వస్వాకృత్యల్పనాసాఢ్యం ప్రాగుక్తవిధినాద్విజ ॥ 108
యుక్తస్తూపి సమాయుక్తం లుపరోహశిరస్తువా ।
మండపాకృతికంవాఽపి శ్రీకాంతంత దుదాహృతమ్ ॥ 109
శాలాకారశిరస్తస్మిన్ షణ్ణాస్యోముఖపృష్ఠయోః ।
పార్శ్వయోర్వంశనాసాఢ్యం యుక్తాస్తూపీవ సంయుతమ్ ॥ 110

అంతః పాదోత్తరైర్యుక్త మితికాంతమిదం పరమ్ ।
ముఖేముఖేచపఞ్జాసి పార్శ్వయోర్వంశనాసికా ॥ 111
సమాకారం శిరస్కంధం కాంతం విజయమేవహి ।
ఏవంత్రి విధనిత్యాంతు ద్వారశోభాం ప్రకల్పయేత్ ॥ 112
ముఖేముఖే మహానాసీ పార్శ్వయోశ్చ తథైవచ ।
అర్థకోటిచతస్రాఢ్యం పంజరంచ తదాకృతి ॥ 113
శాలాకారం శిరోపేత మయుగ్మ స్థూపిసంయుతమ్ ।
విశయం విశాలమేతద్ధి విశాలాలయ ముచ్యతే ॥ 114
అర్థకోటి సహస్రాంగం పార్శ్వయోర్భద్రనాసికా ।
పార్శ్వయోర్వంశనాస్యంగ మయుగ్మస్థూపికాన్వితమ్ ॥ 115
పాదం ప్రత్యల్పనాసాఢ్యం సర్వావయవ సంయుతమ్ ।
విప్రతికాంతాలంకారం వక్ష్యతేతు విశేషతః ॥ 116
పూర్వవదూహ్యమి భాగంచ చతుర్దిగ్భద్ర సంయుతమ్ ।
మహానాసీ చతుష్కాఢ్యం శిరోభద్ర సమన్వితమ్ ॥ 117
అంతః పాదోత్తరైర్యుక్త మయుగ్మ స్థూపికాన్వితమ్ ।
త్రవిధాద్వారశాలాస్యా ద్వారప్రాసాద ముచ్యతే ॥ 118
అంతః పాదోత్తరైర్యుక్తం మండపాద్యై రలంకృతమ్ ।
ద్వారే ద్వారాంగ సంయుక్తం ద్వారం దిగ్భద్ర సంయుతమ్ ॥
పూర్వేఒపరేచశాలాయాః సభద్రం భద్రనాసికా ।
నానామసూరకం స్తంభ వేదికాజాలతోరణమ్ ॥ 120
అంతఃపాదోత్తరైర్యుక్తం మధ్యవారణ సంయుతమ్ ।
పార్శ్వయోర్దండ వక్త్రాఢ్య క్షుద్రనాసీ విభూషితమ్ ॥ 121
శాలాకారం శిరోపేతం జాలకాది విభూషితమ్ ।
కోణ విశాలాలంకారం భూమిభాగేచ పూర్వవత్ ॥ 122

పార్శ్వయోశ్చముఖే పృష్ఠే మహానాసీ చతుష్టయమ్ ।
అయుగ్మస్తూపి సంయుక్తం ద్వారప్రాసాద కుడ్యకమ్ ॥ 123
వక్ష్యేఽహం ద్వారహర్మ్యస్య లక్షణం ద్విజసత్తమ ।
ప్రాగుక్తవత్ ప్రకర్తవ్యం భూమిభాగే ద్విజోత్తమ ॥ 124
సభాశిరస్య సంయుక్తం స్వస్తికాకృతి నాసికమ్ ।
పాదోత్తరైర్యుతం యుగ్మం ఆయుగ్మస్తూపినాన్వితమ్ ॥ 125
కూటం శిఖరనాఘ్య మయుగ్మస్తూపినాసికమ్ ।
కూటాది భూమిభాగంచ ప్రాగివైవ ప్రకల్పయేత్ ॥ 126
అపరేచపరేనాస్యా సతారేద్వ్యంశనిప్రవకమ్ ।
శాలాకారం శిరఃకార్యం నస్వ్రసం స్తూపికాన్వితమ్ ॥ 127
శాలాన్ప్రాకృతి సంయుక్తం నానాలంకారగ సంయుతమ్ ।
నానాధిష్ఠాన చరణైర్యుక్తంతత్ సోపపీఠకమ్ ॥ 128
ద్వారహర్మ్యం త్రిధాప్రోక్తం శృణుగోపుర లక్షణమ్ ।
చతుర్దిగ్భద్ర సంయుక్త మంతః పాదోత్తరైర్యుతమ్ ॥ 129
శాలాకారశిరోయుక్తం భద్రనాసీ ముఖేముఖే ।
పార్శ్వయోశ్చ మహానాస్యాపాదం ప్రత్యల్పనాసికా ॥ 130
మాత్రాదండ మితిఖ్యాతం త్రివిశాల మథోశృణు ।
పూర్వవద్భూమిభాగంచ తలోత్తుంగం క్రమాత్ కృశమ్॥ 131
సభాకారం శిరోవాఽపి శాలాకార మథాపివా ।
నానామసూరక స్తంభ వేదికాద్యై రలంకృతమ్ ॥ 132
చతుర్దిక్షు మహానాసీ విదిక్షు క్షుద్రనాసికమ్ ।
చతుర్ముఖం తతోవక్ష్యే భూమిభాగాది పూర్వకమ్ ॥ 133
శశిభద్రసమాయుక్తం మధ్యేవారణ సంయుతమ్ ।
నానామసూరక స్తంభ వేదికాద్యైరలంకృతమ్ ॥ 134

సభాకారం శిరోవాఽపి శాలాకారమథాపివా ।
ముఖేముఖే మహానాసీ పార్శ్వయోర్ద్విర్ద్వినాసికే ॥ 135
అంతః పాదోత్తరైర్యుక్తం ప్రస్తరేతుతలం ప్రతి ।
అంతః సోపాన సంయుక్తంమధ్యేవారణ సంయుతమ్ ॥ 136
ఏవం త్రిభాసముద్దిష్టం ద్వారగోపుర మధ్యమమ్ ।
అలింద్రాంశంచ కుడ్యంవా వృషభస్థలమేవవా ॥ 137
తులాద్యైః ప్రస్తరంవాఽథ అలింద్రాంగం యథోచితమ్ ।
శాలాకారం సభాకారం మాలికాకారమేవచ ॥ 138
యద్యదిష్టంతు యద్ద్వారే తత్తత్రైవ ప్రకల్పయేత్ ।
బాహ్యేబాహ్యేఽంఘ్రి పాదాభ్యాం మధ్యకుడ్యయుతంతువా॥
గృహపిండీ గర్భగేహం ప్రాగివైవ ప్రకల్పయేత్ ।
అలింద్రం ద్వారయోర్మానే వివృతాంఘ్రికమేవవా ॥ 140
ప్రస్తరేదిష్టభూమ్యంతం గోపానాదిసమన్వితమ్ ।
కూటకోష్ఠాద్యలంకార మూర్ధ్వస్తంభాన్ ప్రకల్పయేత్॥ 141
భూమిభాగమలంకారం గలాంతం పరికల్పయేత్ ।
శీర్షందండాంశం శాలాభం సభాకారం తదుచ్యతే ॥ 142
ఉపారోప్య తమాయత్తం సభాకారక ముచ్యతే ।
ప్రస్తరం ప్రతిసంభాద్య మండపం యత్త్రివిష్టినా ॥ 143
మాలికాకృతి కంఖ్యాతం మండపేతు పరస్పరమ్ ।
గోపురం హ్యేవమాఖ్యాతం పరివారవిధిం శృణు ॥ 144
ఇతి కాశ్యపశిల్పే గోపుర లక్షణం పంచచత్వారింశః పటలం సమాప్తం.

తా॥ ద్వారశోభను మండపమువలె నిర్మించవలెను. ద్వార శాలకూడ మండపమువలెనే యుండవలెను. ద్వారప్రాసాదము

గృహమువలె నుండును. ద్వారహర్మ్యము వరుసగా అంతస్తులతో దిబ్బలుగా నుండును ద్వారగోపురము శాలవలె అంతస్తులతో నుండును. ఈ అన్నిటిని గోపురములనియే చెప్పుదురు. ద్వారశోభ రచించుట యెట్లనిన, 1-2-3 అంతస్తులు చేయవచ్చును. నలువైపుల మహానాసికలును, స్వస్తికమువలె అల్పనాసికలును, తగిన స్తూపిక లును, లేక దిమ్మలుకట్టి ఆపైన శిఖరముగాని, లేక మండపమువలె గాని, రచించిన యెడల శ్రీకాంతగోపురమగును. శాలయొక్క ఆకారమువలె శిఖరమును, దానికి ముందువెనుక అనాసికలును, ఇరువైపుల వంశనాసికలును, తగినట్లు స్తూపికలును, లోపల స్తంభ ములును వానిపై దూలములవంటి బండలును, ఉండునట్లు రచించి రేని కాంతగోపురమగును.

ముందు 6 నాసికలును వెనుక 6 నాసికలును, ప్రక్కలయందు వంశనాసికలును, ఆపైన శిఖరమునుకల దానిని విజయకాంత గోపుర మందురు. ఈమూడును ద్వారశోభ యందలి భేదములు. ముందు వెనుక మహానాసికలును, ప్రక్కలయందు క్షుద్రనాసికలును, సగము కోనలుగల దిమ్మలు 4 ను, అదేరూపముగా పంజరములును, శాలా కారముగా శిఖరమును బేసిసంఖ్యగల స్తూపికలును, కలది విశయ గోపురమగును. సగముకోనలుగల దిమ్మలు అనేకమును ముందు వెనుక భద్రనాసికలును, ప్రక్కలయందు వంశనాసికలును, స్తంభ ములయందు అల్పనాసికలును, సమస్తమైన రూపములును, బేసి సంఖ్యగల స్తూపికలును కలది విశాల గోపురమగును. పూర్వము వలెనే భాగములుచేసి నలువైపుల భద్రములును, 4 మహానాసిక లును, శిరోభద్రమును, లోపల స్తంభములును, పైన దూలమువంటి బారుగల బాళ్లును, బేసిసంఖ్యగల స్తూపికలును, రచించిన యెడల విప్రతీకాంత గోపురమగును. ఈమూడును ద్వారశాలయందు విభేదములు. లోపల స్తంభములును వానిపై వెల్లునదూలములును,

ద్వారము సర్వాంగ సుందరముగను, ద్వారములయందు భద్రము లును, తూర్పున పడమరను భద్రనాసికలును, అనేకవిధములయిన పీఠములతో గూడిన స్తంభములును, వేదికలును, కిటికీలును, తోరణములును, మొదలగునవి కలది ద్వారశాల యనబడును. (ఇచట కొంత శిథిలమై నందున నామము వ్రాయబడలేదు.) లోపల స్తంభములును, నడుమ మత్తాలంబమును, ఇరువైపుల దండముఖములును, క్షుద్రనాసికలును, శాలవలె శిఖరమును, కిటికీలు మొదలయిన అలంకారములును, కలది కోశవిశాల గోపురమగును. పూర్వము వలెనే భాగములుచేసి ముందువెనుక యిరువైపుల మహానాసికలు 4 ను, బేసిసంఖ్యగల స్తూపికలును, కలది ద్వారప్రాసాద గోపురమనియును చెప్పుదురు. ఈ మూడును ద్వారప్రాసాదము నందలి భేదములు. పూర్వమువలెనే భాగములుచేసి సభాకారముగ శిఖరమును, స్వస్తికమువలె నాసికలును, స్తంభములును ఆపైన వెల్లుప మాలములు రెండును, బేసిసంఖ్యగల స్తూపికలును, కలది ద్వారహార్మ్య గోపురమగును.

పూర్వమువలెనే భాగములుచేసి నలువైపుల మహానాసికలును వాని యొక్క నిర్గమము 1 భాగమును, శిఖరముయొక్క ఆకారము శాలవలెను 8 కోణములుగల స్తూపికయును కలది రెండవ పద్ధతిగల ద్వారహార్మ్య గోపురము. శాలలయొక్క నిర్గమమును, అనేక విధములైన అలంకారములును, అనేక విధములైన పీఠములతో గూడిన స్తంభములును, ఉపపీఠముతో గూడిన అధిష్ఠానమునుకలది మూడవ పద్ధతిగల ద్వారశార్మ్య గోపురము. ద్వారహార్మ్య గోపురములు మూడు విధములు చెప్పబడినవి. ద్వారగోపురము యొక్క భేదములను వినుము.

నలువైపుల భద్రములును, లోపల స్తంభములును, వెల్లుపయును, శాలవలె శిఖరమును, రెండువైపుల భద్రనాసికలును, నడి

గోడమవైపులయందు మహానాసికలును, స్తంభమున క్షుద్రనాసిక లును, కలది మాత్రాదండ గోపురమగును. పూర్వమువలెనే అంత స్తులయందు భాగములనుచేసి క్రమక్రమముగా చివర తగ్గించుచు శిఖరము సభాకారముగాగాని, శాలాకారముగాగాని, స్తంభములు అనేకవిధములగు పీఠములతోను, వేదికలు అనేకములుగాను, రచించి నలువైపుల మహానాసికలును నలుమూలలయందు క్షుద్రనాసిక లును కల్పించిరేని శ్రీ విశాల గోపురమగును. ముందువైపున భద్ర మును, నడుమ మత్తవారణమును, అనేక విధములైన అధిష్ఠాన భేదములతో స్తంభములును, వేదికలును, తోరణములునుచేసి శిఖ రము సభాకారముగాగాని, శాలాకారముగాగాని, రచించి ముందు వెనుక మహానాసికలును,ఇరువైపుల రెండు రెండు క్షుద్రనాసికలును, లోపల స్తంభములును వానిపై వెల్లువయును, ఆపైన ప్రస్తరమును ప్రతిముఖముగాను, లోపల మెట్లును, నడుమ మత్తవారణమును ఇట్లు రచించిరేని చతుర్ముఖ గోపురమగును.

గోపురములయొక్క భేదము లిట్లు చెప్పబడినవి. అలింద్రము యొక్క భాగమున గోడగాని లేక నంది పీఠమునుగాని, మాలము మొదలైనవానియందు ప్రస్తరముగాని, అలింద్రమునకు బదులు ఏదియైనను రచించవచ్చును. శాలాకారము,సభాకారము, మాలికా కారము ఇట్లు ఏద్వారమున యేదియిష్టమో ఆద్వారమున అట్టి రూపమునే చేయవచ్చును. వెలుపల వెలుపల స్తంభములును, లోపలగోడయును, గర్భగృహమును, దానిచుట్టూ గోడయును, మునుపటివలెనే రచించవలెను. అలింద్రము ద్వారముయొక్క రెండువైపులను అదేయెత్తుతోగాని, లేక గోడలేకుండ స్తంభము లతోగాని ప్రస్తరమును రచించవచ్చును. ఇట్లు ఎన్ని అంతస్తు లయినను రచించవచ్చును. ప్రస్తరములు గోపానములతో గూడి అందముగా నుండవలెను. కూటములు, శాలలు, మొదలైనవియును,

పై స్తంభములును, నిర్మించవలెను. అంతస్థులయొక్క భాగములును, అలంకారముల యొక్క భాగములును, గలమువఱకు రచించవలెను. శిఖరము దండమువలెగాని, శాలవలెగాని, సభాకారముగా గాని చేయవచ్చును. గుజ్జులవలె దిమ్మలుకట్టి వానిపైన నిర్మించబడినది. సభాకారము, ప్రస్తరము, ప్రతి సంభాద్యము, మండపము కలది మాలికాకృతి యగును. మండపమునను భేదములు కలవు. ఇట్లు గోపురము యొక్క 15 విధములగు భేదములను తెలియవలయును.

శిల్పరత్నము 41వ అధ్యాయమున గోపుర విధానము కొంతమట్టుకు మాత్రమే చెప్పియున్నాడు. పూర్తిగాలేదు.

"శ్లో॥ గోపురాణాంతు సర్వేషాం కుడ్యం గర్భమలిందకమ్ ।
కూటంశాలాం పంజరంచ నాసికాం హస్తిపృష్ఠకమ్॥ 58
కరోతు మూలహార్మ్యేను సారాత్కుంభలతామపి ।
మసూరకస్తంభవేది జాలకైస్తోరణాదిభిః ॥ 59

యథాయుక్తి యథాశోభం యుక్తమేవకరోత్వతః॥ ఇట్లుచెప్పి సరిపుచ్చినాడు. "శ్రీమంతాది నామాని గోపురాణాం విశేషతః" అని యున్నాడు. శ్రీకాంత గోపురమున్నది కాని శ్రీమంత గోపురములేదు.

(అనుబంధము 5, 6 పటములు చూడుము.)

## 9. గోపుర విధానము మఱియొక పద్ధతి

మానసార 3వ అధ్యాయము :

శ్లో॥ తైతిలానాం నృపాణాంచ గోపురాణాంచ లక్షణమ్ ।
మానానాం సారంసంగృహ్యా శాస్త్రే సంక్షేపతః క్రమాత్॥ 1

త్రైతిలస్యోక్తమానం యస్మాన్మనుషాణాం నకారయేత్ ।
నరాణాంయోగ్యమానంయ త్రైతిలానాంతు యోగ్యకమ్ ॥ 2
క్షుద్రే(చ)క్షుద్రమానముక్తం ముఖ్యేముఖ్యంతు మానకమ్ ।
అజ్ఞానా ద్విపరీతంచేత్ స్థానాశం ధనక్షయమ్ ॥ 3
తస్మాత్తు గోపురమానం పరిగృహ్యోక్తవత్కురు ।
ఆద్యకేద్వార శోభంతు ద్వారశాలా ద్వితీయకే ॥ 4
ద్వారప్రాసాదోమధ్యేచ ద్వారహర్మ్యంమయూధికే ।
మహామర్యాది కుడ్యేచ మహాగోపుర మీరితమ్ ॥ 5
ఏషంతుకార యేచ్ఛిల్పి సాలానాం ద్వారకేత ధా ।
త్రిపంచసప్తకరాంతా దేకాదశ కరంతువా ॥ 6
ఏవంతు ద్వారశోభస్య విశాలం పంచధాస్మృతమ్ ।
పంచారత్ని సమారభ్య త్రయోదశ కరాంతకమ్ ॥ 7
ద్వారశాలావిశాలంచ పంచధా పరికీర్తితమ్ ।
సప్తహస్తం సమారభ్య పంచదశ కరాంతకమ్ ॥ 8
ద్వారప్రాసాద విస్తారం పంచభేద విదోవిదుః ।
నవహస్తం సమారభ్య ద్విద్విహస్తవి వర్ధనాత్ ॥ 9
సప్తదశ కరాంతం స్యాద్ ద్వారహర్మ్య విశాలతా ।
ఏకాదశకర మారభ్య నవపంక్తి కరాంతకమ్ ॥ 10
పంచధా విపులం ప్రోక్తం మహాగోపురమేవచ ।
పాదాధికంత ధార్ధంచ పాదోనంతత్సమాధికమ్ ॥ 11
విస్తృతాదాయతాః సర్వే గోపురాణాం విశేషతః ।
అథవా ద్విహస్తవృద్ధిఃస్యా చ్చత్వారింశత్కరాంతకమ్ ॥ 12
త్రిగుణోపరిహస్తాంతం వింశదాయామః శోభకే ।
శాలావిశాలతా మారభ్య ద్విద్విహస్తవివర్ధనాత్ ॥ 13
పంచాశత్కర సీమాంతం పంచవింశతి మాయతమ్ ।
ద్వారప్రాసాద విస్తారా త్పూర్వవద్వర్ధయేత్ క్రమాత్ ॥ 14

షష్టిహస్తావసానంస్యా త్త్రింశదాయామః పూర్వవత్ ।
ద్విద్విహస్త వివృద్ధ్యాచ హస్తసప్తతి కాంతకమ్ ॥ 15
ద్వారహర్మ్య విశాలోర్ధ్వే పంచవింశత్తదాయతమ్ ।
మహాగోపుర విస్తారం ద్విద్విహస్త వివర్ధనాత్ ॥ 16
అశీతిహస్తావసానం (చ) చత్వారింశత్త దాయతమ్ ।
అథవాఽరత్నిమానేన వర్ధమానాయతం మతమ్ ॥ 17
విస్తారద్విగుణాంతంచ చైకభాగేన వర్ధనాత్ ।
శోభాది గోపురాంతస్య తారేభక్తివశాదుచ్యతే ॥ 18
ద్విత్రివేదశరాంశంచ షడ్భాగం శోభవిస్తరే ॥
పంచషట్ సప్తభాగంతు చాష్టనంద విభాజితే ॥ 19
ఏవంతు ద్వారశావేతు విస్తారేతత్ప్రకల్పయేత్ ।
సప్తాష్టనవభాగంచ పంక్తిరేకాదశస్తథా ॥ 20
ద్వారప్రాసాదవిస్తారే భాగమేవం ప్రకల్పయేత్ ।
అష్టనంద దశాంశంతు చైకాదశార్క భాగికమ్ ॥ 21
ఏతేషాం ద్వారహర్మ్యేతు విస్తారం యుక్తితోన్యసేత్ ।
నవపంక్తి సభాగంతు సైకార్క మనుభాగికమ్ । 22
మహాగోపుర విస్తారే భాగమేవం ప్రకల్పయేత్ ॥ $22\frac{1}{2}$

తా॥ దేవతలకును మానవులకును గోపురములయొక్క లక్షణములను చెప్పుచున్నాడు. దేవతలకు చెప్పబడిన కొలతలు మానవుల కుపయోగించరాదు. మానవులకు జెప్పబడిన కొలతలు దేవతల కుపయోగించినను దోషము లేదు. అల్పగోపురములకు అల్పమానములును, శ్రేష్ఠగోపురములకు శ్రేష్ఠమానములును కల్పించవలెను. తెలియక ఎగుడుదిగుడుగా జేసిన యెడల ఆలయము నశించుటయే కాక ధనముకూడ నశించును. కనుక గోపురములయొక్క కొలతలు

చక్కగా తెలిసికొని జేయవలెను. 1. ద్వారశోభ, 2. ద్వారశాల, 3. ద్వారప్రాసాదము, 4 ద్వారహర్మ్యము, 5. మహాగోపురము, శిల్పాచార్యుడు ఆలోచనతో రచించవలెను. ద్వారశోభయొక్క విస్తారము 3-5-7-9-11 హస్తములు ఇట్లు 5 విధములు. ద్వారశాల యొక్క విస్తారము 5-7-9-11-13 హస్తములు ఇట్లు 5 విధములు. ద్వారప్రాసాదముయొక్క విస్తారము 7-9-11-13-15 హస్తములు. ఇట్లు 5 విధములు. ద్వారహర్మ్యముయొక్క విస్తారము 9-11-13-15-17 హస్తములు. ఇట్లు 5 విధములు. మహాగోపురము యొక్క విస్తారము 11-13-15-17-19 హస్తములు. ఇట్లు 5 విధములు. ఈ విస్తారములనుబట్టి దీర్ఘము $\frac{1}{4}$ భాగము అధికము, $\frac{1}{2}$ భాగము అధికము, $\frac{3}{4}$ భాగము అధికము, విస్తారమునకు రెట్టింపు, ఇట్లు 4 విధములుగా జేయుదురు. లేక వెడల్పు 2 హస్తములును పొడవు 3 హస్తములును ఇట్లు ద్వారశోభకు 2-2 హస్తములు పెంచుచు 40 హస్తములవరకును, 3-3 హస్తములు పెంచుచు 60 హస్తముల వరకును చేయవచ్చును.

అదేవిధముగా ద్వారశాలకు 50 హస్తముల విస్తారమువరకును 75 హస్తముల వరకు పొడవును చేయవచ్చును. ద్వారప్రాసాదమునకు 60 హస్తములవఱకు విస్తారమును, 90 హస్తముల వఱకు ఆయతమును చేయవచ్చును. ద్వారహర్మ్యమునకు 70 హస్తములవఱకు విస్తారమును 105 హస్తముల వఱకు నిడివియును చేయవచ్చును. మహాగోపురమునకు 80 హస్తములవఱకు విస్తారమును 120 హస్తముల పొడవును చేయవచ్చును. లేక హస్తముల కొలతతో విస్తారమునకు రెట్టింపువఱకు ఒక్కొక్క భాగమును పెంచుచు శోభ మొదలు గోపురమువఱకు విస్తారమున భాగముల ప్రకారము చెప్పుచున్నాడు. 2-3-4-5-6 భాగములు శోభయొక్క విస్తారము 5-6-7-8-9 భాగములు ద్వారశాలయొక్క విస్తారము 7-8-9-10-11 భాగ

ములు ద్వారప్రాసాదముయొక్క విస్తారము 8-9-10-11-12 భాగ
ములు ద్వారహర్మ్యముయొక్క విస్తారము 9-10-11-13-14 భాగ
ములు మహాగోపురముయొక్క విస్తారము. ఇట్లు భాగములను
కల్పించవలెను.

శ్లో॥ తద్విస్తారార్ధముత్సేధం త్రిపాదం తత్సమంతువా ॥ 23
ఏవంతు ద్వారపాదోచ్చం జన్మపాదాగ్ర సీమకమ్ ।
తదర్థం ద్వారవిస్తారం తద్విశాలం తథోదయమ్ ॥ 24
సపాదసార్ధపాదోన ద్విగుణానాంతు మానుషే ।
సర్వేషాం ద్వారతుంగేచ విస్తారేచ విశేషతః ॥ 25
విస్తారాత్పాదాధికేన విస్తారార్ధావసానకమ్ ।
పంచషట్ సప్తభాగేతు ద్విగుణంసాంఘ్రి యుగ్మకమ్ ॥ 26
ద్వ్యంశాధ్యర్థం గుణాంశంవా ద్వారం సర్వోదయం భవేత్ ।
తత్తద్భాగ విశాలంస్యా త్తత్తుంగ వశేనహి ॥ 27
తదుత్సేధార్ధ విస్తారం ద్వారగోపురం విన్యసేత్ ।
అథవా చోప పీఠంస్యా న్మానంత్యక్త్వాతథోచ్ఛ్రయమ్ ॥ 28
పంచధా శాంతికాద్యుచ్చ మథునావక్ష్యతే క్రమాత్ ।
గోపురస్య విశాలార్థం తత్త్పాదాధికోదయమ్ ॥ 29
తదర్ధాధిక ముత్సేధం తత్త్రిపాదాధికోన్నతమ్ ।
తత్సమంచాధికోత్తుంగం ద్విగుణాత్పాతాధికోన్నతమ్ ॥ 30
ఏవంతు పంచధాద్వార తుంగం సర్వేషు గోపురే (షు) ।
అథవాహ స్తమానేన ద్వారమానం ప్రవక్ష్యతే ॥ 31
ఏకహస్తం సమారభ్య షట్ షడంగుల వర్ధనాత్ ।
ద్విహస్తాంతం ద్వారవిస్తారం ద్వారశోభంతు పంచధా ॥ 32
ద్విహస్తాది త్రిహస్తాంతం పంచధాద్వార విస్తృతమ్ ।
ఏవంతు ద్వారశాలేతు హస్తత్రయ(ం) సమారభేత్ ॥ 33

షట్ షడంగుల వృద్ధ్యాచ చతుర్హస్తావసానకమ్ ।
పంచధాద్వార విస్తారం ద్వారప్రాసాదమధ్యమే ॥ 34
చతుర్హస్తం సమారభ్య పంచహస్తావసానకమ్ ।
ద్వారహర్మ్యే ప్రదేశేతు ద్వారతారంతు పంచధా ॥ 35

పంచహస్తం సమారభ్య హస్తషట్కావసానకమ్ ।
గోపురే ద్వారవిస్తారం పంచధా పరికీర్తితమ్ ॥ 36
అథవాద్వారశోభాది గోపురాంతం యథాక్రమమ్ ।
ఏకద్విత్రిచతుష్పంచ హస్తాదాహస్త వర్ధనాత్ ॥ 37
పంచషట్ సప్తహస్తంచ చాష్టహస్తం నవాంతకమ్ ।
ఏతేషాం ద్వారసర్వేషాం విస్తార ద్విగుణోన్నతమ్ ॥ 38
దేవానాం ద్వారమేవోక్తం మానుషాణాం విశేషతః ।
ద్విగుణాష్టాంశ హీనంవా సప్తాంశం చైకహీనకమ్ ॥ 39
షడంశాంశైక హీనంవా పంచాంశం చైకహీనకమ్ ।
చతుర్భాగైక హీనంవా ద్వారతుంగం ప్రకల్పయేత్ ॥ 40
ఉత్తరాధః ప్రదేశాంతం జన్మోర్ధ్వం ద్వారమారభేత్ ।
ద్వారోత్సేధమిదం కుర్యాత్తస్యాం తద్ద్వారపట్టికా ॥ 41
శేషం యుక్త్యా ప్రయుంజీత ద్వారమేవంతు సర్వశః ॥ $41\frac{1}{2}$

తా॥ గోపురముయొక్క విస్తారములో సగముగాని,ముప్పాతిక వంతుగాని, లేక సమానముగాని ఇట్లు 3 విధములుగా ద్వారశాఖ యెత్తు చేయవచ్చును ఇట్లు జన్మమునుండి పైవరకు యెత్తు చేయవలెను. ద్వారముయొక్క విస్తారము యెత్తులో సగము చేయవలెను. ఆవిస్తారమునుబట్టి $1\frac{1}{4}$ - $1\frac{1}{2}$ - $1\frac{3}{4}$ భాగముల యెత్తు మనుష్య సంబంధమైన గోపురములకును, విస్తారమునుండి $\frac{1}{4}$ లేక $\frac{1}{2}$ భాగములు పెంపుగాని, విస్తారమును 4 భాగములుచేసిన 5-6-7-8-9-10 భాగ

ములును ఒక్కొక్కప్పుడు 12 భాగములును ఇన్ని విధములుగా గోపురద్వారముయొక్క యెత్తును చేయుచుందురు. ఆయావిశాలము లనుబట్టిగాని, ఆయాయెత్తులను బట్టిగాని, పైజెప్పినభాగములు కల్పించ వలసి యుండును. సామాన్యముగా ద్వారగోపురము యెత్తులో సగము విస్తారము కలిగియుండును. ఉపపీఠముయొక్క కొలతను త్రోసివేసి అక్కడినుండి స్తూపివరకును యెత్తును నిర్ణయించుకొన వచ్చును. శాంతికము మొదలైన 5 విధముల యెత్తులను చెప్పు చున్నాడు.

గోపురముయొక్క విస్తారములో సగముచేసి అక్కడనుండి $\frac{1}{4}$ వంతుగాని, $\frac{1}{2}$ భాగములు అధికముగాని, $\frac{3}{4}$ వంతు అధికముగాని, లేక విస్తారముతో సమానముగాని, లేక దానిపైన $\frac{1}{4}$ వంతు యెక్కువగాని, ఇట్లు 5 విధములుగా ద్వారముయొక్క యెత్తును చేయుదురు. లేక హస్తముల కొలతతో ద్వారముయొక్క విస్తార మును యెత్తును చేయుపద్ధతి యెట్లనిన 1. హస్తము మొదలు 6.6 అంగులములు పెంచుచు ఇట్లు 2 హస్తములవఱకు 5 విధములుగా ద్వారశోభయొక్క ద్వారవిస్తారమును 5 విధములుగా చేయవచ్చును. 2 హస్తములు మొదలు 3 హస్తములవఱకు పైవిధముగానే ద్వార శాలముయొక్క ద్వారవిస్తారమును 5 విధములుగా జేయవచ్చును. 3 హస్తములు మొదలు 6 అంగులములు పెంచుచు 4 హస్తముల వఱకు ద్వారప్రాసాదముయొక్క ద్వారవిస్తారమును 5 విధములుగా జేయవచ్చును. 4 హస్తములు మొదలు 6 అంగులములు పెంచుచు 5 హస్తములవరకు ద్వారహర్మ్యముయొక్క ద్వారవిస్తారము 5 విధ ములుగా చేయవచ్చును. 5 హస్తములు మొదలు 6 అంగులములు పెంచుచు 6 హస్తములవరకు మహాగోపురముయొక్క ద్వార విస్తార మును 5 విధములుగా జేయవచ్చును. ఇంకొకపద్ధతి 1-2-3-4-5 హస్తములు మొదలుకొని 1 హస్తము చొప్పున పెంచుచు 5-6-7-

8-9 హస్తములవఱకు సమస్తమైన గోపురములయొక్క ద్వారములకు విస్తారములను చేయుచుందురు. పైజెప్పిన అన్నివిధములైన కొలతలుగల ద్వారములకు విస్తారమునకు రెట్టింపుగా యెత్తుగా చేయవలెను. ఇవి దేవతలకు సంబంధించిన ద్వారములని తెలియవలెను. మనుష్య సంబంధమైన ద్వారములకు భాగము లెట్లనిన విస్తారమునకు రెట్టింపుచేసి అందులో 8వ వంతు తగ్గించిగాని, లేక దానిని 7 భాగములుచేసి అందు 1 భాగము తగ్గించిగాని, 6 భాగములుచేసి 1 భాగము తగ్గించిగాని, 5 భాగములుచేసి అందు 1 భాగము తగ్గించిగాని, 4 భాగములుచేసి అందు 1 భాగము తగ్గించిగాని ఇట్లు 5 విధములుగా ద్వారముయొక్క యెత్తును చేయుదురు. ఇట్లుచేసి ఆపైన ద్వారపట్టిక నుంచవలెను. మిగిలిన పనులన్నియును ఆలోచనతో చేయవలెను. ఇది ద్వారములయొక్క నిర్మాణవిధానము.

శ్లో॥ మూలహర్మ్యవశాద్వక్ష్యే గోపురాణాంచ మానకమ్ ॥ 42
మూలప్రాసాద విస్తార సమంవాపాద మధికం ।
అథవాధ్యర్థం విస్తారం పాదోన ద్విగుణంతువా ॥ 43

ద్విగుణంవా ప్రకర్తవ్యం ద్వారశోభాది విస్తరమ్ ।
ప్రత్యేకం పంచధామాన మాయామం పూర్వవద్భవేత్ ॥ 44
మూలాధిష్ఠాన పాదస్య సమాధిష్ఠాన పాదకమ్ ।
అథవాధిష్ఠాన పాదోచ్చం వేదభూత షడంశకమ్ ॥ 45

సప్తకాష్టాంశకం కృత్వా తత్తదేకైక హీనకమ్ ।
శేషం తద్ద్వారశోభాది పాదాధిష్ఠాన తుంగకమ్ ॥ 46

ఉపపీఠం వినాకుర్యాత్ ద్వారతుంగ మితిస్మృతం ।
శోభకేచైక భూమిఃస్యాద్ ద్వితీయే ద్వితలంభవేత్ ॥ 47

ద్వారప్రాసాద దేశేతు త్రితలంచైవ కారయేత్ ।
హర్మ్యే చతుస్తలంకుర్యాద్గోపురంతల పంచకమ్ ॥ 48
అన్యేషాయు సాతిదేశే షోడశాంతం తలాన్వితమ్ ।
ఏకత్రిపంచ భూమాదా ద్విద్విభూమి వివర్ధనాత్ ॥ 49
త్రివిధంచైక భూమాచ త్వేకార్కతలసీమకమ్ ।
ద్విత్రివేదతలాదాచ చతుర్దశ తలాంతకమ్ ॥ 50
ద్వితలేచ త్రివిధం ప్రోక్తం ద్విద్విభూమి వివర్ధనాత్ ।
త్రితలాత్పంచ త్రయాంతం త్రితలంత్రివిధం భవేత్ ॥ 51
చతుఃషడష్టభూమాదా షోడశాంతం తలసీమకం ।
కన్యసంత్రివిధం ప్రోక్తం కుర్యాదేవం చతుస్తకే ॥ 52
పంచసప్తతలనంద తలాదాద్విద్వి వర్ధనాత్ ।
సప్తదశతలాంతంస్యాత్త్రివిధం పంచభూమికే ॥ 53
దేవానాం మూలహర్మ్యస్య హీనాధిక్యం సమోన్నతమ్ ।
శోభాదిగోపురేష్వేవ ముక్తం సమ్యక్ పురాతనైః ॥ 54

నరాణాం మూలహర్మ్యస్య సమంహీనోన్న తంతువా ।
మూల స్యాధిక భూమించే ద్రాజరాష్ట్రం వినశ్యతి ॥ 55
ఏవంతు ద్వారశోభేచ చోక్తవత్కారయేత్సుధీః ।
అన్యథాద్వార దేశేతు యథాచోక్తవదాచరేత్ ॥ 56
ద్వారపాదోదయేవేద భాగంకుర్యాద్వి చక్షణః ।
ఏకాంశంచోపపీఠోచ్చం తత్సమంచమసూరకమ్ ॥ 57

ద్విభాగం పాదతుంగంస్యాత్కారయేల్లక్షణాన్వితమ్ ।
ద్వారపాదోదయేఃధాతు పంక్తిభాగం విభాజితే ॥ 58

ఉపపీఠంశ రాంశంచ వేదభాగం మసూరకమ్ ।
అధిష్ఠాన ద్విగుణాంఘ్రి తుంగమేవం ప్రకల్పయేత్ ॥ 59

ద్వారపాదోదయేనంద భాగంకుర్యాత్ త్రిభాగికమ్ ।
ఉపపీఠోదయంచాక్షి భాగ మేవం మసూరకమ్ ॥ 60

తద్ద్వయం పాదతుంగేచ కుర్యాదేకోన వింశతిం ।
భాగం తద్ద్వారపాదోచ్చే సప్తభాగోప పీఠకమ్ ॥ 61
వేదభాగమధిష్ఠాన మష్టభాగాంఘ్రి తుంగకమ్ ।
ద్వారపాదోదయేచైవం షడ్భాగం ప్రవిభాజితే ॥ 62
ఉపపీఠోదయం క్షిప్రం భాగమంశంమ సూరకమ్ ।
తయోఽస్తుపాద తుంగంచ ద్విగుణం చైవకారయేత్ ॥ 63
ద్వారపాదోదయేచైక వింశద్భాగం విభాజితే ।
ఉపపీఠోద యంచైవ నవభాగం ప్రకల్పయేత్ ॥ 64
అధిష్ఠానం వేదభాగంతు వసుభాగమంఘ్రి తుంగం ।
ఏకాదశ విభాగేతు ద్వారపాదోదయం భవేత్ ॥ 65
పంచాంశంచోపపీఠోచ్చ మధిష్ఠానం ద్విభాగికమ్ ।
పాదతుంగం చతుర్భాగ మథవాద్వారపాదకే ॥ 66
తుంగేచ త్రయోవింశద్భాగమేవం విభాజితు ।
ఏకాదశం చోపపీఠంచతుర్భాగం మసూరకమ్ ॥ 67

అష్టాంశమంఘ్రి తుంగంస్యాత్ షడ్భాగంతు విభాజితే ।
త్రిభాగంచోపపీఠంతు శివభాగం మసూరకమ్ ॥ 68
ద్విభాగం పాదతుంగం స్యాత్తదూర్ధ్వే ప్రస్తరాదికమ్ ।
శిఖాంతం చోర్ధ్వమానేతు తలానామధునోచ్యతే ॥ 69

తా॥ ప్రధానాలయమునుండి గోపురప్రమాణమును చెప్పుచున్నాడు. ప్రధానాలయముయొక్క విస్తారముతో సమానముగాని, లేక అధికులు $\frac{1}{4}$ భాగముగాని, $\frac{1}{2}$ భాగముగాని, $\frac{3}{4}$ భాగముగాని, రెట్టింపుగాని ఇట్లు 5 విధములుగా ద్వారశోభాది గోపురములకు విస్తారము చెప్పబడినది. లేక విడివిడిగా విస్తారము ఆయామము

మునుపటివలెను చేయవచ్చును. మొదటి ఆలయముయొక్క అధి ష్ఠానము దిగువ ఉపపీఠముతో సమానముగా గోపురము నందలి అధిష్ఠానమున ఉపపీఠమును కల్పించవలెను. లేక అధిష్ఠానమున ఉపానముయెత్తు 4-5-6-7-8 భాగములుచేసి అందులో 1 భాగమును తగ్గించి గోపురముయొక్క అధిష్ఠానమునకు దిగువ ఉపపీఠము యెత్తు చేయవలెను. ఉపపీఠము లేకుండకూడ ద్వారముయెత్తు చెప్పబడి యున్నది. శోభ 1 అంతస్తుగను, శాలము 2 అంతస్తులుగను, ప్రాసాదము 3 అంతస్తులుగను, హర్మ్యము 4 అంతస్తులుగను, గోపురము 5 అంతస్తులుగను ప్రారంభించవలెను. ఇందు శోభము 1-3-5 అంతస్తులు అధమము. 5-7-9 అంతస్తులు మధ్యమము. 9-11-13 అంతస్తులు శ్రేష్ఠము. ఇట్లు 3 విధములుకలవు. శాలము 2-4-6 అంతస్తులు అధమము. 6-8-10 అంతస్తులు మధ్యమము. 10-12-14 అంతస్తులు ఉత్తమము ఇట్లు 3 విధములు కలవు. ప్రాసాదము 3-5-7 అంతస్తులు అధమము. 7-9-11 అంతస్తులు మధ్యమము. 11-13-15 అంతస్తులు ఉత్తమము. ఇట్లు 3 విధములు కలవు. హర్మ్యము 4-6-8 అంతస్తులు అధమము. 8-10-12 అంతస్తులు మధ్యమము. 12-14-16 అంతస్తులు ఉత్తమము. ఇట్లు 3 విధములుకలవు. మహాగోపురము 5-7-9 అంతస్తులు అధమము. 9-11-13 అంతస్తులు మధ్యమము. 13-15-17 అంతస్తులు శ్రేష్ఠము. ఇట్లు 3 విధములుకలవు. దేవతలకు ప్రధాన దేవాలయమునకంటె తక్కువయును అధికమును సమానమును ఇట్లు 3 విధములుగా గోపురములయెత్తు చేయవచ్చును. మనుష్యసంబంధమైన గోపురములకు ప్రధాన గృహముతో సమానముగాని తక్కువగాని యెత్తుండవలెను మనుష్యసంబంధమైన గోపురములు గృహముకంటె యెత్తుండెనేని యజమానుని సమస్త సంపదలు నశించును. ఇది మొదటి ప్రాకారము నందలి గోపుర

మునుగూర్చి చెప్పబడినది. శేషించిన ప్రాకారముల యందలి గోపురములు శాస్త్రమున చెప్పబడినట్లు రచించవలెను.

ద్వారశాఖ పాదవును 4 భాగములుచేసి అందు 1 భాగము ఉపపీఠము, 1 భాగము అధిష్ఠానము, 2 భాగములు ద్వారశాఖ యెత్తు చేయవలెను. మఱియు ద్వారశాఖ పాదవు 17 భాగములు చేసి అందు ఉపపీఠము 5 భాగములు, అధిష్ఠానము 4 భాగములు, ద్వారశాఖ 8 భాగములు చేయవలెను. మఱియొక పద్ధతి ద్వారశాఖ పాదవు 9 భాగములుచేసి అందు ఉపపీఠము 3 భాగములు, అధిష్ఠానము, 2 భాగములు, ద్వారశాఖ 4 భాగములు చేయవలెను. ఇంకొకపద్ధతి ద్వారశాఖ యెత్తు 19 భాగములుచేసి అందు ఉపపీఠము 7 భాగములు, అధిష్ఠానము 4 భాగములు, ద్వారశాఖ 8 భాగములు చేయవలెను. ద్వారశాఖ పాదవును 6 భాగములు చేసి అందు ఉపపీఠము 1 భాగము, అధిష్టానము 1 భాగము ద్వారశాఖ 4 భాగములు చేయవలెను. వేఱొకపద్ధతి.

ద్వారశాఖ పాదవును 21 భాగములుచేసి అందు ఉపపీఠము 9 భాగములు, అధిష్ఠానము 4 భాగములు, ద్వారశాఖ 8 భాగములు చేయవలెను. మఱియొకపద్ధతి ద్వారశాఖపాదవు 11 భాగములు చేసి ఆందు ఉపపీఠము 5 భాగములు, అధిష్టానము 2 భాగములు, ద్వారశాఖ 4 భాగములు చేయవలెను. లేక ద్వారశాఖ పాదవు 23 భాగములుచేసి అందు ఉపపీఠము 11 భాగములు, అధిష్టానము 4 భాగములు, ద్వారశాఖ 8 భాగములు చేయవలెను. ఇంకను ద్వారశాఖ పాదవు 6 భాగములుచేసి అందు ఉపపీఠము 3 భాగములు, అధిష్టానము 1 భాగము, ద్వారశాఖయెత్తు 2 భాగములు చేసి ఆపైన ప్రస్తరమును రచించవలెను. ఊర్ధ్వమానము శిఖాంతమువఱకు చెప్పబోవుచున్నాడు.

శ్లో॥ అధిష్ఠానసమం మంచం తత్సమంగల తుంగకం ।
గలోచ్చ ద్విగుణం ప్రోక్తం శిఖరస్యోదయం న్యసేత్ ॥ 70
శిఖరార్ధం శిఖోత్తుంగం స్తూపిత్రయ సమన్వితం ।
ఏవమేక తలం ప్రోక్తం ద్వితలాదిక మేవచ ॥ 71
క్షుద్రం మధ్యంచ ముఖ్యానాం గోపురీతు విశేషతః ।
ప్రస్తరాది శిఖాంతం స్యాత్ గణ్యమానం ప్రవక్ష్యతే ॥ 72
యస్యాధిష్ఠాన మానంచ తస్య మానవశాదుచ్యతే ।
మసూరోచ్చ సమంవాపి తదష్టాంశనేన మేవవా ॥ 73
పంచషట్ సప్తహీనంవా ప్రస్తరోదయ మేవచ ।
ఊర్ధ్వభూమాంఘ్రి కోత్తుంగమధః పాదవశాదుచ్యతే ॥ 74
అష్ట సప్తక షట్పంచ భాగమేకోనమేవవా ।
తత్తద్భాగోనమానంతు చోర్ధ్వోర్ధ్వ చరణోదయమ్ ॥ 75
తలేతలే ప్రస్తరాణాంతు కారయే దేవమానతః ।
క్షుద్రగోపుర మేవంతు కారయేద్గణ్య మానకమ్ ॥ 76
నవమేకాదశై కార్క-మధిష్ఠానోదయం భవేత్ ।
తత్తద్భాగార్ధభాగేన శేషం తత్ప్రస్తరోదయమ్ ॥ 77
అధః పాదోదయం తత్తద్ భాగోనం చోర్ధ్వపాదకం ।
ప్రస్తరస్యైరమానంతు కారయేత్తు తలేతలే ॥ 78
యస్యమానావసానాంతం చోత్తరాంతం విధీయతే ।
తదూర్ధ్వే ప్రస్తరం యుక్తం తస్యార్ధా చోర్ధ్వవేదికా ॥ 79
తద్ద్వయం గలతుంగంస్యా త్ప్రస్తరోచ్చద్వయంశిరః ।
శిఖరార్ధం శిఖోత్తుంగం తేషాంగోపురమేవచ ॥ 80
ఏవంతు మధ్యమానంతు గోపురాణాంతు గణ్యకం ।
ముఖ్యగోపుర గణ్యంతు వక్ష్యతే విధినాధునా ॥ 81

పూర్వవచ్చైక భూమముక్తం ద్వితలాది విశేషతః ।
ద్వారపాదోదయంచైవ ద్వారవిస్తార మానకం ॥ 82
ఉపపీఠోగయమానం మసూరకాంఘ్రి తుంగకం ।
శేషం ప్రాగుక్త వత్కుర్యాదూర్ధ్వమానం ప్రవక్ష్యతే ॥ 83
అధిష్ఠాన త్రిపాదంచ ఊర్ధ్వపాదస్య తుంగకం ।
అధఃపాద త్రిపాదంచ ఊర్ధ్వపాదోదయం భవేత్ ॥ 84
అధోమంచ త్రిపాదంచ చోపరిప్రస్తరం భవేత్ ।
అథవా భూమిషట్సప్త కాష్టనంద దశాంశకం ॥ 85
తత్తదేకైక హీనంవా చోర్ధ్వపాదాది కోదయం ।
తదర్ధం వేదికోత్తుంగం తద్ద్వయం గ్రీవతుంగకమ్ ॥ 86
గ్రీవతుంగద్వయం చైవ శిఖరస్యోదయం భవేత్ ।
తదర్ధం తచ్ఛిఖోత్తుంగం ద్వితవే పంచకం శిఖమ్ ॥ 87
ప్రస్తరం పూర్వవన్మాన మాదిపాదాది పూర్వవత్ ।
ప్రస్తరోదయమానం యత్తదర్ధం వేదకోదయమ్ ॥ 88
వేదికాచోర్ధ్వకాంతాస్యా త్పూర్వవత్పరి కల్పయేత్ ।
ద్వితుంగే త్రిద్వినేత్రంవా సప్తనేత్రం సమన్వితమ్ ॥ 89
ఏవం త్రితలమాఖ్యాతం ॥ చతుర్భూమ మిహోచ్యతే ॥ 89½

తా॥ అధిష్ఠానముతో సమానము ప్రస్తరము, దానితో సమానము గలముమెత్తు గలముమెత్తునకు రెట్టింపుగా శిఖరము మెత్తు, శిఖరము మెత్తులో సగము మెత్తున 3 కలశములను ఉండు నట్లు ఒక్క అంతస్తు గోపురమును రచించవలయును, ఇందు క్షుద్రము, మధ్యము. శ్రేష్ఠము, అను మూడువిధములుగలవు. వాని లక్షణములను చెప్పుచున్నాడు. ప్రస్తరము మొదలుకొని కలశము వఱకు కొలతలను తెలిసికొనవలెను. అధిష్ఠానమును, అధిష్ఠానముతో సమానముగాని, లేక అందులో 8వ వంతు తగ్గించిగాని, 5-6-7

వంతులు తగ్గించిగాని ప్రస్తరమును చేయవచ్చును. క్రింది స్తంభము మొత్తులో 8-7-6-5 భాగములను తగ్గించి పై స్తంభమును రచించవలయును. ఇదే ప్రకారము పై అంతస్తు లన్నిటికిని తగ్గించుచుండవలెను. ప్రస్తరములనుగూడ ఇదే విధముగా ప్రతి అంతస్తును తగ్గించుచుండవలెను. ఇది క్షుద్రగోపురముల కొలత అధిష్ఠానము మొత్తు 9-11-13 భాగములుచేసి ఆయా భాగములలో సగమువంతు తగ్గించి ప్రస్తరమును చేయవలయును. దిగువ స్తంభము అటులనే భాగములను 9-11-13 చేసి అందు 1 భాగమును తగ్గించి పైన స్తంభమును చేయవలెను. ప్రస్తరముపైన చెప్పినట్లు ప్రతి అంతస్తునను తగ్గించుచుండవలెను. ఒక్కొక్క అంతస్తుకొలత వాజనము పై మట్టమువఱకు అని తెలియవలెను. ఆపైన ప్రస్తరమును అందులో సగము వేదికయును, వేదికకు రెట్టింపుగా గలమును, ప్రస్తరము మొత్తునకు రెట్టింపుగా శిఖరమును, శిఖరము మొత్తులో సగము పైకలశమును, ఇది మధ్యమ గోపురముకొలత.

ఒక్క అంతస్తుగల దానిని మునుపటివలెనే చేయవలయును. రెండతస్తులు మొదలగువాని కొలతలను చెప్పుచున్నాడు. ద్వారశాఖ యొక్క పొడవును, ద్వారము యొక్క విస్తారమును, ఉపపీఠము యొక్క పొడవును, ప్రస్తరమును, స్తంభమును, మిగిలినవన్నియును మునుపటివలెనే రచించవలెను. ఎత్తును చెప్పుచున్నాడు. అధిష్ఠానము ఎత్తులో ముప్పాతికవంతు పై స్తంభముమొత్తు, మొదటి స్తంభములో ముప్పాతికవంతు పై అంతస్తు స్తంభముమొత్తు మొదటి ప్రస్తరము మొత్తులో ముప్పాతికవంతు పైఅంతస్తు ప్రస్తరము లేక 5-6-7-8-9-10 భాగములుచేసి ఆయా భాగములలో ఒక్కొక్క భాగము తగ్గించిగాని, పైఅంతస్తున స్తంభముమొత్తు చేయవచ్చును. వేదికమొత్తు స్తంభములో సగము చేయవలయును. వేదికమొత్తునకు

రెట్టింపుగా గలము యెత్తును, గ్రీవము యెత్తునకు రెట్టింపుగా శిఖరము యెత్తును, శిఖరముయెత్తులో సగము, పైకలశముల యెత్తును రెండంతస్తుల గోపురమునకు 5 కలశము లుండవలెను. మూడవ అంతస్తున మొదటి యంతస్తున జేసినట్లే అన్ని అంతస్తుల యందును చేయుచు, ప్రస్తరములో సగముయెత్తు వేదిక వేదికయొక్క పై భాగము వఱకు కొలతయగును. మూడంతస్తుల గోపురమునకు 5 గాని లేక 7 గాని కలశముల నుంచవచ్చును. ఇక నాలుగంతస్తుల గోపురమునకు కొలతలను జెప్పుచున్నాడు.

## 10. గోపురములకు కొలతలు

శ్లో॥ అర్థాధిష్ఠాన మానంయత్ షడ్భాగంచ విభాజితే ॥ 90
సమంవా పాదశరాంశంవా ప్రస్తరోదయ మీరితం ।
భూతషష్ఠాంశకంవాపి చోర్ధ్వపాదోదయం తథా ॥ 91
ఆది ప్రస్తరమానంతు త్రిపాదం చోర్ధ్వమంచకం ।
వేదంసార్థంశరాంశంతు చోర్ధ్వపాదోదయం భవేత్ ॥ 92
సత్రిపాదం ద్విభాగంస్యా చ్చోర్ధ్వపాదోర్ధ్వ మంచకం ।
గుణంసార్థం చతుర్భాగ మూర్ధ్వపాదమథాపివా ॥ 93
సార్థం ద్విభాగం మంచంచ వేదికోచ్చ మర్థభాగికం ।
తద్ద్వయంగల తుంగంస్యా చ్ఛిరోభాగం గలతథా ॥ 94
శిరస్తుం గార్థభాగంతు స్థూపితుంగం ప్రకల్పయేత్ ।
నవసంఖ్యా శిఖాప్రోక్తా ద్వితలంతుచ పూర్వవత్ ॥ 95
అధివాచతురశ్రంచ స్థూపిమేకం చతుర్ముఖం ।
ఏవంచతుస్తలం ప్రోక్తం పంచభూమంతు వక్ష్యతే ॥ 96
పూర్వవద్భాగమానేన ప్రస్తరం పూర్వవద్భవేత్ ।
సార్థభూతాంశకం చైవ ముపరిచాంఘ్రి తుంగకమ్ ॥ 97

ద్వితీయం ప్రస్తరోత్తుంగం సత్రిపాదం ద్విభాగికం ।
ఊర్ధ్వ పాదం శరాంశంతు తృతీయం ప్రస్తరోదయమ్ ॥ 98
సార్ధద్విభాగమానేన చోర్ధ్వపాదం యుగాంశకం ।
చతుర్థం ప్రస్తరోత్సేధం సపాదద్వ్యంశకం భవేత్ ॥ 99
తమూర్ధ్వాంఘ్రి యుగాంశంతు ప్రస్తరం చద్విభాగికం ।
వేదికోచ్చం శివాంశంస్యాద్ గ్రీవోచ్చంతు ద్విభాగికమ్ ॥ 100
ద్విభాం శిఖరతుంగంస్యాత్ శిఖరార్థం తచ్ఛిఖోదయమ్।
ద్విలలాటే మహానాసి చైకాదశ శిఖాన్వితమ్ ॥ 101
అన్యేషాంచ తలానాంచం ప్రస్తరాదిచ పూర్వవత్ ।
పాదానామపి సర్వేషాం ప్రస్తరాణాం వేతకే ॥ 102
ఏవంమానం ప్రకుర్వీత వేదికాదిగ లాన్వితం ।
శిఖరాది శిఖామానం పూర్వవద్యుక్తింతోన్యసేత్ ॥ 103
అధివాద్వార శోభాది గోపురాణాం విశేషతః ।
విస్తారాద్ద్వి గుణోత్సేధం జన్మాది స్తూపికాంతకమ్ ॥ 104
ద్విగుణార్ధంచ హీనంవా చాధిక్యంచ త్రిధోన్నతం ।
సార్ధంతు ద్విగుణోత్సేధం పాదోనం ద్విగుణోన్నతమ్ ॥ 105
క్షుద్రగోపుర మేవంతు మధ్యమం తత్ప్రవక్ష్యతే ।
క్షుద్రాత్తుపాద హీనంవా చార్ధహీనోదయంతువా ॥ 106
ఏవంతు మధ్యమం ప్రోక్తం మధ్యమాత్పాదహీనకం ।
విస్తారాదద్వి గుణోత్సేధం ముఖ్యగోపురమేవచ ॥ 107
పూర్వవత్ ప్రస్తరాద్యంతం చోర్ధ్వేస్తూపి కాంతకం ।
గణ్యమానంచ సర్వేషాం భాగమానవశాత్ క్రమాత్ ॥ 108
తచ్చతుర్భాగికం కృత్వా చైకభాగం గలోదయం ।
శిఖరోచ్చం ద్విభాగంతు చైకాంశం తచ్ఛిఖోదయమ్ ॥ 109
ఏవమేకతలంప్రోక్తం ద్వితలేభాగముచ్యతే ॥ 109½

తా॥ అర్ధాధిష్ఠాన మానమును 6 భాగములుచేసి దానితో సమానముగాని, పాతికవంతు కలిపిగాని లేక 5 భాగములుగాని, ప్రస్తరము యెత్తు చేయవలయును. 5 లేక 6 భాగములు అధః పాదముయొక్క యెత్తును చేయవలెను. మొదటి ప్రస్తరము యెత్తుతో ముప్పాతికవంతు పై ప్రస్తరమును చేయవలయును. రెండవ అంతస్తున స్తంభము $4\frac{1}{2}$ భాగములు లేక 5 భాగములు చేయవలెను. $2\frac{3}{4}$ భాగములు పై ప్రస్తరము, $3\frac{1}{2}$ భాగములు లేక 4 భాగములు. ఆపైన స్తంభములు, ప్రస్తరము $2\frac{1}{2}$ భాగములు, వేదిక ప్రస్తరములో సగము, గలము వేదికకు రెట్టింపు గలమునకు రెట్టింపు శిఖరము. శిఖరములో సగముయెత్తు పై కలశములు. అవి 9 ఉండవలెను. రెండవ అంతస్తును మునుపటివలెనే చేయవచ్చును. లేక నలుచదరమును నాలుగు ముఖములుగల కలశమును ఒక్కదానినే యుంచవచ్చును. ఇది నాలుగంతస్తుల గోపురము.

అయిదంతస్తుల గోపురమునుగూడ మొదటి అంతస్తు మునుపటివలెనే భాగముల ప్రకారము రచించవలెను. $5\frac{1}{2}$ భాగములు. పై స్తంభము రెండవ ప్రస్తరముయెత్తు $2\frac{3}{4}$ భాగములు. పైన స్తంభము 5 భాగములు, మూడవ ప్రస్తరము. $2\frac{1}{2}$ భాగములు, ఆపైన స్తంభము 4 భాగములు. నాల్గవ ప్రస్తరము $2\frac{1}{4}$ భాగములు. ఆపైన స్తంభముయెత్తు 4 భాగములు. ఐదవ ప్రస్తరము 2 భాగములు. వేదిక యెత్తు 1 భాగము. గ్రీవముయెత్తు 2 భాగములు. శిఖరముయెత్తు 2 భాగములు. శిఖరములో సగముస్థూపి. రెండు లలాటములయందు మహానాసియును, 11 కలశములును, కలిగియుండవలెను. ఇతర అంతస్తులును ప్రస్తరములును పూర్వమువలెనే రచించవలెను. స్తంభము లన్నిటికిని ప్రతి అంతస్తున ప్రస్తరము కాదు. ఇట్లే వేదికలుగలములోస్థూపి నిర్మించవలెను. మఱియు ద్వారశోభ మొదలగు గోపురములకు విస్తారమునకు రెట్టింపుగా

పాదవునుచేసి ఉపానము మొదలుకొని స్తూపికవఱకు భాగములు నిర్ణయించవలెను, రెట్టింపుగాని పాతికవంతు, అరవంతు తగ్గించి గాని గోపురములకు ఎత్తును చేయుదురు. ఈ చెప్పబడిన క్షుద్రగోపు రములకొలతకంటె పాతికవంతుగాని, అరవంతుగాని ఎత్తును తగ్గించి మధ్యమ గోపురములకు ఎత్తును చేయుదురు. మధ్యమగోపురము కంటె పాతికవంతు ఎత్తును తగ్గించిగాని, లేక విస్తారమునకు అరవంతు ఎక్కువ పాదవుచేసిగాని శ్రేష్ఠమగు గోపురమును రచింతురు. మునుపటివలెనే ప్రస్తరాద్యంతమును, పైన స్తూపికాంతమును, కొలతలుకలిగి యుండవలెను. దానిని 4 భాగములుచేసి 1 భాగము గలము పాదవును, శిఖరము ఎత్తు 2 భాగములును, స్తూపిక ఎత్తు 1 భాగమును చేయనలయును. ఇది ఒక్క అంతస్తుకలదాని పద్ధతి.

శ్లో॥ కృత్వాద్విరష్టభాగం యద్ భూతాంశం చోర్ధ్వపాదకం ॥ 110
ద్విభాగం ప్రస్తరోత్తుంగ మేకాంశం వేదితుంగకం।
కోలకంగలతుంగంస్యా ద్వేదాంశం మస్తకోదయమ్ ॥ 111
తదర్ధం స్తూపికోత్సేధం శేషంతు పూర్వవద్భవేత్ ।
తదూర్ధ్వే పంచవింశాంశం కృత్వా చత్రితలం విదుః ॥ 112
ద్వితీయాం ఘ్ర్యుచ్చం షడ్భాగం సార్ధద్వయాంశకం ప్రతి।
తదూర్ధ్వే సార్ధపంచాంశం పాదాయామం తృతీయకమ్ ॥ 113
అంతిమంచ ద్విభాగంస్యాద్ వేదికోదయముం శకం।
గ్రీవతుంగం కలాభాగం శిఖరోచ్చం యుగాంశకమ్ ॥ 114
స్తూపితుంగంద్వయం ప్రోక్తం ప్రత్యూర్ధ్వాది శిఖాంతకం।
నవాధిక్యం దశాంశంత ద్విభజేత్తు చతుస్తలే ॥ 115
తదంశే సార్ధవహ్న్యంశం పాదోచ్చంతద్ ద్వితీయకమ్ ।
అర్ధాధికశివాంశం తదూర్ధ్వే ప్రస్తరమానకం ॥ 116

సార్థత్రిభాగం పాదోచ్చం సపాదాంశం కపోతకం ।
సత్రిపాదద్వయం చాంఘ్రి ప్రస్తరోచ్చం శివాంశకమ్ ॥ 117
వేదికోచ్చం తదర్ధంస్యాద్ గ్రీవోచ్చం సార్ధభాగికమ్ ।
తద్ద్వయాశిఖరోత్తుంగం తదర్థం తచ్ఛిఖోదయమ్ ॥ 118
ప్రస్తరస్యోపరిష్ఠాత్తు స్తూపికాంతోదయం తథా ।
షట్పంచ భాగికంకృత్వా భూతాంశం పాదతుంగకమ్ ॥ 119
నేత్రాంశం ప్రస్తరోత్తుంగం సార్థవేదాంశ మంఘ్రికమ్ ।
త్రిపాదోపేత మేకాంశం ప్రస్తరోదయ మీరితం ॥ 120
సపాదవేదమంఘ్ర్యుచ్చం సార్ధాంశమూర్ధ్వ మంచకమ్ ।
సార్ధవహ్న్యంశాంఘ్రితుంగం సపాదాంశంతు ప్రస్తరమ్ ॥ 121
తదూర్ధ్వే వేదితుంగార్థం కంథరం సార్ధభాగికం ।
తద్ద్వయం శిఖరతుంగం స్యాత్ సపాదాంశం శిఖోదయమ్॥ 122
ఏవం పంచతలం ప్రోక్తం శేషం ప్రాగుక్తవద్భవేత్ ॥ ।
అథవా ద్వారశోభాది పాదుకాది శిఖాంతకం ॥ 123
భాగమానశాద్గణ్యమానం యత్రోప్యచ్యతే బుధైః ।
పూర్వైస్తు తుంగమానంత ద్దశభాగాద్వి భాజితే ॥ 124

తా॥ రెండంతస్తుల గోపురమునకు కొలతలనుచెప్పుచున్నాడు. ఎత్తును 16 భాగములుచేసి స్తంభము 5 భాగములు, ప్రస్తరము 2 భాగములు. వేదిక 1 భాగము, గలము 2 భాగములు, మస్తకము 4 భాగములు, స్తూపి 2 భాగములు మిగిలిన పన్నులన్నియును మును పటివలెనే చేయవలయును. మూడంతస్తులలో గోపురమునకు ఎత్తు 25 భాగములు చేయవలయును. స్తంభము ఎత్తు 6 భాగములు, ప్రస్తరము $2\frac{1}{2}$ భాగములు. ఆపైన స్తంభము $5\frac{1}{2}$ భాగములు. పై ప్రస్తరము 2 భాగములు, వేదిక 1 భాగము, గ్రీవము 2 భాగములు, శిఖరము 4 భాగములు, స్తూపి 2 భాగములు. ఇట్లు మూడంతస్తు

లను రచించవలెను. నాలుగంతస్తుల గోపురము ఎత్తును 19 భాగములుచేసి స్తంభము $3\frac{1}{2}$ భాగములు, ప్రస్తరము $1\frac{1}{2}$ భాగములు, పై స్తంభము $3\frac{1}{2}$ భాగములు, కపోతము $1\frac{1}{4}$ భాగము, మరల స్తంభము $2\frac{3}{4}$ భాగములు, ప్రస్తరము 1 భాగము వేదిక $\frac{1}{2}$ భాగము గ్రీవము $1\frac{1}{2}$ భాగము, శిఖరము 3 భాగములు, స్తూపిక $1\frac{1}{2}$ భాగము ఇందు 20 భాగములకు కొలత చెప్పబడియున్నది. నాలుగంతస్తుల పద్ధతి.

ప్రస్తరము పైనుండి యెత్తును 30 భాగములు చేసి స్తంభము 5 భాగములు, ప్రస్తరము 2 భాగములు, మరల స్తంభము $4\frac{1}{2}$ భాగములు, ప్రస్తరము $1\frac{3}{4}$ భాగములు, మరల స్తంభము $4\frac{1}{4}$ భాగములు ప్రస్తరము $1\frac{1}{2}$ భాగములు, వేది $\frac{1}{2}$ భాగము, గలము $1\frac{1}{2}$ భాగము, శిఖరము 3 భాగములు, స్తూపి $1\frac{1}{4}$ భాగము. ఇట్లు అయిదంతస్తుల గోపురమును రచించవలెను. ద్వారశోభాది గోపురములకు పాదుక మొదలు స్తూపికవఱకు భాగములనుచేసి రచించుపద్ధతి చెప్పుచున్నాడు. ఎత్తును 10 భాగములు చేయవలయును.

(అనుబంధము 7, 8, 9, 10 పటములు చూడుడు.)

## 11. ఉత్తమగోపురముల కొలతలు

శ్లో॥ ద్విభాగం చోపపీఠోచ్చం తస్మాదేకాంశం కుట్టిమం ।
తద్ద్వయం పాదతుంగంస్యా త్తదర్థం ప్రస్తరోదయమ్ ॥ 125
తత్సమం గ్రీవ తుంగం స్యాతద్ద్వయం శిఖరోదయం ।
తచ్ఛిఖోదయ మేకాంశం శేషమానంతు పూర్వవత్ ॥ 126
ఏవమేకతలం ప్రోక్తం ద్వితలభాగ ముచ్యతే ।
జన్మాది స్తూపి పర్యంతం నవపంక్త్యంశకం భవేత్॥

స్యాత్త్ర్యంశం చోపపీఠోచ్చం కుట్టిమంచ ద్విభాగికం ।
పాదదైర్ఘ్యం యుగాంశంస్యాత్సత్రిపాదాంశం మంచకమ్॥ 128

సత్రిపాదద్వయాంశంచ మూలపాదోదయం తథా ।
కపోత ప్రతిరేకాంశం వేదితుంగం తదర్ధకమ్ ॥ 129

గ్రీవోచ్చమేక భాగంస్యాచ్ఛిఖరోచ్చం కలాంశకం ।
తదర్ధం స్తూపికోత్తుంగం శేషం ప్రాగుక్తవన్నయేత్ ॥ 130

త్రితలే పూర్వవత్తుంగం త్రిసప్తాంశం విభాజితే ।
ఉపపీఠం చతుర్భాగం సార్ధాంశంతు మసూరకమ్ ॥ 131

గుణాంశం పాదతుంగంస్యాత్కపోతం సార్ధభాగికం ।
సార్ధద్వయాంశం పాదోచ్చం ప్రస్తరోచ్చం శివాంశకమ్॥ 132

సపాదద్వ్యంశకా జంఘా మంచాయామంత్రిపాదకం ।
తదూర్ధ్వేఽర్ధాంశం వేద్యుచ్చం చోర్ధ్వేగ్రీవం శివాంశకమ్॥ 133

గ్రీవద్వయసమంమూర్ధ్ని గ్రీవతుల్యం శిఖోదయం ।
శేషం పూర్వవదుద్దిష్టం చతుస్తల మిహోచ్యతే ॥ 134

జన్మాదిస్తూపి పర్యంతం కృత్వైకత్రింశ దంశకం ।
షడ్భాగం చోపపీఠోచ్చం ద్వ్యంశకం పీఠమానకమ్ ॥ 135

తద్ద్వయం పాదదైర్ఘ్యంతు సత్రిపాదాంశం మంచకమ్ ।
సపాదత్ర్యంశకం పాదం సార్ధాంశం మంచతుంగకమ్ ॥ 136

పాదాయామంగుణాంశం స్యాత్సపాదాంశం కపోతకం ।
పాదోనత్ర్యంశకం చోర్ధ్వే పాదాయామం ప్రకల్పయేత్॥ 137

ప్రస్తరం చైకభాగంస్యాత్తదర్ధం వేదికోదయం ।
తద్ద్వయం గ్రీవతుంగంస్యాద్ గ్రీవతుంగద్వయం శిరః ॥ 138

ఏకాంశం స్తూపికోత్తుంగం శేషం పూర్వవదాచరేత్ ।
జన్మాదిస్తూపికాంతం చైకోనపంచాశ దంశకమ్ ॥ 139

తద్భాగోపానమస్త్రాంశం సపాదాష్టాంశకం తువా ।
ఉపపీఠమధిష్ఠానం తుంగం సార్థద్వయాంశకమ్ ॥ 140
తద్ద్వయం పాదతుంగంస్యాత్తదర్థం ప్రస్తరోదయం ।
సార్థత్రిశత్యంఘ్రితుంగంస్యాత్సపాదద్వ్యం శమంచకమ్ ॥ 141
పాదాధిక్యంచ చతుర్భాగం పాదం మంచం ద్విభాగికం ।
వేదాంశం పాదతుంగంచ సత్రిపాదాంశ మంచకమ్ ॥ 142
తదూర్ధ్వే చరణోత్తుంగం సత్రిపాద గుణాంశకం ।
ప్రస్తరం సార్థభాగంతు వేదితుంగం త్రిపాదకమ్ ॥ 143
తద్ద్వయం గలతుంగంస్యాద్గుణాంశం శిఖరోదయం ।
సార్థభాగం శిఖోత్తుంగమేవం పంచతలం విదుః ॥ 144

తా॥ ఎత్తును 10 భాగములుచేసి ఉపపీఠము 2 భాగములు, అధిష్ఠానము 1 భాగము, స్తంభము 2 భాగములు, ప్రస్తరము 1 భాగము, గ్రీవము 1 భాగము, శిఖరము 2 భాగములు, స్థూపిక 1 భాగము. ఇట్లు ఒక్క అంతస్తు కలదానిని రచించవలయును. రెండంతస్తుల గోపురమునకు ఎత్తు 19 భాగములుచేసి ఉపపీఠము 3 భాగములు, అధిష్ఠానము 2 భాగములు, స్తంభము 4 భాగములు, ప్రస్తరము $1\frac{3}{4}$ భాగములు, మరల స్తంభము $2\frac{3}{4}$ భాగములు, ప్రస్తరము 1 భాగము, వేది $\frac{1}{2}$ భాగము, గలము 1 భాగము, శిఖరము 2 భాగములు, స్థూపి 1 భాగము. ఇట్లు రెండంతస్తులు కలదానిని రచించవలయును.

మూడంతస్తుల గోపురమునకు ఎత్తు 21 భాగములు చేయవలయును. ఉపపీఠము 4 భాగములు, అధిష్ఠానము $1\frac{1}{2}$ భాగములు, స్తంభము 3 భాగములు, ప్రస్తరము $1\frac{1}{2}$ భాగము, మరల స్తంభము $2\frac{1}{2}$ భాగములు, ప్రస్తరము 1 భాగము, మూడవ స్తంభము $2\frac{1}{4}$ భాగము ప్రస్తరము $\frac{3}{4}$ భాగము, వేది $\frac{1}{2}$ భాగము, గలము

1 భాగము, శిఖరము 2 భాగములు, స్తూపిక 1 భాగము. ఇట్లు మూడంతస్తుల గోపురమును రచించవలయును.

నాలుగంతస్తుల గోపురమునకు ఎత్తు 31 భాగములు చేయవలెను. ఉపపీఠము 6 భాగములు, అధిష్ఠానము 2 భాగములు, స్తంభము 4 భాగములు, ప్రస్తరము $1\frac{3}{4}$ భాగము. రెండవ స్తంభము $3\frac{1}{4}$ భాగములు, ప్రస్తరము $1\frac{1}{2}$ భాగము. మూడవ స్తంభము 3 భాగములు, ప్రస్తరము $1\frac{1}{4}$ భాగము, నాల్గవ స్తంభము $2\frac{3}{4}$ భాగములు. ప్రస్తరము 1 భాగము, వేది $\frac{1}{2}$ భాగము, గలము 1 భాగము, శిఖరము 2 భాగములు, స్తూపిక 1 భాగము. ఇట్లు నాలుగంతస్తుల గోపురములను రచించవలెను.

ఐదంతస్తుల గోపురమునకు ఎత్తు 49 భాగములు చేయవలెను. ఉపపీఠము $8\frac{1}{4}$ భాగములు, అధిష్ఠానము $2\frac{1}{2}$ భాగములు, స్తంభము 5 భాగములు, ప్రస్తరము $2\frac{1}{2}$ భాగములు, రెండవ స్తంభము $4\frac{1}{2}$ భాగములు, ప్రస్తరము $2\frac{1}{4}$ భాగములు. మూడవ స్తంభము $4\frac{1}{4}$ భాగములు, ప్రస్తరము 2 భాగములు. నాల్గవ స్తంభము 4 భాగములు, ప్రస్తరము $1\frac{3}{4}$ భాగములు. అయిదవ స్తంభము $3\frac{3}{4}$ భాగములు, ప్రస్తరము $1\frac{1}{2}$ భాగములు, వేది $\frac{3}{4}$ భాగము, గలము $1\frac{1}{2}$ భాగములు. శిఖరము 3 భాగములు, స్తూపిక $1\frac{1}{2}$ భాగములు. ఇట్లు 5 అంతస్తుల గోపురమును రచించవలెను.

శ్లో॥ శేషంచ పూర్వవత్కుర్యాత్ ద్వారశోభాది పంచధా ।
ఘనంచాప్యఘనంచైవ విన్యాస మథం వక్ష్యతే ॥ 145
విస్తారాయామం శోభాదా పూర్వవద్గోపురాంతకం ।
యన్మానం బహిరస్యైన చూలికామాన సంయుతమ్ ॥ 146
ఏకహస్తం సమారభ్య షట్ షడంగుల వర్ధనాత్ ।
శోభాది గోపురాంతాయ నిర్గమః పంచధాభవేత్ ॥ 147

అథవాభిత్తి పాదాత్ స్యాద్ దండమానేన సంయుతం ।
ఏకదండం సమారభ్య దశదండావసానకమ్ ॥ 148
యథా విమానసంయుక్తం తత్రతదోషోన విద్యతే ।
అజ్ఞానాత్ హానవిచ్ఛేద్యం సర్వదోషకరం భవేత్ ॥ 149
తస్మాత్పరిహరేద్విద్వాన్ మానవనిర్గమమేవచ ।
యథాతారేతు ధాత్వంశం గర్భగేహం గుణాంశకమ్ ॥ 150
ఏకకావృత భిత్తిః స్యా దేవమేక తలంభవేత్ ॥

తా॥ మిగిలిన పనులన్నియును, మునుపటివలెనే చేయవలెను. ద్వారశోభ మొదలగు 5 విధముల గోపురములకును విస్తారమును పొడవును మునుపటివలెనేచేయుచు వెలుపలికి నిర్గమము 1 హస్తము మొదలుకొని 6 అంగులముల చొప్పున పెంచుచు 5 విధములుగా రచించవచ్చును. లేక కుడ్యస్తంభమునుండి దండమానముచేత 1 దండము మొదలు 10 దండముల వఱకు నిర్గమమును రచించ వచ్చును. విమానముతో గూడి యున్నపుడు దోషములేదు. విస్తారము 7 భాగములుచేసి అందు గర్భము 3 భాగములు చేయవల యును. ఒక్క ఆవరణముగల గోడయును ఇట్లు ఒక్క అంతస్తుగల గోపురమును రచించవలెను.

శ్లో॥ ద్వితలేతారం సప్తాంశం వేదాంశం గర్భగేహకం ॥ 151
పరితః సార్థభాగేన భిత్తివిష్కంభ మానకమ్ ।
తదర్ధాంశం కూటశాలా మండితం భిత్తితో న్యసేత్ ॥ 152
తత్సమంచాంతరాలంస్యా న్మధ్యకోష్ఠంగుణాంశకం ।
తస్మాత్తు కూటయోర్మధ్యే చాంతరాలం ప్రకల్పయేత్ ॥ 153
అంతరాలం విశేషేణ పంజరాది విభూషితం ।
ఏవంతు ద్వితలంప్రోక్తం కారయేద్ ద్వారశాలకే ॥ 154

తా॥ ద్వారశాలయను గోపురమునకు విస్తారము 7 భాగములును, అందు గర్భము 4 భాగములును, రెండు అంతస్తులును, చుట్టును గోడ విస్తారము 1½ భాగమును చేయవలెను. అందులో సగము కూటశాలయును, దానితో సమానము అంతరాలమును, మధ్యకోష్ఠము 3 భాగములును, కోష్ఠమునుండి కూటములమధ్య అంతరాలములను పంజరములతోగూడ రచించవలెను. ఇది రెండంతస్తుల పద్ధతి.

శ్లో॥ త్రితలే తార రంధ్రాంశే గర్భగేహం గుణాంశకం ।
ఆవృతి భిత్తిరేకాంశం తత్సమాశే నాలిందకం ॥ 155
తద్బహిశ్చావృతాంశేన కూటకోష్ఠాది పూర్వవత్ ।
ద్వారప్రాసాద మేవంతు ద్వారహర్మ్యమిహోచ్యతే ॥ 156

తా॥ మూడంతస్తులుగల ద్వారప్రాసాదమను గోపురమునకు విస్తారము 9 భాగములును, అందు గర్భము 3 భాగములును, చుట్టునుగోడ 1 భాగము దానితో సమానము. అలిందమును, దాని వెలుపల చుట్టును 1 భాగము కూటకోష్ఠములు మొదలగునవి పూర్వమువలెనే రచించవలెను. ఇది మూడంతస్తుల రచన—

శ్లో॥ విస్తారేదశభాగేతు గర్భగేహం త్రయాంశకం ।
తద్బాహ్యేఽవృత భిత్తిస్తు చాంశేనా వృతాలిందకమ్ ॥ 157
అంశేన కర్ణహర్మ్యాది పరితోంశేన కూటకం ।
ముఖ్యశాలంతు భూతాంశం శేషాంశం చాంతరాంతమ్ ॥ 158
ఏవంచ తు స్తలం ప్రోక్తం పంచభూమిరిహోచ్యతే ॥ 158½

తా॥ నాలుగంతస్తులుగల ద్వారహర్మ్యమను గోపురమునకు విస్తారము 10 భాగములుచేసి అందు గర్భము 3 భాగములు, దాని చుట్టును గోడ 1 భాగమును, అలిందము 1 భాగమును, కర్ణహర్మ్యము

మొదలగునవియును 1 భాగమును, ముఖ్యశాల 5 భాగములు. మిగిలినది అంతరాలము చేయవచ్చును. ఇది నాలుగంతస్తుల గోపురమును రచించుపద్ధతి.

శ్లో॥ విస్తారం రుద్రభాగంతు నాలిగేహం గుణాంశకం ॥ 159
తద్బహిర్ ద్వ్యంశమేకేన వృద్ధ్యాకుడ్య విశాలకం ।
తత్తద్బాహ్యే వృతాంశేన కుర్యాద లిందకం భవేత్ ॥ 160
ఏకాంశం కూటశాలాది కర్ణహర్మ్యావృతం తథా ।
ఏకాంశం కూటవిస్తారం మహాశాలా త్రయాంశకా ॥ 161
ఏకైకం చాంతరాలంస్యాత్ క్షుద్రశాలైక భాగికం ।
విస్తారద్విగుణాన్యేవ భాగమేలేన వర్ధనాత్ ॥ 162
యథేష్టం దీర్ఘవిస్తారే కూటకోష్ఠాది విన్యసేత్ ।
పాదాన్యాన్ భద్ర సంయుక్తం పాదం దేశేషు విన్యసేత్॥ 163
ప్రధానేచోర్ధ్వదేశేవా కుర్యాద్దోషోన విద్యతే ।
ఏకదండం ద్విదండంవా త్రిదండం భద్రనిర్గమమ్ ॥ 164
అన్యేషాం హర్మ్యమానేన యుక్త్యా తత్రైవ యోజయేత్ ।
ఏవం ఘనమానముక్త మఘనం వక్ష్యతేఽధునా ॥ 165
విస్తారాయామభక్తిః స్యాదుక్తవద్యుక్తితోన్యసేత్ ।
ద్విత్రిభాగం విశాలంతు చాయతం తత్ప్ర కల్పయేత్ ॥ 166
భక్తిత్రిభాగమేకాంశం భిత్తివిస్తారమేవచ ।
శేషంతద్గర్భగేహంతు మధ్యభాగేతు లేశనమ్ ॥ 167
అథవాచాయతంవేద భాగం కుర్యాద్విచక్షణః ।
హార్మ్యార్ధం భిత్తివిస్తారం శేషంతు గర్భగేహకే ॥ 168
అలిందపరితో భిత్త్యర్ధం ద్వారదేశే విశాలతా ।
త్రిభాగం భద్రవిస్తారం సార్ధభాగంతు నిర్గమమ్ ॥ 169

నవపంక్త్యం శకంవాపి రుద్రభాగాంశ మేవచ ।
ఏవంతు మధ్యకోష్ఠంచ నిర్గమంచ ద్విభాగికమ్ ॥ 170
తస్య మధ్యేతు భద్రంవా పంచషడ్భాగ మేవవా ।
అథవాసప్తభాగంతు వసుభాగం తథైవచ ॥ 171
ఏకాంశం నిర్గమం కుర్యాత్ షట్ సప్తాంశ మథాపివా ॥
ఏవంతు చాంతరాలంస్యా న్మధ్యమే మధ్యశాలయుక్ ॥ 172
ద్విభాగంవా త్రిభాగంవా విస్తారం నిర్గమాంశకం ।
తద్ద్వయోరంతరం కుర్యా ద్వ్యక్త్యాతత్రైవ భూషితమ్ ॥ 173
ఏకంవా కర్ణకూటంతు తథైవాంతర్వి శేషతః ।
భిత్తిబాహ్యేవృతాంశేన కర్ణకూటాద్బహిస్తథా ॥ 174
ఏవం జలస్థలంప్రోక్త మూర్ధ్వాధోభూమిం విన్యసేత్ ।
శేషంతు పూర్వవత్కుర్యా దేవంతు త్రితలం మతమ్ ॥ 175

తా॥ విస్తారమును 11 భాగములుచేసి నాలి గృహము. 3 భాగములు, దానివెలుపల 2 భాగములుగోడ ఒక్కొక్క భాగము పెంపుతో అలిందములును, ఒక్క భాగము కూటశాలలును కల్పించవలెను. కూట విస్తారము 1భాగము మహాశాల 3 భాగములు, 1-1 భాగముఅంతరాలము,క్షుద్రశాల 1భాగము, విస్తారము 2 పాళ్ళుచేసి అందు 1 భాగమునుకలిపి యిష్టము వచ్చినట్లు కూటములు శాలలు రచించవచ్చును. స్తంభములకు భద్రములను, స్థానములయందు స్తంభములను రచించవలెను. ప్రధాన స్తంభములకును పై స్తంభములకును అలంకారము లుండవచ్చును. 1-2-3 దండములు భద్రములకు నిర్గమములను చేయవచ్చును. ఒక్కొక్కచోట ఆలోచించి తగిన ప్రకారము చేయవలెను. ఇది ఘనమానము. అఘనము. అనగా నిర్గమము లేకుండ జేయుట వెడల్పు పొడవు భాగములు చేయవలెను. విస్తారము 2 భాగములును, ఆయతము 3 భాగము

లును చేయవలెను. 3 భాగములలో 1 భాగము గోడయును మిగిలినది గర్భగృహమును అగును. లేక పొడవు 4 భాగములు చేసి అందులో సగముగోడ విస్తారమును మిగిలినది గర్భగృహమును చేయవలెను. గోడలో సగము చుట్టూ అలిందముల వెలుపల ద్వారమువద్ద విస్తారమును చేయవలెను. భద్రము విస్తారము 3భాగములు, నిర్గమము $1\frac{1}{2}$ భాగము, 9-10-11 భాగములు మధ్యకోష్ఠమును రచించవచ్చును, అయితే నిర్గమము మాత్రము 2 భాగములే యుండవలెను. దానిమధ్య భద్రము 5-6-7-8 భాగములును దాని నిర్గమము 1 భాగమును 6-7 భాగములు అంతరాలమును చేయవచ్చును. మధ్యశాలతో కలిసి అంతరాల ముండవలెను. 2 భాగములుగాని 3 భాగములుగాని, విస్తారమును నిర్గమము 1 భాగమును, ఆ రెంటిసందు ఎడమును ఆలోచనతో రచించవలెను. కర్ణకూటము 1 భాగము, అటులనే గోడ వెలుపల 1 భాగము కర్ణకూటముల వెలుపల జలమార్గములును, అన్ని అంతస్తులును పూర్వము చెప్పబడినట్లు రచించవలెను. ఇది మూడు అంతస్తుల రచన. మధ్యకోష్ఠ విశాలమును 1-1 భాగము పెంపుచేయుచు అంతస్తులను వరుసగా పెంచుచుండవలయును.

(అనుబంధము 11 నుండి 15 వఱకుగల పటములు చూడుడు)

## 12. కూటకోష్ఠాది లక్షణములు

శ్లో॥ మధ్యకోష్ఠ విశాలేతు పూర్వవత్ స్యాం శమాధికం ।
శేషం ప్రాగుక్తవత్ కుర్యాత్ సర్వంయుక్త్యా ప్రయోజయేత్ ॥
ద్వారప్రాసాదమేవంతు త్రితలేష్వేవ కారయేత్ ।
గోపురేతు చతుస్త్ర్యాభి విన్యాసంచ మయోఘునా ॥ 177
విస్తారే రుద్రభాగంతు పూర్వవదాయతం మతం।
అష్టాంశాద్యేక భాగాంతం పంచధా విపులంభవేత్ ॥ 178

తత్తద్ద్విగుణ సీమాంతం పాదమేకేన వర్ధనాత్ ।
ఏవంచాయ మిదం ప్రోక్తం భిత్తిగేహ మిహోచ్యతే ॥ 179

త్రిచతుష్పంచ షడ్భాగం సప్తాంశం కుడ్యవిస్తరం ।
శేషంతు నాలగేహంతు పంచధాపరికీర్తితమ్ ॥ 180

భిత్తిబాహ్యం శకాంశేన ద్విభాగంచ తలేతలే ।
లలాటే భద్రమేకాంశ విస్తారం నిర్గమార్థకమ్ ॥ 181

అంతస్త్వలింద్రకంవాపి భిత్తికం వాంఘ్రికాన్వితం ।
తద్బహిరలింద్రకే యుక్త్యా జాలకం చాంఘ్రి కాంతరే ॥ 182

ఘనంవాప్య ఘనంవాపి భిత్తింకుర్యా ద్విచక్షణః ।
ఆయామేమధ్యమే ద్వారం భిత్తిదేశేత్వయం న్యసేత్ ॥ 183

గేహేతద్వల్లలాటేతు చోపపీఠాకృతి తలం ।
అథవావ్రపవద్యుక్త్యా యథేష్టముత్సేధం మానయేత్ ॥ 184

స్తంభయుగ్గోపురం జ్ఞాత్వా విస్తారే చోత్తరాంతకం ।
తత్త్రిభాగద్విభాగంవా భిత్తిమేకేన కారయేత్ ॥ 185

స్థాపయేద్భాగమేకం చేత్తత్పూర్వాద్బహిరాశ్రితం ।
అంతోత్తరాయతేన్యస్య తిర్యక్ తౌలిప్రకల్పయేత్ ॥ 186

పాదం వాయతేతౌలిం కుర్యాద్యుక్త్యా విచక్షణః ।
తదూర్ధ్వే జయంతికం కుర్యాత్తత్తత్ప్రచ్ఛాదనాన్వితమ్ ॥ 187

అథవా త్రిచతుర్భాగం విస్తారాయామతం తథా ।
భిత్తివారార్థ భాగంతు శేషంతద్గేహమానకమ్ ॥ 188

తత్సమం పరితోలిందం శేషం వత్పూర్వవద్భవేత్ ।
అథవా చాయతంమాన మేకభాగాధికం తథా ॥ 189

పూర్వవద్భిత్తి విస్తార మేకాంశా వృతాలిందకం ।
త్రిభాగం మధ్యభద్రంచ శేషం పూర్వవదాచరేత్ ॥ 190

చతుర్భాగ విశాలేతు పంచభాగాయతం తథా ।
భాగార్థం భిత్తివిస్తారం శేషం గర్భగృహం భవేత్ ॥ 191
ఏకంచ పరితోద్వారం మధ్యభద్రం త్రిభాగికం ।
నిర్గమం చైకభాగేన తత్తద్భద్రం ద్విభాగికమ్ ॥ 192
ఏకాంశం నిర్గమోపేతం యుక్త్యాశేషంతు పూర్వవత్ ।
చతుః షడ్భాగ విస్తార మాయామం ప్రవిధీయతే ॥ 193
ఏకభాగేన కుడ్యంస్యా న్నాలిగేహంతు శేషకం ।
ఏకభాగావృతాలిందం మధ్యభద్రం యుగాంశకమ్ ॥ 194
తదర్థం నేత్రభద్రంస్యా త్తదర్థం భద్ర నిర్గమమ్ ॥ 194½

తా॥ మధ్యకోష్ఠ విశాలమున మునుపటివలె ఒక భాగమును పెంపుచేయవలెను. మిగిలినవన్నియును పూర్వమువలెనే చేయవలయును. ద్వార ప్రాసాదము మూడు అంతస్తులతోనే రచించవలెను. గోపురమయిన మొదల నాలుగంతస్తుల పద్ధతి చెప్పుచున్నాడు. విస్తారమును 11 భాగములుచేసి పూర్వమువలె ఆయతమును 8 భాగములు మొదలు 1 భాగమువఱకు 5 విధములుగా విస్తారమును చేయవచ్చును. ఒక్కొక్కదానికి రెట్టింపువఱకు ¼ వంతు పెంచుచు ఆయమును చేయవచ్చును. భిత్తిగేహమును గూర్చి చెప్పుచున్నాడు.

3-4-5 6-7 భాగములు గోడయును మిగిలినది నాలగృహము. ఇట్లు 5 విధములు ప్రతి అంతస్తునను గోడ వెలుపల 2 భాగములును, లలాటమున భద్రము 1 భాగము విస్తారమును నిర్గమము ½ భాగమును, లోపల అలిందములును, గోడగాని, స్తంభములుగాని, ఆ ప్రదేశమున అలిందమునందు ఆలోచనతో స్తంభముల సందున జాలకములను రచించవలెను. నిర్గమము కలచోటగాని లేక నాలుగు

సమముగానున్న చోటగాని, గోడను రచించవలెను. పాదవుయొక్క నడుమద్వారము గోడయందు రెండుండవలెను.

గృహమునందును, లలాటమునందును, ఉపపీఠాకారముగ అంతస్తును చేయవలెను. లేక వప్రమువలెనైనను చేయవచ్చును. ఇష్టము వచ్చినట్లు యెత్తును కల్పించవచ్చును. స్తంభములతో గూడిన గోపురమును విస్తారమున ఉత్తరాంతముగను, అందు 3 భాగములు 2 భాగములుగానిచేసి గోడ 1 భాగము చేయవలెను. వెలుపలి నూలు ప్రకారము అంతమున ఉత్తరమునుంచి అడ్డదూలము నుంచవలెను. స్తంభమునుగాని, పాదవున దూలముగాని, ఆలోచించి చేయవలెను. ఆపైన జయంతికము నుంచవలెను. ఆయా పనులకు ప్రచ్ఛాదనములను చేయవలెను. లేక 3 భాగములు విస్తారము 4 భాగములు ఆయతముచేసి గోడ విస్తారములో సగముచేసి మిగిలినది గృహము చేయవలెను. దానితో సమానముగా చుట్టును అలిందములనుచేసి మిగిలినది మునుపటివలెనే చేయవలెను. మఱియు పాదవు విస్తారము కంటె 1 భాగ మధికముచేసి గోడ 1 భాగమును, 1 భాగముచుట్టూ అలిందములును చేయవచ్చును. మధ్యభద్రము 3 భాగములు, మిగిలినది గృహము - విస్తారము 4 భాగములు, పాదవు 5 భాగములు, అర్ధభాగముగోడవిస్తారముమిగిలినది గర్భగృహము. చుట్టునుద్వారము 1 భాగము, మధ్యభద్రము 3 భాగములు, నిర్గమము 1 భాగము, ఆయా భద్రములు 2 భాగములను, నిర్గమము 1 భాగమును, ఆలోచించి రచించవలెను. మిగిలినది మునుపటివలెనే చేయవలెను. విస్తారము 4 భాగములు, పాదవు 6 భాగములుచేసి గోడ 1 భాగము మిగిలినది నాలిగెహము చేయవలెను. అలిందము 1 భాగము చుట్టును రచించవలెను. మధ్యభద్రము 4 భాగములు. అందులో సగము నేత్రభద్రమును, దాని నిర్గమము అందులో సగమును చేయవలెను.

# 13. ద్వారశోభ అంతస్తులు

శ్లో॥ అష్టభాగం తథా యామం మధ్యేభద్రం షడలోకం ॥ 195
శేషం తత్పూర్వవత్ ప్రోక్తం కుర్యాత్తచ్ఛిల్పవిత్తమః ।
పంచషడ్భాగ విస్తారే చాయామం తద్విభాజితే ॥ 196
నేత్రభద్రం ద్విభాగంత చ్ఛేషాంశం పూర్వవద్భవేత్ ।
పంచభాగ విశాలేతు సప్తభాగం తథాయతే ॥ 197
మధ్యభద్రంతు భూతాంశం విస్తారం చైకనిర్గమమ్ ।
అన్యేషాం పూర్వవత్కుర్యా దధవాంశాధి కాయతమ్ ॥ 198
షడ్భాగం భద్రవిస్తార మేకభాగేన నిర్గమమ్ ।
శేషం పూర్వవదుద్దిష్టం తదర్ధాంశాధికాయతమ్ ॥ 199
పంచాంశం భద్రవిస్తారం నిర్గమంచైక భాగికం ।
శేషంప్రాగుక్త వత్కుర్యాత్పంక్తి భాగాయతం తథా ॥ 200
షడ్భాగం మధ్యభద్రంచ అన్యేషాం పూర్వవద్భవేత్ ।
షడంశం భాగమాధిక్యం విస్తారాయామకం తథా ॥ 201
ఏకాంశం భిత్తి విస్తారం పరితః శేషంతు గేహకం ।
ఏకభాగావృతా లింద్రం పంచాంశం మధ్యభద్రకం ॥ 202
నేత్రభద్రంచ చతుర్భాగ మేకాంశం భద్రనిర్గమం ।
ఏకభాగాధికా యామం మధ్యభద్రం షడంశకమ్ ॥ 203
తస్మారాధిక్య భాగంతు భూతాంశం భద్రమీరితం ।
ఆయామేదశ భాగేతు భద్రతారం షడంశకం ॥ 204
ఆయామేరుద్ర భాగంతు సప్తాంశం భద్రవిస్తరం ।
ద్వాదశాంశం తథాయామే మధ్యభద్రో గజాంశకమ్ ॥ 205
నిర్గమం చైకభాగంస్యా చ్ఛేషం ప్రాగుక్తవన్నయేత్ ।
ఏవం తద్ద్వార శోభంస్యా దేకభూమి రితిస్మృతం ॥ 206

తా॥ పొడవు 8 భాగములు. మధ్యభద్రము 6 భాగములు, మిగిలినది పూర్వమువలెనే విస్తారము 5 భాగములు పొడవు 6 భాగములు. నీవు భద్రము 2 భాగములు మిగిలినవి మునుపటివలెనే విస్తారము 5 భాగములు పొడవు 7 భాగములు. మధ్యభద్రము 5 భాగములు. నిర్గమము 1 భాగము చేయవచ్చును. విస్తారముకంటె పొడవు 1 భాగ మధికముచేసి భద్రము 5 భాగములు, నిర్గమము 1 భాగము చేయవలెను. పొడవు 10 భాగములు, మధ్యభద్రము 6 భాగములు చేయవచ్చును. విస్తారము 6 భాగములు, పొడవు 7 భాగములు, గోడ 1 భాగము చుట్టును మిగిలినది గృహము. చుట్టును అలిందము 1 భాగము, మధ్యభద్రము 5 భాగములును, నేత్రభద్రము 4 భాగములును, భద్రనిర్గమము 1 భాగమును, విస్తారముకంటె పొడవు 1 భాగ మధికముగను, మధ్యభద్రము 6 భాగములును, విస్తారముకంటె పొడవు 2 భాగము లధికమును, భద్రము 5 భాగములును, లేక పొడవు 10 భాగములును, భద్రము 6 భాగములును, పొడవు 11 భాగములును, భద్రము 7 భాగములును, పొడవు 12 భాగములును, భద్రము 8 భాగములును, నిర్గమము 1 భాగమును చేయవచ్చును. ఇట్లు ద్వారశోభ ఒకటి అంతస్తు.

## 14 ద్వారశాల అంతస్తులు

శ్లో॥ విస్తారే పంచభాగేతు ప్యైకభాగాధి కాయతం ।
త్రిచతుర్భాగనాలంస్యా చ్ఛేషంభిత్తి విశాలకమ్ ॥ 207
తద్బహిః పరితో౽ంశేన కూటకోష్ఠ విశాలకం ।
ఏకాంశేం కర్ణకూటంచ హారతారం శివాంశకమ్ ॥ 208
మధ్యకోష్ఠం త్రిభాగంచ యుక్త్యాతత్రైవ యోజయేత్ ।
ఏవం లలాటయోశ్చైవ దైర్ఘ్యం విన్యాసముచ్యతే ॥ 209

కర్ణకూటద్వయంచైవ తద్భాగద్వయ మీరితం ।
అంతరాలద్వయం పక్షం భాగం కుర్యాద్విచక్షణః ॥ 210
మధ్యకోష్ఠం చతుర్భాగం నిర్గమంచ ద్విభాగికం ।
అథవాధ్యర్థభాగంచ సపాదాం శైకమేవచ ॥ 211
మధ్యకోష్ఠమిదం ప్రోక్తం నేత్రదీర్ఘద్వయం తథా ।
మధ్యకోష్ఠంచ చతుర్థంచ కర్ణకూటం చతుష్టయమ్ ॥ 212
హారాంతరాలదేశేతు తోరణాద్యైర్విభూషితం ।
అథవాంశాధికాయామం పూర్వవద్భిత్తి విస్తృతమ్ ॥ 213
మధ్యభద్రోచ్చ భద్రంచ త్రిభాగం విస్తృతం భవేత్ ।
నిర్గమం చైకభాగంస్యా ల్లలాటాంశేతు పూర్వవత్ ॥ 214
తస్మాదధికాంశాయామం పూర్వవద్విస్తృతం భవేత్ ।
మధ్యభద్రం యుగాంశంస్యా ద్ధారాంతరం ద్విభాగికమ్ ॥ 215
మధ్యకోష్ఠం యుగాంశంస్యా త్కుర్యాచ్ఛేషంతు ।
పూర్వవత్ నవభాగం తథాయామే మధ్యకోష్ఠం శరాంశకమ్ ॥
అథవా వేద భాగంతు చాయామే తత్ప్రకల్పయేత్ ।
మధ్యకోష్ఠంతు షడ్భాగం మధ్యభద్రం ద్విభాగికమ్ ॥ 217
తదర్ధం నిర్గమం ప్రోక్త మంతరాలం ద్విభాగికం ।
శేషం పూర్వవదుద్దిష్ట మథవారస భాగికమ్ ॥ 218
విస్తారం రసభాగంస్యా దాయామంచ విశేషతః ।
ఏకాంశం తద్వృతంభిత్తి తారం శేషంచనాలికా ॥ 219
తద్బాహ్యే పరితశ్చాంశం కర్ణకూటాది మానకం ।
మధ్యకోష్ఠం ద్విభాగంస్యా త్త్రిభాగం చాంతరాలకమ్ ॥ 220
ఆయామే మధ్యకోష్ఠంచ త్ర్యంశంహారం ద్విభాగికం।
అష్టాంశంచ తథాయామం మధ్యకోష్ఠం యుగాంశకమ్ ॥ 221

నవభాగం తథాయామే కోష్ఠాయామం శరాంశకం ।
త్రిభాగం వాస్యభద్రంస్యా న్నిర్గమం చైకభాగికమ్ ॥ 222
దశభాగం తథాయామే పూర్వ వత్పరికల్పయేత్ ।
ఏకాదశాంశకం కుర్యా త్పంచాంశం మధ్యకోష్ఠకమ్ ॥ 223
ద్వాదశాంశం తథాయామే శాలాయామం డషంశకం ।
మధ్యేద్విభాగం భద్రంస్యా న్నిర్గమం చైకభాగికమ్ ॥ 224
హారస్య మధ్యదేశేతు చానుశాలా విశాలకం ।
తత్పార్శ్వద్వయ యోర్ద్వారం నాసికా పంజరాన్వితమ్ ॥ 225
శేషంతు పూర్వవత్కుర్యా ద్వ్యక్త్యా తత్రైవయోజయేత్ ।
విస్తారేసప్తభాగంతు వసుభాగం తథాయతమ్ ॥ 226
భిత్తివిస్తార మేకాంశం పరితః శేషమంతరాలకమ్ ।
తత్త్రద్బాహ్యే వృతాంశేన శేషమూహ్యం విచక్షణైః ॥ 227
నవభాగం తథాయామే దశభాగమథాపివా ।
ఏకాదశాంశకం వాపి విన్యసేచ్చైవ పూర్వవత్ ॥ 228

తా॥ విస్తారము 5 భాగములు, పొడవు 6 భాగములు, 3-4 భాగములు నాలమును, మిగిలినది గోడ వెడల్పు, దాని వెలుపల చుట్టును కూటములు కోష్ఠములు 1 భాగము చేయవలెను. కర్ణకూటము 1 భాగము, హారాంతము 1 భాగము, మధ్యకోష్ఠము 3 భాగములు ఆలోచించి చేయవలెను. ఇట్లు లలాటములు రెంటికిని నిడుపు విన్యాసము చెప్పబడుచున్నది. కర్ణకూటములు 2 ను, రెండు భాగములు చేయవలెను. అంతరాలములు 2 ను రెండు భాగములు చేయవలెను. మధ్యకోష్ఠము 4 భాగములు, నిర్గమము 2 భాగములు లేక $1\frac{1}{2}$ భాగము, $1\frac{1}{4}$ భాగము చేయవచ్చును. నేత్రదీర్ఘము 2 భాగములు, మధ్యకోష్ఠము 4 భాగములు, కర్ణకూటము 4 భాగములు, హారములయొక్క అంతరాలములయందు తోరణములను రచించవలెను,

లేక పొడవు 1 భాగము అధికముచేసి మునుపటివలెనే గోడ వెడల్పుచేసి మధ్యభద్రము, ఎత్తుగల భద్రము, విస్తారము 3 భాగములు, నిర్గమము 1 భాగము, లలాటము 1 భాగము, అంతకంటె ఇంకొకభాగ మధికముగా పొడవుచేసి విస్తారము అదేచేసి మధ్య భద్రము 4 భాగములు, హారాంతరము 2 భాగములును, మధ్య కోష్టము 4 భాగములును, మిగిలినది మునుపటివలెనే రచించవలెను. పొడవు 9 భాగములుచేసి మధ్యకోష్ఠము 5 భాగములు చేయవలయును. లేక 4 భాగములు చేయవచ్చును. మధ్యకోష్ఠము 6 భాగములు, దాని మధ్యభద్రము 2 భాగములు, అందులో సగపాలు నిర్గమము. అంతరాలము 2 భాగములు మిగిలినది మునుపటివలెనే చేయవలెను. లేక 6 భాగములు విస్తారమును 7 భాగములు పొడవును ఒక భాగముచుట్టూ గోడయును మిగిలినది నాళికయును చేయవలెను. దాని వెలుపల చుట్టును 1 భాగము కర్ణకూటము మొదలయినవి చేయవలయును మధ్యకోష్ఠము 2 భాగములు, అంతరాలము 3 భాగములు లేక మధ్యకోష్ఠము 3 భాగములు హారము 2 భాగములు చేయవచ్చును పొడవు 8 భాగములుచేసి మధ్య భద్రము 4 భాగములు, పొడవు 9 భాగములు, కోష్ఠము 5 భాగములు, దానికి భద్రము 3 భాగములు, నిర్గమము 1 భాగము పొడవు 10 భాగములుచేసి పూర్వమువలెనే రచించవచ్చును. పొడవు 11 భాగములు, మధ్యకోష్ఠము 5 భాగములు, పొడవు 12 భాగములు శాల 6 భాగములు, మధ్యభద్రము 2 భాగములు, నిర్గమము 1 భాగము, హారముమధ్య అనుశాలయును. ఆరెండు ప్రక్కల హారములును, నాసికా పంజరములును, మిగిలినవి పూర్వమువలెను చేయవలయును. విస్తారము 7 భాగములు, పొడవు 8 భాగములు, గోడవెడల్పు 1 భాగము చుట్టును మిగిలినది అంతరాలము ఆయా వెలుపలభాగము చెప్పిన మిగిలినపనులను చేయవలయును. పొడవు

9 భాగములు లేక 10 భాగములు, 11 భాగములుచేసి యైనను పూర్వమువలె రచించవచ్చును.

శ్లో॥ త్రయోదశాంశమాయామే మధ్యశాలా విశాలయుక్ ।
త్రిభాగంచాంతరాలంస్యా చతుర్దశాయతం తథా ॥ 229
మధ్యకోష్ఠం తథాష్టాంశం శేషం ప్రాగుక్తవన్నయేత్ ।
అథవాచాష్టభాగంతు విస్తారంతు నవాయతిమ్॥ 230
ద్విభాగం భిత్తివిస్తారం శేషం నాలిగృహం మతం ।
తద్బాహ్యేపరితశ్చాంశం కర్ణకూటాద్యమానకమ్ ॥ 231
అథవాదశభాగంస్యా త్తదేకాదశభాగికం ।
ద్వాదశాంశాయతం వాథ త్రయోదశాయతం తతః ॥ 232
చతుర్దశాయతంవాపి పంచదశాంశ దీర్ఘకం ।
మధ్యకోష్ఠం శరాంశంస్యా త్తత్సమం చాంతరాలకమ్ ॥ 233
ద్వ్యష్టభాగం తథాయామే మధ్యకోష్ఠం రసాంశకం ।
తస్యమధ్యే విశేషేణ త్రిభాగం చానుశాలకం ॥ 234
ఏక చాధ్యర్థ భాగంవా మధ్యకోష్ఠస్య నిర్గమమ్ ।
శేషం పూర్వవదుద్దిష్టం నవభాగమథాపివా ॥ 235
విస్తారం చాయతం పంక్తిభాగం కుర్యాద్విచక్షణః ।
భిత్తితారం కలాంశంస్యా త్తద్బహిః పరితోంశకమ్ ॥ 236
ఏవంతు కూటశాలాది మానం కుర్యాద్విశేషతః ।
అథవాం శాధికాయామం ద్వాదశాంశాయతం తువా ॥ 237
త్రయోదశాంశకం వాపి ద్విసప్తభాగమేమా ।
పంచదశాంశకం వాపి షోడశాంశం తదాయతమ్ ॥ 238
విన్యాసం పూర్వవత్కుర్యా త్సప్తదశాంశమాయతం ।
మధ్యకోష్ఠం నవాంశంస్యా త్తన్మధ్యే భూతభాగికమ్ ॥ 239
విస్తారేమధ్య భద్రంతు నిర్గమంచైక భాగికం ।
అంతరాలం చతుర్భాగం తన్మధ్యే ద్వ్యంశ భద్రకమ్ ॥ 240

అధివాస్టాదశాంశంతు చాయామంత్రప్రకల్పయేత్ ।
దశాంశం మధ్యకోష్ఠంచ షడంశం మధ్యభద్రకమ్ ॥ 241
ఘనంవాప్య ఘనంవాపి భిత్తింకుర్యాద్విచక్షణః ।
ఊర్ధ్వభాగం విశేషేణ కర్ణహార్మ్యాది కుంచితమ్ ॥ 242
తత్రైవాభ్యంతరం చాథభాగమేకం జలస్థలం ।
తద్బాహ్యే చోర్ధ్వభాగంతు భిత్తిరేవం తథైవచ ॥ 243
అథవాదం కమానేన వేశనం నిర్గమం తథా ।
ఏతేషాం ద్వారశాలేషు ద్వితలం కారయేద్బుధః ॥ 244

తా॥ పొడవు 13భాగములు మధ్యశాలవిశాలముగను,అంతరాలము 3 భాగములు, పొడవు 14 భాగములు, మధ్యకోష్ఠము 8 భాగములు మిగిలినది పూర్వమువలెనే చేయవలయును. మఱియు విస్తారము 8 భాగములు, పొడవు 9 భాగములు, గోడ మందము 2 భాగములు మిగిలినది నాలిగృహము చేయవలయును. దాని వెలుపల చుట్టును 1 భాగము కర్ణకూటము మొదలగు భాగములను కల్పించవలెను. లేక 10-11-12-13-14-15 భాగములుచేయుచు మధ్యకోష్ఠము 5 భాగములును, దానితో సమానముగా అంతరాలమును, దాని నడుమ అనుశాల 3 భాగములును, ఇట్లు 1½ భాగము మధ్యకోష్ఠముయొక్క నిర్గమమును చేయవలయును.

పొడవు 16 భాగములు మధ్యకోష్ఠము 6 భాగములు. మిగిలినవి పూర్వమువలెనే రచించవలెను. విస్తారము 9 భాగములు, పొడవు 10 భాగములు గోడ వెడల్పు 2 భాగములు దాని చుట్టును 1 భాగము. ఇట్లు కూటములు, శాలలు రచించవచ్చును. లేక పొడవులో మాత్రము 11-12-13-14-15-16 భాగముల వఱకు పెంచి మునుపటివలెనే అన్నియును రచించవలెను. పొడవు 17 భాగములు, మధ్యకోష్ఠము 9 భాగములును, దాని నడుమ భద్రము

5 భాగములును, నిర్గమము 1 భాగమును, అంతరాలము 4 భాగములు, దాని నడుమ భద్రము 2 భాగములు మఱియు పొడవు 18 భాగములు, మధ్యకోష్ఠము 10 భాగములు. దాని నడుమ భద్రము 6 భాగములు నిర్గమముతోగాని లేక సూలుతోసమానముగాగాని, గోడను రచించవలయును పైప్రదేశమున కర్ణకూటములు మొదలగువానితో అలంకరింపబడి యుండవలయును. వానికి జల మార్గములు 1 భాగము చేయవలెను. దాని వెలుపలను పైనను ఇట్లు గోడను రచించవలెను. లేక దండమానముతో లేశను నిర్గమము చేయవచ్చును. ద్వారశాల యిట్లు రెండంతస్తులుగా రచింపవలయును.

## 15 ద్వారప్రాసాదము అంతస్తులు

శ్లో॥ గోపుర త్రితలన్యాసం లక్షణం వక్ష్యతేఽధునా ।
సప్తాంశంచ ద్విసప్తాంశం భాగంచైకైకవర్ధనాత్ ॥ 245
ఏవమాయమిదం ప్రోక్తం శిల్పిభిః ప్రవరైఃకృతం ।
ద్విభాగం భిత్తివిస్తారం పరితః శేషంతు గేహకమ్ ॥ 246
తస్యబాహ్యేవృతం జ్ఞాత్వా భాగం కుర్యాజ్జలాత్ స్థలే ।
తద్బహిః పరితోఽంశేన కర్ణహార్మ్యాది మండితమ్ ॥ 247
తత్ప్రస్మాదావృతాంశేన చాదిదేశే జలస్థలం ।
తత్సమం తద్బహిః కుర్యాత్ కూటశాలాద్య మానకమ్ ॥ 248
మధ్యశాలాష్టభక్తికం ప్రోక్తం కర్ణకూటాష్టకం తథా ।
హారాషోడశ సంయుక్తం శేషం ప్రాగుక్తవన్నయేత్ ॥ 249
అష్టభాగంతు విస్తార మాయామంతేన వర్ధనాత్ ।
షోడశాంశం యథాన్యాయ్యం పూర్వవద్విధినాచరేత్ ॥ 250
నవాంశంతార మారభ్య వసుపంక్త్య వసానకం ।
ఆయామమితిహి ప్రోక్తం విన్యాసం పూర్వవద్భవేత్ ॥ 251

విశాలం దశభాగంతు వింశద్భాగావసానకమ్ ।
నవవంక్త్యంశమేక వింశాంశం దీర్ఘవిన్యా సముచ్యతే ॥ 252

## 16. ద్వార హర్మ్యము అంతస్తులు

నందపంక్త్యంశం విభజేచ్ఛ తుస్తలేతు త్రివర్గకం ।
షట్ సప్తాష్టభాగంవా నవార్థం వార్థరుద్రకమ్ ॥ 253
భానుసైకారక భాగంతు మధ్యకోష్ఠ విశాలకమ్ ।
శేషంచాంతరాలంచ ద్విభాగం కర్ణకూటకమ్ ॥ 254
మధ్యశాలా విశేషేణ పంచషట్ సప్తకం భవేత్ ।
ద్విభాంవా త్రిభాగంవా శాలామధ్యేతు భద్రకమ్ ॥ 255
ఏకాంశంవా ద్విభాగంవా త్రిభాగం నిర్గమంతువా ।
అథవాహారదేశేతు చైకద్విత్రియుగాంశకమ్ ॥ 256
మధ్యకేత్వను శాలాశ్చ నిర్గమం చైకభాగికమ్ ।
శేషంతు చాంతరాలానాం నాసికా పంజరాన్వితమ్ ॥ 257
అథోభూమిశ్శాంతరాలే కుంభంకుం భలతాన్వితం ।
భద్రంవాపి విభద్రంవా కర్ణహర్మ్యాది మండితమ్ ॥ 258
హారంచ కర్ణకూటంచ ఉత్తరాంతం శిఖాంతకం ।
మధ్యకోష్ఠస్య శాలేతు భద్రశాలా విశేషతః ॥ 259
పక్షశాలాన్వితం వాథచోర్ధ్వశాలాన్వితం తువా ।
నీడాకారయుతం వాపి చార్థశాలాన్వితం భవేత్ ॥ 260
ఉత్తరాంతం కపోతాంతం ప్రతికాంత మథాపివా ।
ఏవంచ మధ్యకోష్ఠేతు శాలానామున్నతం మతమ్ ॥ 261
లలాటేచ భద్రకోష్ఠం వాసకోష్ఠంవా కల్పయేత్ ।
ఏవమేతద్ధ శాంశేన శేషంతు యుక్తితోన్యసేత్ ॥ 262
ఏవంచ తుస్తలం ప్రోక్తం నవాంశారంభం పూర్వవత్ ॥262½

తా॥ మూడంతస్తుల గోపుర లక్షణమును చెప్పుచున్నాడు. పొడవు 7 భాగములు మొదలు 1-1 భాగము పెంపుతో 14 భాగముల వఱకు చేయవచ్చును. గోడ మందము 2 భాగములు, చుట్టును రచింపవలెను. మిగిలినది లోపలగృహము. దానియొక్క వెలుపల చుట్టును 1 భాగము జలమార్గమును, దాని వెలుపల చుట్టు 1భాగము కర్ణహార్మ్యము మొదలగునవి రచించవలెను. దానినుండి చుట్టును మొదటి ప్రదేశమున జలమార్గమును, దానితో సమానముగా దాని వెలుపల కూటశాలను, మధ్యశాల 8 భాగములు, కర్ణకూటములు 8 హారములు 16 మిగిలినవి పూర్వమువలెనే చేయవలయును. విస్తారము 8 భాగములు, పొడవు దాని ననుసరించి 16 భాగముల వఱకు చేయవచ్చును. విస్తారము 9 భాగములు, పొడవు 18 భాగములవఱకు పెంచవచ్చును. విస్తారము 10 భాగములు పొడవు క్రమముగా 20 భాగములవఱకు కల్పించవచ్చును. లేక 19 భాగములుగాని 21భాగములుగాని చేయవచ్చును.ఇది మూడంతస్తులుగల ద్వారప్రాసాదము రచించుపద్ధతి.

నాలుగంతస్తుల రచనయందు పొడవు 19 భాగములుచేసి 6 7-8-9½-11½-12-13 భాగములు మధ్యకోష్ఠ విస్తారము చేయవచ్చును. మిగిలినది అంతరాలము, కర్ణకూటము 2 భాగములు, మధ్యశాల 5-6-7 భాగములును, అందు భద్రము 2 భాగములుగాని 3 భాగములుగానిచేసి నిర్గమము 1-2 3 భాగము లుంచవచ్చును. లేక హార ప్రదేశమున 1-2-3-4 భాగములు మధ్య అనుశాలను రచించుచు దాని నిర్గమము 1 భాగము చేయవలయును. మిగిలినది అంతరాలములలో నాసికా పంజరములు రచించవలయును. అంతరాలమున దిగువ ప్రదేశము కుంభము కుంభలిత రచించవలెను. భద్రములతోగాని లేక భద్రములు లేకుండ సాదాగాగాని,కర్ణహార్మ్యములను రచించవలెను. హారము, కర్ణకూటము, ఉత్తరముతో సమానముగాని, స్తూపికతో సమానముగాని చేయవచ్చును. మధ్యకోష్ఠము యొక్క శాలయందు భద్రశాలను రచించవలెను.

లేక పక్షిశాలలనైనను రచించవచ్చును. మఱియు ఊర్ధ్వశాలనైన రచించవచ్చును. నీడమువలెనైనను చేయవచ్చును. అర్థశాలను చేయవచ్చును. అవి ఉత్తరాంతముగను, లేక కపోతాంతముగను, ప్రతికాంతముగను, ఇట్లు మూడు విధములుగ ఎత్తును కల్పించ వచ్చును. లలాటమున భద్రకోష్ఠముగాని, వాసకోష్ఠముగాని రచించ దగును. అది 10 భాగముల విస్తారముకలిగి యుండవలెను. మిగిలినవి ఆలోచించి చేయవలయును. ఇట్లు నాలుగంతస్తులు గల ద్వార హర్మ్యమను గోపురమును రచించు పద్ధతి.

## 17. ద్వారగోపురము అంతస్తులు అందలి భేదములు

శ్లో॥ తస్మాదాయతే సర్వస్మిన్ ద్విగుణాంతాంశం పూర్వవత్ ॥ 263

వేదభూతరసాంశేన సప్తభాగాష్టభాగికం ఏవంతు ।

భిత్తిమానంతు శేషంతన్నాలికం భవేత్ ॥ 264

భిత్తిబాహ్యంతు వృద్ధిఃస్యాత్ పరితశ్చైక భక్తితః ।

అష్టభాగావసానంస్యాత్ బాహ్యమానంతు పూర్వవత్ ॥ 265

కర్ణహార్మ్యాది విన్యాసం తచ్చతుర్వర్గ కాంతకం ।

మధ్యకోష్ఠ విశాలంతు పూర్వవత్పరికల్పయేత్ ॥ 266

శేషంతు చాంతరాలంస్యా త్కూటానాం విన్యసేద్బుధః ।

అన్యాన్యనుక్త మానానాం చతుర్భాముక్తవత్కురు ॥ 267

నిర్గమంచ ప్రవేశంచా లంకారం వక్ష్యతేఽధునా ।

విస్తారే వసుభాగంస్యాద్ విభజేత్ ప్రతిరేవచ । 268

తదర్ధాంశావృతం బాహ్యే సాలంశేషంచ వేదికం ।

వేదితారం చతుర్భాగం త్ర్యంశంతద్గ్రీవ విస్తరమ్ ॥ 269

వేదితుల్యం శిరస్తారం శేషం ప్రాగుక్త వద్భవేత్ ।

ద్విలలాటే మహానాసితద్ ద్వయోర్మధ్య నాసికమ్ ॥ 270

తచ్ఛాలానాసికంవాపి కర్తవ్యాకృతి నాసికా ।
అన్యాంతర ప్రదేశేతు క్షుద్రనాసి ప్రభూష్యతే ॥ 271
నేత్రనాసీ విసాలేతు రసతారసమం భవేత్ ।
త్రికభాగం ద్విభాగంవా పంచభాగ త్రిభాగికమ్ ॥ 272
చతుర్భాగ త్రిభాగంవా మధ్యనాసీవిశాలతా ।
తత్త్రిభాగైక భాగంతు పంచభాగాద్ ద్విభాగికమ్ ॥ 273
చతుర్భాగ ద్విభాగంవా క్షుద్రనాసీ విశాలకం ।
పాదాధికం సమంవాపి పాదహీనం తథోచ్ఛ్రయమ్ ॥ 274
మహానాసి మూళితుంగం స్తూపికాగ్రావసానకం ।
మధ్యనాసి తథా మూళిచాగ్రం తత్ఫలకాంతకమ్ ॥ 275
యుక్త్యాతత్ క్షుద్రనాసీనాం కారయేచ్ఛిల్ప విత్తమః ।
శిలాకారం శిఖాకారం స్తూపికానాం సువృత్తకమ్ ॥ 276
గలకూటోప సంయుక్తం క్షుద్రనాసి చతుష్టయం ।
శ్రీభోగాఖ్యమిదం ప్రోక్తం మష్టనాసీ జయాంఖ్యకమ్ ॥ 277
క్షుద్రనాస్యర్క సంయుక్తం శ్రీవిశాలం తథైవచ ।
షోడశక్షుద్ర నాస్యంగం విష్ణుకాంత మిహోచ్యతే ॥ 278
క్షుద్రనాస్యా తథావింశ దింద్రకాంతం ప్రకథ్యతే ।
క్షుద్రనాసీం వినాకుర్యాత్ బ్రహ్మకాంతమితి స్మృతమ్ ॥ 279
గలకూటం వినాకుర్యాత్ స్కందకాంతం విశిష్యతే ।
మధ్యనాస్యున్నతం తత్ర నాసికా పంజరాన్వితమ్ ॥ 280
ఏవంతు శ్రీకరంప్రోక్తం కర్కరీనాసికాకృతం ।
శాలాకోష్ఠం విశేణ స్తూపికాంతం ప్రకల్పయేత్ ॥ 281
భద్రశాలాంతుతత్ కుర్యాత్ సౌమ్యకాంత ముదీరితం ।
ఏతానిదవభేదాః స్వేచ్ఛరః సర్వేషుయోజయేత్ ॥ 282

గోపుర ఘనం సర్వేషు యత్తలాద్వైర్విశేషతః ।
సర్వస్యేంద్రస్య బాహ్యేతత్వాదంత్యక్త్వా ప్రకల్పయేత్ ॥ 283
అనుక్త మన్యతోగ్రాహ్యా । మగ్రాహ్యా మరసీదతి ॥ 283½

తా॥ విస్తారమునకు సగము పెంచిగాని రెట్టింపుచేసిగాని పొడవును నిర్ణయించి అందు 4-5-6-7-8 భాగములు గోడను చేయుచు మిగిలిన భాగములను నాలిగ్రృహములను చేయవలయును. గోడవెలుపల చుట్టును 1 భాగము మొదలు 8 భాగములవఱకు పెంచి మునుపటివలెనే కర్ణహర్మ్యము మొదలయినవి రచించవలెను. ఇట్లు నాలుగు అంతస్తులవఱకుచేసి మధ్యకోష్ఠముయొక్క విస్తారము పూర్వోక్తప్రకారము చేయవచ్చును. మిగిలినది అంతరాలము కూటములు రచించవలయును. ఇందు చెప్పబడనివి కొన్నియున్నచో నాలుగంతస్తుల గోపురమునకు జెప్పిన కొలతలతో రచించవలయును. అలంకారములయొక్క నిర్గమములను ప్రవేశములను చెప్పుచున్నాడు.

విస్తారము 8 భాగములుగా ప్రతిని విభాగించి అందులో సగము వెలుపలచుట్టూ ప్రాకారమును మిగిలినది వేదికయును చేయవలెను వేదిక విస్తారము 4 భాగములు. గ్రీత విస్తారము 3 భాగములు శిఖరవిస్తారము వేదితో సమానము మిగిలినది ప్రాసాదము వలెనే గోపురమునకును చేయవలయును. రెండు లలాటములయందు మహానాసి 1½ భాగము చొప్పునను, శాలానాసికమునుగూడ ఆకారమునుబట్టి రచించవలెను. ఇతరమైన సందులలో క్షుద్రనాసికలను చేయవలయును. విస్తారమున నేత్రనాసి 6 భాగము లుండవలెను. 3 భాగములలో 2 భాగములు, 5 భాగములలో 3 భాగములు, 4 భాగములలో 3 భాగములు, మధ్యనాసి విస్తారము చేయవచ్చును. దానిలో 3 లో 1 భాగముగాని, 5 భాగములలో 2 భాగములుగాని, 4 భాగములలో 2 భాగములుగాని, క్షుద్రనాసి విస్తారముండవలెను

ఎత్తు 1 పాతిక అధికముగాని, తరుగుగాని, లేక సమానముగాని, చేయవచ్చును. మహానాసి శిఖరము యెత్తు స్తూపిక పైభాగము వఱకును, మధ్యనాసిక శిఖరము ఫలమువఱకును, క్షుద్రనాసిక శిఖరము అంతకంటె తక్కువగను ఆలోచించి చేయవలెను. శాలరూపముగాగాని, శృంగరూపముగాగాని, స్తూపికలు గుండ్రముగా రచించవలెను, గలకూటముతోగూడి క్షుద్రనాసికలు 4 కలది శ్రీభోగగోపురము 8 క్షుద్రనాసికలుగలది. జయగోపురము 12క్షుద్రనాసికలుకలది. శ్రీవిశాలగోపురము 16 క్షుద్రనాసికలుకలది. విష్ణుకాంతగోపురము 20 క్షుద్రనాసికలుగలది. ఇంద్రకాంత గోపురము క్షుద్రనాసికలు లేనిది బ్రహ్మకాంత గోపురముగల కూటములు లేనిది స్కందకాంత గోపురము మధ్యనాసి యెత్తును నాసికాపంజరములును కలది శ్రీకరగోపురము కర్కరీ నాసికములును, శాలాకోష్ఠము స్తూపిక వఱకును, దానియందు భద్రశాలను రచింపబడినది. సౌమ్యకాంతగోపురముగల కూటములుండి క్షుద్రనాసికలు లేనిది సామాన్యద్వారగోపురము ఇట్లు పదివిధములు. అన్ని అంతస్తుల యందును నిర్గమములను కల్పించవలయును. అన్ని గోపురములవలె వెలుపల పాతికవంతును వదలి రచించవలయును. ఇందు చెప్పబడని విషయములు ప్రాసాదలక్షణములయందు జూడవలయును.

## 18. గోపురవాతాయన లక్షణము

శ్లో॥ వక్ష్యేవాతాయనానాంచ లక్షణం విధినాధునా ॥ 284
సర్వేణామపి హర్మ్యాణాం మండపాదీ నివాస్తూని ।
తథావాతాయనస్థానం తథా వైచోక్తవన్నయేత్ ॥ 285
త్రైతిలానాంతు తంతంతు నరాణాం హీప్యతేబుధైః ।
నరాణాం జాలకం సర్వం దేవానామపి యోగ్యకమ్ ॥ 286

తద్విస్తారోదయం సర్వం ప్రాచీనోక్తవదాచరేత్ ।
పాదపాలికయా యుక్తం పత్రపుష్పై రలంకృతమ్ ॥ 287

దేవానాం జాలకానాంచ మధ్యరంధ్ర సమన్వితమ్ ।
ద్విజానాం భూపతీనాంచ మధ్యస్తంభం విసర్జయేత్ ॥ 288

మధ్యమం పట్టికాయుక్తం కుర్యాచ్ఛిల్ప విచక్షణః ।
వైశ్యానాం శూద్రజాతీనాం మధ్యే స్తంభం ప్రయోజయేత్ ॥

నకుర్యాత్ పట్టికామధ్యే చైకంమంచం శుభావహం ।
ఉక్తలక్షణ హీనంతు నహికుర్యాద్యదేచ్ఛయా ॥ 290

అర్ధనాశం శ్రవాహీనం భవిష్యతి నసంశయః ।
నాగబంధం తథావల్లీ గవాక్షం కుంబరాక్షకమ్ ॥ 291

స్వస్తికం సర్వతోభద్రం నంద్యావర్తాకృతి స్తథా ।
పుష్పబంధం సచిత్రాంగం రత్నసంపై రలంకృతమ్ ॥ 292

ఏవం వాతాయనరూపం నాగవల్ల్యాది దైవశం ।
ఉక్తవద్విస్తృతాయామే నందనం దపదం భవేత్ ॥ 293

భుజంగ ద్వయమేకంస్యా దేకాదశపదేత్రిధా ।
నాగవేదాష్టభాగంవా కుర్యాద్వాతాయనంబుధః ॥ 294

సప్తసప్త పదంకృత్వా పత్రవల్ల్యాది మండితం ।
యుగ్మాయుగ్మ పదైర్వాథ చాన్యద్వాతాయనేఽపిచ ॥ 295

ఏకద్విత్రి చతుష్పంచ కూటైర్రంధ్రిక పట్టికా ।
తద్విస్తారఘనం సర్వం కుర్యాద్వై శిల్పవిత్తమః ॥ 296

గోపురే కూటకోష్ఠాది గ్రీవే పాదాంతరే తథా ।
ఘనేవాప్యఘనేవాపి యథా వాతాయ నైర్యుతమ్ ॥ 297

అన్యేషాం వాస్తుసర్వేషాం చోక్తవద్దేశకే యథా ।
కుర్యాద్వాతాయనం సర్వం శ్రీసంపత్ప్రదాయకమ్ ॥ 298

ప్రథమాత్తు సార్ధకరం షట్ షణ్మాత్ర వృద్ధ్యా ।
తత్పంచ బాహుమవధి త్రివిశాలమితి భవేత్ ॥ 299
శోభాదిపంచదశేచ పంచవిధ ప్రమాణంస్యాత్ ।
ద్వారేషు చైవవిదితం కథ్యతే ద్విగుణోదయమ్ ॥ 300
ఇతి మానసారే వాస్తుశాస్త్రే గోపుర విధానం నామ త్రయ
స్త్రింశోఽధ్యాయః—

తా॥ కిటికీలను రచించు పద్ధతి చెప్పుచున్నాడు. మేడలు మండపములు, గృహములు మొదలగువానికి కిటికీలను రచింతురు. దేవతలకును బ్రాహ్మణాది సమస్త వర్ణములవారికిని విస్తారమును పొడవును శాస్త్రమున చెప్పబడినట్లు రచించవలెను. కమ్మీలును పైన అడ్డముగా పీటలును, పత్రములు, పుష్పములు మొదలగు వానితో నలంకారమును, మధ్య రంధ్రమునుగల కిటికీని దేవతా గృహములకును, బ్రాహ్మణులకును, క్షత్రియులకును మధ్యస్తంభము లేకుండను, నడుమ పట్టికయును రచించవలెను. వైశ్యులకును, శూద్రులకును మధ్య స్తంభముతో కిటికీలను రచించవలెను. నడుమ పట్టికను రచించగూడదు. పైన ప్రస్తరమును మాత్రము రచించ వలయును. ఇందు చెప్పబడని యంశములను యిష్టమువచ్చినట్లు చేయవచ్చును. కర్ణహీనము ధననాశము చేయును. నాగబంధము, వల్లి, గవాక్షము, కుంజరాక్షము, స్వస్తికము, సర్వతోభద్రము, నంద్యావర్తము. పుష్పబంధము, సచిత్రాంగము, రత్నభూషితము, ఇట్లు భేదములు కలవు. 9-9 భాగములుచేసి రెండు సర్పములను రచించబడినది నాగబంధము. ఒక్క సర్పమును రచించవచ్చును. 8-4 భాగములుగాని, లేక 8-8 భాగములుగాని చేయవచ్చును. 7-7 భాగములుచేసి పత్రములు లతలు రచించవచ్చును. దానిని వల్లి అందురు. సమసంఖ్య భాగములతోగాని, విషమ సంఖ్య భాగ ములతోగాని, యితరములైన కిటికీలు రచించవచ్చును. అంఘ్రి

పట్టిక 1-2-3-4-5 అంగుళములమందముకలిగి యుండవచ్చును. దానికి రెట్టింపుగా వెడల్పు కలిగి యుండవలయును. గోపురమున కును, కూటము కోష్ఠము మొదలగువాని గ్రీవముననుు, స్తంభముల నడుమను, నిర్గమముల యందును, లేక సూత్రమా ననుసరించియైనను తగినట్లు ఆ యా స్థలములయందు కిటికీలను రచించవచ్చును. $1\frac{1}{2}$ హస్తము మొదలుకొని $\frac{1}{4}$ చొప్పున పెంచుచు 5 హస్తముల వఱకు 15 భేదములుగా జేయవచ్చును. అనగా ద్వారశోభకు 3 ద్వార శాలకు 3, ద్వార పార్శ్వమునకు 3, ద్వార ప్రాసాదమునకు 3, ద్వార గోపురమునకు 3, ఇట్లు తెలియవలయును. ద్వారము లన్నిటి కిని విస్తారమునకు రెట్టింపుగా పొడవును కల్పించవలయును.

## 91. మండప లక్షణములు - వాని స్వరూపములు

కాశ్యప శిల్పము 44వ అధ్యాయము :

శ్లో॥ అథవక్ష్యే విశేషేణ మండపానాంతు లక్షణం ।
ప్రాసాద స్యైకభూపకాతు ప్రోచ్యతే ముఖమండపః ॥ 1
జాతిచ్ఛంద వికల్పానా మాభాసానాం తథైవహి ।
ప్రాసాదాది ముఖేచైవ దిశాసులిదిశాసువా ॥ 2
గ్రామాదీనాంతు మధ్యేవా దిశాసు పదిశాసువా ।
ఉద్యానేవా నదీతీరే తటాకేవాధివాపునః ॥ 3
నేవార్థం మండపం కుర్యాదష్ట దిఙ్ముఖమండపం ।
ప్రాసాదస్యాగ్రతః కుర్యాన్మండపానాం చతుష్టయమ్ ॥ 4
ముఖమండప మాదౌతు ప్రతిమామండపం తతః ।
స్నాపనార్థం తృతీయంతు నృత్యార్థంచ చతుర్థకృత్ ॥ 5
శేషువై ప్రథమం ప్రాగ్వద్ద్వితీయాది రథోచ్యతే ।
అంతర్ద్వారాంశ్చ తానేతాన్ మధ్యహారాంశ్చవాకురు ॥ 6

మండపాన్మండపం తత్ర శాలాద్వామండ పాంతరం ।
అంతరాలమితిఖ్యాత మాదౌ తల్లక్షణం శ్రుణు ॥ 7
ఏకద్విత్రి చతుష్పంచ షట్ సప్తాష్టకంతువా ।
నవధర్మ మథోవాపి రుద్రహస్త మథాపివా ॥ 8
అంతరాల విశాలస్య రుద్రసంఖ్యా ప్రకీర్తితా ।
యత్ర యన్మండపం కుర్యాత్తస్మిన్ పంక్త్యా విశేషతః ॥ 9
ఏక ద్విత్రిచతుష్పంచ భక్త్యావాభ్యంతరాలకమ్ ।
సావకాశాంత రాలంవా భిత్తిమధ్య మథాపివా ॥ 10
భిత్తిమధ్యాంతరాలం చేత్పార్శ్వయోర్వోశ సంయుతం ।
ఏకద్విత్ర్యగ్రే పాదంవా వేశం భక్త్యైకమేవవా ॥ 11
ద్వయోర్మధ్యేతు ద్వారంవా జాలకంవా ప్రకల్పయేత్ ।
ఉత్తరే జలధారాంశ్చ స్నానార్థం పరికల్పయేత్ ॥ 12
యుగ్మాయుగ్మంతు పంక్తిర్వాఽభ్యంతరాలం ద్విజోత్తమ ।
అధిష్ఠానాది సర్వాంగం మండపస్య సమంభవేత్ ॥ 13
అంతరాలం నమాఖ్యాతం శ్రుణుమండప లక్షణం ।
ద్విహస్తంతు సమారభ్య ద్విద్విహస్త వివర్ధనాత్ ॥ 14
ఏవమేకో నవిశంతు నవధామండపం భవేత్ ।
ఆభాస సదనానాంతు ఆభాసం మండపం భవేత్ ॥ 15

తా॥ మండపములను రచించుపద్ధతి చెప్పుచున్నాడు. జాతి, ఛందము, వికల్పము, అభాసము, అను దేవాలయములయొక్క ముందుగాని, ప్రక్కలనుగాని, దిశలయందుగాని, మూలలయందు గాని, గ్రామముయొక్క మధ్యనుగాని, నలుదిశలయందుగాని, నలు మూలలయందుగాని, ఉద్యానమునందును, చెఱువులోను, దేవునికి అష్టదిశలయందు ముఖమండపములను రచించవలెను. ప్రాసాదము ముందు ముఖమండపము, ప్రతిమామండపము, స్నాపనమండపము,

నృత్యమండపము అను నాలుగు రచించుచుందురు. అందు మొదటిది ప్రాసాదముతో సమానముగ నుండవలయును. రెండవది మొదలు వరుసగా జెప్పుచున్నాడు. లోపల హారములు, మధ్య హారములు చేయవలయును. మండపమునుండి మఱియొక మండపము, శాల నుండి మండపము, చేయబడినది అంతరాలమగును. దాని లక్షణము చెప్పుచున్నాడు. 1-2-3-4-5-6-7-8-9-10-11 హస్తములు అంత రాల విస్తారము చేయుదురు. ఏ ఆలయము దగ్గఱ నిర్మించు మండ పము ఆకొలత ననుసరించి యుండవలెను. అంతరాలము 1-2-3-4 భాగములుచేసి గోడలలోపలికిగాని లేక గోడల మధ్యకుగాని చేయ వచ్చును. అటుల గోడల మధ్యకు చేయబడినయెడల ప్రక్కలయందు వేశముతో కూడ కొలతకు రావలయును. ముందు 1-2-3 పాదములు గాని లేక 1 భాగముగాని రెంటినడుమ ద్వారముగాని, కిటికీగాని, రచించవలయును. ఉత్తరమున స్నానమునకు జలధారను కల్పించ వలెను. సరిగదులుగానిచేసి, గదులుగాని, అంతరాలమును చేయ వచ్చును. అధిష్ఠానము మొదలు అన్ని రూపములు మండపముతో సమానముగా నుండవలెను. ఇది అంతరాల లక్షణము. మండపము 3 హస్తములు మొదలుకొని, 2 హస్తముల చొప్పున పెంచుచు 19 హస్తములవఱకు 9 భేదములుగా ఆభాస మండపములను రచించ వచ్చును. ఆభాస ప్రాసాదములయందు ఆభాస మండపములనే రచించవలయును. ఇతరములు కూడవు.

శ్లో॥ ఏకవింశతి హస్తాది ద్విద్విహస్త వివర్ధనాత్ ।
సప్తత్రింశత్కరాంతంచ వికల్పం నవధాభవేత్ ॥ 16
ఆభాసానాంచ తద్యోగ్యం స్వస్వయోగ్య మథాపివా ।
నవత్రింశతి మారభ్య ద్విద్విహస్త వివర్ధనాత్ ॥ 17

పంచాధికంతు పంచాశత్కరాంశం ఛందముచ్యతే ।
సప్తపంచాశదారభ్య ద్విద్విహస్త వివర్ధనాత్ ॥ 18
సాగ్నిసప్తతి హస్తాంతం ప్రస్సృతా జాతిరుచ్యతే ॥
తద్విస్తారసమం దీర్ఘం సమాశ్రం మండపం భవేత్ ॥ 19
అధ్యర్థహస్తమారభ్య షట్ షడంగుల వర్ధనాత్ ।
పంచహస్తావధిం యావత్ పంక్తివ్యాసంతు కల్పయేత్ ॥ 20
సార్ధహస్తం సమారభ్య యావత్పంచ కరావధి ।
గుణాంగులవివృధ్ధ్యాతు పంక్తివ్యాసం ప్రకల్పయేత్ ॥ 21
సార్ధద్విహస్తమారభ్య షడంగుల వివర్ధనాత్ ।
స్తంభానాముదయం హ్యేవం స్తంభవ్యాసమథోచ్యతే ॥ 22
వస్వంగులం సమారభ్య అర్ధాంగుల వివర్ధనాత్ ।
ఏవోనవింశ మాత్రంతు త్రయోవింశాంఘ్రి విస్తృతమ్ ॥ 23
పాదంచ భానురుద్రాంశే దశవై చాష్ట వాభవేత్ ।
మూలాకారాంత్రదేకాంశ హీనమగ్రతలం భవేత్ ॥ 24
తలిపార్ధతలోత్తుంగం సామాన్యం సర్వమండలే ।
తలిపోచ్చేతు భూతాంశే ద్విభాగంచ తలోదయమ్ ॥ 25
అంఘ్రితుంగాగ్ని వేదైక భాగంవాపి మసూరకం ।
ఉపపీఠ మధిష్ఠాన కేవలం వామసూరకమ్ ॥ 26
ధరాతలసమం ప్రోక్తం ద్విగుణం త్రిగుణం తువా ।
ఉపపీఠోదయంఖ్యాత ముపపీఠార్ధవత్తువా ॥ 27
ఉపపీఠమధిష్ఠానం చరణం ప్రస్తంతథా ।
నీవ్రవేశమలంకారం గుణ్యం ప్రాగివ విద్యతే ॥ 28
పత్తిత్రయ సమాయుక్తం షోడశ స్తంభ సంయుతం ।
కలాల్పనాసికోపేతం మధ్యేకూటంతు ఏవవా ॥ 29

మండపంవాథ సర్వత్ర చతుర్ద్వావయుతంతువా ।
ఇష్టదిగ్ద్వారమేకంవా ద్వయంవా జాలకోఽష్టదిక్ ॥ 30
బాహ్యాసోపాన సంయుక్తం చిత్రితంతోరణాదిభిః ।
తోరణాది విహీనంవా కల్పైవం ప్రథమభవేత్ ॥ 31

తా॥ వికల్పమున 21 హస్తములు మొదలు 2 హస్తముల పెంపుతో 37 హస్తములవఱకు 9 భేదములు వికల్పప్రాసాదమున ఈ కొలతలతో మండపములను రచించవలయును. ఛందమున 39 హస్తములు మొదలు 2 హస్తముల పెంపుతో 55 హస్తములవఱకు 9 విధములు. ఇవి ఛందప్రాసాదమున రచించు మండపముల కొలతలు జాతి మండపములకు 57 హస్తములు మొదలు 2 హస్తముల చొప్పున పెంచుచు 73 హస్తములవఱకు 9 భేదములు. ఇవి జాతిప్రాసాదముల యందు రచింపదగినవి, మండపమునకు విస్తారమును పొడవును సమానము నుండవలయును. 1 హస్తము మొదలు కొని 6 హాంగులముల చొప్పున పెంచుచు 5 హస్తములవఱకు గది యొక్క విస్తారమును చేయవలయును. $1\frac{1}{3}$ హస్తము మొదలుకొని 3 అంగులముల చొప్పున పెంచుచు 5 హస్తములవఱకు 29 భేదములుగా గదియొక్క విస్తారమును కల్పించవచ్చును. $2\frac{1}{3}$ హస్తములు మొదలుకొని 6 అంగులముల చొప్పున పెంచుచు స్తంభములయొక్క యెత్తును చేయవలయును. స్తంభము యొక్క విస్తారము 8 అంగులములు మొదలుకొని $\frac{1}{2}$ అంగులము చొప్పున పెంచుచు 19 అంగులములవఱకు 23 భేదములుగా రచించవచ్చును. స్తంభముయొక్క లావు 12-11-10-8 భాగముచేసి మొదలుకంటె చివర ఒక్క భాగము తగ్గించవలయును. స్తంభముయెత్తులో సగముపైన ప్రస్తరమును చేయుదురు. స్తంభముయెత్తు 5 భాగములుచేసి అందు 2భాగములు గాని, స్తంభముయెత్తు 3 భాగములుచేసి అందు 1 భాగముగాని,

4 భాగములుచేసి 1 భాగముగాని, అధిష్ఠానమును కల్పించవచ్చును. ఉపపీఠము అధిష్ఠానముగాని, లేక అధిష్ఠానమును మాత్రమేకాని చేయవచ్చును. అధిష్ఠానముతో సమానముగాని, రెట్టింపుగాని, లేక రెండు వంతులు యెక్కువగాని ఉపపీఠముయెత్తు చేయుదురు. ఉపపీఠము, అధిష్ఠానము స్తంభము, ప్రస్తరము, నిర్గమము, ప్రవేశము, అలంకారములు. ఇవి అన్నియును ప్రాసాదమున జేసినట్లే చేయవలయును. గదులు మూడు వరుసలును, 16 స్తంభములును, 16 అల్పనాసికలును, మధ్యశిఖరమును, కలశమును, చుట్టును మండపమును మఱియు నాలుగు ద్వారములును, లేక యిష్టమువచ్చిన దిశ యందు ద్వారము ఒక్కొక్కటిగాని రెండు రెండుగాని, లేక కిటికీలు కోష్ఠములుగానిచేసి వెలుపల మెట్లును, తోరణములును, చేయవచ్చును. తోరణములు లేకున్నను చెల్లును. ఇది మొదటి మండపము.

శ్లో॥ చతుర్భక్త్యా విశాలంతు అష్టదిగ్ద్వార సంయుతం ।
పూర్వాపరద్విసంక్త్యేక భక్త్యా విస్తారనిర్వకమ్ ॥ 32
మధ్యమాంఘ్రిం పరిత్యజ్య ఊర్ధ్వేకూటం ద్విభాగికం ।
వసుపంజర సంయుక్తం ద్వితీయం మండపం భవేత్ ॥ 33
పంచభక్త్యా విశాలంతు మధ్యేకూటం ద్విభాగికం ।
మండపం షట్‌త్రింశ ద్వాత్రింశ చ్చరణాన్వితమ్ ॥ 34
భానుద్విగుణం రాష్ట్రిం పంజరాష్టకము సంయుతం ।
అష్టదిగ్ద్వార సంయుక్తం ద్వారమత్రైక కుడ్యకమ్ ॥ 35
ద్వారస్థానేతు సోపానం సర్వాలంకార సంయుతం ।
కుడ్యకుంభ లతాద్యైస్తు భూషితంతు తృతీయకమ్ ॥ 36
చతురశ్రంతు షడ్భక్త్యా మధ్యేకూటం ద్విభాగికం ।
తత్కూటమష్ట పాదాఢ్యం మధ్యేరంగ సమాయుతమ్ ॥ 37

చతుర్ద్వార సమాయుక్త మష్టదిగ్ద్వారమేవవా ।
ద్విభక్త్యాఽపి హ్యాతంచైవ భక్త్యాది ప్రథమాయుతమ్ ॥ 38
అష్టదిగ్భద్ర సంయుక్తం చతుర్దిగ్భద్రమేవవా ।
చత్వారింశతి చాష్టాంఘ్రి యుక్తంవా తత్రయోజితమ్ ॥ 39
చతుర్వింశాల్పనా సాధ్యం కుడ్యకుంభ లతాన్వితం ।
తోరణాష్టక సంయుక్తం చతుర్థం మండపం త్విదమ్ ॥ 40
చతురశ్రంతు సప్తాంశం షష్ట్యంఘ్రిక సమాయుతం ॥
నవభాగేన తన్మధ్యే కూటంవా మండితాంగణమ్ ॥ 41
ద్వాత్రింశ దల్పనాసాధ్యం చతుర్దిగ్భద్ర సంయుతం ।
త్రిభాగైకాంశ విస్తారం నిర్గమం ముఖభద్రకమ్ ॥ 42
మధ్యరంగ సమోపేత మష్టకుడ్య సమన్వితం ।
సర్వాలంకార సంయుక్తం పంచమం పరికీర్తితమ్ ॥ 43
యుగాశ్రమష్టభక్త్యాతు అశీతి చరణాన్వితం ।
చతుర్భాగే తన్మధ్యే ఊర్ధ్వకూటం ప్రకల్పయేత్ ॥ 44
చతుర్దిగ్ద్వార సంయుక్త మష్టదిగ్ద్వారమేవవా ।
ముఖసోపానమగ్న్యం శైర్వాసనీవ్ర సమన్వితమ్ ॥ 45
మద్యరంగ సమాయుక్తం షడష్టనాసికాన్వితం ।
సర్వాలంకార సంయుక్తం షష్ఠంతు మండపం భవేత్ । 46

తా॥ విస్తారమును 4 భాగములుచేసి 8 దిక్కుల ద్వారములును, తూర్పు పడమరలు రెండుగదుల వరుసలుగా నిర్గమములుచేసి మధ్యస్తంభము లేకుండచేసి పైన కూటము 2 భాగములును, పంజరములు 8 చేసిన మొదల రెండవ మండపమగును. విస్తారమును 5 భాగములుచేసి మధ్యకూటము 2 భాగములును,మండపము చుట్టును 1 భాగము 32 స్తంభములును, 24 తలములును, పంజరములు

8 యును, 8 దిక్కులద్వారములును, ద్వారము ప్రక్కగోడయును, ద్వారమునకు మెట్లును, గజతుండాద్యలంకారములును, కుడ్యస్తంభములు, కుంభలతలు, రచింపబడినది. మూడవ మండపము చతురశ్రమును 6 భాగములుచేసి మధ్యకూటము 2 భాగములు, ఆకూటమునకు 8 స్తంభములు, మధ్య రంగమును 4 దిశలద్వారములుగాని, లేక 8 దిక్కుల ద్వారములుగాని, రెండు రెండు భాగములుగాని, 8 భద్రములును, లేక 4 భద్రములుగాని, 48 స్తంభములును, 24 క్షుద్రనాసికలు, కుడ్యమున కుంభలతలు, 8 తోరణములు కలది నాల్గవ మండపము.

చతురశ్రమును 7 భాగములుచేసి 60 స్తంభములును, దాని నడుమ 9 భాగములు కూటమును, అంగణమును, 32 క్షుద్రనాసికలును, 4 భద్రములును, ముఖభద్రము 3 భాగములును నిర్గమము 1 భాగమును, మధ్యరంగమును లేక 8 గోడలును, సమస్తమైన అలంకారములును కలది అయిదవ మండపము. నలుచదరమును 8 భాగములుచేసి 80 స్తంభములును, దాని నడుమ 4 భాగములు ఊర్ధ్వకూటమును, 4 దిశల ద్వారములును, లేక 8 దిశల ద్వారములును, ముఖ సోపానము 3 భాగములును, గృహానిర్గమముతో సర్వాలంకారములు కలది, ఆఱవ మండపము.

శ్లో॥ చతురశ్రం దశాంశంతు భానుద్వయ గజాంఘ్రికం ।
మధ్యేచైవాష్టదిగ్భాగ నవకూట సమాయుతమ్ ॥ 47
కూటోపరిస్రివతాంశేతు త్వంతరాలం ప్రకల్పయేత్ ।
పార్శ్వాన్ముఖేన సోపానం దిశిభద్ర సమన్వితమ్ ॥ 48
సర్వాలంకార సంయుక్తం సప్తమం మండపం భవేత్ ।
రుద్రభక్త్యాయుగాశ్రంతు మధ్యేత్ర్యంశేన కూటకమ్ ॥ 49

ముఖేసోపాన సంయుక్త మష్టదిగ్భద్ర సంయుతం ।
ద్వారమత్రైవ కుడ్యాంశ మష్టభాగావసానకమ్ ॥ 50
సర్వాలంకార సంయుక్త మష్టమం మండపం భవేత్ ।
ద్వాదశాంశే యుగాశ్రంతు మధ్యేత్ర్యంశేన కూటకమ్ ॥ 51
మండపస్య తుబాహ్యేతు అంశేనాలింద్ర మిష్యతే ।
తద్ త్ర్యంశేనతు విస్తార నిష్క్రాంతంస్యా చ్చతుర్దిశి ॥ 52
చతుఃషష్టి సిమంపాద మాద్యంగేనతు కల్పయేత్ ।
సర్వాలంకార సంయుక్తం సవమం మండపం భవేత్ ॥ 53
... ... ... పేత మండపస్య తదాయతం ।
తష్యోచిత విభాగంతు కృత్వావా మండలం కురు ॥ 54
పంక్తిత్రయ విశాలంతు పంచపంక్త్యా విశాలకం ।
ఏకపార్శ్వే పురేవాఽథ ద్వారమంశేన కల్పయేత్ ॥ 55
పార్శ్వద్వారయుతంద్వేతు త్రింశదంఘ్రి సమన్వితం ।
తదేవపరితోఽంశేన మండపాభ్యంతరేరసః ॥ 53
ఉపాదైర్ఘ్యం హానం కుర్యా దష్టవింశాంఘ్రి సంయుతం ।
పురేసార్శ్వయుతంచేత్తు చరణం చాష్టవింశతిః ॥ 57
అథవాద్వారహీనంతు త్రిరష్టచరణాన్వితం ।
పాదం ప్రత్యల్పనాసాఢ్యం వేదిజాలక తోరణమ్ ॥ 58
నానాకుంభలతాద్యైస్తు కల్పితం ప్రథమం భవేత్ ।
చతుర్భత్తి విశాలంతు ఆయామేతు షడంశకమ్ ॥ 59
మండపం పరితోఽంశేన కూటమభ్యంతరేతరం ।
ద్విభక్తి విస్తలితంచైవ భక్త్యాతు ముఖభద్రకమ్ ॥ 60
ద్వాత్రింశచ్చరణోపేతం మండపంతు ద్వితీయకం ।
విశాలపంచ భక్త్యాస్యా దాయామేసప్తభక్తయః ॥ 61

త్రిపంచపంక్తి విస్తారం దీర్ఘం మధ్యే సభాభవేత్ ।
మండపం పరితోఽంశేతు అష్టదిగ్భద్ర సంయుతమ్ ॥ 62
చత్వారింశతి పాదాఢ్యం సర్వాలంకార సంయుతం ।
వేదికాద్యైః సమాయుక్తం తృతీయం మండపం భవేత్ ॥ 63
రసభక్తి విశాలంతు వసుభక్త్యాయతం భవేత్ ।
ద్విచతుర్భక్తి విస్తారం దీర్ఘం మధ్యే మహోదయమ్ ॥ 64
మండపం పరితోష్టాంశ మష్టదీర్ఘకభద్రకం ।
షష్టిసంఖ్యాంఘ్రి సంయుక్తం చతుర్థ మండపం భవేత్ ॥ 65

తా॥ నలుచదరమును 10 భాగములుచేసి 32 స్తంభములును, మధ్యను 8 దిశలయందును మొత్తము 9 కూటములును, కూటము పైన నిర్గమము 1 భాగము అంతరాలమును, ద్వారముయొక్క యిరు వైపుల మెట్లును, నలువైపుల భద్రములును, అన్ని అలంకారము లును కలది ఏడవ మండపము. సమచతురశ్రమును 11 భాగములు చేసి మధ్యకూటము 3 భాగములును, ద్వారము నసోపానములును, 8 భద్రములును, ద్వారమునగోడ 1 భాగమును, 8వ భాగమువఱకు సమస్తమైన పనులుగలది ఎనిమిదవ మండపము. చతురశ్రమును 12 భాగములుచేసి మధ్య 3 భాగములు కూటమును, మండపము వెలుపల 1 భాగము అలిందమును, దానియొక్క నిర్గమము 3 భాగ ములు, నాలుగువైపులను, 64 స్తంభములు మొదటిఅంతస్తు రచించ వలెను. ఇది తొమ్మిదవ మండపము. మఱియు విస్తారమును పొడ వును యిష్టమువచ్చినట్లు కల్పించి విస్తారమున 3 వరుసలగదులును పొడవున 5 వరుసల గదులునుచేసి ఒక ప్రక్కనుగాని లేక ముందు గాని, 1 భాగము ద్వారమును చేయవలయును. ప్రక్కలయందు రెండు ద్వారములును, 30 స్తంభములును, దానికి చుట్టును 1 భాగము మండపములోపల లుపలనిడుపు 6 భాగములు తగ్గించి

28 స్తంభములతో ముందును, దానికి ఒకవైపున ద్వారముతోను' లేక 24 స్తంభములతోనే ద్వారములేకుండగాని, స్తంభమున క్షుద్ర నాసికలును, వీధిజాలకము, తోరణము, అనేక కుంభలతలు రచింప బడినది. దీర్ఘచతురశ్ర మండపములలో మొదటిది. మఱియు విస్తారము 4 భాగములు, పొడవు 6 భాగములుచేసి మధ్యకూటమును చుట్టు 1 భాగము, ముఖభద్రము విస్తారము 2 భాగములతో రచించ వలెను. 32 స్తంభములు కలది దీర్ఘచతురశ్ర మండపములలో రెండవది. విస్తారము 5 భాగములు, పొడవు 7 భాగములుచేసి మధ్య 3 భాగముల విస్తారమును, 5 భాగముల పొడవునుగల సభను కల్పించి మండపమును చుట్టును 1 భాగము అష్ట దిక్కులయందు భద్రములను, 40 స్తంభములను రచింపబడి వేదిక మొదలగు అన్ని అలంకారములుకలది. దీర్ఘచతురశ్ర మండపములలో మూడవది. విస్తారము 6 భాగములును, పొడవు 8 భాగములునుచేసి మధ్య విస్తారము 2 భాగములు, పొడవు 4 భాగములుగల మొత్తైన మండ పమును చుట్టును 8 భాగముల విస్తారమున 8 పొడవైన భద్రము లను, 60 స్తంభములను రచింపబడినది. దీర్ఘచతురశ్ర మండపము లలో నాలుగవది.

శ్లో॥ తారేస ప్త విభాగేతు నవభక్త్యా యతాన్వితం ।
త్రిభక్తి విస్తృతపంచ భక్త్యాయామ సమంకరం ॥ 66
తారత్రయోదశాంశేన మధ్యాంశాంశేన కూటకం ।
అష్టదిక్కుడ్య సంయుక్తం చతుర్దిగ్భద్ర సంయుతమ్ । 67
ప్రముఖే పంచభాగేన ముఖభద్రం ప్రకల్పయేత్ ।
సద్వాయం స ప్తతిభక్త్యా తథాంఘ్రిక సమన్వితమ్ ॥ 68
సర్వాలంకారం సంయుక్తం ద్వాదశం మండపం భవేత్ ।
త్రిపంచపంక్తి విస్తార మాయామం చతురశ్రకమ్ ॥ 69

మధ్యేకూటం గుణాంశేన శేదనే ఊర్ధ్వ సమన్వితం ।
గుణాంశం విస్తృతాయామం ముఖభద్ర సమన్వితమ్ ॥ 70
అష్టదిక్కుడ్య సంయుక్తం మాయతాంఘ్రి సమన్వితం ।
సద్విపంచాశదధిక ద్విశతం చరణైర్యుతం ॥ 71
సర్వాలంకార సంయుక్తం మండపంతు త్రయోదశం ।
షోడశాంశే యుగాశ్రంతు మధ్యేకూటంతు షోడశమ్ ॥ 72
తదశీతి సమాయుక్తం ద్విశతం పాదముచ్యతే ।
ముఖభద్ర సమాంశేన తదర్థేనేతరేదిః ॥ 73
సర్వాలంకార సంయుక్తం మండపంస్యా చ్చతుర్దశం ।
ఏవం హిమనుభేదేన యుగాశ్రం మండపం విదుః ॥ 74
ఇత ఊర్ధ్వం చతుస్త్రింశ దంశం సీమావసానకం ।
చతురశ్రో మండపఃస్యా త్సర్వాలంకార సంయుతః ॥ 75
భిత్తి స్తంభంచ పరితః కర్తురిచ్ఛావశాన్నయేత్ ।
సమాశ్రమండపంత్వేద మాయాశ్రమథోచ్యతే ॥ 76
విస్తారం పంక్తితుల్యంస్యాత్ సాయతం వాఽథపంక్తయః ।
విస్తారం పంక్తిమానంతు గుణాంగుల వివర్ధనాత్ ॥ 77
సప్తవింశాంగులం యావ త్తావదాయతం వోదితం ।
వృద్ధిక్షీణం తథావాఽథ మండపేతు కరోదితమ్ ॥ 78
నాశ్రయేత్తుకరం పూర్వ మండపంతు సమాచరేత్ ।
అశేషఘట సంఖ్యాతు ప్రాగ్వదాయామమాచరేత్ ॥ 79
మండపే పరితోఽష్టాంశే నాష్టదిగ్భద్ర సంయుతం ।
త్రిభక్తివిస్తృతంచైవ భక్త్యాతన్ముఖ భద్రకమ్ ॥ 80
సప్తతిస్తుద్వయాధిక్యం పాదమిత్య భిధీయతే ।
సర్వాలంకార సంయుక్తం పంచమం మండపం భవేత్ ॥ 81

వసుభక్తి విశాలంచ దశభక్త్యా తథాయతం ।
ద్విచతుర్భాగ విస్తారం దీర్ఘంమధ్య మహోదయమ్ ॥ 82
పరితోమండపోహ్యాంశం మధ్యస్తంభ వివర్జితం ।
ఇంద్రదదిఙ్ముఖ భద్రంచ చతుర్ద్వ్యంశేనసువ్రత ॥ 83
షణ్ణవత్యంఘ్రి సంయుక్తం సర్వాలంకార సంయుతం ।
షష్ఠంతు మండపం హ్యేవం ప్రోచ్యతేతు శివార్ణకమ్ ॥ 84
నవభక్త్యా విశాలంతు రుద్రభక్త్యా తథాయతం ।
త్రిపంచ భక్తి విస్తారం దీర్ఘంమధ్యే సభాభవేత్ ॥ 85
పరితో వేదభాగంతు మండపం పరికల్పయేత్ ।
త్రిపంచభాగ విస్తారం దీర్ఘంస్యాన్ముఖభద్రకమ్ ॥ 86
సర్వాలంకార సంయుక్త మష్టమం మండపం భవేత్ ।
అష్టదిక్ చారురంగం స్యాత్కల్పయేచ్ఛల్ప విత్తమః ॥ 87
ఏవంహి మనుభేదంచ సాయతం మండపం విదుః ॥ 87½

తా॥ విస్తారము 7 భాగములు, పొడవు 9 భాగములు, మధ్య విస్తారము 3 భాగములు, పొడవు 5 భాగములు, విస్తారము పొడవు నిర్ణయింపబడిన మధ్యరంగము పైన కూటము రచించవలెను. 8 దిక్కులను గోడను రచించవలయును. 4 దిశలయందు భద్రములును, ముందువైపున ముఖభద్రము, 5 భాగముల విస్తారముతో రచించవలెను. 72 స్తంభములును, సమస్తమైన అలంకారములును కలది దీర్ఘచతురశ్ర మండపములలో పది రెండవది. విస్తారము 15 భాగములును, అదే పొడవును మధ్యకూటము 3 భాగములు నలుచదరమును ముఖభద్రము 3 భాగములు నలుచదరముగను, 8 దిక్కుల యందును గోడలును, పొడవైన స్తంభములును, 252 స్తంభములును, అన్ని అలంకారములు కలది. చతురశ్ర మండపములలో

పదునూడవది. మఱియును చదరముగలదానిని 16 భాగములుచేసి మధ్య 16 భాగములు కూటమును, 280 స్తంభములును, ముందు వైపున మండపముతో సమానముగా ముఖభద్రమును, ఇతర దిశల యందు అందులో సగము గలముఖ భద్రములును, అన్నివిధములైన అలంకారములును కలది చతురశ్ర మండపములలో పదునాల్గవది. ఇట్లు నలుచదరమున పదునాల్గు విధముల మండపములు చెప్ప బడినవి. వీనికిపైన 34 భాగములవఱకును, చతురశ్ర మండపముల కొలతలుకలవు. గోడయును, స్తంభములును, చుట్టును కర్తయొక్క యిష్టానుసారముగ చేయవచ్చును.

ఆయతాశ్ర మండపములను జెప్పుచున్నాడు. విస్తారమును 10 భాగములుచేసి పొడవు విస్తారముకంటె 3 అంగుళముల చొప్పున ఒక్కొక్క భాగమునకు పెంచి పొడవునుకూడ 10 భాగములు చేయవచ్చును. ఇట్లు ఒక్కొక్క భాగమునకు 27 అంగులముల వఱకు పెంచవచ్చును. ఈప్రకారముగ రచించినను రచించవచ్చును. అధిక సంఖ్యయందు మాత్రము పూర్వము చెప్పినట్లే రచించుట యుక్తము. మధ్య నాలుగు భాగములు కూటములును, నలుమూలల యందు 3 భాగముల చొప్పునను, 16 స్తంభములతోను రచించ వలయును. కూటమునకు నలువైపులను 2-2 స్తంభములను కల్పిం చిన యెడల మొత్తము 72 స్తంభములగును. మండపము చుట్టును 8 భాగములుచేసి 8 భద్రములను రచించవలయును. ఒక్కొక్క భద్రమును 3 భాగములుచేసి అందు 1 భాగము ముఖభద్రమును రచించవలయును. అన్ని అలంకారములను కల్పించవలెను. దీర్ఘ చతురశ్ర మండపములలోనిది ఐదవది. విస్తారము 8 భాగములు పొడవు 10 భాగములుచేసి మధ్య విస్తారము 2 భాగములు పొడవు 4 భాగములు రంగమును కల్పించి చుట్టును మండపము 1భాగమును

చేయవలయును. కూటమునందు స్తంభమును కల్పించగూడదు. తూర్పున ముఖభద్రము పొడవు 4 భాగములును వెడల్పు 2 భాగములును చేయవలయును. 96 స్తంభములును సమస్తమైన అలంకారములును కలది దీర్ఘ చతురశ్ర మండపములలో ఆఱవది.

ఇది శివప్రాసాదమునకు దగినది. విస్తారము 9 భాగములును, పొడవు 11 భాగములును, మధ్యసభ విస్తారము 3 భాగము పొడవు 5 భాగములు చేసి చుట్టును 4 భాగములు మండపమును, ముఖభద్రములు, విస్తారము 3 భాగములు, నిడివి 5 భాగములు చేయవలయును. 8 దిశలయందును అందమైన రంగములను కల్పించవలయును. ఇది దీర్ఘ చతురశ్ర మండపములలో ఎనిమిదవది. ఇట్లు పదునాల్గు భేదములు కలవు.

(అనుబంధము 16 నుండి 33 వఱకుగల పటములు చూడుడు)

శ్లో॥ త్రిచతుష్పంచ షట్ సప్త అంకణాస్యతు ఏవవా ॥ 88
సర్వేషాం మండపానాంచ భిత్తివ్యాసంతు పంచధా ।
పాదాయామ విశాలేన దారుపాదే నవాసమమ్ ॥ 89
సర్వేషాం ముఖభద్రాణాం కరణం మండలాకృతి ।
పార్శ్వేసోపాన సంయుక్తం హస్తిహస్త విభూషితమ్ ॥ 90
పంచషట్ సప్తనవాష్టదండంవా తస్యవిస్తృతం ।
సపాదం సార్ధదండంవా హస్తిహస్తో దయాన్వితమ్ ॥ 91
యష్టినానూర్ధ్వకల్పంవా వస్వశ్రం హస్తిహస్తకం ।
తన్నేత్రవం కిం పురోరస్య అశ్రం కకుంతాకృతి ॥ 92
మూలాదష్టాంశరహిత మగ్రమస్తు క్రమాత్ కృశం ।
హస్తిహస్తాంతరం విప్రయుగ్మంవా యుగ్మయష్టయః ॥ 93
దండం సపాదదండంవా సార్ధంవా సత్రిపాదకం ।
ద్విదండంవాఽథధీమత్శ్చ విస్తారం స్యాత్తదేనహి ॥ 94

తేనద్విగుణ స్త్రీవంతు అభయస్థాన మండపే ।
యష్టే రుచ్చాగ్ని భాగైకం భాగంస్యా దామలోదయమ్ ॥ 95
ఆదౌ సమతలేస్థిత్వా సవ్యపాద పురస్సరం ।
సోపానారోహణం విద్యాన్మర్త్యానాంతు విధీయతే ॥ 96
మండపం హ్యేవమాఖ్యాతం గోపురం శృణుసువ్రత ॥ 97
ఇతి కాశ్యపశిల్పే మండపలక్షణం చతుశ్చత్వారించః పటలః ॥

తా॥ మండపము లన్నిటికిని గోడవిస్తారము స్తంభము పొడవుతో సమానముగాని, అంకణములలో 3-4 5-6-7 వ వంతుగాని, దారుస్తంభముతో సమానముగాని, ముఖభద్రము లన్నియును గుండ్రముగను, ప్రక్కలయందు మెట్లును, గజ మండపములును, 5-6-7-8-9 దండముల విస్తారముగను, గజ మండపముల పొడవు 1 దండము $1\frac{1}{4}$-$1\frac{1}{2}$ 2 దండములు చేయవచ్చును. యష్టికిపైన 8కోణములతో గజ మండపమును రచించవలెను. దాని నిర్గమము కింపురుని బొమ్మనకు ముందుగాను, తొండము చివర మొగ్గవలె నుండవలెను. మొదలుమొక్క లావులో 8వ వంతు తక్కువగా చివరలావు కలుగ జేయవలెను. గజ మండపముల సందున సరి సంఖ్యగాగాని, బేసి సంఖ్యగాగాని, యష్టిసంఖ్య నుంచవచ్చును. 1 దండము $1\frac{1}{4}$-$1\frac{1}{2}$-$1\frac{3}{4}$ 2 దండములు. ఇట్లు విస్తారము చేయవచ్చును. దానికి రెట్టింపుగా నిర్గమము కల్పించవలెను. యష్టియెత్తు 3 భాగములుచేసి అందులో 1 భాగము మస్తకమును చేయవలయును. మొదట సమతలమునుండి క్రమముగా $\frac{1}{4}$ చొప్పున సవ్యముగా మెట్లు రచించవలయును. ఇది మండపముల లక్షణము. శిల్పరత్నము 39వ అధ్యాయమున ముఖమండపము, అర్చనా మండపము, అధివాస మండపము, నాట్య మండపము అని నాలుగు విధములు చెప్పబడియున్నవి. కాని యింతటి క్రమముగా కొలతలు మొదలగునవి చెప్పియుండలేదు.

# 20. మానసారుని మండప భేదములు
## తత్ స్వరూపములు

మానసారము 34వ అధ్యాయము :

శ్లో॥ సర్వేషాం మండపానాంతు లక్షణం వక్ష్యతేఽధునా ।
తైతిలానాం ద్విజాతీనాం వర్ణానాం వా సయోగ్యకమ్ ॥ 1
భక్తిమానం తథాభిత్తి విస్తారం చాప్యలిందకమ్ ।
ప్రపాంగం మండపాకారం పంచభేద స్తథోచ్యతే ॥ 2
అధ్యర్థ హస్తమారభ్య షట్ షడంగుల వర్ధనాత్ ।
పంచహస్తాంతకం భిత్తి పంచదశ విశాలకమ్ ॥ 3
విస్తారస్య సమాద్దైర్ఘ్య మధికం చైకమేవవా ।
విస్తారద్విగుణాంతంచ ఏకైకాంగుల వర్ధనాత్ ॥ 4
విస్తారాష్టాంశ కాంశేన వర్ధనాత్ ద్విగుణాంతికం ।
ఏవం భక్త్యాయతం ప్రోక్తం భక్తితార విహోచ్యతే ॥ 5
ఏకహస్తం సమారభ్య షట్ షడంగుల వర్ధనాత్ ।
భక్తితారం ద్విహస్తాంతం పంచధా పరికీర్తితమ్ ॥ 6
ఏకభిత్తి ద్విభిత్తివా లిందవిస్తారమేవచ ।
అధిష్ఠానం వినాకుర్యా జ్జన్మాది ప్రస్తరాంతకమ్ ॥ 7
అథవా పాదవంశంచ సంయుక్తం తత్ ప్రపాంగకం ।
ఖదిరం చందనంచైవ పూతిపాదపదారుభిః ॥ 8
అన్యైః సారద్రుమైః ప్రోక్తం హేమదుగ్ధ కదారుచ ।
మధుకం క్షీరిణీసాల మన్యత్ శ్రేష్ఠద్రుమోత్తమమ్ ॥ 9
అథవాశిలా సంయుక్తం ప్రపాసర్వాంగ మేవచ ।
శుద్ధం మిశ్రంచ సంకీర్ణం యథాశోభం బలంతుయత్ ॥ 10

యథాలాభం ద్రుమైః స్తంభైః వంశైత్వవసార వృక్షకం ।
క్రముకం స్తంభయుక్తతా ఘాతయేత్ స్థాపయేత్సుధీః ॥ 11
క్రముకైర్వంశ యుక్తంవా వేణుభిశ్చోర్ధ్వవం శకం ।
దీర్ఘంచ తిర్యగ్వంశం చోర్ధ్వేతద్ దీర్ఘవంశకమ్ ॥ 12
నాలికేరదవైశ్చాపి బిధ్వాత్వాచ్ఛాదనం భవేత్ ।
అన్యైరపిదవైః సర్వై ర్యథాలాభం వితానయేత్ ॥ 13
వాతేన త్వచలం తత్ర కుర్యాద్దక్షిణికా ప్రపా ।
ప్రపాంగంచ ప్రపాశ్చై తత్కుర్యాత్తత్ర ద్విచక్షణః ॥ 14
దేవాలయే గృహేవాపి మండపేపృథగేవవా ।
అంతర్వాపి బహిర్వాపి పరితస్తు యథా ప్రపా ॥ 15
యత్రదేశే ప్రపాంకుర్యా త్తత్రదోషోన విద్యతే ।
ఇతి ప్రపాంగ ముక్తంతు మండపం వక్ష్యతేఽధునా ॥ 16

తా॥ అన్ని విధములైన మండపములయొక్క లక్షణములను చెప్పుచున్నాడు. దేవతలకును, బ్రాహ్మణులకును, అన్నికులముల వారలకును, తగిన కొలతలు, గోడమందము, అలిందము, ప్రపాంగము, మండపాకారము 5 విధములుగా చెప్పబడుచున్నది. $1\frac{1}{2}$ హస్తము మొదలుకొని 6-6 అంగులములు పెంచుచు 5 హస్తముల వఱకు 15 విధములుగా గోడను రచించవచ్చును. వెడల్పుతో సమానముగా పొడవుగాని, లేక 1-1 అంగులమును పెంచుచు రెట్టింపు వఱకుగాని, లేక విస్తారమును 8 భాగములుచేసి అందు ఒక్కొక్క భాగమును పెంచుచు రెట్టింపువఱకుగాని, ఇట్లు పొడవును కల్పించవచ్చును. మఱియు 1 హస్తము మొదలుకొని 6-6 అంగులముల చొప్పున పెంచుచు 2 హస్తములవఱకు 5 విధములుగా జేయవచ్చును.

ఒక్కగోడగాని, రెండు గోడలుగాని, అలిందములతోగాని, అధిష్ఠానముకాక జన్మస్థానము మొదలు ప్రస్తరము వఱకు రచింపదగును. లేక వెదురుబొంగులను పాతి పందిరివలెను రచించవచ్చును. చంద్ర, చందనము, దేవదారువు, ఇతరములైన చేవగలదారువులు. మేడికఱ్ఱ, ఇప్ప, పాల మద్ది, కఱ్ఱలు, ఇంకను యోగ్యమైనవియును, గాని, తాతి చక్కని కట్టడముతో ఎకజాతి, ద్విజాతి, త్రిజాతి మున్నగు భేదములతో యిష్టానుసారముగాను, అందముగాను బల యుక్తముగాను రచింపదగును. ఒకప్పుడు స్తంభములకు వెదురు బొందులుగాని, పోకమ్రానులుగాని, నాటవచ్చును. అయితే పోకమ్రానులనునాటి వానిపైన వెదురుబొంగులను వేయవచ్చును. మొత్తము వెదురుతోను రచించవచ్చును. పైన కొబ్బరియాకులను కప్పవలెను. లేక తాటి యాకులు మొదలైనవికూడ కప్పవచ్చును. గాలికి కదలకుండునట్లు గట్టిగా రచించవలెను. దేవాలయము, గృహము, మండపము, మొదలగువాని యందును, లేక ఒంటరి గాను, లోపలను, వెలుపలను, చుట్టును, పందిరిని కల్పించవచ్చును. అటుల కల్పించుటవలన దోషములేదు. ఇక మండప లక్షణములను చెప్పుచున్నాడు.

శ్లో॥ దేవాలయేషు సర్వేషు సమ్ముఖే బహుమండపం ।
పుణ్యక్షేత్రే తథారామే గ్రామాదౌ వాస్తు మధ్యమే ॥ 17
చతుర్దిక్షు విదిక్ష్వపి బాహ్యాభ్యంతరతోఽథవా ।
నరాణాం గృహమధ్యేచ సంముఖే మండపంతువా ॥ 18
సర్వేషాం వాసయోగ్యంచ మండపం యాగమండపం ।
నృపాణామభిషేకార్థం మండపం నృత్తమండపమ్ ॥ 19
పాణిపీడన సిద్ధ్యర్థం తథామైత్ర్యంచ మండపమ్ ।
ఉపనయన మండపంచైవ తథాచ స్నాన మండపమ్ ॥ 20

అర్భకానాం ముఖాలోక మండపం సతీమండపం।
క్షౌరార్థం మండపం చైవ చాగ్ని కార్యార్థ మండపమ్॥ 21
సుఖాన్వితార్థం కల్పేత మండపం విధివత్ క్రమాత్ ।
మండపానాంచ సర్వేషాం స్థానముక్తం పురాతనైః॥ 22
ప్రాసాదాభిముఖే సప్త మండపం కల్పయేత్ క్రమాత్ ।
ఆదౌతు స్నపనార్థంచా ధ్యయనార్థం ద్వితీయకమ్॥ 23
విశేషం స్నపనార్థంచ మండపంచ తృతీయకం ।
చతుర్థం ప్రతిమాగారం పంచమం స్థాపన మండపమ్॥ 24
షష్ఠంచాపి తతః కుర్యా త్తత్త తీర్థ మండపం ।
సప్తమం నృత్తగీతార్థ మాగారం తత్సాథకార్థకమ్॥ 25
అథవా తన్ముఖే కుర్యాదేక ద్విత్రిచ మండపం ।
స్నపనం ప్రతిమాంగానాం గీతనృత్తార్థ మండపమ్॥ 26
మండపం ద్వితీయంచైత దగ్రమండపం తన్ముఖే ।
ఆదౌచాధ్యయనార్థంస్యా త్రితీయా మండపం తథా॥ 27
తత్రైవ మండపం కుర్యాత్ ప్రతిమామండపం బుధః ।
త్రిచతుష్పంచ షట్సప్త చాష్టరంధ్రం ద్విభిత్తికమ్॥ 28
ప్రథమాత్సప్త మాంతంచ భిత్తిమేకాం ప్రకల్పయేత్ ।
తస్మాత్తద్యైక పంక్త్యంత మేకభాగై ర్వివర్ధనాత్॥ 29
మండపానాంచ సప్తానాం ప్రత్యేకం పంచధా భవేత్ ।
ఏవంతు చతురశ్రంస్యా త్తస్మాదేకేన వర్ధనాత్॥ 30
తత్సమాధికాయామం సమం వాచాయతంతువా ।
యుగ్మభిత్తించ యాంకుర్యాన్మధ్యస్తం భాన్ పరిత్యజేత్॥ 31
తత్త్వధిష్ఠానం పాదంచ ప్రస్తరంచ త్రివర్గకం ।
తదూర్ధ్వే మండపాంతంచ చూలికాకర్ణ హర్మ్యకమ్॥ 32

అంతరం ప్రస్తరోపేతం కుర్యాత్తు సమలంకృతం ।
సోపపీఠమధిష్ఠానం కేవలం వామసూరకమ్ ॥ 33
హార్మ్యోపపీఠయుక్తంచేత్ సోపపీఠాదిమండపం ।
పీనోపపీఠ హార్మ్యం చేన్మండపంచ త్రివర్గకమ్ ॥ 34
హార్మ్యస్య విపరీతంచేత్ స్వామినోమరణం ధ్రువం ।
ప్రస్తరం తత్రయత్తత్ర ప్రాసాద వదలంకృతమ్ ॥ 35
ప్రాసాద వదలంకృత్య చాధికాలం కృతం తువా ।
బాహ్యం చాలయతద్బాహ్యం మండపాం తమితీష్యతే ॥ 36

తా॥ దేవాలయము లన్నిటియందును ఎదురుగా పెక్కు మండపములను రచింతురు. పుణ్యక్షేత్రమునను, తోటయందును, ఊరియందును, ఇండ్లనడుమను, నలువైపులను మూలలను, వెలుపలను, లోపలను, మనుష్యగృహముల నడుమను, ఎదురుగాను, మండపములను రచింతురు. అందఱు నివసించుటకును, యజ్ఞమునకు, రాజులయొక్క అభిషేకమునకును, నాట్యమునకును, వివాహము నకును, స్నేహమునకును, ఉపనయనమునకును, స్నానమునకును, శిశుముఖావలోకనమునకును, స్త్రీలకును, క్షౌరమునకును, అగ్నికార్య మునకును, సుఖముకొఱకు మండపములను రచింతురు. అవి శాస్త్ర ప్రకారము రచించవలయును అన్ని మండపములకును స్థానములు చెప్పబడియున్నవి. ప్రాసాదమున కెదురుగా 7 మండపములను రచించవలయును. మొదటిది స్నానమండపము, రెండవది ఆధ్యయన మండపము, మూడవది ఘటాభిషేక మండపము, నాల్గవది ప్రతిమా మండపము అయిదవది స్థాపన మండపము, ఆఱవది తీర్థమండపము, ఏడవది నృత్తగీతముల కొఱకు మండపము, లేక నృత్యగీతములు నేర్చుకొను మండపము, లేక దేవాలయ ముఖభాగమునందు 1-2-3 మండపములను రచింతురు. స్నానమండపము, ప్రతిమయొక్క

అలంకారావయవములను గీతనృత్తములకును, మొదటి అధ్యయనము నకును, తరువాత ప్రతిమకును మండపములను రచింతురు. 3-4 5-6-7-8-9 రెండు గోడలతో ఒకటి మొదలు ఏడువఱకుఒక్క గోడతోను, అక్కడినుండి పదునొకండువఱకు ఒక్కొక్క భాగము పెంపుతోను రచింపవచ్చును. మండపము లేడింటికిని ప్రత్యేకముగా 5 విధములుకలవు. ఇట్లు నలుచదరపు మండపములు చెప్పబడినవి. అక్కడినుండి ఒక్కొక్కటి పెంపుతో సమచతురశ్రముగాని, దీర్ఘ చతురశ్రముగాని, రెంపుగోడలతోను, మధ్య స్తంభము లేకుండను, అధిష్ఠానము, స్తంభము, ప్రస్తరము అను (త్రివర్గము)మూటితోనే యుంచి ఆపైన చివరవఱకు శిఖరము కర్ణహర్మ్యము, అంతర ప్రస్తరము అలంకారముగా రచించవలయును. ఉపపీఠము అధిష్ఠానముగాని, లేక అధిష్ఠానము ఒక్కటేగాని చేయవచ్చును. ప్రాసాదమునకు ఉపపీఠము అధిష్ఠానము రచింపబడినచో అదే విధముగా మండప ముండవలెను. గొప్ప ఉపపీఠముగల ప్రాసాదమైన యెడల మంటపము త్రివర్గముతోనే సరిపుచ్చవలెను. మూలప్రాసాదమునకు విరుద్ధముగా మండపమును రచించినయెడల యజమానునకు కీడు గలుగును. ప్రాసాద ప్రస్తరమున నున్నట్లే మండప ప్రస్తరమునను పనులు చేయవలయును. ఇంకను అధికముగాను జేయవచ్చును. మొత్తముపని ఆలయముతో పోలియుండవలెను.

శ్లో॥ తేషాంక్రమేణ విన్యాస లక్షణం వక్ష్యతేఽధునా ।
చతురశ్ర సమాకారం సమమానం త్రిభక్తికమ్ ॥ 37
షోడశ స్తంభ సంయుక్తం చతుర్ద్వార సమన్వితం ।
చతుర్దిగ్భద్రవిస్తార మేక భాగేన నిర్గమమ్ ॥ 38
చతురశ్రం చతుర్భక్తిః షోడశ స్తంభ సంయుతం ।
చతుర్దిక్షు చతుర్ద్వార మేకభాగేన భద్రకమ్ ॥ 39

ద్వాత్రింశత్ క్షుద్రనాస్యంగం శేషం ప్రాగుక్తవన్నయేత్ ।
షడ్భాగం చతురశ్రంస్యాత్ షట్త్రింశత్పాద సంయుతమ్॥40
చతుర్దిక్షు చతుర్ద్వారం మధ్యపాదాన్ పరిత్యజేత్ ।
ద్విభక్త్యా భద్రవిస్తార మేకభాగేన నిర్గమమ్ ॥ 41
ద్వాత్రింశత్ క్షుద్రనాస్యంగం సర్వాలంకార సంయుతం ।
చతుః షష్ట్యంఘ్రి సంయుక్తం సప్తసప్త ద్విభాగికమ్ ॥ 42
చతుష్పాదం త్యజేన్మధ్యే చతుర్ద్వారం చతుర్దిశి ।
త్రిభక్తి విస్తృతం భద్రమేకభాగేన నిర్గమమ్ ॥ 43
షష్ట్యంఘ్రికయుక్తంవాపి తన్మధ్యే చోర్ధ్వకూటకం ।
చత్వారింశత్తు నాస్యంగం శేషం పూర్వవదాచరేత్ ॥ 44
చతురష్టాష్టభక్తిశ్చ చతుః షష్ట్యంఘ్రి సంయుతం ।
చతుర్దిక్షు చతుర్ద్వారం మధ్యపాదాన్ విసర్జయేత్ ॥ 45
చతుర్భాగేన భద్రంస్యా దేకభాగేన నిర్గమం ।
పూర్వవత్ క్షుద్రనాస్యంగం యుక్త్యాతత్రైవ యోజయేత్॥
సంవనంద విభాగేన విస్తారాయామ స్తత్సమం ।
కల్పయేన్నవరంగంస్యాత్ షోడశం పాదాన్ పరిత్యజేత్ ॥ 47
నందాష్టభాగ సంయుక్తం త్రిభాగైకేన భద్రకం ।
చతుర్దిక్షు చతుర్ద్వారం తత్తదగ్రే సభద్రకమ్ ॥ 48
సర్వాలంకార సంయుక్తం షడష్టైవాల్పనాసికా ।
తన్మధ్యేచోర్ధ్వ కూటంస్యా చ్చత్వారింశాష్ట నాసికమ్ ॥ 49
తదేవ షోడశస్తంభం త్యజేత్కర్ణ చతుష్టయే ।
చతుర్దిక్షు చతుర్ద్వారం వేదభాగైక భద్రకమ్ ॥ 50
సర్వాలంకార సంయుక్తం శేషం యుక్త్యా ప్రయోజయేత్ ।
ఏకాదశ విభాగేన మండపం చతురశ్రకమ్ ॥ 51

సాలింద్రం నవరంగంస్యా దష్టోత్తర శతాంఘ్రికం ।
తద్బహిః పరితోలింద్రమేక భాగేన కారయేత్ ॥ 52
చతుర్దిక్ పంచభాగేన భద్రంచాంశేన నిర్గమం ।
చతుర్దిక్షు చతుర్ద్వారం చతుః షష్ట్యల్ప నాసికమ్ ॥ 53
నాభ్యూర్ధ్వకూట సంయుక్తం సర్వాలంకార సంయుతం ।
ఏవంతు చాతురశ్రంస్యా త్తదాయామ మిహోచ్యతే ॥ 54

తా॥ మండపముల యొక్క విన్యాస లక్షణములను చెప్పు చున్నాడు. సమానమైన నలుచదరమును 3 భాగములుచేసి దానికి 16 స్తంభములును, నలువైపుల నాలుగు ద్వారములును, ఆనాలుగు దిక్కులయందు 1 భాగము నిర్గమముతో భద్రములును, రచించ వచ్చును. మఱియు చతురశ్ర ప్రదేశమును 4 భాగములుగాచేసి అందు మధ్య 2 భాగములను వదలి ప్రక్కలయందు ఒక్కొక్క భాగమునకే స్తంభములు నిలుపుచు ఇట్లు 16 స్తంభములును, నలు వైపుల మధ్యద్వారములును,భద్రముల యొక్క నిర్గమము 1 భాగము చొప్పునను, 32 క్షుద్రనాసికలును చేయవచ్చును. లేక చతురశ్ర మును 6 భాగములుచేసి అందు మధ్య 2 భాగములను వదలి ఒక్కొక్కమూల 9 స్తంభముల చొప్పున మొత్తము 36 స్తంభము లును, నలువైపుల నాలుగు ద్వారములును, పై జెప్పబడిన స్తంభ ములుదప్ప మధ్య స్తంభముల నుంచగూడదు. భద్రముయొక్క విస్తారమును 2 భాగములుచేసి అందు 1 భాగము నిర్గమమును 32 క్షుద్రనాసికలును, చేయవచ్చును. నలుచదర ప్రదేశమును 7-7 భాగములుచేసి దానికి 64 స్తంభములను నిర్ణయించి దాని నడుమ 4 స్తంభములను తీసివేసి 60 స్తంభములనే యుంచి నలువైపుల ద్వారములును, భద్రముల విస్తారము 3 భాగములును నిర్గమము 1 భాగమును, మధ్య ఊర్ధ్వ కూటమును, 40 క్షుద్రనాసికలును,

చేయవచ్చును. నలుచదరమును 8-8 భాగములుచేసి మధ్య 2 గదులనువదలి ఒక్కొక్క మూలను 16 స్తంభముల చొప్పున మొత్తము 64 స్తంభములును, నలుదిశలయందు ద్వారములును, మధ్యస్తంభములు లేకుండను, భద్రముల విస్తారము 4 భాగముల చొప్పునను, నిర్గమము 1 భాగము చొప్పునను చేయవలయును. క్షుద్రనాసికలను పూర్వము వలెనే ఆలోచించి చేయవలయును. మఱియు నలుచదర ప్రదేశమును 9-9 భాగములుచేసి మధ్య 3 గదులను బారుకువదలి ఒక్కొక్క మూలను 16 స్తంభములను నలుచదరముగానుంచి యిట్లు నలుమూలలకు 64 స్తంభములను కల్పించి మధ్య నవరంగమును 9 గదులుగా రచించి మిగిలిన 72 గదులలో చుట్టును నలువైపుల నాలుగు ద్వారములును భద్రములు విస్తారము 3 భాగములును, నిర్గమము 1 భాగమును చేయవలయును. క్షుద్రనాసికలు 48 రచించవలయును. దాని నడుమ పైకూటము 48 నాసికలును చేయవలయును. మఱియు దానినే మూలల యందలి 16 స్తంభములుకూడ లేకుండజేసి నలువైపుల ద్వారములును, భద్రములు విస్తారము 4 భాగములును, నిర్గమము 1 భాగమును చేయవచ్చును. మఱియు నలుచదరమును 11-11 భాగములుగాజేసి మధ్య 36 స్తంభములను తీసివేసి నవరంగమును అలిందములును, 108 స్తంభములును, దాని వెలుపల చుట్టును 1 భాగము అలిందములును, నలువైపుల భద్రములు 5 భాగముల విస్తారమును, 1 భాగము నిర్గమమును చేయవలయును. నలువైపుల ద్వారములును 64 క్షుద్రనాసికలును, మధ్య నవరంగము పైన శిఖరమును కలశమును రచించవలయును. ఇవి చతురశ్ర మండపములు- ఇక దీర్ఘచతురశ్ర మండపములను చెప్పబోవుచున్నాడు.

(అనుబంధము 34 నుండి 40 వఱకు గల పటములు చూడుడు)

శ్లో॥ త్రిభక్తి విస్తృతంచైవ షడ్భక్త్యాయతం కల్పయేత్ ।
మూలాగ్రే ద్వారసంయుక్తం పార్శ్వేద్వారం నయోజయేత్॥
అథవాహీనాధికాంశేన దైర్ఘ్యమధ్యే ప్రవేశనం ।
అంశేనాకృతా లిందంస్యాత్ చ్ఛేషం ప్రాగుక్తవన్నయేత్॥ 56
చతుర్భాగం విశాలే తుచాష్టాంశ మాయతం తథా ।
ద్వ్యంశషడ్భాగం విస్తారం దైర్ఘ్యం మధ్యేచ మండపమ్ ॥ 57
పరితస్తస్య బాహ్యేతు భాగేనాలిందమిష్యతే ।
యథేష్ట ద్వారసంయుక్తం శేషం ప్రాగుక్తవన్నయేత్ ॥ 58
భూతభాగేన విస్తారం దశభాగం తథాయతం ।
తన్మధ్యే త్ర్యంశవిస్తారం చాష్టాంశాయామ మండపమ్ ॥ 59
తద్బహిః పరితోద్వారమేక భాగేన కారయేత్ ।
శేషం ప్రాగుక్తవత్కుర్యా త్సర్వాలంకార సంయుతమ్ ॥ 60
షడ్భాగేన విశాలంస్యా త్తత్సమేనాధికాయతం ।
ద్విభాగం మధ్యరంగంస్యాత్పరితోద్వ్యంశేన మండపమ్ ॥ 61
శేషంప్రాగుక్త వత్కుర్యాలంకార సంయుతం ।
విస్తారం చాష్టభాగంస్యా దాయామం షోడశాంశకమ్ ॥ 62
తన్మధ్యే వేదభాగేన ద్వాదశాంశేన మండపం ।
పరితఃద్వ్యంశేనాలిందంస్యా చ్ఛేషం పూర్వవదాచరేత్ ॥ 63
నవభాగేన విస్తారం చాష్టదశాంశమాయతం ।
త్రిభాగే ద్వాదశాంశేన మధ్యరంగం ప్రకల్పయేత్ ॥ 64
తద్బాహ్యేఽలింద్రమంశేన పరితోద్వ్యంశేన మండపం ।
అథవాచైక భాగేతు చాంతర్బాహ్యే త్వలిందకమ్ ॥ 65
చతుష్కర్ణే చతుర్వ్యాసం చేష్టదిగ్గత భిత్తికం ।
ఉక్తవద్ ద్వారసంయుక్తం సర్వాలంకార సంయుతమ్ ॥ 66

విశాలేదశభాగేతు వింశత్యంశం తథాయతం ।
పరితోఽలిందం భాగంస్యా ద్విస్తార ద్విగుణాయతమ్॥ 67
మధ్యద్విభాగ విస్తారం తస్యాంతే గద్వ్యంశ మండపం ।
తస్యాంతశ్చైకభాగేన చావృతాలింద మిష్యతే ॥ 68
మధ్యేచద్వ్యంశ విస్తారం ద్వాదశాయతనం తథా ।
ఏవంతు మండపాకారం శేషం ప్రాగుక్తవన్నయేత్ ॥ 69
విస్తారం రుద్రభాగంస్యా ద్విస్తారాద్ ద్విగుణాయతం ।
మధ్యే త్రిభాగవిస్తారం మనుభాగాయతం తథా ॥ 70
కుర్యాన్మండపం బాహ్యేతు సర్వం ప్రాగుక్తవన్నయేత్ ।
విస్తారం రుద్రభాగంస్యా ద్విస్తారాద్ ద్విగుణాయతమ్ ॥ 71
యథామధ్యేఽంకణం కుర్యాత్పంచ భాగేన విస్తృతం ।
పరితోఽంశే మండపం స్యాద్ ద్వ్యంశేనా వృతాలిందకమ్॥ 72
అథవాసప్తాంశ విస్తారం ద్వ్యర్ణవాంశం కర్ణాయతం ॥
తద్బాహ్యేతు ద్విభాగేన మండపం పరితస్తథా ॥ 73

తా॥ దీర్ఘచతురశ్ర మండపముల కొలతలను చెప్పుచున్నాడు. విస్తారము 3 భాగములు పొడవు 6 భాగములు ముందువెనుక ద్వారము లుండవలెను. ప్రక్కలయందు ద్వారములు కూడవు. లేక మధ్య ప్రవేశనము ఒకభాగము అధికముగాగాని, తక్కువగా గాని చేయవచ్చును. దాని చుట్టును అలిందములు 1 భాగము మిగిలినవి పూర్వమువలెనే చేయవచ్చును. విస్తారము 4 భాగములు పొడవు 8 భాగములు నడుమ మండపము విస్తారము 2 భాగములు పొడవు 6 భాగములు చుట్టును అలిందములు 1 భాగము ద్వారము యిష్టప్రకారము చేయవచ్చును. మిగిలినవి పూర్వమువలెనే చేయవలెను. విస్తారము 5 భాగములు పొడవు 10 భాగములు దానినడుమ

విస్తారము 3 భాగములు పొడవు పొడవు 8 భాగములు మండపము దాని వెలుపల చుట్టును 1 భాగము ద్వారము మిగిలినది పూర్వమువలెనే చేయవలయును. విస్తారము 6 భాగములు పొడవు 12 భాగములు దాని మధ్యరంగము విస్తారము 2 భాగములు పొడవు 8 భాగములు చుట్టును 2 భాగములు మండపమును మిగిలిన అన్ని అలంకారములు మునుపటివలెనే చేయవలయును.

విస్తారము 8 భాగములు పొడవు 16 భాగములు దాని నడువు రంగము విస్తారము 4 భాగములు పొడవు 12 భాగములు చుట్టును 2 భాగములు అలిందములును, మిగిలిన పనులు పూర్వమువలెనే రచించవలయును. విస్తారము 9 భాగములు పొడవు 18 భాగములు దాని నడుమ రంగము విస్తారము 3 భాగములు పొడవు 12 భాగములు దానిచుట్టును అలిందములు 1 భాగము, వానిచుట్టును మండపము 2 భాగములు లేక 1 భాగమే చేసి లోపలను వెలుపలను అలిందములను కల్పించవచ్చును. నాలుగు మూలలయందు 4 గృహములును, ఇష్టమువచ్చిన దిశయందు గోడను బెట్టవచ్చును. పై జెప్పబడిన ప్రకారము ద్వారమును కల్పించవలెను. విస్తారము 10 భాగములు పొడవు 20 భాగములు అందు వెలుపలినుండి చుట్టును అలిందములు 1 భాగము విస్తారమును పొడవు 2 భాగములునుచేసి మధ్యరంగము విస్తారము 2 భాగములు పొడవు 12 భాగములు దాని వెలుపల చుట్టును మండపము 2 భాగములును, ఆ మండపమునకు లోపలి దరిని చుట్టును 1 భాగము అలిందములును చేయవలయును. అనగా మధ్యరంగము ప్రక్క అలిందములు తరువాత మండపము ఆతరువాత అలిందములు అని తెలియవలయును.

విస్తారము 11 భాగములు పొడవు 22 భాగములు దాని నడుమ విస్తారము 3 భాగములు పొడవు 14 భాగములు గృహమును

దాని వెలుపల మండపము పై జెప్పిన ప్రకారము భాగములతోను అలిందములతోను రచించవలెను. లేక మధ్యరంగము 5 భాగముల వెడల్పును పొడవు 16 భాగములును చుట్టును 1 భాగము మండపమును దానిచుట్టును అలిందములు 2 భాగములును చేయవచ్చును. మఱియు మధ్యరంగము విస్తారము 7 భాగములును పొడవు 18 భాగములును, దానిచుట్టును మండపము 2 భాగములును చేయవచ్చును.

శ్లో॥ తదేవాం శాధికంస్యాద్ దైర్ఘ్యే ద్విత్రిమండపం ।
ప్రత్యేకం పంచభాగేన సభాకూటంచ మండపమ్ ॥ 74
అథవా మండపాకారం యుక్త్యా తత్రైవ యోజయేత్ ।
చతుర్దిక్షు చతుర్ద్వారం కుర్యాద్భద్రైరలం కృతమ్ ॥ 75
ఏవంతు మండపం ప్రోక్తం తన్నామ ఇహోచ్యతే ।
ప్రథమం హిమజంచైవ తతో నిషధజం భవేత్ ॥ 76
తృతీయం విజయంచైవ చతుర్థం మాల్యజం తథా ।
పంచమం పారియాత్రం చ షష్ఠంస్యా ద్గంధమాదనమ్ ॥ 77
సప్తమం హేమకూటంస్యా న్మండపాఖ్యాని సప్తకం ।
ఏవంహర్మ్య ముఖేకుర్యా ధన్యత్సర్వ మిహోచ్యతే ॥ 78
ఏకాదశం చతురశ్రంస్యా దాయతాశ్ర క్రమేవచ ।
అంశేనా కృతద్వారంస్యా చ్చతుర్ద్వారంచ చతుర్దిశి ॥ 79
ఏకభాగేన భద్రంస్యా త్సర్వాలంకార సంయుతం ।
ఏవంతు మేరుజం ప్రోక్తం పుస్తకార్జన యోగ్యకమ్ ॥ 80
ద్విభక్తి చతురంశేన భద్రస్యా వృతాలిందకమ్ ।
ఏవంతు విజయం ప్రోక్తం వివాహార్థం హిమండపమ్ ॥ 81
దేవతార్థం సముద్దిశ్య పానీయాయచ మండపం ।
పూర్వోక్త విజయంనామ మండపం తత్రకారయేత్ ॥ 82

త్రిభాగంచ చతురశ్రంస్యా చ్చతుర్ద్వార సమన్వితం ।
ద్విరష్టర విపాదంస్యాత్ సిద్ధయాగాది సర్వశః ॥ 83
చతురశ్రం చతుర్భాగం మధ్య స్తంభాన్ పరిత్యజేత్ ।
మధ్యేతు చాంకణం కుర్యా దంశేనావృత మండపమ్ ॥ 84
ఏకద్విత్రి చతుర్ద్వారం కల్పయేత్తు యథేష్టకం ।
ఏకాంశ మావృతద్వారం పార్శ్వద్వారం ప్రకల్పయేత్ ॥ 85
ఏకద్విభాగ విస్తారం నిర్గమం భద్ర సంయుతం ।
తత్పార్శ్వేచ ముఖేవాపి సోపానం తత్ర కల్పయేత్ ॥ 86
ఏవంతు పద్మకం ప్రోక్తం దేవానాం పచనాలయం ।
సించాఖ్య మండపంచాపి పచనాలయ మేవవా ॥ 87
విస్తారం వేదభాగేన పంచభాగం తదాయతం ।
ద్విత్రిభాగాం కణంమధ్యే చాంశేనావృత మండపమ్ ॥ 88
తద్బహిః పరితో దేశే చాంశేనా లిందమిష్యతే ।
త్ర్యంశం తద్భద్ర విస్తారం నిర్గమాంశేన యోజయేత్ ॥ 89
వాతాయన శమాయుక్తం మేకద్వారం ప్రకల్పయేత్ ।
అంగణేచ ప్రపాయుక్తం పద్మాఖ్యం పుష్పమండపమ్ ॥ 90
పంచాంశం చతురశ్రంస్యా త్త్రిభాగాం కణం భవేత్ ।
తద్బహిః పరితోఽంశేన మండపం పరికల్పయేత్ ॥ 91
వాతాయన సమాయుక్తం భద్రం శేషంతు పూర్వవత్ ।
జలసంపూరితార్థంచ భద్రమండప మీరితమ్ ॥ 92
తదేకాం శాధికం వాపి ద్విభాగాధిక మాయతం ।
తద్ధిద్విద్విభాగంవా విస్తారం పంచాంశమాయతమ్ ॥ 93
విస్తారేమండపం కుర్యా దిష్టదిగ్గతభిత్తికం ।
అగ్రే చద్వారమేకంస్యా ద్వ్యక్త్యాచాంగణ సంయుతమ్ ॥ 94

తద్బహిః పరితోంశేన ద్వారం కుర్యాద్విచక్షణః ।
మండపం భద్రసంయుక్తం ధాన్య నిక్షేపయోగ్యకమ్ ॥ 95

తా॥ పై శ్లోకములయందు చెప్పబడిన మండపమునకు 1 భాగము పెంపుచేసి 2-3 మండపములనుగాని, వేఱుగా 5 భాగములు చేసి సభారంగమును మండపమునుగాని కల్పించవచ్చును. లేక మండపరూపమును ఆలోచనతో అందముగా రచించవచ్చును. నలువైపుల ద్వారములును, భద్రములును రచించవలెను. వాని పేర్లను జెప్పుచున్నాడు, 1 హిమజము, 2 నిషధజము, 3 విజయము. (వింధ్యజము) 4. మాల్యజము, 5, పారియాత్రము, 6. గంధమాదనము, 7. హేమకూటము. ఇట్లు హర్మ్యములనుబట్టి తెలియదగును. ఇతర మండపముల వేళ్లు చతురశ్రప్రదేశమును 1 భాగముచేసిగాని, లేక ఆయత చతురశ్రముగాగాని, 1 భాగము చుట్టును ద్వారములు నలువైపులను, భద్రములు ఒక్కొక్క భాగమును చేసిరేని మేరుజ మండపమగును. ఇది గ్రంథాలయమునకు దగినది. 2 భాగములు చేసి దానిలో 4 వ వంతు భద్రమును చుట్టును అలిందములును కల్పించిరేని విజయమండప మగును. ఇది వివాహమునకు దగినది. దేవతలకును, పానీయమునకును దగియుండును. చతురశ్రమును 3 భాగములుచేసి నలువైపుల ద్వారములును 16 గాని 12 గాని స్తంభములుకలది యాగమండపము. చతురశ్రమును 4 భాగములు చేసి మధ్యస్తంభమును తీసివేసి మధ్యగదిని కల్పించి చుట్టును 1 భాగము మండపము చేయబడి 1-2-3-4 ద్వారములుంచి 1-2 భాగములు విస్తారమును నిర్గమమును భద్రములు ఇరువైపులనుగాని యెదురుగాగాని మెట్లును రచింపబడినది పద్మమండపమగును.

ఇది దేవతలకు పాకశాల కుపయోగించును. అభిషేక మండపముగను చెల్లును. విస్తారము 4 భాగములు పొడవు 5 భాగములు

చేసి అందు దాని నడుమ 2-3 భాగములు గదిగానుంచి చుట్టును 1 భాగము మండపముచేసి దాని వెలుపల చుట్టును 1 భాగము అలిందమును, భద్రము యొక్క విస్తారము 3భాగములును, నిర్గమము 1 భాగమును, కిటికీలును, ఒక్కొక్కద్వారముగానిచేసి ముంగిలి యందు చలిపందిరియును, రచింపబడిన పద్మమండపమునే పుష్ప మండపమందురు. చతురశ్రప్రదేశమును 5 భాగములుచేసి అందు 3 భాగములు నడుమ గదినిచేసి దాని చుట్టును 1 భాగము మండపమును, కిటికీలును, భద్రములును మొదలైనవి మునుపటివలెనే రచించవలెను. జలమును నిలువయుంచుటకు భద్ర మండపమును కల్పించవలెను. విస్తారము 6 భాగములును పొడవు 7 భాగములును చేసి దాని నడుమ విస్తారము 4 భాగములు పొడవు 5 భాగములు గర్భమును కల్పించి విస్తారమున మండపమును ఇష్టమువచ్చిన వైపున గోడయును ముందువైపున 1 ద్వారమును ముంగిలియును దాని వెలుపల 1 భాగము చుట్టును ద్వారములును భద్రములును కలది ధాన్యము నుంచదగిన మండపము.

శ్లో॥ షడ్భాగేన విశాలేతు చాయామంచాష్టభాగికం ।
వేదభాగేన విస్తారం షడ్భాగాయమతోఽంకణమ్ ॥ 96
తత్తద్బాహ్యే వృతాంశేన మండపం పరికల్పయేత్ ।
ఆయామేమధ్య సూత్రాత్తు వామేద్వారంతు యోజయేత్ ॥97
కూటాంగం మండపం కుర్యాత్ ప్రచ్ఛాదన మథాపివా ।
శివాఖ్యమండపం ప్రోక్తం ధాన్యకర్షణ యోగ్యకమ్ ॥ 98
పంచసప్తాంశే విస్తారం తస్మాద్ ద్వ్యంశాధి కాయతం ।
మండపం తత్తదంశేన సమాశ్రంవాయ తంతువా ॥ 99
తత్త్రిభాగాం గణంమధ్యే చైకద్వ్యంశేన మండపం ।
వాతాయన సమాయుక్తం చేష్టదిగ్ద్వార సంయుతమ్ ॥ 100

మధ్యే ప్రచ్ఛాదనం కుర్యాత్ ప్రపాంగం వాధి కల్పయేత్ ।
ఏకభాగేన బాహ్యేతు పరితో భ్రమా లిందకమ్ ॥ 101
తత్తద్భాగేన సంయుక్తం మానం ప్రాగుక్తవన్నయేత్ ।
నృత్తాఖ్య మండపం ప్రోక్తం నృత్తశ్రవణ యోగ్యకమ్ ॥ 102
తదేవచేష్ట దిగ్న్యాసం కుర్యాదేవం తుజాలకం ।
వస్త్రాభరణ శస్త్రాది రత్నకోశాది యోగ్యకమ్ ॥ 103
విస్తారం సప్తభాగంస్యా ద్యుథేష్టాంశం తథాయతం ।
సమాశ్రం వాయతాశ్రంతు కుర్యా దాస్థాన మండపమ్ ॥ 104
విస్తారద్విగుణంవాపి త్రిగుణంవా తదాయతం ।
సమాశ్రం సప్తసప్తాంశే త్రిత్రిమధ్యమ రంగకమ్ ॥ 105
పరితశ్చైకైకభాగం ద్వ్యంశైకం మండపంతువా ।
పృష్ఠే తత్పార్శ్వ యోర్మధ్యే ముఖేపాద సమన్వితమ్ ॥ 106
పార్శ్వయోః పృష్ఠతశ్చైవ ద్వారంతు ప్రస్తరంతువా ।
పార్శ్వైకద్వార సంయుక్తం యుక్త్యా సోపాన సంయుతమ్ ॥
చతుర్దిక్షు త్రిభాగైకం విస్తారం భద్రనిర్గమం ।
అథవా ముఖభద్రేతు నిర్గమంతద్ ద్విభాగికమ్ ॥ 108
తదగ్రే వాథపార్శ్వేచ కుర్యాత్ సోపాన భూషణం ।
తస్యమధ్యేచ రంగేతు మాక్తికేన ప్రపాన్వితమ్ ॥ 109
తన్మధ్యాం శాసనాదీనాం తోరణం కల్పవృక్షకం ।
తన్మానం చోక్తవత్కుర్యా త్సర్వాలంకార సంయుతమ్ ॥ 110
మండపే ద్వివిమానంస్యాదేకం వాద్వితలంతువా ।
మండపాగ్రే ప్రపాంగంస్యా ద్యథేష్టాయామం కల్పయేత్ ॥ 111
తస్యమధ్యే త్రిభాగేన విస్తారాయామం చోక్తవద్భవేత్ ।
నాటకాది ప్రచ్ఛాదనం శేషభాగావృతంప్రపా ॥ 112

ప్రపాగ్రీక ద్విభాగంవా కర్ణేలాంగల భిత్తికం ।
తన్మృఖేత్యంశం విస్తారం భద్రమంశేన నిర్గమమ్ ॥ 113
విస్తార సమభద్రంవా సోపానం ముఖపార్శ్వయోః ।
శేషంప్రాగుక్తవత్కుర్యాత్ సర్వాలంకార సంయుతమ్ ॥ 114

తా॥ విస్తారము 6 భాగములు పొడవు 8 భాగములు దాని నడుమ విస్తారము 4 భాగములు పొడవు 6 భాగములు గదిచేసి చుట్టును వెలుపల 1 భాగము మండపమును పొడవు వైపున మధ్య సూత్రమునుండి యెడమప్రక్క ద్వారమును రచించవలెను. మధ్య శిఖరమును చుట్టును చదరముగాగాని, లేక అంతయును చదరముగా గాని కప్పు చేయవచ్చును. దీనిని శివమండప మందురు. వడ్లు మొదలయినవి దంచుటకును ఉపయోగించును. మఱియు విస్తారము 5 భాగములు పొడవు 7 భాగములుగాని, లేక విస్తారమునకంటె 2 భాగము లధికముగాజేసి వేఱొక కొలతతోగానిచేసి సమ చతు రశ్రమునగాని, దీర్ఘచతురశ్రమునగాని, అందులో 3వ వంతు నడుమ విశ్రాంతి స్థలమును, దాని వెలుపల చుట్టును 1 భాగముగాని, 2 భాగములుగాని, మండపమును, ఇష్టమువచ్చిన దిశయందు ద్వార మును కిటికీలను, నడుమ కప్పునుగాని, లేక పందిరిగాగాని రచించ వచ్చును. దానిచుట్టును 1 భాగము అలిందములను రచించవలయును. అలిందములు మొదలయినవి కొలతల ప్రకారము రచించవలెను. ఇది నృత్తమండపము దీనినే ఒకవైపున గదిచేసి కిటికీలును, వస్త్ర ములు, నగలు, రత్నములు, ధనము, ఆయుధములు, నుంచుటకు యోగ్యమైనది.

మఱియు విస్తారము 8 భాగములును, పొడవు తగినంత చేసికొని, చతురశ్రముగాగాని, దీర్ఘచతురశ్రముగాగాని, ఆస్థాన మండపమును రచింపదగును. విస్తారమునకు రెట్టింపుగాగాని లేక 3 వంతులుగాని,

పొడవును చేయవచ్చును. మఱియు విస్తారము 7-7 భాగములు నలుచదరముగాను, అందు 3-3 భాగములు నడుమ రంగమును దాని చుట్టును 1 భాగముగాని లేక 2 భాగములుగాని మండపమును వెనుకను, ప్రక్కలను, ముందును, స్తంభములును, ప్రక్కలను వెనుకను ద్వారముగాని, ప్రస్తరముగాని, చేయవచ్చును. ప్రక్కను ఒక్క ద్వారమును మెట్లతోగూడ రచించవలెను. నలువైపుల భద్రములు విస్తారము 2 భాగములు నిర్గమము 1 భాగము చేయవలెను. లేక ముఖభద్రమున నిర్గమము 2 భాగములు చేయవచ్చును. దాని ముందును, కుడి యెడమలను మెట్లు కల్పించవలయును. దానియొక్క మధ్యరంగమున ముత్యముల పందిరిని రచించవలయును. దాని నడుమ రాజశాసనములనుగాని, లేక ధర్మవాక్యములనుగాని తోరణములుగా రచింపదగును.

కల్పవృక్షమునుగూడ రచించవలయును. మండపమునకు 2 విమానములుగాని 1 విమానముగాని, ఒక్క అంతస్తుగాని రెండంతస్తులుగాని రచించవచ్చును. మండపము ముందు చలిపందిరి యిష్టమైన కొలతలతో జేయదగును. దాని నడుమ 3వ వంతు విస్తారము పొడవునుగల నాటకాది ప్రచ్ఛాదనమునుచేసి మిగిలిన దానినిగూడ అలంకారముగా జేయవలయును. పందిరిముందు 1 భాగముగాని, 2 భాగములుగాని, మూలలయందు నాగలివలె గోడలను రచించవలయును. దాని నడుమ 3వ భాగము విస్తారముతోను 1 భాగము నిర్గమముతోను, భద్రమును రచించవలెను. మిగిలిన పనులన్నియును పూర్వోక్త ప్రకారము అలంకారముగ జేయవలయును.

శ్లో॥ అథవా మండపదేశే ద్విత్రిభాగేన పూర్వవత్ ।
అథవా మండపాద్యేతత్ ప్రపాసంయుక్తం బాహ్యకే ॥ 115

ఏకభాగం ద్విభాగంవా పరితోఽలింద మిష్యతే।
శేషం ప్రాగుక్త వత్కుర్యాత్సర్వాలంకార సంయుతమ్ ॥ 116
అథవా మండపదేశే సప్తాంశం హస్తిపృష్ఠకమ్ ।
త్రిపంచాంశేన విస్తార మాయామం మధ్యరంగకమ్ ॥ 117
తద్బాహ్యే చైకభాగేన మండపం పరితస్తథా ।
తన్ముఖే ద్విత్రిభాగేన భద్రం శేషంతు పూర్వవత్ ॥ 118
అథవా మండపాద్యే తత్ప్రపా సంయుక్తం బాహ్యకే ।
ఏకభాగం ద్విభాగంవా పరితోఽలింద మిష్యతే ॥ 119
శేషంప్రాగుక్త వత్కుర్యా త్సర్వాలంకార సంయుతం ।
శతపాదయుతం వాథ సహస్రాంఘ్రికం మండపమ్ ॥ 120
యుక్త్యా తద్భక్తి మధ్యేన యథేష్టాయత విస్తృతం ।
దేవానాం భూపతీనాంచ కుర్యాదాస్థాన మండపమ్ ॥ 121
అష్టాంశం చతురశ్రంవా నవాంశం చతురశ్రకం ।
తత్తదాయామమేవంచ భూపతీనాంచ యోగ్యకమ్ ॥ 122
మండపం పూర్వవత్కుర్యా ద్దేవస్య చోత్సవార్థకం ।
సాలాఖ్యాతు కృతాఖ్యాస్యాత్కుర్య ద్ధోరంగకే సుధీః ॥
దశాంశం చతురశ్రంస్యాత్ షట్ షడంశంతు మధ్యమే ।
ఊర్ధ్వకూట సమాయుక్తం పరితోద్వ్యంశేన మండపమ్ ॥ 124
మధ్యేద్వారం ద్విభాగంస్యాద్ ద్విపడ్భాగేన చాగ్రతః ।
తద్భాగేన ద్విభాగేన ద్వారపార్శ్వేతు వేదికమ్ ॥ 125
పరితోఽలిందభాగేన వారణం ముఖభద్రకం ।
అథవానేత్ర భద్రంస్య చ్ఛేషం యుక్త్యా ప్రయోజయేత్ ॥
దర్భాఖ్యం మండపం ప్రోక్తం కుంజరస్యాలయం తథా ।
ఏకాదశాంశ విస్తారమాయతం వింశదం శకమ్ ॥ 127

ఏకభాగం ద్విభాగంవా మండపం పరిత స్తథా ।
శేషంతు చాంకణం మధ్యే చేష్టదిగ్ద్వార సంయుతమ్ ॥ 128
అష్టస్త్మైక పంక్తిః స్యా దశ్వానాం నిలయాన్వితమ్ ।
కౌశికం మండపం ప్రోక్తం శేషం యుక్త్యా ప్రయోజయేత్ ॥
ద్వాదశాంశంతు విస్తార మాయామంతద్ ద్వయంభవేత్ ।
అష్టాంశం చాంకణంమధ్యే పరితః ద్వ్యంశేన మండపమ్ ॥ 130
ఇష్టదిగ్ద్వార సంయుక్త మిష్టదగ్గత భిత్తికం ।
కూలధారణ మిత్యుక్తం గోసంఘూవాస యోగ్యకమ్ । 131

తా॥ పై జెప్పబడిన మండపమునందు 2-3 భాగములు పూర్వమునవలెనే చేయవచ్చును. లేక మండపమునుండి చలిపందిరిని వెలుపల రచించవచ్చును. 1-2 భాగములు చుట్టును అలిందములను రచింపదగును మిగిలినవి పూర్వము చెప్పినట్లు రచించవలయును. లేక మండపమును 7 భాగములుచేసి కొంచెము నడుము మెరకగా చదరముగా కప్పును చేయవచ్చును. దాని నడుమ రంగము 3 భాగములుగాని, లేక 5 భాగములుగాని నలుచదరముగాచేసి దాని వెలుపలచుట్టును 1 భాగము మండపమును రచించవలెను. దానిముందు 2-3 భాగములు భద్రమును కల్పించి మిగిలినవి మును పటివలెనే చేయవలయును. లేక మండపమునుండి చలిపందిరిని వెలుపల రచించి 1-2 భాగములు చుట్టును అలిందములను కల్పించవలయును. మిగిలిన పనులన్నియును పూర్వమువలెనే అన్ని అలంకారములతో జేయవలెను. 100 స్తంభములతోగాని, 1000 స్తంభములతోగాని ఆలోచనతో మండపమును రచించి భాగముల ప్రకారము నలుచదరముగాగాని, దీర్ఘచతురశ్రముగాగాని, దేవతలకును రాజులకును ఆస్థాన మండపము రచింపవలయును. నలుచదరపు ప్రదేశమును 8 భాగములుచేసిగాని, లేక 9 భాగములుచేసిగాని, దీర్ఘచతు

రశ్రమముగాగాని, చేయుట రాజులకు దగినది. పై జెప్పిన మండపమునే దేవుని యుత్సవమునకు సాలమునుచేసి కుటియొక్క దిగువ రంగమును కల్పించవచ్చును.

చతురశ్ర ప్రదేశమును 10 భాగములుచేసి దానినడుమ 6 భాగములు నలుచదరముగా రంగమును దానిపై శిఖరము కలశమును, చుట్టును 2 భాగములు మండపమును, మధ్యద్వారము 2 భాగములును, ముందు 2 భాగములు విస్తారమును 6 భాగములు పొడవును గల వేదికనుచేసి ద్వారమునకు రెండువైపుల అలిందములు నలువైపుల 1 భాగము చొప్పున రచించి పైన చదరపు కప్పును ముఖభద్రమును రచించవలెను. లేక నేత్రభద్రములనుకూడ రచించవచ్చును. మిగిలిన పనులు ఆలోచించి యిష్టానుసారముగ రచించవచ్చును. దీనిని దర్భమండప మందురు. ఏనుగు లుండుటకును దగియుండును. చదరపు ప్రదేశమును విస్తారము 11 భాగములును, పొడవు 20 భాగములునుచేసి అంచు 1 భాగము లేక 2 భాగములు చుట్టును మండపము మిగిలినది లోపల గదియును ఏదిశయందయినను ద్వారము ఒక్కొక్క వరుసకు 8 చొప్పున గుజ్జముల నుంచవచ్చును. దీనిని కౌశిక మండప మందురు. మిగిలిన పనులు పూర్వమువలెనే చేయవచ్చును. విస్తారము 12 భాగములు పొడవు 24 భాగములు దాని నడుమ 8 భాగములు గర్భమును చుట్టును 2 భాగములు మండపము ఏదిశయందయినను ద్వారము ఇష్టము వచ్చిన ప్రక్కగోడయును రచించిరేని కూలధారణ మండపమగును. ఇది ఆవులుండుటకు దగినది.

శ్లో॥ త్రయోదశాంశ విస్తారం సమాశ్రంవా యతాశ్రకం ।
విస్తారంచ తదాయామం యుక్త్యాత త్రైవయోజయేత్ ॥ 132
సప్తాంశం విస్తృతంమధ్యే కల్పయేదం కణంభవేత్ ।
తస్యబాహ్యే వృతాంశేన కారయేత్తస్మ సూరకమ్ ॥ 133

విస్తారద్వయ మాయామం శేషం యుక్త్యా ప్రయోజయేత్ ।
తద్బాహ్యే మంటపం కుర్యాద్ ద్వ్యంశేనావృత మేవచ ॥ 134
చతుర్దిక్షు చతుర్ద్వార మిష్టదిగ్గత భిత్తికం ।
తత్తద్బాహ్యావృతాంశేనా లిందం కుర్యాత్తు తత్సమమ్ ॥ 135
పంచాంశం ద్వ్యంశవిస్తారం నిర్గమం భద్రసంయుతం ।
సుఖాంగాఖ్య మితిప్రోక్తం సత్రయోగ్యంతు మండపమ్ ॥ 136
మన్వంశే సమవిస్తారం తత్సమాధిక మాయతం ।
దక్షిణే పశ్చిమేవాపి చతుర్దశాంశ మాయతమ్ ॥ 137
తదంశేనా వృతాలిందం త్ర్యంశం మధ్యేతు మండపం ।
మధ్యస్తంభంతు సర్వేషాం త్యక్త్వాద్వారం ప్రయోజయేత్ ॥
తన్ముఖే ద్వ్యంశ మావృతం ద్వారంశేషం యథాంకణం ।
పరితశ్చైక భాగేన తద్బాహ్యే భ్రమాలిందకమ్ ॥ 139
ఏవంతు సౌఖ్యకం ప్రోక్తం శేషం ప్రాగుక్త వన్నయేత్ ।
నదీతీరేతటాకేవా సింధుతీరే ప్రకల్పయేత్ ॥ 140
సర్వాసాం దేవతానాంచ తీర్థయోగ్యం ప్రకీర్తితం ।
పంచదశాంశ విస్తార మేవంత్రిం శాయతం తథా ॥ 141
అథవాచతురశ్రంస్యా చతుర్ద్వార సమన్వితం ।
తన్మధ్యే పంచభాగేన సప్తభాగాం కణం తథా ॥ 142
తద్బాహ్యే పరితోంశేన కుర్యాదంతరా లిందకం ।
ఖలూరికాపి తద్బాహ్యే త్రిత్రిభాగేన మంటపమ్ ॥ 143
తస్యబాహ్యే వృతాలింద మేకభాగేన కారయేత్ ।
తద్బహిశ్చావృతాంశేన కారయేద్ భ్రమాలిందకమ్ ॥ 144
పంచాంశం ద్వ్యంశ విస్తారం నిర్గమం భద్రసంయుతం ।
మండపస్య బహిర్దేశే కారయేత్పరితః ప్రపాం ॥ 145

మండపే చోర్ధ్వకూటంస్యా న్మాలికాకృతిం విన్యసేత్ ।
తత్తద్వారణ సంయుక్తం వాతాయన సమన్వితమ్ ॥ 146
కర్ణేకర్కరీ భద్రంస్యా ద్యుక్త్యాతత్రైవ యోజయేత్ ।
సర్వాలంకార సంయుక్తం మాలికాఖ్యంతు మండపమ్ ॥ 147
మధ్యకర్ణేజలం పూర్ణం జలంపుష్పై రలంకృతం ।
ఏవం వసంతయోగ్యంస్యాద్ దేవానాం క్షత్రియాదీనాం ॥ 148

తా॥ విస్తారము 13 భాగములు నలుచదరము సమానముగా గాని, లేక దీర్ఘచతురశ్రమముగాగానిచేసి దాని నడుమ 7 భాగములు గదివి కల్పించి దానిచుట్టును 1 భాగము కప్పును దాని వెలుపల చుట్టును 2 భాగములు మండపమును నలువైపుల 4 వాకిళ్లును ఒక వైపున గోడయును వానివెలుపల 1 భాగము చొప్పున చుట్టును అలిందములును, భద్రములు విస్తారము 5 భాగములును, నిర్గమము 2 భాగములును చేసినచో సుఖాంగ మండప మగును. దీనిని సత్రమున నుపయోగింతురు. విస్తారము 14 భాగములును నలుచదరము సమానముగాగాని, లేక పొడవును 28 భాగములు చేసిగాని, దక్షిణమునగాని, పడమరగాని, 14 భాగములు పొడవున 1 భాగము చుట్టు అలిందములుచేసి, నడుమ 3 భాగములు మండపము చేయవలెను. దానికి మధ్య స్తంభము లేకుండ రచించవలెను. ద్వారమును 2 భాగములు చేయవలెను. మిగిలినది లోపల రంగము చేయవలయును. దీనిని సౌఖ్యక మండప మందురు. మిగిలిన పనులన్నియును పూర్వమువలెనే చేయవలయును. నదియొడ్డునను చెఱువులోను, సముద్రపు టొడ్డునను, రచించుట ముఖ్యము.

ఇది సమస్త దేవతలకును తీర్థయోగ్యమైనది. విస్తారమును 15 భాగములుచేసి పొడవు 30 భాగములు చేసిగాని, లేక నలుచదరము సమానముగాచేసిగాని, 4 ద్వారములును, దాని నడుమ

5 భాగములు లేక 7 భాగములు గది కల్పించి దాని వెలుపల చుట్టును 1 భాగము అలిందములును, దాని వెలుపల సాముకూటము నకు 3-3 భాగములు మండపమును, మరల దానిచుట్టును 1 భాగము అలిందమును, దానివెలుపల 1భాగము భ్రమాలిందములును, 5భాగ ముల విస్తారమును, 2 భాగముల నిర్గమములునుగల భద్రములును, మండపమునకు వెలుపల చుట్టును చలి పందిరియును, మండపముల పైన శిఖరమును, కలశమును, తోరణమువలె వగుసలుగాను, లేక కొంచెము నడుము మెరకగా కప్పును, ప్రక్కల కిటికీలును, మూలల యందు గట్టిభద్రములును సమస్తమైన యలంకారములతో జేసిరేని మాలికా మండప మగును. మధ్య కర్ణమున నిండుగా జలమును, పుష్పములును, సర్వకాలములయం దుండెనేని దేవతలకును, రాజుల కును వసంతసేవ కుపయోగించును.

శ్లో॥ షోడశాంశేన విస్తారం ద్వాత్రింశా యామకం తథా ।
పూర్వవచ్చతురశ్రంస్యా న్మధ్యస్తంభాన్ పరిత్యజేత్ ॥ 149
మధ్యాం కణంతు షడ్భాగం శేషం ప్రాగుక్తవన్నయేత్ ।
తదేవ షోడశాంశేన మధ్యరంగం షడంశకమ్ ॥ 150
తద్బాహ్యేవృతాంశేన చాంతరాలింద మిష్యతే ।
తద్బహిశ్చాపిత్ర్యంశేన మండపం పరితస్తథా ॥ 151
తద్బాహ్యే వృతాంశేనా లిందం కుర్యాద్ విచక్షణః ।
తత్పురేపృష్ఠ పార్శ్వేతు భ్రమాలిందం శివాంశకమ్ ॥ 152
తచ్చతుష్కర్ణదేశేతు కర్కరీం చాష్టభద్రకమ్ ।
ఊర్ధ్వకూట సమాయుక్తం ద్వారభద్రైస్తు సంయుతమ్ ॥ 153
తన్ముఖే పురతః పార్శ్వే ద్వార సంయుక్తభద్రకం ।
తత్కర్ణేచద్వయోర్భద్రం చతుర్థం కర్కరీకృతమ్ ॥ 154

కర్కరీభద్ర సంయుక్తం మండపస్య విశాలకం ।
ఏకద్విత్ర్యేకభాగంస్యా త్కర్కరీ భద్రనిర్గమమ్ 155
మధ్యేభద్రేతు విస్తారం పంచషడ్భాగమేవవా ।
తత్సమం నిర్గమంవాపి ద్విత్రివేదాంశ మేవవా ॥ 156
భద్రం తత్పురపార్శ్వేతు కుర్యాద్ ద్వారం తదంశకం ।
ఏకద్విత్రి తలంమధ్యే మండపే చోర్ధ్వకూటకమ్ ॥ 157
ఏవంతు మాలికాకారం శేషం ప్రాగుక్త వన్నయేత్ ।
సర్వాలంకార సంయుక్తం మాలాకృతి మితీరితమ్ ॥ 158
దేవతాలోకన యోగ్యం దేవదేవస్య మండపం ।
ఏవంతు మండపం ప్రోక్తం దేవభూసుర భూపతేః ॥ 159
విస్తారే చైకభక్త్యావా యథేష్టాయామ వర్ధనాత్ ।
సర్వేషాం మండపానాంతు పూర్వోక్తానాం తదాయతమ్ ॥ 160
ద్విభక్తి విస్తృతం తస్మా దేకభాగాధి కాయతమ్ ।
మధ్యైకభక్తివాసంస్యా త్పురః పార్శ్వేచ మండపమ్ ॥ 161
ఆత్మార్థం విప్రసద్మేతు యజనార్థ ముదీరితం ।
తదేవ ద్విగుణాయామం మధ్యరంగం ద్విభాగతః ॥ 162
తత్పార్శ్వే చైకభాగేన వాసం కుర్యా ద్విచక్షణః ।
తత్పురేఽలిందమేకాంశ మథవా నిర్వాస మండపమ్ ॥ 163
అథవా వంశమూలేతు చైకద్వ్యంశేన వాసకం ।
ఏవంతు విప్రయోగ్యంస్యా ద్ధనదాఖ్యంతు మండపమ్ ॥ 164

తా॥ విస్తారము 16 భాగములు పొడవు 32 భాగములుగాని లేక నలుచదరము సమానముగాగానిచేసి మధ్య స్తంభములు లేకుండచేసి 6 భాగములు గదిగా నిర్ణయించవలయును. లేక దానినే రంగముగాను జేయవచ్చును. దాని వెలుపల చుట్టును 1 భాగము అలిందములును, అలిందముల చుట్టును 3 భాగములు మండపముగ

మరల వెలుపల చుట్టును అలింపములు 1 భాగమును చేయవలయును. నలువైపుల భ్రమాలిందములను రచించవలెను. దానికి నలుమూలల యందు 8 గట్టి భద్రములను రచించవలయును. పైన శిఖరము కలశము నుండవలయును. ద్వారములును, భద్రములును, రచించ వలెను దానియొక్క ముందును, ప్రక్కలను, ద్వారముతో గూడిన భద్రములును ఆ రెండు కర్ణములయందును గట్టిభద్రములు 4 రచించ వలెను. గట్టి భద్రములతో గూడిన మండపముయొక్క విస్తారము 1-2-3 భాగములు చేయవచ్చును. దాని నడుమ భద్రము 5-6 భాగములు విస్తారమును నిర్గమము అంతేకాని లేక 2-3-4 భాగములు గాని చేయవచ్చును. ముందును ప్రక్కలను భద్రముతో గూడిన ద్వారము మధ్యరంగము 1-2-3 అంతస్తులుగానిచేసి పైన శిఖరమును కల్పించిన యెడల పై కూటములు వరుసగానున్న యెడల మాలాకృతి మండపమగును. దేవతలను చూచుటకు తగినది దేవ దేవ మండపము. ఇట్లు దేవతలకును, బ్రాహ్మణులకును, క్షత్రియులకును ఒప్పును. విస్తారమును 1 భాగముచేసి యిష్టప్రకారము సమాన చతురశ్రముగాని, దీర్ఘచతురశ్రముగాని చేసిగాని, విస్తారము 2 భాగములు పొడవు 3 భాగములు చేసిగాని, దానినడుమ 1 భాగము గదియును, దానిముందును ఇరువైపులను, మండపమును చేయవచ్చును. దీనిని ఆత్మార్థమండప మందురు. విప్రులకు యజనార్థము దీనిని రచింతురు. దీనినే పొడవు రెట్టింపుచేసి మధ్యరంగము 2 భాగములుచేసి దాని ప్రక్కను 1 భాగము గదియును దాని ముందు 1 భాగము అలిందము లేక అంతయును మండపముగాగాని, లేక వంశమూలమున 1-2 భాగములు గృహముగాగాని చేసిరేని విప్రయోగ్యముగానుండి ధనద మండప మనిపించుకొనును.

శ్లో॥ త్రిభక్తివిస్తృతం తస్మాదేకభాగాధికాయతం ।
తదర్ధేన ద్విభాగేన మండపం చోన్నతాసనమ్ ॥ 165

పృష్ఠేచపార్శ్వయోః కుడ్యం పురతో పాదసంయుతం ।
తన్ముఖే ద్విత్రిభాగేన నిర్గమంచాసనాన్వితమ్ ॥ 166
కర్ణేలాంగలభిత్తిః స్యాద్ భ్రమణావృత బాహ్యకే ।
ఏకాంశేనాంఘ్రి సంయుక్తం పురః పార్శ్వేచ భద్రకమ్ ॥ 167
ధనాధిప మండపం స్యాద్ దేవభూసుర యోగ్యకం ।
తదేవమధ్యాంకణ సంయుక్తం క్షారార్థం ద్విజభూపతేః ॥ 168
తదేవభాగాధికాయామ మిష్టదిగ్గతభిత్తికం ।
భూపతీనాంచ వైశ్యానాం కోశరత్నాది యోగ్యకమ్ ॥ 169
తదేవాధికమాయామం మధ్యభాగాం కణం భవేత్ ।
ఏకభాగావృతావాస మిష్టదిగ్గతభిత్తికమ్ ॥ 170
ఆయామ మధ్యసూత్రస్య వామేద్వారం ప్రకల్పయేత్ ॥
కర్ణేకర్కరీభద్రంస్యాద్ భ్రమణాంశేన పూర్వవత్ ॥ 171
శూద్రాణామితిచ ప్రోక్త మథధాన్యాగార నామకం ।
విస్తారం చతురంశంస్యా దేకభాగాధి కాయతమ్ ॥ 172
పంచాంశే ద్వ్యంశకేనైవ మండపం పరికల్పయేత్ ।
తన్ముఖైక త్రిభాగేన నిర్గమం భద్ర విస్తృతమ్ ॥ 173
తత్పురేతు ద్విపార్శ్వేవా ప్రపాంచైకేన కారయేత్ ।
భద్రాంతం కుడ్య సంయుక్తం మండపం పృష్ఠపార్శ్వయోః ॥
దేవతానాంచ మానార్థం భూషణాఖ్యంతు మండపం ।
తదేకాంశాధి కాయామం విస్తారం పూర్వవద్భవేత్ ॥ 175
తద్భాగ ద్విభాగేన విస్తారం మండపం భవేత్ ।
ద్విత్రిభాగాం కణంపూర్వే చైకభాగం ఖళూరకమ్ ॥ 176
మండపస్య వినాద్రైక్షేశ్య ద్వారం కుర్యా ద్విచక్షణః ।
భూషణాఖ్యంచ విప్రాణాం యోగ్యం పుంసవనార్థకమ్ ॥ 177

తదేవాంశాధి కాయామం విస్తారం పూర్వవద్భవేత్ ।
త్రిచతుర్భాగమాయామం మండపం పరితోభవేత్ ॥ 178
ఏవం సుభూషణాఖ్యంస్యాచ్ఛేషం పూర్వోక్తవన్నయేత్ ।
భూసురాది త్రయాణాం చోపనయనాది యోగ్యకమ్ ॥ 179
వేదాష్టాంశ విస్తార మాయామం మండపం భవేత్ ।
వంశేమూలాగ్రయోః సంధిం ద్విచతుర్భాగేన కారయేత్ ॥ 180
ఏకద్వివాసయోర్మధ్యే ద్విచతుర్భాగాంకణం భవేత్ ।
ఏతత్పార్శ్వద్వయం చైకం చతుర్భాగేన ద్వారకమ్ ॥ 181
దైర్ఘ్యేచ మధ్యసూత్రస్య వామేద్వారం ప్రకల్పయేత్ ।
అథవాతస్య మధ్యేతు కుడ్యవ్యాసం విభాజితే ॥ 182
కులాభద్వార సంయుక్తం శేషంయుక్త్యా ప్రయోజయేత్ ।
ఏవంతు భూషణాఖ్యంస్యాచ్ఛూద్రాణాం పచనాలయమ్ ॥ 183

తా॥ విస్తారము 3 భాగములును, పొడవు 4 భాగములును, విస్తారములో సగమును పొడవులో సగమును ఎత్తయిన పీఠముతో మండపమును వెనుకను ప్రక్కలను గోడలును, ముందువైపున స్తంభములును, దానిముందు 2 భాగములు వెడల్పును 3 భాగములు పొడవును నిర్గమము పీఠముతోగూడచేసి మూలలయందు నాగలి వలె గోడను రచించి, చుట్టును 1 భాగము విశ్రాంతిస్థలము స్తంభ ములతోను, ముందును ఇరువైపులను భద్రములును చేసి రేని ధనాధిప మండపమగును. ఇది దేవతలకును బ్రాహ్మణులకును తగినది. దీనికే మధ్యగది కల్పించిన యెడల వ్రతమునకు దగిన మండప మందురు. దీనినే పొడవు 1 భాగము మిగులుగాజేసి యేదోయొకవైపున గోడ గట్టినయెడల రాజులకును వైశ్యులకును ధనము రత్నములు నిలువ యుంచుటకు దగియుండును.

పై జెప్పినదానినే మధ్యగది కల్పించి 1 భాగము యిల్లుగా జేసి యొకవైపున గోడను రచించి పొడవులో మధ్యసూత్రము యొక్క యెడమప్రక్క ద్వారమునుంచి మూలయందు గట్టిభద్రమును రచించి దాని చుట్టును విశ్రాంతి స్థలమును 1 భాగము చేసిన యెడల శూద్రులకు యోగ్యమైన ధాన్యమందిరమగును. విస్తారము 4 భాగములుచేసి పొడవు 5 భాగములుచేసి అందులో సగము వెడల్పున అదే పొడవున మండపమును రచించి దానిముందు 3 భాగములు విస్తారము నిర్గమముతో భద్రమును, ఆ భద్రమునకు ముందును, ఇరువైపులను, పందిరిని వేయవలయును, భద్రమువఱకు గోడలను రచించి వెనుకను రెండుప్రక్కలను మండపమును రచించిన యెడల దేవతలకును మౌనవ్రతమునకును దగిన భూషణమండపమగును. దీనినే 1 భాగము పొడవు అధికముచేసి అదే వెడల్పునుంచి అందు 2 భాగముల వెడల్పున బారుకు మండపమును, తూర్పున 2 భాగముల వెడల్పునను, 3 భాగముల పొడవునను, గది చేసి 1 భాగము విశ్రాంతి స్థలమును చేయవలయును. మండపమునకు గాక విశ్రాంతి స్థలమునందు ద్వారమును రచించిన యెడల విప్రయోగ్యమును పుంసవనయోగ్యమును అయిన భూషణ మండపమగును.

పైదానినే అదే విస్తారమును పొడవు 1 భాగ మధికమునుచేసి 3-4 భాగములు పొడవున మండపము చుట్టును రచించిన యెడల సుభూషణ మండపమగును. దీనియందు బ్రహ్మ క్షత్రియ వైశ్య జాతులు ఉపనయనము చేయుటకు దగియుండును. విస్తారము 4 భాగములు పొడవు 8 భాగములుచేసి నెన్నుగాడియొక్క మొదలునను, చివరను, అతుకులు 2-4 భాగములు చేయవలయును. 1-2 యిండ్లనడుమ విస్తారము 2 భాగములును, పొడవు 4 భాగములును గదిని కల్పించవలెను. దీనియొక్క ప్రక్కలను 1 గాని లేక 2 గాని ద్వార

ములను 4 భాగములు చేయవలెను. ఆద్వారము పొడవున మధ్య సూత్రమునుండి యెడమ వైపున నుండవలయును. లేక నడుమను గోడయొక్క విస్తారమును భాగములుచేసి ఆప్రకారము ద్వారమును నిలుపదగును. ఏకకులమువారికి దగినగోలతతో వారికి ఆమండపము నకు ద్వారమును రచించవలయును. ఇది భూషణ మండపము. శూద్రులకు పాకశాలగా నుపయోగించును.

శ్లో॥ తద్ ద్విభాగేన విస్తారే తస్మాద్ ద్వ్యంశాధికాయతం ।
పంచాంశేన ద్విభాగేన పూర్వవద్ ద్వార సంయుతమ్ ॥ 184
వాసమేక ద్వయోర్మధ్యే త్రిత్రిభాగాం కణంభవేత్ ।
ఏకాంశేన త్రిభాగేన పార్శ్వేద్వారం ప్రయోజయేత్ ॥ 185
తద్బాహ్యే పరితోఽలింద మేకభాగేన కారయేత్ ।
దైర్ఘ్యే మధ్యమభాగేతు ద్వారం సంకల్పయేత్సుధీః ॥ 186
స్యాదేకద్విత్రిభాగేన నిర్గమం భద్రవిస్తృతం ।
ఏవంతు మండపం హర్మ్యం దేవభూసుర భూపతేః ॥ 187
పచనార్థ మితిప్రోక్తం నానాతలద్వారైరపి ।
తస్మాద్ ద్వ్యధికాయామం విస్తారం పూర్వవద్భవేత్ ॥ 188
తన్మధ్యేఽం కణమంశేన పరితోద్వ్యంశేన మండపం ।
తస్యాంతం చైకభాగేన పరితస్తు ఖళూరికా ॥ 189
తద్దైర్ఘ్యే మధ్యసూత్రస్య వామేద్వారం ప్రకల్పయేత్ ।
శేషంతు పూర్వవత్కుర్యా న్మండపం హర్మ్యమీరితమ్ ॥ 190
సర్వేషామపి వర్ణానాం బాలాలోకన యోగ్యకం ।
షడ్భాగవిస్తృతంచైవ సప్తభాగాయతం తథా ॥ 191
తద్భాగేన ద్విత్రిభాగేన మధ్యరంగం ప్రకల్పయేత్ ।
మధ్యస్తంభాన్ పరిత్యజ్య పరితః ద్వ్యంశేన మండపమ్ ॥ 192

తద్బాహ్యేచావృతాంశేన భూవృతాలింద సంయుతం ।
చతుర్దిక్షు చతుర్ద్వారం కర్ణేలాంగల భిత్తికమ్ ॥ 193
చతుర్దిగ్భద్ర సంయుక్త మేకద్విత్రిక భాగికం ।
దేవానాంచ విలాసార్థం శృంగారాఖ్యంతు మండపమ్ ॥ 194
ఆయామం చాష్టభాగేన విస్తారం పూర్వవద్భవేత్ ।
తద్భాగే ద్విచతుర్భాగం తన్మధ్యే చాంకణం భవేత్ ॥ 195
తద్బహిశ్చా వృతాంశేన కుర్యాత్తత్ర దలిందకం ।
తద్బహిశ్చావృతాంశేన మండపం ద్వ్యంశమేవవా ॥ 196
చతుర్వాసం చతుష్కర్ణే ద్విభాగేన యోజయేత్ ।
తద్బహిశ్చైకభాగేన పరితో వారమిష్యతే ॥ 197
తద్దైర్ఘ్యే మధ్యసూత్రస్య వామేద్వారంతు పూర్వవత్ ।
వంశమూలాగ్రయోః సర్వం కర్కరీకృత నేత్రకమ్ ॥ 198
ద్వ్యంశైకం తత్రవిస్తారం నిర్గమం భద్రసంయుతం ।
సర్వేషామపి వర్ణానాం సుగతం సర్వదేశికమ్ ॥ 199

తా॥ (184వ శ్లోకమున అర్థము చక్కగాలేదు). 3 భాగములు నలుచదరముగా గదిని రచించి దాని ప్రక్క 1-3 భాగములతో ద్వారమును రచించవలయును. దాని వెలుపల చుట్టును అలిందములు 1 భాగము చేయవలయును. నిడివియందు మధ్యమ భాగమున ద్వారమును భద్రముయొక్క నిర్గమము 1-2-3 భాగము లుంచవచ్చును. ఇట్లు మండపమును హర్మ్యమును రచించిరేని దేవతలకును బ్రాహ్మణులకును క్షత్రియులకును యోగ్యమగును. ఇది పచనార్థ మండపము. అనేకమైన అంతస్తులును ద్వారములును కల్పించవచ్చును, పై జెప్పిన దానికంటె పొడవు 2 భాగములు పెంచి విస్తారమును పెంచకుండ దానినడుమగది 1 భాగమును దాని చుట్టును

మండపము 2 భాగములు దాని వెలుపల చుట్టును విశాల ప్రదేశ మును, దానిని దివియందు మధ్య సూత్రమున కెడమప్రక్క ద్వార మును రచించవలయును. మిగిలినపనులు పూర్వమువలెనే చేయ వలయును. దీనిని హార్మ్యమండపమందురు. ఇది అన్నికులముల వారికిని శిశువులను చూచుటకు దగినది. విస్తారము 6 భాగములు పొడవు 7 భాగములుచేసి అందు 2-3 భాగములు మధ్యరంగమును కల్పించి దానికి మధ్య స్తంభములు లేకుండచేసి చుట్టును 2 భాగ ములు మండపముచేసి దానివెలుపల చుట్టును 1 భాగము అలింద మును నలువైపుల 4 ద్వారములును మూలలయందు లాంగలమువలె ఖండపు గోడలును నలుదెసల భద్రములును వాని నిర్గమము 1-2-3 భాగములు చేయవచ్చును.

ఇది దేవతలకు విలాసార్థముగా నుపయోగింపబడు శృంగార మండపము మఱియు విస్తారము 8 భాగములును పొడవు 10 భాగ ములునుచేసి దానియందు విస్తారము 2 భాగములు పొడవు 4 భాగములు గదినిచేసి దానివెలుపల చుట్టును 1 భాగము అలిందము లును అలిందముల వెలుపల 2 భాగములు చుట్టును మండపమును నలుమూలలయందు 4 యిండ్లు 2-2 భాగముల చొప్పునను దాని వెలుపల 1 భాగమును చుట్టును వాకిండ్లును దానియొక్క నిడుపు నందు మధ్యసూత్రమునకు ఎడమవైపున ద్వారమును వెన్నుగాడి యొక్క మొదలునను, చివరను, అంతయును గట్టిగా నేత్రకమును రచించవలెను. నేత్రమునందు విస్తారము 2 భాగములు నిర్గమము 1 భాగముగల భద్రమును రచించవలయును. దీనిని సుగత మండప మందురు. అన్నికులముల వారికిని అంతటను ఉపయోగించును.

శ్లో॥ చతుర్భాగాధి కాయామం విస్తారం పూర్వవద్భవేత్ ।
లలాటేద్వ్యంశ విస్తారం రసభాగ తదాయతమ్ ॥ 200

పురతః పృష్ఠభాగేతు చైకభాగమ లిందకం ।
వంశమూలేతు వాసంస్యా త్కుర్యాత్తు ద్విత్రిభాగతః ॥ 201
శేషం ప్రాగుక్తవత్సర్వం యుక్త్వా తత్రైవ యోజయేత్ ।
తదేవాగ్రే చతుర్భాగం చోక్తవన్మండపంతువా ॥ 202
కేచిత్ షడష్టభాగేన విస్తారాయామం కల్పయేత్ ।
లలాటే ద్వ్యంశషడ్భాగం విస్తృతాయతం మండపమ్ ॥ 203
ఏకాంశేతత్పురేఽలిందం ద్విత్రిభాగాంకణం భవేత్ ।
తత్పురేపార్శ్వయోః శేషం మహాద్వారంతు కల్పయేత్ ॥ 204
లలాటే తుద్వ్యంశ విస్తారాయామం మండపం భవేత్ ।
ఏవంతు ప్రాగతం ప్రోక్తం సర్వకర్మ సుఖావహమ్ ॥ 205
సప్తాంశం క్రమవిస్తారం నవభాగం తదాయతం ।
త్ర్యంశేన పంచభాగేన చాంకణం విస్తృతాయతమ్ ॥ 206
తద్బహిశ్చ ద్విభాగేన పరితో మండపం భవేత్ ।
అథవాత త్రిభాగేన లలాటే మండపం భవేత్ ॥ 207
తత్పురేచ ద్విభాగేన యుక్త్వా మధ్యేతు చాంకణం ।
తత్పురైచ ద్విపార్శ్వేతు చైకభాగేనా లిందకమ్ ॥ 208
తద్బహిశ్చా వృతాంశేన మండపానాంత్వ లిందకం ।
మధ్యేద్వారంతు సంకల్ప్య విస్తారే చాథదైవతమ్ ॥ 209
తద్ద్విత్ర్యంశేన విస్తారం నిర్గమం భద్రసంయుతం ।
ఏకం వాథద్వయం వాపి ద్వారం చత్రయమేవచ ॥ 210
తద్బహిశ్చా వృతాంశేన కుర్యాదావృతా లిందకం ।
సర్వాలంకార సంయుక్తం కర్ణహర్మ్యాది మండితమ్ ॥ 211
ద్రోణాఖ్యమండపం ప్రోక్తం దేవారామం ప్రకల్పయేత్ ।
అథవా భూపతీనాంతు చాత్మార్థం యజనార్థకమ్ ॥ 212

విప్రాణాం శుభకర్మార్థం సంధ్యాయోగ్యక మండపం ।
అథవా తపస్వినాంచ మఠంవా నాటకాహితమ్ ॥ 213
ఏకభాగాధి కాయామం విస్తారం పూర్వవత్ క్రమాత్ ।
షట్ త్రిభాగం కణంమధ్యే పరితోద్వ్యంశేన మండపమ్ ॥ 214
లలాటే మండపే పూర్వే చైకభాగేనా లిందకం ।
ఏవంతు భూపహర్మ్యేతు మల్లయోగ్యంతు కారయేత్ ॥ 215

తా॥ విస్తారము 6 భాగములును, పొడవు 12 భాగములు చేసి లలాటమున విస్తారము 2 భాగములును, పొడవు 6 భాగములును చేసి, ముందువైపునను, వెనుకవైపునను, అలిందము 1 భాగము చొప్పున చేసి, వంశమూలమున గృహము 2-3 భాగములు చేసి మిగిలినది చుట్టును మండపము పూర్వము చెప్పబడినట్లు చేయవచ్చును. లేక దీనినే ముందు 4 భాగములు మండపము చేయవచ్చును. కొందఱు 6 భాగముల విస్తారము 8 భాగములు నిడివి చేయుదురు. లలాటమున విస్తారము 2 భాగములు పొడవు 6 భాగములు మండపమును కల్పించి దాని ముందు 1 భాగము అలిందమును, విస్తారము 2 భాగములు దీర్ఘము 3 భాగములతో గదిని కల్పించి మిగిలిన ప్రదేశమును ముందువైపునను ఇరుప్రక్కలను గొప్ప ద్వారములను రచించి లలాటమున 2 భాగముల విస్తారముతోను అదియే పొడవుతోను మండపమును రచించవలయును. దీనిని ప్రాగత మండపమందురు. అన్ని కార్యములకును దీని నుపయోగించుకొనవచ్చును. విస్తారము 7 భాగములును పొడవు 9 భాగములును చేసి దానినడుమ గది విస్తారము 3 భాగములు నిడివి 5 భాగములు చేసి దాని వెలుపల 2 భాగములు చుట్టును మండపమును లేక అందులో 3వ వంతు మండపమును రచించవలయును. ఆ మండపము ముందు 2 భాగములు నడుమ గదియును, ఆగది ముందును దాని కిరుప్రక్కలను,

అలిందములు 1 భాగము చొప్పునను, దాని చుట్టును వెలుపల 1 భాగము మండపమున కలిందములును, మధ్య ద్వారమును రచించ వలయును. ఆ ద్వారమున 2-3 భాగములు నిర్గమముతో భద్రమును 1-2-3 ద్వారములను గూడ రచించవచ్చును.

వాని వెలుపల చుట్టును అలిందములను కల్పించవచ్చును. మూలలయందు హర్మ్యములను రచించి సమస్తమైన యలంకార ములు రచించిరేని ద్రోణమండప మగును. దేవతలకు తోటను కల్పించవలయును. లేక రాజులకుగాని, విప్రులకు యజ్ఞముకొఱకు గాని, శుభకార్యములకునుగాని, సంధ్య వార్చుకొనువారలకుగాని తగి యుండును. తపస్సుచేయు వారలకును, మఠముగాగాని, నాట్యముచేయుటకుగాని, తగియుండును. దీనివే విస్తారము 1 భాగము పొడవు 1 భాగము ఎక్కువచేసి దాని నడుమ గది విస్తారము 3 భాగ ములును నిడివి 6 భాగములునుచేసి దానిచుట్టును 2 భాగములు మండపమును రచించి తూర్పున లలాట మండపమున 1 భాగము అలిందమును ఇట్లు రాజభవనమున రచించవలయును. జెట్టీలు సాము చేయుట కుపయోగించును.

శ్లో॥ తస్మాద్ ద్వ్యంశాధి కాయామం విస్తారం సప్తభాగికం ।
పంచాంశం చైవపంక్త్యంశం తన్మధ్యే చాంకణం భవేత్ ॥ 216
తద్బాహ్యే పరితః కుర్యా దేకభాగేన వేదికాం ।
ఏతద్ ద్రోణంచ భూపానా మాయుధాభ్యాస మండపమ్॥ 217
పంచదశాంశకం దైర్ఘ్యం నేత్రత్రిభాగ మండపం ।
తత్పురేఽలింద మేకాంశం నవాంశేన యుతాంకణమ్ ॥ 218
తత్పార్శ్వపురత శ్చైవ యుగాంశేన ఘూరికా ।
ద్రోణాఖ్య మండపం చైవ మేషయుద్ధార్థ యోగ్యకమ్ ॥ 219
అష్టాష్టాంశ విస్తారమాయామంచ తత్రకల్పయేత్ ।
తన్మధ్యే ద్విద్విభాగేన కల్పయేత్ వివృతాంకణమ్ ॥ 220

తద్బహిశ్చా వృతాంశేన కుర్యా చ్చైకాఖలూరికా ।
తద్బహిశ్చ ద్వయాంశేన మండపం పరిత స్తథా ॥ 221
కర్ణేచ ద్విద్విభాగేన కుర్యా ద్వాసంతుష్టయం ।
తద్బహిశ్చా వృతాంశేన సంయుక్తం భద్రాలిందకమ్ ॥ 222
మధ్యసూత్రస్య వామేతు ద్వారం కుర్యా ద్విచక్షణః ।
తద్బహిశ్చా వృతాంశేన కుర్యాచ్చైకం ఖలూరికమ్ ॥ 223
చతుష్కర్ణేఽష్ట నేత్రంస్యాద్ భద్రయుక్ కర్కరీకృతం ।
అథవా వేదభాగేన మధ్యకోష్ఠం సమాశ్రకమ్ ॥ 224
తద్బహిశ్చా వృతాంశేన జలపాదంచ నిమ్నకం ।
తద్బహిః పరితోభాగే కుర్యాచ్చై కా ఖలూరికా ॥ 225
తన్మధ్యే మండపం కుర్యాత్కర్ణం లాంగలభిత్తికం ।
మధ్యస్తంభం త్యజేచ్ఛస్తం దిక్షుస్తంభం త్యజేత్తువా ॥ 226
ఊర్ధ్వకూట సమాయుక్తం సర్వాలంకార సంయుతం ।
తద్బహిః పరితోదేశే యథేష్టాంశ ప్రపాంగకమ్ ॥ 227
నృపాణాం భోజనార్థంస్యాత్ ఖర్వటాఖ్యంతు మండపం ।
తదేవభాగైక వేదాంశం మధ్యరంగం తమిష్యతే ॥ 228
తద్బాహ్యే తద్ ద్విభాగేన మండపావృత మిష్యతే ।
తద్బహిశ్చా వృతాంశేన కుర్యాత్త ద్భ్రమాలిందకమ్ ॥ 229
తచ్చతుర్దిక్షు మధ్యేచ స్తంభం సర్వోపరిత్యజేత్ ।
ద్వ్యంశైకం నేత్రవిస్తారం నిర్గమం భద్రసంయుతమ్ ॥ 230
మధ్యభద్రస్య విస్తారం నిర్గమంచ ద్విభాగికం ।
చతుర్దిక్షు చతుర్ద్వారం కర్ణేచ కర్కరీకృతమ్ ॥ 231
ఊర్ధ్వకూట సమాయుక్తం సర్వాలంకార సంయుతం ।
తన్ముఖే తత్సమాంశేన విస్తారాయామం కారయేత్ ॥ 232

చతుః షడ్భాగ విస్తారా యామం మండపాంకణంస్యాత్ ।
పురశ్చ పార్శ్వయోశ్చైవ ద్వ్యంశేన ముఖమండపమ్ ॥ 233
ద్వారం తన్ముఖభద్రంస్యా త్కర్ణేషు కర్కరీకృతం ।
మండపే చాంకణం జ్ఞాత్వా విధానం వివిధాననమ్ ॥ 234
సర్వాలంకార సంయుక్తం వాతాయన సమాయుతం ।
ఏవంతు ఖర్వటంప్రోక్త మభిషేకార్థ మండపమ్ ॥ 235

తా॥ పైజెప్పిన దానికంటె పొడవు 2 భాగము లధికముచేసి అనగా 12 భాగములుచేసి యనుట. విస్తారము 7 భాగములుచేసి దాని నడుమ గది విస్తారము 5 భాగములు పొడవు 10 భాగములు చేసి దాని చుట్టును 1 భాగము వేదికను రచించినయెడల ద్రోణ మండప మగును. రాజులకు ఆయుధముల నభ్యసించుటకు దగియుండును. విస్తారము 11 భాగములును నిడివి 15 భాగములునుచేసి అందు 2 మూలలయందు 3 భాగముల చొప్పున మండపములును, ఆనడుమ 9 భాగములు నలుచదరముగా గదియును, మండపముల ముందు 1 భాగము చొప్పున అలిందములును, గదికి ముందును ఇరు ప్రక్కలను 2 భాగముల చొప్పున విశ్రాంతి స్థలమును రచించి రేని ద్రోణమండపమగును. ఇది పొట్టేళ్ళ పందెమున కుపయోగించును. విస్తారమును నిడివియును సమానముగా 8 భాగములుచేసి దాని నడుమ 2 భాగములు నలుచదరముగా గదియును దాని వెలుపల చుట్టును 1 భాగము విశ్రాంతి స్థలమును, దానిచుట్టును 2 భాగములు మండపమును, నలుమూలలయందు 2 భాగముల చొప్పున గదులును, దాని వెలుపల చుట్టును 1 భాగము భద్రములతోగూడిన అలిందములును, మధ్య సూత్రమున కెడమవైపున ద్వారమును, దాని వెలుపల చుట్టును 1 భాగము విశ్రాంతి స్థలమును నాలుగు మూలలయందు 2 2 చిన్న గదులును, గట్టి భద్రములును రచింప

వలయును. లేక మధ్యగది 4 భాగములు చతురశ్రముగాజేసి దాని వెలుపల చుట్టును 1 భాగము లోతయిన జలస్తంభములను రచించి దాని వెలుపలచుట్టును 1 భాగము విశ్రాంతి ప్రదేశమును, దాని నడుమ మండపమును, నలుమూలలయందు నాగలివలె ఖండపు గోడలును రచించి మధ్యను, నలుదిశలయందును స్తంభములు లేకుండచేసి పైన శిఖరమును కలశమును రచించి దానివెలుపల చుట్టును యిష్టప్రకారము పందిరిని కల్పించిన యెడల రాజులకు భోజనమునకు దగిన ఖర్వాట మండపమగును.

పైదానినే గది 5 భాగములు నలుచదరముగాజేసి దాని వెలుపల చుట్టును 2 భాగములు మండపమును, దాని వెలుపల చుట్టును 1 భాగము అలిందములును రచించి దానికి నలువైపులను మధ్యను స్తంభమును లేకుండచేసి మూలగది విస్తారము 2 భాగములు నలుచదరమును అంతయే నిర్గమమును భద్రమును మధ్య భద్రము యొక్క విస్తారమును నిర్గమమును 2 భాగములును, నలువైపుల 4 ద్వారములును, మూలలయందు గట్టి దిమ్మలును, పైన శిఖరమును కలశమును, దానిముందు దానితో సమానముగా వెడల్పును పొడవుచేసి అందు విస్తారము 4 భాగములును, పొడవు 6 భాగములును, గల రంగమును రచించి దానికి ముందును ఇరుప్రక్కలను 2 భాగముల చొప్పున ముఖ మండపమును రచించి ద్వారమును ముఖ భద్రమును మూలలయందు గట్టి దిమ్మలునుచేసి అనేకవిధములయిన అలంకారములును ఇష్టానుసారముగా ద్వారములును, కిటికీలును రచించిన యెడల అభిషేక యోగ్యమైన ఖర్వాట మండపమగును.

శ్లో॥ నవభాగంతు విస్తారం తత్సమాంశే ముఖాయతం ।
మధ్యరంగం త్రిభాగంస్యా దంశేనా వృతాలిందకమ్ ॥ 236

తద్బహిశ్చ ద్విభాగేన మండపావృత మేవచ ।
తస్మాత్ త్రిభాగషడ్భాగం విస్తారా యామరంగకమ్ ॥ 237
కుర్యాత్తు శిల్పవిద్విద్భిర్ముఖ మండపం మధ్యమే ।
తత్పురేపార్శ్వయోశ్చైవ చైకభాగేనా లిందకమ్ ॥ 238
తద్బహిస్తద్వశాత్కుర్యా న్మండపం తద్ ద్వయాంశకం ।
శేషం ప్రాగుక్తవత్కుర్యా చ్ఛ్రీరూపాఖ్యంచ మండపమ్ ॥ 239
ఏవం దేవాలయే కుర్యాద్ భూపాభిషేక యోగ్యకం ।
దశభాగ విశాలంస్యా ద్వింశత్యంశం తదాయతమ్ ॥ 240
మధ్యరంగం యుగాంశంస్యా న్మధ్యస్తభాన్ పరిత్యజేత్ ।
తద్బహిశ్చా వృతాంశేనా లిందం ద్వ్యంశేన మండపమ్ ॥ 241
తద్బహిశ్చా వృతాంశేన చోర్ధ్వేతు జలస్థలం ।
తస్మాత్తు తన్ముఖేరంగం ద్వ్యంశం షడ్భాగమేవవా ॥ 242
తన్ముఖే పార్శ్వయోశ్చైవ మండపాకారం యోజయేత్ ।
మంగలాఖ్య మితిప్రోక్తం పురతః శేషముక్తవత్ ॥ 243
ఏవంతు నృపహర్మ్యేతు తులాభారార్థ యోగ్యకం ।
భూపానాంచ యథాస్థాన మండపం వక్ష్యతే క్రమాత్ ॥ 244
ఏకాదశ విభాగేన మూలవిస్తార దైర్ఘ్యకం ।
తత్సమాంశేన విస్తార మేకద్విత్రి ముఖాయతమ్ ॥ 245
విస్తార సమసూత్రం స్యాత్కుర్యాదాస్థాన మండపం ।
మూలమండప మధ్యేతు పంచపంచాంశ రంగకమ్ ॥ 246
తద్బాహ్యే ద్విత్రిభాగేన పరితో మండపం భవేత్ ।
చతుర్దిక్షు చతుర్ద్వారం కర్ణేలాంగలభిత్తికమ్ ॥ 247
బాహ్యేచ ద్విత్రిభాగేన భూవృతాలిందకం భవేత్ ।
చతుర్దిక్షు ద్విత్రిభాగేన భద్రద్వారేణ సంయుతమ్ ॥ 248

పార్శ్వసోపాన సంయుక్తం హస్తిహస్త విభూషితం ।
సోపపీఠమధిష్ఠానం స్తంభాదీన్ ప్రస్తరాన్వితాన్ ॥ 249
ప్రస్తరోర్ధ్వే విశేషోఽస్తి చూలిహర్మ్యాది మండితం ।
మధ్యరంగోర్ధ్వకూటంస్యా చ్చైకద్విత్రి తలంతువా ॥ 250
రత్నప్రాసాదరంగేతు ప్రాగుక్తవదలంకృతం తన్ముఖేచ ।
ప్రపాం కుర్యాద్ యుక్త్యాయామంతు కల్పయేత్ ॥ 251
నాటకవిస్తారంపంచ పంచభాగేన యోజయేత్ ।
పార్శ్వే చైవత్రిభాగేన బహుపాద సమన్వితమ్ ॥ 252
సోపపీఠాంఘ్రి సంయుక్తం ప్రస్తరంచ ప్రపాంగకం ।
ప్రముఖేభద్ర సోపానం కర్ణేలాంగలభిత్తికమ్ ॥ 253
శివేవాదారుజేవాపి మిశ్రద్రవ్యేణ కారయేత్ ।
శేషంతు దేవతాస్థానం మండపోక్త వదాచరేత్ ॥ 254
ఏవమాస్థాన యోగ్యంస్యాత్తత్ స్వరాక్షర యోగ్యకం॥ 254½

తా॥ విస్తారము 9 భాగములు పొడవు 9 భాగములుచేసి దాని నడుమ 3 భాగములు నలుచదరముగ రంగమును రచించి దాని చుట్టును 1 భాగము అలిందములును, అలిందముల వెలుపల చుట్టును 2 భాగములు మండపమును రచించవలయును. లేక మధ్య రంగము విస్తారము 3 భాగములు పొడవు 6 భాగములుచేసి దాని ముందును కుడియెడమలను మూడు వైపుల 1 భాగము అలిందములును, వాని వెలుపల చుట్టును 2 భాగములు మండపమును రచించవచ్చును. మిగిలిన పనులు పూర్వమువలెనే చేయవలయును. ఇది శ్రీరూప మండపము. ఇది దేవాలయమున రచింపబడినను రాజాభిషేక యోగ్యము. విస్తారము 10 భాగములు పొడవు 20 భాగములు చేయవచ్చును. లేదా 10 భాగము వేయించవచ్చును. మధ్యరంగము విస్తారమును పొడవును 4 భాగములుచేసి దాని నడుమ స్తంభము

లను తీసివేయవలయును. దాని చుట్టును 1 భాగము అలిందములును హానిచుట్టును వెలుపల 2 భాగములు మండపమును రచించవలెను. పైన మరల చుట్టును 1 భాగము జలస్థలమును కల్పించవలెను. దానిముందు రంగము విస్తారము 2 భాగములును పొడవు 6 భాగములునుచేసి దానికి ముందును ఇరువైపులను 2 భాగములు మండపమును రచించవలయును. శేషించిన పనులు పూర్వమువలెనే చేయవలయును. ఇట్లు రాజభవనమున తులాభారమునకు రచింపవలయును. దీనిని మంగళ మండప మందురు.

ఇక రాజులయొక్క ఆస్థానమండపమును చెప్పుచున్నాడు. సమాన చతురశ్రముగా 11 భాగములుచేసి దానితో సమాన భాగములుగా 1-2-3 భాగముల విస్తారముతో ముఖమును విస్తారముతో సమానముగా ఆస్థాన మండపమును, ప్రధాన మండపము నడుమ 5 భాగములు నలుచదరముగా రంగమును దాని వెలుపల 2-3 భాగములు చుట్టును మండపము నలువైపుల 4 ద్వారములును, మూలలయందు నాగలివలె ఖండపు గోడలును, దాని వెలుపల 2-3 భాగములు చుట్టును అలిందములును నలువైపుల 2-3 భాగములు భద్రములుగల ద్వారములును, ప్రక్కలయందు మెట్లును, ఆ మెట్లయందు ఏనుగు తొండములును, ఉపపీఠముతో గూడిన అధిష్ఠానమును, స్తంభములు, ప్రస్తరము, ఆపైన తలయందు హర్మ్యములును, మధ్యరంగముపైన శిఖరము కలశమును, 1-2-3 అంతస్తులుకూడ రచించవచ్చును. రంగమునందు ముత్యములు మొదలగువానితో నలంకారమును, దానిముందు పందిరియును, నాట్యరంగమును 5 భాగములు నలుచదరముగా నుంచవలెను. దాని ప్రక్కలయందు 3 భాగములు తగినన్ని స్తంభము లుంచవలెను. ఉపపీఠము అధిష్ఠానము, స్తంభములు, ప్రస్తరము, పందిరి, దానిముందు భద్రమును మెట్లును, మూలలయందు నాగలివలె ఖండపు గోడలును, జాతితో

గాని, కఱ్ఱతోగాని, లేక యిష్టప్రకారముగానిచేసి మిగిలిన దేవస్థానమును చెప్పబడిన కొలతలతోను,లక్షణములతోను రచించవలయును. ఇది ఆస్థానమండపము వేదపఠనమునకును, సంగీతమునకు ఉపయోగించును.

శ్లో॥ చతుః షడ్భాగవిస్తారా యామంచ తత్ప్రకల్పయేత్ ॥ 255
ద్విచతుర్భాగవిస్తారా యామంచ మండపం భవేత్
విస్తారాత్తు ద్విభాగేన వంశమూలేతు వాసకమ్ ॥ 256
తదగ్రేద్విత్రిభాగేన కుడ్యపాద సమన్వితం ।
తద్బహిశ్చా వృతాంశేన వారం కాంతాఖ్య మండపమ్ ॥ 257
ఏవంతు యువరాజస్య లీలాలోకన మండపం ।
సర్వాలంకార సంయుక్తం చోర్ధ్వకూట సమన్వితమ్ ॥ 258
షడష్టాంశేన విస్తారా యామంచ మండపం భవేత్ ।
ద్విత్రిభాగేనవా సంస్యాత్త్రి చతుర్భాగ మండపమ్ ॥ 259
వంశమూలాగ్రయోర్వాసం తన్మధ్యే మండపం భవేత్ ।
తత్పురేఽలింద మేకాంశం చేష్టదిగ్గతభిత్తికమ్ ॥ 260
ముఖ్యేష్టద్వ్యంశ మాయామం విస్తారం ముఖద్వారకమ్ ।
ద్విత్రిభాగేన వాసంస్యా దగ్రేమూలేన యోజయేత్ ॥ 261
అథవా మూలవాసైశ్చ ద్విత్రిభాగేన యోజయేత్ ।
ద్విచతుర్భాగవిస్తారా యామం మూలమండపంస్యాత్ ॥ 262
తత్పురే పృష్ఠదేశేతు చైకైకాంశేనా లిందకం ।
పరితఃకుడ్య సంయుక్తం తద్బహిర్ద్వారమేవచ ॥ 263
తస్మాదేవద్వి భాగేన నిర్గమం భద్రవిస్తృతం ।
మండపే వంశమూలాగ్రే త్యంశంభద్ర విశాలకమ్ ॥ 264
నిర్గమం చద్విభాగంస్యాద్ భద్రావృత వారకమ్ ।
మండపే చోర్ధ్వకూటంస్యా చ్ఛాలాకారంతు యోజయేత్ ॥

అష్టవక్త్రి సమాయుక్తం కర్ణేషు కర్కరీకృతం ।
మధ్యసూత్రస్య వామేతు ద్వారం కుర్యాద్విచక్షణః ॥ 266
శ్రీవిశాలమిత్రిప్రోక్తం మహిష్యావాస మండపం ।
చతుః షడ్భాగ విస్తారా యామంచ మండపం భవేత్ ॥ 267
ద్విద్విభాగేన సంయుక్తం తన్మధ్యే చాంకణం భవేత్ ।
ద్విచతుర్భాగ విస్తారం వాసమాయామ మీరితమ్ ॥ 268
తత్పురే పృష్ఠభాగాంతం చైకద్వ్యంశేన కారయేత్ ।
తద్బహిర్ద్వారమేకేన పరితః కూటాకృతిస్తథా ॥ 269
వంశమూలాగ్రయోర్వ్యాసం తద్ద్వారం వాసమధ్యమే ।
మండపే మధ్యసూత్రస్యవా మేద్వారం తథాయతే ॥ 270
ఏరంపో మార్కనామస్యాద్ విప్రాణాం పచనాలయం ।
తచ్చ విస్తారదైర్ఘ్యేషు ద్విద్విభాగేన వర్ధనాత్ ॥ 271
అన్యత్ క్షత్రియ సర్వేషాం యుగభాగేన మండపం ।
విస్తారం ద్విగుణాంతంస్యాద్ ద్విద్విభాగేన వర్ధనాత్ ॥ 272
యథా తద్వినియోగార్థం మండపం వైశ్యశూద్రయోః ।
తత్తచ్చిత్తవశాత్సర్వ మిష్టదిగ్భాగ భిత్తికమ్ ॥ 273

తా॥ విస్తారము 4 భాగములు పొడవు 6 భాగములుచేసి అందు విస్తారము 2 భాగములు పొడవు 4 భాగములుగల మండపమును రచించి దానివెన్క మొదలు నానుకొని విస్తారమునకు రెట్టింపు పొడవుతో గృహమును రచించి దానిముందు 2-3 భాగములుగోడలును స్తంభములుగల విశ్రాంతి స్థలమును, దానివెలుపల చుట్టును 1 భాగము ద్వారములును పైన శిఖరమును, కలశమును రచించి రేవి కాంత మండపమగును. దీనియందు యువరాజులు ఆడుకొనుట మొదలగువాని కుపయోగము విస్తారము 6 భాగములును పొడవు 8 భాగములునుచేసి అందు 2-3 భాగములు గృహమును, 3-4 భాగ

ములు మండపమును వెన్నుయొక్క మొదలునను చివరను యిండ్లును నడుమ మండపమును దానిముందు అలిందము 1 భాగమును, ఏదో యొక వైపున గోడయును, ముందు ముఖద్వారము పొడవు 8 భాగములును విస్తారము 2 భాగములునుగల ప్రదేశమును, 2-3 భాగములుగల యిండ్లును రచించవలయును. లేక 2-3 భాగములుగలవి ప్రధాన గృహము నానుకొని యుండవచ్చును ప్రధాన మండపము విస్తారము 2 భాగములును పొడవు 4 భాగములును కల్పించవలయును దానియొక్క ముందును వెనకను 1-1 భాగము అలిందములును, చుట్టును గోడలును వెలుపల ద్వారమును దానినుండి 2 భాగములు విస్తారమును నిర్గమమునుగల భద్రమును మండపము వెన్నుయొక్క మొదలునను చివరను 3 భాగముల విస్తారమును 2 భాగముల నిర్గమమునుగల భద్రములును, భద్రముల నావరించిన ద్వారములును, మండపముపైన శిఖరమును, కలశమును లేక శాలరూపమును చేయవచ్చును. మూలలయందు 8 ముఖములును, గట్టి దిమ్మలును, నిడివియొక్క మధ్యసూత్రమునకు ఎడమవైపున ద్వారమును రచించవలయును. దీనిని శ్రీవిశాల మండపమందురు.

అంతఃపురస్త్రీ లుండదగినది మఱియు విస్తారము 4 భాగములును నిడివి 6 భాగములునుగల మండపము దానినడుమ 2.2 భాగములుగల గర్భము 2-4 భాగములు విస్తారము పొడవుగల యిల్లును దాని ముందు వెనుక భాగము వఱకు 1-2 భాగములును దాని వెలుపల ద్వారము 1 భాగమును చుట్టును శిఖరాకారమును వెన్నుగాడి యొక్క మొదలున చివరను, గృహములును, వానినడుమ ద్వారములును, మండపము పొడవున మధ్య సూత్రమున కెడమవైపున ద్వారమును రచించినయెడల సోమార్క మండపమగును, ఇది బ్రాహ్మణులకు పాకశాలకు దగియుండును. దీనినే విస్తారమునను పొడవునను 2-2 భాగములుచేసి మండపము 4 భాగములుచేసి లేని

క్షత్రియులకు దగియుండును. విస్తారమునందు మరల 2 భాగములును పొడవున 2 భాగములును పెంపు చేసిన యెడల వైశ్యులకు దగియుండును. ఆపై 2 భాగములు పెంపుచేసిచో శూద్రులకు యోగ్యమగును. వారివారికి దకినట్లు యిష్టానుసారముగా నేదిక్కున నైనను గోడను రచించవచ్చును.

శ్లో॥ దేవానాం భూసురాణాంచ మండపం జాతిరూపకం ।
భూపానాం మండపం సర్వం ఛందరూపమితీరితమ్ ॥ 274
వైశ్యకానాంతు సర్వేషాం వికల్పంచేతి కథ్యతే ।
శూద్రాణాం మండపంసర్వ మాభాసమితి కీర్తితమ్ ॥ 275
కేచిద్భద్ర విశేషేణ జాతిరుక్తాపురాతనైః ।
ద్వివక్త్రిం దండకం ప్రోక్తం త్రివక్త్రిం స్వస్తికంతథా ॥ 276
త్రివక్త్రిం లాంగలాకారం నంధ్యావర్తం చతుర్ముఖం ।
షణ్ముఖం మాలికం ప్రోక్తం మండపం చాష్టవక్త్రియుక్ ॥ 277
ఏవంతు సర్వతోభద్రం సర్వాలంకార సంయుతం ।
వక్ష్యతే విధినాసమ్యక్ సర్వగ్రామార్థ మండపమ్ ॥ 278
సమాశ్రం వాయతాశ్రంచ యుగ్మం వాయుగ్మభిత్తికం ।
లుపాంవా ప్రస్తరాంగంవా తల్పాచ్ఛాదనమేవచ ॥ 279
లుపాయుక్తంతు సర్వాంగం సభాచేతి ప్రకీర్తితా ।
పరితః ప్రస్తరంమధ్యే చోర్ధ్వేకూటంతు మండపమ్ ॥ 280
ప్రస్తరాంగంతు సర్వాంగం మండపంచేతి కథ్యతే ।
మండపంవా సభాంవాపి గ్రామయోగ్యం యథాదిశి ॥ 281
నగరేచ యథాకారం ద్విగుణాధ్యర్ధకాయతం ।
పాదూనం ద్విగుణంవాపి ద్విగుణం పత్తనేన్యసేత్ ॥ 282
విస్తార ద్విగుణాయామం శూద్రఖర్వట యోగ్యకం ।
అధిష్ఠానాద్యలంకారం సర్వం ప్రాగుక్తవన్న్యసేత్ ॥ 283

యాత్రామార్గేషు సర్వేషాం కారయేన్మండపం సుధీః ।
ప్రపాంగం మండపంవాపి యథాయుక్త్యా ప్రయోజయేత్ ॥284
బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రక చతుర్వర్ణే యదుక్తంతుతద్ ।
దేవానాం భవతిత్వనం తరతరంశూద్రైర్విప్రైః క్షత్రియైః ।
తద్విప్రైర్భవతి త్వనంతరతరం క్షత్రైర్విప్రైః శూద్రకైః ।
రాజ్ఞాం వైభవతి త్వనంతరతరం శూద్రైర్విశాంవైశ్యకైః ॥
శూద్రైర్యుక్తం మండపం శూద్రకాణాం ।
అన్యేషాం తజ్జాతియోగ్యంతు కుర్యాత్ ॥ 285
చోక్తంచేత్త ద్విప్రజాత్యాది యోగ్యం ।
కర్తా భర్తా సర్వథా నాశమాయాత్ ॥ 286

ఇతి మానసారే వాస్తుశాస్త్రే మండప విధానం
నామ చతుర్త్రింశోఽధ్యాయః.

తా॥ దేవతలకును బ్రాహ్మణులకును జాతిరూపమండపములను, క్షత్రియులకు ఛందరూప మండపములను, వైశ్యులకు వికల్ప రూప మండపములను, శూద్రులకు ఆభాసరూప మండపములను, రచించవలయును. కొందఱు భద్రవిశేషములచేత జాతులకు యోగ్యమును దెలిపియుండిరి. రెండుముఖములు దండకమనియును, మూడు ముఖములు స్వస్తిక మనియును, లాంగలాకారమనియును, నాలుగు ముఖములు సంధ్యావర్తమనియును, ఆఱుముఖములు మౌళికమని యును, ఎనిమిది ముఖములు సర్వతోభద్రమనియును, చెప్పబడినవి.

ఇవి యన్నియును సమస్తమైన అలంకారములతో రచింప దగినవి. గ్రామము మొత్తమున కుపయోగించు మండపము రచించు పద్ధతిని చెప్పుచున్నాడు. సమచతురశ్రము, దీర్ఘచతురశ్రము జంట గోడలు, బేసిగోడలు, లుపలు, ప్రస్తరాంగము, తల్పాచ్ఛాదనము,

ఇట్లు చేయవచ్చును. సభామండపములను లుపలతోనే రచింతురు. చుట్టును మండపముచేసి నడుమ శిఖరమును కలశమునుంచుట యుక్తము. ప్రస్తరాంగము అనగా చదరముగా గప్పబడియుండు దానిని మండపమందురు. మండపముగాని, సభగాని, గ్రామమునకు దగిన దిశయం దుంచవలెను. పట్టణమునందు దాని ఆకారము వెడల్పునకు రెట్టింపు పొడవుగాని, లేక సగము పెంచిగాని, లేక ముప్పాతికవంతు పెంపుచేసిగాని, చేయవచ్చును. పత్తనము నందలి మండపమునకు విస్తారమునకు రెట్టింపుగా పొడవును చేయవలయును. శూద్రఖర్వటము నందును ఇదే కొలత సరిపోవును. అధిష్ఠానము మొదలగు అలంకారములు పూర్వోక్తప్రకారము రచించవలయును. యాత్రామార్గము లన్నిటియందును మండపములను రచింపవలయును. చదరపు కప్పుతోగాని, శిఖరముతోగాని, రచించవచ్చును. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, వర్ణముల కుపయోగించు మండపములను దేవతల కుపయోగించవచ్చును. క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణములకు దగిన మండపమును బ్రాహ్మణుల కుపయోగించవచ్చును. దానినే రాజుల కుపయోగించవచ్చును. వైశ్య, శూద్ర వర్ణముల కుపయోగించు మండపమును వైశ్యుల కుపయోగించవచ్చును. శూద్రుల కుపయోగించు మండపమునే శూద్రు లుపయోగించు కొనవలయునుగాని అంతకుపై తరగతి మండపముల నుపయోగించరాదు. అదే విధముగా అన్నికులముల వారును తమకు పైతరగతి మండపముల నుపయోగించుటవలన కర్తయును భర్తయును నశింతురని చెప్పబడుచున్నది. ఇది మానసారమునందలి మండపవిధానమను ముప్పదినాలుగవ అధ్యాయము.

(అనుబంధము 41 నుండి 47 వఱకు గల పటములు చూడుడు.)

# 21. విశ్వకర్మ మండప భేదములు 27

విశ్వకర్మ ప్రకాశ 6వ అధ్యాయము :

శ్లో॥ అథాతః సంప్రవక్ష్యామి మండపానాంచ లక్షణం ।
మండపాన్ ప్రవరాన్వక్ష్యే ప్రాసాదస్యాను రూపతః ॥ 123
వివిధా మండపాః కార్యాః శ్రేష్ఠమధ్య కనీయసః ।
నామతస్తాన్ ప్రవక్ష్యామి శ్రుణుధ్వం ద్విజసత్తమాః ॥ 124
పుష్పకః పుష్పభద్రశ్చ సువృత్తోఽ మృతనందనః ।
కౌశల్యోబుద్ధి సంకీర్ణో గజభద్రో జయావహః ॥ 125
శ్రీవత్సో విజయశ్చైవ వాస్తుకీర్ణశ్చ శ్రీధరః ।
జయోభద్రో విశాలశ్చ సుశ్లిష్టః శత్రుమర్దనః ॥ 126
భూజయోనంద నశ్చైవ తథావైమాన భద్రకః ।
సుగ్రీవో హర్షణశ్చైవ కర్ణికారః పదాధికః ॥ 127
సింహశ్చయామ భద్రశ్చ సమసూత్రిస్త థైవచ ।
సప్తవింశతి రాఖ్యాతా లక్షణం శ్రుణుతద్విజాః ॥ 128
స్తంభాయత్ర చతుః షష్టిః పుష్పకః ఉదాహృతః ।
ద్వాషష్టిః పుష్పభద్రస్తు షష్టిః సువృత్త ఉచ్యతే ॥ 129
అష్టపంచాశతి స్తంభః కథ్యతేఽ మృతనందనః ।
కౌశల్యోఽథషట్ పంచాశ చ్చతుః పంచాశ తాన్వునః॥ 130
నామ్నాతుబుద్ధి సంకీర్ణో ద్విహీనోగజ భద్రకః ।
జయావహాస్తు పంచాశ ఛ్ఛ్రీవత్సస్తు ద్విహీనకః ॥ 131
ద్వావింశ ద్ధర్షణోజ్ఞేయః కర్ణికారశ్చ వింశతిః ।
పదాధివోఽష్టాదశభి ర్ద్విరష్టః సింహ ఉచ్యతే ॥ 132

ద్విహీనోయామ భద్రస్తు సమసూత్రోనిగద్యతే ।
యామభద్రః క్వచిత్ప్రోక్తో ద్వాదశ స్తంభ సంయుతః ॥ 133
మండపాః కథితా హ్యేతే యథావల్లక్షణాన్వితాః ।
త్రికోణవృత్తమధ్యేతు అష్టకోణం ద్విరష్టకమ్ ॥ 134
చతుష్కోణంచ కర్తవ్యం సంస్థాన మండపస్యతు ।
రాజ్యంచ విజయంచైవ ఆయుర్వర్ధన మేవచ ॥ 135
పుత్రలాభః శ్రియఃపుష్టిః స్త్రీపుత్రాది క్రమార్భవేత్ ।
ఏవంతు శుభదఃప్రోక్త అన్యథాతు భయావహః ॥ 136
ఇతి బ్రహ్మోక్త విశ్వకర్మప్రకాశే శ్రీవిశ్వకర్మణోక్త
వాస్తుశాస్త్రే ప్రాసాదు విధానం నామషష్టోఽధ్యాయః ॥

తా॥ మండప లక్షణములను చెప్పుచున్నాడు. ఉత్తమధ్యమ అధమములను పద్ధతులను తెలిసికొని మండపములను రచించవలయును. 1 పుష్పకము, 2 పుష్పభద్రము, 3 సువృత్తము, 4 అమృతనందనము, 5 కౌశల్యము, 6 బుద్ధి సంకీర్ణము, 7 గజభద్రము, 8 జయావహము, 9 శ్రీవత్సము, 10 విజయము, 11 వాస్తుకీర్ణము, 12 శ్రీధరము, 13 జయము, 14 భద్రము, 15 విశాలము, 16 సుశ్లిష్టము, 17 శత్రుమర్దనము, 18 భూజయము, 19 నందనము, 20 మానభద్రము, 21 సుగ్రీవము, 22 హర్షణము, 23 కర్ణికారము, 24 పదాధికము, 25 సింహకము, 26 యామభద్రము, 27 సమసూత్రము— ఈ యిరువదేడు మండపములను రచించుపద్ధతి. నలుచదరము, ముకోణము, 8 పలకలు, 16 మూలలు, గుండ్రము. ఇట్లు యిష్టానుసారముగా 64 స్తంభములతో పుష్పకమును, 62 స్తంభములతో పుష్పభద్రమును, 60 స్తంభములతో సువృత్తమును, 58 స్తంభములతో అమృతనందనమును, 56 స్తంభములతో కౌసల్యమును, 54 స్తంభములతో బుద్ధిసంకీర్ణమును, 52 స్తంభ ములతో గజభద్రమును,

50 స్తంభములతో జయావహమును, 48 స్తంభములతో శ్రీవత్సమును, 46 స్తంభములతో విజయమును, 44 స్తంభములతో వాస్తుకీర్ణమును, 42 స్తంభములతో శ్రీధరమును, 40 స్తంభములతో జయమును, 38 స్తంభములతో భద్రమును, 36 స్తంభములతో విశాలమును, 34 స్తంభములతోను శ్లిష్టమును, 32 స్తంభములతో శత్రుమర్ధనమును 30 స్తంభములతో భూజయమును, 28 స్తంభములతో నందనమును, 26 స్తంభములతో మానభద్రమును, 24 స్తంభములతో సుగ్రీవమును, 22 స్తంభములతో హర్షణమును, 20 స్తంభములతో కర్ణికారలమును, 18 స్తంభములతో పదాధికమును, 16 స్తంభములతో సింహకమును, 14 స్తంభములతో యామభద్రమును, 12 స్తంభములతో సమసూత్రమును రచించిరేని రాజ్యవృద్ధి, విజయము, ఆయుష్యము, సంతానవృద్ధి, సంపద్వృద్ధి, కలిగియుందురు. ఒకానొక శాస్త్రమున మాత్రము యామభద్రమును 12 స్తంభములతో రచింపవలయునని చెప్పినాడు. (కూడదనుట) ఇంతకుమించిగాని తక్కువగాని స్తంభములను కల్పించుట దోషము.

శ్లో॥ "చతుఃషష్టి స్తంభయుక్తః పుష్పకోనామ విశ్రుతః ।
ద్విద్విస్తంభ త్యాగయుక్త్యా పుష్పాధ్యాః సప్తవింశతిః ॥"
(అపరాజితపృచ్ఛ)

అపరాజితపృచ్ఛ 186వ సూత్రమున పై మండపములనే దీర్ఘ చతురశ్రముగాను, అల్పసంఖ్యగల స్తంభములతోను రచించు పద్ధతి చెప్పబడియున్నది.

సమరాంగణ సూత్రధార 67వ అధ్యాయము:

శ్లో॥ ఇదానీమభిధీయంతే మండపాః సప్తవింశతిః ।
ప్రాసాదాత్ ద్విగుణం కుర్యాత్ కనిష్ఠం తత్రమండపమ్ ॥ 1

పాదోన ద్విగుణం మధ్యం ప్రాసాదేతు కనీయసి ।
తస్మిన్నేవ కనీయాం సంవిదధ్యాత్ సార్థమానతః ॥ 2
పాదోన ద్విగుణః సార్థః సపాదశ్చేతి మధ్యమే ।
సార్థః సపాదస్తుల్యశ్చ త్యుత్తమాద్యాః స్యురుచ్యతే ॥ 3
సపాదద్విగుణాః సార్థ ద్విగుణాః సాంతరోద్భవాః ।
క్షుద్రప్రాసాదకేషుస్యుర్మండపా బహవోఽపరే ॥ 4
క్షేత్రాలాఖే పునరిమాన్ సర్వాన్ సర్వేషు యోజయేత్ ।
దైర్ఘ్యం దైర్ఘ్యేణ గృహ్ణీయాద్ విస్తృత్యా విస్తృతిస్తథా॥5
ప్రమాణం మండపేకార్యం వలభ్యాంగరుడేఽపిచ ।
చతురశ్రీకృతే క్షేత్రే దశధాప్రవిభాజితే ॥ 6
భాగైశ్చతుర్భిర్భద్రంస్యాద్ ద్వాభాగా ప్రతిభద్రకం ।
అగ్రతః పృష్ఠతోవాపి నిర్గమో భాగికో భవేత్ ॥ 7
భద్రాణాం నిర్గమోభాగం సార్థభాగమథాపివా ।
ప్రాసాదస్య త్రిభాగేన చతుర్భాగేనవా భవేత్ ॥ 8
అర్థేనాథ షడంశేన పంచాంశేనాథ నిర్గతిః ।
ప్రాసాదానాం సమాకార్యా పాదోనావా ప్రమాణతః ॥ 9
కార్యాత్రిభాగ హీనావా మండపాస్తు సమైఃక్షణైః ।
స్వవిస్తార సమంభద్రే ముఖేచైషా ప్రకీర్తితా ॥ 10
కర్ణా ద్విభాగికాజ్ఞే యాస్తేషాం కోణచతుష్టయే ।
వామదక్షిణ భాగాభ్యాం సహభద్రం షడంకమ్ ॥ 11
ప్రతిభద్రేన చైతాస్మిన్ విదధ్యాదగ్రష్ఠయోః ।
చతుః షష్టి ధరోఽయంస్యాత్ పుష్పకోనామ మండపః ॥ 12

తా॥ ఇరువదియేడు మండపములను రచించు విధానమును చెప్పుచున్నాడు. ప్రాసాదముయొక్క విస్తారమునకు రెట్టింపు $1\frac{3}{4}$

వంతు $1\frac{1}{3}$ వంతు కనీస మండపమునకును, విస్తారమునకు $1\frac{3}{4}$ వంతు $1\frac{1}{2}$ వంతు $1\frac{1}{4}$ వంతు మధ్యమ మండపమునకును, విస్తారమునకు $1\frac{1}{2}$ వంతు $1\frac{1}{4}$ వంతు విస్తారముతో సమానము ఉత్తమ మండపము నకు కొలతలు నిర్ణయింపబడినవి. క్షుద్రప్రసాదముల యందు $2\frac{1}{4}$ భాగములును మండపములకు విస్తారములను కల్పింతురు. స్థలము తక్కువైనప్పుడుకూడ ఆలోచింపతగిన ప్రకారము రచించవచ్చును. ప్రాసాదముయొక్క పొడవునుబట్టి పొడవును వెడల్పునుబట్టి వెడ ల్పును మండపములకు కల్పించవచ్చును.

వలభీ ప్రాసాదమునను గరుడ ప్రాసాదమునను ఇట్టి కొలతలు వచ్చును. చతురశ్ర ప్రదేశమును 10 భాగములుచేసి అందు భద్రము 4 భాగములును, ప్రతి భద్రము 2 భాగములును, ముందువెనుకను నిర్గమము 1 భాగమును లేక $1\frac{1}{2}$ భాగము ప్రాసాదములో 3వ వంతు లేక 4వ వంతు చేయవచ్చును. సగము 6వ వంతు, 5వ వంతు నిర్గమము చేయవచ్చును. గదులు ప్రాసాదముతో సమానములు గాని, పాతికవంతు తక్కువగాని, 3వ వంతు తగ్గించిగాని, ఇట్లు సమానమైన గదులు చేయవలయును. భద్రమున విస్తారముతో సమానముగాని, ద్వారమునగాని, నిర్గమము చేయదగును. పైన నలుమూలలయందు కర్ణములు 2–2 భాగముల చొప్పున రచించ వలయును. కుడి యెడమల యందుగల భాగములతో సహాభద్రము 6 భాగములు దీనియందు ప్రతిభద్ర మక్కరలేదు. ముందువెనుక మాత్రమే ప్రతిభద్రము లుండవలయును. 64 స్తంభములు (ధరలు) కలది పుష్పక మండపము.

శ్లో॥ దిక్త్రియే ప్రతిభద్రాణి ముఖే ప్రాగ్గ్రీవ ఏవహి ।
పుష్పభద్రో చతుః స్తంభ శ్చతుపః సుప్రభో భవేత్ ॥ 13
ఇతి స్తంభద్వయత్యాగాత్ ద్రూమోమండప వింశతిం ।
యేఘుష్పకః పుష్పభద్రః సువృత్తోఽమృతనందనః ॥ 14

కౌసల్యో బుద్ధిసంకీర్ణో గజభద్రో జయావహః ।
శ్రీవత్సో విజయశ్చైవ వస్తుకీర్ణ శ్రుతిర్జయః ॥ 15
యజ్ఞభద్రో విశాలశ్చ సుశ్లిష్టః శత్రుమర్దనః ।
భూజయోనందనశ్చైవ మానవో మానభద్రకః ॥ 16
సుగ్రీవో మండపః ప్రోక్తో భద్రైర్యుక్తశ్చతుష్పదైః ।
చతుర్భిస్త్రిపదైః కర్ణై ర్నిర్గమైః ప్రాగుదాహృతైః ॥ 17
ధరాణామేవ లింశత్యా చతురుత్తర యాయుతః ।
అస్య ద్వావింశతి స్తంభపడన్యే ద్విధరక్షయాత్ ॥ 18
సుగ్రీవో హర్ష నామాచ కర్ణికారః పదాధికః ।
సింహశ్చ యామభద్రశ్చ సమసూత్రశ్చేతి సప్తమః ॥ 19
సప్తవింశతి త్యుక్తామండపానాం సమానతః ।
ఏషాం విచిత్రరూపాణాం ప్రాసాదాకృతి ధారిణామ్ ॥ 20
మిశ్రకాశ్చ పరిజ్ఞేయా హస్తైర్ద్వివ్యైకమానతః ।
మూలప్రాసాదతుల్యావా త్ర్యంశేనార్ధేన చోర్జితాః ॥ 21
ద్విస్తంభ శుకనాసాగ్రే విజ్ఞేయః పాదమండపః ।
ప్రాసాదభిత్తిమానేన మండపే భిత్తయః స్మృతాః ॥ 22
సపాదాచ త్రిభాగావా వీధికాః స్తుర్యధోచితం ।
క్వచిద్భిత్తి విహీనాంశ్చ కుర్యా దాకాశమండపాన్ ॥ 23
లతిష్వేవవిధిః ప్రోక్తః సాంధారేషు స్వమానతః ।
ప్రాసాదో యాదృశస్తా దృక్ మండపేఽపి తదగ్రతః ॥ 24
యాని ప్రాసాద నామాని తాని స్యుర్మండపేష్వపి ।
వాస్తుభేదేన భేదోఽయం మండపానాం విధీయతే ॥ 25
శతార్ధ మండపస్థానం తలార్ధం భాజనాయచ ।
యజ్ఞార్థేయాని ముఖ్యార్థా విహారార్థే నృపాలకే ॥ 26

కార్యోదశాంశం విస్తారో ఏకైకాను శతావధేః ।
హస్తానాం సంఖ్య యామానం హస్తేనస్యాద్గతేహాశితుః ॥ 27
ఉపయోగానుసారేణ స్వధియా పరికల్పితః ।
ఆయతశ్చతురశ్రోవా కర్తవ్యో నాద్యమండపః ॥ 28
శతమష్టోత్తరం జ్యేష్ఠశ్చతుః షష్టికరోఽవరః ।
కనిష్ఠో మండపః కార్యో ద్వాత్రింశత్కర సమ్మితః ॥ 29

తా॥ పై పుష్పక మండపమునకు మూడు దిశలయందు ప్రతి భద్రములును, ముందు ప్రాగ్గ్రీవమును 4 స్తంభములతోను రచించి రేని పుష్పభద్రమగును. పుష్పభద్ర ప్రాగ్గ్రీవమున 2 స్తంభములను తగ్గించిన యెడల సుప్రభ మండపమగును. ఇట్లు వరుసగా 20 మండపములను రచింపదగును. మఱియు సుగ్రీవ మండపమునకు భద్రములు 4 భాగములును, కర్ణములు 3 భాగముల చొప్పునను 24 స్తంభములును, (ధరలు) చేయవలయును. 22 స్తంభములతో హర్షణ మండపమును, 20 స్తంభములతో కర్ణికార మండపమును, 18 స్తంభములతో పదాధిక మండపమును. 16 స్తంభములతో సింహామండపమును, 14 స్తంభములతో యామభద్ర మండపమును, 12 స్తంభములతో సమసూత్ర మండపమును రచించవలయును. ఈ మండపములు ప్రాసాదము ననుసరించి యనేకరీతులతో విచిత్రముగా రచించవచ్చును. మిశ్రక ప్రాసాదములందు 2-3-1 హస్తములుగాని ప్రాపాదముతో సమానముగాని, 3వ వంతుగాని, సగము వంతుగాని కలిపి మండప విస్తారమును చేయుదురు. 2 స్తంభములు గల శుకనాసముందు పాదమండపమును రచించవలయును. ప్రాసాదముగోడ లావునుబట్టి మండపము గోడను రచించవలెను. ప్రాసాదము గదులతో సమానగదులుగాని, లేక పాతికవంతు యెక్కువగా గాని, లేక ముప్పాతికవంతుగాని, మండపముయొక్క గదులు చేయవలయును. ఆకాశమండపములు కొన్ని గోడలులేకుండ రచింతురు.

ఈ చెప్పబడినవి లతిన ప్రాసాదములయందు రచింపదగిన పద్ధతులు. సాంధార ప్రాసాదములందు వాని కొలతలను దెలిసికొని రచింపవలయును. ప్రాసాదమున కెట్లుండునో అట్లే మండపము ముందును రచించవలయును. ప్రాసాదనామమే మండపమునకును చెల్లును. మండప స్థానములను 50 భాగములవఱకుచేసి యజ్ఞమునకును, రాజులయొక్క విహారమునకును, కల్పించవచ్చును. 10 హస్తములు మొదలు 1-1 హస్తమును పెంచుచు 100 హస్తముల వఱకు విస్తారమును కల్పించవచ్చును. శిల్పాచార్యుడు తనబుద్ధి కౌశలముతో నూహించిన నలుచదరము సమానముగాగాని లేక పొడవు అధికముగాగాని చేయుచు 108 హస్తములు జ్యేష్ఠ మండపము, 60 హస్తములు మధ్య మండపము, 32 హస్తములు కనిష్ఠ మండపమును రచించవచ్చును. 50 శ్లోకము మొదలు అధ్యాయాంతమువఱకు 114½ శ్లోకములున్నను అవియన్నియును వ్రాయదగినంత విశేషము కలవిగా యిప్పటికి కన్పట్టుక లేదు. అవి సంస్కరణా నంతరమున ముఖ్యమని తలంచినచో చేర్చుటకౌలుగును.

---

## 22. సమరాంగణాచార్యుని అష్టమండపములు అందు భద్రమండపము

సమరాంగణ సూత్రధార 66వ అధ్యాయము :

శ్లో॥ ఇదానీం మండపానష్టౌ బ్రూమః ప్రాసాదసంస్థితాన్ ।
ప్రాసాదం కల్పయేత్పూర్వం భాగశుద్ధం సులక్షణమ్ ॥ 1
సంవృతో౽వాభవేదేష వ్యతిరిక్తో౽థవాక్వచిత్ ।
చతురశ్రో విభాగైశ్చ ఘటంతేయః సమంవృతః ॥ 2
వసుభాగైర్విఘటతే వ్యతిరిక్తః సకీర్తితః ।
గర్భోభగర్భ సమఃశస్తః సో౽న్యథా దోషమావహేత్ ॥ 3

ఏవం నివేశయేదగ్రే మండపాస్యైవ సద్మనః ।
భవేచ్ఛత పదాఖ్యేన జ్యేష్ఠమధ్యకనీయసః ॥ 4
మండపాంస్తేషు భద్రంఃస్యాన్నం దనాఖ్యస్తథాపరః ।
మహేంద్రో వర్ధమానశ్చ స్వస్తికః సర్వభద్రకః ॥ 5
మహాపద్మోఽష్టమశ్చైషాం గృహరాజః ప్రకీర్తితః ।
ఏతేయథార్థ నామానో లక్ష్మ్యైతేషాం ప్రచక్ష్మహే ॥ 6
ప్రాసాద ద్విగుణాయామః పాదోన ద్విగుణాయతః ।
కార్యోయస్తథాధ్యర్థమగ్రతః సురమందిరమ్ ॥ 7
ప్రాసాదోచ్ఛ్రయతుల్యంవా కార్యామండప విస్తృతిః ।
శుకనాసాన్వితాః కార్యాస్తేచాలింద సమన్వితాః ॥ 8
అలిందాః సర్వతో భాగనిర్గతాభాగ విస్తృతాః ।
కదాచిత్ సార్థభాగేన నిష్క్రాంతా భాగవిస్తృతాః ॥ 9
దశభిర్భాజయేద్భాగైర్భద్రం ప్రాజ్ఞః సమంతతః ।
శృంగాణి స్యుర్ద్విభాగాని సహితాన్యుదకాంతరైః ॥ 10
భాగప్రమాణవిస్తారా దామూలతలమస్తకం ।
శృంగేషురథికా కార్యా భాగపాదేన నిర్గతా ॥ 11
భాగేనైకేన నిష్క్రాంతం విస్తృతం చతురంశకః ।
మధ్యభద్రం విధాతస్య మాశాసు చతసృష్వపి ॥ 12
పీఠం ప్రాసాదపీఠస్య నాత్ర కుర్వీతమండలే ।
తలపట్టోభవేచ్ఛుక నాసోయాక్షితి రంగికా ॥ 13
తలపట్ట మథస్తస్యా మండపస్య నివేశయేత్ ।
కర్తవ్యమేవమగ్రేఽగ్రే నిమ్నం నిమ్నతరం తతః ॥ 14
అథవాతత్సమం దద్యాత్ స్థపతిః శాస్త్రలిత్తమః ।
చతుర్భాగా యతద్వారం షడ్దారుక సమన్వితమ్ ॥ 15

అగ్రేభద్రం విధాతవ్యం చతుఃస్తంభ విభూషితం ।
పృష్ఠతశ్చభవేదేవం సంస్కృతి శ్చైత్రమండపే ॥ 16
సంస్కృతేః కనాసాస్యాద్ భూమికాః పృష్ఠభద్రకం ।
శేషంతథైవకర్తవ్యం విధానం మండపస్యతు ॥ 17
సభిత్తిభిః పరిక్షిప్తః కర్తవ్యః పార్శ్వయోర్ద్వయోః ।
భాగేన కల్పయేద్భిత్తిం గవాక్షైరుపశోభితాద్ ॥ 18
వాతాయనాశ్చ కర్తవ్యాః సహచంద్రావలోకనైః ।
ప్రాసాదద్వారవద్ ద్వార విస్తారో మండపే భవేత్ ॥ 19
సపాదః సత్రిపాదోవా సార్ధః సామ్యోఽథవా భ్యవేత్ ।
ఊర్ధ్వద్వారవిధిః కార్యో మూలద్వారా సతిక్రమాత్ ॥ 20

తా॥ ప్రాసాదముల యందలి 8 మండపములను రచించు విధానమును చెప్పుచున్నాడు. ఆలయమును చుట్టుకొనిగాని లేక వేఱుగాగాని, నలుచదరముగా భాగములనుచేసి రచించవలయును. ఆలయమునుబట్టి చేయుట అవసరము లేనిచోట 8 భాగములతో రచించవచ్చును. ప్రాసాదగర్భముతో సమానముగా మండప గర్భము కల్పించవలయును. అట్లు చేయనియెడల దోషము,హానికరము. ఆలయమునకుముందు మండపమును రచించవలయును. విస్తారమును 10 భాగములుచేసి ఉత్తమ మధ్యమ అధమ భేదములతోను, వాని వాని పేరులకు దగినపద్ధతులతోను రచించవలయును. భద్రమండపము, 2 నందన మండపము, 3 మహేంద్ర మండపము, 4 వర్ధమాన మండపము, 5 స్వస్తిక మండపము, 6 సర్వతోభద్ర మండపము, 7 మహాపద్మ మండపము, 8 గృహరాజ మండపము, వీనియొక్క లక్షణములను చెప్పుచున్నాడు.

దేవాలయముయొక్క విస్తారమునకు రెట్టింపు లేక $1\frac{3}{4}$ వంతు, లేక $1\frac{1}{2}$ వంతు, ఇట్లు మండపమునకు పొడవును చేయవలయును.

దేవాలయముయొక్క యెత్తుతో సమానముగా మండపముయొక్క వెడల్పును చేయవలయును. శుకనాస అలిందము అలిందమునకు నిర్గమము 1 భాగము విస్తారము 1 భాగము చేయవలయును. కొందఱు 1½ భాగమును నిర్గమమును విస్తారము 1 భాగమును చేయుదురు. మండప విస్తారమును 10 భాగములుచేసి మూలల యందు కర్ణకూటములు 2-2 భాగముల చొప్పున జలమార్గములతో గూడ రచించి వాని వెంబడి రథములను విస్తారము 1 భాగముతోను నిర్గమము ¼ భాగమును చేయవలయును. మధ్యభద్రము విస్తారము 3 భాగములును నిర్గమము 1 భాగమును చేయవలయును. ఇట్లు నలువైపుల రచించవలయును. పీఠము మాత్రము దేవాలయ పీఠముతో సమానముగా జేయవలసినపనిలేదు. తలపట్టము. శుకనాస అంతస్తులు, గర్భము, ఇవి రచించవలయును ఆలయ తలపట్టమున కంటె తక్కువగా నుండవలెను. ఇట్లు మండపములు వరుసగా ఒక్కొక్కటి తక్కువ చేయుచుండవలెను. లేక సమానముగాను చేయవచ్చును. ద్వారము పొడవు 4 భాగములు షడ్దారుకముతో గూడియుండవలయును. దానిముందు భద్రము 4 స్తంభములతో రచించవలయును. వెనుకవైపునను ఇటులే రచించిరేని చైత్రమండపమగును. లేక శుకనాస, అంతస్తులు, వెనుకభద్రము రచించి మిగిలిన వన్నియును అటులే యుంచవచ్చును. లేక రెండుప్రక్కలను గోడలనుగట్టి ఆగోడ 1 భాగము మందముచేసి కిటికీలను రచించి ఆకిటికీలకుపైన అర్ధచంద్రాకారముగా ఆర్చిలు చేయవలయును. దేవాలయ ద్వారముతో సమానముగా మండపమునకు ద్వార విస్తారమును చేయవలయును. విస్తారమునకు రెట్టింపుగా యెత్తును చేయుచు మూలద్వారము నతిక్రమించకుండ క్రమముగా 1¾ - 1½ - 1¼ భాగములు చేయుచుండ వలయును.

శ్లో॥ జాలవ్యాలకపోతాలీ మత్తవారణ కైర్యుతాః ।
భ్రమనిర్మాపితైః స్తంభైః కర్తవ్యాశ్చ గవాక్షకాః ॥ 21
వాతాయనంతదర్ధేన పాదోనం చావలోకనం ।
క్షణమధ్యే ప్రకుర్వీత చతుష్కీం విధివచ్ఛుభామ్ ॥ 22
క్షోభాయాం బాహ్యతో రేఖా క్షాతోర్ధ్వగమంచ వర్జయేత్ ।
దారుకర్మవిధిర్మధ్యే యథాస్యాత్ కథ్యతే తథా ॥ 23
సమైః క్షణైః సమైః స్తంభైః సమైశ్చాలింద కైర్యుతాః ।
సమైః కర్ణైశ్చ సంయుక్తైః సమద్రవ్య విధానవత్ ॥ 24
పద్దారుకైస్తిరశ్చినైః కార్యాః కైశ్చిన్ముఖాయతైః ।
తులాసమతలా యద్వా ప్రోక్షిప్తా మధ్యదేశగా ॥ 25
తులాపద్దారుకాధీనా తదధీనాని తానివా ।
కేచిన్మంధాన సంస్థానా నాపీకాదియుతాపరా ॥ 26
అథవా మధ్యతః కార్యా సుస్తంభాలిందవేష్టితాః ।
మహోధరయుతా కార్యా చతుష్క్యభయతః సమా ॥ 27
గజతాలులు మాకర్మ ద్రవ్యైః స్యాదుత్తరోత్తరైః ।
ఏతేనానా విధాః కార్యా ద్రవ్యైరవికలైస్తథా ॥ 28
యాకాచిద్రోచతే ప్రాజ్ఞ స్తామేకాం కారయేత్ క్రియాం ।
క్షణాం తరాణ్యలంకుర్యా దిల్లీతోరణకైస్తథా ॥ 29
వజ్రబంధ సమాయుక్తాః ఘంటికా పల్లవైర్యుతాః ।
హారపద్మదలాకీర్ణాః శాలభంజీ విరాజితాః ॥ 30
స్తంభకాశ్చ విధాతవ్యాః పంచాభరణ భూషితాః ।
కంఠకైరతి చిత్రైశ్చ రథకైస్తోరణైః సహ ॥ 31
వితానైర్వి విధాకారై రూపకర్మోప శోభితైః ।
ఏవం విధాతవ్యా సీమాతుల్యా స్తులోదయాః ॥ 32

ప్రాగ్గ్రీవకేష్వలిందేషు మధ్యేభాగేచ పార్శ్వయోః ।
నతలాని విధీయంతే యథాకామం క్రియా భవేత్ ॥ 33

సీమాద్వారే యథావాయోః ప్రవేశం నైవపీడయేత్ ।
తథోర్ధ్వద్వారికాకార్యా పట్టస్యోపర్యవస్థితా ॥ 34

వేదివ్యాలకపోతాలీ మత్తవారణతులోదయః ।
షడ్దారుకం ద్వారభద్రే తత్ర కుర్వీతబుద్ధిమాన్ ॥ 35

ఛాద్యతో మండపేఽప్యేవం మానతః కర్మతోఽపిచ ।
కపోతాలీవరండీ భిస్తథా చాంతర పత్రకైః ॥ 36

కర్ణప్రాసాద కైశ్చిత్రైః కర్మస్యాద్ భద్రమండపే ।
ఉచ్ఛ్రాయస్య వివేచీయా దత్రస్త్వన్యత మోబుధైః ॥ 37

శిఖరస్య త్రిభాగేన పాదోనైకేనవా భవేత్ ।
ఉచ్ఛ్రాయో మండపస్యార్ధ్వే శుకనాస సముచ్ఛ్రితిః ॥ 38

హర్మ్యంవా తత్ర కుర్వీత చారుకర్మోప శోభితమ్ ॥ 38½

తా॥ కిటికీలు, వ్యాలములు, కపోతలముల నరుసలు, మత్తవారణము, చుట్టును కొలత ప్రకారము నిలుపబడిన స్తంభములు, వానియందు కిటికీలును, ఆకిటికీలో సగమువంతుగాని, పాతికవంతుగాని, ముప్పాతిక వంతుగాని అర్థచంద్రాకారమైన ఆర్చి, గదుల నడుమ కోనేరు, మారుదలయందు వెలుపల రేఖ మిట్టగానుండ రాదు. దారుకర్మ తగినపద్ధతితో చేయవలయును. సమానమైన గదులును, సమానమైన స్తంభములును, సమానమైన శాలలును, అలిందములును, సమానమైన కర్ణములును, సమానమైన యితర సామగ్రియును, షడ్దారుకములును, అడ్డముగా కల్పింపబడిన ముఖములు కొన్ని పొడవుగను, దూలము అంతటను సమానప్రదేశమున ఆనియుండునట్లును మధ్యప్రదేశము యెత్తుగా రచించుటయును, దూలమును షడ్దారుకములును ఒకటి

కొకటి కలసియుండుటయును, చేయవలయును. కొందఱు గుండ్రము గను, మఱికొందఱు దీర్ఘచతురశ్రముగను చేయుదురు లేక మధ్య రంగమున స్తంభములయందు అలిందములను కల్పింతురు. కోనే ఱను దానిచుట్టు పెద్ద స్తంభములను నలువైపులను రచించుటకూడ కలదు. ఏనుగుయొక్క దవడలవలెనుండు లుమలు వరుసగా పైన రచించుచు కదలకుండునట్లు గట్టిగా రచించవచ్చును. ఈ చెప్పబడిన వానిలో ఏవిధముగానైనను అందముగా రచించవచ్చును.

గదులలో ఇల్లికాతోరణములను రచించవలయును. వజ్రబంధ మును, ఘంటను పల్లవములతో గూడినదానినిగను, హారములు, పద్మదలములు, సాలభంజికలు, కలస్తంభములును, మఱియు స్తంభ మున కుండదగిన 5 విధములగు అలంకారములను క్రమముగా రచించ వలయును. మిక్కిలి చిత్రములుగల కంఠములును, రథములును, తోరణములును, వితానములును, చక్కగా నిర్మించవలయును. దూలముయొక్క సీమతో సమానముగా నుండవలయును. ప్రాగ్గ్రీ వముల యందును, అలిందముల యందును, నడుమను ఇరువైపులను తలములను చేయరాదు. ఇష్టము వచ్చినట్లు అలంకారములను చేయ దగును. సీమాద్వారమున వాయుప్రవేశము దోషముకనుక పై ద్వారము పట్టమునకుపైన నిలుపవలయును. వేదిక, వ్యాలము, కపోతలములవరుస పైకప్పు దూలము పొడవు పద్దారుకము. ద్వార మున భద్రము రచించవలెను. వెలుపలనుగూడ కపోతలములవరుస, వరండి, అంతరపత్రము, కర్ణప్రాసాదములు చిత్రములుగను రచించ వలయును. దేవాలయముయొక్క శిఖరముకంటె తగ్గుగానుండునట్లు మండప శిఖరమును రచించవలయును. శిఖరములో 3వ వంతుగాని. లేక దానిలో ముప్పాతిక వంతుగాని,మండపముపైన శుకనాసయొక్క యెత్తు చేయవలయును. లేక అచ్చట హార్మ్యమునైనను రచించ వచ్చును. ఇది భద్రమండప లక్షణము.

## 23. నందనమండపము

శ్లో॥ చతురశ్రీ కృతేక్షేత్రే నందభాగేన భాజయేత్ ॥ 39

భద్రంపడ్భాగమాయామం చతుర్భాగం తథాపరం ।

భాగభాగంతు నిష్క్రాంతం స్తంభైఃప్రాగ్గ్రీవ కల్పితైః ॥ 40

పంచభాగాయ తాజ్ఞేయా కర్ణే భద్రాంతరస్థితా ।

భిత్తిఃస్యాద్ భాగవిస్తారా సలిలాంతర సంయుతా ॥ 41

ఏవం చతుర్దిశంకార్యో నందనో మండపః సదా ॥ 41½

తా॥ చతురశ్రప్రదేశమును 9 భాగములుచేసి భద్రము యొక్క విస్తారము 4 భాగములును, పొడవు 6 భాగములును, నిర్గమము 1భాగమును, స్తంభములు ప్రాగ్గ్రీవములతోగూడ 5 భాగములపొడవున రచించవలయును. భద్రముల సందున కర్ణములను రచించవలయును. గోడ మండపము 1 భాగము చేయవలయును. జలమార్గములను కల్పించవలయును. ఇట్లు నలువైపుల రచించిరేని నందనమండప మగును.

## 24. మహేంద్ర మండపము

శ్లో॥ మహేంద్రస్య తలచ్ఛందః కర్ణాలాంగల సంయుతౌ ॥ 42

చతుర్భాగాయతోదిక్షు దారుకర్మ విభూషితః ।

ద్విభాగికాని శృంగాణి క్షోభయేదు దకాంతరైః ॥ 43

చతుర్భాగాయతం భద్రంభాగ మేకంతు విస్తృతం ।

ఏకతశ్చముఖం దద్యాద్ దారుకర్మ పరిచ్యుతమ్ ॥ 44

తా॥ పైజెప్పిన భాగములతోనే మండపమునకు నాలుగు మూలలయందును నాగలివలె ఖండపు గోడలును, షడ్దారుకార్య

లంకారములును, శృంగములును, 2 భాగములును, జలమార్గములతో గూడను రచించవలెను. భద్రముయొక్క పొడవు 4 భాగములు, విస్తారము 2 భాగము ఇట్లు నలుప్రైపుల రచించినయెడల మహేంద్ర మండపమగును. దారుకర్మ రహితముగాను చేయవచ్చును.

## 25. వర్ధమాన మండపము

శ్లో॥ నందనశ్చేద్బహిర్భద్రై ర్జలమార్గై ర్వివర్జితః ।
భాగద్వితయ విస్తారో భాగమేకం వినిర్గతమ్ ॥ 45
ప్రాగ్గ్రీవ పార్శ్వయోర్ద ద్వాదుచ్ఛాయోర్ధ్వ పదస్థితః ।
వాతాయనంవా కుర్వీత వర్ధమాన స్తథా భవేత్ ॥ 46

తా॥ పై జెప్పిన 9 భాగములతోనే వెలుపల భద్రములను 2 భాగముల విస్తారముతోను 1 భాగము నిర్గమముతోను జలమార్గములు లేకుండ రచించి ప్రాగ్గ్రీవమునకు రెండువైపుల 1 భాగము యెత్తున కిటికీలను రచించిన యెడల వర్ధమాన మండపమగును.

## 26. స్వస్తిక మండపము

శ్లో॥ పక్షద్వయే నందనస్య భద్రైర్భి త్త్యభివేష్టయేత్ ।
గవాక్షకై రలం కుర్యాన్న కుర్యాదుద కాంతరమ్ ॥ 47
స్వస్తికోఽయం సమాఖ్యాతః సర్వలక్షణ లక్షితః ॥ 47½

తా॥ పై జెప్పిన మండపముననే రెండుప్రక్కల భద్రములును, చుట్టుగోడయును, గవాక్షులును రచించి రేని స్వస్తికమండపమగును.

## 27. సర్వతో భద్రమండపము

శ్లో॥ అథాభిధీయతే సమ్యక్ సర్వతోభద్ర లక్షణం ॥ 48

కర్ణేకర్ణే లాంగలేవై సార్ధభాగద్వయాయతమ్ ।
కార్యాపరస్పరం తేషు దారుకర్మ వికల్పనా ॥ 49
భాగేనైకేన నిర్యాతం భాగషట్కేన చాయతం ।
షడ్దారుకద్వయం భద్రం కారయేద్ బాహ్యతః స్థితమ్ ॥ 50

తా॥ పై కొలతలతోనే నలుమూలలయందు నాగలివలె ఖండపు గోడలు $1\frac{1}{2}$ భాగము పొడవున రచించవలెను. దారుకర్మము నిష్టానుసారముగా జేసి షడ్దారుకములను రెండింటిని కల్పించి భద్రము పొడవు 6 భాగములును నిర్గమము 1 భాగమును చేసిన యెడల సర్వతో భద్రమండప మగును.

## 28. మహాపద్మ మండపము

శ్లో॥ చతురశ్రీకృతే క్షేత్రే తత్రాష్టాభక్తై ర్విభాజయేత్ ।
త్యక్త్వా తస్మిన్ మధ్యేకర్ణే ష్వాదధ్యాల్లాంగలానిచ ॥ 51
చతుర్భాగాంతరస్థాని షడ్దారుకయుతానిచ ।
కర్తవ్యం భాగనిష్కాంతం దిక్షుభద్ర చతుష్టయమ్ ॥ 52
చతుష్పదస్తదాయామాత్ సర్వతోఽలిందకోబహిః ।
ప్రతిభద్రాణి కుర్వీత చతుర్భాగాయతానిచ ॥ 53
నిర్గతాని ద్విభాగేన దిక్షుస్తంభాన్వితానిచ ।
ఇత్యేతైర్లక్షణై ర్యుక్తోమహాపద్మః ప్రకీర్తితః ॥ 54

తా॥ పూర్వమువలెనే భాగములుచేసి నలు మూలలయందు నాగలివలె ఖండపు గోడలను రచించి షడ్దారుకము 4 భాగములుచేసి నలుదిశలయందు పొడవు 6 భాగములును 1 భాగము నిర్గమముతోను భద్రములను రచించవలెను. 4 భాగముల పొడవున అంతటను అలిందములను చేయవలయును. ప్రతి భద్రములు పొడవు 4 భాగ

ములు నిర్గమము 2 భాగములు చేయవలెను. నలుదిశలయందు స్తంభములనుంచిరేని మహాపద్మ మండపమగును.

## 29. గృహరాజ మండపము

శ్లో॥ చతురశ్రీ కృతే క్షేత్రే చతుష్కోణ విభూషితే ।
అలిందవేష్టితం కుర్యాత్ ప్రాగ్గ్రీవం ముఖసంశ్రితమ్ ॥ 55
గవాక్ష కాశ్చకర్తవ్యా స్తథా చంద్రావలోకనాః ।
వాతాయనా స్తథో ర్ధ్వతాః సమంతా ద్రూపశోభితాః ॥ 56
గృహరాజ క్రియాహ్యేవం సర్వశోభా సమన్వితా ।
ఏవం లక్షణ సంయుక్తం మాతౄణామపి మందిరమ్ ॥ 57

తా॥ నలుచదరపు నేలను సమాన భాగములుచేసి చుట్టును అలిందములును, ద్వారమున ప్రాగ్గ్రీవమును, కిటికీలును, కిటికీలపైన అర్థచంద్రాకారమైన ఆర్చిలును కలది, గృహరాజ మండపము మాతృకా దేవతల కుపయోగించును.

శ్లో॥ ఊర్ధ్వతః శుకనాసస్య శుకనాసస్య మూలతః ।
కనీయసం మండపానాం కర్తు రిచ్ఛావ శాద్భవేత్ । 58
పార్శ్వయో రుభయోస్తుల్యాం విదధ్యాత్తిర్య గాయతం ।
వ్యాపిచతుష్కర ఘనధ్యాపివా ... ... ... ...॥ 59
ప్రాసాదస్య సముత్థానం విదధ్యాన్మండపం బహిరః ।
ద్వార విస్తారవిస్తీర్ణా స్తేషుకార్యా గవాక్షకాః ॥ 60
సమాసపాద పాదోనా సార్థాచోచ్ఛ్రితిరాయతా ।
అష్టాంగుల సమోపేతా దశాంశే ద్వారవిస్తృతే ॥ 61
విస్తారో మండప స్తంభ ద్వారోచ్ఛ్రాయ సమోచ్ఛ్రితిః ।
గర్భవ్యాసో మండపస్య సాష్టాంశంసాంశ ఏవచ ॥ 62

తా॥ శుకనాసముయొక్క పైనగాని, శుకనాసముయొక్క మొదటగాని, మంటపములకు శ్రేష్ఠము. మధ్యమము అధమము అను విధముల ననుసరించి చేయదగును. అడ్డమున రెండువైపుల సమానముగా పనులను చేయవలయును. ఆలయముతో సమానముగా మండపమును రచించవలయును. ద్వారముకూడ దేవద్వారముతో సమానముగా నుండవలయును. ద్వారమునకు రెండువైపుల కిటికీలను చేయవలయును. ద్వారముయొత్తు విస్తారమునకు రెట్టింపు. $1\frac{3}{4}$ - $1\frac{1}{2}$ - $1\frac{1}{4}$ ఇట్లు క్రమముగా పై అంతస్తులకు ఎత్తును చేయదగును. మండపములో 10వ వంతు ద్వారముయొక్క విస్తారము మండప స్తంభము ద్వారముయొత్తు సమానముగా నుండవలెను. ఆలయగర్భమునకంటె మండప గర్భము విస్తారము 8వ వంతు మొదలుకొని రెట్టింపు వఱకు పెంచవచ్చును.

## 30. వర్ధమానాద్యష్ట మండపములు

అపరాజిత పృచ్ఛ 187వ సూత్రము విశ్వకర్మోవాచ :

శ్లో॥ వర్ధమానఃస్వస్తి కాఖ్యోగరుడః సురనందనః ।
సర్వతోభద్ర కైలాసేంద్ర నీలారత్న సంభవః ॥ 1
చతురస్రో వర్ధమానః స్వస్తికోభద్ర సంయుతః ।
గరుడఃసః ప్రతిరథః సురానందః ప్రభద్రకైః ॥ 2
కర్ణోదైః సర్వతోభద్రః కైలాసోభద్రకోదకైః ।
ప్రతిరథావింద్రనీలః త్రిభిః స్యా ద్రత్నసంభవః ॥ 3
ఇత్యష్టౌచ సమాఖ్యాతా వర్ధమానాది మండపాః ।
శాహ్యాచ్ఛందే ప్రకర్తవ్యా మండపాః సర్వకామదాః ॥ 4

తా॥ 1 చతురశ్రము కలది వర్ధమాన మండపము, 2 భద్రములుకలది స్వస్తిమండపము, 3 భద్రములును ప్రతిరథములునుకలది గరుడ మండపము, 4 భద్రములయందు ప్రతిభద్రములను రచింపబడినది సురానంద మండపము, 5 కర్ణకూటములయందు జలమా

ర్గము లుంచినది సర్వతోభద్ర మండపము, 6 భద్రములయందు జలమార్గము లుంచబడినది కైలాస మండపము, 7 ప్రతి రథముల యందు జలమార్గముకలది ఇంద్రనీల మండపము, 8 అన్నింటి యందును జలమార్గములుకలది రత్నసంభవ మండపము. ఇతరమైన అన్నిపనులును పూర్వము చెప్పబడియున్నది.

## 31. ద్వాదశముఖ మండపము

శ్లో॥ సుభద్రశ్చ కిరీటీచ దుందుభిః ప్రాంత ఏవచ ।
మనోహరశ్చ శాంతశ్చ నందాఖ్యశ్చ సుదర్శనః ॥ 15
రమ్యకశ్చ సునాభశ్చ సింహః సూర్యాత్మక స్తథా ।
నిగూఢాగ్రే త్రికంఖ్యాతం ద్వాదశేముఖ మండపాః ॥ 16
ద్వారాగ్రేచైవ నిర్గూఢం తదగ్రేచ చతుష్కికా ।
సుభద్రో నామవిజ్ఞేయో మండపః సర్వకామదః ॥ 17
ఉభయోః కక్షయోర్దద్యాత్ కిరీటీ నామతః స్మృతః ।
ఏకంచ దుందుభిః పూర్వే అథోభాప్రాంతత స్తథా ॥ 18
పూర్వే చతుష్కికాయాంచ వామతశ్చ మనోహరః ।
శాంతశ్చైతదుభాభ్యాంచ స్తంభై ర్ద్వ్యష్టభి రేవచ ॥ 19
మూలప్రాసాద ద్విగుణం త్రికాణాం పృథునిర్గతం ।
త్రిభిశ్చ తుష్కికాఽఽయామే పృథుత్వేత్రి భిరేవచ ॥ 20
సర్వప్రాసాద పీఠస్య సమాఖ్యా తంత్రికంతథా ।
పునరేవ ప్రవక్ష్యామి తద్విధాన్ షట్చమండపాన్ ॥ 21
తస్యబాహ్యే పునర్దద్యాత్ ప్రత్యలిందమను క్రమాత్ ।
చతుష్కీ క్రమయోగేన మండపాన్ షట్చలక్షయేత్ ॥ 22
చతుష్కికేచే త్పూర్వేఽగ్రే నందాఖ్యః సర్వకామదః ।
త్యక్త్వాగ్రే చోదశేగర్భే దద్యాచ్చైవ సుదర్శనః ॥ 23
ఉభేకక్షే పునశ్చాగ్రే రమ్యకః సముదాహృతః ।
అగ్రే ద్విచతుష్కికాభ్యాం సునాభోనామ సంప్రతః ॥ 24

అలిందయుక్తో ద్వాపక్షౌ సింహనామాన ఉచ్యతే ।
ముక్తకోణాకృతిః స్థిత్వా పూర్వకర్ణే సూర్యాత్మకః ॥ 25
నాలోద్భవః పృథుత్వేచ చతుః క్షణాగ్ర నిర్గతః ।
క్షణేక్షణే చతుష్కా వితాన సంవరణోదయః ॥ 26
ఇతి సూత్ర సంతాన గుణకీర్తి ప్రకాశప్రోక్త్య శ్రీ భువన దేవాచార్యోక్తా పరాభిత పృచ్ఛాయాం వింశతి మండపాధి కారోనామ సప్తాశీత్యుత్తర శతతమం సూత్రమ్.

తా॥ నిగూఢమయిన కోనేళ్లుగల మండపములను చెప్పుచున్నాడు. 1 ద్వారముముందు అర్ధగోడయును దానిముందు కోనేరుగలది సుభద్రము, 2 కుడియెడమ దశలయందు కోనేళ్లుగలది కిరీటి మండపము, 3 తూర్పువైపున మాత్రమే కోనేరుగలది దుందుభి మండపము, 4 తూర్పునను దక్షిణముననూ, (ముందుకుడి వైపున) కోనేళ్లుగలది ప్రాంత మండపము, 5 తూర్పునను, ఉత్తరమునను ముందును ఎడమ వైపునను కోనేళ్లుగలది మనోహర మండపము, 6 కుడివైపునను, ఎడమవైపునను కోనేళ్లును, 8. 8 స్తంభములతో భద్రములను రచింపబడినది శాంత మండపము.

ప్రధాన దేవాలయమునకు రెట్టింపుగాను, భద్రములయొక్క నిర్గమము అధికముగాను, కోనేళ్లు పెద్దవిగానుగల మండపములను చెప్పుచున్నాడు. తూర్పున ప్రత్యలిందమును, కోనేరునుకలది నంద మండపము గర్భమున కోనేరుగలది సుదర్శన మండపము,ముందును ఇరువైపులను కోనేళ్లుగలది రమ్యకమండపము ద్వారమునకు ముందు రెండు కోనేళ్లుగలది సునాభ మండపము కుడియెడమల కోనేళ్లు గలది సింహ మండపము, ముక్త కోణాకృతిగానుండి మూడువైపుల కోనేళ్లుగలది సూర్యాత్మక మండపము.

## 32. ప్రాగ్గ్రీవాది షోడశ మండపములు

అపరాజితపృచ్ఛ 188వ సూత్రము విశ్వకర్మోవాచ :
శ్లో॥ ప్రాసాదాగ్రేతుద్వౌ స్తంభౌ ప్రాగ్గ్రీవః పరికీర్తితః ।
చతుష్కశ్చ చతుః స్తంభైః షడ్భిః స్తంభైశ్చసన్ముఖః ॥ 5

అష్టస్తంభైశ్చ త్రిజగో దశస్తంభైస్తు శ్రీధరః ।
దక్షిణే త్రికపుకారో స్తంభాద్వాదశ పుష్పకః ॥ 6
చతుష్కికాదగ్రే ద్వి సప్తస్తభైశ్చ శ్రీపదః ।
ద్వ్యష్టస్తభైః శ్రియానందః సంవరోఽగ్రచ చతుష్కికః ॥ 7
త్యక్తచతుష్కికః పక్ష ప్రాగ్గ్రీవే పృథివీధరః ।
అగ్రేచత్యక్త ప్రాగ్గ్రీవ చతుష్కి మధ్యతస్తథా ॥ 8
పుణ్యభద్రస్తదానామ జయంతాశ్చాగ్ర సంయుతః ।
పూర్వేత్రిసశ్చతుష్క్యశ్చ శంకుపర్ణశ్చ సంజ్ఞితః ॥ 9
ప్రాగ్గ్రీవా త్రిపదాపక్షీ పూర్వే చైకాచతుష్కికా ।
గోవిందశ్చ తదానామ భోగీస్యాత్త్రి పదాగ్రకః ॥ 10
ముక్తకోణేఽథ పూర్వేతు త్రిదశాఖ్యశ్చ నామతః ।
పంచవీతో పరికుర్యాద్ విఖ్యాతాన్ నృత్యమండపాన్ ॥ 11

తా॥ 1 దేవాలయము ముంపు 2 స్తంభములతో ప్రాగ్గ్రీవముకలది ప్రాగ్గ్రీవ మండపము, 2 నాలుగు స్తంభములతో ప్రాగ్గ్రీవముకలది చతుష్క మండపము, 3 ఆఱు స్తంభములతో ప్రాగ్గ్రీవముకలది సన్ముఖ మండపము, 4 ఎనిమిది స్తంభములతో ప్రాగ్గ్రీవముకలది త్రిజగ మండపము, 5 పది స్తంభములతో ప్రాగ్గ్రీవము కలది శ్రీధర మండపము, 6 పదిరెండు స్తంభములతో ప్రాగ్గ్రీవము కలది పుష్పక మండపము, 7 ముందు కోనేరును పదునాల్గు స్తంభములతో ప్రాగ్గ్రీవముకలది శ్రీపద మండపము 8 పదునాఱు స్తంభములతో ప్రాగ్గ్రీవముకలది శ్రియానంద మండపము, 9 ముందు కోనేరుకూడ నుండెనేని సంవర మండపము, 10 కోనేరు లేకుండ ఇరువైపుల ప్రాగ్గ్రీవము లుండెనేని పృథివీధర మండపము, 11 ముందు ప్రాగ్గ్రీవమును తీసివేసి నడుమ కోనేరును రచించిరేని పుణ్యభద్ర మండపము, 12 ముందు ప్రాగ్గ్రీవముకూడ నుండెనేని జయంత మండపము, 13 ముందువైపున 3 కోనేరు లుండెనేని శంకుపర్ణ మండపము, 14 ప్రాగ్గ్రీవములు ఇరువైపులను ముందును

3 భాగముల చొప్పున నుండి ముందు కోనేరును రచించిన యెడల గోవింద మండపమగును. 15 ముందువైపున మాత్రమే 3భాగములు ప్రాగ్గ్రీవముకలది మహాభోగి మండపమగును. 16 ముక్తకోణములును, తూర్పున కోనేరుకలది త్రిదశ మండపము. ఇవి యన్నియును పంచవిధములైన పీఠములపయి నిర్మించదగినవి.

## 33. మేర్వాది పంచవింశతి మండపములు

అపరాజిత పృచ్ఛ 188వ సూత్రము :

శ్లో॥ చతురశ్రీకృతే క్షేత్రే అష్టధా ప్రతిభాజితే ।
భవేన్మధ్యే ద్విభాగస్తు చతుష్కః సంవృతోధరైః ॥ 20
అలిందం భాగికం కుర్యాద్ ద్వాదశ స్తంభ కోచ్ఛ్రితం ।
ద్వితీయే వింశతి స్తంభై రష్టా వింశతిభిః పరః ॥ 21
భద్రంతు భాగనిష్కాసం షడ్భాగం చైవవిస్తరే ।
ప్రతిభద్రం తతోభాగే చతుర్భాగంతు విస్తరమ్ ॥ 22
ద్విభాగాయామ విస్తారః ప్రాగ్గ్రీవఃస్యాచ్చ చతుర్దిశం ।
సూర్యోత్తర శతస్తంభా భూమికాపంచధోచ్ఛ్రితా ॥ 23
మేరుమందర ఉక్తాశ్చ ద్విభామోర్ధ్వేచ మాడతః ।
ప్రకర్తవ్యాః సంవరణా శ్చాద్యకూట ఘంటాదితః ॥ 24
మాడోఽపితాదృశః కార్యో యాదృశో మేరుమండపః ।
ద్విద్విస్తంభహ్రాస్వయోగా న్మండపాఃస్యు రనుక్రమాత్ ॥ 25
చతుఃషష్టి స్తంభకాంతం మండపాః పంచవింశతిః ।
తదూర్ధ్వే వైసంవరణాఽనేకాలిందైశ్చ సంయుతా ॥ 26
శేషం విచ్ఛిన్నరూపాది కల్పయేచ్చ యథాక్రమః ।
అతఃప్రాసాద తుల్యాచ ద్వితీయా భూమిరూర్ధ్వతః ॥ 27
ప్రాసాద స్కంధహీనాంగా ప్రకర్తవ్యా తృదీయకా ।
సమస్తావరణచ్ఛాద్య సంవరణం వితానకమ్ ॥ 28
ప్రాంగణే మాండరూపాఢ్యాః కర్తవ్యాః శుభలక్షణాః ॥ 29

తా॥ చతురశ్ర ప్రదేశమును 8 భాగములుచేసి దాని నడుమ 2 భాగములు కోనేరును దానిచుట్టు బలమైన స్తంభములు 4 ను, అలిందము 1 భాగమును మరల నాలుగు మూలలనుకలిపి 12 స్తంభములును, రెండవవరుస చుట్టూను స్తంభములు 20 ఆతరువాత వరుస 28 స్తంభములు భద్రముయొక్క నిర్గమము 1 భాగము విస్తారము 6 భాగములు ప్రతిభద్రము విస్తారము 4 భాగములు నిర్గమము 1 భాగము, నలుదిశలయందు ప్రాగ్గ్రీవములు 2-2 భాగములు నలుచదరముగాను, ఇట్లు 112 స్తంభములతో 5 అంతస్తులుగాను, మేరు మందర మండపములు 2 ను రెండతస్తుల వఱకు సాదాగా రచించి ఆపైన విమానమును సంవరణ భాద్యము, కూటములు, ఘంటకలశము ఇట్లు రచించవలెను. మేరువు, కంటె 2 స్తంభములు తగ్గినది అనగా 110 స్తంభములుకలది మందర మండపము. 108 స్తంభములుకలది కైలాస మండపము. 106 స్తంభములుకలది హిమవన్మండపము, 104 స్తంభములు కలది గంధమాదన మండపము, 102 స్తంభములు కలది హేమకూట మండపము, 100 స్తంభములుకలది రత్నకూట మండపము, 98 స్తంభములుకలది శృంగవన్మండపము, 96 స్తంభములుకలది ఇంద్రనీల మండపము, 94 స్తంభములుకలది పద్మరాగ మండపము, 92 స్తంభములుకలది మహాపద్మ మండపము, 90 స్తంభములుకలది కీర్తి పతాక మండపము, 88 స్తంభములుకలది పూర్ణ మండపము, 86 స్తంభములుకలది శతశృంగ మండపము, 84 స్తంభముకలది సురప్రియ మండపము. 82 స్తంభములుకలది శాంతిదేహ మండపము, 80 స్తంభములుకలది పుణ్యాత్మ మండపము, 78 స్తంభములు భూర్మండపము, 76 స్తంభములుకలది భువర్మండపము, 74 స్తంభములుకలది స్వర్మండపము. 72 స్తంభములుకలది మహాకాంత మండపము, 70 స్తంభములుకలది పురుషాంత మండపము, 68 స్తంభములుకలది ప్రతాపవర్ధన మండపము, 66 స్తంభములు కలది లక్ష్మీవిలాస మండపము, 64 స్తంభములుకలది త్రైలోక్య విజయ మండపము. ఇట్లు 25 భేదములు కలవు. రెండవ అంతస్తు

వఱకు దేవాలయముతో సమానమైన కొలతలతో రచించి ఆపైన దేవాలయ స్కంధమునకు దిగువగానుండునట్లు విమానములను రచించవలయును. ఇతరములు శిల్పి యిష్టానుసారముగా రచించవచ్చును.

## 34. నందనాద్యష్ట మండపము

అపరాజితపృచ్ఛ 188వ సూత్రము:

శ్లో॥ షోడశాంశం కృతం క్షేత్రం ద్విమధ్యే భ్రమభాగికం ।
ప్రత్యలిందై ర్ద్వితీయంచ తృతీయం పూర్వభద్రకే ॥ 40
భద్రేపరేచ తుర్థంచ పంచమం కక్షయో స్తథా ।
పూర్వభద్రా లిందైఃషష్ఠ పరాలిందైః సప్తకమ్ ॥ 41
కక్షద్వయే చాష్టమంతు అష్టావేవ నందనాదికాః ।
తదనుక్రమనామాని కథయామి సమాసతః ॥ 42
నందనోఽథో భద్రజయా విజయో మంగల స్తథా ।
పూర్ణోమహేంద్ర కశ్చైవ అష్టమో మకరధ్వజః ॥ 43
అష్టౌ సమతలాజ్ఞేయా దివ్యవితాన భూషితాః ।
ఊర్ధ్వే సంవరణాకారాః కర్తవ్యాః సర్వకామదాః ॥ 44

ఇతిసూత్ర సంతానగుణకీర్తి ప్రకాశప్రోక్త శ్రీ భువన దేవాచార్యోక్తా పరాజిత పృచ్ఛాయాం మండపసూత్ర నిర్ణయాధికారో నామాష్టా శీత్యుత్తర శతతమం సూత్రమ్.

తా॥ చతురశ్రప్రదేశమును 1 భాగములుచేసి మరలాదానిని రెండు భాగములుగాచేసి అందు నడుమ కోనేరు 1 భాగమును చుట్టును $\frac{1}{3}$ భాగము మండపమును రచించిరేని నందన మండపము పైజెప్పిన దానినే చుట్టును అలిందముతో మండపమును రచించిన యెడల భద్రమండపమగును. లేక తూర్పు వైపున భద్రమును రచించిన యెడల జయమండపమగును. పడమరదిశ యందుకూడ భద్రమును రచించినయెడల విజయమండపమగును. దక్షిణముననుు,

ఉత్తరమునను, భద్రములను రచించినయెడల మంగళ మండప మగును. తూర్పున అలిందములు భద్రమును రచించినయెడల పూర్ణ మండపమగును. పడమర భద్రమును అలిందములను రచించిన యెడల మహేంద్ర మండపమగును. ఉభయ పార్శ్వముల యందు భద్రములను అలిందములను రచించినయెడల మకరధ్వజ మండప మగును.

(అనుబంధము 48వ పటము చూడుము)

ఇది శ్రీ మద్విశ్వకర్మ వంశమూలర్షి పంచకమధ్య మాహాభౌవన
గోత్ర పవిత్ర, స్వర్ణాచ్ఛమాంబా వేంకట శివార్యపౌత్ర,
లక్ష్మాంబాకోటయ సుధీమణిపుత్ర, శ్రీ మద్గాయత్రీ
విరాడ్విశ్వకర్మ వరప్రసాదజనిత కవితా సుధారస
పాత్ర, పదవాక్య ప్రమాణనిధాన-విమర్శకా
చార్య-శిల్పకళాకోవిద-సర్వతంత్ర స్వతంత్ర-
స్థపతి తిలకాది బిరుదవిరాజమాన సుబ్ర
హ్మణ్యాభిధాన విరచిత నానావాస్తు
శిల్పాగమశాస్త్ర పరిశీలనాత్మ కాంధ్ర
తాత్పర్యసహిత భారతీయ మహాశిల్పము
నందు ప్రాకారలక్షణము, పరివార
దేవతలు గోపురములు, మండప
ములుగల దేవాలయభేదములు అను

అష్టమకళ



# 4వ పటము

------ ఇంద్ర శేష ------

చంద్ర సూర్య



5వ పటము



7 అంతస్తుల
గోపురం
ఎత్తు 36 భా.

# 6వ పటము (గోపుర స్థానములు) (8)


















ప్రధానాలయము

7వ పటము



(16) 2 అంతస్థులు

8వ పటము



(25) 3 అంతస్థులు

9వ పటము



20. 19

(4 అంతస్థులు)

10వ పటము



30

5 అంతస్థులు

11వ పటము



10 భా. ఒక అంతస్థు

12వ సటము



2అ. 19 భా.

13వ పటము



21 భా. 3 అంతస్థులు

14వ పటము



31భా. 4 అంతస్థులు

15వ పటము



49 భా. 5 అంతస్థులు

16వ పటము




18వ పటము







17వ పటము




19వ పటము

20వ పటము




21వ పటము



22వ పటము




23వ పటము







24వ పటము



25వ పటము

3.5 భా. 3 ద్వా. 30 స్తం

26వ పటము




27వ పటము



28వ పటము



6 - 8 భా. 60 స్తం.

29వ పటము



7 - 9 భా. 72 స్తం

30వ పటము

15 భా. 252 స్తం. 240 తోనూ చేయించవచ్చును.

31వ పటము

16 భా. 280 స్తం

మధ్యగదులు 16

264 తోనూ

చేయవచ్చును.





32వ పటము

8 - 10 భా.

96 స్తం.

33వ పటము

9 - 11 భా

112 స్తం.



34వ పటము



3 భా 16 స్తం

35వ పటము



4 భా 16 స్తం.

36వ పటము



6 భా. 36 స్తం.

37వ పటము



7 భా. 60 స్తం.

38వ పటము



8 భా. 64 స్తం.

39వ పటము



9 భా. 64 స్తం.

40వ పటము



11 భా. 108 స్తం.

41వ పటము



3 . 6 భా.

42వ పటము



4 . 8 భా  24 స్తం

43వ పటము



5 - 10 భా.  30 స్తం.

44వ పటము



6 - 12 భా.  64 స్తం.

45వ పటము



8 - 16 భా.  88 స్తం.

46వ పటము




47వ పటము



10 - 20 భా.

11.22 భాగములు చేసి మధ్య 3 - 14 చేయవచ్చును.

48వ పటము



శ్రీ

# భారతీయ మహాశిల్పము

## 9వ భాగము




రచయిత:

విమర్శకాచార్య, శిల్పకళాకోవిద

**స్వర్ణ సుబ్రహ్మణ్యకవి**





ప్రచురణకర్త:

**డా॥ స్వర్ణ వాచస్పతి B. V. Sc.**

# 9వ భాగం విషయసూచిక

| కాశ్యపశిల్పము | మానసార | శిల్పరత్నము | |
|---|---|---|---|
| 49-46-58-59 | 52-52 | ఉత్తరభాగము | |
| 50-61-62-63 | 62-51 | 1-3 | |
| 64-65-66-67-68 | | పూర్వభాగం | సమరాంగణ |
| 69-70-71-72 | | 14 | |
| 73-74-75-76 | | ,, ,, 40 | సూత్రధార |
| 77-78-60-48 | | ఉత్తర భాగం | 70-77 |
| 47 | | 21వా॥ | |
| | | 22-14వ అ. | |
| | | 25-29 వరకు | |

| అపరాజిత పృచ్ఛ | | |
|---|---|---|
| 202-205-198 | | |
| 199-204-200 | మయవాస్తు | ఆత్రేయ శిల్పము |
| 206-208-213 | | |
| 212-214 | | |

శ్రీ

# భారతీయ మహాశిల్పము

## నవమకళ

శ్రీ మద్విరాట్ విశ్వకర్మణేనమః

## 1. ఇష్టదేవతాస్తుతి

శ్లో॥ దేవఃసపాతు భువనత్రయసూత్రధార
స్త్వాంబాల చంద్రకలికాంకిత జూటకోటిః
ఏతత్ సమగ్రమపికారణమంతరేణ
కార్త్స్న్యాద సూత్రితమసూత్ర్యతయేన విశ్వమ్॥ (సమరాం)

శ్లో॥ ఉత్పత్తి రక్షణలయాన్ జగతాం ప్రకుర్వన్।
భూవారివహ్నిరామరుతోగగ నంచసూతే।
నానాసురేశ్వర కిరీట విలోలమాలా
భృంగానవీథ చరణాంబురుహంనమామి॥ (మానసార)

జయతివరదమూర్తి ర్మంగలం మంగలానాం
జయతి సకలవంద్యా భారతీ బ్రహ్మరూపా।
జయతిభువనమాతా చిన్మయీ మోక్షరూపా
దిశతుమమ మహేశో వాఙ్మయః శబ్దరూపమ్॥ (విశ్వప్రు)

శ్లో॥ అభీప్సితార్థ సిద్ధ్యర్థం పూజితోయః సురైరపి
సర్వ విఘ్నచ్ఛిదేతస్మై గణాధిపతయేనమః॥ (అపరా)

శ్లో॥ మహాదేవం శశిధరం సర్వలోకైక నాయకం
మహేంద్ర మధ్యగంశాంతం పార్వతీ సహితం పరమ్॥
దేవదానవ సిద్ధాద్యైః సేవితంసుర పూజితం।
ప్రణమ్య దేవచరణమేవం బ్రూయాత్సకశ్యపః॥ (కాశ్య)

శ్లో॥ మాయావైభవ కల్పితాగుణమయా
బ్రహ్మాండ భాండాంతరే జీవాఖ్యస్తదధిష్ఠితాశ్చవివిధా
యత్ సంస్థితాయన్మయాః ఆత్మానం పరమంతమాపనిష
ద్వైర్వాక్యైః
సదాస్వస్తికైరన్విష్టం భువనైక నాథమమలం
వందే విరించాధిపమ్

శ్లో॥ పారుష్యాంగో యేనచాదా యాగానాం
వాస్యాత్మస్వాస్నిగ్ధతాం ప్రాపితోఽర్ఘః నిత్యం దేవైర
ర్చితో విశ్వకర్మా సోఽయంభూయాత్సర్వ లోకోదయాతు॥
" త్రిపురపురత్రయరచనా యత్కరయోః కర్మచాతురీజాతా
శిల్పివరంతందనుజైరర్చిత చరణంమయం వందే॥ (శిల్పరత్నం)

## 2. శిలాసంగ్రహణమునకు శుభశకునములు

### కాశ్యప శిల్పము 49వ పటలము

శ్లో॥ ఆచార్యః శిల్పిసంయుక్తః శిలాగ్రహణమాచరేత్।
దివ్యంతరిక్ష భౌమాని నిమిత్తాన్యుపలక్షయేత్॥ 19
వాయసందక్షిణేవామా దాగతంచతథైవచ।
శ్యేనంలై దక్షిణేవామే గృధ్రంమాంసేనసంయుతమ్॥ 20
కన్యాగోదర్శనంచైవ నావస్త్రావాహనంతథా।
దధినాపూర్ణకుంభంచ క్షీరకుంభంతథైవచ॥ 21
పుష్పం పుష్పధరంవాఽపి సుతవద్యువతిస్త్రీయః
అన్నంచమాంసాహారంచ శివభక్తిపరాయణమ్॥ 22
జ్వాలానలంచ దీపంచ జవైః పూర్ణఘటావృతం।
వరాహంచ గజంచైవ వేశ్యాచాత్యంత సుందరీ॥ 23
శుభాన్యేతాని భౌమాని అశుభం విపరీతకమ్॥ 23½

తా॥ స్థపతి ఉపశిల్పులతో గూడ శిలను తెచ్చుటకైబయలు దేరునప్పుడు శుభశకునముల లయ్యేనేని శుభము. కాకి యెడమ నుండి కుడి కివచ్చినను. డేగ కుడినగాని యెడమనుగాని కనుపించినను, గద్ద మాంసమును నోటగరచుకొని యున్నను, కన్యలు, ఆవులు కనుపడినను, ఎదురు వచ్చినను, పెరుగుకుండ పాలదుత్త, పూలు, పూలు ధరించినవారు, బిడ్డచంకనగల యౌవనస్త్రీలు, అన్నము, మాంసము, శివభక్తి కలవారు, మండుచున్న అగ్ని, దీపము, మంచినీళ్ళ కడవ, పంది, ఏనుఁగు, జడవేసికొనినస్త్రీ, ఇట్టి శకునములు శుభమును తెలియజేయును. శిల్పరత్నము, ఉత్తర భాగమున

శ్లో॥ ప్రీహాతుః శాలయో మాంసం, మధుచ్ఛత్రం చచామరం
మాంగల్యో యోషితో రాజా, ధ్వజః పూర్ణధనూంషిచ॥ 7
క్షీరిణే శాస్తురంగాశ్చ, దృశ్యతేఽ భిముఖం యదా.
యామరిష్టార్ధ సిద్ధ్యైస్యాత్తో సుతరాంతత్ప్ర దక్షిణమ్॥ 8
గాలికావా యసరుతం ప్రయాణేనామతః శుభం।
ప్రవేశేదక్షిణేశస్తం క్షుతంహ్యేదావశోభనమ్॥ 9
అన్యత్రతప్పృష్టేవామేచ శస్తంన్యాణాంచకూజితం
స్యాత్తాసుభరటాదీనాం వామేశస్తంతుదక్షిణే॥ 10
గానంచదిశి శాంతాయాం పింగలానాంద్వయంహితం।
సృగాలవా యసావ్యాఘ్ర శ్చకోరశ్చకపోతికా॥ 11
వామాదీ దక్షిణగాః శస్తాః ఫణిసర్వత్ర నిందితః।
శశకౌశికగృధ్రాశ్చ శ్వేనాశ్చమృగడుండుభాః॥ 12
దక్షిణాద్వామగాః శస్తాః శుభావాచః శుభప్రదాః
జాతేతునోద్వనిర్వామే గతిర్దక్షిణతః శుభా॥ 13

ఇట్లెన్నియో కలవు.

## 3. అపశకునములు తచ్ఛాంతి

### కాశ్యప శిల్పము. 49వ పటలము

శ్లో॥ ఉల్కాపాతంది శాందాహం మహావాత ప్రవర్తనమ్। 24
అశుభాన్యంతరిక్షాని భౌమాంశ్శోభనముచ్యతే॥
ముక్తకేశనరాశ్చైవ కీర్ణకేశాస్తథైవచ 25
తైలాభ్యక్తాశ్చనగ్నాశ్చ కాషాయవసనాన్వితాః।
దర్పనేనైవమృద్భాండం తైలపాత్రంతథైవచ॥ 26
భిన్ననాసాకర్ణకాశ్చ హీనాంగశ్చాధికాంగవాన్।
పుత్రహీనాతునారీచ విధవాచతథైవచ॥ 27
బహుధక్షేశ్చ భౌమాన్యేతానినైవర్జయేచ్ఛుభే।
శుభంచేద్గమనం కుర్యాదశుభంచేద్వివర్జయేత్॥ 28
అశుభేత్వగ్ని మాస్థిర్య శివేనైవశతాహుతీః
సమిదాజ్యోదనైః కుర్యాన్నాగారితం నాగభూషణమ్॥ 29
దత్వాశివంనమస్కృత్య గచ్ఛేదాచార్యశిల్పిచ।
పర్వతేసాగరేతీర్థే క్షేత్రేచైవనేపునః॥ 30
క్షీరవృక్షసమీపేచ దేవహర్మ్య సమీపవే।
నదీతటాకతీరేవా శిలాంసంగృహ్య శిల్పకః॥ 31
అన్యస్థానేనగృహ్ణీయాత్ గ్రాహితేస్యాత్తు నాశనమ్॥ 31½

తా॥ చుక్కలు రాలుట, తగులబడుట, పెద్దగాలి విసరుట, తలవిరియబోసికొన్న మనుష్యులును, చింపిరి తలగల మనుష్యులును, తలకు చమురు అంటుకొనినవారును, దిగంబరులును, కానివస్త్రములు గలవారును, నీళ్ళులేని మట్టికడములను, నూనెడబ్బా, లేకనూనెసీసా, ముక్కు తెగినవాడును, చెవి తెగినవాడును, ఏదో ఒక అవయవము లేనివాడును, చిల్లవ్రేలు, కణితి మొదలైనవి కలవాడును, బిడ్డలు లేని

స్త్రీయును, భర్త లేని స్త్రీయును తిండిపోతులును, ఇట్టి దర్శనములు అపశకునములు, కనుక శుభశకునమైన యెడల వెళ్ళవలయును. అపశకునమయ్యేనేని తిరిగి యింటికివచ్చి అగ్నినావాహనముచేసి శివ మంత్రముతో సమిధలు, నెయ్యి, అన్నము వీనితో 108 హోమ ములుచేసి యీశ్వరునకు నమస్కరించి స్థపతియును, శిల్పాచార్యు డును బయలుదేరి, కొండ,సముద్రము, మహర్షులు స్నానము చేయు నదిగాని, మహర్షులునివసించుపుణ్యక్షేత్రముగాని, లేక సామాన్యమైన యడవిగాని, చేరి అచ్చటి పాలుగలచెట్టు సమీపమునగాని, దేవాల యము ప్రక్కనుగాని, ఏటియొడ్డునగాని, చెరువులోగాని, శిలనుతీయ వలెను. లేక యితర ప్రదేశముల యందుగల శిలను తీసిరేని దానిని గ్రహించినను తుబమానుడునశించును.

## 4. శిలా లక్షణము

### కాశ్యపశిల్పము 49వ పటలము

శ్లో॥ శ్వేతారక్తాచ పీతాచ కృష్ణాచైవచతుర్విధా॥ 32
గోక్షీరశంఖకుందేందు ముక్తాస్ఫటికసన్నిభా।
మల్లికా కుసుమప్రఖ్యా శ్వేతాసప్తవిధాస్మృతా॥ 33

జపాకింశుకపుష్పాభా ఇంద్రగోపసమప్రభా।
జాతీఫలనిభాకారా శశరక్తసమప్రభా॥ 34

దాడిమీ పుష్పసంకాశా బంధూక కుసుమప్రభా్యా।
కురంటకుసుమప్రఖ్యా పీతాశైలాచ సప్తధా॥ 35

మహిషాక్షాంజనాభాసా నీలోత్పలసమాప్రభా।
భృంగమయూరకంఠాభా మషీపత్రసమతథా॥ 36

రాజావర్తనిభాకారా కృష్ణముద్గసమప్రభా।
ప్రాస్వముద్గ సమాకారా కృష్ణశైల దశాస్మృతా॥ 37

శ్వేతారక్తాచపీతాచ విప్రాదీనాంక్రమాద్భవేత్।
ధర్మకామార్థ మోక్షాంశ్చ దద్యుఃసతత మేవచ॥ 38
పరేషాంవాచకంశ్రేష్ఠం పరేషామపరంవినా।
ప్రతిలోమానులోమాభ్యాంభిన్నయోగం నగృహ్యతాన్॥ 39
ఆచార్య శిల్పినాచైవ సితవస్త్రధరావుభౌ।
శుక్లమాల్యానులిప్తాంగౌ పంచాంగభూషణాన్వితౌ॥ 40
ఉత్తారాదీనిసంగృహ్య శిలాంగచ్ఛేత్సమాహితౌ।
యస్మిన్దేశేశిలా శేతే తాంకృత్వాతు ప్రదక్షిణమ్॥ 41
దోషవర్జాంశిలాందృష్ట్వా పరిచ్ఛేద్య విశేషతః।
వర్ణాతపాగ్ని గంధాంచ సుకీర్ణాంక్షారవారిణామ్॥ 42
ముక్తేశస్థాంతటస్థాంచ కర్మాంతరేతు యోజితాం।
శర్కరాఢ్యాంచపంకాంచ జర్జరాంరూక్షసంయుతామ్। 43
రేఖాబిందుకలంకాది సంయుతాం పరివర్జయేత్।
సూత్రవద్వాతదాకార రవితశ్మిసమన్వితా॥ 44
వర్ణపాతరదాకారా రేఖాస్త్రైత్రివిధాస్మృతా।
జంబూఫలసమాకారా వాద్రాక్షాసదృశోపమా॥ 45
అన్యద్వావృత్తసంకాశా త్రివిధాబిందురేవహి।
కృష్ణలోహనిభాకారా కృష్ణభ్రమరసన్నిభా॥ 46
శిఖిపుచ్ఛసమాకారా కలంకాచచతుర్విధా।
ఖర్జూరపత్రసంకాశా దూర్వాస్తంబనిభాతథా॥ 47
వైణవాంకురసంకాశా లూతపాదవదాయుతా।
అన్యాశ్మసుసితారేఖా సర్వసంపత్సమృద్ధిదా॥ 48
కృష్ణకృష్ణావినాశాయ శ్వేతకృష్ణాతథైవహి।
తస్మాత్సర్వప్రయత్నేన ఇతరాపరిగృహ్యతామ్॥ 49
హరితాకృష్ణాశిలాగ్రాహ్యా సితవర్ణావిశేషతః।
ఖర్జూరపత్రసదృశా దూర్వాస్తంబాకృతిఃశుభా॥ 50

తా॥ జాతిలో నాలుగు రంగులు గలవు. తెలుపు, ఎరుపు, నలుపు. పసుపుమరల ఒక్కొక్క దానియందును కొన్ని భేదములు కలవు ఆవుపాలు, శంఖము, మొల్లపువ్వుచంద్రుడు, ముత్యము,పటికపు రాయి, మల్లెపువ్వు. ఇట్లు తెలుపులో 7 భేదములును, దాసనపువ్వు, మోదుగపువ్వు, మొగుడుపురుగు, లేక ఆరుద్రపురుగు, జాజికాయ, కుందేటి నెత్తురు, దానిమ్మపువ్వు, మంకెనపువ్వు, ఇట్లు ఎరుపులో 7 భేదములను. 'పీతాసువర్ణ సీంకాశా, రజనీచూర్ణ వర్ణకా, శంపాకపుష్ప సంకాశా, గోశ్రేణి సుమసన్నిభా, (మయమనం) గోరింటపువ్వు, బంగారము, పసుపు, తేలపువ్వు, తంగేడుపువ్వు, పుష్పనాగమణి, పంగపండుచాయ, నిమ్మపండు చాయ, ఇట్లు పసుపులో 7 భేదములును. దున్నపోతు కన్ను, కాటుక, నల్లకలువ, తుమ్మెద, నెమలి కంఠము, మణిపత్రము "నీలమేఘ సమావర్ణా, మాషవర్ణ సమాశిలా, ఇంద్రనీలసమాశైలం" (మలువాస్తు) నల్లపెసలు, నీలమేఘము, మినుములు, ఇంద్రనీలమణి. ఇట్లు నలుపులో 10 భేదములు కలవు. ఇందులో తెలుపు బ్రాహ్మణులకును, ఎరుపు క్షత్రియులకును, పసుపు, వైశ్యులకును, నలుపు శూద్రులకును, వరుసగా ధర్మము, కామము, అర్థము మోక్షమునిచ్చును. తక్కువ జాతివారికి తక్కువజాతి శిలను గాని, యెక్కువ జాతివారికి తక్కువజాతి శిలనుగాని తీయరాదు. ఆచార్యుడును శిల్పియును తెల్లని వస్త్రములను ధరించి తెల్లని పుష్పమాలలును తెల్లని గంధమును, గలవారై పంచాగశుద్ధి గలదినవలన శిల సమీపమునకు బోవలెను. ఆ శిలకు ముమ్మారు ప్రదక్షిణము చేసి దోషములున్నవో లేవో చక్కగా పరీక్షించి తెలుసుకొనిదానిని పగులగొట్టవలయును. ఎల్లప్పుడు వర్షమునకు తడియునది, ఎడమ ఎగడునది, నిప్పువలన తగులబడినది ఉప్పు నీటిలో నున్నది.కూడని ప్రదేశముననున్నది. ఏటి యొడ్డున నున్నది, ఏదో యొకపనికై తీయబడినది. మొరముకలది, బురదగలది, పాచిపట్టినది, లేక శిథిలమైనది.

కమకైనది చార, చుక్క, మచ్చ, మొదలగు దోషములు కలది. పనికి రాదు. రేఖాదోషము, నూలు పట్టినట్లు చుక్కగా నుండు గీతలుగాని సూర్యకిరణములవలె విప్పారినట్లుగా బోవుగీతలుగాని, వానకాలుగా అనగా ఏటవాలుగా బోవు గీతలుగాని, ఈ మూడును దోషములే. శేరేమపండువలెను. ద్రాక్షాపండ్ల గుత్తివలెను. వేరొక విధముగ్గా గుండ్రముగను ఇట్లు మూడు విధములు బిందుదోషము, ఇనుము వలెను, నల్లతుమ్మెదవలెను, నెమలి కన్నువలెను, ఇట్లు మచ్చ దోష ములు నాలుగు విధములు. ఖర్జూరపు మట్టవలెను, గరికకాడలవలెను, వెదురు మొలకలవలెను, సాలెపురుగు పాదములవలెను పొడవుగా నున్న గీతలును, ఇతరములైన రంగులుగల రాళ్ళయందు తెల్ల గీత లును, సమస్తమైన సంపదల నిచ్చును. నల్లరాతియందు నల్లచారలు నశింపజేయును. తెల్లరాతియందు నల్లని గీతలు కూడ నాశము కలు వియే. కనుక బహుజాగ్రత్తగా పరిశీలించి శుభకరమైన శిలను తీయ వలయును, పసుపు వన్నెకల రాతిని, నాలుపు వన్నెకల రాతిని, తెలుపు వన్నెగల రాతిని, ఖర్జూరపు ఆకువంటి గీతలుగల రాతిని, గరిక తీగలవంటి గీతలుగల రాతిని శుభకరమైనదానిని గావలియు వలయును.

## కాశ్యప శిల్పము 49వ పటలము

శ్లో॥ అవ్యక్తృష్ణాఽశుభాఖ్యాతా గోధానం ధననాశనమ్।
సకలరోగబింజ్ఞేయం రాజరాష్ట్ర వినాశనమ్॥ 51
బిందుః పుత్ర వినాశః స్యాద్దారిద్ర్యం శ్రీ వినాశనం,
ఏవంపరీక్ష్యబహుధా కారయేల్లక్షణాన్వితమ్॥ 52
బాలాయువతివృద్ధాచ పుంస్త్రీనపుంసకంతదా।
స్వరైకావృతిభేదైశ్చ పరిచ్ఛేదవిధింశ్రుణు॥ 53
ఘనకంసధ్వనిర్వాస్యా శిలాబాలాఇతిస్మృతా।
ఘంటాధ్వని సమాదీర్ఘా యువతిః సాప్రకీర్తితా॥ 54

వితతధ్వనిసంయుక్తా యాసావృద్ధా చకీర్తితా।
ఘంటాధ్వని సమోన్నాదా దీర్ఘాసాపుంశిలాఇవ॥ 55

తాలశబ్దసమాకారా దీర్ఘాయాసాశిలాస్త్రియః।
అస్నిగ్ధాఘ్ఘరరూక్షా స్వరహీనానపుంసకా॥ 56
స్వరైరేవసమాఖ్యాతా ఆకృత్యాభేదఉచ్యతే।
చతురశ్రాచవస్వశ్రా స్త్రీశిలేతిప్రకీర్తితా॥ 57
ఆయతాశ్రాచవృత్తాచ దశద్వాదశకోణకా।
పుంలింగాసాశిలాఖ్యాతా సువృత్తాసానపుంసకా॥ 58

దశాగ్రాంద్వాదశాగ్రాంచ బాలవృద్ధాంచవర్జయేత్।
పుంశిలాభిః కృతంలింగం స్త్రీశిలాభిస్తుపీఠకా॥ 59

నపుంసకశిలాభిస్తు పాదాధారః సమాచరేత్।
కృతంచవిపరీతంయత్ తత్సధాకర్తృనాశనమ్॥ 60
ప్రాగగ్రాంవోదగగ్రాంవా శిలాంసంగ్రాహ్యదేశికః।
ప్రాగగ్రేపశ్చిమంమూల ముదగగ్రంత్రదక్షిణే॥ 61
శంభుసౌమ్యగతంయత్తల్లింగాగ్రంతత్ప్రకీర్తితం।
అధోభాగంముఖంఖ్యాతం పృష్ఠమూర్ధ్వగతంభవేత్॥ 62

తా. పై జెప్పబడిన లక్షణములు లేని యితరములైన నల్లరాళ్లు ధనధాన్య పశుపుత్రాదిక్షయములను గలిగించును, ఇంతేకాకతీరని వ్యాధులునురాజుయొక్క రాజ్యమునకు చేటును కలిగించును. బిందు దోషము పుత్రులను జంపును. దరిద్రమును గలిగించును సంపదలు నశింపజేయును. బాల్యము, యౌవనము, వార్ధకము పురుష, స్త్రీ, నపుంసక రూపములు ధ్వనులవలనను ఆకారముల వలనను గ్రహించ వలయును. జేగంటవంటి ధ్వనియును, కురుచగనుండునదియును బాల శిల, ఘంటవంటి ధ్వనియును పొడవునుగలది యౌవనశిల. విస్తార మైన ధ్వనియుక్తమైనది వృద్ధశిల. తాళమువంటి ధ్వనిగలదియును

పొడవైనదియును స్త్రీశిల, నునుపులేనిది, చిక్కదనములేనిదిదోషము గలది కఱకుగలది తక్కువధ్వనిగలది నపుంసకశిల, ఇంతేకాక ఆకార భేదములును చెప్పబడినవి. నలుచదరములుగలది 8 కోణములుగలది స్త్రీశిల దీర్ఘచతురస్రమును, గుండ్రమును, పదిపది రెండుకోణములుగలదియును పురుషశిల. గుండ్రముగానున్నదినపుంసకశిల. అయితే 10-12తలలుగల దానిని, బాల, వృద్ధరూపములుగానిని విడువవలెను. పురుషశిలతో లింగ మును, స్త్రీశిలతో పీఠమును చేయవలయును. అడుగుననుంచబడు ఆధారశిలను నపుంసకశిలను చేయవచ్చును. ఇట్లుగాక వ్యతిరేకముగ చేయబడినయెడల కర్తను నశింపజేయును. తూర్పు శిరస్సుగాని, ఉత్త రపు శిరస్సుగాని, ఉండు శిలను తీయవలెను. తూర్పు తలయయ్యె పడమర మొదలు, ఈశాన్య శిరస్సుగాని ఉత్తరశిరస్సుగాని కలశిలను లింగముయొక్క తలనుగా రచించవలెను. అడుగు భాగము ముఖ మును పై భాగము వీపును చేయవలయును.

## 5. మానసారుని శిలాలక్షణము

మానసారము 52 అ

శ్లో॥ లింగానాం పీఠకానాంచ దేవదేవ్యాశ్చహర్మ్యకే॥ 79
శిలాసంగ్రహణంచాపి లక్షణంవక్ష్యతేఽధునా।
పర్వతేవావనేవాపి స్థపతిఃస్థాపకైఃసహ॥ 80
ప్రభాతేతుసముత్థాయ కర్తాచానుచరైఃసహ।
మార్గకేచోక్తవత్సర్వం పార్శ్వేతుశకునానికై॥ 81
సుముహూర్తేసులగ్నేచ శిలాసంగ్రహణం భవేత్।
ఉక్తవద్రథమారోప్య శిల్పశాలాం ప్రవేశయేత్॥ 82
పత్రావపీఠకాశ్మంచా నలావటేకదాశ్మనా।
ఆతపేనావపీఠంచేద్ వర్జయేత్వా శిలాసుధీః॥ 83

యత్పూర్వోత్తరాగ్రంజ్ఞాత్వా మూలందక్షిణపశ్చిమే।
అధోభాగంముఖంజ్ఞాత్వా శయనేచాపరోర్ధ్వకమ్॥ 84
పూర్వాగ్రాశ్చశిలాస్సర్వాః దక్షిణేసవ్యపార్శ్వకే।
ఉత్తరేవామభాగంస్యా దుత్తరాగ్రశిలాంవిదుః॥ 85

పూర్వేతుదక్షిణంపార్శ్వం పశ్చిమేవామపార్శ్వకం।
ఈశానాగ్రశిలానాంతు మూలంనైరృత్యదేశకే॥ 86
అన్యకోణేషుసర్వేషు మూలకుగ్రంతువిద్యతే।
దిక్షుదీర్ఘశిలాసర్వాః పుంశిలాశ్చప్రకీర్తితాః॥ 87
చతుష్కోణేషుదీర్ఘంస్యా చ్ఛిలాషండః ప్రకీర్తితః
ప్రభూతంచస్థితంసర్వం పృథ్వ్యాకాశాయతంతథా॥ 88
ఊర్ధ్వాగ్రమధ్యేమూలంచ ప్రాగుక్తదిక్తథైశకే।
తత్తమున్నతవక్త్రంచ యదిసంస్థాపనంభవేత్॥ 89
తత్పార్శ్వంపూర్వవద్జ్ఞాత్వా తస్యాకారమిహోచ్యతే।
మూలమగ్రంచమధ్యంచ సమాకారంతుపుంశిలా॥ 90
స్థూలమూలంకృశాగ్రంస్యాత్ స్త్రీశిలాతుప్రకాశితా।
స్థూలాగ్రంచకృశం మధ్యేస్థూలంనపుంసకంశిలా॥ 91
చతురశ్రంపుంశిలాప్రోక్తం వృత్తంస్యాద్వనితాశిలా
బహుధాచాగ్రశృంగంస్యాత్తన్నపుంసకమీరితమ్॥ 92
కాంసకాధ్వనినాదంస్యాత్ స్త్రీశిలాతుప్రకీర్తితా।
రత్నభాండధ్వనినాదం శిలాచపురుషంస్మృతమ్॥ 93
నిర్ధ్వనిచశిలానర్వం నస్త్రీనపుమాన్విదుః।
తాలధ్వనినినాదంస్యా చ్ఛిలాబాలాప్రకీర్తితా॥ 94
మహిషధ్వనిసంయుక్తా శిలావృద్ధా ప్రకీర్తితా।
పూర్వోక్త ధ్వనిరూపాభ్యా యౌవనాచశిలాభవేత్॥ 95

శిలాసర్వేషు వృద్ధాంచ శిలాంబాలాం వివర్జయేత్।
పుంశిలయానరంలింగం కుర్యాద్రేఖాంవివర్జయేత్॥ 96
శక్తీనాంపీఠకానాంచ స్త్రీశిలాసంగ్రహోభవేత్।
ప్రాసాదాదీనాంసర్వేషాం నపుంశకశిలాభవేత్॥ 97
శ్వేతంరక్తంచ పీతంచ శిలాకృష్ణంయథాక్రమాత్।
ద్విజాతేనాంచవర్ణానాం లింగాదీన్ కారయేద్బుధః॥ 98
సర్వేషామపివర్ణానాం సాశిలాకృష్ణమేవవా,
సర్వేషాంవర్ణపాషాణే కృష్ణరేఖాం విసర్జయేత్॥ 99
శ్వేతంచస్వర్ణరేఖంచ సర్వసంపత్కరంశుభం।
శిలాసంగ్రహణంప్రోక్తం శేషమాగమోక్తవత్తోస్మృతన్॥100

తా. పురుష దేవాలయములకును స్త్రీ దేవాలయములకును. లింగమునకును, ప్రతిమలకును, పీఠములకును శిలలను పరీక్షించితీయు పద్ధతులను చెప్పుచున్నాడు. ఆచార్యుడును శిల్పియును. ఉదయమున లేచి కర్తయును తదనుచారులును, కొండకుగాని, అడవికిగానిపోయి శుభశకునాదులను శుభముహూర్తమును తెలిసికొని చక్కగా పరిశీలించి శిలను గ్రహించవలయును. దానిని బండిమీద పెట్టించి శిల్పశాలకు తెచ్చి శాస్త్రోక్త ప్రకారము నిర్మించవలయును. చెట్లయాకులు రాలిపడియున్నది, అగ్ని తగిలినది, ఎండతగిలినది, ఇట్టిశిలలను తీయగూడదు. తూర్పున శిరస్సుగాని, ఉత్తరమున శిరస్సుగాని, కలరాతికి దక్షిణమును, పడమరయును అడుగుభాగముగా అనగా పాదములుగా చేయవలయును. లోపలిభాగము ముఖమును, పైభాగమును వీపుగను చేయవలయును. తూర్పున చివరగల రాళ్లన్నింటికిని దక్షిణమునకు కుడిపైపు, ఉత్తరమున ఎడమపైపు చేయవలయును. ఉత్తరమున చివరగళరాతికి దక్షిణమున మొదలును తూర్పున కుడిప్రక్కను, పడమర ఎడమప్రక్కను, నిర్ణయించ వలయును. ఈశాన్యమున చివరగలరాతికి మొదలు నైరుతియందును, ఆగ్నేయమునకు కుడి

ప్రక్కను, వాయవ్యమున ఎడమ ప్రక్కను నిర్ణయించవలయును. ఇంతకుదప్ప ఇతర దిక్కులయందుగాని మూలలయందుగాని తలలు గలరాళ్ళను తీయగూడదు. తూర్పు మొదలగు దిశలయందుండెడి పాదవుగలరాళ్ళు పురుషసిలలు, ఆగ్నేయము మొదలగు నాలుగు మూలలయందుండి పాదవుగల రాళ్ళు నపుంసకశిలలు, ప్రపంచమున పుట్టిపెరిగినవన్నియును, భూమ్యాకాశములనడుమనే యున్నవి కనుక పైనతల క్రిందపాదముచేయుట శాస్త్రప్రసిద్ధము. పూర్వము చెప్పబడిన తూర్పు,ఉత్తరము, ఈశాన్యము. ఈ మూడు దిశలయందు ఎత్తయిన ముఖము గలరాళ్ళను విగ్రహములకు పనికివచ్చును. ఈ రాళ్ళకు కుడి ఎడమలు ముందు వెనుకలు పూర్వము చెప్పబడిన ప్రకారము చేయ వలయును. వాని యాకారములను కొన్నింటిని చెప్పుచున్నాడు. మొదలునడుమ చివర సమానముగానున్నది పురుషశిల. మొదలు లావు చివర సన్నము కలది స్త్రీశిల, మొదలు చివరలావు నడుమ సన్నముగలది నపుంసకశిల లేక మొదలు చివర సన్నముగానునడుమ లావుగాను ఉండునది కూడా నపుంసకశిలయే. మరియు నలుచదరము గలది పురుషశిల. గుండ్రముగా నుండునది స్త్రీశిల. అనేక విధము లుగా తలలుగలది నపుంసకశిల. జేగంట వంటి మ్రోతకలది స్త్రీశిల. రత్నములుగల బంగారపు అందెమ్రోతగలది పురుషశిల. ధ్వని లేనిది నపుంసకశిల. తాళము వాయించినట్లు మ్రోగునది బాలశిల. మహిషము అరచినట్లు మ్రోగునది వృద్ధశిల. ఈ చెప్పబడినవానిలో యౌవనశిలను దీసికొన వలయును. బాల, వృద్ధ శిలలను దీయరాదు పురుషశిలతో పురుష దేవతలను శివలింగమును రచించవలయును. అయితే రేఖాదోషముకలరాళ్ళ నుపయోగించరాదు. స్త్రీ దేవతల కును పీఠములకును స్త్రీశిలనుపయోగించ వలయును. నపుంసక శిలలు గుళ్ళు గోపురములు మండపములు మొదలయినవి కట్టుటకును,ఆధార శిలకును ఉపయోగించుకొనవచ్చును. తెలుపు, ఎరుపు, పసుపు, నలుపు. ఇట్లు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర జాతులుగా నిరుంగ

వలయును. నల్లరాతితో అన్నికులముల వారలకును ప్రతిమలను చేయవచ్చును. నల్లరాతియందు నల్లనిచారలుండెనేని మహాదోషము కనుక అట్టి రాళ్ళను విసర్జించవలయును. ఏ రాతియందయినను తెల్లని గీతలు, బంగారువన్నెగల గీతలుండెనేని సర్వసంపత్కరమని తెలియవలయును. ఇట్లు సమస్తమును చక్కగా తెలిసికొని శిలలను తేవలయును.

## 6. శిలా దోషములు

శిల్పరత్నము పూర్వభాగం 14వ అధ్యాయము

శ్లో॥ ఏవం పరీక్ష్యచ శిలాం సమవేక్ష్యశస్తాం।
ప్రక్షాళ్యతోయైర్బహుళః ప్రయత్నాత్
గర్భాణివేప్యవిధినాపిచ మండలాని తత్తోజ్ఞగురుర్జ్ఞాతు
మహార్థతీహ॥ 21

తుల్యాంశఃక్షీరపిష్టైస్తు విషకాసీసగైరికైః।
దృషదానిప్యనిశ్యైవ మేకరాత్రోషితంతతః॥ 22

ప్రక్షాళ్యగర్భాన్ దోషాంశ్చ మండలైస్తత్రరక్షయేత్॥
మంజిష్ఠాభేమండవే దర్దురఃస్యాత్ పీతే గోధాకాపితే
మూషికాశ్చ కృష్ణేణసర్ప పాండరేచేతికేచితో,
కాపోతాభేగాలికో వృశ్చికోవా॥ 23

రక్తేతుకృకలాసఃస్యాత్ ఖద్యోతోమధుసన్నిభే
మిశ్రేపిపీలికా గర్భః శస్త్రాభేఘూం సరేదృషత్॥ 24

గారేతువిమలాధూమ్రే పతంగః సికతాథవా
నీలపీతే భవేత్కూర్మో గర్భదోషాన్ వదామ్యహమ్॥ 25

తా॥ శిలను పరీక్షించునప్పుడు దానిని నిర్మలమైన జలముతో కడిగి పాలు, పిండి, విషము, జేగురు, మైలతుత్తము, కలిపి దానికి

వ్రాసి ఆరాత్రియుంచి మరల రాతిని కడుగవలయును. ఎఱ్ఱగా నుండెనేని దానిలో కప్పయుండును. పచ్చగా నుండెనేని బల్లి యుండును. చామనచాయగా నుండెనేని యెలుక యుండును. నల్లగా నుండెనేని పాముండును. పావురపువన్నెగా నుండెనేని బల్లిగాని, తేలుగాని యుండును. ఎఱుపువన్నెగానున్న-చో తొండయుండును. తేనె వర్ణముగలిగియున్న మిడుగురు పురుగు లుండును. కొన్నిరంగులు కలసి యుండెనేని చీమలుండును. బూడిదవన్నెగా నుండెనేని లోపల మఱి యొకరాయియుండును. ఎరుపుగానిధూమ్రవర్ణముగాని కలిగియుండెనేని పక్షియుండును. లేక యిసుకయుండును. నీలము పసుపు కలసినవన్నె యుండెనేని తాబేలుండును. ఇవియన్నియును గర్భదోషములని చెప్పబడును. ఇట్టిశిలమెన్నటికిని పనికిరాదు.

## 7. లింగనిర్మాణవిధి, నాగరాదిలింగభేదములు

### కాశ్యపశిల్పము 49వ పటలము

శ్లో॥ ఏవం పరీక్ష్యసంగ్రాహ్యాగవై్యతాశ్యాద్బుధః।
సత్యమంత్రేణ సంస్థాప్య గంధపుష్పాది భిర్యజేత్॥ 63
తస్యాస్తుశాంకరేదేశే శాంతిహోమంతుకారయేత్।
అగ్న్యాధానాదికంసర్వ మగ్నికార్యోక్తమాచరేత్॥ 64
సమిధోహృదయేనైవ మూలేనాజ్యంతుహోమయేత్।
చరుహోమమఘోరేణ పురుషేణైవ తండులమ్॥ 65
తిలామీశానమంత్రేణ సర్షపంకవచేనతు।
శతమర్ధంతదర్ధంవా ప్రత్యేకంజుహుయాత్క్రమాత్॥ 66
స్విష్టకృదగ్నేతి మంత్రేణ పూర్ణాహుతిమథాచరేత్।
తతోవహ్నింసముద్వాస్య పూజాపర్యుషితంత్యజేత్॥ 67
శిలాచ్ఛేదకరంశస్త్రమస్త్రమంత్రేణ పూజయేత్।
అపసర్పణముచ్చార్య శిలాచ్ఛేదనమాచరేత్॥ 68

గర్భగేహాంతుపంచాంశం గుణాంశం శ్రేష్ఠముచ్యతే, గర్భ
గేహ ప్రమాణంచ ద్వారమానంతథైవచ॥ 69

స్తంభంచపీఠమానంచ హస్తతాలాంగులంతథా।
లింగమానంధ్రువంసప్త భేదాస్తే ప్రత్యనేకధా॥ 70

గర్భగేహాంతుపంచాంశం గుణాంశం శ్రేష్ఠముచ్యతే।
గర్భార్ధంమధ్యమాఖ్యాతం తయోర్మధ్యేఽష్టభాజితే॥ 71

శ్రేష్ఠమధ్యాధమంలింగం ప్రత్యేకంత్రివిధంభవేత్।
అథవాగర్భగేహాంతు నవభాగవిభాజితే॥ 72

గర్భగేహసమాసార్ధా నుత్తమాదిత్రయత్రయం।
శుద్ధద్వారసమంశ్రేష్ఠం త్రిద్వ్యంశంతుకనీయసమ్॥ 73

తయోర్మధ్యేఽష్టభాగేతు నందభేదంద్విజోత్తమ।
స్తంభాయామసమానంతు నవభాగవిభాజితే॥ 74

శ్రేష్ఠాధమానినవధా ప్రోచ్యతేద్విజసత్తమ।
ప్రాసాదేత్వాదిభూమౌతు స్తంభభాగసమంహితత్॥ 75

తన్మధ్యమితివిఖ్యాతం తస్యార్ధమధమంభవేత్।
తయోర్మధ్యేఽష్టభాగేన నందభేదేద్విజోత్తమ॥ 76

స్తంభాయామేతుతత్రైవ నవభాగవిభాజితే।
నవధాలింగమానంతు స్తంభమానంద్విజోత్తమ॥ 77

అధిష్ఠానోదయంవిప్ర స్తంభమానవదాచరేత్।
ఏకహస్తం సమారభ్య స్యాష్టాంశాంశవివర్ధనాత్॥ 78

నవహస్తావధింయావత్ సంఖ్యాషష్టిఃసపంచకా।
పంచహస్తాదిమానాని హార్మ్యేహస్తవశాన్నయేత్॥ 79

పంచహస్తాదితోహార్మ్యం లింగస్తంభవశంవినా।
హస్తాదిగుణహస్తాంతం వికల్పాభావహార్మ్యయోః॥ 80

త్రిహస్తం షట్కరాంతంతు లింగచ్ఛందవిమానకే।
షట్కరాదినవాంతంతు లింగంజాతిగృహోచితమ్॥ 81

తా॥ పైచెప్పినరీతిగా శిలను పరీక్షించి తెచ్చి పంచ గవ్యములతో కడిగి సత్యమంత్రముచేత శిలను నిలువబెట్టి గంధపుష్పాదులచేత పూజించి దానికి ఈశాన్యమున శాంతి హోమము చేయవలయును. అగ్నికార్యమంతయును కల్పోక్తప్రకారము చేయవలయును హృదయన్యాసముతో సమిధలును, మూలమంత్రముతో నెయ్యి, అఘోరమంత్రముతో అన్నమును, పురుష మంత్రముతో బియ్యమును, ఈశాన మంత్రముతో నువ్వులును కవచముతో ఆవాలును, 108 సారులుగాని, 54 సారులుగాని, ప్రత్యేకముగా హోమములు చేయవలయును. స్విష్టకృత్తను మంత్రముతో పూర్ణాహుతిని చేయవలయును. తరువాత అగ్నికి ఉద్వాసనమంత్రమును చెప్పి ఆఱిన తరువాత తీసివేయవలయును. శిలలను పగులగొట్టు టంకము మొదలగు పనిముట్లను శస్త్రమంత్రముతో పూజించి అపసర్పణ మంత్రముతో శిలను పగులగొట్టవలయును. గర్భాలయమును 5 భాగములు చేసి అందు 3 భాగములు చేయుట శ్రేష్టము. లేక ద్వారమునుబట్టి చేయుటగలదు స్తంభప్రమాణమునననుసరించిచేయుదురుహస్తమానమునను చేయుదురు జాతివిమానమును చేయవచ్చును. అంగులమానముతోను చేయుదురు. ఇట్లులింగమానులు7విధములుగా చెప్పబడియున్నది.గర్భమానముననుగర్భాలయము 5 భాగములుచేసిఅందు 3 భాగములుగల లింగము శ్రేష్ఠము గర్భవిస్తారములో సగముగలది మధ్యమము. గర్భవిస్తారములో సగమును8 భాగములుచేసి అందు 1 భాగము తగ్గించినది అధమము. అట్లుగాక గర్భాలయమును 9 భాగములుచేసి అందు 5 భాగములు చేయుట శ్రేష్ఠము. 4½ భాగములు చేయుట మధ్యమము 4 భాగములు చేయుట అధమము. ద్వారముతో సమానము శ్రేష్ఠము ద్వారమును 9 భాగములుచేసి అందు 1 భాగము తగ్గించినది మధ్య

మము. 2 భాగములు తగ్గించినది అధమము. స్తంభము పాదవు 9 భాగములుచేసి దానితో సమానముగా చేయబడినది శ్రేష్ఠము. 1 భాగము తగ్గించినది మధ్యమము 2 భాగములు తగ్గించినది అధమము దేవాలయముయొక్క మొదటి అంతస్తునగల స్తంభముతో సమానము శ్రేష్ఠము. అందుసగము తగ్గించినది మధ్యమము. సగములో సగము తగ్గించబడినది అధమము అధిష్ఠానము మొత్తును 9 భాగములు చేసి దానితో సమానముగా చేయుట శ్రేష్ఠము. 1 భాగము తగ్గించబడినది మధ్యమము. 2 భాగములు తగ్గించబడినది అధమము. 1 హస్తము మొదలుకొని 9 హస్తముల వఱకు ఒక భాగములో 8వ వంతు చొప్పున పెంచుచు మొత్తము 65 విధములుగాను చేయుదురు. లేక హస్తమానములో జేయుట యెట్లనిన. 1 హస్తము మొదలు 3 హస్తములవరకు వికల్ప, ఆభాస, హర్మ్యములయందును, 3 హస్తములు మొదలు6 హస్తములు వరకు ఛందప్రాసాదములయందును, 6 హస్తములు మొదలు 9 హస్తముల వఱకు జాతిహార్మ్యములయందును లింగమానములను జేయవచ్చును.

## కాశ్యప శిల్పము 49వ పటలము

శ్లో॥ ఏవంహస్తవశాత్ఖ్యాతం తాలమానమథోచ్యతే।
ఏకాదినవతాలాంత మేకతాలవివర్ధనాత్॥ 82
లింగేహీనవభేదాస్స్యుః కల్ప్యంజాతీతరాలయే।
త్రయోదశాంగులారభ్య యావన్నవశతాంగులమ్॥ 83
తావదేకోనపంచాశల్లింగంమానాంగువేనతు।
త్రిభాగసహితంలింగం హస్తఘ్నీణంనకారయేత్॥ 84
హస్తమానాక్షయంలింగం వృత్తాకారమశేషకం।
వేదానరేతదేకాంశం విష్టరంయోజయేద్బుధః॥ 85
శేషంతుదృశ్యమానంస్యా ద్వికల్పాభాసహర్మ్యతోః,
విష్టరేచేశలింగంతు వికల్పాదిగృహేవినా॥ 8

ఏకాంగులంసమారభ్యయావత్సప్రాంగులావధిః।
లోహజంరత్నజంతావదూర్ధ్వేశైలజముచ్యతే॥ 87
త్రయోదశాంగులంలింగం శైలజంతునకారయేత్।
ఏవంత్వనేకభేదేన ప్రోచ్యతేలింగమానకమ్॥ 88
నాగరంద్రావిడంలింగం వేసరంచసదామ్యహం।
లింగోదయేతువేదాంశే చైకాంశంకన్యసప్తమమ్॥ 89
తుంగత్ర్యంశేశివాంశంతు విస్తారంశ్రేష్ఠముచ్యతే।
తయోర్మధ్యేఽష్టభాగేతు నవధాతారముచ్యతే॥ 90
అధోదయేకలాంశేతు పంచాంశంశాంతికంభవేత్।
వేదాంశంపౌష్టికంఖ్యాతం గుణాంశంజయదంభవేత్॥ 91
అవిచారాద్ద్విభాగస్స్యాద్వ్యాసమేవంచతుర్విధం।
ఏవంత్రయోదశవ్యాసం నాగరేతువిధీయతే॥ 92
లింగోచ్ఛ్రేద్వినవాంశేతు రసభూతయుగాంశకే।
గుణాంశేశాంతికాదిఃస్యాద్ ద్రావిడేచచతుర్విధమ్॥ 93
వేసరేలింగతుంగేతు వింశత్యంశవిభాజితే।
అష్టౌవాసప్తషట్పంచ భాగైర్వ్యాసంప్రకల్పితమ్॥ 94
శాంతికంపౌష్టికంచైవ జయదంచక్రమేణతు।
వేసరంచచతుర్భేదం హార్మ్యలింగంచపిండికా॥ 95
పాదాధారశిలాశ్చైవం ఏకజాతిస్వసంకరం। 96
యత్త్రైవకల్పితంలింగం వృద్ధిహేతుదుదాహృతమ్॥
అన్యోన్యసంకరశ్చేత్తురాజ్ఞోదుఃఖభయావహం। 97
తస్మాత్సర్వప్రయత్నేన సంకరంసమాచరేత్।
లింగానాంనాగరాద్యేవం ఖ్యాతమాయాదికంశృణు॥ 98

తా॥ తాళమానమును చెప్పుచున్నాడు. 1 తాలము మొదలు
1. 1. తాలమును పెంచుచున్న ఇట్లు లింగభేదము 9 విధములుగా చెప్ప

బడియున్నది. ఈ ప్రమాణము జాతిహర్మ్యములకు చెల్లదు. 13, అంగులములు మొదలుకొని 109 అంగులముల వఱకును 2, 2.అంగు ళముల పెంపుతో 49 విధములుగా చెప్పబడియున్నవి, 3 భాగములు చేయబడిన లింగము 1 హస్తమునకు తక్కువయెత్తుండరాదు హస్తము నకు తక్కువ యెత్తుగల లింగమంతయును గుండ్రముగా నుండవల యును. 4 భాగములు లేక 3 భాగములుచేసి అందు 1 భాగము పీఠ చేయవలయును. మిగిలిన భాగములు పైకి కనుపడుచుండవలయును. ఇట్లువికల్ప, ఆభాస, హర్మ్యములయందు ప్రతిష్ఠింపబడు లింగములను రచించవలయును. జాతిఛందహర్మ్యములయందు ప్రతిష్ఠింపబడు లింగ ములకిట్లు పీఠభాగమును నిర్ణయింపదగదు. 1 అంగులము మొదలు 7 అంగులముల వఱకు లోహలింగము, రత్నలింగము పొడవు కలిగి యుండవచ్చును. ఆపైన శిలాలింగముల కొలతలు చెప్పబడియున్నవి. అయినను 13 అంగులముల కొలతతో శివలింగముయెత్తు చేయరాదు నాగరద్రావిడ వేసర లింగములను చెప్పుచున్నారు. లింగముయెత్తును 4 భాగములుచేసి అందు 1 భాగము విస్తారముచేయుట కనీసపద్ధతి. ఎత్తును 3 భాగములుచేసి అందు 1 భాగము విస్తారముచేయుట శ్రేష్ఠము ఈ రెంటినడుమ 8 భేదములు కల్పింపబడినవి. మరియు ఎత్తును 16 భాగములుచేసి విస్తారము 5 భాగములు చేయబడినది శాంతికలింగము, లేక 4 భాగముల విస్తారము చేయబడినది పౌష్టిక లింగము, 3 భాగముల విస్తారము చేయుబడినది జయదలింగము, లేక యెత్తులో సగము విస్తారము చేయుటయు గలదు. మొత్తము 13 భేద ములుగనాగరలింగములుండును, ఇంక ద్రావిడ లింగములు. లింగము యెత్తు 18 భాగములుచేపి అందు విస్తారము 6 భాగములు చేసిరేని శాంతికము, 5 భాగములు చేసిరేని పౌష్టికము, 4 భాగములు చేసిరేని జయదము, 3 భాగములుచేసిరేని అద్భుతము. అని నాలుగు విధము లుగా జెప్పబడియున్నవి. వేసరలింగములు. ఎత్తు 20 భాగములుచేసి

అందు విస్తారము 8 భాగములు చేసిన యెడల శాంతికము, 7 భాగములు చేసిన యెడల పౌష్టికము, 6 భాగములు చేసినయెడల జయదము 5 భాగములు చేసినయెడల అద్భుతము. ఇట్లు వేసర లింగములు నాలుగు విధములుగా చెప్పబడియున్నవి. పాదాధారశిలలు అన్నియును ఒక్క జాతిగా నుండవలెను గాని, 2-3 జాతుల్లు కలపరాదు. తెలియక కలిపిన యెడల యజమానుడు దుఃఖముల పాలగును. నాగరాదిలింగభేదములు చెప్పబడినవి.

## 8. స్వయంభు లింగభేదములు

మానసారము 52వ అధ్యాయము

శ్లో॥ స్వయంభులింగసర్వేషాం లక్షణంవక్ష్యతేఽధునా।
ఉద్భూతం దైవకం చైవమానుషంగాణవంతథా॥ 101
ఏవంచతుర్విధంలింగం స్వయంభురితికీర్తితం।
తత్ స్థాప్యంస్వయముద్భూతం స్వయంభురితికీర్తితః॥ 102
దేవైశ్చస్థాపితంలింగం దైవకంలింగముచ్యతే।
మానుషైఃరచితంలింగంమానుషంచేతికథ్యతే॥ 103
ఆర్షైస్సురచితంలింగం చార్షకంచైవకథ్యతే।
గణైశ్చపూజితంలింగం గాణవంచేతికథ్యతే॥ 104
ఉద్భూతం శ్వేతవర్ణంస్యాద్ దైవకంరక్తవర్ణకం।
మానుషంపీతవర్ణాభం కృష్ణవర్ణంతుగాణవమ్॥ 105
ఆర్షంతుయుక్తసూత్రంస్యాత్ స్వస్తికాకృతిమేవనా।
ఉద్భూతంశంకరాకారం రుద్రాక్షరంచదైవకమ్॥ 106
నగోపమంగాణవంస్యాల్లింగాకారమివోచ్యతే।
ఉద్భూతంస్థూలమూలంస్యాత్ కృశాగ్రంవాసమాధికమ్। 107
అన్యథాసర్వలింగానాం స్థూలాగ్రంకృశమూలకం।
దైవకండిండిమాకారం మానుషంత్రపుషాకృతిమ్॥ 108

ఉద్భూతంపర్వతాకారం కూష్మాండాకృతిగాణపమ్।
పుణ్యనద్యద్రిదేశేతు లింగసంగ్రహణంభవేత్ ॥ 109
ఏవంపరార్థలింగంస్యా చ్ఛేషమాగమోక్తవత్ స్యాత్ ।
ఆత్మార్థంలింగపీఠస్య లక్షణంపర్యతేఽధునా॥ 110
పీఠతుంగసమంవాథ త్రిపాదంచార్థమేవవా।
లింగాయామమితిప్రోక్తం నాహంపీఠవిశాలివత్॥ 111
నదీపర్వతదేశేతు పీఠసంగ్రహణంభవేత్।
శ్వేతంరక్తంచ పీతంచ కృష్ణవర్ణంచతుష్టయమ్॥ 112
భూసురాదిచతుర్ణాంతు వర్ణానాంలింగతఃక్రమాత్।
అథవాకృష్ణవర్ణంచ తత్సర్వంచార్షకంభవేత్ ॥ 113
అతికర్షితలింగంయత్ భూదేవ్యంశంభురుచ్యతే।
తత్రస్వయంభులింగేతు విరూపంచవిశేషతః॥ 114
సమ్యక్ సూత్రేచసంకుర్యా ద్వ్యావల్లక్షణముచ్యతే।
తల్లింగంమానుషంప్రోక్తం తత్పర్వతాలిందకేచ॥ 115
రేఖాబిందుకలంకాంతం వర్జయేత్తద్ విశేషతః।
సావర్ణబిందురేఖాఢ్యం సర్వసంపచ్ఛుభాయతమ్॥ 116
ఈషత్తదున్నతంలింగం హార్మ్యవత్ స్వయంభులింగకం।
వృత్తంవాఽఽయతవృత్తంవా నాభేశ్చరణాభాయతే॥ 117
కించిత్తదున్నతంకర్మ్య నిమ్నంతత్పృష్ఠమిష్యతే।
స్థూలాగ్రంయత్కృశంమూలే లింగంసర్వంనిజాకృతి॥ 118
స్వభావదంతౌష్ఠయుక్తంచే ల్లింగంతన్మానుషంభవేత్,
పికతారోపణంజ్ఞాత్వా చైవంస్వయంభులింగకమ్ 119
వినారక్తంవినాకృష్ణం సైకతేలింగమిష్యతే
సర్వస్వయంభులింగేషు చాత్మార్థంచపరార్థవే 120

నసంజ్ఞేషుచరక్షేత్రేషు లింగస్యోక్తార్చనంభవేత్
ఉక్తలింగప్రకారేణ శేషంస్యాద్రాగమోక్తవత్ 121
అత్మార్థార్చనలింగస్య వక్ష్యే తేపీఠలక్షణం।
కర్మనాశంపరిత్యజ్య కించిచ్ఛ్వశిలాభవేత్॥ 122
జలానలాతపవాత స్పృష్టాశ్మానివివర్జయేత్।
పృధ్వీగర్భస్థితంస్నిగ్ధం బిందురేఖం వివర్జయేత్॥ 123
కలితం చైకభాగంస్యాత్ స్త్రీశిలాతుప్రకీర్తితా।
నపుంసంసూత్మ్మదష్టంచ నపుంసకంశిలాభవేత్॥ 124
సర్వ్యక్కృష్ణశిలాః ప్రోక్తాః వర్ణమన్యంవివర్జయేత్।
కర్షపాషాణవత్ స్వర్ణరేఖాలోపణమిష్యతే॥ 125
ఏవంపరీక్షితేపశ్చాచ్ఛిలాసంగ్రహణంభవేత్।
ఏవంలక్షణయుక్తస్య శిలాపీఠంప్రకుర్వతే॥ 126

తా॥ స్వాయంభులింగములయొక్క లక్షణభేధములను చెప్పుచున్నాడు. ఉద్భూతలింగము, దైవకలింగము, మానుష లింగము, గాణవలింగము, అను నాలుగువిధములు. ఎవరివలననైన స్థాపించబడినవియును. తమంతటతామే పుట్టినవియును స్వాయంభులింగములే. దేవతలచే స్థాపించబడినది దైవకలింగము, మనుష్యులచే రచింపబడినది మానవలింగము. ఇతరులచే (ఋషులచే) రచింపబడిన లింగము ఆర్షలింగము. ప్రమధులచే పూజింపబడినదిగాణవలింగము. ఉద్భూతలింగము తెలుపు, దైవకలింగము ఎరుపు, మానుషలింగము పసుపు, గాణవలింగము నలుపు, స్వస్తికము మొదలగు తగిన రేఖలుగలది ఆర్షలింగము. ఉద్భూతలింగము శివరూపముగలది. శివబీజాంకురము కలది దైవకలింగము. కొండవంటి రూపముగలది గాణవలింగము. మొదలు లావుకలది ఉద్భూతలింగము, లేక స్థూలమైనతలగలది. సమానముగానుండునదియును, ఉద్భూత లింగములే. ఇతరలింగము

లన్నియును చివరలావును మొదలు సన్నమును కలిగియుండును. తాషావలెనుండునది దైవకలింగము, చేదుదోసకాయ వలెనుండునది మానుషలింగము, పర్వతాకారముగలది ఉద్భూతలింగము, గుమ్మడి పండువలె నుండునది గాణవలింగము. ఇట్టి లింగములు పుణ్యనదుల యందును, మహర్షులుండెడి పర్వతముల యందును లభించును. ఇత రుల కొఱకు రచించిపబడు లింగముల లక్షణములను చెప్పినాడు. తన కొఱకురచింపబడు లింగములెట్లుండవలయునో చెప్పుచున్నాడు. పీఠము యెత్తుతో సమానముగాని, ముప్పాతికవంతుగాని, సగమువంతుగాని లింగముయొక్క యెత్తుండవచ్చును. చుట్టుకొలత పీఠముయొక్క విస్తారమెంతో అంతయుండవలయును. పీఠమునకు దగినశిలను నదిలో గాని కొండదగ్గరగాని, పరిశీలించి తేవలయును. తెలుపు, ఎరుపు, పసుపు, నలుపు. ఇవి బ్రహ్మక్షత్రియ, వైశ్య, శూద్ర, జాతులకు దగినవని తెలియవలెను. లేక నలుపు వన్నెగల ఱాతిని అన్ని కుల ములవారికి ఉపయోగించవచ్చును. మిగుల నొరపిడి కలిగినది బ్రాహ్మణులచే పూజింపదగిన శివరూపమని తెలియవలయును. అందు రూపభేదములెన్నియో కనపడుచుండును. శాస్త్రప్రకారము కొండ గుహాలయందు చక్కగా చేయబడినవి మానుషలింగము. రేఖా దోషము, బిందుదోషము, కలంకదోషము. అనేకదోషము, మొదల యినవి కలశిలను విడువవలెను. బంగారు వన్నెగల చాఱగాని, చుక్క గాని, యుండెనేని సమస్తమైన సంపదల నిచ్చునని తెలియవలెను. కొంచెముయెత్తుగా మిద్దెవలె తలగలలింగముగాని, గుండ్రనిలింగము గాని, గుండ్రములో కొంచెము పొడవుగల రూపమునగాని, సగము నుండి దిగువభాగము పొడవుగలదిగాని, కొంచెమెత్తయిన కనుతెప్పలు గలిగి పల్లముగానున్న వీపుకలదియును, తల లావును, మొదలు సన్న మును కలిగి శివరూపముతో సమానముగా దంతములు పెదవులు కను పడుచుండెనేని అది మానుషలింగము. ఇట్టి లింగములను ఇసుకలోబడి

యున్న స్వయంభులింగములని యెఱుంగవలయును. ఎఱుపు, నలుపు, వన్నెలుగాని లింగములు ఇసుకయందు లభించెనేని వానిని స్వయంభు లింగములుగానెఱుంగవలయును. ఒకప్పుడు లింగముయొక్క యథార్థ నామము తెలియకున్నను, ఎఱుపు వన్నెగల శివలింగము లభించినను సామాన్యముగా లింగమును పూజించు, పద్ధతి ప్రకారము పూజించ వచ్చును. ఆత్మార్థమైన లింగమునకు పీఠమును రచించుపద్ధతి చెప్పు చున్నాము. యజమానుని చంపునట్టి దోషములు లేని శిలను తీసికొని వచ్చి పీఠమును చేయవలయును వానకు తడిచినది యెండకు ఎండినది, ఎల్లప్పుడు గాలి తగులుచుండెడిది. అగ్ని తగిలినది. ఇట్టి రాళ్లు పనికి రావు. భూమిలో నున్నదియును, నునుపైనదియును, చుక్క, చాఱ, మొదలగు దోషములు లేనిదియును, ఒకవైపున బాగుగానున్నది యును, ఆగు శిలస్త్రీశిల, కొంచెము కఱుకుగలది నపుంసకశిల. ఇతర వర్ణము కలియని నల్లఱాయి శ్రేష్ఠము. ఒరపిడి ఱాతిమీద గీతవలె బంగారపు చాఱలుగల నల్లఱాయి పనికివచ్చును. ఇట్లు బాగుగా పరి శీలించి శిలను తెచ్చి శాస్త్రమున చెప్పబడినట్లు పీఠమును చేయ వలయును.

## 9. మానసారుని లింగభేదములు

### మానసారము 52వ అధ్యాయము

శ్లో॥ లింగమానవిధిః సమ్యగ్ లక్షణంవక్ష్యతేఽధునా।
శైవంపాశుపతంచైవ కాలాముఖంమహావ్రతమ్॥ 1
వామంచభైరవంచైవ లింగస్యనామషడ్విధమ్।
సమకర్ణంవర్ధమానం శివాంకం స్వస్తికంతథా॥ 2
ఏతచ్చతుర్విధంలింగం విప్రాదీనాంచయోగ్యకం।
సమకర్ణంభూసురాణాం భూపానాంవర్ధమానకమ్॥ 3
4)

వైశ్యానాంచశివాంకంచ పరేషాంస్వస్తికంభవేత్ ।
విప్రాణాంసర్వలింగంచ కుర్యాద్దోషోనవిద్యతే॥ 4

వర్ధమానం శివాంకంచస్వస్తికం భూపయోగ్యకం।
స్వస్తికంచ శివాంకంచ వైశ్యానామపియోగ్యకమ్॥ 5

శుద్ధగర్భగృహేద్వారే ప్రాసాదస్య విశాలకం।
అధిష్ఠానోదయేపాదం తుంగమానంతథైవచ॥ 6

హస్తమానాంగులేనైవ యజమానోదయేనచ।
ఏతత్తత్తద్విధిః ప్రోక్తం ప్రత్యేకంబహుధాభవేత్॥ 7

శ్రేష్ఠాదీనికనిష్ఠాంతం ప్రత్యేకంత్రిత్రిమానకం।
గర్భేనందవిభాగంతు చైకైకంలింగతుంగకమ్॥ 8

కేచిత్తుదేకభాగేతు నవభాగంవిభాజితే।
తదేకాశీతిలింగంస్యాత్ కన్యసాదుత్తమాంతకమ్॥ 9

ప్రత్యేకంతత్త్రిధామానమేకైకంలింగతుంగకం।
కన్యసాగర్భతారార్ధం త్రిపాదం మధ్యమంభవేత్ । 10

గర్భతారసమంశ్రేష్ఠం త్రివిధంలింగతుంగకం।
గర్భగేహేతుమానంస్యాల్లింగతుంగంప్రకల్పయేత్॥ 11

శుద్ధద్వారోదయంనంద భాగంకృత్వా విశాలకం।
ఏకైకంలింగతుంగం స్యాత్కన్యసాదీనిపూర్వకమ్॥ 12

ప్రత్యేకంతుత్రిధామానం చైకాశీతిచలింగకం।
ప్రాసాదస్యవిశాలేతు గర్భగేహముక్తవద్భవేత్॥ 13

అధిష్ఠానసమంశ్రేష్ఠం త్రిపాదంమధ్యమంభవేత్।
తదర్ధంకన్యసంప్రోక్తంత్రి విధంలింగమీరితమ్॥ 14

అర్ధవానవభాగంస్యాన్నవలింగముదాహృతం।
కన్యసాదుత్తమాంతంస్యాత్ ప్రత్యేకం పూర్వవద్భవేత్॥ 15

పాదోదయంనవాంశంస్యా న్నవధాలింగమానకం।
తదేవంచైకభాగేతు చతుర్భాగం విభాజితే॥ 16
ఏకైకంలింగతుంగంస్యాత్ షట్త్రింశంలింగతుంగకం।
కన్యసాదుత్తమాంతంస్యా త్సర్వంప్రాగుక్తవన్నయేత్॥ 17
హార్మ్యతుంగంనవాంశంస్యా త్కన్యసాదిత్రయంత్రయం।
ఏవంతునవలింగంస్యా న్నవభేదోదయంభవేత్॥ 18
కేచిద్విమానతుంగేతు నందనందాంశకంభవేత్।
ఏకైకంలింగతుంగంస్యా న్నందనందోదయంభవేత్ 19
కన్యసాదుత్తమాంతంస్యా త్పూర్వవల్లింగమిష్యతే।
ఏకహస్తంసమారభ్య హస్తైకేనప్రవర్ధయేత్॥ 20
ఏకైకంలింగతుంగంస్యా న్నవహస్తావసానకం
ఏవంతునవతుంగంస్యా త్కన్యసాదిత్రయంత్రయమ్ 21
కరత్రిపాదమారభ్య తత్సమేనవివర్ధనాత్
పాదోనసప్తహస్తాంతం పూర్వవన్నవలింగకమ్ 22
అర్ధహస్తంసమారభ్య చార్ధహస్తేనవర్ధనాత్
నార్ధవేదకరాంతంస్యా న్నవలింగోదయంభవేత్ 23
పాదహస్తంసమారభ్యపాదహస్తేనవర్ధనాత్
పాదాధికద్విహస్తాంతం నవలింగంతుపూర్వవత్ 2
జాతిచ్ఛందంకల్పంతు చాభాసంతు చతుర్విధం
ఏకహస్తవశాత్సర్వం కన్యసాదిత్రయంత్రయమ్॥ 25
ఛందాదీనాంతుమానంస్యాత్ షట్త్రింశల్లింగతుంగకం।
ఏకాదశాంగులమారభ్య ద్విద్వ్యంగులవివర్ధనాత్॥ 26
సప్తవింశాంగులాంతంస్యా న్నవధాలింగతుంగకం।
ద్వాదశాంగులమారభ్య షట్షడంగులవర్ధనాత్॥ 27

షష్ట్యంగులావసానంస్యా న్నవధాలింగమానకం।
పంచవింశాంగులామారభ్య షట్ షడంగులవర్ధనాత్ ॥ 28
త్రిసప్తత్యవసానంస్యా న్నవధాలింగతుంగకం।
సర్వేషాంకన్యసాచ్ఛ్రేష్ఠ పర్వాంతాంగులమానకమ్॥ 29

తా॥ లింగములయొక్క కొలతలను చెప్పుచున్నాడు. శైవము పాశుపతము, కాలాముఖము, మహావ్రతము, నామము, భైరవము, ఇట్లు 6 విధములుగా లింగములయొక్క వ్రేళ్ళకలవు, సమకర్ణము, వర్ధమానము, శివచిహ్నము, స్వస్తికము. ఈ నాలుగు లింగములు నాలుగుకులములవారికి యోగ్యములైనవి. సమకర్ణలింగము బ్రాహ్మణులకును, రాజులకు వర్ధమానలింగమును, వైశ్యులకు శివాంకలింగమును శూద్రులకు స్వస్తిక లింగమును తగినవి. లేక బ్రాహ్మణుడు పై జెప్పిన నాలుగు విధములైన లింగములకు పూజించవచ్చును. క్షత్రియుడు వర్ధమానము మొదలు మూడు విధముల లింగములను పూజించవచ్చును. వైశ్యుడు శివాంకము మొదలు రెండువిధముల లింగములను పూజించవచ్చును. గర్భగృహము, ద్వారము, ప్రాసాదవిస్తారము. అధిష్ఠానముయెత్తు స్తంభము యెత్తు, హస్తమానము, యజమానునియెత్తు, ఇట్లు అనేక విధములుగా లింగము యెత్తునకు కొలతలు చెప్పబడియున్నవి. అందులో శ్రేష్ఠము 3 విధములు, మధ్యమము 3 విధములు కనీసము 3 విధములు. ఇట్లు 9 విధములు కలవు. మరియు దేవాలయ గర్భమును 9 భాగములుచేసి 1 . 1 భాగము పెంపుతో 9 భాగముల వరకు 9 విధములుగా జేయుదురు. మఱల ఒక్కొక్కదానిచే 9 భాగములు చేయుటచేత (81) భేదములు కలుగుచున్నవి. గర్భాలయములో సగము యెత్తుండుట కనీసము, ముప్పాతిక ఎత్తుండుట మధ్యమము. గర్భాలయము విస్తారముతో సమానముగాయుండుట శ్రేష్ఠము. ద్వారము యెత్తును 9 భాగములుచేసి పూర్వమువలెనే 9 విధములుగా లింగము యెత్తును చేయవచ్చును. ప్రాసాదముయొక్క విస్తారముతో సమానము ఉత్తమము. ముప్పాతికవంతు మధ్యమము. సగము

వంతు కనీసము. అధిష్ఠానముతో సమానమైనయెత్తు శ్రేష్ఠము. ముప్పాతికవంతు మధ్యమము. సగము యెత్తు కనీసము. లేక 9 భాగములుచేసి పూర్వమువలెనే 9 విధములగ కూడ ప్రతిష్ఠించవచ్చును. స్తంభముయెత్తును 9 భాగములుచేసి దానితో సమానముగాని 1. 1. భాగము తగ్గించుచు 9 విధములుగా జేయవచ్చును. మఱల ఆ ఒక్క భాగమును 4 భాగములుచేయగా36 భాగములగును. ఇట్లు 36 విధములుగాను లింగముయెత్తు చేయవచ్చును. ప్రాసాదము యెత్తును 9 భాగములు చేసి కనీసమున 3 భేదములు మధ్యమమున 3 భేదములు. ఉత్తమమున 3 భేదములు మొత్తం 9భేదములు చేయదగును. కొందరు పైవిమానముయొక్క యెత్తును 9 భాగములుచేసి మరల ఒకభాగమునే 9 భాగములు చేసి యిట్లు 81భేదములుగ లింగముయొక్క తలనుచేయుదురు. మఱియు 1 హస్తము మొదలుకొని1.1 హస్తమును పెంచుచు ఇట్లు 9 హస్తముల వఱకు 9 విధముల ఎత్తును కల్పింతురు. $\frac{3}{4}$ హస్తము మొదలుకొని $\frac{3}{4}$ హస్తము చొప్పున పెంచుచు 9 విధములుగా $6\frac{3}{4}$ హస్తముల వరకు లింగముల తలలను కన్పించవచ్చును. లేక $\frac{1}{2}$ హస్తము మొదలుకొని $\frac{1}{2}$ హస్తము చొప్పున పెంచుచు $4\frac{1}{2}$ హస్తముల వఱకు 9 భేదములుగా లింగముయొక్క యెత్తును చేయవచ్చును. $\frac{1}{4}$ హస్తము మొదలుకొని $\frac{1}{4}$ హస్తము చొప్పున పెంచుచు $2\frac{1}{4}$ హస్తముల వఱకు 9 భేదములుగా జేయవచ్చును. జాతి హర్మ్యములకు హస్తము చొప్పున పెంచబడినవియును, ఛందహర్మ్యములకు $\frac{3}{4}$ హస్తము చొప్పున పెంచబడినవియును, వికల్పహర్మ్యములకు $\frac{1}{2}$ హస్తము చొప్పున పెంచబడినవియును, ఆభాసహర్మ్యములకు $\frac{1}{4}$ హస్తము చొప్పున పెంచబడినవియును కలసి మొత్తము 36 విధములుగా లింగముల యెత్తులుకలిగినవి. 11. అంగులముల మొదలు 2. అంగులముల చొప్పున పెంచుచు 27 అంగులముల వఱకు 9 భేదములును. 13. అంగులములు మొదలు 6 అంగులముల చొప్పున

పెంచుచు 60. అంగులముల వరకు 9 భేదములును, 25 అంగులములు మొదలుకొని 6 అంగులముల చొప్పున పెంచుచు 73. అంగులముల వరకు 9 భేదములును ఇట్లు అన్నిటికిని కనీసమున 3. మధ్యమమున 3. శ్రేష్ఠమున 3. మొత్తము 9 భేదములని యెఱుంగవలయును.

శ్లో॥ యజమానస్యమేఢ్రాంతం నాభ్యంతంహృదయాంతకం।
స్తనాంతంబాహుసీమాంతం హన్వంతంనాసికాంతకమ్॥ 30
నేత్రాంతంసమతుంగంస్యా న్నవలింగోదయంభవేత్।
అథవాతుంగమానేతు నవభాగంవిభాజితే॥ 31
ఏకైకంలింగతుంగంస్యా త్కన్యసాదిత్రయంత్రయం।
నవత్యంశవిధంలింగం యజమానవశాద్విదుః॥ 32
బహుధాస్థాప్యలింగంవా నవలింగంపరిసంఖ్యయా।
అథహస్తాదిమానంచ సర్వలింగేషుకల్పయేత్॥ 33
పంచాదశాంగులంమానం యన్మానంనవలింగకే।
సప్తదశాంగులాంతంచ పంచదశాంగులమాదభేత్॥ 34
స్థాపయేత్పంచలింగేతు చేత్యాబ్ధ్వేనతుకారయేత్।
తత్త్రిపాదకరాదూర్ధ్వం బాధికంసర్వతుంగకే॥ 35
సర్వేషాంచైకహర్మ్యేతు చైకలింగంతు సమ్మతం।
బహుధాసర్వలింగేషు తత్త్రికర్ణంనకారయేత్॥ 36
ద్వికర్ణంబహులింగేతు త్రికర్ణంచైకలింగకే।
లింగతుంగమితిప్రోక్తం తద్విశాలమిహోచ్యతే॥ 37
త్రిచతుష్పంచాంగులాంతంస్యా ద్బహులింగేషువిస్తృతం।
అథవాతుంగమానేతు త్రిచతుష్పంచభాగికమ్॥ 38
తత్తదేకాంశవిస్తారం బహులింగవిశాలకం।
నాగరంద్రావిడంచైవ వేసరంచత్రిధామతమ్॥ 39

షట్సప్తాంగులంచైవలింగతారమితిస్మృతం।
నవపంక్తిరుద్రమాత్రంస్యాత్ సమలింగవిశాలకమ్॥ 40

భానుసైకాంగులంచైవ చతుర్దశాంగులమేవచ।
ఏవంతుచైకలింగస్య విస్తారంపరికీర్తితమ్॥ 41

పంచదశాంగులంచైవ షోడశాంగులమేవచ।
సప్తదశాంగులంచైవ లింగానామితివిస్తృతమ్॥ 42

అష్టాదశాంగులంచైవ నవపంక్త్యంగులాంతకం।
వింశత్యంగులంచైవ లింగతారంత్రిధామతమ్ 43

ఏకవింశాంగులంచైవ ద్వావింశతిశాంగులం
త్రయోవింశాంగులంచైవ త్రిధాలింగవిశాలకమ్ 44

చతుర్వింశాంగులంచైవ పంచవింశాంగులంతథా
షడ్వింశాంగులంచైవ విశాలంత్రివిధంమతమ్ 45

సప్తవింశాంగులంచైవ చాష్టావింశాంగులంతథా।
నవవింశతిమాత్రంస్యా ల్లింగతారమితిస్మృతమ్॥ 46

అథవావింశదంగుల్యే మేకత్రింశతిమాత్రకం।
ద్వాత్రింశాంగులంచైవ లింగతారమితిస్మృతమ్॥ 47

కన్యసాదుత్తమాంతంస్యా త్ప్రత్యేకంత్రిమానకం।
ఏవంతునవధాలింగం ప్రత్యేకంనాగరాదిభిః॥ 48

అథవాతుంగమానంతు చతుష్పంచషడంశకం।
తత్తదంశైకభాగేన చైకలింగవిశాలకమ్॥ 49

నాగరంద్రావిడంచైవ వేసరంచత్రిధామతం॥ 50

ఇష్టాయామేద్వ్యంశే సత్రింశదంశం।
కృత్వాక్రమాదధికం తదంశకం విస్తారంతత్కన్యసాదిత్రిధా।
యుక్త్యాధీమాన్ వేసరాదీనికూర్యాత్ 51

బహులింగోదయేసర్వ స్మిన్ బ్రహ్మాంశం వినోదయం।
ద్విభాగంసమకవ్యసం విష్ణుద్రాంశంతత్సమమ్॥ 52

తా॥ యజమానునియొక్క మేఢ్రము వరకు, నాభివరకు, హృమ్మువరకు, స్తనములవరకు, భుజములవరకు, తాలువులవరకు, ముక్కు వరకు, నేత్రములవరకు, శిరస్సువరకు, ఇట్లు 9 విధములుగా లింగముయెత్తును చేయవచ్చును. లేక యజమానుని యెత్తును 90 భాగములుచేసి ఒక్కొక్క భాగమునకు 10 ఖండ భాగములు చేసి యిట్లును 9 భేదములుగా లింగముయెత్తును చేయవచ్చును 9 లింగములను ప్రతిష్ఠింపవలసినచోట హస్తమానముతో చేయవచ్చును. 15 అంగులములు నవలింగములకును, 17 అంగులములు పంచలింగములకును చేయవలయును. అంతకుపైన చేయరాదు. అన్ని లింగములయెత్తు 3/4 హస్తముకంటె నధికము చేయగూడదు. సమస్తమైన ఆలయములయందు ఒక్కొక్క లింగమును ప్రతిష్ఠించుట ముఖ్యము. అంతకుమించి లింగములను ప్రతిష్ఠించునపుడు పీఠము ముక్కోణముగా నుండగూడదు. బహులింగ ప్రతిష్టయందు రెండు కోణములుగల పీఠమేయుండవలయును. లింగములయొక్క విస్తారమును చెప్పుచున్నాడు. 3, 4, 5 అంగులముల విస్తారము బహులింగ నిర్మాణమునమండదగును. లేక యెత్తులో 3 వంతు 4వ వంతు 5వ వంతు విస్తారము చేయదగును, వీనినివరుసగా నాగరలింగము, ద్రావిడ లింగము, వేసర లింగము అందురు. 6, 7, 8 అంగులములు బహులింగములయందు లింగవిస్తారము, లేక 9, 10, 11 అంగులములు సమలింగవిస్తారమును చేయవచ్చును. 12, 13, 14 అంగులముల్లు ఏకలింగవిస్తారము 15, 16, 17 అంగులములు విస్తారము 18, 19, 20 అంగులముల విస్తారము. ఇట్లు మూడు విధములు. 21, 22, 23 అంగులములు. ఇట్లు మూడు విధములు. 24, 25, 26 అంగులములు. ఇట్లు మూడు విధములును 27, 28, 29 అంగులములును, 30-31-32 అంగులములును, కనీసమునుండి ఉత్తమము వరకు విస్తార

భేదములు కల్పింపబడినవి. ఇట్లు నాగర ద్రావిడవేసర భేదములు కలిగినవి. మరియు లింగము ఎత్తును 4-5-6 భాగములు చేసి అందు ఒక్కొక్క భాగమును లింగ విస్తారము చేసిరేని, వరుసగా నాగరము, ద్రావిడము. వేసరము, అగును. లింగముయొక్క పొడవు 30 భాగములుచేసి దానిని రెండుగాజేసి ఆ రెండు భాగములు సమా నముగాను, పైన 1 భాగము అధికముగాను, పైన 2 భాగములు అధికముగాని చేసినయెడల నాగరము. ద్రావిడము, వేసరము అగును. ఇవి స్వల్పదేవాలయము లందలి లింగముల పద్ధతి. అనేక లింగము లయినప్పుడు బ్రహ్మభాగమును వదలి విష్ణురుద్రభాగములనే కొలత యందు చెప్పుకొనవలయును.

శ్లో॥ అథ వాతుంగం నవమంస్యా ద్వేదంనారాయణోదయం।
పంచాంశం శివోదయంస్యా ద్వర్ధమానమితిస్మృతమ్॥ 53
అష్టాదశాంశకంతుంగే వైష్ణవంచాష్టభాగికం।
దశాంశంశివోదయంస్యా చ్ఛివాధికంలింగమీరితమ్॥ 54
ఉత్సే ధేదశ భాగేతు వైష్ణవంచతురంశకం।
రసభాగం శివాంశంస్యాత్ స్వస్తికంబహులింగ తే॥ 55
ద్రుహిణహరిహరాంశం తత్సమంచైకలింగే।
మునివసునవభాగైస్తుంగ మష్టత్రయాంగమ్॥ 56
ద్రుహిణహరిహరాంశం సర్వతోభద్రలింగం,
ద్విజకులనృపపూజ్యం వర్ధమానంతథైవం॥ 56
పంచపంచచషడంశకోన్నతం బ్రహ్మవిష్ణుశివభాగతఃక్రమాత్।
తుంగమష్టయుగభాగకేకృతే తచ్ఛివాధికమిహార్య
మోగ్యకమ్॥ 57
స్వస్తికస్యదశషటోశిరోన్నతం షోడశాంశ విధివైష్ణవంతథా।
రుద్రభాగవిధివత్సమాచరేత్ సంపదర్థమివశాద్ర
యోగ్యకమ్। 58

వేదాశ్రాభం బ్రహ్మభాగేచమూలే చాష్టాశ్రాభంమధ్యమే
విష్ణుభాగే।

వృత్తాకారంచాగ్రకేతచ్ఛివాంశం కుర్యాత్సర్వం
వస్థలంచైకలింగమ్॥ 59

వేదాశ్రంవస్వశ్రకంవృత్తమేవం ప్రోక్తంమూలేమధ్యకే
ఽనేకలింగే వృత్తాకారంచాగ్రకేరుద్రభాగే।
కుర్యాదేవం శిల్పివిద్వద్భిరేవ॥ 60

ఏకానేకంచోక్తలింగేశివాంశే కుర్యాద్ధారాం
షోడశాదిద్వయేన।

వృద్ధ్యాథారాతూం సహస్రావసానం ధారాలింగేచైవ
ముక్తంసుతంత్రైః॥ 61

పంచషట్సమునిరష్టవిస్తృతే ద్విద్విభాగయుత మస్తకోన్నతం।
తత్తదంగకృతతచ్ఛిరోదయే ద్వ్యంశయుగ్మమధికోప
మానకమ్॥ 62

వర్తికస్థమినతచ్ఛిఖంబుదైః కుక్కుటాండత్రపుషాకృతిస్తథా।
అర్ధచంద్రమితిచత్రవద్భవేత్ శిల్పశాస్త్రవర
వర్ణితం క్రమాత్॥ 63

పూజాంశేతత్తుంగమష్టద్వయాంశం కృత్వాఽంశేన
ద్విత్రివేదాన్విసృజ్య।

తస్యాథస్తల్లక్షణోద్ధారశేషం శిల్పీకుర్యాన్నాగరాదీన్
త్రిధైవ॥ 64

తత్రైచ్ఛకార్ధాంశకంమధ్యభాగే విస్తారంస్యాల్లక్షణోద్ధారణేచ
అగ్రేచైకద్వ్యశత్ర్యంశేనతుంగం తస్మాత్పార్శ్వభ్రా।
మయేత్ పృష్ఠ కాంతమ్॥ 65

కుర్యాదేకాంపిండికాంతస్యపార్శ్వే చైకద్విత్ర్యంశకం
చానతంచ।

ష్పష్టేయుక్త్యాకారయేద్విష్ణుకాంతం ఏవంయుక్త్యా
నాగరాదిక్రమంస్యాత్ ॥ 66
ఏకానేకంలింగకంధారణాంశే కుర్యాల్లింగేమూర్ధ్ని
వత్కుడ్మలంవా,
ఛత్రాకారంవాధమూర్ధ్ని ప్రదేశే యుక్త్యాధీమానుద్ధరేత్
స్యాదధస్తాత్ ॥ 67
లింగాదీన్స్థాపయేత్సర్వహర్మ్యే ప్రాగుక్తవత్క్రమాత్ ॥ 68

తా॥ లింగముయెత్తు 9 భాగములుచేసి అందు 4 భాగములు విష్ణ్వంశమును 5 భాగములు శివాంశమును చేసిన యెడల వర్ధమాన లింగమగును. లింగముయెత్తు 18 భాగములుచేసి విష్ణ్వంశము 8 భాగములును శివాంశము 10 భాగములును చేసినయెడల శివాధిక లింగమగును. లింగము యెత్తు 10 భాగలుముచేసి విష్ణ్వంశము 4 భాగములు, శివాంశము 6 భాగములు చేసినయెడల స్వస్తిక లింగమగును. ఇది బహులింగముల యందుపయోగించును. బ్రహ్మ, విష్ణు, శివ భాగములను సమానముగా చేసినయెడల సర్వతోభద్ర లింగమగును. ఇది యేకలింగ ప్రతిష్ఠకుపయోగించును. లింగము యెత్తును 24 భాగములుచేసి 7-8-9 భాగములు బ్రహ్మ, విష్ణు, శివ భాగములుగా చేసినను సర్వతోభద్రలింగమే యగును. దీనిని దేవతలు బ్రాహ్మణులు పూజింతురు. వర్ధమాన లింగమును రాజులు పూజింతురు. లింగముయెత్తును 16 భాగములుచేసి 5 భాగములు బ్రహ్మకును 5భాగములువిష్ణువునకును, 6 భాగములు శివునకును చేయబడిన లింగము వైశ్యులుపూజింపదగినది. 16 భాగములు చేయబడి విష్ణు భాగములు 7 శివభాగముల్లు 9 ఇట్లు చేసిరేని స్వస్తికలింగమగును. ఇది శూద్రయోగ్యమగును. మరియు లింగముయెత్తును 3 భాగములుచేసి మొదలు నలుచదరమును, నడుమ 8 పలకలును, చివర గుండ్రమును చేయబడినది. యేకలింగ ప్రతిష్ఠకు చెల్లును. ఏక లింగమునకుగాని

బహులింగములకుగాని 16 మొదలు 2. 2. ధారలు పెంచుచు ఇట్లువరు సగా వెయ్యివఱకును చేయవచ్చును. దీనిని ధారాలింగమందురు. మరియు విస్తారమును 5-6-7-8 భాగములుచేసి ఒక్కొక్కదానికి 2 భాగముల చొప్పున తలలను చేసిరేని వరుసగా కుక్కుటాండరూప లింగము, త్రపుషరూపలింగము, అర్ధచంద్రాకార లింగము, ఛత్రాకారలింగము, ఇట్లు నాలుగు విధములగు లింగములేర్పడును. మరియు లింగముయెత్తును 16 భాగములుచేసి అందు 2-3-4 భాగములను వదలి దాని దిగువ ప్రదేశమున ఆయా భాగములలో సగము వంకు మధ్యభాగమున విస్తారమును, తలయందు 1-2-3 భాగముల ఎత్తును ప్రక్కలయందు తగ్గునట్లు వృత్తరేఖను గీయవలయును. ఇట్లు గీయుట వలన ఛత్రాద్యాకారము లేర్పడును. ఇట్లు ఆలోచించి తలను రచించవలయును. నాగర ద్రావిడ వేసరలింగముల తలలగును. ఒక్క లింగముగాని, అనేక లింగములుగాని, వాని తలలను మనుష్యుని తల వలెను, మొగ్గవలెను, గొడుగువలెను, కల్పించవలయును. పూర్వము చెప్పబడిన కొలతల ప్రకారము లింగములను ప్రతిష్ఠించవలయును.

## 10. అష్టలింగముల వివరము

### కాశ్యప శిల్పము 49వ పటలము

శ్లో॥ సమలింగంవర్ధమానం శైవాధికంతుస్వస్తికం।
సర్వతోభద్రలింగంచ సార్వదేశికమేవచ॥ 110

ధారాలింగంముఖలింగం లింగమష్టవిధంభవేత్।
సమలింగంతువిప్రాణాం నృపాణాంవర్ధమానకమ్॥ 111

శైవాధికంతువైశ్యానాం శూద్రాణాంస్వస్తికంభవేత్।
సర్వేషామితరంలింగం సర్వకామఫలప్రదమ్॥ 112

ఏకఏవమహాదేవో లింగభేదాన్నృణాంహితః।
ఇష్టాయామునిశార్దేన చతురశ్రీకృతంపురా॥ 113

పశ్చాద్భాగత్రయంకల్ప్య మనేనవిధినాయుతః।
చతురశ్రమధోభాగం బ్రహ్మభాగంసముచ్యతే॥ 114

మధ్యేతువసుకోణంస్యాద్ విష్ణ్వంశంతత్ప్రకీర్తితం।
ఊర్ధ్వభాగంతువృత్తంస్యా త్తచ్ఛివాంశేతివిద్యతే॥ 115

అంశంప్రత్యధానాస్తే అశేషంతుశివాత్మకమ్। 115½

తా॥ సమ లింగము, వర్ధమాన లింగము. శైవాధిక లింగము. స్వస్తికలింగము. సర్వతోభద్రలింగము, సార్వదేశికలింగము, ధారా లింగము, ముఖలింగము, సమలింగము, బ్రాహ్మణులకును, వర్ధమాన లింగము, క్షత్రియులకును, శైవాధికలింగము వైశ్యులకును, స్వస్తిక లింగము శూద్రులకును, సర్వతోభద్రలింగము సమస్తమైన వారికిని యోగ్యము. ఇష్టము వచ్చిన పొడవుగల శిలను నలుచదరముగా చేసి పొడవును 3 భాగములు చేసి, మధ్యభాగము 8 కోణములుగను పై భాగము గుండ్రముగను చేయవలయును. మొదలు బ్రహ్మభాగం నడుమ విష్ణుభాగము. పైన శివభాగము. అని తెలియవలయును దీనిని సమలింగమందురు.

శిల్పరత్నం ఉత్తరభాగము 2వ అధ్యాయము

శ్లో॥ సంకృత్యంశేతులింగోచ్చే సప్తాష్టనవభిఃక్రమాత్కే।
అంశైర్బ్రహ్మహరీశాన భాగాఃస్యుర్వర్ధమానవే॥ 93

పంచషట్సప్తభాగైర్వా చతుఃపంచషడంశకైః।
వర్ధమానంభవేల్లింగం శ్రేష్ఠమధ్యాధిమక్రమాత్॥ 94

లింగాయామేతుపంక్త్యంశే రామాగ్నిశ్రుతిసమ్మితైః।
అంశైర్బ్రహ్మాదిభాగాఃస్యుః క్రమాల్లింగేశివాధికే॥ 95

లింగోత్సేధేతుసందాంశే షట్సప్తవసుభాగకైః।
బ్రహ్మవిష్ణ్వీశభాగానాం క్రమాన్మాహాఃప్రకీర్తితాః॥ 96

లింగంత్రైరాశికంనామ భవేత్సర్వసమేతుతత్।
స్వాయామార్థార్ధవిస్తారం స్వస్తికంవాశివాధికమ్॥ 97
వర్ధమానంచతల్లింగం నామ్నాసురగణార్చితం।
తత్సార్వదేశికంజ్ఞేయం సర్వవర్ణహితావహమ్॥ 98

తా॥ లింగమునెత్తును 24 భాగములుచేసి అందు బ్రహ్మ, విష్ణు, శివ భాగములు 7-8-9 చేసిన యెడల వర్ధమాన లింగమగును. లేక 5-6-7 భాగములుగాని, 4-5-6 భాగములుగాని చేసినను మధ్యమ కనీసవర్ధమానలింగములగును. లింగమునెత్తును 10 భాగములుచేసి 3-3-4 భాగములు బ్రహ్మ విష్ణు శివాంశములుగా చేయబడినవి. శివాధికలింగము, లింగమునెత్తును, 9 భాగములుచేసి అందు 6-7-8 భాగములు బ్రహ్మ విష్ణు శివభాగములు చుట్టుకొలతలు క్రమముగాచేయబడినది. వరుసగా శ్రేష్ఠ, మధ్యమ, కనిష్ఠ సర్వతోభద్రలింగములగును, లింగమునెత్తును 2. భాగములుచేసి అందు శివ భాగము పెంపుచేయబడినది. స్వస్తిక లింగమగును. మరియు వర్ధమానలింగము కూడ యెత్తు 9 భాగములుచేసి అందు విష్ణుభాగములు 4ను శివభాగములు 5ను చేసిరేని సార్వదేశికమనిపించుకొనును దేవతలచే బూజింపబడుటయు సర్వవర్ణములవారికి హితమును గలుగును.

శిల్పరత్నం ఉత్తరభాగము 2వ అధ్యాయము

శ్లో॥ వైష్ణవాంశేచశైవాంశే ధారాద్విద్విగుణీకృతే।
సర్వేషామపిలింగనాం ధారాలింగంత్రిధామతమ్॥ 106
మూలేఽష్టాశ్రంవాకలాశ్రం యుగాశ్రంతస్మాదూర్ధ్వం
తద్యుగాఽస్యుశ్చధారాః॥
ఏవంపూర్వాచార్యకైరీశ్వరస్య ప్రోక్తంధార
లింగమేతత్త్రిధైవ॥ 107

సర్వతోభద్రదలింగేషు ధారాఃస్యుఃపంచవింశతిః।
సప్తపర్ణదలాకారాః సమాఃసర్వాఃసమాంతరాః॥ 108
ఏకైకస్యాంతుధారాయాం చత్వారింశత్ప్రసంఖ్యయా।
కుర్యాత్సమానిలింగాని స్యాత్తల్లింగసహస్రకమ్॥ 109
చతురశ్రస్యకోణార్థ సూత్రలాంఛనమధ్యతః।
కోణత్యాగాత్తో తదష్టాశ్రం,కుర్యాద్విష్ణ్వంశసిద్ధయే॥ 110
అర్థవాలింగవిస్తారం సప్తధావిభజేత్సమం।
మధ్యేత్రిభాగంసంస్థాప్య ద్విద్విభాగవివర్జనాత్॥ 111
వస్వశ్రం సిద్ధ్యతిసమ మథవృత్తంనిగద్యతే।
చతురశ్రస్యలింగస్య శిరోమధ్యేనిధాయతు॥ 112
సూత్రందిగంతమానేన భ్రామయేద్వృత్తసిద్ధయే॥ 113

తా॥ విష్ణుభాగమునగాని, శివభాగమున గాని కోణములు రెట్టింపు చేయుచువచ్చినది ధారాలింగమగును. మొదలు 4-8-16గాని చేసి రెండవ భాగమున అనగా విష్ణుభాగమున దానికి రెట్టింపుగా కోణములుచేయబడి అవి అరటియాకునందున్న రేఖలవలె విడివిడిగా కనపడుచుండవలెను. ఇట్లు 25 వఱకు కోణములుచేసి ఒక్కొక్క దానిని 40 ఖండములుచేయగా 1000 కోణములగును. ఈ గదులలో ఒక్కొక్క లింగమును తీర్చుటచే సహస్ర లింగములగును. లింగము యొక్క నలుచదరమున మధ్యరేఖలనుంచి ఆ మధ్య గుర్తుల ప్రకారము కైవారములో గీచి ఆ వృత్తమును 8 భాగములుచేసి గీతలను గీచి ఆ ప్రకారము 8 కోణములు చేయవలయును. లేదా విస్తారమును 7 భాగములుచేసి ఇట్లు నలువైపుల గుర్తులుపెట్టి నడుమ 3 భాగములను వదలి మూలలయందు 2 · 2 భాగములను తెగగొట్టిన యెడల సమానముగా 8 కోణములువచ్చును, పైభాగమున వృత్తరేఖగీచి విష్ణుభాగమునందలి కోణములను తగ్గించినయెడలశివాంశము గుండ్రముగా వచ్చును.

## కాశ్యపశిల్పము 49వ పటలము

శ్లో॥ పూజాభాగత్రయంకృత్వా ఊర్ధ్వభాగంముఖంభవేత్ —
...చైవసమాయతమ్॥ 117
కర్ణాష్టౌద్వాదశాక్షంచ సర్వలక్షణసంయుతం।
లింగాకారాయతస్తస్య తస్యాయంపిండికాన్వితమ్॥ 118
— అథవాఽధికమ్ నేత్రసూత్రపుటాంతంచ
పుటార్థంవర్ధమానకమ్॥ 119
ప్రత్యేకంతుపదాధిక్యం యుగాంశంపరికల్పనం,
హిక్కాదిగలమానంతు చత్వార్యపముదాహృతమ్॥ 120
యున్నైకోనదశాంశంతు కంఠోచ్చమితివిద్యతే।
శేషంలింగాకృతిఖ్యాతం కల్పయేల్లక్షణాన్వితమ్॥ 121
చతుర్వక్త్రైకవక్త్రంవా చతుర్బాహుద్విబాహువా।
స్తనసూత్రోపరిష్టాత్తు బింబంలక్షణసంయుతమ్॥ 122
హిక్కాసూత్రోపరిష్టాద్వా శేషంలింగాకృతిర్భవేత్।
ముఖలింగమితిఖ్యాతం నృపాణామపివృద్ధయే॥ 123
విష్కంభమష్టధాకృత్వా మూలేమధ్యేతథాగ్రకే।
భాగహీనంతుసంకల్ప్య స్థూలమూలముదాహృతమ్॥ 124
హ్రాసయేచ్ఛివభాగాది శిరఃస్థూలముదాహృతమ్।
ఏతదార్షమితిఖ్యాత మృషిభిఃపూజితంవరమ్॥ 125
గుణాశ్రంపంచకోణంచ షట్సప్తద్వాదశాశ్రకమ్।
దశధావాఽశ్రకంఽవాఽపి అశ్రేతరమనోహరమ్॥ 126
ఫలకాదర్పణాకార మేకరేఖమరేఖకమ్ శిరసోవర్తనాహీనం
మానోన్మానైరసన్వితమ్॥ 127
సేవ్యంస్వాయంభువంచేతి ఖ్యాతందేవైః సుపూజితమ్।
బాణేనపూజితాభోగం బాణలింగముదాహృతమ్॥ 128

స్థూలంసూక్ష్మంశిరోమూలం క్రమేణపరిపఠ్యతే।
ఉత్తమంతుముఖంఖ్యాతం మధ్యమంసమమాననమ్॥ 129
విష్టరేతుప్రవేశాంశం సార్వదేశికలింగవత్।
లోహాజిడకరత్నంచైవ శార్వదేశికలింగవత్॥ 130

తా॥ శివలింగమును 3 భాగములుచేసి అందు పై భాగమున ముఖమును చేయవలయును. 8 చెవులును, 12 కన్నులను, ఇట్లు నాలుగు తలలుగా రచించవలయును.—నేత్ర సూత్రము నుండిపుటాంతము వఱకు చేయవలయును. వర్ధమానమునకు 1 భాగమధికము చేయవలయును. పుటార్ధమునుండి 4యవము అక్కిలి మొదలుగళము 4 యవము మొత్తము కంఠముయెత్తు 9 యవలు చేసి మిగిలినదిలింగాకారముగనే యుండవలయును. 4 ముఖములుగాని 1 ముఖముగాని, 4 చేతులుగాని, 2 చేతులుగానిచేయవచ్చును.స్తనసూత్రముపైభాగమును మాత్రమేరచించవలయును. లేకహిక్కాసూత్రము నుండి పైభాగమును కూడశివరూపమురచించిమిగిలినది లింగాకారముచేయవచ్చును. దీనిని ముఖలింగమందురు. బ్రాహ్మణులేకాక క్షత్రియులుగూడపూజింపదగినది. లింగము వెడల్పును 8 భాగములుచేసి మొదలుకంటె చివర 1 భాగమును తగ్గించినయెడల మొదలు లావు చివర సన్నము అగును. దీనిని ఆర్ష లింగమందురు. మహర్షులు పూజింపదగినది. మరియు 3-5-6-7-10-12 కోణములుకలదిగాని, లేక గుండ్రముగానున్నదిగాని తల గుండ్రముగా లేకచదరముగానున్నదిగాని, తెల్లనిచాఱ కలదిగాని, చాఱలు లేనిదిగాని, శాస్త్రమునకు సరిపడినకొలతలు లేకున్నను దానిని స్వాయంభువలింగమందురు. అది సేవకులు పూజింపదగినది. బాణలింగం కూడ స్వాయంభువలింగములో సమానమైనదే. మొదలు కంటె తల యెక్కువ విస్తారముగలది యుత్తమ ముఖము, మొదలు చివర సమానముగలది మధ్యమముఖము. పీఠమున ప్రవేశము సార్వదేశిక

లింగమువలె నుండవలయును. లోహజలింగము, రత్నజ లింగము సార్వదేశిక లింగములవలెనుండవలెను.

## 11. లింగశిరోవర్తన భేదములు

### అపరాజితపృచ్ఛ 203వ సూత్రము

శ్లో॥ సమస్తానారహిలింగానాం బ్రహ్మదౌచతురశ్రకః।
కర్ణసూత్రాన్మృక్తకోణే విష్ణురష్టాశ్రకోభవేత్॥ 32
బ్రహ్మాదిస్థానతోలుష్టో వృత్తాకారసముద్భవః।
పూజాభాగఊర్ధ్వతఃస్యా ద్రుద్రాంశోవృత్తసంజ్ఞకః॥ 33
విస్తారంచాస్యలింగస్య తదంతముపలక్షయేత్।
విభక్తిర్మస్తకే తేషాం లింగానాంపంచధాభవేత్॥ 34
ఛత్రాకారమష్టమాంశే సార్ధంద్వ్యంశంషడంశవే।
త్రపుషాభంవేదభక్తే ద్విభాగంకుక్కుటాండభమ్॥ 35
త్రిభక్తేలింగవిస్తారే చైకాంశమర్ధచంద్రకమ్।
సార్ధత్ర్యంశేనతుల్యంస్యా దష్టాంశేలుద్బుదాకృతిః॥ 36

తా॥ లింగము లన్నిటికిని మొదలు బ్రహ్మభాగము నలుచదరమును, విష్ణుభాగము 8 కోణములును, శివభాగము గుండ్రమును చేయుదురు. లింగముయొక్క విస్తారమును 8 భాగములుచేసి నడుము మొత్తు $1\frac{1}{2}$ భాగము పెంచి కైవారముతో గీచినయెడల ఛత్రాకారము వచ్చును. విస్తారమును 6 భాగములుచేసి $2\frac{1}{2}$ భాగములతో ప్రక్కలు తగ్గించి కైవారముతో గీచినయెడల త్రపుషాకారమువచ్చును. విస్తారమును 4 భాగములుచేసి అందు 2 భాగములు ప్రక్కలు తగ్గించి కైవారముతో గీచినయెడల కుక్కుటాండాకారము వచ్చును. విస్తారమును 3 భాగములుచేసి అందు 1 భాగము ప్రక్కలు తగ్గించి కైవారముతో గీచినయెడల అర్ధచంద్రాకారము వచ్చును. విస్తారమును

8 భాగములు చేసి ప్రక్కలు 3½ భాగములు తగ్గించి కైవారముతో గీచిన యెడల బుద్బుదాకారమేర్పడును. ఇట్లు 5 విధములనివిరుంగ వలయును.

శిల్పరత్నం ఉత్తరభాగం 2వ అధ్యాయము

శ్లో॥ షడంశేలింగవిస్తారే సార్ధద్వ్యంశేనవర్తయేత్॥ 1.0
త్రపుషాభశిరఃసిద్ధ్యైరామాంశైః కుక్కుటాండకమ్।
లింగవ్యాసతృతీయాంశవర్తనాదర్ధచంద్రకమ్॥ 121
లింగవ్యాసేఽష్టధాభక్తే సార్ధాంశత్రయవర్తనాత్।
బుద్బుదాభస్యలింగస్యశిరఃసిద్ధ్యతిశోభనమ్॥ 122

తా॥ లింగముయొక్క విస్తారమును 6 భాగములుచేసి మధ్య 2½ భాగములు పెంచి వృత్తమును గీచినయెడల త్రపుషాకారము, 3 భాగములు నడుమ పెంపుచేసి వృత్తమును గీచినయెడల కుక్కుటాండాకారము, లింగముయొక్క విస్తారములో 3వ వంతు మధ్య పెంచి వృత్తమును గీచినయడల అర్ధచంద్రాకారము. లింగముయొక్క విస్తారము 8 భాగములుచేసి మధ్య 3½ భాగములెత్తుచేసి కైవారము గీచిన యెడల బుద్బుదాకారము, ఇట్లు తలలు యేర్పడునని తెలియ వలయును.

కాశ్యపశిల్పము 49వ పటలము

శ్లో॥ లింగభేదః సమాఖ్యాతః శిరసోవర్తనంశృణు।
లింగమూర్ధాదికేశాంతం శిరసోవర్తనంభవేత్॥ 131
తస్మాల్లింగోదయేకుర్యాచ్ఛిరసోవర్తనంద్విజ।
ఛత్రాకారంభవేత్పూర్వం కుక్కుటాండంద్వితీయకమ్॥ 132
తృతీయంత్రపుషాకారమర్ధచంద్రంచతుర్థకం।
యస్యలింగస్యవిష్కంభమష్టధావిభజేద్బుధః॥ 133

ఊర్ధ్వాదేశాంశమాలంబ్య ప్రథమంఛత్రశీర్షకం।
ద్వాత్రింశద్విభజేత్తార మూర్ధ్వాద్యూర్ధ్వాంశలమ్బితమ్॥ 134
ఛత్రాభంతద్ద్వితీయంస్యాత్ సప్తాంశంతత్తృతీయకం।
చతుర్థంతునవాంశంతు ఛత్రాభంచతుర్విధమ్॥ 135

ద్విజానాంచనృపాణాంచ ఛత్రాభంసర్వకామదం।
సర్వేషాముః లింగానాం ఛత్రాభంతుప్రశస్తకమ్॥ 136

ద్వాత్రింశేతుశిరస్తారే ద్వావింశత్యేకవింశతిః।
వింశదేకోనవింశాంశైః కుక్కుటాండంచతుర్విధమ్॥ 137

స్వస్తికాఖ్యంచలింగంతు ప్రశస్తంశూద్రవృద్ధిదం।
సార్వదేశికలింగానా మన్యేషాంచవిశేషతః॥ 138

ప్రాసేద్వాత్రింశదంశేతు మనుపంక్తికలాంశకైః।
సప్తదశాంశకంచైవ త్రపుషాభంచతుర్విధమ్॥ 139
వర్ధమానంచలింగంతు ప్రశస్తకంతు [illegible]।
ద్వాత్రింశాంశేశిరస్తారే ధర్మరుద్రాంశకైఃసదా॥ 140
మనుత్రయోదశాంశైస్తు అర్ధచంద్రంచతుర్విధమ్।
శివాధికంచలింగంతు శస్తంవైశ్యార్హకంమతమ్॥ 141

తా॥ లింగముయొక్క తల గుండ్రముగా నుండుటకు గల భేదములను చెప్పుచున్నాడు. లింగముయొక్క మస్తకము [illegible] కేశాంతము వఱకు భాగములను చెయవలయును. విస్తారమును 8 భాగములు చేసి నడుమ 1 భాగమును యెత్తుచేసి కైవారము గీచినయెడల ఛత్రాకారము మొదటి పద్ధతియగును. విస్తారమును 32 భాగములుచేసి నడుమ 5 భాగములను యెత్తుచేసి కైవారముగీయగా ఛత్రాకారము రెండవపద్ధతి యగును. మధ్య 7 భాగముల యెత్తుచేయగా ఛత్రాకారము 3వ పద్ధతియగును. 9 భాగములయెత్తు చేయగా ఛత్రాకారము నాల్గవ పద్ధతి యగును. విస్తారము 32 భాగములను నడుమ

స్తు 19-20-21-22 భాగములుచేసి కై వారముతో గీయగా వరుసగా
క్కుటాండ పద్ధతి నాలుగు విధములగును. విస్తారమును 32 భాగ
లనుచేసినచుమ 14-15-16-17 భాగములనుయెత్తుచేసికై వారముతో
నయెడల వరుసగా త్రపుషాకారమున నాలుగు విధములగును.
్తారమును 32 భాగములుచేసి నడుమ 10-11-12-13 భాగములుచేసి
వారముతో గీయగావరుసగా అర్ధచంద్రాకారమున నాలుగు విధము
ను, ఛత్రాకారలింగము బ్రాహ్మణులకును క్షత్రియులకును దగినది.
స్తిక లింగము కుక్కుటాండరూప లింగము శూద్రయోగ్యమైనది.
పుషాకారముగల వర్ధమానలింగము క్షత్రియులకుదగినది. శివాధిక
గమున అర్ధచంద్రాకారము చేయబడినది. వైశ్యయోగ్యలింగము,
ు తెలియువలయును.

(అనుబంధము 1 నుండి 5వ పటము వరకు చూడుడు)

## 12. సమరాంగణ దశలింగములు

సమరాంగణ 70వ అధ్యాయము

॥ పూజాంశమేకాదశధా భక్త్వోర్ధ్వం సర్వతఃసమం।
తిర్యక్తద్వైకనవతిం భాగానాంశిరసోభజేత్॥ 13
భజేత్సహస్రంలింగానాం స్థైకమిత్యసమైఃపదైః।
సహస్రలింగమిత్యుక్తం పంచవక్త్రాంగమేవతత్॥ 14
అధోవిభాగంనవధా లింగేసర్వంవిభాగయేత్।
ఊర్ధ్వేభాగత్రయంత్యక్త్వా భాగభాగేనకల్పయేత్॥ 15
భాగేనశిరసస్తస్య గ్రీవాకుర్యాత్ తతఃపరం।
భాగద్వయేనస్కంధాంశం కర్ణాయుగ్మపచానిచ॥ 16
పుష్పసంస్థితమాశాసు విహితేచస్పృష్టపిః।
చతుర్ముఖంభవేల్లింగ మర్చితంసర్వకామదమ్॥ 17
త్రిముఖేతులలాటాదీ న్యంగాన్యంశేనసాంఘ్రిణా।
పృథక్పృథక్విధేయాని శేషాంశాత్స్కందకల్పనా॥ 18

ఏకవక్త్రే త్రిభాగేన సార్ధేన లలాటాదీని కల్పయేత్।
నవభక్తే త్యజేద్ ద్వౌ ద్వౌ విభాగౌ పార్శ్వయోర్ద్వయోః॥ 19

విధి రేష చతుర్వక్త్రే విభక్తే పార్శ్వయోర్ద్వయోః।
సార్ధం సార్ధం జేత్ పార్శ్వే చైకవక్త్రోర్ధ్వతశ్చహి॥ 20

చంద్రార్ధాలంకృతం కార్యం జటాజూటధరం శిరః।
శిరసో వర్తనాకారా పూర్వప్రోక్తేన వర్త్మనా॥ 21

ఏకత్రిచతుర్ణాం స్యానాం విస్తృతిర్ముఖసిర్గమః।
స్యాద్ద్వా విభాగైరాకంద్రికాణాం క్రైర్యర్యథాక్రమమ్॥ 22

ముఖలింగం న కర్తవ్యం లింగాత్ సర్వసమాన్వితే।
సర్వేషాం ముఖలింగానాం ద్విదలం పీఠమిష్యతే॥ 23

తేజోఽపి జాయతే దైర్ఘ్యం త్రయస్త్రింశత్సహస్రశః।
లోహానితద్వద్ దారూత్థా న్యశ్మమృత్ప్రభవానిచ॥ 24

తా॥ లింగముయొక్క పైభాగమును 11 భాగములు చేసిదానికి అడ్డముగా 91 భాగములను చేసి లింగరూపములుగా చేసినయెడల 1001 లింగములగును. దీనిని సహస్ర ముఖలింగమందురు. 5 భాగములుగా చేసి 5 ముఖములను చేయవచ్చును. 4 ముఖములు చేయుదగును. దిగువ 9 భాగములును పైన 3 భాగములను వదలి 6 భాగములును ముఖములను కల్పించవలెను. తల ముఖము మెడ భుజములు చెవులు చేయవలయును. తల 1 భాగము మెడ స్కంధము 2 భాగములు చెవులు 1/2 భాగము ఇట్లు రచించవలయును లింగముయొక్క అడుగు భాగమున పద్మమును రచించవలయును. ఇట్టి లింగమును బూజించుట వలన అన్ని కోరికలు నెఱవేరును. 3 ముఖములుగల లింగమును $1\frac{1}{4}$ భాగము ముఖమును, చేసి అచ్చటినుండి మిగిలిన రూపమును చేయవలయును. ఒక్కటే ముఖమైనచో $1\frac{1}{2}$ భాగము ముఖముండవలయును. చతుర్ముఖ లింగమున విస్తారమును 9 భాగ

ములు చేసి యిరుప్రైపుల 2. 2. భాగములను వదలవలయును. ఏకముఖ లింగమున 1 న్నర, 1 న్నర భాగములను ప్రక్కలయందు వదల వలయును. జటాజూటమును బాలచంద్రుడును కలిగి యుండవలయును. లింగము యొక్క తల గుండ్రముగానే యుండవలయును. 1-3-4 ముఖములయ్యేనేని ముఖములయొక్క విస్తారములు, నిర్గమములు ఆలోచించి చేయవలయును ముఖలింగమున లింగమునంతటను ముఖం చేయరాదు. ముఖలింగము లన్నింటికిని పీఠము రెండు దలములు గలిగియుండవలయును. తేజోలింగమును, లోహలింగమును, దారు లింగమును, శిలాలింగమును, మృణ్మయలింగమును చేయవచ్చును.

శ్లో॥ ప్రాసాదగర్భమానాద్వా పంచాంశైస్త్రిభిరుత్తమమ్॥ 27

నవాంశైః పంచభిర్మధ్యం కనీయోఽర్ధేనతద్భవేత్।

ప్రభేదైరంతరైస్తేషాంయథాయోగంత్రిభిస్త్రిభిః॥ 28

షడన్యానిభవంత్యేవం నవలింగానిపూర్వవత్॥

తా॥ గర్భాలయమును 5 భాగములుచేసి అందు 3 భాగములు పీఠముండుట శ్రేష్ఠము. 9 భాగములుచేసి 5 భాగములుంచుట మధ్యమము. లేక సగముంచుట అధమము. ముఖ్యలింగముల కిట్లుండవలయును.

శ్లో॥ ద్వైర్ఘ్యేషోడశధాభక్తే చతుర్భిఃసురపూజితం॥ 30

లింగంవిష్కంభతోఽస్యాద్యం భూతాంశైరంచితంశుభైః।

భవేత్ సర్వసమంషడ్భి రాద్యాఖ్యంచతురశ్రకమ్॥ 31

కోణేకర్ణాగ్రసూత్రేణ లాంఛితే శేషమావనాత్।

అష్టాశ్రిస్యాత్ సప్తభక్తే హానాత్కర్ణాంశయోరథ॥ 32

గర్భసీమార్ధసూత్రేణ వర్తనాద్వృత్తనిర్మితం।

అథోమధ్యోర్ధ్వభాగాః స్యుశ్చతురశ్రాదికాఃక్రమాత్॥ 33

బ్రహ్మవిష్ణుమహేశానాం దైర్ఘ్యే లింగే సమోత్తమాః।
సమస్తేష్వపి లింగానాం భాగాస్స్యుః పృథుమానతః॥ 34

పునరూర్ధ్వే విధాతవ్యో భాగో బ్రహ్మశివాశ్రయో।
లింగస్య దైర్ఘ్యజం పీఠే విస్తారోऽసౌ విధీయతే॥ 35

లింగవిస్తారతశ్చాన్యత్ పార్శ్వపీఠే విశిష్యతే।
తత్సమో బ్రహ్మణో భాగాత్ సంప్రదాయాపహ్నుత్యవా॥ 36

తా॥ లింగము పొడవును 16 భాగములుచేసి విస్తారము 4 భాగములు చేయబడినది దేవతల్కు పూజించునది. విస్తారము 5 భాగములు చేయబడినది శుభములనిచ్చును. లేక విస్తారము 6 భాగములు చేయబడినదియును శుభకరమే. మొదలు నలుచదరమును, నడుము 8 కోణములును, చివర గుండ్రమును చేయవలయును. నడుమకోలత 8 భాగములను చివర గుండ్రముగా చేయగా 7 భాగములేయగును, సమస్తమైన లింగములును ఇదే ప్రకారము చేయదగినవి. లింగము యెత్తుతో సమానముగా పీఠముయొక్క విస్తారమును చేయవలయును ప్రక్క పీఠములు లింగవిస్తారముతో సమానముగా నుండవలయును.

శ్లో॥ రుద్రభాగో విధాతవ్యో లింగో ప్రాచ్యాయస్తథైవచ।
ఊర్ధ్వం త్ర్యంశస్య మానేన వర్తనాద్బాలచంద్రమాః॥ 38
శరాంశం కుక్కుటాండంచ తుర్యంశం త్రపుసన్నిభమ్।
అష్టమాంశస్య తుచ్ఛత్రం మానాదర్ధస్య వర్తనాత్॥ 39
కృతేऽష్టాంశే చతుర్థాస్మిన్ భాగవృద్ధ్యా తదుచ్యతే।
పుండరీకం విశాలాఖ్యం శ్రీవత్సం శత్రుమర్దనం॥ 40
లింగేషు లక్షణోద్ధారః కర్తవ్యః సచకథ్యతే రుద్రభాగం త్రిధా
భక్త్వా ద్వాభ్యాం లక్షణముద్దిశేత్॥ 41
శిరోర్ధార్ధాయతో లింగే లక్షణోऽపి తదిష్యతే।
యద్వాయతాంశనం షష్ఠే కర్తవ్యం నవమాంశకే॥ 42

నవాయామంశివాకారం పక్షరేఖావివర్జితమ్।
పార్శ్వరేఖాత్రిభాగేన విస్తృతంచతురశ్రకమ్॥ 43
ప్రాగ్వదష్టాశ్రివృత్తంచ షడశ్రిచ్ఛత్రమస్తకం।
శత్రుమర్దనసంజ్ఞేన ఛత్రేణ సమలంకృతమ్॥ 44
లింగమింద్రార్చితంశస్తం మ్నోంద్రందిగ్విజయార్థినామ్।
ప్రతిష్ఠాప్యమిదంశత్రోర్వ్యద్వాస్తంభనమిచ్ఛతా॥ 45
లోకపాలైశ్చైతికుర్యాత్ తత్త్ర్యంశార్ధార్ధలక్షణమ్।
ఐంద్రదేవప్రజాభమధ్యేఽస్య పక్షరేఖావిధీయతే॥ 46

తా॥ లింగముయొత్తు 11 భాగములుచేసి తలయందు నడుమ 3 భాగములుంచి కైవారము గీయబడినది. అర్ధచంద్రాకారము 5 భాగములుంచి గీయబడినది. కుక్కుటాండాకారము 4 భాగములుంచి గీయబడినది త్రపుషాకారము ఎత్తులో 8వ వంతుచేసి కైవారముతో గీయబడినది ఛత్రాకారము. ఇందలి ఛత్రాకారమునకు పుండరీకమనియు, అర్ధచంద్రాకారమునకు విశాలాఖ్యమనియు, త్రపుషాకారమునకు శ్రీవత్సమనియు, కుక్కుటాండాకారమునకు శత్రుమర్ధనమనియు, నామముల నిర్ణయించిరి. ఈ లింగములయందు ముఖములను రచించుటకు లక్షణములు చెప్పబడియున్నవి. లింగముయొక్క పైభాగము శివాంశము. కనుక దానిని 3 భాగములుచేసి పైన 1 భాగమును వదలి 2 భాగములలో శివముఖములను రచించవలయును, పొడవుగల ముఖమును చేయదలచినచో ఈ కొలత సరిపోవును లేక 2 భాగములుచేసి పైన 1 భాగమును వదలి మిగిలిన సగములోను చేయవచ్చును. 9 భాగములు పొడవుచేసినప్పుడు ప్రక్కలయందు గీతలుంచదగదు. ప్రక్కగీత 3వ వంతు చేయవలయును. విస్తారమును నలుచదరము 8 కోణములును, గుండ్రమును లేక 6 కోణములును

ఛత్రాకారముగా తలను చేసినయెడల శత్రుమర్ధనమను పేరుగలది యగు ఇట్టి లింగబ్రహ్మునిచే పూజింపబడినది. కనుక దీనిని తూర్పున ప్రతిష్ఠించిన యెడల విజయమును సంపదలు కలుగును. దీనికి పక్ష రేఖలు వజ్రాకారముగా నుండవలయును.

శ్లో॥ స్వదైర్ఘ్యదలరుద్రాంశైః పంచభిచ్ఛత్రభావనాం।
విస్తృతంచతురశ్రంస్యా న్మద్యేవృత్తంచపూర్వవత్॥ 47

అశ్రిభిఃసప్తభిర్యుక్తంవృత్తంస్వాస్రవివర్జితమ్।
ప్రాగ్విస్తారార్థవిస్తారి లక్షణేనోక్తమస్తకమ్॥ 48

యద్వైకాదశభిర్భక్తే పక్షయోశ్చత్రిభిస్త్రిభిః
లుప్తైరంశైస్తదేవాంశే నోచ్ఛ్రితంఛత్రమిష్యతే॥ 49

ఇదమగ్న్యర్చితంలింగం కృత్వాగ్నేర్యోబయేద్దిశమ్।
చికీర్షుణారిసంతాపం ప్రతిష్ఠాప్యమిదంసదా॥ 50

తా॥ లింగముయొక్క పొడవు 11 భాగములుచేసి అందు 5 భాగములు ఛత్రాకారముచేసి విస్తారము నలుచదరము గుండ్రము పూర్వమువలెనేచేసి మధ్య 7 కోణములుగాని, గుండ్రముగాని చేయ దగును విస్తారమును 11 భాగములుచేసి ప్రక్కలయందు 3 . 3 భాగములు వదలి పైన 1 భాగము ఎత్తుచేసి రచింపబడిన తల ఛత్రా కారమగును. ఇది అగ్నిచే పూజింపబడిన లింగము ఆగ్నేయమున స్థాపించినయెడల శత్రువులను జయించును.

శ్లో॥ స్వదైర్ఘ్యార్ధనవాంశానాం పంచకేనప్రవిస్తృతమ్।
కుర్యాత్తుండంచపృష్ఠంచ పార్శ్వయుగ్మంత్రిభిస్త్రిభిః 51

నవధాసర్వతఃకృత్వాత్రీంస్త్రీనుత్సృజ్యకోణగాన్।
కుర్వీతాష్టాస్రమేవంస్యాత్ క్రమాద్వృత్తంవినాశ్రిభిః॥ 52

మూర్ధానందశభిర్భక్త్వా భాగత్రితయలోపనే।
పక్షయోర్వహితేకుర్యాదుచ్ఛ్రితం దశమాంశతః॥ 53

లక్షణంపూర్వవత్ కార్యం దంమి గ్రాకారమగ్రతః।
ఇమంయామ్యాదిశిస్థాప్యం లింగంమృత్యుజిగీషుభిః॥ 54
వధార్థంవావిపక్షాణాం సర్వైరైవస్వతార్చితమ్॥

తా॥ లింగముయొక్క పొడవులో సగము 9 భాగములుచేసి విస్తారము 5 భాగములతో ముఖమును వెనుక 3 . 3 భాగములతో ప్రక్కలను నడుమ 3 భాగములు వీపును చేయవలయును లేక 9 భాగములుచేసి మూలలయందు 3 . 3 భాగములను వదలి కోణములను రచించవచ్చును. తలను 10 భాగములుచేసి యిరుప్రక్కలయందు 3 . 3 భాగములు తీసివేసి యెత్తు 10 భాగములుచేసి పూర్వమువలెనే రచించవచ్చును. లింగముతల కత్తియొక్క పై భాగము వ్లెనుండ వలెను. ఇట్లు దక్షిణదిశయందు స్థాపించు లింగమును చేయవలయును. అకాలమృత్యుదోషములను పోగొట్టును. ఇట్టి లింగమును యముడు పూజించినట్లు చెప్పబడియున్నది.

శ్లో॥ స్వరాశిర్మస్తకేరుచ్చే సార్థభాగంపరిక్షతే।
పార్శ్వయోఃస్యాదపిలోపాత్ ఖడ్గాగ్రాభంచశస్యతే॥ 56
ఖడ్గాభిధమిదంలింగం ప్రతిష్ఠాప్యతునిర్ఋతిః॥
అథాపస్వందిగీశత్వం తత్వేయోగంచశాంకరమ్॥ 57
సార్థంసప్తాంశకంలింగం పార్శ్వయోఃసార్థకాన్వితం।
చతుర్థ్యస్త్రక్ష్మైతస్య పాశాగ్రాభంకదాచనం॥ 58
లింగమేతత్ ప్రతిష్ఠాప్య వరుణఃస్వదిగీశతామ్।
యోగంయథాప్తవాసైశం కింత్వేతచ్ఛాంతిపుష్టిదమ్॥ 59

తా॥ లింగముయొక్క పైభాగమున తలయెత్తు 1 న్నర భాగం ప్రక్కలు తగ్గించినట్లయిన ఖడ్గాగ్రములో సమానముగానుండును. దీనిని ఖడ్గలింగమందురు. నైర్ఋతియందు ప్రతిష్ఠించినచో జయము కలిగించును. పడమర దిశయందు ప్రతిష్ఠింపబడు లింగము వరుణున

శిష్టమైనది. తత్త్వయోగము కలుగును. శాంతికరమును బలమును
కలిగించును.

శ్లో॥ స్యాదర్ధేద్వాదశభాగాంశైః సప్తభిః పువతేఽనిలే।
కోణాంశకైస్తథా భక్తైః పార్శ్వయోస్త్రిస్త్రిలోపనే॥ 60

విధేయంపూర్వవత్వృత్తం శిరచ్ఛత్రంవినాపరం।
లక్ష్మధ్వజాగ్రవచ్చాస్య ఏతద్వై వృషదశ్వకమ్॥ 61

ద్విషదుచ్చాటవిశ్లేష పరోక్షకంపాన్వితంచ।
ప్రతిష్ఠాప్యమిదంలింగం వాయవ్యాయాంమనీషిభిః॥ 62

సప్తాంశమూర్ధ్ని పార్శ్వస్థ సపాదాంశంపరిజ్యతేః।
ఛత్రంస్యాల్లక్ష్మచైతస్య గదాగ్రసదృశంభవేత్॥ 63

కృత్వైతత్ కిన్నరేశఃస్యాత్ స్వదిగీశత్వమాత్మవాన్।
యోగంచశివధామాప్య విభూతింప్రాప్తవానతః॥ 64

స్యాత్త్వైరుద్రాంశకైఃషడ్భిర్విస్తృతేచతురశ్రకం।
భక్తైర్భాగత్రయంత్యాగాన్ భవత్యష్టాశ్రిపార్శ్వయోః॥ 65

వృత్తంతుపూర్వవత్ కార్యం కుక్కుటాండనిభంశిరః।
త్ర్యంశంవిహీనైర్నవభిః కుక్కుటాండమిదంభవేత్॥ 66

నవభిఃపార్శ్వయోస్త్రిస్త్రి శాతనాఃకుక్కుటాండకం।
అశ్రిత్రయంచకర్తవ్యం పూజాభాగసమాశ్రయమ్॥ 67

శూలాగ్రప్రతిమంలక్ష్మ లింగేకర్తవ్యమైశ్వరే।
స్యాదిదంయోగసామ్రాజ్య జ్ఞానసంప్రాప్తికారకమ్॥ 68

బ్రాహ్మేస్యాత్ రౌద్రవత్సర్వం పద్మకుడ్మలవచ్ఛిరః।
లక్ష్మాస్మిన్ కమలాకారం లింగకేకమలజన్మనః॥ 9

లింగమేతత్ ప్రతిష్ఠాప్య ప్రాజాపత్యం ప్రజాపతిః।
లేఖేపదమతఃస్థాప్య మిదంవ్యోమపదేచ్ఛుభిః॥ 70

వైష్ణవే రౌద్రవత్సర్వం శిరోఽస్మిన్ కుంతసన్నిభం।
భక్త్వాభవజతుల్యంతా కర్తవ్యంలక్ష్మవైష్ణవే॥ 71
పుణ్యక్షేత్రోద్భవమిదం ద్విజాదీనాంసితాద్యథా।
సంగ్రాహయేచ్ఛిలాద్రవ్యం ముక్త్వాయోషిన్నపుంసకమ్॥ 72

తా॥ లింగములో సగమును 12 భాగములుచేసి ప్రక్కల యందు 3 . 3 భాగములు తగ్గించి 7 భాగములు గుండ్రముచేసి ధ్వజము యొక్క తలవలె రచింపబడినది వాయులింగము. ఇది శత్రువులను జయించుటకై రచింపబడునది. 7 భాగములుచేసి తలయొక్క ప్రక్కలయందు $1\frac{1}{4}$ భాగము చొప్పున తగ్గించి గొడుగువలెగాని, గదయొక్క తలవలెగాని రచింపబడినది కుబేరలింగము. శివసాన్నిధ్యము జేరు యోగమునులభింపజేయును. ఐశ్వర్యముకూడ లభించును 11 భాగములుచేసి 6 భాగములు విస్తారము నలుచదరమును ప్రక్కల యందు 3 . 3 భాగములు తీసివేసి 8 కోణములును, ఆపైన గుండ్రమును తలకోడిగ్రుడ్డువలెను. 9 భాగములలో ప్రక్కలయందు 3 3 భాగములు తగ్గించినను కోడిగ్రుడ్డువలెనే వచ్చును. 3 కోణములును శూలముయొక్క తలవలె రచింపబడినది యీశ్వరలింగము. ఇది యోగసామ్రాజ్యము నిచ్చును. రుద్రలింగమువలెనే అన్నియును చేసి తామరమొగ్గవలె తలను రచించి పద్మమువలె రచించబడినది. బ్రాహ్మ్యలింగము, దీనిని పూజించుటవలన ప్రజాపతిత్వము లభించును. వ్యోమపదములభించును. రుద్రలింగమువలెనేచేసి తలను కుంతమువలె చేసినచో పుణ్యక్షేత్రముల దర్శించుట మొదలగునవి కలుగును, బ్రాహ్మణులు మొదలగు నాలుగు కులములవారికి వరుసగా తెలుపు, ఎరుపు, పసుపు, నలుపు వన్నెలు గలవియును పురుష శిలలను పరీక్షించి లింగమును చేయవలయును. స్త్రీనపుంసక శిలలుగాని దోషములు కలవిగాని పనికిరావు. విశ్వకర్మీయ శిల్పము 5వ అధ్యాయమున బ్రహ్మ విష్ణు శివ భాగములు సమానముకలది వర్ధ

మానము, ఎత్తులో 9వ వంతుగాని. 8వ వంతుగాని తగ్గించి [illegible] కొలత చేయబడినది. సర్వతోభద్రము, ఎత్తును 27 భాగములు చేసి నడుమ 8 కోణములు చేయబడినది స్వస్తికము ఎత్తును 25 భాగములు చేసి నడుమ 16 కోణములు చేయబడినది నంద్యావర్తము అనిర [illegible] బడియున్నది.

## 13. బాణలింగోత్పత్తి

అపరా. 205వ సూత్రము

శ్లో॥ ఆయాతో నారదో భూయోయత్రాఽఽసీచ్ఛూలపాణికః।
రథేచారుహ్య దేవేశం గణంకృత్వా మహేశ్వరః॥ 21

అథోముమోచాగ్ని బాణం జ్వలితంజ్వాలమాలయా।
పాతితందివ్యబాణేన హాహాకారసముద్భవమ్॥ 22

త్రిఖండంత్రిపురంకృత్వా పాతితంధరణీతలే।
ఏకంచపతితంఖండం శ్రీశైలే త్రిపురాంతికే॥ 23

తత్రవైకోటిలింగానాం సిద్ధంక్షేత్రంప్రభావతః।
ద్వితీయంపతితంఖండ పర్వతేఽమరకంటకే॥ 24

అమరనద్యుద్భవాకోటిః కోటిలింగప్రభావతః।
నర్మదాయాంచలింగంత్వ మరకంటక నిర్మితమ్॥ 25

తృతీయంపతితంఖండం వారాణస్యాంతుపుత్రక।
తత్రసార్ధకోటిలింగం ఖ్యాతముద్భవనాశకమ్॥ 26

తా॥ ఈశ్వరుడు త్రిపురములను నశింపజేయుటకు అగ్నిబాణము ప్రయోగింపగా నా పట్టణములు దగ్ధమై ఒకఖండము శ్రీశైలమునను త్రిపురాంతకమునను బడెను. అచట 1 కోటిలింగములు జన్మించినవి. రెండవ ఖండము అమర కంటక పర్వతమున బడెను. అమరకంటకమునను నర్మదానదియందును 1 కోటిలింగములు కలిగినవి.

మూడవఖండము కాశియందు బడెను. అచట 1 న్నర కోటిలింగ ములుదయించినవి. ఈ లింగము లన్నియును మానవులయొక్క పాపములను బోగొట్టి మోక్షము నిచ్చునవియై యున్నవి.

## 14. బాణలింగ భేదములు, తత్ఫలములు

అపరాజితపృచ్ఛ 206వ సూత్రము విశ్వకర్మోవాచ

శ్లో॥ అతఃపరం ప్రవక్ష్యామి బాణలింగస్యలక్షణం।
పూర్వమారాధితశ్చేశో భక్త్యైశ్చత్రిదశైరపి॥ 1

ఏకాస్యాద్ వైద్విసప్తాంత మాస్యభేదస్యలక్షణం।
ఏకాస్రంచస్వయం దేవస్త్రీనేత్రః శూలపాణికః॥

ఉమామహేశ్వరంద్వ్యస్రం త్ర్యస్రంత్రిపురుషంతథా।
బ్రహ్మణాచార్చితంలింగం తథావేదాస్రసంజ్ఞకమ్॥ 3

పంచాస్రంలోకపాలైశ్చ షడస్రంశిఖికేతునా।
సప్తాస్రంవరుణేనాఽథ చాష్టాశ్రంవసుభిస్తథా॥ 4

నవగ్రహైర్నవాశ్రంచ దశాశ్రంచదిశాధిపైః॥
ఏకాదశాశ్రంవిష్ణునా సూర్యేణద్వాదశాస్రకమ్॥ 5

త్రయోదశాస్రంసర్వైశ్చ శక్రాస్రంశక్రతస్తథా।
ఏకాద్యంచతుర్దశాంతం కథితంచయథాక్రమమ్॥ 6

ఏకాస్రంస్థాపితంలింగం యేననైపృథివీతలే।
ముచ్యతేసర్వపాపేభ్యో బ్రహ్మహత్యాదిభిశ్చసః॥ 7

ద్వ్యశ్రకంచతథాలింగం స్థాపితంభక్తితత్పరైః।
మోదతేదివిముక్తఃస్యాత్ సగోహత్యాదిపాతకైః॥ 8

త్రిశ్రకంచతథాలింగం పూజితంచసురాసురైః।
అశ్వమేధాదిపుణ్యంచ లభతేనాత్రసంశయః। 9

పురుషమేధసంపుణ్యం చతురశ్రిచపూజితే
అరమ్యాగమనాన్ముక్తో హ్యభక్ష్యస్యచభక్షణాత్ 10
ముక్తపాపశ్చవిజ్ఞేయః పంచాశ్రిపూజితేతథా
స్త్రీబాలఘాతీశుద్ధఃస్యాచ్ఛివలోకంషడశ్రికే 11
సప్తాశ్రేబాణలింగేతు పృధ్వీదానఫలంభవేత్
అష్టాశ్రింతుయదాలింగం పూజితంపృధివీతలే 12
గురుస్త్రీపాపముక్తశ్చ లభతేశివలోకతాన్
నవాశ్రింతుయదాలింగం పూజితంచప్రియత్నతః 13
సముక్తఃసల్వపాపేభ్యో బహుస్వర్ణాదికంఫలన్
సప్తకోటిజన్మపాపం నశ్యేద్దర్శనతఃక్షణాత్ 14
శివలోకందశాశ్రిచ లభతేనాత్రిసంశయః
ఏకాదశాశ్రించతథా సంసారభయనాశనమ్ 15
ద్వాదశాశ్రింతథాలింగం సూర్యతేజఃసమప్రభమ్
త్రియోదశాశ్రింలింగంతు అర్చితంచతథాబుధైః॥ 16
పృథ్వీదేవాధిపత్యంచ ప్రాప్యతేనాత్రిసంశయః
చతుర్ధశాస్రింలింగంతు స్వర్గాదాదేవపూజితతు 17
దశాశ్వమేధజన్యంచ ఫలంప్రాప్నోతిమానవః॥

తా. బాణలింగమున 1కోణముండిన స్వయంభులింగము 2 కోణముల్లున్న ఉమామహేశ్వరలింగము 3 కోణములుండెనేని త్రిమూర్తి లింగము 4 కోణములుండెనేని బ్రహ్మచే పూజింపబడినలింగము 5 కోణములుగలది లోకపాలపూజితలింగము 6కోణములుగలది సుబ్రహ్మణ్య పూజిత లింగము 7 కోణములుగలది వరుణపూజిత లింగము 8 కోణములుగలది వసుపూజితలింగము 9 కోణములుగలది నవగ్రహపూజిత లింగము 10 కోణములుగలది తిక్పాల పూజితలింగము, 11 కోణములుగలది విష్ణుపూజిత లింగము, 12 కోణములు గలది సూర్య

పూజితలింగము 13 కోణములుగలది సమస్త దేవతలచే పూజింపబడినది. 14 కోణములు గలది ఇంద్రపూజిత లింగము ఏకాస్రలింగమును పూజించినవారికి బ్రహ్మహత్యాది సమస్తపాపములు నశించి పుణ్యము లభించును. ద్వ్యస్రలింగమును పూజించినవారికి గోహత్యాది పాపములు నశించి సంతోషముతో నుందురు. త్ర్యస్రలింగమును పూజించినవారికి అశ్వమేధ యజ్ఞఫలము లభించును. చతురస్ర లింగమును పూజించినవారికి అభక్ష్యభక్షణాది పాపములు నశించును. పంచాస్ర లింగమును పూజించినవారికి స్త్రీహత్య, శిశుహత్య మొదలగు దోషములు నశించి పుణ్యము లభించును షడశ్ర లింగమును పూజించిన వారికి శివలోకము లభించును. సప్తాశ్ర లింగమునుపూజించిన వారికి భూదాన ఫలము లభించును. అష్టాశ్రిలింగమును పూజించిన వారికి గురుపత్నీగమనాది పాపములు నశించును. నవాశ్ర లింగమును పూజించిన వారికి పుణ్యలోకము లభించును. దశాశ్ర లింగమును పూజించినవారికి శివలోకము లభించును. ఏకాదశాస్ర లింగమును పూజించిన వారికి భవబంధములు తొలగును. ద్వాదశాస్ర లింగమును పూజించిన వారికి సూర్యునివంటి తేజస్సు లభించును. త్రయోదశాస్ర లింగమును పూజించినవారికి భూమియందు దేవత్వము సంభవించును. చతుర్దశాస్రలింగమును పూజించిన వారికి స్వర్గమున దేవతలచే పూజింపబడునంతటి పుణ్యము లభించును.

## 15. దారులింగనిర్మాణము

అపరాజిత 200వ సూత్రము

శ్లో॥ చందనో దేవదారుశ్చ రక్తచందన ఏవచ
సర్జశ్చ శింశపాశ్చైవ శిరీషాశోక కౌతథా॥ 6
కర్పూరాగరుశ్చైవ హింతాలమధుపాదపాః
8) తాథాఖదిరకశ్చైవ పద్మాటః పారిజాతక॥ 7

శ్రీఫలల్లవంగక్షీరాంజన కాశ్చతస్థైవచ
బీజకార్జునకౌవృక్ష్యా అన్యేయేచదృఢాత్మకాః॥ 8
నిర్వ్రణాఃసుదృఢాః కార్యాః ప్రాంచితా దోషవర్జితాః
శాఖోద్భవాదికచ్ఛేద గ్రంథికోటరవర్జితాః॥ 9
షోడశాంగులతోహీనం లింగంకుర్యాన్న దారుజం
షోడశాంగులతోవృద్ధి ర్నవలింగేషు కీర్తితాః॥ 10
తథాష్టకసిబంధేచ షోడశాంగులవృద్ధితః॥

తా॥ గంధపుమాను, దేవదారు, ఎఱ్ఱచందనము, మారి, ఇరుగుడు, దిరిసెన, కంకేళి, పాటలవృక్షము, పచ్చచందనము, గిరిక తాడి, ఇప్ప, చంద్ర, కల్పవృక్షము, తగిరస, మారేడు, లవంగ, పాల కాటుకచెట్టు (తమాలవృక్షము) మాదీఫలవృక్షము, ఏరుమద్ది, ఇంకను సత్తువగలదారువులను గూర్చి లింగమును రచించవచ్చును. గాట్లు, గుంటలు, తొఱ్ఱలు, పగుళ్ళు, ముడులు లేనిదానినిగాజూచి 16అంగుల మొదలుకొని 8 అం. పెంపుచేయుచూ అనేక విధములుగా చేయ వచ్చును. 16 అం॰ తక్కువగా దారులింగమును చేయరాదు శిల్ప రత్నములో

చందనం దేవదారుశ్చ శమీపిప్పలశింశాపాః
ఖదిరాసనీమాలు మధుకవకుళస్తథా పద్మాటం
కర్ణికారంచ విప్రాదీనాంత్ర యంత్రయమ్॥ 43

తా॥ ఇందు జమ్మి, రావి, టేకు, పొగడ, కొండగోగు చెట్లు కూడా చెప్పబడియున్నవి.

## 16) మృణ్మయలింగము

అపరా 204 వసూ విశ్వకర్మోవాచ

శ్లో॥ పార్థివస్యప్రవక్ష్యామి విధానం పరమంశుభం
పక్వంచైవమపక్వంవా పార్థివంద్వివిధం స్మృతమ్॥ 1

తత్రా పక్వం ప్రశంసంతి ఆయుష్యం శ్రీబలప్రదం
తదనుక్రమయోగంచ కథయామ్యస్తవాంతికే॥ 2

శ్వేతాం పీతాం తథారక్తాం మృత్తికాంచ సమాహరేత్
తథాగోధూమచూర్ణంతు మాషికం చూర్ణమేవతు॥ 3

కపిలాయా ఘృతంక్షీరం పంచక్షీరంచ వృక్షజమ్
గుడంచగుగ్గులంచైవ చూర్ణయిత్వాచ ప్రక్షిపేత్॥ 4

వర్జయిత్వాఽన్యద్రవ్యాణి లాక్షాకుళుత్థ కాంజికమ్
ప్రతిక్షిపోవరం జేషు మాసం పక్షాధికంతథా॥ 5

తతస్తుకారయేల్లింగం విధియుక్తిక్రమైస్తథా
వ్యక్తావ్యక్త మిదంకుర్యాచ్ఛాశ్వతం సర్వకామదమ్॥ 6

అవ్యక్త మిదముక్తంతు వ్యక్తమానం ప్రవక్ష్యతే
పూజాభంగ స్త్రిభాగేతు వక్త్రస్య నిర్గమంవిదుః॥ 7

మృద్దారులోహశైలైశ్చ శ్వేతం లింగంతు కామదమ్
పార్శ్వలింగ సమాయుక్తం తత్సన్మానేనతత్కురు॥ 8

లింగార్ధ్వ పృథుమానంత ద్విభక్తం ద్వాదశాంగులం
చతుర్వింశతికోచ్ఛ్రాయే వక్త్రంనైద్వాదశాంగులో॥ 9

లలాటంద్వ్యంగులంప్రోక్తం భ్రూనేత్రం ద్వ్యంగులంతథా
నాసికాద్వ్యంగులాప్రోక్తాఽదకాచైక కలాంగులా॥ 10

శంఖాకృతిః కంఠరేఖా హనుకాద్వ్యంగుళాయతా
వేదాంగులం పృథువక్త్రం ద్వ్యంగులా నాసికాపుటిః॥ 11

ద్వ్యంగులాయతకం నేత్రం తన్మానం నేత్రకాంతరమ్
చాపాకారాచదృష్టిః స్యాద్ భ్రూలితా చాంగులాయతా॥ 12

ద్వాదశాంగులవిస్తారే కర్ణావేకైకకాంగులౌ
భ్రూసమోత్సేధకాచైవ ఉభౌకర్ణౌ సమానతః॥ 13

జటామకుట సంయుక్తం శశాంకకృత శేఖరం
శివాననం కుండలాది దివ్యాభరణభూషితమ్॥ 14

తా॥ మట్టితో చేయబడు లింగములు రెండు విధములు 1. పక్వతలింగము, 2 అపక్వలింగము ఈ రెంటిలో అపక్వలింగము ఆయుష్యము సంపద నిచ్చునది. కనుక లింగమును రచించు క్రమమును చెప్పుచున్నాడు. తెల్లమన్ను, ఎఱ్ఱమన్ను, పచ్చమన్ను. ఇందులో ఏదైన ఒకదానిని తెచ్చి గోధుమపిండి, తేనే, సున్నము, నల్లని యావుపాలు, మఱ్ఱి మొదలగు ఐదు చెట్లపాలు, బెల్లము, గుగ్గిలము, నూని యితరవస్తువులేమి చేర్చకుండ లక్క, ఉలవ గంజి, కలిపి యింటిలోగాని, నీడనుగాని 20 దినములుగాని, లేక 28 దినములుగాని, ఆరనిచ్చి శాస్త్రమున జెప్పబడినట్లు లింగమును జేయవలయును. దీనిని అవ్యక్తలింగమందురు. వ్యక్తలింగము యొక్క కొలతలను చెప్పుచున్నారు. పై పూజాభాగమున శివ వంతుముఖము నను నిర్గమను చేయవలయును. మృద్దారులోహశైల లింగము లన్నింటిలోను శ్వేతలింగము అన్ని కోరికలనిచ్చునది యని తెలియవలయును. ప్రక్కలయందు లింగముల నుంచదలచిన యెడల వాని వాని కొలతల ననుసరించి చేయవలయును. లింగముయొక్క పై భాగము విస్తారము 2 భాగములుచేసి, ఎత్తు 24 అంగులములలో ముఖము 12 అంగులములు, నొసలు 2 అంగులములు, కనుబొమలు కన్నులు 2 అంగులములు, ముక్కు 2 అంగులములు, పెదవులు 2 అంగులములు కంఠమున రేఖలు శంఖమున నున్నట్లుండవలెను. తాలువలు పొడవు 2 అంగులములు, ముఖముయొక్క విస్తారము 4 అంగులములు, ముక్కుపుటలు 2 అంగులములు, కన్నులయొక్క పొడవు 2 అంగులములు, రెండు కన్నుల నడుమసందు 2అంగులములు,కన్నులు ఎక్కుపెట్టిన ధనుస్సువలె నుండవలయును. కనుబొమలు పొడవు 1.1 అంగులము పొడవు, చెవులు 1. 1, అంగులము కనుబొమలతో సమా

నమైన ఎత్తు కలిగియుండవలయును. రెండు చెవులునుసమానసూత్ర మున నుండవలెను. జటామకుటమును, జడయందు చంద్రుడును. చెవులకు కుండలములు మొదలగు సమస్తమైన ఆభరణములును కలిగి యుండవలయును. మఱియు

శిల్పరత్నం ఉత్తరభాగము 1 అధ్యాయము

శ్లో॥ తీర్థక్షేత్రాచలారామ పుణ్యదేశోద్భవాంమృదమ్॥ 44
శుక్లాంరక్తాం తథాపీతాం కృష్ణామాదాయచూర్ణయేత్
యవగోధూమమాషాణాం చూర్ణానాంగుగ్గులోపరి॥ 45
లాక్షా శ్రీవేష్టకశ్యామ్య సర్జ్యానాంచసమాంశకైః
కుందురుకాశ్చభాగేన మృచ్చూర్ణం సర్వసమ్మతమ్॥ 46
కపిలాపంచగవ్యేన సతైవేనతు మర్దయేత్
తాంమృదంమర్దితాంపక్ష్యం మాసమాత్రోషితాంపునః॥ 47
గృహీత్వాకారయేల్లింగం సపీఠంలక్షణాన్వితం
మాసంతుశోషయేద్ఘర్మే బింబమామంతుమార్తికమ్॥ 48
అథవా కేవలం మృత్స్నాం కర్మయోగ్యాం విచూర్ణితామ్
మర్దితాంపంచగవ్యాద్భిర్మాస మాత్రంతథోషితామ్॥ 49
గృహీత్వాకార యేల్లింగం సపీఠంత్విష్టమానతః
విపచేత్ కుశవైర గ్నౌపక్వలింగంతు తద్భవేత్॥ 50

తా. మహాత్ములుండెడి యడవులయందును, వారు స్నానము చేయు నదులయందును, పర్వతములయందును, సామాన్య వనములయందునుగల మన్నును, తెలుపు, ఎరుపు, పసుపు, నలుపు రంగులుగల దానిని తెచ్చి దానిని మెత్తగా నలగగొట్టి యవల యొక్కయు, గోధుమలయొక్కయు, మినుముల యొక్కయు, పిండిని, గుగ్గిలమును, లక్కను, దేవదారుబెరడుతో చేసిన ధూపద్రవ్యమును,

మఱ్రిచెట్టుబంక, మద్దిచెట్టుబంక ఆందుగచెట్టుబంక ఇవియన్నియునుగలిపి ఆవుపాలు పెరుగు, నెయ్యి, పంచితము, గోమయము, నువ్వులనూనెలతో 15దినములు మెత్తగానూరి ఒకనెలదినములు ఆరబెట్టి తరువాత దానిని లింగముగా రచించవలయును. ఆ లింగమును నెల దినములు నీడను ఎండబెట్టిన యెడల అపక్వలింగమగును. లేక మన్నును మాత్రమే లింగమును రచించుటకుదగినట్లు మెత్తగానూరి పై చెప్పిన పంచగవ్యములతో మర్దించి యొక నెలదినములు నీడను ఆరనిచ్చి దానిని లింగమును జేసి పీఠమును గూడ రచించి తగిన సెగలో కాల్చిన యెడల పక్వలింగమగును.

## 17. మిశ్రలింగ నిర్మాణము

శిల్పరత్నం ఉత్తరభాగం 1వ అధ్యాయము

శ్లో॥ కృత్వాదారుమయంశూలం లోహపట్ట విభూషితమ్
మృదావిధివదావిప్య శోషయేన్మిశ్ర లింగకమ్॥ 51

తా॥ యోగ్యమైన దారువును భూమిపై నిలిపి దానికి రాగి రేకు మొదలైనవి చుట్టి పాకముచేసిన మన్నును పూయుచు నీడను యెండబెట్టబడినది మిశ్రలింగమగును.

## 18. రత్నలింగములు, తత్ఫలములు

అపరాజిత 198వ సూత్రం

శ్లో॥ రత్నజానాంతు నామాని కథితాన్య పరాజిత
సర్వరత్నోద్భవం లింగం కర్తవ్యం సర్వకామదమ్॥ 12
వజ్ర వైడూర్యార్క-కాంత పుష్పరాగేందుకాంతకం
మాణిక్యముక్తా స్ఫటిక రాజనీల ప్రవాలకైః॥ 13
మరకతోత్పలనీలైః వజ్రైతైఃపులకైస్తథా
మహానీలైః సునీలైశ్చగిరివజ్రైశ్చపీలుతైః॥ 14

గోమేధైశ్చ శిఖాదీపై రితిరయ్నభిధానకైః శంఖా
ద్యైర్గజదంతైశ్చ లింగంకుర్యాచ్చ కామదమ్॥ 15
సయోనిమాన సంయుక్తం సర్వకామ ఫలప్రదం
వినాయోనించ కర్తవ్యంధా తుజంర త్నజంతధా॥ 16
ధర్మకామ్యం చార్థకామ్యం తథేచ్ఛా మోక్షకామ్యకే
చతుర్విధాని కామ్యాని లింగ యోన్యాదిభేదతః॥ 17
యాదృగ్వర్ణం భవేల్లింగం తాదృగ్వర్ణంచ పీఠకం
ధర్మకామ్యంతద్ యదైవ ధర్మార్థం స్యాత్ సుపూజితమ్॥ 18
నీలంమరకతం లింగం పీఠికా శ్వేతవర్ణికా
అర్థకామ్యంతు తన్నామ పూజితం చార్థహేతకే॥ 19
శ్వేతరక్తే యదావర్ణే ఇచ్ఛాకామ్యంచనామతః
ఇచ్ఛాసిద్ధించప్రాప్నోతి యస్యలింగార్చనేరతః॥ 20
ధాతురత్నైర్ద్వివర్ణాచ శ్వేతపీతాదితస్తథా
మోక్షకామ్యంతు తత్ప్రోక్తం ముక్తిమార్గప్రదాయకమ్॥ 21
ధర్మార్థకామ మోక్షార్థం లింగార్చాస్యాచ్చతుర్విధా
మూలాగమే చనిర్దిష్టం శాస్త్రజ్ఞైరుక్త మేవచ॥ 22

తా॥ వజ్రము, వైడూర్యము, సూర్యకాంతము, పుష్యరాగము, చంద్రకాంతము, మాణిక్యము, ముత్యము, స్ఫటికము, రాజనీలము, పగడము, మరకతము, ఉత్పలనీలము, మహానీలము, సునీలము, గిరివజ్రము, గోమేధికము, శిఖాదీపము, శంఖము, ఏనుగుదంతము ఇవి యన్నియును దోషవర్జితమైనవి లింగములుగ జేయదగినవి. శాస్త్రప్రకారము కొలతలతో రచించిన యెడల సమస్తమైన కోరికలును సిద్ధించును. లింగమును పీఠమును ఒక్కటే రంగు గలిగి యున్న యెడల ధర్మకామ్య లింగమగును. లింగము నీలముగాని లేక మరకతముగాని, పీఠము తెలుపు అయినది అర్థకామ్య లింగము.

లింగము పీఠము తెలుపు యెరుపు వన్నెలతో నుండెనేని యిచ్ఛాకామ్యలింగము రత్నము లోహము కూడిన లింగము అది తెలుపు పసుపువన్నెలతో లింగము పీఠము ఉండెనేని మోక్షకామ్య లింగమగును. ఇట్లు నాలుగు విధములుగ రత్న లింగముల ఫలములు జెప్పబడియున్నవి.

సమరాం 0వ అధ్యాయము

శ్లో॥ పద్మరాగం మహాభూత్యై సౌభాగ్యాయతు మౌక్తికమ్
పుష్పరాగమహానీలౌ గయాతీర్థ సముద్భవమ్॥ 78
యశసేకులసంతత్యై తేజసే సూర్యకాంతకమ్
వైడూర్యం స్ఫాటికం సర్వకామదం మోక్షదాయకమ్॥ 79
విద్రుమం శత్రునాశంస్యాత్ వజ్రం సంపత్కరంతథా
శ్రేష్ఠంమరకతం లింగం గోమేధం పశువృద్ధిదమ్॥ 80

తా॥ మాణిక్యముతో రచించబడిన లింగము ఐశ్వర్యము నిచ్చును. ముత్యముతో రచింపబడిన లింగము సౌభాగ్యప్రదము. పుష్యరాగలింగము, మహానీలలింగము గయాతీర్థ ఫలమునిచ్చును. సూర్యకాంతలింగము తేజస్సు నిచ్చును. వైడూర్యలింగమును స్ఫటిక లింగమును అన్నికోరికల నిచ్చును. ప్రవాళలింగము శత్రువులను నశింపజేయును. వజ్రలింగము సంపదలనిచ్చును. మరకతలింగము సమస్తము నిచ్చును. గోమేధిక లింగము పశువృద్ధిని కలిగించును.

శిల్పరత్నము ఉత్తరభాగము 1వ అధ్యాయము

శ్లో॥ స్ఫటికం పద్మరాగంచ వజ్రంనీలం హిరణ్మయం
వైడూర్యం విద్రుమం పుష్యం రత్నబింబంతథాఽష్టథా॥ 31
స్ఫటికం సూర్యకాంతంచ చంద్రకాంతమితిత్రిధా
స్ఫటికస్యైవభేదాఃస్యుః కామమోక్షార్థదాః క్రమాత్॥ 32

శ్రియం కామం తథారోగ్య మృద్ధిం పుత్రం జయం సుఖం
లభతే పద్మరాగాది బింబానాం క్రమశోఽర్చనాత్॥ 33

తా॥ స్ఫటికము సూర్యకాంతము చంద్రకాంతము అను నీ మూడును స్ఫటిక జాతియే యగును, ఇవి క్రమముగా కామము, మోక్షము, అర్థమునిచ్చును. పద్మరాగము శ్రీకరము. వజ్రము కోరికల నిచ్చును. నీలము ఆరోగ్యము నిచ్చును. సువర్ణము బుద్ధికరము, వైడూర్యము సంతానము నిచ్చును. విద్రుమము జయము నిచ్చును. పుష్యరాగము సుఖమునిచ్చును.

## 19. రత్నదోషములు

శిల్పరత్న ఉత్తరభాగము 1వ అధ్యాయము

శ్లో॥ రేఖాబిందుః కలంకశ్చ కాకాంఘ్రిః క్షతమూలయః
తుషార త్రాసరంధ్రాణి యత్నాత్ రత్నేషు వర్జయేత్॥ 35

రేఖాబిందుః కలంకంచ త్రాసః కాకపదం క్షతమ్
ఖద్యోతో మక్షికాఛాయా భేదాః సంధి తుషారకే॥ 36

నిమ్న మస్తకతా చేతి దోషా రత్న భవాస్తథా
స్త్రీపుంనపుంసకభిదా నస్యాద్రత్నేషు సర్వథా॥ 3

తా॥ రత్నములకు దోషములను చెప్పుచున్నాడు. గీత, చుక్క, మచ్చ, కాకిపాదము, దెబ్బతగిలి చీలుట, లేక వేసుపోవుట, మెత్తని పిండి వచ్చుట. పొట్టురేగుట, కాంతిలో చలనముండుట, బెజ్జము లుండుట, మిడుగురుపురుగు, ఈగవంటి చాయలు పగులుట, గుంటమొగము ఇట్టి చెడుగుణములుగల రత్నములను లింగముగా చేయరాదు. రత్నములకు స్త్రీపురుష నపుంసక భేదములు శాస్త్రములయందు చెప్పబడియుండలేదు,

## 20. లోహలింగ భేదములు

శిల్పరత్న ఉత్తరభాగము 1వ అధ్యాయము

శ్లో॥ సౌవర్ణం రాజతంతామ్రం పైత్తలంకాంస్యమాయసమ్
సైసకంత్రాపుషంచేతి లోహంబింబం తథాష్టధా॥ 38
భుక్తి భుక్తి ప్రదంహైమం లింగంరౌప్యంతు పుష్టిదం
తామ్రజం త్రపుదంవిద్యాత్ తథైవస్యాత్తుపైత్తలమ్॥ 39
ఆయురారోగ్యదం కాంస్యమాయసం మారణం స్మృతం
సైసకంత్రాపుషంచాపి విద్వేషోచ్చాటనాదిషు॥ 40
ముఖ్యలోహానిచత్వారి హేమాదీని శుభానిహి
పిశాచలోహాన్యన్యాని కాంస్యాదీనీతి కేచన॥ 41

తా॥ లింగమును బంగారము, వెండి, రాగి, యిత్తడి, కంచు, ఇనుము, సీసము, తగరము అను 8 లోహములతో చేయుదురు. వాని ఫలములను జెప్పుచున్నాడు. బంగారముతో చేయబడిన లింగము భుక్తిముక్తుల నిచ్చును. వెండితో జేయబడిన లింగముబలమునిచ్చును రాగితో జేయబడిన లింగము, ఇత్తడితో చేయబడిన లింగము, కంచుతో చేయబడిన లింగము ఆయుష్యమును ఆరోగ్యమును ఇచ్చును. ఇనుముతో చేయబడిన లింగము మరణమును గలిగించును. సీసము, తగరము ఈ రెండును వరుసగా విద్వేషము. ఉచ్చాటనము కలిగించును కనుక బంగారము, వెండి, రాగి, కంచు, ఇత్తడి, మాత్రమే శుభకరములు.

అపరా 199వ సూత్రము

శ్లో॥ హైమంరౌప్యం తథాతామ్రం కాంశ్యంచపిత్తలంతథా
త్రపునాగఃసప్తమః స్యాత్కృష్ణలోహం తథాష్టమమ్॥ 13
ఇతిచాష్టౌ లోహకాద్యా ధాతవఃపరికీర్తితాః
రామదాని చ కార్యాణి అష్టలోహమయానిచ॥ 14

లోహమిశ్రంచ కర్తవ్యం సుధీవ సర్వకామదం
సయోనిమానసంయుక్త మిచ్ఛాభుక్తి ప్రదాయకమ్॥ 15
లోహాది మిశ్రకాయామ ప్రమాణం కామదంతథా
పునర్విభక్తంచ త్రిధా బ్రహ్మవిష్ణు రుద్రాంశకమ్॥ 16
బ్రహ్మదౌ మధ్యమే విష్ణుం రుద్రశ్చాంతే ప్రకీర్తితః
కార్యస్త్రయం తథాయామ ఏకాంశంచ పృథుత్వకమ్॥ 17
మస్తకావర్తనం మధ్యే బాహ్యేవైరాష్ట్రి విభ్రమః
మస్తకాంతోద్భవం పీఠం పార్శ్వాంగేతు ప్రదక్షిణమ్॥ 18
అష్టాంగుల భవఃలింగం పూజ్యతే చక్రవర్తిభిః
సప్తాంగులం మహారాజై ర్మహీపాసైశ్చ భక్తితః। 19
షడంగులాత్మకం లింగం మహామండలకేశ్వరైః
పంచాంగులం తథాలింగ మర్చ్యం వైభుక్తి కామకైః॥ 20
మహాసామంత సంజ్ఞైస్తు లింగం వేదాంగులోచ్ఛ్రితం
త్ర్యంగులం చైవసామంతై ర్బుక్తి కామైశ్చ పూజితమ్॥ 21
ద్వ్యంగులాత్మక మధ్యంచ తథైవద్వ్యంగులాయతమ్
ముక్త్యర్థం యతిభిశ్చైవ పూజనీయ మశంకితైః॥ 22
అంగులద్వయ మధ్యంచ జనైఃసర్వైర్హితార్థకమ్
తథైకాంగులికం మధ్యే సర్వకామార్థముక్తిదమ్॥ 23
మనోహరాదితో లింగం యావత్ స్యాన్నంది వర్ధనమ్
కార్యంరత్నమయంచైవ ధర్మకామార్థమోక్షదమ్॥ 24

తా॥ బంగారము, వెండి, రాగి, కంచు, ఇత్తడి, తగరము, సీసము ఇనుము, ఈ 8 లోహములతో లింగమును చేయుదురు. వీనిని ధాతు లింగములందురు. సున్నము పాకము చేసినట్లు లోహములను గూడ కలిపి మిశ్రలింగమును చేయవచ్చును. పీఠమునుగూడ మిశ్రమ లోహ

ముతోనే చేయవలయును. వానియొక్క కొలతల వివరములను జెప్పు చున్నాము అందును బ్రహ్మ విష్ణు శివాంశములనియెడు మొదలు నడుము చివర భాగములు తెను, అందు 1 భాగము విస్తారమును, తల కొంచెము మొనగాను గుండ్రముగాను చేయవలయును, నడుము పల్లముగా జేసిన యెడల మహాదోషము. అందువలన కీడు గలుగును. లింగము యెత్తు యెంతో పీఠముయొక్క విస్తారము అంతే యుండవలయును చక్రవర్తి పూజించులింగము 8 అంగులముల ఎత్తును మహారాజులు పూజించు లింగము 7 అంగులముల యెత్తును, మహీపాలుడు పూజించు లింగము 6 అంగులముల యెత్తును, మహామండలేశ్వరుడు పూజించులింగము 5 అంగులముల ఎత్తును మహా సామంతరాజు పూజించు లింగము 4 అంగులముల యెత్తును సామంతరాజు పూజించు లింగము 3 అంగులముల యెత్తును, యతీశ్వరులు ముక్తి కొఱకు పూజించు లింగము 2 అంగులముల యెత్తును, ధనవంతులు కూడ నిట్టి లింగమును ధర్మార్థ కామమోక్షముల కొరకు పూజించవచ్చును. 1 అంగులము యెత్తుగల లింగమును కూడ సమస్తమైన వారు చతుర్విధ ఫలపురుషార్థముల కొరకు పూజించవచ్చును. ఈ లింగములకు వరుసగా మనోహర లింగము. శ్రీముఖలింగము, రుద్ర తేజోలింగము మహోత్సవలింగము, ఆనందలింగము, సుముఖలింగము శ్రీపూజ లింగము, నందివర్ధనలింగము, అను పేళ్ళు కలిగియున్నవి.

## 21. లక్షణోద్ధారము

### కాశ్య 49వ పటలము

శ్లో॥ స్థపతిశ్చ శుచిర్భూత్వా యజ్ఞసూత్రోత్తరాన్వితః 143
ప్రాగ్వదగ్నింసమభ్యర్చ్య స్విష్టపూర్ణాహుతించరేత్
ప్రతిసరంబంధ యేత్తత్ర లింగపీఠేద్విజోత్తమ॥ 144
స్వర్ణ రజత కార్పాస సూత్రైర్వాహామయేనతు
ప్రభాతేసుముహూర్తేతు లక్షణోద్ధారమాచరేత్॥ 145

పాయస-ఘృత సంయుక్తం శిరఃస్థానే బలింహరేత్
రక్తగంధంపరిత్యజ్య గంధాద్యై రర్చయేద్బుధా॥ 146
రక్తేనధాతునాలింగ మధ్యేస్సూత్రం తుపాదయేత్
ముఖభాగస్య మధ్యేతు నాలంకుర్యాత్ సలక్షణమ్॥ 147

శిల్పరత్న ఉత్తరభాగము 3వ అధ్యాయం

శ్లో॥ ఏవంలింగం కారయిత్వా మహాత్మా శూన్యందోషై
ర్లక్షణైర న్వితంచ
లక్ష్మోద్ధారం కారయేద్వర్ణ యోగ్యం
తద్వత్ ప్రోక్తం తత్క్రమాత్ స్యాగమేషు॥ 1
లింగమూర్ధ్నిక్షతం స్యాచ్చేత్ రాజ్ఞాంకర్తుశ్చ నాశనమ్
ఛిద్రంభార్యాం సుతంశంఖే వక్త్రేహాన్యాశ్చ శిల్పినమ్॥ 2
మధ్యేదుఃఖం చదుర్భిక్షం క్రోడేవృష్టి వినాశనమ్
అత్యాయతం చాతిహ్రస్వం కృశంస్థూలం నృపాంతకమ్॥ 3
పర్యాప్తకర్మిణి లింగం శాణాదివాలుకాదిభిః
గోబాలరజ్జుభిశ్చైవ ఘర్షయేన్నిర్వ్రణం సమమ్॥ 4
ముకురోదరవచ్ఛ్లక్ష్ణం దృశ్యచ్ఛాయం సువర్తులమ్
తతఃశుద్ధాంబు గోక్షీర నాలికేరేక్షు వారిభిః॥ 5
ప్రక్షాళ్యతీర్థతోయేన ప్రోక్తచిహ్నాని లక్షయేత్
రాజసర్షపమాత్రాశ్చేద్ యత్రస్యుః స్వర్ణబిందవః॥ 6
లింగేవాపీఠికాయాంతా సర్వవర్ణహితావహాం
స్వల్పదోషమపిత్యాజ్యం లింగంపీఠంచ తద్భవేత్॥ 7
నిర్దోషమన్యత్ సంపాద్య లక్షణోద్ధారమాచరేత్॥

తా॥ లింగముయొక్క తల యందుగుంటయున్న యెడల కర్త
యజమానుడును నశింతురు. శంఖరూపముగా నుండెనేని యజ

మానుని భార్యకు కీడు కలుగును. మరియు పుత్రులకును హానియగును. ముఖమునందు గుంట యుండెనేని శిల్పి నశించును. మధ్య గుంట యుండెనేని దరిద్రుని జేయును. అోమ్మూన పల్లముండెనేని అనావృష్టి దోషము కలుగును, మిగుల పొడవుగాని, మిగుల కురుచగాని, సన్నముగాని, లావుగాని, అయిన యెడల యజమానుడు మరణించును. కొలది తరుగులున్న యెడల సానమీాదగాని లేక యిసుకతోగాని రవ్వతోగాని రోమములతోగాని, కొబ్బరిత్రాడుతోగాని. యొరపిడిచేసి గుంట లేకుండ సమానముగా నుండునట్లు చేయవలయును. అద్దమువలె అంతట సమానముగాను చేసి గుండ్రముగా చేసిన తరువాత ఆవుపాలు కొబ్బరినీళ్ళు, చెఱకురసము, మంచినీళ్ళు మొదలగు వానితో కడిగి శాస్త్రమున జెప్పబడియున్న శుభకరమైన గుర్తులను చూడవలయును. బంగారువన్నెగల చుక్క పెద్ద ఆవగింజంత లింగముననగాని, పీఠముననగాని, యుండినచో సమస్తమైనవారికిని సంపదల నిచ్చును. లింగమును జేయునపుడు కొలది దోషమున్నను అట్టి రత్నమును విడువవలయును. దోషములు లేనిదానినే సంపాదించి లింగమును చేయవలయును. (సమస్త లక్షణములు ఇదివరకే చెప్పబడి యున్నవి)

## 22. క్షణిక లింగభేదములు

మానసారము 52వ అధ్యాయము

శ్లో॥ తోయేవామండలే వాపి పుష్పేవాచోత్పలేఽపివా
సికతేవాధహస్తే వా చాక్షతైర్వాగుడైస్తథా॥ 160
మోదకే వాథపిష్టేవా గోమయే వాయథేష్టకమ్
సద్యఃపూజ్యంతచేల్లింగం ప్రోక్తంతత్ క్షణికంభవేత్॥ 161
తానిలింగాని సర్వేషాం యథాలింగాకృతిర్భవేత్
ధ్యాత్వాతత్ క్షణికంలింగం మానం సర్వంనకారయేత్॥ 162

తా॥ నీటిమీద లింగరూపమును జేసిగాని, పుష్పమును లింగముగా జేసిగాని, కలువపుష్పనుగాని, ఇసుకతోగాని, అక్షతలతోగాని బెల్లముతోగాని, లడ్డు ఉండతోగాని, పిండితోగాని, ఆవు పేడతోగాని లింగముకుపీఠముతో సహా చేసి తాత్కాలికముగా పూజించవచ్చును దానివి క్షణిక లింగమందురు. ఇట్టి క్షణిక లింగమునకు కొలతలు లక్షణములు అవసరము లేదు.

## 23. లింగ పీఠభేదములు

కాశ్యపశిల్పము 59వ పటలము

(లింగపీఠ నిర్మాణ లక్షణము వ్రాయవలెను)

మానసార 53వ అధ్యాయము

శ్లో॥ పీఠతుంగం త్రిధాకృత్వా హ్యేకాంశేగల తుంగకమ్। 139
అథవాపం చద్వయాంశంవా గలతుంగం విశేషతః
శేషంతు చోర్ధ్వాధోబంధం పట్టజన్మ సరోరుహామ్॥ 140
ఏకాంశం జన్మతుంగంతు వేత్రకంచైక భాగికమ్
తత్సమంపంక జాగ్రంస్యా త్పద్మకుక్షిర్ద్వయాంశకమ్॥ 141
తదష్టాంశైక వేత్రంస్యాత్తత్సమం చోర్ధ్వవేత్రకమ్
పూర్వవత్కర్ణ సంయుక్త మూర్ధ్వఖండంత థోక్తవత్॥ 142

తా॥ పీఠముయొక్క యెత్తును 3 భాగములుచేసి అందు 1 భాగము కంఠమును చేయవలయును. లేక 5 భాగములుచేసి అందు 2 భాగములును చేయవచ్చును. మిగిలిన భాగములు పైనను అడుగునను సమానముగా పట్టము, జన్మము, రెండు పద్మములు రచించవలయును. మరియు ఉపానము 1 భాగము, నేత్రము 1 భాగము, పద్మము 1 భాగము, నేత్రము పావుభాగము, కంఠము 3 భాగములు, పైన నేత్రము పావుభాగము, పద్మము 1 భాగము, పట్టము 1 భాగము ఇట్లు మొత్తము 9½ భాగములు చేయవచ్చును.

## మానసార 53వ అధ్యాయము

శ్లో॥ సర్వేషామపి లింగానాం వక్ష్యతే పీఠలక్షణమ్
లింగతారం త్రిధా పీఠతారం స్వయంభు లింగకే॥ 1
అథవా లింగనాహేతు స్థూలదేశే సమంభవేత్
లింగతుంగసమం వాపి తత్పాదాధికమేవవా॥ 2

అధ్యర్థం వా త్రిపాదోనం ద్విగుణం త్రిగుణంతువా
స్వయంభులింగ పీఠస్య చోత్సేధమితి కథ్యతే॥ 3
ఏవం లింగాంశమానేన పీఠంస్యాన్మాన యేత్సృథ।
పూర్వోక్త మానలింగానా మధునా పీఠలక్షణమ్। 4

లింగస్య బాహ్యదేశేతు లింగతారం సమంతతః
యల్లింగ పరిణాహస్య సమం వా పీఠ విస్తృతమ్॥ 5
వైష్ణవాంశం సమోత్సేధం పీఠం స్వస్తికలింగకే
అథవా పాదాంశమాధిక్యం బ్రహ్మాంశే సంగ్రహం భవేత్॥ 6
అన్యైస్తు సర్వలింగానాం బ్రహ్మాంశోదయం బుధైః
కుర్యాత్తన్మానం సంగ్రాహ్య ద్విత్రివేదశరాంశకమ్॥ 7
తదేకాంశాధికం విష్ణు మానం పీఠోదయే తథా
పీఠాంశం సార్ధాధో దేశే విష్ణ్వంశం నవధా కృతమ్॥ 8
పీఠంతు యోజయేత్తత్ర ద్విస్తారేతు త్రిభాగికమ్
ఏకాంశం నాల దైర్ఘ్యం స్యాత్తత్సమం మూలవిస్తృతమ్॥ 9
చతుర్భాగైకం హీనంస్యాచ్ఛేషం తదగ్రవిస్తృతం
అథవా పంచత్ర్యంశేన చాగ్రనాల విశాలకమ్॥ 10
తదేకాంశాధికం వాపి పూర్వోక్తం నాల దీర్ఘకే
గ్రీవోర్ధ్వం చోక్తమానంతు నాలస్య బహులం భవేత్॥ 11
నాలితారత్రిభాగైకం జలధార విశాలకమ్
పీఠస్యోర్ధ్వే విశాలేతు చతుష్పంచషడంశకే॥ 12

ఏకాంశేన శేషంతుస్యాద్ వృతవారి విశాలకమ్
వృతవారి విశాలేతు తత్రదంశం విభాజితే॥ 13
ఏకాంశం నిమ్నవిస్తారం వట్టికాంత సమన్వితమ్
నంద్యావర్త శిలాచోర్ధ్వే తస్మాన్నారాయణాంతకమ్॥ 14
పీఠతుంగమితిప్రోక్తం గణ్యమానమహోచ్యతే॥

తా॥ స్వయంభులింగమునకు పీఠము లింగము విస్తారమునకు 3 రెట్లుండవలయును. లేక లింగము యొక్క లావు గలచోట చుట్టు కొలతతో సమానము. లింగముయొక్క యెత్తుతో సమానము $1\frac{1}{4}$ $1\frac{1}{2}$, $1\frac{3}{4}$ 2-3 రెట్లు యెత్తు చేయవలయును. మరియు పీఠము యొక్క విస్తారమును చెప్పుచున్నాడు. లింగమునకు వెలుపల లింగముతో సమానమైన విస్తారముచుట్టును ఉండునట్లు విస్తారమును చేయ చేయవలయును, స్వస్తిక లింగమునకు పీఠము నైష్టవాంశముతో సమానమైన యెత్తుండవలయును లేక 3/4 వంతు బ్రహ్మాంశములో నుండి గ్రహించవచ్చును. ఇతరములైన సమస్తలింగములకును బ్రహ్మాంశముతో గూడ కలిపి కొలతను తీసికొని, 2-3-4-5 భాగములుచేసి అందు 1 భాగమును కలిపి విష్ణు భాగము వరకు పీఠముయెత్తును చేయ వలయును. పీఠభాగములో $1\frac{1}{2}$ భాగము దిగువ విష్ణ్వంశమును 9 భాగములుచేసి పీఠమును కల్పించవలయును. పీఠముయొక్క విస్తారమును 3 భాగములుచేసి అందు 1 భాగము నాలము పాదవును చేయవల యును. మొదలు విస్తారముపీఠముతో సమానముగా నుండవలయును. 4 భాగములలో 1 భాగము తీసివేసి మిగిలిన 3 భాగములు చివర విస్తారముచేయవలయును. లేక 5 భాగములలో 2 భాగములు తీసివేసి 3 భాగములు చేయవచ్చును. 5 భాగములలో 4 భాగములు నాల విస్తారమును చేయవచ్చును. గ్రీవముయొక్క పైకొలత ప్రకారము నాలము మందము కలిగి యుండవలయును. నాలముయొక్క విస్తారమును 3 భాగములుచేసి అందు 1 భాగము జలధారకు విస్తారము చేయవల యును. పీఠముపై విశాలమును 4-5-6 భాగములుచేసి అందు 1 భాగం

చుట్టును ఉంచి మిగిలినది పల్లముగా చేయవలయును పట్టి కాంతము వఱకు నిమ్నమును చేయవలయును. నిమ్న విస్తారమును 1 భాగము చేయవలయును. సంద్యావర్త శిలపైన విష్ణ్వంశము వఱకు లింగపీఠము యొక్క యెత్తును చెప్పుచున్నాడు-

మానసార 53వ అధ్యాయం

శ్లో॥ ఉత్సేధే షోడశాంశేతు ప్రథమోచ్ఛ్రం ద్విభాగికమ్॥ 15
పద్మోచ్ఛ్రంతు త్రిభాగంస్యా త్తదూర్ధ్వంషేపణాంశకమ్
కంధరంచ త్రిభాగంస్యా త్తమూర్ధ్వంకంపమంశకమ్॥ 16
ఊర్ధ్వ పద్మంత్రయాంశంస్యాద్ వాజనంచ త్రిభాగికమ్
ఏకాంశం వృతవారిస్యాద్ భద్రపీఠమితి స్మృతమ్॥ 17
తదేవగలదేశేతు కుముదం నిర్గమం భవేత్
త్రయాంశం వృత్త కుంభంవా శ్రీభద్రమితి కీర్తితమ్॥ 18
కుంభస్యోపరితస్యాథ శ్చోర్ధ్వాక్తేన పద్మయుగ్
తస్యాధో౽ర్ధేనైకార్ధేన కుర్యాత్తత్ద్విచక్షణః॥ 19
శేషంతు పూర్వవత్పీఠం శ్రీ విశాలమితిస్మృతమ్
నోచేత్కుంభం ద్విభాగంస్యా త్పద్మతుంగం
యుగాంశకమ్॥ 20
శేషంప్రాగుక్త వత్కుర్యా దుపపీఠం ప్రకల్పయేత్
అథవాధిష్ఠానవద్వహ్యం కుర్యాత్ సర్వాంగలింగకే॥ 21

తా. పీఠము యెత్తును 16 భాగములుచేసి అందు ఉపానము 2 భాగములు, పద్మము 3 భాగములు, కంపము 1 భాగము, కంఠము 3 భాగములు, కంపము 1 భాగము, పైన పద్మము 3 భాగములు, వాజనము 3 భాగములు చుట్టును జలమార్గము 1 భాగము చేయబడినది. భద్రపీఠమగును.

కాశ్యప 58వ పటలము

శ్లో॥ కృత్వాతుషోడశాంశే తేన్నం భాగేనోపానముచ్యతే॥ 31
జగత్యుచ్ఛంతు వేదాంశం గుణాంశం కుముదోచ్ఛ్రయం
శివాంశం పట్టికామానం కంఠమానం గుణాంశకమ్॥ 32
తదూర్ధ్వం పట్టమేకాంశం ద్విభాగంపట్టికాభవేత్
శవ్యంశం ధృతవారిస్యాద్భద్ర పీఠమిదంపరమ్॥ 33

పై జెప్పిన దానినే కంఠమున కుముదముగాని, వృత్తకుంభము గాని, రచించిన యెడల శ్రీభద్రమగును. మరియు పైజెప్పిన దానినే కుంభముపైనను, దిగువను, ½ భాగము చొప్పున పద్మములను రచించిన యెడల శ్రీవిశాలమగును. లేక కుంభము 2 భాగములును పద్మములు 4 భాగముల చొప్పునను రచించి మిగిలినవి యిష్టానుసారముగ చేసినచో పద్మపీఠమగును.

కాశ్యప 58వ పటలము

శ్లో॥ కలాంశం విభజేత్తుంగ ముపానోచ్ఛంద్విభాగతః
భూతాంశోచ్ఛ మధోపద్మం కంఠంపాదుకన దృశమ్॥ 23
ఊర్ధ్వపద్మంతు వేదాంశం ద్విభాగం పట్టికోదయమ్
శివాంశం ప్రతివాజంచ షోడశదల సంయుతం
క్షుద్రందలం తయోర్మధ్యే అష్టౌవాధ మహాదలం॥

అని చెప్పబడియున్నది. ఇంకను ఉపపీఠమును గూడ రచించవచ్చును

విశ్వకర్మీయ శిల్పము

శ్లో॥ పద్మపీఠసముత్సేధం షోడశం భాగమిష్యతే
భాగద్వయ ముపానంస్యా చ్ఛతుర్భాగేన పద్మకం॥
కంపమర్ధాంశకంచైవ కంఠం నేత్రా శకంతథా
కంపమర్ధేనభాగేన వేదాంశం చోర్ధ్వపద్మకం॥

భాగద్వయం పట్టికాస్యా దూర్ధ్వే కంపం తథాంశకమ్॥

తా॥ పద్మ పీఠముయొక్క ఎత్తును 16 భాగములుచేసి అందు ఉపానము 2 భాగములు, అధోపద్మము 4 భాగములు కంపము అర భాగము, గళము 2 భాగములు, కంపము అర భాగము, ఊర్ధ్వపద్మం 4 భాగములు, పట్టిక 2 భాగాలు, కంపము 1 భాగం ఇట్లు చేయబడినది పద్మ పీఠమగును.

## విశ్వకర్మీయ శిల్పము

శ్లో॥ ఉపానంద్వ్యంశకం త్ర్యంశం పద్మం కంపం తథాంశకమ్
కంఠం త్రిభాగముత్సేధం కంపమేకాంశకంతథా॥

తస్యోర్ధ్వే త్ర్యంశకం పద్మం పట్టికాస్యాద్ ద్విభాగికా
కంపమేకాంశకం చైవ వేదిభద్రమితీరితమ్॥

తా॥ పీఠముయొక్క ఎత్తును 16 భాగములుచేసి అందు ఉపానము 2 భాగములు, పద్మము 3 భాగములు, కంపము 1 భాగము, గళము 3 భాగాలు, కంపము 1 భాగము పద్మము 3 భాగాలు, పట్టిక 2 భాగాలు, కంపము 1 భాగము ఇట్లు చేయబడినది. వేదిభద్రమగును.

## కాశ్యప శిల్పము 58వ పటలం

శ్లో॥ పీఠోచ్చంతు కలాంశేతు ద్విభాగం పాదుకోదయం
గుణాంశం జగతీమానం కుముదోచ్చంతు తత్సమం॥ 34
వ్యోపట్టమానంతు కంఠమానం ద్విభాగతః
తస్యోర్ధ్వంకం పమేకాంశం గుణాంశం పట్టికాభవేత్॥ 35
ఏకాంశం ధృతవారిస్స్యా ద్వేదీభద్రంత దచ్యుతే

## మయమతము 7వ అధ్యాయం

శ్లో॥ ఏకభాగము పానంస్యాత్ కంపమానంత దర్ధకం
పద్మతుంగం ద్విభాగంతు కంపమర్ధాంశ మేవచ॥

కంఠమేకాంశకం చైవ తదర్థాంశం పమిష్యతే
ద్విభాగం కుముదోత్సేధం కంపమర్థాంశకంతధా॥
గ్రీవమేకాంశసం యుక్తం తదర్ధాంశం పమానకం
ఊర్ధ్వపద్మంద్విభాగేన క్షేపణంచార్ధ భాగికమ్॥

తా॥ లింగపీఠముయొక్క యెత్తును 12 భాగములుచేసి అందు ఉపానము 1 భాగము, కంపము $\frac{1}{2}$ భాగము, పద్మము 2 భాగములు, కంపము $\frac{1}{2}$ భాగము, కంఠము 1 భాగము, కంపము అర భాగము, కుముదము 2 భాగములు, కంపము అర భాగము, గ్రీవము 1 భాగము, కంపము అర భాగము, పద్మము 2 భాగాలు, క్షేపణము అర భాగము ఇట్లు చేయవలయును

మానసార 53వ అద్యాయము

శ్లో॥ యత్తుంగస్య వశాద్వేశం పీఠకర్ణావసానకమ్
ఉక్తతారాది హీనంస్యా త్సర్వదోష సముద్భవమ్॥ 22
తస్మాత్తునిర్గమం కుర్యాద్ విస్తారం తత్ప్రకల్పయేత్
కుర్యాత్తు నాగరేలింగే పీఠం నాగరమేవచ॥ 23
ద్రావిడేద్రావిడం ప్రోక్తం వేసరేవేసరంతథా
ధారాలింగంతు సర్వేషాం ధారాపీఠం ప్రకల్పయేత్॥ 26
యద్యదాకార లింగానాం తత్తదాకార పీఠకమ్
తత్తచ్ఛిఖరాకారంతు కుర్యాదేవం విచక్షణః॥ 25
విపరీతే భూసురాదీనాం విపత్తింహి సమావహేత్
తస్మాత్తుపీఠలింగాది హర్మ్యాది పరిహృద్యతే॥ 24
నాగరం చతురశ్రంస్యా దష్టాశ్రం ద్రావిడంతథా
వృత్తంచ వేసరంప్రోక్త మేతత్ పీఠాకృతిస్తథా॥ 27
ధారాలింగంతు పీఠానాం సర్వంధారాకృతిస్తథా
క్రియేత శిల్పిభిః సర్వైః సర్వసంపత్కరం సదా॥ 28

స్వాయంభులింగ విస్తృతి త్రిగుణంచపీఠే
పీఠస్యతార త్రిగుణం పరిశుద్ధగేహమ్॥ 29
గేహాత్రిధైకం పరితోబహిష్కుర్యాత్ తారమ్
కేచిత్తదాయామసమంపీఠ విశాలమేతత్॥ 30

ఇతిమానసారేవాస్తుశాస్త్రే పీఠలక్షణ విధానంనామ
త్రిపంచశదధ్యాయః॥

తా॥ లింగము యెత్తు యెంతో పీఠము విస్తారము అంతే యుండ వలయును. షడ్వర్గగణితమును చూడక పీఠమును చేసిన యెడలనది దోషము కలదియగును. నాగరలింగమునకు నాగరపీఠమును, ద్రావిడ లింగమునకు ద్రావిడ పీఠమును, వేసర లింగమునకు వేసరపీఠమును, ధారాలింగమునకు ధారాపీఠమును, ఇట్లు లింగములనుబట్టి పీఠములను రచించదగును. బ్రాహ్మణాది కులములనుబట్టి కూడ పీఠములను రచించవలయును. వ్యతిరేకముగ రచించబడినేని దోషములు కలుగును. నాగరము నలుచదరము, ద్రావిడము అష్టాశ్రం, వేసరము గుండ్రం ఇట్లు చేయవలయును. ధారాలింగమునకు ధారా పీఠమే యుండవలయును, మరియు స్వాయంభులింగముయొక్క విస్తారమునకు పీఠము 3 రెట్లుండవలయును. పీఠముయొక్క విస్తారమునకు 3 రెట్లు గర్భాలయముండవలయును. గర్భాలయమునకు 3 రెట్లు చుట్టును విశ్రాంతి ప్రదేశముండ వలయును. కొందఱు స్వాయంభులింగము యెత్తుతో సమానముగా పీఠముయొక్క విస్తారమును చేయుదురు.

## 24. మణిరేఖానాల లక్షణములు

కాశ్యప శిల్పము 49వ పటలం

శ్లో॥ లక్షణోద్ధారణోత్క్రాంశం రుద్రభాగవిభాజితే
ముకులోదయమేకాంశం తద్వ్యాసంచాపితత్సమమ్॥ 159

తన్మాలానాంతు దీర్ఘత్వం నవభాగము దాహృతమ్
తన్నాలమేకసూత్రంవా సూత్ర ద్విత్రియుతంతునా॥ 160
సూత్రమాయ యుతంచేత్తు సూత్రాంతరయవత్రయం
యవద్వయాంతరంవాఽథ నాలితారం ద్విజోత్తమ॥ 161
నాలమూర్ధ్వే చతస్యాగ్రే సీమాసూత్రంసమావిక్షేత్
తన్నాలంత్వేక సూత్రంచే ల్లింగమధ్యే విశేషతః॥ 163
సూత్రోక్త వ్యాసఖాతంచ నాలాయామేతు కల్పయేత్
నాలాధస్తాత్తు వ్యోమాంశం త్యజేద్విష్ణ్వంశకోపరి॥ 163
మణిరేఖాతతః కార్యాముకులంస్యా ల్లింగమంతరైః
మణిరేఖయోఽంతర్విప్ర పద్మమూలం సమంతువా॥ 164
పద్మతారం త్రిధైకంవా వేదాంశేత్ర్యంశ ఏవవా
పంచాంశేతు యుగాంశంవా పద్మతారార్ధమేవవా॥ 165
ముకులమూలేఽంతరం హ్యేవం తాలమూలేఽంతరంశృణు
నాలాయామసమంవాఽథ పాదంపాదయుగాంశకౌ॥ 166
త్రిభాగం పంచభాగేతు వేదభాగమథాపివా
నాలమూల సమంత్వేవ మణిరేఖాద్వయోఽంతరమ్॥ 167
మూలాదగ్రం క్రమాత్ తీక్ష్ణం మణిరేఖాంతరంకురు
ఘాతుమూలేసమే తిర్యగ్గత్వా పృష్ఠేతు సంధయేత్॥ 168
మణిరేఖావ్యాసమాతం లింగస్యోచ్ఛ్రితం సూత్రయేత్
మణిరేఖా లంబనంనాల ద్విసార్ధం సమమేవవా॥ 169
తస్మాదామూల పర్యంతం వసుభాగ విభాజితే
మణిరేఖాలంబనంవాఽపి నవధా పరికీర్తితమ్॥ 170
సర్వేషు లక్షణోద్ధారే ష్వష్టమంమణిరేఖికే
ప్రథమం లక్షణంప్రోక్తం ద్వితీయంలక్షణంశృణు॥ 171

లక్షణోద్ధారణోర్ధ్వాంశం దశభాగ విభాజితే
ముకులోదయమేకాంశం వస్వాంశం నాలదీర్ఘకమ్॥ 172

నాలాధస్తాత్తువ్యోమాంశం నీత్వా శేషంతు పూర్వవత్
ద్వితీయం లక్షణంఖ్యాతం తృతీయం లక్షణం శృణు॥ 173

లక్షణోద్ధారభాగంతు ధర్మభాగ విభాజితే
ఏకాంశం ముకులోచ్ఛ్రాంతు నవాంశం నాలదీర్ఘకమ్॥ 174

శేషం పూర్వవదుద్దిష్టం చతుర్థం లక్షణం శృణు
లక్షణాంశంతు నవధా భజ్యేకాంశం తుకుడ్మలమ్॥ 175

సప్తాంశం నాలదీర్ఘంతు శేషం పూర్వవదాచరేత్
చతుర్థం లక్షణం ప్రోక్తం పంచమం శృణుసువ్రత॥ 176

లక్షాంశం వసుధాభజ్య వ్యోమాంశం ముకులోదయమ్
షడంశం నాలదీర్ఘంతు నాలాధస్తాచ్ఛివాంశకమ్॥ 177

తదేవసప్త భాగంతు నాలదీర్ఘముదాహృతమ్
శేషం ప్రాగివ కర్తవ్యం సప్తమం లక్షణం శృణు॥ 178

లక్షణాంశేతు సప్తాంశే శక్త్యంశంముకులోదయమ్
భూతాంశం నాలదీర్ఘంతు శేషంపూర్వవదేవహి॥ 179

షడంశంవాఽదతన్నాల దీర్ఘం శేషంతు ప్రాగివ
ఏవమష్టవిధంఖ్యాతం నాలాయామం ద్విజోత్తమ॥ 180

అగ్రాకారేఽబ్జ ముకులం భానుసంఖ్యాతుసువ్రత
యథేష్టనాలం కర్తవ్యం నవసంఖ్యాతు దేశిక॥ 181

తా॥ లక్షణోద్ధారము చెప్పబడిన భాగమును 11 భాగములు చేసి, మొగ్గయొక్క పొడవు 1 భాగము చేయవలయును. విస్తారమును అంతే చేయవలయును. మొదలు నుండి చివరకు 9 భాగములు ఆనాలమునకు 1-2-3 సూత్రము లుంచవచ్చును. సూత్రముల సందు 3

యవలును లేక 2 యవలును నాలముయొక్క విస్తారము నాలము పైనను చివరను సీమా సూత్రమును లిఖించవలయును. నాలము 1 సూత్రముకలది యవ్యేనేని లింగ మధ్యమున నుండవలయును. సూత్రమునకు జెప్పబడిన విస్తారమున ఖాతమును నాలముయొక్క పొడవున రచించవలయును నాలము క్రింద 1 భాగం విష్ణ్వంశము పైన వదలవలయును. తరువాత మణిరేఖను రచించవలయును. వెలుపల మొగ్గయుండవలయును. మణిరేఖల సంకునపద్మము మొదలుతో సమానముగాని, పద్మముయొక్క విస్తారమును 3 భాగములు చేసి అందులో 1 భాగముగాని, లేక 4 భాగములలో 3 భాగములుగాని లేక 5 భాగములలో 2 భాగములుగాని. లేక విస్తారములో సగముగాని, ముకులము యొక్క మొదలు సందు చెప్పబడియున్నది. నాలము యొక్క మొదలున సందు చెప్పుచున్నాడు. నాలముయొక్క పొడవుతో సమానముగాని, $\frac{1}{4}$, $\frac{1}{2}$, $\frac{4}{3}$, భాగములుగాని లేక 5 భాగములలో 4 భాగములుగాని నాలముయొక్క మొదలుతో సమానముగాని, మణిరేఖలయొక్క సందుండవలయును. మొదలునుండి చివరకు క్రమముగా వాడికలిగి యుండవలయును. ధాతుమూలమున సమముగాను అడ్డంగా బోనిచ్చి వెనుక కూర్చవలయును మణిరేఖ యొక్క విస్తారం నంజలి ఖాతమును లింగంయొక్క యెత్తును సూత్రముతో చూడవలయును. మణిరేఖయొక్క లంబనం నాలంనకు రెట్టింపు $1\frac{1}{2}$, లేక సమానము ఉండవలయును. అచ్చటినుండి మొదలు వరకు 8 భాగములు చేసి మణిరేఖయొక్క లంబమును 9 విధములుగా చెప్పబడియున్నది. అన్ని లక్షణోద్ధారము లందును 8వ భాగము మణిరేఖగా చెప్పబడియున్నది. ఇదియొక పద్ధతి లేక 10 భాగములు చేసి మొగ్గపొడవు 1 భాగముచేసి నాలముయొక్క పొడవు 8 భాగములును, నాలము క్రింద భాగముంచి మిగిలినది మునుపటివలెనే చేయు

వలయును. ఇది రెండవ పద్ధతి. పైజెప్పిన 10 భాగములలో 1 భాగం మొగ్గఎత్తు 9 భాగములు నాలముయొక్క పాదవు చేయవచ్చును. ఇది మూడవ పద్ధతి. లేక 9 భాగములుచేసి మొగ్గ 1 భాగము నాలము పాదవు 7 భాగములు. మిగిలినది పూర్వమువలెనే చేయవలయును. ఇది నాలుగవ పద్ధతి. 8 భాగములుచేసి మొగ్గ 1 భాగము నాలము పాదవు 6 భాగములు. నాలముక్రింద 1 భాగము చేయవచ్చును. ఇది ఐదవపద్ధతి. లేక . భాగములు నాలము పాదవుచేసి మిగిలినవన్నియును పూర్వమువలెనే చేయవచ్చును. ఇది ఆఱవపద్ధతి. లక్షణోద్ధారమును 7 భాగములుచేసి మొగ్గ 1 భాగము నాలము పాదవు 5 భాగములు క్రింద 1 భాగమును చేయవచ్చును. ఇది యేడవ పద్ధతి. పై దానినే నాలము మాత్రము 6 భాగములు పాదవుచేసి మిగిలినవన్నియును మునుపటివలెనే చేయుట ఎనిమిదవ పద్ధతి. చివరను పద్మము కుళమును 3 భాగములు రచించి నాలము 9 భాగములతో గూడ మొత్తము 12 భాగములు యిష్టము వచ్చిన కొలతలతో అందముగా గూడ రచించవచ్చును.

## మానసారము 52వ అధ్యాయము

శ్లో॥ పీఠతార సమంలింగం మధ్యనాలాగ్ర కాంతకం
పీఠతారం ద్వయంకృత్వా చైకాంశం నాలవిస్తృతమ్॥ 135
తచ్చతుర్భాగివైకాంశ హీనంనాలాగ్రతారకం
కేచిద్ ద్వితృంశమేవంస్యా న్నాలాగ్రాంతక్షయిం
క్రమాత్॥ 136
తద్విశాల త్రిభాగైకం ప్రణావే విస్తారమేవవా
పీఠతార చతుర్థాంశం త్రయాంశం వృతవారికా॥ 137
పీఠతార సమంచైవ లింగస్య పరిణాహకం
ఏనమాత్రార్థ లింగేను స్వయంభుపరిపరార్థకే॥ 138

కుర్యాదనేకలింగేషు చైకలింగం నకారయేత్ ॥

## 25. షడ్వర్గ ఫలములు

### కాశ్యప శిల్పము 49వ పటలము

శ్లో॥ లింగస్యోత్సేధ మానంతు మానాంగులేన యోజయేత్
మాత్రాచ్ఛేదం ప్రవృద్ధ్యావా హాన్యాద్వా పరికల్పయేత్ ॥ 99
శ్రేష్ఠాంతరాయామమాత్రై ర్మాత్రపూర్ణాం పరిగ్రహేత్
ఉత్సేధమాత్రమష్టాభి ర్వర్ధితం ఋక్షసంఖ్యయా॥ 100
హృత్వా శేషోదిత ంఖ్యాత మశ్విన్యాదిద్విజోత్తమ
నవభిర్గుణితేసప్త హృతేత్వర్కాదివారకే॥ 101
అనవేగుణితేచాష్ట హృతేయో నిరుదాహృతా
అష్టాభిర్వర్ధితేభాను ర్హృతేత్వాయ ముదాహృతమ్॥ 102
నవభిర్గుణితేనాడీ హృతే శేష మృణంభవేత్
యుగవృద్ధ్యానవేహ్రాసే త్వంశకం తస్కరాదయః 103
ఆయాధిక్యం వ్యయంక్షీణం సంపదామాస్పదం సదా
ధ్వజః సింహః వృషోహస్తీ శుభయో నిరుదాహృతాః॥ 104
నృపకర్తుశ్చ జన్మర్క్షా ల్లింగఋక్షావసానకమ్
తద్దైవవాస్తు ఋక్షాది గణయేత్తు శుభావహామ్॥ 105
జన్మత్రయంచ యుగ్మంచ వేగాష్ట ఋతునందకాః
శుభాయవిహితాహ్యేతే శేషకాస్త్వ శుభావహాః॥ 106
లగ్నాష్టకంచవై నరాక్షసమ్
వర్జితాత్వాశు భాహ్యేతే యత్నతః పరివర్జయేత్॥ 107
భానువారాది సంయుక్తాః సూర్యర్క్షాది చతుశ్చతుః
రిపుత్వం మరణంనాశ మమృతంచ యథాక్రమమ్॥ 108

తస్కరం నిర్ధనంషండం చాంశకం పరివర్జయేత్
శేషాంశకం పరిగ్రాహ్యం శుభమానంతు సంగ్రహేత్ ॥ 109

తా॥ లింగముయొక్క యెత్తును మానాంగులములచే కొలిచి చాలనపుడు కొన్ని యవలను పెంచి లేకున్న కొన్ని యవలను తగ్గించి షడ్వర్గఫలములకు దగినట్లు చేయవలయును. ఉత్తమ లింగములకు అంగులములతోనే గణితముకుదర్చవలయును. లింగముయొక్క యెత్తు అంగులములను 8చే పెంచి 27చే భాగింపగా మిగిలినవి అశ్వని మొదలగు నక్షత్రములగును. 9చే పెంచి 7చేభాగింపగా మిగిలినవిసూర్యాదివారములగును. 3చే హెచ్చించి 8చే భాగింపగా మిగిలినవి ధ్వజా రాది యోనులగును. 8చే పెంచి 12చే హరింపగా మిగిలినవి ఆయముగును 9చే పెంచి 10చే హరింపగా మిగిలినవి వ్యయములగును. 4చే పెంచి 9చే హరింపగా మిగిలినవి తస్కరాది అంశములగును. ఆయసంఖ్య అధికముగను వ్యయసంఖ్య హీనముగను నుండవలయును. ధ్వజ, సింహ, వృష, గజములు శుభయోనులు రాజుగాని, కర్తగాని వారియొక్క జన్మనక్షత్రమునుండి లింగనక్షత్రము వఱకు లెక్కించి 1-2-4-6-8-9 ఇట్లు మూడు ఆవృత్తులలోను శుభతారలని యెఱుంగవలయును. మిగిలినవి పనికిరావు. జన్మలగ్నమునకు 8వ లగ్నమును మనుష్యరాక్షస గణములను వర్జించవలయును. ఆదివారము మొదలు సూర్యుడున్న నక్షత్రమునుండి 4-4 నక్షత్రములు శత్రుత్వము మరణము, నాశము, అమృతము ఇట్లు వరుసగా ఫలములు కలుగునవి యని తెలియవలయును. అంశములలో తస్కర, నిర్ధన, షండములు పనికిరావు. మిగిలినవి శుభకరములు. మానసారమునందునును ఇదే తీరున జెప్పబడియున్నది.

మానసార 52వ అధ్యాయము

శ్లో॥ దైర్ఘ్యే లింగస్యాయాది షడ్వర్గశుద్ధిం కుర్యాత్సర్వథోక్తవత్
మానలింగే చాన్యస్వాయం భువాదిమానంచ
యుక్త్యంతథాయాదీని సర్వేన కుర్యాత్ ॥ 163

వహ్న్యైరీష్టనంద వసునంద యుగేన వృద్ధ్యా
చాష్టార్క-పంక్తి రుడుభిర్మునినంద హాన్యాత్
యోనిశ్చవృద్ధి వ్యయతారక వారమంశం షడ్వర్గ
యుక్తరచనం హిపవార్థలింగే॥ 164

ధ్వజధూమసింహ శునకవృషగర్దభాశ్చ దంతీచకాకశ్చ
వసుయోనిర్యథా క్రమేణ ధ్వజసింహహస్తివృషయోనిః
శుభంప్రశస్తం అన్యేషుయోనిర శుభముదితం పురాణైః॥ 165

శత్రుంవృద్ధిర్మరణం శుభావహం చతుర్బుద్ధిరూపం
సుమంగలమ్ శ్రీకరంచ సుఖదం సువృద్ధిదం
పుష్కలాయరవిః తత్ఫలం క్రమాత్॥ 166

భుక్తిముక్తి శుభదం సమృద్ధిదం సంపదర్థం ధనమృద్ధిదం
ద్విజభుక్తినాశ కలహంచ మైత్రకం చోక్తమేవ
దశధాఫలంభవేత్॥ 167

ఆయాధిక్యం చాన్యథాహీనముక్తం ఆయంహీనం
చాన్యథా చేత్వధికమ్ మృత్యుదారిద్రావహం
నాశహేతుః ఆయాధిక్యం సంపదర్థం సమంవా॥ 168

జన్మద్వితీయదషష్ఠి స్త్వష్టనందా శుభార్థాథానాం
సారివారం విసృజ్యకృతిమ్యం భుక్తిశక్తిబుద్ధిదంచ॥ 169

భూషం శుద్ధింధీరంచాధనం వేశ్మైవచ శక్తిశ్చప్రభుబంధనం
పీరంచైవ భుక్తిముక్తి శుభాంశమ్ అన్యత్సర్వం తస్కరాద్యం
యథాంశం యుక్తంచే త్సర్వసమృద్ధి నాశనమ్॥ 170

ఇతిమానసారేవాస్తు శాస్త్రేలింగవిధానంనామ
ద్విపంచాశదధ్యాయః

## 26. లింగ నిర్మాణాద్యంతవిధులు

కాశ్యపశిల్పము 49వ పటలము

శ్లో॥ స్థపతిశ్చ శుచిర్భూత్వా యజ్ఞసూత్రోత్తరాన్వితః 143
ప్రాగ్వదగ్నిం సమభ్యర్చ్య స్విష్టపూర్ణాహుతించరేత్
ప్రతిసరం బంధయేత్తత్ర లింగపీఠేద్విజోత్తమ॥ 144
స్వర్ణరజత కార్పాస సూత్రైర్వాహాయయేనతు
ప్రభాతేసుముహూర్తేతు లక్షణోద్ధార మాచరేత్॥ 145
పాయసంఘృత సంయుక్తం శిరఃస్థానేబలింహరేత్
రక్తగంధం పరిత్యజ్య గంధాద్యైరర్చ్య యేద్ధ్రువా॥ 146
రక్తేనధాతునాలింగ మధ్యేసూత్రంతుపాతయేత్
ముఖభాగస్యమధ్యేతు నాలంకుర్యాత్ సలక్షణం॥ 147
లింగమానేనమతిమాన్ సూత్రవిస్తారముచ్యతే॥

తా॥ శిల్పాచార్యుడు స్నానముచేసి నూతన యజ్ఞోపవీతమును ధరించి పూర్వమువలె అగ్నిని పూజించి స్విష్టకృద్ధోమమును చేసి తోరాకంకణమునుదాల్చి బంగారపుతీగె, లేక వెండితీగె అథమము నూలుదారము తీసికొని భాగముల ప్రకారము నూళ్ళుపట్టి సూర్యోదయ కాలమున సుముహూర్తమున లక్షణోద్ధారమును చేయవలయును పాలు, నెయ్యి, శిలయొక్క తలయందుంచవలయును. ఎఱ్ఱనిగంధము గాని పూలుగాని పనికిరావు మంచిగంధము, మల్లెపువ్వులు, మొదలయిన తెల్లనిపూలు మున్నగువానితో పూజించి సూత్రము పట్టిన చోట గుర్తులు మాత్రము జేగురుఱాయి మొదలగువానితో గీయవచ్చును. నలుపైపుల మధ్యస్థానమును గుర్తుచేసి చుట్టును భాగములను కల్పించవలయును. ఇట్లు లింగమును పీఠమును నాలమును రచించిన తరువాత

శ్లో॥ దృఢసూత్రం ప్రకర్తవ్యం లింగేషూక్త ప్రమాణతః
స్థాపయేత్తుతదాలింగం ప్రాగ్రగందారువిష్టరే॥ 128

లక్షయేత్ పీఠకేవిత్తం లింగం సౌమ్యేనిధాపయేత్
స్థాపితైః కలశైఃస్థాప్య లింగం పీఠంప్రాదాబుధః॥ 183

గన్ధైర్గంధోదకైఃస్థాప్య గంధపుష్పాది భిర్యజేత్
లంబకూర్చ సమాయుక్తం సర్వాలంకార సంయుతమ్॥ 184

రథేతుశిబికాయాంవా గ్రామంకృత్వా ప్రదక్షిణం
తతోజలాశయంప్రాప్య జలాధివాసనంకురు॥ 185

తా॥ లింగమునుగట్టి నూలుత్రాడుతో చుట్టి దారువుతో జేయ బడిన పీఠమునందు తూర్పున తల యుండునట్లుంచి ఉత్తరమున లింగ మును దానికి దక్షిణమున కలశములను ఉంచి పంచగవ్యములలోను పరిమళ ద్రవ్యముతో గూడిన శుద్ధోదకముతోను, అభిషేకముచేసి గంధపుష్పాదులతో పూజించి దర్భకూర్చములను కట్టి సమస్తమైన అలంకారములనుచేసి రథముపైగాని, పల్లకిపైగాని యుంచి గ్రామ మున నూరేగింపుచేసి చెఱువుగాని, కోనేఱుగాని, నదిగాని, జలాధి వాసమున కుపయోగము కనుక యిందేది యున్నను అచటికి దీసికొని పోయి శాస్త్రోక్త ప్రకారము జలాధివాసమును చేయించవలయును.

## మానసార 52వ అధ్యాయము

శ్లో॥ పీఠతారోదయంనాలం దీర్ఘంప్రాగుక్తవన్నయేత్॥ 143
వృత్తాకారంతు పీఠంస్యా దన్యథాకృతింవర్జయేత్
పీఠతుంగేతురంధ్రంస్యా ల్లింగనాహస్య సన్నిభమ్॥ 144
లింగతుంగ విశేషంస్యా ద్వేశనంతన్న యేద్బుధః
మానయేద్బహులింగేతు చైకానేకాది లింగకైః 145
ఏతత్తుసర్వలింగేషు చాత్మార్థంచపరార్థకే
తన్మధ్యేస్థాపయేల్లింగ మాధారత్వాని విన్యసేత్॥ 146

లింగస్యపరితోరంధ్రే స్వర్ణవర్ణావబంధనం
అథావేరజతేనైవ తామ్రంవాయ సమేనచ। 147

కారయేచ్ఛిల్పినాసమ్యగ్ లింగపీఠోర్ధ్వమైఃసహ
స్యాదేకానేకలింగానాం పరార్ధేత్వష్టబంధనమ్॥ 148

కేచిత్ త్రిబంధనం కుర్యాద్ ద్రవ్యైశ్చగుగ్గులాదిభిః
రత్నలింగైశ్చ సర్వేషాం స్వర్ణపీఠం ప్రకల్పయేత్॥ 149

అథవారత్న పీఠంవా రత్నలింగేషు పూర్వవత్
యద్యద్ద్రవ్యేణలింగంస్యా త్తత్ద్రవ్యేణ పీఠకమ్॥ 150

నవరత్నైశ్చ సంయుక్తం స్వర్ణపీఠంప్రకల్పయేత్
యద్యద్రత్నైశ్చయల్లింగే తత్తున్నామ్నైవనామకమ్॥ 151

పీఠేతులింగకేవాపి నవరత్నైర్విశేషతః
ఏకకర్ణంచైకలింగం బహుభిశ్చైక లింగకమ్। 152

వజ్రలింగమితిప్రోక్తం రత్నాని ఇతికథ్యతే
ఏకంవాబహురత్నంవా నవరత్నైశ్చ సంయుతమ్॥ 153

లింగం యదుక్తంస్వర్ణేన పీఠేరత్నాని యోజయేత్
అథవాకేవలం స్వర్ణం పీఠంవాకారయేద్బుధిః॥ 154

స్వర్ణలింగమితిప్రోక్తం లక్షణం పూర్వవద్భవేత్
ఆచార్యహస్తేనవాలింగం శిష్యస్యనాహంగుళవతు॥ 155

పశ్చాత్ పూజాంతథా కుర్యాదాచార్యోక్తో పదేశవత్
యథోక్తలింగపూజాయాః ఫలంవక్ష్యేయథావిధి॥ 156

నదీపర్వత లింగానాం కైలాసారోహణంభవేత్
ఇహలోకస్య పూజిత్వం భుక్తిముక్తి ఫలప్రదమ్॥ 157

రత్నలింగస్య పూజాయాః ఫలంముక్తి ప్రదాయకమ్
స్వర్ణలింగార్చనస్త్వేవం ఫలంస్వర్గాప వర్గకమ్॥ 153

స్వర్ణపీఠంతుతల్లింగం ముక్తాఘనమథాపివా
కల్పయేత్ కర్తవిమానేన ప్రశస్తం దోషవర్జితమ్॥ 159

తా॥ పీఠము యొక్క విస్తారముతో సమానముగా నాలము పొడవు కలిగి యుండవలయును. పీఠము యొక్క ఆకారము గుండ్రముగా నుండవలయును. లింగము యొక్క విస్తారముతో సమానముగా పీఠము పైన రంధ్రమును చేయవలయును, లింగం యొక్క యెత్తులో శివ భాగము వేశనము చేయవలయును. బహులింగములైనచో వాని కొలతల ననుసరించి చేయవలయును. పీఠము నడుమ లింగమును స్థాపించవలయును. మొదట నవరత్నములను స్థాపించి లింగము యొక్క చుట్టును గల రంధ్రములను బంగారముతో పూడ్చవలయును లేదా వెండితోనైనకమ్మి వేయవలయును అధమము రాగితో నైనను కమ్మి వేయవలయును. లేక అష్ట బంధములో ఉక్కుబీడు కలిపి రంధ్రములను కమ్మవచ్చును. ఏకలింగమైనను పంచలింగములైనను, నవలింగములైనను అష్టబంధనముతో బిగించవలయును.కొందరు త్రిబంధనముతో గూడ బిగింతురు. రత్నలింగం లన్నిటికిని బంగారముతో పీఠమును రచించవలయును. రత్నపీఠమునైన చేయవచ్చును. ఏ రత్నముతో లింగమును చేయుదురో ఆ రత్నముతోనే పీఠమును రచించవలయును. అయితే నవరత్నములతో లింగములను 9 చేసిరేని ఆ లింగంలన్నిటికిని సువర్ణ పీఠమునే చేయవలయును ఏ రత్నముతో చేయబడిన లింగంనకు ఆ రత్నము పేరునే వాడుదురు. ఏకలింగంనకు గుండ్రని పీఠమునే రచించవలయును. ఏకలింగమునకుబహుకోణములు గల పీఠముండెనేని యది వజ్రలింగ మనబడును ఒక్కలింగమైనను బహులింగములైనను సువర్ణ పీఠమునురచించి యందు నవరత్నముల నుంచదగును. లేక బంగారంతోనే లింగమును పీఠమును రచించిరేని యది సువర్ణ లింగమనిపించుకొనును, అంగులముల కొలతను చేయు

నష్టాను శిల్పా చార్యుని హస్తముతోగాని, ఆయన శిష్యుని హస్తముతోగాని అంగులములను నిర్ణయించవచ్చును. పూజనూ ఆచార్యుడు చెప్పిన పద్ధతితో చేయవలయును. నదీ పర్వత లింగముల యొక్క పూజ వలన కైలాస ప్రాప్తి కలుగును. ఇహ లోకము నందును భుక్తిముక్తులు లభించును. రత్నలింగమును పూజించుట వలన మోక్షం లభించును. సువర్ణ లింగమును పూజించుటవలన స్వర్గ ఫలము లభించును. సువర్ణ పీఠమున లింగము ముత్యముతో సమానమైన లావుగలిగియున్నజాలును. ఏ రత్నము నైనను దోషము లేని దానినిగా జూచి లింగమును చేయవలయును.

కాశ్యప శిల్పము : 59వ పటలము

శ్లో॥ జయదంచతురశ్రాంతం యోన్యాకారంప్రజాకరం
శాంతిఃస్యాద్ధనురాకారే గుణాశ్రంరిపునాశనం 43
వర్ధమానంతువృత్తంస్యాత్పంచాశ్రంతుష్టిపుష్టిదం
షట్కోణంరోగనాశంస్యాద్దేవమేవక్రమాద్విదుః॥ 44

(అనుబంధము 6 నుండి 11వ పటము వఱకు చూడుడు)

## 27. వృషభలక్షణము

కాశ్యప శిల్పము 46వ పటలము

శ్లో॥ ఆదౌతుపరివారాణాం వక్ష్యేవృషభలక్షణమ్॥ 35
తుంగేపంచదశాంశేతు ఏకాంశంచాంగలంభవేత్
చత్వారింశాంగులాయామం గలాత్పృష్ఠావసానకమ్॥ 36
మూర్ధాదిగలపర్యంతం వర్ణమాత్రముదాహృతమ్
తస్మాద్ద్విగ్రీవోచ్చమష్టాంశం పూర్వోక్తంషోడశాంగులమ్॥ 37
ఊరుదీర్ఘంచతుఃస్థానేఃషణ్మాత్రంపరికీర్తితమ్
జానుమానంద్విమాత్రంస్యాజ్జంఘామానంషడంగులిమ్॥ 38
ఖురమానంద్విమాత్రంస్యాత్తుంగమేవంప్రకల్పయేత్
శృంగాంతరంతువస్వంశం శృంగోచ్ఛంచతురంశకమ్॥ 39

శృంగమూలవిశాలంతు చతురంగులముచ్యతే
అర్ధాంగులంతథూర్ధ్వాగ్రం వ్యాసం మూలాత్ కృశం క్రమాత్॥ 40

కించిద్వక్రసమాయుక్తౌ శృంగమభ్యంతరేబుధః
లలాటవ్యాసఘనంవాంశం ముఖవ్యాసంశరాంగులమ్॥ 41

ఘనంచతత్సమంఖ్యాతం నేత్రమేకాంగులంభవేత్
నేత్రమధ్యలలాటోచ్చం వేదమాత్రముదాహృతమ్॥ 42

నేత్రాత్కర్ణాంతపర్యంతం పంచాంశంకర్ణదీర్ఘకం
కర్ణమూలవిశాలంతు ద్విమాత్రమితివిద్యతే॥ 43

మధ్యవ్యాసంచతుర్మాత్ర మగ్రమంగులవిస్తృతమ్
ఘనమర్ధాంగులంఖ్యాతం ఘ్రాణంసార్ధాంగులాయతమ్॥ 44

వ్యాసమేకాంగులంఖ్యాతం గోజితత్సమముచ్యతే
అంగులంనాసికాదూర్ధ్వం తుంగమిత్యభిధీయతే॥ 45

ఆస్యంపంచాంగులాయామ మధరోష్ఠంద్వయాంగులం
త్రిమాత్రంచోత్తరోష్ఠంచ యుక్తితఃకల్పయేత్ క్రమాత్॥ 46

జిహ్వాయామవిశాలోచ్చం త్రిద్వ్యేకాంగులముచ్యతే
గ్రీవవ్యాసోదశాంశఃస్యాత్ తస్మాలంద్వాదశాంగులమ్॥ 47

పృష్ఠగ్రీవస్యమూలస్య వ్యాసమష్టాంగులంభవేత్
పృష్ఠగ్రీవాగ్రవిస్తారం షడంగులముదాహృతమ్॥ 48

కకుదుచ్చంచతుర్మాత్రం తస్యవ్యాసంషడంగులమ్
గ్రీవస్యాగ్రఘనంచాపి అధ్యర్ధాంగులముచ్యతే॥ 49

శరీరేమధ్యమేవ్యాసం చతుర్వింశాంగులంభవేత్
అపరేవ్యాసంభాన్వంశం శక్తియుక్త్యాసమాచరేత్॥ 50

పూర్వపాదోరుమూలస్య వ్యాసంపంచాంగులంభవేత్
తదూర్ధ్వాగ్రంచతుర్మాత్రం జంఘామూలంచతత్సమమ్॥ 51

జంఘాగ్రంగుణమాత్రంస్యా త్సార్ధాగ్న్యంశంఖురాఃస్మృతం
అపరేచోరుమూలంస్యా ద్వ్యాసంవేదంక్రమాత్కృశమ్॥ 52
అగ్రమష్టాంగులంవ్యాసం వ్యాసంమూలంషడంగులమ్
జంఘాగ్రంచతురంగుల్యం ఖురవ్యాసంయుగాంశకమ్॥ 53
ఊరుపంచాంగులాయామం జానుదీర్ఘంద్విమాత్రకమ్
జంఘాపంచాంగులందీర్ఘం త్రిమాత్రంఖురమానకమ్॥ 54
పుచ్ఛవ్యాసంత్రిమాత్రంవా మూలాగ్రేసార్ధమాత్రకమ్
పుచ్ఛంజంఘాగ్రసీమాంతం వాలయేత్తువిశేషతః॥ 55
పుచ్ఛాగ్రే కేశసహిత వ్యాసంవేదాంగులంభవేత్
మూలాగ్రంచైకమాత్రంస్యా త్కేశదీర్ఘంయుగాంగులమ్॥ 56
బీజాయామవిశాలంతు సర్వంవహ్న్యంగులంక్రమాత్
ద్విమాత్రంఘనమిత్యుక్తం శేషాయామంయుగాంగులమ్। 57
ఉదయాదంగులవక్త్రం ఘనమిత్యభిధీయతే
స్థితంవాశయితంవాఽపి పద్మేవాభద్రపీఠకే॥ 58
సుధామృచ్ఛర్కరాభిర్వా శిలాలోహోత్తమేనవా
స్వర్ణజంతామ్రజంవాఽపి లోహజంవృషభంకురు॥ 59
కించిద్ధీనంనకర్తవ్యం మానోన్మానప్రమాణకే
తదాకర్తుస్సుకర్తృత్వం తస్మాల్లక్షణమన్వితమ్॥ 60
కర్తవ్యం విపరీతంచే ద్విపరీత ఫలప్రదం వృషలక్షణంఖ్యాతం॥

తా॥ పరివార దేవతలలో మొదట వృషభ లక్షణమును జెప్పుచున్నాడు. ఎత్తును 15 భాగములు చేసి ఒక్కొక్క భాగము 1 అంగులముగా భావించవలయును. మెడ నుండి పిప్పు చివరకు 40 అంగులములు. తలనుండి మెడవఱకు 4 అంగులములు అచ్చటి నుండి మెడ యెత్తు 8 అంగులములు మెడ మొదలు ఱొమ్ము వరకు 16 అంగులములు తొడ పాదపు (నాలుగు భాగములు) 6 అంగులములు

మోకాలు 2 అంగులములు పిక్క పొడవు 6 అంగులములు గిట్ట యెత్తు 2 అంగులములు కొమ్ములసందు 8 అంగులములు కొమ్ము యెత్తు 4 అంగులములు కొమ్ము యొక్క మొదలు విస్తారము 4 అంగులములు కొమ్ము యొక్క చివరలావు ½ అంగులము మొదలు నుండి చివర వఱకు క్రమముగా సన్నమై యుండవలయును. కొమ్ములు కొంచెము లోపలికి వంగి నట్లుండవలయును. నొసలు విస్తారము 9 అంగులములు ముఖము విస్తారము 5 అంగులములు లావు 5 అంగులములు కన్ను 1 అంగులము కన్నుల నడుమ నొసలు యెత్తు 4 అంగులములు, కన్నుల నుండి చెవుల వఱకు 5 అంగులములు చెవి పొడవు 5 అంగులములు చెవి మొదలు విస్తారము 2 అంగులములు చెవి మధ్య విస్తారం 4 అంగులములు చెవి యొక్క చివర విస్తారం 1 అంగులము చెవి మందం ½ అంగులం ముక్కు పొడవు 1½ అంగులం ముక్కురంధ్రం విస్తారము 1 అంగులము ముక్కు క్రింది చాఱ 1 అంగులం ముక్కుపైన యెత్తు 1 అంగులం నోరు పొడవు 5 అంగులములు క్రింది పెదవి 2 అంగులములు పై పెదవి 3 అంగులములు నాలుక పొడవు 8 అంగులములు నాలుక విస్తారం 2 అంగులములు నాలుక మందం 1 అంగులం మెడ విస్తారం 10 అంగులములు మెడ మొదలు 12 అంగులములు వెనుక మెడ యొక్క మొదలు విస్తారం 8 అంగులములు వెనుక మెడ చివర విస్తారం 6 అంగులములు మూపురము యెత్తు 4 అంగులములు విస్తారం 6 అంగులములు మెడపైన లావు 1½ అంగులం దేహము యొక్క నడుమ విస్తారం 24 అంగులములు మీదగాని దిగువగాని విస్తారం 12 అంగులములు ముందు కాలు తొడ మొదలున విస్తారం 6 అంగులములు దానిపైన చివర 4 అంగులములు పిక్కమొదలు 4 అంగులములు పిక్క చివర 3 అంగులములు గిట్ట చివర 3½ అంగులములు వెనుక తొడ మొదలు విస్తారం 4 అంగులములు క్రమముగా తగ్గి యుండవలయును. ముందు

8 అంగుళములును మొదలు 6 అంగులములును పిక్క చివర 4 అంగులములు గిట్ట విస్తారం 4 అంగులములు తొడ పొడవు 5 అంగులములు మోకాలు పొడవు 2 అంగులములు పిక్క పొడవు 5 అంగులములు గిట్ట ఎత్తు 3 అంగులములుతోక మొదలు విస్తారము 3 అంగులములు మొదలుపైన $1\frac{1}{2}$ అంగులం తోక పిక్క యొక్క చివర వఱకు ఆనుకొని యుండవలయును. తోక చివర వెంట్రుకలతో గూడ విస్తారం 4 అంగులము లుండవలయును. మొదలు చివర 1 అంగుల ముండవలయును. వెంట్రుకల పొడవు 4 అంగులములు వృషణముల పొడవు విస్తారము 3 అంగులములును, మందం 2 అంగులములును చేయవలయును. మగ గుఱిపొడవు 4 అంగులములు చివర నుండి 1 అంగులం లావు కలిగి వ్రేలివలె నుండవలయును. నిలుచున్నట్లుగాని, పరుండినట్లుగాని, పద్మపీఠమునగాని, భద్రపీఠమునగాని, సున్నము మన్ను మొదలగు ఱాయి, ఱాయి, లోహం మొదలగువానితో రచింప దగును. అందును సువర్ణం రజతం, తామ్రం వీనితో చేయుట శ్రేష్ఠము. ఎత్తు లావు మొదలయిన కొలతలు కొంచెం తక్కువగా గావి, కొంచెం అధికముగాగాని చేయరాదు. అటుల చేసిరేని శుభ ఫలములకు బదులు దోషములుకలుగును. ఇట్లు వృషభమును రచించ వలయును.

శిల్పరత్నం ఉత్తర భాగం 21వ అధ్యాయమున $10\frac{1}{2}$ శ్లోకము లీతీరుననే యున్నవి. ఆట్టి అసంపూర్తి లక్షణమును వదలివేయడ మైనది.

### మానసార 62వ అధ్యాయము

శ్లో॥ వృషభస్యలక్షణంసమ్యగ్వక్ష్యతేవిధినాఽధునా
వాయోరభిముఖం స్థాప్య (పయేత్)పీఠేవాథోత్సవేఽపివా॥ 1
విమానేమండపేవాఽపి చాగ్రోపరిపరిన్యసేత్
ద్వారతుంగసమం శ్రేష్ఠం త్రిభాగంమధ్యమంభవేత్॥ 2

కన్యసంతుద్విభాగంస్యా త్త్రివిధంవృషభోదయమ్
ఏకహస్తంసమారభ్యచైకహస్తేనవర్ధనాత్॥ 3
నవహస్తాంతముత్సేధం కన్యసాదిత్రయంత్రయం
పంచవింశాంగులమారభ్యద్విద్వ్యంగులవివర్ధనాత్॥ 4
ఏకత్రింశతిమాత్రాంతం యత్ శుభాయాదిసంభవమ్
చరోత్సేధసమంశ్రేష్ఠం కర్ణాంతంమధ్యమంభవేత్॥ 5
బాహ్యాంతంకన్యసంప్రోక్త ముత్సవంవృషభోదయమ్
పీఠాయామేత్రిభాగైకం పీఠతారసమంతువా॥ 6
పీఠతారంత్రిపాదంస్యా త్త్రివిధంవృషభోదయమ్
పాదాదుష్ణీషసీమాంతం స్థానకంమానసంగ్రహమ్ 7
స్థానకంశయనంవాఽపి లోహజేవాశివేఽదవా
దార్వా[illegible]సరత్నేన సుధామృత్ శర్కరాదిభిః 8
ఘనంవాఽప్యఘనంవాఽపి కుర్యాత్తుశిల్పవిత్తమః
ఏవంతువృషభోత్సేధం పంచాదశాంగులంభవేత్॥ 9
ఉష్ణీషాత్తుగలాగ్రాంతం దశమాత్రంప్రశస్యతే
తస్యాధోవసుభాగంస్యాద్ గ్రీవతుంగమితిస్మృతమ్॥ 10
తస్యాధశ్చోరుమూలాంతం షోడశాంగులమేవచ
షడంగులంచోరుదైర్ఘ్యం ద్విమాత్రంజానుతుంగకమ్॥ 11
జంఘాదైర్ఘ్యంచోరుసమం ఖురోత్సేధంద్విమాత్రకమ్
గ్రీవాత్తుపుచ్ఛమూలాంతం చత్వారింశాంగులాయతమ్॥ 12
శృంగాయామంయుగాంగుల్యం శృంగతారంత్రిమాత్రకమ్
తదాష్టాంశైకభాగంస్యా చ్ఛృంగాగ్రస్యవిశాలకమ్॥ 13
ఫాలతారంనవాంగుల్యం ముఖతారంశరాంగులమ్
తత్సమంచోచ్ఛ్రియంకుర్యా న్నేత్రాయామంద్వ
యాంగులమ్॥ 14

అధ్యర్ధాంగులము త్సేధం నిర్గమంచార్ధమాత్రకం
నేత్రమధ్యేముఖాయామ మష్టాంగులమితిస్మృతమ్॥ 15

తస్మాత్కృకాటికాంతంస్యాత్ షణ్మాత్రింతదుదాహృతమ్
శృంగమధ్యంయుగాంగుల్యం భాలతుంగంతథైవచ॥ 16

నేత్రద్వయోశ్చమూలాంతం వేదమాత్రాంతరంభవేత్
శరాంశంశ్రోత్రదైర్ఘ్యంస్యా చ్ఛ్రోత్రమూలంద్విమాత్రకమ్॥ 17

తత్సమంవిస్తృతంచైవ మధ్యతారంయుగాంగులమ్
శివాంశమగ్రవిస్తారం నామర్ధాంగులంభవేత్॥ 18

అధ్యర్ధాంగులంసంప్రోక్తం నాసికాయామమేవచ
అంగులంసుషిరతారం తత్సమంనాసికాగ్రకమ్॥ 19

పంచాంగులమాస్యాయతం చోత్తరోష్ఠంత్రిమాత్రకమ్
అధరోష్ఠంద్విమాత్రంస్యా జ్జిహ్వాయామంగుణాంశకమ్॥ 20

తద్విస్తారంద్విమాత్రంస్యా త్తదర్ధంతద్ఘనంభవేత్
గ్రీవతారంతుపంచాంశం మూలతారంత్రిమాత్రకమ్॥ 21

పృష్ఠగ్రీవస్యమూలేతు ఘనమష్టాంగులంభవేత్
అగ్రంషడంగులంచైవ కుర్యాద్వ్యాసంషడంగులమ్॥ 22

తదుత్సేధంచతుర్మాత్రం గ్రీవాయాఃలంబనంబుధః
మూలమధ్యాగ్రవిస్తారం వేదబంధకలాంగులమ్॥ 23

ఘనమష్టాంగులోపేతం కుర్యాత్తత్రైవయోజయేత్॥
గ్రీవాయాఃపురతోబింబం మూలవ్యాసంద్వయాంగులమ్॥ 24

హృదయాన్మూర్ధపర్యంతం తదుచ్చంద్వినవాంగులమ్
పృష్ఠోచ్చంమనుమాత్రంస్యాత్ పృష్ఠతారంచతుస్త్రయమ్ 25

పృష్ఠోరుమూలవిస్తారం దశమాత్రంప్రశస్యతే
మధ్యమంచాష్టమాత్రంస్యా దగ్రంతుచతురంగులమ్॥ 26

శరాంగులంచోరుదైర్ఘ్యం స్యాజ్జానుతుంగంకలాంగులం
జంఘాయామంశరాంగుల్యం ఖురతుంగంద్విమాత్రకమ్॥ 27

శ్లో॥ సార్ధవహ్న్యంగులంజాను విస్తారం పరికీర్తితం
ఖురాయామంద్విమాత్రంస్యా త్పుచ్ఛమూలంద్వి
మాత్రకమ్॥ 28
అపరోరుదద్యోర్మధ్యే ముష్కశేఫోదరాన్వితమ్
స్కంధతారంషడంగుల్యం తస్యాధ ఊరువిస్తృతమ్॥ 29
మూలం వేదాంగులంప్రోక్త మగ్రంసార్ధగుణాంగులమ్
జానుతారంగుణాంగుల్యం తథాజంఘావిశాలమ్॥ 30
సార్ధంవాద్వ్యంగులంవాసి తత్సమంతత్ ఖురంభవేత్
శేషంయుక్త్యాచసంయుక్తం శ్వేతవర్ణేనశోభితమ్॥ 31
శ్వేతవర్ణనిభంభద్ర మగ్రంహికృష్ణసధూమవత్
వేదపాదఖురైరపికర్ణయోః శ్వేతరక్తసమగ్రమనోహరం॥ 32
శంఖశ్వైత్యైఃక్షణామరక్తంచమాలా కర్ణబంధైఃకర్ణ
రుద్రాక్షమాలా
అన్యైరుక్తం కింశుకపుష్పదామైః
వంశస్యోర్ధ్వేవ్యాఘ్రచర్మాభిరామమ్॥ 33
భృంగకోలకలలాటపట్టధృవ్ పత్రవల్లిబహురత్నశోభితమ్
కర్ణయోర్వపుః పార్శ్వచామరైః పాదనూపురస
భూషణాన్వితమ్॥ 34
ఇతి మానసారే వాస్తుశాస్త్రే వృషభలక్షణవిధాంనామ
ద్విషష్టితమోఽధ్యాయః

తా॥ వృషభమును రచించుటకు లక్షణములను కొలతలను చెప్పుచున్నాడు. వాయువ్యమును జూచునట్లు పడమర ముఖముతో పీఠముపైనగాని యుత్సవము చేయుటకు దగిన శకటముపైగాని, విమానమునగాని, మండపమునగాని, ద్వారరేఖపై నుంచవలయును

ద్వారము యొక్క యెత్తుతో సమానము శ్రేష్ఠము. ద్వారములో ముప్పాతికనందు మధ్యమము. ద్వారము యెత్తులో సగము అధమము ఇట్లు వృషభము యొక్క యెత్తును 3 విధములుగ జెప్పబడియుండెను. 1 హస్తము మొదలుకొని 1-1 హస్తమును పెంచుచు ఇట్లు 9 హస్తముల వఱకు ఎత్తును 9 విధములుగా జేయవచ్చును. మఱియు 25 అంగులములు మొదలుకొని 2 అంగులముల చొప్పున పంచుచూ 31 అంగులముల వఱకు గణిత ప్రకారం శుభాయము గల కొలతతో రచించవచ్చును. మూల పేర్పాటుతో సమానమైన యెత్తు చేయుట శ్రేష్ఠము. చెవితో సమానమైన యెత్తుమధ్యమము. భుజముల యెత్తు అధమం. ఇట్లు ఉత్సవమునకు వృషభం యొక్క యెత్తును చేయవల యును. పీఠము యొక్క పొడవును 3 భాగములుచేసి అందొకభాగం గాని, పీఠం యొక్క విస్తారముతో సమానముగాగాని, పీఠ విస్తార ములో ముప్పాతిక వంతుగాని యిట్లు 3 విధములుగా వృషభం యెత్తును చేయవచ్చును. పాదం మొదలుకొని కొమ్ముల చివర వఱకు స్థానకము చేయవలయును స్థానకంగాని, శయనంగాని, వెండిబంగారు మొదలగు లోహములతోగాని, శిలతోగాని, దారువుతోగాని, మందమైన వస్త్రం మీదగాని, రత్నముతోగాని, సున్నపు పాకముతో గాని, మట్టితోగాని, మెఱపశిలతోగాని. నిండురూపముగాగాని, లేక యొకవైపు మాత్రమే కనుపడునట్టి రూపముగాగాని. శిల్పా చార్యుని యిష్టానుసారముగా రచించవచ్చును. ఇట్లు వృషభం యొక్క యెత్తు అగును. కొమ్ముల చివరనుండి మెడ చివర వఱకు 10 అంగులములు, దాని క్రింద 8 భాగములు మెడ యెత్తు దాని దిగువ తొడ మొదలు వఱకు 16 అంగులములు తొడ పొడవు 6 అంగులములు మోకాలి యెత్తు 2 అంగులములు పిక్క 6 అంగుల ములు మోకాలి యెత్తు 2 అంగులములు పిక్క 6 అంగులములు పొడవు గిట్ట యెత్తు 2 అంగులములు మెడ నుండి తోక మొదలి

వఱకు పొడవు 40 అంగులములు కొమ్ము పొడవు 4 అంగులములు కొమ్ము విస్తారం 3 అంగులములు దానిని 8 భాగములు చేసి అందు 1 భాగం కొమ్ము చివర విస్తారం చేయవలయును. నొసలు విస్తారము 9 అంగులములు ముఖం యొక్క విస్తారం 5 అంగులములు ఎత్తు 5 అంగులములు కన్ను పొడవు 2 అంగులములు కన్ను యెత్తు 1½ అంగులం నిర్ణయం ½ అంగులం కన్నుల నడుమ ముఖం యొక్క పొడవు 8 అంగులములు అచటి నుండి తలవెనుక వఱకు 6 అంగులములు కొమ్ముల నడుమ సందు 4 అంగులములు నొసలు యెత్తు 4 అంగులములు. కన్నుల రెంటి నడుమ ముందు కొలుకుల నానుకొని సందు 4 అంగులములు. చెవి యొక్క పొడవు 5 భాగములు చెవి మొదలు 2 అంగులముల విస్తారము మధ్య విస్తారము 4 అంగులములు చెవి యొక్క విస్తారం 1 భాగం మందం ½ అంగులం ముక్కు పొడవు 1½ అంగులం ముక్కు రంధ్రము విస్తారము 1 అంగులము ముక్కుచివర 1 అంగులం నోరు పొడవు 5 అంగులములు పై పెదవి 3 అంగులములు క్రింది పెదవి 2 అంగులములు నాలుక పొడవు 3, అంగులములు విస్తారము 2 అంగులములు మందము 1 అంగులం మెడ విస్తారము 5 భాగములు మొదలు విస్తారం 3 భాగములు వెనుక మెడ మొదలు లావు 8 అంగులములు వెనుక మెడ చివర 6 అంగులములు ఎత్తు 4 అంగులములు మెడ యొక్క యెత్తు మొదలు నడుమ చివర విస్తారం వరుసగా 4-3-2 అంగులములు అగును. లావు 8 అంగులములు మెడ యొక్క ముందు ప్రతిమ మొదలు విస్తారం 2 అంగులములు ఱొమ్ము మొదలుకొని తలవఱకు ఎత్తు 18 అంగులములు వీపు యెత్తు 14 అంగులములు వీపు విస్తారం 13 అంగులములు వీపు తొడలు మొదలు విస్తారం 10 అంగులములు నడుమ విస్తారం 8 అంగులములు చివర 4 అంగులములు తొడ యొక్క పొడవు 5 అంగులములు మోకాలి యెత్తు 2 అంగులములు పిక్క పొడవు 5 అంగులములు గిట్ట యెత్తు 2 అంగులములు మోకాలు విస్తారం 3½ అంగులములు

గిట్ట పొడవు 2 అంగులములు లేక మొదలు 2 అంగులములు వెనుక రెండు తొడల నడుమ వృషణములు మేఢ్రం పొట్ట రచించవలయును మూపు విస్తారం 6 అంగులములు దాని క్రింద తొడ మొదలు విస్తారము 4 అంగులములు చివర $3\frac{1}{2}$ అంగులములు మోకాలు విస్తారం 3 అంగులములు పిక్క విస్తారం 3 అంగులములు గిట్ట $1\frac{1}{2}$ భాగము లేక 2 భాగములు చేయవచ్చును. మిగిలిన పనులు ఆలోచనతో చేయవలయును. తెలుపువన్నె ముఖ్యం కొమ్ములును, గిట్టలును నలుపుగాగాని నీలముగాని చేయవచ్చును. చెవులు తెలుపు యెఱుపు కలసి యుండవచ్చును. మెడలోని దండలు తెలుపు వన్నె కలిగి యుండవలయును. కర్ణబంధముగాని కర్ణమున రుద్రాక్షమాలగాని రచింపదగును. వేఱు ప్రదేశములయందు ఎఱ్ఱని పూలదండ లుండవచ్చును. నొసలు పట్టం పత్రతల్లితోగాని, రత్నహారములతోగాని ప్రకాశించునట్లు రచించవచ్చును. వృషభం యొక్క వెన్నుపై పులితోలు నుంచవలయును. చెవులు వింజామరమువలె నిక్కి యుండవలయును. పాదములకు నూపురములను రచించవలయును.

అపరాజిత 208 వ సూత్రము

శ్లో॥ నందీశ్వరంతతోవక్ష్యే యదుక్తంపూర్వమేవహి
తస్యస్వరూపసంస్థానం కథయామితుసంప్రతి 6
బ్రహ్మాద్యంవిష్ణుభాగాంతం కల్పయేత్తస్యచోచ్ఛ్రియమ్
పాదాధికోభవేజ్జ్యేష్ఠః కనిష్ఠఃపాదవర్జితః॥ 7
తదుచ్ఛ్రియంచవిభజేత్ భాగైఃపంచభిరేవచ
తత్రిభాగప్రమాణేన సప్తభాగాయతోభవేత్॥ 8
ద్విభాగంచభవేద్వక్త్ర మాత్యామేచోచ్ఛ్రియంవిదుః
అధోభాగేమస్తకస్య భోగసూత్రేచసక్థినీ॥ 9
శృంగంపాదంతువిస్తారే విస్తారాదుచ్ఛ్రియోఽధికః
శృంగాధశ్చార్ధభాగేన కర్ణఃపాదోనభాగికః॥ 10

భాగమేకంభ వేద్గ్రీవా పృథుకంబలతఃసహ
అక్షోభాగేమస్తకాచ్చ పృష్ఠస్కంధంచభాగికమ్॥ 11
త్రిభాగాయతకంపృష్ఠం త్రిభాగంపృథుకుక్షయోః
ద్విభాగముచ్ఛ్రయుదరం పరమూరుతద్విస్తృతమ్॥ 12
బాహుల్యంభాగమేకంతు జంఘాయుగ్మాంశకాయతా
అర్ధభాగైకమగ్రంచ ఖురికాచార్ధభాగతః॥ 13
పుచ్ఛమూలంభాగపాద మగ్రంకుర్యాత్తదర్ధతః
చతుర్భాగాయతంపుచ్ఛం భాగైకంచాగ్రచామరమ్॥ 14
తదుత్తమంచసోత్సాహం పాదైకంచోచ్ఛ్రితంక్రమాత్
ఘంటాచామరఘుర్ఘుర మాలాలంకారభూషితమ్॥ 15
శృంగాభరణమప్యేవం కుండికాగ్రేసమోదకా
మోదకావృషవక్త్రాగ్రే తావచ్చైవముపస్కరమ్॥ 16
ప్రాసాదమానతశ్చాంత ర్లింగస్థానాదికల్పితమ్
ఏకద్విత్రిచతుఃపంచ షట్సప్తాంగులకాంతరే॥ 17
మూర్తిస్థానేతుకర్తవ్యా మూలస్తంభైశ్చతుష్కికా
వృషస్యచోచ్ఛ్రయఃకార్యో విష్ణుభాగాంతదృష్టికం॥ 18
పాదంజానుకటింయావ దర్భాయావాహనస్యదృక్
గుహ్యనాభిస్తనాంతంవా సూర్యేవ్యోమస్తనాంతకమ్॥ 19
విలోమేకురుతేపీడా మధోదృష్టిఃసుఖక్షయమ్
స్థానంహాన్యేదూర్ధ్వదృష్టిః స్వస్థానేముక్తిదాయికా॥ 20
ఇతిసూత్రసందానగుణకీర్తి ప్రకాశప్రోక్త శ్రీ భావనదేవాచార్యోక్తాపరాజితపృచ్ఛాయాం చండీశ్వర (నందీశ్వర) వృషభలక్షణాధికారోనామాష్టోత్తర ద్విశతతమం సూత్రమ్॥

తా॥ పూర్వ శాస్త్రముల ప్రకారం నందీశ్వర లక్షణములను చెప్పుచున్నాడు. వృషభము యొక్క యెత్తు బ్రహ్మస్థానము మొదలు

విష్ణు స్థానం వఱకు చేయవలయును. అంతకంటె $\frac{1}{2}$ భాగం అధికముగా జేసిన యెడల శ్రేష్ఠము. లేక $\frac{1}{4}$ భాగం తగ్గించిన యెడల అధమము అని తెలియవలయును. వృషభము యెత్తును 5 భాగములు చేసి పొడవు 7 భాగములు చేయవలయును. ముఖము పొడవు యెత్తు 2 భాగములు తలయొక్క దిగువభాగ సూత్రమున తొడ కొమ్ము $\frac{1}{4}$ వంతు విస్తారం కంటె యెత్తు అధికం కొమ్ము దిగువ $\frac{1}{4}$ భాగమున చెవి $\frac{3}{4}$ భాగము కలిగి యుండవలయును. మెడ 1 భాగం గొప్ప గంగడోలుతో గూడ తలయొక్క దిగువ ప్రదేశమున పీపు మూపురం 1 భాగం పీపు 3 భాగముల పొడవు పీపులావు పొట్ట 3 భాగములు పొట్టనుండి పైన యెత్తు 2 భాగములు వెనుక తొడ విస్తారము మందం 1 భాగం పిక్క పొడవు 2 భాగములు మోకాలు $\frac{1}{2}$ భాగము గిట్ట $\frac{1}{2}$ భాగం తోక మొదలు $\frac{1}{4}$ భాగము పైన అందులో సగం విస్తారం తోక పొడవు 4 భాగములు చివర వెండ్రుకలకుచ్చు 1 భాగం సంతోషముతో నుండి నట్లును, ముందు ఒక కాలు నిలువబెట్టినట్లును ఘంటమువ్వలుకూర్చిన పట్టెడయును. కొమ్ములకు అందమైన ఆభరణములును సన్నని మెడ గల చెంబుపైన మోదకమును వృషభం యొక్క నోటియందు కుసుమములును. ఇట్లు అంతటను అలంకారముగ రచించవలయును. ఆలయము యొక్క కొలత ననుసరించి లోపల లింగం మొదలగు స్థానములను కల్పించవలయును. 1-2-3-4-5-6-7 అంగులములతో మూర్తి స్థానమున ప్రధాన స్తంభములతో నంది యెత్తునకు పైగా నుండునట్లు మండపమును రచించవలయును. లింగము నందలి విష్ణు స్థానముపై చూపు తగులునట్లు నంది యెత్తును చేయవలయును పాదం మోకాలు నడుము నాభి స్తనం ఈ ప్రదేశములలో దిగువ చూపు దుఃఖప్రదము పై చూపు స్థాననాశము కనుక సమప్రదేశమున చూపు ఉండునట్లు వృషభమును స్థాపించవలయును.

(అను బంధము 12 నుండి 21 వరకు గల పటములు చూడుడు)

## 28. చండనాధ లక్షణమ్

అపరాజిత 208వ సూ. విశ్వకర్మోవాచ

శ్లో॥ అథాతఃసంప్రవక్ష్యామి నందికేశ్వరలక్షణమ్
పాదోనోవాత్రిభాగోనో పీఠోచ్ఛ్రయమానతః॥ 1
ఉచ్ఛ్రయేచండకంకుర్యాత్ స్థూలంభీష్మాననంతథా
పిబంతంచతథామాక్షం వికృతాననమూర్ధ్వగమ్॥ 2
చండికాగ్రకేశైశ్చైవ నిబద్ధోపరిచండికా
హారకేయూరసంయుక్తం కంకణాభ్యామలంకృతమ్॥ 3
పదతశ్చాష్టమంగత్వా తపనాక్షంపద్మాకృతిమ్
రుచకంభద్రకంచైవ హంసంవావర్ధమానకమ్॥ 4
జగత్యుపరికుర్యాద్వై భాస్త్యైవవామతస్తథా
ఏవంవిధంతుకర్తవ్యం చండనాధస్యలక్షణమ్॥ 5

తా॥ నందికేశ్వరుని లక్షణమును చెప్పుచున్నాడు. పీఠము ననుసరించి యెత్తును చేయవలయును. బలిసిన శరీరమును భయంకరమైన ముఖమును అందము లేక పైకెత్తబడినదియును. తేనెను త్రాగుచున్నదియును అగు మొగమును, పైకి రేగిన తలవెండ్రుకలును ఆ తల వెండ్రుకలతో గూర్చుండిన చండికయును, మెడలో హారములును, బాహుపురులును, కంకణములును, పాదనూపురములును, ఎఱ్ఱని కన్నులును, రుచకము మొదలగు జగతులయందు ద్వారమున కెడమపైపున నుండునట్లు రచించవలయును.

## 29. ప్రాగ్ద్వార ప్రతీహారులు

అపరా॥ 213వ సూ. విశ్వకర్మోవాచ

శ్లో॥ మాతులింగంచనాగేంద్ర డమరుంశూలమేవచ
నదీముకుటశోభాఢ్యః సర్వాభరణభూషితః॥ 1

ఖట్వాంగంచకపాలంచ డమరుంబీజపూరకమ్
దంష్ట్రాకరాలవదనో మహాకాలస్తుదక్షిణే॥ 2

తా॥ నందీశ్వరునకు కిరీటమును సమస్తమైన ఆభరణములును, మాదీఫలము నాగపాశము డమరువు శూలము కలిగి ప్రాగ్ ద్వారము యొక్క యెడమ వైపున నుండవలయును. మహాకాలునకును సమస్తమైన ఆభరణములును కిరీటమును ఖట్వాంగము, కపాలం, డమరువు, అమృత కలశము, భయంకరమైన ముఖం కలిగి ప్రాగ్ద్వారము యొక్క కుడివైపున నుండవలయును.

## 30. దక్షిణ ద్వార ప్రతీహారులు

శ్లో॥ తర్జనీత్రిశూలంచైవ గదాండమరుకంతథా
హేరంబోవామభాగేహి భృంగిణందక్షిణేస్మృతః॥ 3
గదాడమరుఖట్వాంగం తర్జనీవామహస్తకే
ఉభౌవాదక్షిణద్వారే భృంగీదక్షిణతఃశుభః॥ 4

తా॥ దక్షిణ ద్వారం యొక్క యెడమప్రక్క హేరంబుడు తర్జని (బెదురు) త్రిశూలము, గద, డమరుకము, కిరీటం సమస్త భూషణములు కలిగి యుండవలయును. కుడి ప్రక్కను భృంగి కిరీటము సమస్తమైన భూషణములు, గద, డమరువు, ఖట్వాంగము, తర్జని, కలిగి యుండవలయును.

## 31. పశ్చిమద్వార ప్రతీహారులు

శ్లో॥ త్రిశూలండమరుంచైవ ఖట్వాంగంబీజపూరకమ్
పశ్చిమేదుర్ముఖోవామే తద్వక్త్రింగోముఖాకృతిః॥ 5
పశ్చిమద్వారికార్యఃస పాండురోஉస్యాధదక్షిణే
ఖట్వాంగంచకపాలంచ డమరుంబీజపూరకమ్॥ 6

తా॥ పశ్చిమ ద్వారము యొక్క యెడమవైపున దుర్ముఖుడు

గోముఖము కిరీటము సమస్తాభరణములు త్రిశూలము, డమరువు, ఖట్వాంగము అమృతకలశము కలిగియుండవలయును. కుడివైపున పాండురుడు గోముఖము, కిరీటము సమస్తాభరణములు, ఖట్వాంగము కపాలము, డమరువు, కలశము కలిగియుండవలయును.

## 32. ఉత్తర ద్వార ప్రతీహారులు

శ్లో॥ మాతులింగంమృణాలంచ ఖట్వాంగంపద్మఖండకం
సితశ్చోత్తరేద్వారే వామేచైవవ్యవస్థితః॥ 7
పద్మఖండంచఖట్వాంగం మృణాలంబీజపూరకమ్
ఆసితోదక్షిణేభాగే ఉత్తరేద్వారేఏవచ॥ 8

తా॥ ఉత్తర ద్వారము యొక్క యెడమవైపున సితుడు. కిరీటము సర్వాభరణములు. మాదీఫలము తామరకాండ ఖట్వాంగము పద్మఖండము కలిగియుండవలయును. కుడివైపున అసితుడు కిరీటము సమస్తాభరణములు పద్మఖండము ఖట్వాంగము తామరకాండ మాదీఫలము కలిగియుండవలయును.

## 33. శివరూప భేదములు అందు సుఖాసన లక్షణము

### కాశ్యప శిల్పము 50వ పటలము

శ్లో॥ సుఖాసనస్థితంబింబ ముమాస్కందయుతంద్విజ
తృతీయంచంద్రమూర్ధానం చతుర్థంవృషవాహనమ్॥ 16
పంచమంనృత్తమూర్తింతు గంగాధరమతఃపరమ్
సప్తమంత్రిపురారిఃస్యాత్ కళ్యాణసుందరం తథా॥ 17
నవమంచార్ధనారీశం దశమంగజహారిణమ్
తథాపాశుపతంవిద్యాత్ కంకాలంద్వాదశంస్మృతమ్॥ 18

త్రయోదశంహరిహరం భిక్షాటనంచతుర్దశమ్
చండేశ్వరప్రసాదంతు పంచదశముదాహృతమ్॥ 19
షోడశందక్షిణామూర్తిం తతఃకాలారిణంభవేత్
సర్వేషాంప్రతిమానాంతు మానమాదావదామ్యహమ్॥ 20

తా॥ శివరూప భేదములను చెప్పుచున్నాడు. 1. సుఖాసనము 2. సోమస్కందము, 3. చంద్రశేఖరము, 4 వృషవాహనము 5. నృత్తమూర్తి 6. గంగాధరము 7. త్రిపురారి 8. కళ్యాణసుందరము 9. అర్ధనారీశ్వరము 10. గజాంతకము 11. పాశుపతము 12. కంకాలము 13. హరివారము 14. భిక్షాటనము 15. చండేశ్వరానుగ్రహము 16. దక్షిణామూర్తి 17. కాలారి ఇట్లు వివరించి చెప్పబడి యున్నవి.

కాశ్యప శిల్పము 61వ పటలము

శ్లో॥ అథవక్ష్యే విశేషేణ సుఖాసనవిధింపరం
ఆర్జవంరాజసంభావం భద్రపీఠంసుఖాసనమ్ 1
వామాంఘ్రింశాయయేత్పీఠే దక్షిణాంఘ్రింతులంబయేత్
ఊర్ధ్వభాగోపరిష్టాత్తు సార్ధవేదాంగులాధికమ్॥ 2
స్ఫిక్పిండమానమేతద్ధి ఆసీనోర్ధ్వవిశేషతః
ఆసనేపూర్వకేశాంతం జాన్వోర్బాహ్వవసానకమ్॥ 3
జానూర్ధ్వంపూర్వకేశాంతం జానుబాహుగ్రివాస్యకమ్
పరహస్తమణిబంధం మధ్యమంచసమంభవేత్॥ 4
ఆసీనేనస్వసూత్రేఽస్తి పూర్వసూత్రేఽధునాశృణు
మౌళిమధ్యంతునాసాగ్రాత్ స్తనాభంనాభిమధ్యమమ్॥ 5
వామాంఘ్రిగుల్ఫమధ్యేతు బ్రహ్మసూత్రంప్రలంబయేత్
సూత్రాద్దక్షిణజాన్వంత మేకత్రింశాంగులంభవేత్॥ 6
అథవాత్రింశదంగుల్యం ఏకోనత్రింశతోఽపివా
సూత్రాత్తదంఘ్రినలకా ద్వ్యాఽతరంద్వాదశాంగులమ్॥ 7

త్రయోదశాంగులం వాఽథ దశాంగులమథాపి వా
పీఠంనాదంప్రపార్ష్ణ్యోస్తు నీవ్రంద్విత్ర్యంగులంతు వా॥ 8

తత్సూత్రాన్మధ్యమే హస్తే మధ్యరేఖావసానకం
చతుర్దశాంగులం ప్రోక్త మంతరంతు ద్విజోత్తమ॥ 9

ఊర్ధ్వే మణిబంధాంతం నీవ్రంద్విత్ర్యంగులంతు వా
కటకంసింహకర్ణం వా తత్రస్థం ప్రవిధీయతే॥ 10

తర్జన్యాదికనిష్ఠాంతం తత్రాంగుల్యస్తువక్రగాః
ఈషద్వక్రం తదంగుష్ఠ మేవం స్యాత్కటకాకృతిః॥ 11

మధ్యామధ్యతలాంతంతు అర్ధమర్ధం త్వనామికా
వక్రం శేషాంగులం ప్రాగ్వత్ సింహకర్ణమిదంపరమ్॥ 12

హిక్కాసూత్రంసమంకుర్యా త్కర్తవ్యాగ్రాకరేపరే
వక్రావనామికాంగుష్ఠౌ తలమధ్యావసానకౌ॥ 13

కించిద్వక్రాకనిష్ఠాఽపి శేషౌద్వౌతు ఋజుక్రియా
కర్తవ్యాఽకృతిరేవంస్యా ల్లక్షణాంచితసుందరమ్॥ 14

కూర్పరం శ్రోణిపార్శ్వే తు పంచషట్సప్తమాకృతిమ్
కుక్షిమధ్యే చనాసాగ్రే పూర్వసూత్రంతుసంస్పృశేత్॥ 15

మేఢ్రమూలంతు వామాంఘ్రి గుల్ఫమధ్యం రసాంగులమ్
అథవా సప్తమాత్రంతు పంచమాత్రమథాపి వా॥ 16

నాభిమధ్యంతు వామాంఘ్రి నలికాగ్రంచతుర్దశ
త్రయోదశాంగులం వాఽథ భాన్వంగులమథాపి వా॥ 17

ఫాల్యగ్రమధ్యమాత్సూత్రం ద్వ్యంతరమనుమాత్రకం
సార్ధత్రయోదశం వా త్రయోదశాంగులమేవ వా॥ 18

ఋజుగతంసుఖాసీనం ప్రవాలసదృశప్రభమ్
త్రినేత్రంసుస్థవదనం సన్నం రాజసంగుణమ్॥ 19

వ్యాఘ్రాజినాంబరోపేతం దుకూలవసనాన్వితమ్
కర్తరీపరహస్తాద్వా బాహ్యేవాఽభ్యంతరాసనమ్॥ 20

తా॥ సుఖాసన విధిని చెప్పుచున్నాడు. రాజ సభావము గల ఋజుత్వమును, భద్రపీఠముపై సుఖాసనమును ఎడమకాలు పీఠమును అడ్డముగా మడిచికొని యుండుటయును కుడికాలు లంబమును పై భాగమున పైన నుండుటయును $4\frac{1}{2}$ అంగులములు ఎక్కువ. ఇది సిరుదుల యున్నది. ఆ సీనముపైన నుండవలయును. ఆ సనమున పూర్వకేశముల వఱకును మోకాళ్ళ యొక్క వెలుపలి వఱకును మోకాళ్ళపై నుండి ముందు కేశముల వఱకును మోకాలు భుజము, మొదనోరు, పై చేయి యొక్క మనికట్టు నడుముతో సమానముగా నుండవలయును. ఆసీనమున స్వసూత్రంనందు ముందు సూత్రమును చెప్పుచున్నాడు. హాళిమధ్యమునాసాగ్రము నుండి స్తనములతో సమానము నాభిమధ్యమము ఎడమకాలి చీలిమండ నడుము. ఇట్లు బ్రహ్మసూత్రముండవలయును. ఆ సూత్రమునుండి దక్షిణపు మోకాలి వఱకు 31 అంగులములుండవలయును. లేక 30-29 అంగులము లుండదగును. ఆ సూత్రమునుండి రెండు పాదముల చీలిమండ పై భాగమున సందు 12 అంగులములుండవలయును లేదా 13-10 కూడ నుండవచ్చును. పీఠము నాదము చీలిమండ యొక్క ఉబ్బరము నిర్గమము 2-3 అంగులములు బ్రహ్మసూత్రమునుండి నడుమ హస్తమునందలి మధ్యరేఖ వఱకు 14 అంగులములు సందు తొడల సందు మనికట్టువఱకు నిర్గమము 2-3 అంగులములుండవచ్చును. కటకమును గాని సింహకర్ణమునుగాని అచట రచించవలయును. తర్జని వ్రేలు మొదలు కనిష్ఠపు వ్రేలి వఱకు నాలుగువ్రేళ్ళను వంకరగా నుండవలయును. బొటనవ్రేలు కొంచెము వంగి యుండవలయును. మధ్యను ప్రక్కలను అరచేయి కడపటి వరకు సగము సగము అనామిక వ్రేళ్లుండవలయును. మిగిలిన వ్రేళ్ళు పూర్వము చెప్పినట్లు వంగియుండ

వలయును. ఇది సింహాకర్ణ మగును. అక్కలి సూత్రమును సమానముగా ముందును వెనుకను చేయవలయును. అనామిక అంగుష్టములు వంకరగను చీలమండపై భాగము వఱకును చిటికెనవ్రేలు కొంచెము వంపును మిగిలిన రెండు వ్రేళ్ళును చక్కగా నుండవలయును. ఇట్లు లక్షణ యుక్తముగా సుందరముగా నుండవలయును. మోకాలు పిఱుదు ప్రక్కను 5, 6, 7 అంగులములును, పొట్ట నడుము ముక్కుచివర పూర్వసూత్రమును తగులునట్లు చేయవలయును. మేఢ్రమూలము ఎడమకాలి చీలిమండ నడుమ 6 అంగులములు లేక 7, 5 అంగులములుండవచ్చును. బొడ్డు నడుము ఎడమకాలి చీలిమండ పై భాగము 14 అంగులములు లేక 13, 12 అంగులములు కల్పించవచ్చును. మౌళి యొక్క నడుము నుండి సూత్రము రెంటి సందు 14 అంగులములు 13½, 13 అంగులము లుండవచ్చును. ఏ ప్రక్కకు ఒరగకుండా కాలి మీద కాలువేసికొని పగడమువంటి కాంతితోను మూడు కన్నులతోను, చక్కని ముఖముతోను, రాజసగుణముతోను, పులితోలు వస్త్రమును, దుకూలవస్త్రములును, పై చేతులు కర్తరీ హస్తముతోను (అనగా అనామిక వ్రేలిని ముడిచి తర్జని వ్రేలిని యెడముగా జేసి మిగిలిన నాలుగు వ్రేళ్ళను చాచబడినది) [శివుడు జడంధరాసుర సంహారము కొఱకు భూమిలో మధ్యమ ముంచి తర్జనిచే చక్రమును వ్రాసెను.] వెలుపలగాని లోపలగాని ఆసనమును చేయవచ్చును.

శ్లో॥ దక్షిణేపరశుంవామే కృష్ణాంహస్తేసముద్ధృతమ్
అభయందక్షిణంవామం కటకంసింహాకర్ణవత్॥ 21
వామేకర్ణవిశేషేణ శంఖపాత్రంనిధాపయేత్
త్రిచతుష్పంచమాత్రంవా పంచమండలవిస్తృతమ్॥ 22
కర్ణనాలఘనంచైవ త్రిగుణంపత్రవిస్తృతమ్॥
ఏవంపత్రఘనంప్రోక్తం శ్వేతభాన్వాది మార్దవమ్॥ 23

దక్షిణేమకరాస్యంవా కుండలంసింహమేవవా
కుండలంవ్యాసతుంగంతు త్రిచతుష్పంచమాత్రకమ్॥ 24
యుక్త్వాతత్కుండలంకృత్వా కర్ణస్కంధోపరిన్యసేత్
అథవాకర్ణయోర్విప్ర వృత్తకుండలకంన్యసేత్॥ 25
వృత్తకుండలవిస్తారమష్టాదశయవంభవేత్
వేదాంగంగులంమతత్తుంగం కుంభాబ్జంముకులోదయమ్॥ 26
అన్యద్వాసుందరోపేతం కల్పయేద్వృత్తకుండలమ్
జటామకుటసంయుక్తం యుగ్మసంఖ్యాజటాన్వితమ్॥ 27
మకుటస్యోదయంవిప్ర చతుర్వింశాంగులంభవేత్
త్రిసప్తాంగులతుంగంవా ద్వినవాంగులమేవవా॥ 28
కేశాంశ్చమకుటంచాపి లలాటేపట్టసంయుతం
ముఖాంతసదృశంవిప్ర మకుటమూలవిశాలతమ్॥ 29
తత్సప్తాష్టనవాంశేన హీనమగ్రవిశాలకమ్
చతుష్పూరిమసంయుక్తం భాన్వంశంపూరిమోదయమ్॥ 30
సల్యేనాగార్కపుష్పైశ్చ వామేత్వర్ధశశింన్యసేత్
దక్షిణేశర్ధంతా వామేనాగార్కపుష్పధృత్॥ 31
కటిసూత్రత్రిసంఖ్యాది సూత్రంప్రతియవంస్వనం
కటిసార్ధోపరిష్టాత్తు కటిసూత్రంతుబంధయేత్॥ 32
పంచషట్సప్తమాత్రతా కీర్తిమానసవిస్తృతమ్
తద్విస్తారసమోత్తుంగం మేఢ్రోర్ధ్వంపరికల్పయేత్॥ 33
కటిసూత్రాదూరుదామ మూరుత్రయావసానకమ్
ముక్తాదామోరుదాతుస్యాదంతరేరత్నసంయుతమ్॥ 34
కటిసూత్రంసమాఖ్యాతం కటకంవలయాన్వితం
కటకంవలయోపేతం ప్రకోష్ఠంద్విజసత్తమ॥ 3
కనిష్ఠాంగుళిపరీణాహం వలయంమార్దవంహితం
అథవావలయస్యైవ ఘనంద్విత్రియవంతువా॥ 36

పరాజితంతువలయం యుగ్మం ప్రకోష్ఠేనిధాపయేత్
మార్గవంరత్నబంధంవా కృత్వాతులవలయేద్విజ॥ 37
కేయూరంకూర్పరేస్యస్య మకుటంచఘనాన్వితమ్
ఏకాకారంతుకేయూరం వాఽష్టపత్రాబ్జసంయుతమ్॥ 38
నానారత్నసమాయుక్తం శైలవాహమథాపివా
పత్రపూరిమసంయుక్తం బాహుమధ్యేద్విజోత్తమ॥ 39
పత్రపూరిమనాలంతు కేయూరసదృశంఘనమ్
తత్పూరిమాదధోనాలం బాహుద్విత్రిపరంతువా॥ 40
త్రిచతుష్పంచమాత్రంవా పత్రపూరిమవిస్తృతం
తద్వ్యాసార్ధమాత్రతుంగం పాదోనంద్విగుణంతువా॥ 41
ద్విగుణంవాపితుంగంతు తద్బాహువలయంభవేత్॥

తా॥ కుడిచేత పరశువు ఎడమచేత, వేడికుడిచేత అభయం ఎడమ చేత కటకాముఖము (చూపుడు వ్రేలిని నడిమి వ్రేలితోను బొటన వ్రేలితోనుచేర్చి అన్ని వ్రేళ్ళను లోపలికి వంచుట) ఎడమ కర్ణమున శంఖపత్రము 3, 4, 5 అంగులములు ఐదు మండలముల విస్తారము కర్ణనాలము యొక్క మందం కలిగియుండవలయును. పత్రం యొక్క విస్తారము 3 రెట్లు కలిగియుండదగును. పత్రము యొక్క మందమును ఇట్లు చెప్పియుండిరి. తెల్లగాను సూర్యునివలె మృదువుగాను ప్రకాశించవలయును. కుడి చెవి కుండలము సింహముతో నుండవల యును. కుండలము యొక్క విస్తారము యెత్తు 3, 4, 5 అంగులములు ఇట్లు చేసి కర్ణస్కంథముపై నుంచవలెను. లేక రెండు చెవులకు గుండ్రని పోగులు చేయవచ్చును. వృత్త కుండలములయొక్క విస్తారం 18. యవలుండవలయును. వాని యెత్తు 4 అంగులములు కుంభము పద్మము ముకులము లేక ఇష్టం వచ్చిన అందముతో రచించవచ్చును జటాజూటముతో గూడిన జంట జడలును ముకుటము యెత్తు 24 అంగులములు 21 అంగులముగాని 18 అంగులములుగాని చేయవచ్చును కేశములనే ముకుటముగాగాని చేయదగును. లలాటమున పట్టమును

రచించవలయును. ముఖాంతముతో సమానము కూటము యొక్క మొదలు విస్తారమును, దాని విస్తారములో 7, 8, 9 వంతులు తగ్గించి పైన విస్తారమును చేయదగును. నాలుగు పూరిమములతోను 13 భాగములు పూరిమము యెత్తును కుడివైపున నాగుడును, జిల్లేడు పూలును, ఎడమ వైపున బాలచంద్రుడును లేక దక్షిణమున సగము చంద్రుడును ఉత్తరమున సర్పమును జిల్లేడుపూలును, కటి సూత్రము మూడు వరుసలును, ఒక్కొక్క పేట లావు 1. యవ కటి యొక్క 1½ అంగులముపైన కటి సూత్రబంధమును రచించవలయును. 5, 6, 7 అంగులములు కీర్తి ముఖము యొక్క విస్తారము ఎత్తు విస్తారముతో సమానము చేయవలయును. మేఢ్ర స్థానముపై రచించవలయును. కటి సూత్రమునుండి యూరుదామము ఊరువుల మూడింటి వఱకును ముత్తెపుదండ రత్నహారము కటిసూత్రము చేయవలయును. కటకము గుండ్రముగా నుండవలెను. ముంచేతి యందు కడియ ముండవలయును, చిటికెనవ్రేలు మూపున కడియము యొక్కలావు చేయవలయును. లేక 2, 3, యవలమందము చేయవచ్చును. పరావృత్తమున కడియములు ముంజేతులకు రెండు చేయవలయును. మందమైన రత్నబంధమును కడియమునకు జేయదగును. మోచేతిపైన బాహుపురిని గొప్ప కిరీటమును ఒక్కటై రూపము గలవే యూరమును 8 పత్రములు గల పద్మముతో గాని, అనేక రత్నములను గూర్చిగాని, పర్వతమునగాని, వాహనముపై గాని, యున్నట్లును లేక పత్రపూరిమమున పత్రపూరిమనాలము కేయూరముతో సమానమైన లావులు, ఆ పూరిమమునకు దిగువ నాలము భుజములకు 2, 3 అంగులములు పైనగాని, 3, 4, 5 అంగులములు విస్తారమును ఆ విస్తారములో సగం యెత్తు, లేక 1¼ తక్కువగా రెట్టింపు రెట్టింపు ఇట్లు బాహువలయమును రచించవలయును.

శ్లో॥ మధ్యాంగుల్యావినా శేషాః స్వాంగుపీముద్రికాన్వితాః
ముద్రికామూలపర్వస్థా వృత్తాయావసనాన్వితమ్॥ 42

ఉదరంబంధంవిశాలం చైకద్విత్రియుగంతువా
యవంవాద్వియంవాఽథ ఉదరంబంధనంభవేత్॥ 43
నానాలంకారసంయుక్తం నానారత్నైర్విచిత్రితం
నాభేరూర్ధ్వేగుణాంశంతు నీత్వావాదారువర్ధయేత్॥ 44
పాదయోర్మధ్యమాదన్యాః స్వాంగుల్యోవలయాన్వితాః
జాలకవద్ద్వయఘనం స్వాంగులానాంతుమధ్యగమ్॥ 45
పాదౌజాలకయుక్తౌహి గుల్ఫజస్థౌద్విజోత్తమ
జాలకాబంధసూత్రంతు యవద్వయఘనాన్వితమ్॥ 46
తత్సూత్రజాలనాలంస్యాత్త్రిపంచయవమానకం
త్రియవంజాలకానాలం శేషంవైజాలకోదయమ్॥ 47
తస్మిన్నతసమంవ్యాసం యవమానంచతత్సమం
శేషంహీనంఘనంగాఢం యస్యయచ్ఛాయధోచితమ్॥ 48
గాఢావృతంతుయుక్తంస్యాదంతఃపాషాణసంయుతం
ఘనంపాషాణహీనంతు గాఢనిమ్నంతదోచ్యతే॥ 49
పరశ్వోర్హారిణీదీర్ఘం షాన్వాంగులముదాహృతం
పరశుంహారిణీంచైవ యుక్త్వావాద్వయమాచరేత్॥ 50
యజ్ఞోపవీతసంయుక్తం యవాష్టాంశంఘనంభవేత్
ఉపవీతద్విసూత్రంస్యాదుపవీతసమంఘనమ్॥ 51
వాసఃస్కంధోపరిన్యస్య నాభ్యధస్త్వంగులంభవేత్
యజ్ఞోపవీతసూత్రంస్యాన్నాభేర్దక్షిణపార్శ్వకే 52
అపరేవామమాశ్రిత్య యజ్ఞసూత్రంనిధాపయేత్
ఊరుసూత్రంసమాలంబ్య స్తనాదష్టాంగులోత్తరమ్॥ 53
యజ్ఞోపవీతమేవంస్యాచ్ఛిన్నవీరమథశ్రుణు
యజ్ఞోపవీతంస్యాద్విప్ర స్కంధయోరుభయోరపి॥ 54

పార్శ్వయోశ్చైవ శ్రోణ్యగ్రే న్యస్య స్తనాంతరైకవత్
గ్రీవాహారం విజానీయా ద్ధిక్కాధస్తాత్ షడంగులమ్॥ 55
లంబే వేదాంగులం తారం యవత్రయఘనాన్వితమ్
నానారత్నైర్విరచ్యైశ్చ హారం కృత్వాతు సుందరమ్॥ 56
హిక్కాసూత్రోపరిష్టాత్తు ఉపగ్రీవం చ బంధయేత్
రుద్రాక్షం వా౽థ రత్నం వా హేమసూత్రమథాపి వా॥ 57
ఉపగ్రీవం సమాయుక్తం నానాపుష్పవిరాజితం
సర్వాంగసుందరం దేవం శేషం యుక్త్యా సమాచరేత్॥ 58
ఏవం సుఖాసనం ప్రోక్తముమాస్కంద యుతం తథా॥ 59

ఇతి కాశ్యపశిల్పే సుఖాసనం నామైకషష్టితమః పటలః

తా॥ నడిమివ్రేలు తప్ప మిగిలిన నాలుగు వేళ్ళకు ఉంగరములును ఆ యుంగరము మొదటి కణుపు నానుకొని యుండవలయును. ఉంగరము పొట్ట 2 యవల యెత్తును విస్తారము 1, 2, 3, 4 యవలును అనేక రత్నములతో రచించవచ్చును. ఉదర బంధము 1, 2 యవలును నాభికి పైనను 3 భాగములుంచి యనేక మణులతో చేయవలయును. పాదముల వేళ్లకు ఉంగరములు పాదములకు కడియములును ఆకడియములు చీలమండలమీద మొగ్గలతో నుండవలయును. జాలక బంధ సూత్రము 2 యవల వుండదగును. ఆ సూత్రజాలము యొక్క కాడ 3, 5 యవలుండవచ్చును, 3 యవలు జాలనాలమును మిగిలినది జాలకము చివర ఎత్తు విస్తారము సమముగా 1 యవమాత్రముండదగును. మిగిలినవి తక్కువ లావు అధికము ఎక్కడెక్కడ యెట్లుండవలయునో అట్లు చేయవచ్చును. పెద్ద కడియమునకు లోపల రాళ్ళుండవలయును. లోపల బోలు లేకుండ గట్టిది చేసినచో రాళ్ళక్కఱలేదు. గాఢ నిర్గమముమాత్రము అవసరము. పరశువుయొక్కయు వేడియొక్కయు పొడవు 12 అంగులముల చొప్పున నుండవలెను. ఆ

గండ్ర గొడ్డలిని వేడిని ఆలోచనతో రచించవలెను. జందెమును యవలో 8వ వంతు చేయవలయును ఒక్కొక్క పేట విడినప్పుడు అన్నియును ఒకటే లావున నుండవలయును. ఎత్తును లావును ఒకటి గనే యుండవల యును. ఉత్తరీయము మూపుపైనను బొడ్డుకు దిగువ 1 అంగులము వఱకును ఉండవలయును. జందెము బొడ్డు యొక్క కుడివైపున క్రిందనుపైన యెడమవైపుగా భుజముపైకిని రచించవలెను. తొడల యొక్క సూత్రము నుండి స్తనములకు పైన 8 అంగులము లుండును. ఇక ఛన్న వీరమును జెప్పుచున్నాడు. జందెము మూపుపై నుండి రెండవ ప్రక్కకు పిఱుదు సగము వఱకు వచ్చి ముందు వైపునను స్తనముల సందుగావచ్చి తొడనడుమ కలియును. మెడలోదండ అక్కిలి దిగువ 6 అంగులములుండ వలయును. లంబమున విస్తారము 4 అంగులములు 3 యవలలావు అనేక మణులతోను బంగారముతోను హారమును అందముగా రచించ వలెను. అక్కిలి సూత్రముపైన కంఠ మాలను రుద్రాక్షులతోగాని రత్నములతోగాని బంగారు తీగెతో రచించదగును. అనేక పుష్పములతో గూడ హారములను రచించ వచ్చును. దేవుని సమస్త అవయవములును హారకేయూరాదులును ఆలోచనలతో అందముగా రచించ వలయును. ఇది సుఖాసన మూర్తి లక్షణము. ఇక సోమస్కందమూర్తి లక్షణము చెప్పుచున్నాడు. ఉమామహేశ్వర లక్షణము శిల్ప సంగ్రహము "పంచవక్త్రం మహాకాయం త్రినేత్రం మకుటోజ్జ్వలం గంగాధరం చంద్రచూడం భస్మాంగం నాగకుండలం దశబాహుసమాయుక్తం ఖట్వాశంకపాలినం సారంగమభయంవరదం శూలఖడ్గదాగాధరండమరుంకుండలీ భూషం ఉమావామాంకధారిణం ఉమామహేశ్వరంధ్యాయే ఇష్టకామ్యార్థ సిద్ధయే॥ (27)

(అనుబంధము 22వ పటము చూడుడు)

# 34. సోమస్కందమూర్తి లక్షణము

## కాశ్యప శిల్పము 62వ పటలము

శ్లో॥ అథవక్ష్యేవిశేషేణ సోమస్కందేశ్వరంద్విజ
సుఖాసనంయథాప్రోక్తం తథైదంచవిధీయతే॥ 1

దేవస్యవామపార్శ్వేతు పార్వతీంచనీసుఖాసనాం
కాయయేద్దక్షిణంపాదంవామపాదం ప్రలంబయేత్ 2

ఆసనస్యోపరిష్టాత్తు స్ఫిగుచ్ఛంచతురంగులం
ఊర్ధ్వకాయసమాయుక్తం మానస్యోపరికల్పయేత్॥ 3

కించిద్దేవ్యాశ్రితంవక్త్రం లక్షణంభాగసంయుతం
వరదంవామహస్తేతు ఉత్పలందక్షిణేకరే॥ 4

కించిద్వక్రోయథాపూర్వో వామహస్తాతథోర్ధ్వకే
వరదంచాభయంఖ్యాతం పృథక్సింహాస్యకర్ణవత్॥ 5

వామాంకేస్థాపయేద్దేవీం సర్వాభరణభూషితాం
రక్తాంబరధరాందేవీం ఛన్నవీరసమన్వితాం॥ 6

అథవాఽన్యప్రకారేణ దేవీభంగంవదామితే
వామోరౌబాహ్యపీఠేతు వామహస్తతలంన్యసేత్॥ 7

పశ్చాదుత్పలసంయుక్తం దక్షిణంహస్తముచ్యతే
పీఠేతుదక్షిణేజానౌ కించిదుచ్ఛ్రితసంయుతమ్॥ 8

త్రిచతుష్పంచమాత్రంవా పీఠజాన్వంతరంభవేత్
షట్సప్తాష్టాంగులంవాఽథ పీఠజాన్వంతరంభవేత్॥ 9

ఏవంద్వివిధమిత్యాహు ర్దేవీభంగంవిధీయతే
శ్రీమతాచోక్తమార్గేణ దేవీమానంతుగృహ్యతామ్॥ 10

స్థానకానాంతుదేవేశ దేవీచస్థానకంభవేత్
ఆసనేత్వాసనంఖ్యాతం విపరీతం విపత్కరమ్॥ 11

దేవీలక్షణమేవంవా స్కందలక్షణముచ్యతే
దేవీదేవేశయోర్మధ్యే స్థాపయేత్ స్కందమూర్తికామ్॥ 12
దేవ్యాహిక్కావసానంతు స్కందమానంతదుత్తరం
స్తనాక్షాంతంకనిష్ఠంస్యా త్తయోర్మధ్యేఽష్టభాజితే॥ 13
నవధాస్కందమానంతు ఉత్తమావంత్రయంత్రయమ్
జాత్యాభాసయుతంవాఽపి హీనంవాఽపిప్రకల్పయేత్॥ 14
సవేదరసధర్మాంశం తన్మానంతువిధీయతే
ఏకాంశమంగులంఖ్యాతం తదష్టాంశంయవంభవేత్॥ 15
ఏకాంగులంశిరోమానం కేశాంతంచైవతత్సమం
త్రిభాగంనేత్రసూత్రాంతం పుటాంతంచైవతత్సమమ్॥ 16
గుణాంశంహనుసీమాంతం గ్రీవోచ్చంతుద్వయాంగులమ్
హిక్కాసూత్ర స్తనాంతంతు నవభాగముదాహృతమ్॥ 17
తస్మాన్మధ్యావసానంతు వస్వంగులముదాహృతం
నాభేస్తుమేఢ్రమూలాంతం సప్తమాత్రమితిస్మృతమ్॥ 18
భాన్వంశమూరుదీర్ఘంస్యా జ్జానుద్వ్యంగులకంభవేత్
జంఘాచోరుసమంతుల్యం ద్వ్యంశంపాదతలోన్నతమ్॥ 19
దశాంశాంఘ్రితలాయామం బాహుదీర్ఘంచతుర్దశ
ప్రకోష్ఠాయామందశాంశం తలంవేదాంగులంభవేత్॥ 20
యుగాంశంమధ్యమాంగుల్యం సార్ధాగ్న్యంశమనామికా
తత్సమంతర్జనీదీర్ఘం కనిష్ఠాయాంగుణాంగులమ్॥ 21
అంగుష్ఠాయామమగ్న్యంశం యుగాంశంనలవిస్తృతం
ప్రకోష్ఠాగ్రంగుణాంశంతు తన్మూలంచతురంగులమ్॥ 22
భూతాంశం బాహుమూలంస్యా ద్విస్తారంద్విజసత్తమ
సార్ధాష్టాంశంముఖవ్యాసం సప్తాంశంకర్ణవిస్తృతమ్॥ 23

కక్షయోరంతరవ్యాసం త్రయోదశాంగులంభవేత్
పంచాంశంహృదయవిస్తారం రుద్రాంశంమధ్యవిస్తృతమ్॥ 24

శ్రోణిస్థానేతుభాన్వంశం కటిస్థానేత్రయోదశ
ఊరుమూలవిశాలంతు వస్వంగులముదాహృతః॥ 25

షడంగులంజానుతారం జంఘామూలంయుగాంగులమ్
గుణాంశంనలకంతారం షడంశంనలవిస్తృతమ్॥ 26

పార్ష్ణివ్యాసంయుగాంశంవా శేషంయుక్త్యాతుకల్పయేత్
కేశాంతేనాసికోపేతం కరండముకుటాన్వితమ్॥ 27

ఉభయోర్హస్తయోఃపుష్పం వామేవరదమేవవా
కటకంవాఽథతద్ధస్తం సింహకర్ణమథాపివా॥ 28

దక్షిణేపుష్పహస్తంవా కపిండముభయంతువా
కటిసూత్రధృతంనగ్నం ఛన్నవీరసమన్వితమ్॥ 29

మృదుకచంచోపగ్రీవం బాలభూషణభూషితం
అసీనంవాస్థితంవాఽథ నృత్తంవాస్కందమాచరేత్॥ 30

ఆసీనౌచరణౌద్వౌద్వౌ విష్టరోపరిశాయయేత్
స్థితౌపాదతలౌద్వౌతు స్థలభంగమితిస్థితౌ॥ 31

చరణౌకుంచితౌభౌతు యుక్త్యాజానోర్హ్వశ్చనీవ్రకం
ద్విపాదౌకుంచితౌకించిత్ కించిద్గమనమేవవా॥ 32

నృత్తంచేత్స్వస్తికఃసవ్య పాదంవక్రసమన్వితం
ఉద్ధత్యవామపాదంతు పీఠోత్సేధంకలావధి॥ 33

షణ్మాత్రపంచమాత్రాంతం పాదముద్ధరతోద్విజ
ఫలేనావరదంవామం హస్తమన్యంతుసూచితమ్॥ 34

అథవా వామహస్తంతు ఫలంవ్యన్యప్రసాదయేత్
హికాసూత్రే సమేధృత్వా కర్ణబంధోర్ధ్వసీమకమ్॥ 35

ద్వ్యాంతరంలంబ సూత్రంతు నృత్తమూర్తివదాచరేత్
ఉమాస్కందయుతంప్రోక్తం శ్రుణుచంద్రధరారిధృత్॥ 36

ఇతి కాశ్యపశిల్పే ద్విషష్టితమః పటలః

అపరా 213వ సూ.

శ్లో॥ ఉమామహేశ్వరంవక్ష్యే ఉమయాసహాశంకరం
మాతులింగంత్రిశూలంచ ధృతందక్షిణఃకరే॥ 25
ఆలింగన్వామహస్తేన నాగేంద్రంచద్వితీయకే
హారస్కంధేఉమాహస్తం దర్పణంద్వితయేకరే॥ 26
అధస్తాద్వృషభంకుర్యాత్ కుమారంచగణేశ్వరమ్
భృంగిరిటింతథాకుర్యా న్నిర్మాంసంనృత్తసంస్థితమ్ 27

మయమతమ్

"శాంతంపద్మాసనస్థం శశధరమకుటం పంచవక్త్రంత్రినేత్రం
శూలంవజ్రంచఖట్వాం పరశుమభయదం దక్షభాగేవహంతం
నాగంపాశంచఘంటా డమరుగుణపాతం సాంకుశంవామభాగే
నానాలంకారయుక్తం స్ఫటికమణినింభపార్వతీశంనమామి
తా॥ సోమస్కందేశ్వర లక్షణమును చెప్పుచున్నాడు. సుఖా

సన మూర్తికి జెప్పబడిన లక్షణములే చేయవలయును. దేవుని యొక్క యెడమ వైపువ పార్వతి సుఖాసనముతో నుండవలయును. ఎడమ పాదము లంబమును చేయవలయును. పీఠముపైన పిరుదుల యెత్తు 4 అంగులములు శరీరముపై భాగము కొలతల ప్రకారము రచించవలయును. కొంచెము పార్వతిని అనుకొనినట్లు ముఖమును, ఎడమచేయి వరదమును, కుడిచేతి యందు ఉత్పలమును కొంచెము వంచిన ముందు చేతులు యెడమ చేయి వరదము కుడిన అభయము ఒకప్పుడు సింహాకర్ణము వలెను. ఉండవచ్చును, ఎడమతొడ యందు పార్వతిని సమస్త

మైన ఆభరణములతో గూడి యుండునట్లును, ఎఱ్ఱనిచీరెను ఛన్న వీరముతోను, లేక యెడమ తొడ వెలుపల పీఠమున యెడమచేతి నానించి తరువాత కుడిచేతియందు ఉత్పలమునుంచి పీఠమున కుడి మోకాలు వొంచెను యెత్తుగాను 3, 4, 5 అంగులములు పీఠము మోకాలు ఈ రెంటి సందుండవచ్చును. 6, 7, 8 అంగులముల సందు కూడ నుండవచ్చును. ఇట్లు దేవి భంగములను రెండు విధములుగా జెప్పియుండిరి, (దూర్వాశ్యామనిభా దేవీ, అను పాఠము కూడ కలదు కనుక దేవి ఆకుపచ్చ వన్నెతో నుండవలయును. శాస్త్రోక్త ప్రకారం దేవి కొలతలను చేయవలయును. దేవునకు స్థానకమైనచో దేవికి గూడ స్థానకము చేయవలయును. దేవునకు ఆసనమైన యెడల దేవికిని ఆసనమునే చేయవలయును. దేవి యొక్క లక్షణములను జెప్పబడెను. ఇక స్కందుని లక్షణమును జెప్పుచున్నాడు. పార్వతీశ్వరుల నడుమ స్కందుని నిలుపవలెను. దేవి యొక్క అక్కిలితో సమానముగా స్కందుని యెత్తు చేయవలయును. అధమము స్తనముల యెత్తయిన జేయవలయును. ఈ రెండు కొలతల నడుమ 8 భాగములు చేసి యిట్లు స్కందుని యెత్తును 9 విధములుగా జేయవచ్చును. జాతి, ఛందము, వికల్పము, ఆభాసము అను నాల్గు విధములతో ఆభాసమున తక్కువ కొలతతోను చేయుదురు. 4, 6, 10 భాగములుగా విభజించి అందొక భాగమును 1 అంగులముగా భావించి యందు 8వ వంతును యవప్రమాణముగా నెంచి చేయవలయును. తలయెత్తు 1 అంగులము కేశాంతము వఱకు దానితో సమానము. నేత్ర సూత్రము వఱకు 3వ వంతు పుటాంతమునకు దానితో సమానము. అక్కిలి వఱకు 3వ వంతు మెడయెత్తు 2 అంగులములు అక్కిలి సూత్రము నుండి స్తనముల వఱకు 9 భాగములు అక్కడినుండి బొడ్డు వఱకు 8 అంగులములు బొడ్డు నుండి మేఢ్రమూలము వఱకు 7 అంగులములు తొడల పొడవు 12 భాగములు మోకాలు 2 అంగులములు పిక్కలు తొడలతో సమానము 12 భాగములు పాదము యెత్తు 2 భాగములు

పాదము పొడవు 10 అంగులములు భుజముల పొడవు 14 అంగుల ములు ముంజెయ్యి పొడవు 10 భాగములు అరచెయ్యి పొడవు 4 అంగులములు నడిమి వ్రేలు పొడవు 4 అంగులములు అనామిక వ్రేలును, తర్జని వ్రేలును పొడవు 3½ అంగులములు చిటికెనవ్రేలు 3 అంగులములు బొటనవ్రేలి పొడవు 3 భాగములు అరచేయి వెడల్పు 4 భాగములు ముంజేతి చివర విస్తారము 3 అంగులములు ముంజెయ్యి మొదలు విస్తారము 4 అంగులములు భుజము మొదలు విస్తారము 5 భాగములు మొగము విస్తారము 8½ భాగములు చెవుల సందు విస్తారము 7 భాగములు చంకల సందు విస్తారము 13 అంగులములు ఱొమ్ము విస్తారం 5 భాగములు మధ్య విస్తారము 11 భాగములు పిఱుదుల వద్ద విస్తారము 12 భాగములు మొల విస్తారము 13 భాగములు తొడల మొదలు విస్తారము 8 అంగులములు మోకాలు విస్తారము 6 అంగులములు పిక్క మొదలు 4 అంగులములు చీలమండపై భాగము విస్తారము 3 అంగులములు పిక్క ప్రదేశ విస్తారము 6 అంగులములు చీలమండ విస్తారము 4 అంగులములు మిగిలినవి ఆలోచించి చేయవలయును. కేశాంతమున ముక్కుతో గూడ నెమిలి ముఖమువంటి యాకారముగల కరండ ముకుటమును రచించవలయును. రెండు చేతులలో పుష్పములుగాని ఎడమవైపు వరదహస్తమునుగాని, కడియమునుగాని, సింహాకర్ణముగాని (కర్తరీ ముఖ హస్తము గాని) కుడిచేత పుష్పంగాని లేక రెండు చేతులలో వెలగపండ్లుగాని, శరీరమంతయు వస్త్రహీనముగను, మొలత్రాడును, మెత్తని తలవెండ్రుకలును, మెడలో కురుచయైన హారమును, శిశువుల కుండదగినయాభరణములును, కూర్చుండినట్లుగాని, లేక నిలుచుండినట్లుగాని, ఆనుకొనుచున్నట్లుగాని, కూర్చుండినట్లయితే పీఠముపైన రెండు తొడలు పాదములాని యుండవలయును. నిలుచుండినట్లయిన రెండు పాదము

లుండవలసిన పద్ధతి చెప్పుచున్నాడు. రెండు కాళ్ళను కొంచెము వంచి గాని, లేక ఒక కాలినే వంచిగాని, మోకాలి నిర్గమమును చేయవల యును. రెండు కాళ్ళను కొంచెము వంచి నడుచున్నట్లుగాని, చేయ వలయును. నృత్తమయిన-చో ఎడమ పాదము స్వస్తికముగను, కుడి పాదము వంకరగను, ఎడమకాలిపైకెత్తి యుంచవలయును. పీఠము యెత్తు 16 అంగులములు 5 అంగులములు లేక 6 అంగులములు కాలు యెత్తి యుంచవలయును. ఎడమచేతియందు పండుగాని వరదముగాని, కుడిచేయి సూచితమును, లేక ఎడమచేత ఫలమునుంచి వస్త్రాదిద్య లంకారమును చేయవచ్చును. అక్కిలి సూత్రమునకు సమానముగాను కర్ణబంధము పై ప్రదేశమునకును పందు నృత్తమూర్తికి జేసినట్లు చేయవలయును. ఉమాస్కందయుత రూపము చెప్పబడినది. చంద్ర శేఖర లక్షణమును చెప్పబోవుచున్నాడు.

(అనుబంధము 23వ పటము చూడుడు)

## 35. చంద్రశేఖర లక్షణము

### కాశ్యప శిల్పము 63వ పటలము

శ్లో॥ అథవక్ష్యే విశేషేణ చంద్రశేఖరమూర్తికాం
కేవలంగౌరిసహిత మాలింగంచత్రిథాభవేత్॥ 1
కేవలంగౌరిసహితం సహజంగౌరీసంయుతం
ఆలింగ్యచైకహస్తేన దేవీదేవౌపరస్పరమ్॥ 2
కృతమాలింగముఖ్యాత మేవంత్రివిధమూహ్యతాం
కేవలంసమపాదంతు స్థానకంసహితంభవేత్॥ 3
సమభంగంత్రిభంగంస్యా దాభంగంచంద్రశేఖరం
కేవలంమూర్తిదంఖ్యాతం సహితత్వంభయప్రదమ్॥ 4
తెష్వాదౌసమపాదంతు స్థానకంసహితంతథా
బింబమానోదయంసర్వం ప్రాగేవపరివేష్టితమ్॥ 5

లంబమానోపమానంచ హ్యధునావక్ష్యతే క్రవశాత్
ప్రలంబఫలకాయామం చత్వారిచాష్టమాత్రకమ్॥ 6
అష్టాదశాంగులం తారం సార్థద్వ్యంగులంఘనం
చతుష్పాదసమాయుక్తం పాదోచ్ఛం ప్రతిమోదయమ్॥ 7
ఋజ్వంగులసమాయుక్తం స్థాపయేత్సమభూతలే
సమసూత్రంవినిశ్చిత్య ప్రలంబఫలకోపరి॥ 8
పూర్వేఽపరేచపార్శ్వేచ మానసూత్రం ప్రలంబయేత్
అంతరేసుషిరంకల్ప్యం సూత్రాంత్యంలంబయేత్తదా॥ 9
తత్సూత్రంతుగుణంబింబం కారయేద్ద్విజసత్తమ
పూర్వేచపాతయేత్పృష్ఠే కాయమధ్యేచలంబయేత్॥ 10
ఏతానిపంచసూత్రాణి బ్రహ్మసూత్రముదాహృతం
కక్ష్యాంతరేముఖాంతేచ ద్వేద్వేసూత్రే ప్రలంబయేత్॥ 11
ఏవంహీనవసూత్రాఢ్యం స్థానకంచాసనంతథా
ముకుటంమధ్యమంచైవ లలాటస్యతుమధ్యమే॥ 12
నాసాగ్రమధ్యమంచైవ హనోర్మధ్యంతథైవచ
హిక్కామధ్యంచహృదయం మధ్యేనాభిశ్చమధ్యమే॥ 13
లింగమధ్యేచమధ్యేతు పాదయోశ్చతలాంతరే
లంబయేత్పూర్వసూత్రంస్యాదపరస్తమధోచ్యతే॥ 14
ముకుటస్యమధ్యమాద్విప్ర కృకాటికాస్తుమధ్యమే
కకున్మధ్యత్వమధ్యేతు స్ఫిక్పిండాంతరకేతథా॥ 15
ఊరుజాన్వోశ్చజంఘాయాం పార్ష్ణ్యోశ్చద్వ్యంతరేతథా
ఏవంస్యాల్లంబయేత్సూత్ర మపరస్యాత్తమేవహి॥ 16

తా॥ చంద్రశేఖరమూర్తిని రచించు పద్ధతి చెప్పుచున్నారు ప్రత్యేకముగా శివరూపమును, గౌరీసహిత రూపమును. ఒకరినొకరు పట్టికొనినట్లును ఇట్లు మూడు విధములుగా చేయవచ్చును.

కేవలశివరూపము సమానమైన పాదములు గలిగి మెరుగు లేకుండ నిలిచినట్లుండుట స్థానకము. సమభంగమును, త్రిభంగమును, ఆభంగ మును, ఇట్లు మూడు విధములుగా చంద్రశేఖరుని చేయుదురు. ఒక్కటే ప్రతిమయైనచో అభయవరద హస్తములతోను, సమాన పాదములతోను రచించవలయును. ప్రతిమా లక్షణమున జెప్పబడిన ప్రకారము చేయవలయును. లంబమానము ఉపమానము చెప్పబోవు చున్నాడు. ప్రలంబ ఫలకము యొక్క పొడవు 32 అంగులములును, విస్తారము 18 అంగులములను, మందము $2\frac{1}{2}$ అంగులములును. లేక 2 అంగులములును నాలుగు పాదములును, బొమ్మ చివర మొత్తు $\frac{1}{4}$ యును, 2½ అంగులములును సమాన ప్రదేశమున నుంచవలయును. ప్రలంబఫలకముపైన సమసూత్రము నుంచి ముందు వెనుక ప్రక్కలు మానసూత్రములనుంచి లోపల రంధ్రమును చేసి సూత్రము చివర పొడవు చేయవలయును. ఆ నూలు ప్రకారము బొమ్మను చేయవల యును. ముందును వెనుకను శరీరము యొక్క నడుమ నిలువుగా సూత్రమును పట్టిరేని యిది పంచసూత్ర పద్ధతి యగును చంకల లోపలను, ముఖము యొక్క అంతమునకు 2.2 సూత్రములను నిలు వుగా నుంచవలయును. ఇది నవసూత్ర పద్ధతి యగును. స్థానకమున గాని, కిరీటము యొక్క నడుము, నొసలు యొక్క నడుము, ముక్కు చివర నడుము, అక్కిలి నడుము, చెక్కిలి మీఁది భాగము నడుము. బొమ్మనడుము, బొడ్డు నడుము, లింగ స్థానము నడుము, పాద ముల రెంటి నడుము, ఇట్లు ముందువైపున నూలును పట్టవలయును. వెనుక నూలు పట్టు విధము చెప్పుచున్నాడు. కిరీటము నడుము, పెడ తల నడుము (ముచ్చిలి గుంట నడుము) మూపు నడుము పిఱుదుల రెంటి నడుము తొడల నడుము మోకాళ్ళ రెంటి సందు పిక్కల రెంటి సందు చీలమండల రెంటి నడుము ఇట్లు వెనుక నూలును పట్ట వలయును.

శ్లో॥ పార్శ్వయోఃకర్ణవల్ల్యంతం గ్రీవామధ్యేతథైవచ
శాహ్వాచమధ్యమాలంబ్య గుల్ఫమధ్యేతులంబయేత్॥ 17
దేహమధ్యేగతేనైవ పంచసూత్రంప్రకల్పయేత్
శ్రోత్రాభ్యంతర్గతంసూత్రం స్తనచూచుకమధ్యమే॥ 18
పాదోరుమధ్యదేశేంత్యే మధ్యమేతుప్రలంబయేత్
పూర్వసూత్రంతుమాల్యగ్రం నిమ్నంద్వాదశమాత్రకమ్॥ 19
పూర్వసూత్రంమాల్యమగ్రం షణ్మాత్రంతుప్రయుజ్యతే
పూర్వసూత్రంలలాటాంతం హ్యాంతరంద్వ్యంగులంభవేత్॥ 20
అపరసూత్రంశిరఃపృష్ఠే పాదోనాంతంయుగాంగులమ్
పూర్వసూత్రంతుహన్వంతం సమవంద్వ్యంమిష్యతే॥ 21
కృకాటికాపరంసూత్రం యువోనంద్వ్యంతతాంతరే
పూర్వసూత్రంమహికాంతం ద్వ్యంతరంతురసాంగులమ్॥ 22
కకుదోఽపరపృష్ఠేతుషోడశంతుయవాంతరం
ఉరసఃపూర్వసూత్రంతు ద్వ్యంతరంతుద్విమాత్రకమ్॥ 23
కకున్మధ్యాత్పరంసూత్రం ద్వ్యంతరంత్వేకమాత్రకం
మధ్యోదరంన్యసేత్పూర్వం సూత్రంవైతత్సమంపరే॥ 24
వంశంనిమ్నపరంసూత్రం పాదోనమాత్రకంపరం
ప్రాక్సూత్రాన్నాభిమధ్యేతు ద్వ్యంతరంసార్ధమాత్రకమ్॥ 25
నాభిసూత్రాత్పరేపృష్ఠే సార్ధపఞ్చాంగులంభవేత్
ప్రాక్సూత్రాన్మేఢ్రమూలాంతం గుణాంగులముదాహృతమ్॥ 26
తత్సమంతుపరేసూత్రే ద్వ్యంతవరంతుద్విమాత్రకం
ఊరుమధ్యేతుపురతో జానుమధ్యంతథైవచ॥ 27
జంఘామధ్యేచనలికా మధ్యేచైవపురోగతం
తిర్యక్సూత్రంతుసంకల్ప్య ద్వ్యంతరంతుప్రమీయతే 28

తత్తత్స్థానేపురేచైవ తిర్యక్సూత్రం ప్రకల్పయేత్
ఊరుమధ్యాంగసూత్రంతు పూర్వసూత్రంతుద్వ్యంగులమ్॥ 29
తత్రైవాపరసూత్రంతు షడ్వింశతియవంభవేత్
జానుమధ్యాంగసూత్రాంతం పూర్వాసూత్రంగసాంగులమ్॥ 30
తత్రైవాపరసూత్రంతు పాదోనంపంచమాత్రకం
జంఘామధ్యంతుప్రాక్సూత్రం వస్వంగులముదాహృతమ్॥ 31
తత్రైవాపరసూత్రం షడ్వింశతియంభవేత్
ప్రాక్సూత్రాన్నలకామధ్యం సార్ధంవస్వంగులంభవేత్॥ 32
నలకాపరసూత్రాంతం పాదోనంపంచమాత్రకం
ద్వ్యర్ధమంగుష్ఠయోరగ్రం పూర్వసూత్రంవిశేషతః 33
తత్సూత్రంపార్ష్ణి పర్యంతం సార్ధమగ్న్యంశమిష్యతే
ప్రాక్సూత్రకాయమధ్యస్థం సూత్రంసార్ధంనవాంగులమ్॥ 34
కాయమధ్యస్థసూత్రంతు శిరఃపృష్ఠయుగాంశకం
తత్కాయమధ్యసూత్రంతు కకుత్పంచాంగువార్ధకమ్॥ 35
ఉరోమధ్యప్రదేశేతు పృష్ఠంసార్ధషడంగులం
సూత్రమధ్యోదరేపృష్ఠే సార్ధవేదాంగులంభవేత్॥ 36
నాభిప్రదేశపృష్ఠేతు సార్ధభూతాంగులంభవేత్
కటిస్రవంషడంశంస్యా త్సార్ధాష్టాంశంస్ఫిగగ్రకం॥ 37

తా॥ రెండు ప్రక్కలను చెవితమ్మెల వఱకును, మెడ నడుము వెలుపల నడుము నుండి చీలమండలు రెంటి నడుము వఱకును ఇట్లు దేహమధ్య సూత్రమును, పంచసూత్రములని తెలియవలయును. చెవుల లోపలి నుండి స్తనచుకముల యొక్క నడుముగాను, రెండు పాద ముల యొక్కయు తొడల యొక్కయు, మధ్యప్రదేశమునను, వెలుప లను, నడుమునను లంబము చేయవలయును. ముందు వైపు నూలు కిరీటము చివరలోతు 12 అంగులములు కిరీటము చివర 6 అంగుల

ములు ముందువైపు నూలు నొసలు వఱకు సందు 2 అంగులములు వెనుక నూలు తల వెనుక $3\frac{1}{4}$ అంగులములు ముందు నూలు చెక్కిలిపై భాగము 3 అంగులములపైన 1 యవము వెనుక నూలు తల వెనుక 2 అంగులములకు 1 యవతరుగు ముందు వైపు నూలు అక్కిలి వఱకు సందు 6 అంగులములు మూపు వెనుక ప్రక్క 16 యవలు ముందు నూలు రొమ్ముసందు 2 అంగులములు వెనుక మూపున సందు 1 అంగులము ముందు నూలు పొట్టనడుము నూలుతో సమానము. వెనుక నూలున వెన్నుపూస లోతు 6 యవలు ముందు నూలున బొడ్డు నడుమునసందు $1\frac{1}{2}$ అంగులము నాభి సూత్రము నుండి వెనుక వైపున $2\frac{1}{2}$ అంగులములు పల్లము ముందు నూలున మేఢ్ర మూలము యొక్క అంతము 3 అంగులముల పల్లము ఆ నూలున వెనుక ప్రక్క సందు 2 అంగులములు ముందు నూలున తొడ నడుము, మోకాలి నడుము పిక్క నడుము చీలమండ పై భాగమునకు ముందుకు పెంపు కలిగియుండవలయును. అడ్డ నూలును బట్టి సందును తెలిసికొనవలెను ఎక్కడ కొలత అవసరమో అక్కడ నూలును బట్టి సందు కొలుచుకొనవలెను. తొడ నడుము నూలు ముందువైపు నూలు సందు 2 అంగులములు ఆ నూలును వెనుక ప్రక్క 26 యవలుండవలయును. మోకాలి నడుము నూలు తూర్పు నూలున సందు 6 అంగులములు అదే నూలు వెనుక ప్రక్కను $4\frac{3}{4}$ అంగులములు ముందు నూలు పిక్క నడుమ 8 అంగులములు అదియే వెనుక ప్రక్క 26 యవలుండును. ముందు నూలున చీలమండపై భాగము $8\frac{1}{2}$ అంగులములు వెనుక నూలున $4\frac{3}{4}$ అంగులములు ముందు నూలున బొటనవ్రేలి చివర $2\frac{1}{2}$ అంగులములు ఆ నూలున వెనుక చీలమండ వఱకు $3\frac{1}{2}$ అంగులములు ముందు నూలు శరీరము నడుము $9\frac{1}{2}$ అంగులములు అదియే వెనుక నూలున 4

అంగులములు శరీర మధ్య సూత్రమున వెనుక పొట్టయెదురు $4\frac{1}{2}$ అంగులము నాభి యెదురు వెనుక $5\frac{1}{2}$ అంగులములు మొల నిర్గమము 6 అంగులములు పిఱుదుల నిర్గమము $8\frac{1}{2}$ అంగులములు చేయవలయును.

శ్లో॥ ఊరుమధ్యోత్కటలంవేదో జానుపృష్ఠంతథైవచ
జంఘామధ్యేగుణాంశంతు నలికాద్వ్యంగులాభవేత్॥ 38
గుల్ఫయోర్ద్వియుగాంగుల్యం పరసూత్రేబహిర్ఘనం
పార్శ్వసూత్రాదధస్తాత్తు సమసూత్రంతుసంస్థితమ్॥ 39
పార్శ్వసూత్రాత్పురో బాహు పర్యంతంచతురంగులం
తత్సూత్రాదపరేబాహు పర్యంతంచాంశమాత్రకమ్॥ 40
పూర్వేకరౌతుమధ్యేచ కూర్పరంచవలగ్నకం
తత్కరౌబాహ్యవిస్తారౌ చతురంగులమిష్యతే॥ 41
కర్తరీపరహస్తాగ్రౌ హిక్కాసూత్రసమంభవేత్
మధ్యాంగులాగ్రముభయోః స్తనాగ్రస్యసమంభవేత్॥ 43
అభయందక్షిణేహస్తే వరదంవామహస్తకం
ప్రాక్సూత్రాదభయేహస్తే మధ్యంపంచశాంగులమ్॥ 43
వరదంవామహస్తంతు అధోముఖంప్రకల్పయేత్
తలమూలాంకటిపృష్ఠే మేఢ్రాగ్రంతుతతఃపరే॥ 44
మధ్యాంగుల్యంసమాలంబ్య ఊరుసీవంయుగాంగులం
ఊరువర్త్రింతువరదం పృష్ఠంనాభిసమోద్ధృతమ్॥ 45
వరదంహస్తతలమధ్యే పూర్వసూత్రంతలాంగులం
కర్తరీమణిబంధంతు బాహుబాహ్యముఖంభవేత్॥ 46
అథవారుద్రభాగంతు దశాంగులమథాపివా
కర్పూరంపూర్వసూత్రాంతం సీవంసస్తదశాంగులమ్॥ 47
జంఘయోరేకోనవింశ మూరుమూలంద్వయోన్నతం
గుల్ఫయోరంతరంచైవ ఏకాంగులముదాహృతమ్॥ 48

ఊర్వోర్మధ్యాంతరంగుల్యం వింశాద్యంవా ఉదాహృతం
జాన్వంతరంచతుర్మాత్రం జంఘయోఃపంచమాత్రకమ్॥ 49
తలోరూతురసాంశంతు వేదాంశంగుల్ఫయోర్భవేత్
పాదాంగుష్ఠద్వయోరంతం ద్వ్యంతరంవసుమాత్రకమ్॥ 50
ఆర్జవంరాజసంభావం కల్పయేద్వాద్విజోత్తమ
కర్తరీపరహస్తాద్వా టంకంవైదక్షిణకరే॥ 51
హరిణీవామహస్తేతు టంకంకృత్వాబహిర్ముఖం
హరిణీబాహ్యమూలంవా ద్వ్యంతరాననమేవచ॥ 52
జటామకుటసంయుక్తం దక్షిణేచంద్రశేఖరం
వామేందుశేఖరంవాఽథ ప్రవాలసదృశప్రభమ్॥ 53
త్రినేత్రంసౌమ్యవదనం సర్వాభరణభూషితం
పీతాంబరధరందేవం వస్త్రాగ్రంనలకాంతకమ్॥ 54
ఉభయోఃపార్శ్వయోదేవ మధ్యతశ్చోరుమధ్యమం
కేవలంచైవమాఖ్యాతం వామేగౌరీసమాయుతమ్॥ 55
భిన్నపీఠైకపీఠంవా భవేద్వాభంగసంయుతం
తద్గారీసంయుతంచోరుభిన్నపీఠైకమేవవా॥ 56
తదేవాభంగసంయుక్తం దేవదేవ్యాపరస్పరం
దేవోవరదహస్తేన దేవీంనైత్యపరాశ్రితోమ్॥ 57
స్థానమధ్యాంతరేవామ పార్శ్వమాలింగనంకురు
పార్శ్వసూత్రాత్పరే వామబాహుమాలింగనంతువా॥ 58
దేవీదక్షిణహస్తేన శంభోర్దక్షిణపార్శ్వతః
కటిసూత్రోపరిష్టాత్తు పుష్పంవామకరేధృతః। 59
అథవాపార్శ్వదేవేర్యో వ్యమ్నస్తుదక్షిణేకరే
కరోత్పలంవహంత్యాశ్చ వామహస్తంప్రలంబయేత్॥ 60

ఏవమాలింగమూర్తిశ్చ త్రిధామానేనకల్పయేత్
సర్వాభరణసంయుక్తం ప్రభామండలసంయుతమ్॥ 61
చంద్రశేఖరమాఖ్యాతం వృషారూఢమథశ్శృణు॥ 62
ఇతి కాశ్యపశిల్పే చంద్రశేఖరమూర్తిలక్షణంనామ త్రిషష్టితమః పటలః-

తా॥ తొడల నడుమ అధికము 4 అంగులములు మోకాలి వెనుక 4 అంగులములు పిక్క నడుమ 3 భాగములు చీలమండపైన కాలు 2 అంగులములు చీలమండలు 4 అంగులములు వెనుక నూలు నుండి వెలుపలికి మందము ప్రక్క నూలునుండి దిగువ సమసూత్రమును పట్టవలయును ప్రక్క నూలు నుండి ముందు భుజముల వఱకు 4 అంగులములు ఆ నూలు నుండి వెనుక భుజముల వఱకు 1 అంగులము ముందు చేతులు నడుము మోచేతులు, నడుమును, చేతులు వెలుపలకు 4 అంగులములు వెనుక చేతులు రెండును కర్తరీముఖములుగను,అక్కిలి నూలు నుండి సమానముగా జేయవలయును. రెండు చేతుల యొక్క నడిమివ్రేళ్లు చనుమొనలతో సమానముగా నుండవలయును. కుడి చెయ్యి అభయమును, ఎడమచెయ్యి వరదమును చేయవలయును. అభయహస్తము ముందు నూలు నుండి 15 అంగులముల సందు ఎడమ చేయి వరదమును క్రింది ముఖముగా జేయవలయును. అరచెయ్యి మొదలు మొలవెనుకకు, అభయమును, వరద హస్తము యొక్క చివర మేఢ్రాంతముగను రచించవలయును, నడిమి వ్రేలిని లంబము చేయవలయును. తొడ నిర్గమము 4 అంగులములు తొడ ముఖమున వరదమును, వెనుక బొడ్డుతో సమానమైన యెత్తును వరదము హస్తతలము నడుమ ముందు నూలుకు 1 అంగులము కర్తరీమణి బంధము భుజము యొక్క వెలుపలి ముఖముగా నుండవలయును. లేక 11 అంగులములు 10 అంగులములు చేయవచ్చును. మోకాలు ముందు నూలు నుండి నిర్గమము 17 అంగులములు పిక్కలు 19 అంగులములు

తొడల మొదలు 2 అంగులము యెత్తు చీలమండల నడుము 1 అంగులము తొడల నడుమ 20 అంగులములు మోకాలి సందు 4 అంగులములు పిక్క సందు 5 అంగులములు అడుగు ప్రదేశము 6 అంగులములు పీఠము నుండి తొడలు 6 అంగులములు చీలమండ 4 అంగులములు కాలిబొటన వ్రేళ్ళ సందు 8 అంగులములు చక్కగా ఒరుగు లేకుండనుండుట రాజసభావము వెనుక చేతులు కర్తరీ ముఖము, లేక కుడిచేతటంకమును, ఎడమచేత వేడియును, చేయవలయును. టంకము యొక్క ముఖం వెలుపలికిని, వేడి ముఖము లోపలికిని లేక వెలుపలికిని, లేక ముఖము మధ్యకు వచ్చునట్లుగాని చేయవచ్చును. జటామకుటమును కుడివైపున చంద్రుడును, లేక యెడమ వైపునను రచించవచ్చును. పగడమువంటి యెఱ్ఱని కాంతి గల శరీరమును, మూడు కన్నులును శాంతము గల సుందర ముఖమును, సమస్తమైన భూషణములును, పీతాంబరమును, కాలి చీలమండ వఱకు వస్త్రమును రెండు ప్రక్కలపై వస్త్రము తొడల వఱకును, ఇట్లు ఏకప్రతిమను చేయవలయును. లేక యెడమ వైపున పార్వతి అదే పీఠమునగాని వేఱుపీఠమునగాని కలసి యుండవచ్చును. లేక యిద్దరికిని విడివిడిగా సుఖాసనము కల్పించవచ్చును. శివునకు వరద హస్తమును, పార్వతి శివుని ఆశ్రయించినట్లుగాని, ఎడమవైపున పార్వతి ఆలింగనము చేసినట్లుగాని, ప్రక్క నూలునుండి వెనుకగా భుజమును బట్టికొని యున్నట్లుగా రచించవచ్చును. లేక దేవి కుడిచేతితో దేవుని కుడి ప్రక్కను పట్టుకొనినట్లును, అ చెయ్యి దేవుని కటిసూత్రముపై నుండునట్లును ఎడమచేత పుష్పమును బట్టికొనినట్లును రచించవచ్చును. లేక కుడిచెయ్యి దేవుని భుజముపై నుంచి యెడమ చెయ్యి జారవిడిచి పుష్పమును పట్టికొనినట్లు చేయవచ్చును ఇట్లు ఆ లింగమూర్తిని మూడు విధములైన కొలతలతో జేయవచ్చును. సమస్తమైన భూషణములును గుండ్రని వెలుగు నడుమనున్నట్లును రచించ

వలయును. తరువాత వృషవాహనుని లక్షణమును చెప్పబోవుచున్నాడు.

(అనుబంధము 24వ పటము చూడుడు)

## 36. వృషవాహనమూర్తి లక్షణము

### కాశ్యప శిల్పము 64వ పటలము

శ్లో॥ వృషవాహనమూర్తేస్తు లక్షణంవక్ష్యతేఽధునా
సమభంగంత్రిభంగంవా కల్పయేచ్ఛిల్పవిత్తమః॥ 1

దక్షిణంస్వస్తికంపాదం వామపాదంతుకుంచితం
ఉష్ణీషాన్మధ్యమాద్వామే లలాటంమధ్యవామకే॥ 2

వామనేత్రావసానేతు వామనాసాపుటాంతకే
దక్షిణేస్థానపీఠంస్యాద్ వామనాభిశ్చమధ్యమే॥ 3

వామోరుమధ్యపార్ష్ణ్యోశ్చ మధ్యసూత్రంప్రలంబయేత్
ఏవంతుసమభంగంస్యాన్నతమానంయుగాంగులమ్॥ 4

ముఖేపూర్వవదుద్దిష్టం దక్షిణేతుస్తనేతథా
నాభేర్వామేగుణాంశంతు వామోరుమధ్యమేతథా॥ 5

స్వస్తితాంఘ్రిస్తుగుల్ఫంస్యాన్మధ్యేసూత్రంప్రలంబయేత్
అతిభంగమితిఖ్యాతం నతంపంచాంగులంభవేత్॥ 6

వృషస్యమస్తకోర్ధ్వేతువిన్యసేద్వామకూర్పరం
హిక్కాసూత్రంతథావిప్ర కలాంశంవానవాంగులమ్॥ 7

వామకూర్పరలంబంస్యాత్తస్మాదాస్తనసీమకం
వృషభస్యోచ్ఛ్రియంఖ్యాతం పాదస్థానాహితాంగులమ్॥ 8

వృషభోదయమాఖ్యాతం వృషలక్షణవత్కురు
వృషమూర్ధ్నితుహస్తేతు మధ్యాంగుల్యగ్రసీమకమ్॥ 9

నాభిసూత్రంసమంకుర్యా దంగులంవాసతాంగులం
అధస్తాత్తలమధ్యేతు పూర్వసూత్రంయవద్వయమ్॥ 10
అధోముఖంప్రకర్తవ్యం తదర్ధంతుప్రసారయేత్
దక్షిణేపూర్వహస్తేతు పార్ష్ణినాభేరధోబుధః॥ 11
పక్షేషోడశమాత్రంవా నతంతత్సింహకర్ణవత్
వక్రదండోత్థితంతస్మిన్ కల్పయేత్తుచలాచలమ్॥ 12
స్థితాంఘ్రిజానురూర్ధ్వాసు హిక్కాసూత్రంసమున్నతం
కనిష్ఠాంగులపరీణాహ మగ్రంవక్త్రిత్రియాన్వితమ్॥ 13
లోహజందారుజంవాఽథ వక్రదండైవమాచరేత్
అధస్తాన్మణిబంధస్తు ఊరుమూలంతదుత్తరమ్॥ 14
పంచషట్సప్తమాత్రంవా వసునందాంగులంతువా
జటాముకుటసంయుక్తం జటాభారస్తులంచితః॥ 15
జటాబంధశిరోవాఽపి కర్తురిచ్ఛావశాన్నయేత్
సర్వాభరణసంయుక్తం రక్తాభంరక్తవస్త్రకమ్॥ 16
వామపార్శ్వేఉమాదేవి దక్షిణేవావిశేషతః
స్వస్తికందక్షిణంపాదం వామపాదంతుకుంచితమ్॥ 17
ఉత్పలందక్షిణేహస్తే వామహస్తేప్రసారితమ్
స్త్రీమానేనవిధానేన ఉమాదేవీంచకారయేత్॥ 18
వృషవాహనమాఖ్యాతం నృత్తమూర్తిరథోపరి 19
ఇత్యంశుమద్భేదేకాశ్యపశిల్పే వృషవాహనమూర్తి లక్షణం
నామచతుఃషష్టితమఃపటలః

తా॥ వృషవాహనమూర్తి యొక్క లక్షణమును చెప్పుచున్నాడు సమభంగమునగాని, లేక త్రిభంగమునగాని రచించవచ్చును.కుడికాలు స్వస్తికమును (నిలువుగాను) ఎడమకాలు కుంచితమును (వంపును) ఉష్ణీషము నుండి నడుముగా ఎడమప్రక్క నొసలు నడుము ఎడమ

కన్ను ప్రక్కగాను ఎడమ ముక్కుపుట ప్రక్కగాను, కుడివైపున స్థాన పీఠమును, ఎడమనాభి నడుము, ఎడమ తొడ నడుము, చీలమండ మధ్య సూత్రమును జారవిడువవలయును. దీనిని సమభంగ మందురు. లోతు లేక వంపు 4 అంగుళములు మఱియు ముఖమును మునుపటి వలెనే యుంచి కుడి స్తనము నాభి యొక్క యెడమ ప్రక్క 3 అంగుళములు ఎడమ తొడ నడుము కాలు అడ్డముగాను చీలమండ నడుము గను నూలును పట్టవలయును. దీనిని అతిభంగమందురు. వంపు 5 అంగుళములు ఎద్దుయొక్క తలపైన ఎడమ మోచెయ్యి నుంచి అక్కిలి నూలు 16 అంగుళములుగాని లేక 9 అంగుళములు గాని, లేక యెడమ కాలును జారవిడిచి అక్కడినుండి స్తన ప్రదేశము వఱకు నూలుపట్టి చేయవలయును. వృషభమును లక్షణోక్త ప్రకారముగ రచించవలయును వృషభము యొక్క తలను చేయి యుంచి నడిమిప్రేలి చివరకు, నాభి సూత్రమును సమానము చేయవలయును. అంగుళముగాని అంగుళము వంపుగాని, అడుగున అరచేతి నడుమ ముందు నూలుకు పల్లము 2 యవలు ముఖమును క్రిందికి జూచుచున్నట్లు రచించవలయును. సగము ప్రసారముండవలయును. కుడివైపు ముందుచెయ్యి చీలమండ బొడ్డు వీనికి దిగువ నుండవలయును. 15, 16 అంగుళములు వంగి యుండ వలయును. దానిని సింహకర్ణమువలె కర్తరీ ముఖముతో రచించవల యును. వక్రదండమును చలముగను, అ చలముగను రచించవచ్చును. నిలుచున్న మోకాలిపైన అక్కిలి సూత్రము ఎత్తుగా నుండవలయును. వక్రదండము అంగులము విస్తారమును మూడు వంపులును కలిగి యుండవలయును. ఇనుముతోగాని కఱ్ఱతోగాని చేయవచ్చును. మని కట్టు క్రింద తొడ మొదలును, పైన 5, 6, 7, 8. 9 అంగులము గల జటామకుటమునుగాని, జటాబంధమునుగాని రచించవచ్చును, సమస్త మైన భూషణములును, ఎఱుపువన్నెయును, ఎఱ్ఱని వస్త్రములును, ఎడమవైపున పార్వతియును కుడికాలు అడ్డమును, ఎడమకాలు కుంచి

తను ను, కడిచేతియందు కలువయును, ఎడమచేయి జారవిడుచుట యును. స్త్రీ ప్రతిమకు జెప్పబడిన కొలతతో రచించవలయును. వృషవాహనమూర్తి లక్షణము చెప్పబడెను. నృత్తమూర్తిలక్షణమును చెప్పబోవుచున్నాడు.

## 37. నృత్తమూర్తి లక్షణము

కాశ్యప శిల్పము 65వ పటలము

శ్లో॥ అథవక్ష్యేవిశేషేణ నృత్తమూర్తేస్తులక్షణం
ఉత్సాహవర్ధనార్థాయ ఉద్భూతాచర్మముండికా॥ 1
త్రిపుంద్రవదనంకృత్వా నృత్తాత్కర్ణనతలతథా
హాసోత్సుకాసనాదేవీ తత్సుఖాసనవృద్ధయే॥ 2
తథానృత్తంకరిష్యతి సర్వలోకహితాయవై
దేవానాంమూర్తినాథాయ రాజరాష్ట్రవివర్ధనం 3
నృత్తముష్టాదశంహ్యేవం తేషాందానవముచ్యతే
ప్రకృతౌవిధినాగ్రాహ్యం బింబమానంద్విజోత్తమ॥ 4
ఉత్తమందశతాలేన సర్వాంగంపరికల్పయేత్
భానురుద్రదశంచైవ తుంగంనృత్తోన్నతంభవేత్॥ 5
ఉష్ణీషాన్మధ్యమాత్సవ్యే లలాటంమధ్యదక్షిణే
నీత్వాశివాంగులంసవ్యే నేత్రాంతేచపుటాంతకే॥ 6
హనోఃసర్వంతుహిక్కాయాం మధ్యేనాభించమధ్యమే
వామోర్వభ్యంతరేలంబ్య స్థితాంఘ్రిగుల్ఫమధ్యమే॥ 7
ప్రభామండలమధ్యేతు పూర్వసూత్రంతులంబయేత్
లలాటసూత్రనీవ్రంతు యుగార్ధాంగులమంతరః॥ 8
గుల్ఫసూత్రాంతరేచైవ ద్వాదశాంశంవిధీయతే
హిక్కామధ్యంతుసూత్రంతు సార్ధసప్తంనవాంగులమ్॥ 9

ముకుటోర్వ్యేకపక్షాగ్రం సూత్రాంతరంతథైవచ
ఊర్ధ్వకుక్షింస్స్పృశేత్పూర్వం సూత్రమేవం ప్రలంబయేత్॥ 10
తత్సూత్రాద్గోలబాహ్వగ్ర మర్ధాధికకలాంగులమ్
తస్మాదపరబాహ్వగ్రం యుగాంగులముదాహృతమ్॥ 11
తస్మాదగ్నికరాగ్రాంతం సాష్టత్రింశాంగులంతు వా
చత్వారింశతిమాత్రం వా తస్మాదగ్నిగుణాంగులమ్॥ 12
హిక్కాసూత్రంసముద్ధృత్య మధ్యమేవ ధ్వమాగ్రకం
తద్ధస్తతలమధ్యేవా మధ్యాంగుల్యగ్రపూర్వకే॥ 13
మధ్యపర్వేయవాధిక్యం త్వనలంపాత్రసంయుతం
పాత్రంవినాఽథవాధిక్యం పంచాంగులంవిశాలకమ్॥ 14
తుంగంసప్తాంగులంవాఽష్ట నవమాత్రమథాపివా
త్రిపంచసప్తజిహ్వాయాం కల్ప్యమేవముధోచ్యతే॥ 15
ఉక్తాసుమధ్యజిహ్వాయాం వన్యందక్షిణాననంకురు
దక్షిణేపూర్వసూత్రంతు బాహ్వగ్రంవిశదంకురు॥ 16
తస్మాడ్డమరుకేహస్తే మణిబంధస్యబాహ్యకే
అష్టాత్రింశతిమాత్రంవా చత్వారింశతిరేవవా॥ 17
చత్వారింశతిమాత్రంవా వామహస్తస్యసవ్యయోః
తద్ధస్తేమణిబంధోర్ధ్వం హిక్కాసూత్రంసమంభవేత్॥ 18
డమరుంమధ్యమంపిండ్యం సూచీకర్ణంతుఉద్ధృతః
తర్జన్యగ్రంతుసూచ్యగ్రం తర్జనీరజనీభవేత్॥ 19
అథవాచర్మసూత్రఃతు పిండీమధ్యాంగులోపరి
అనామికోపరిష్టాత్తు డమరుంపరికల్పయేత్॥ 20
డమరోర్దీర్ఘవిస్తారం వసుపంచాంగులంక్రమాత్
మధ్యంగుణాంగులంవ్యాసం పద్మాకారంప్రకల్పయేత్॥ 21
వలయద్వయసంయుక్తం చర్మసూత్రేణబంధితం
గల్యేనాకృతబింబంతం తద్ద్రవ్యేణతుకారయేత్॥ 22

తా॥ నృత్తమూర్తి లక్షణమును చెప్పుచున్నాడు సంతోషము పెంపు జెందుటకు డమరుకమును రచించవలయును. ముఖమును త్రిపుండ్రముతోను పెలవి వరకు ఒరగినతోను నృత్తమూర్తి యుండ వలయును. పార్వతి సింహాసనముపై సుఖాసనమునగాని లేక విదిగాని యుండవచ్చును. సమస్త లోకములకు హితమును గోరియీశ్వరుడు నృత్తమును చేయుచున్నాడు. దేవతల యొక్క దుఃఖములను తొలగించుటకును, రాజరాష్ట్రమువృద్ధియగుటకును, నృత్తము 18 విధములుగా నేర్పడినది. వానిలో మొదటి 9 భేదములు కల్పింపబడినవి. సామాన్యావస్థ యందలి స్థితిని బట్టి గ్రహింపవలయును. ప్రతిమ కొలత ఉత్తమ దశతాలపద్ధతితో సమస్తమైన అవయవములను కల్పించి 12, 11, 10 అంగులములు నృత్తము యొక్క యెత్తును చెయవలయును. ఉష్ణీషము నుండి నడుము నుండి నొసలు నడుమ కుడివైపును పొందిన 1 అంగులము కుడివైపునను, కన్నుప్రక్కను, ముక్కుపుటప్రక్కను, చెక్కిలిమీది భాగమంతయును, అక్కిలి నడుమను, బొడ్డు నడుమును, ఎడమ తొడ నడుమును, లంబము చేయవలయును. నిలుకడ గల పాదము చీలమండ నడుము. ప్రభామండలము నడుమను, ముందువైపు నూలును జాఱవిడువవలయును. నొసలు నూలు యొక్క నిర్గమము $4\frac{1}{2}$ అంగులముల సందును, చీలమండ నూలు సందు 12 అంగులములు, అక్కిలి నడుమ నూలు $7\frac{1}{2}$ అంగులములు 9 అంగులముల వఱకును చేయవచ్చును. కిరీటము యొక్క ప్రక్కను 1, 2 అంగులములు నూలుకు సందుండవలయును. ముందు వైపున పైన పొట్టను అనుకొని నూలు జాఱవిడువవలయును. ఆ నూలు నుండి కదలుచున్న చెయ్యి భుజము చివరకు $2\frac{1}{2}$ అంగులములు దాని నుండి వెనుక భుజము చివర 4 అంగులములు. అచ్చటి నుండి నిప్పుగల చేయి ప్రక్క వఱకు 38, లేక 40 అంగులములు

అక్కడినుండి పైన 3 అంగులములకు అక్కిలి నూలుండవలయును. అక్కిలి నూలుతో సమానముగా ఎత్తబడిన అభయహస్తము యొక్క నడిమి వ్రేలుండవలయును. ఆ చెయ్యి యొక్క అరచెయ్యిగాని యుండవచ్చును. ముందు వైపున నడిమి వ్రేలినడిమికనుపు పైన యవము పైన పాత్రమున అగ్నియుండవలయును. పాత్రము లేకున్నను, 5 అంగులముల విస్తారమును 7 అంగులముల యెత్తును లేక 8, 9 అంగులములైన నుండవచ్చును. అగ్నికి జిహ్వలు 3, 5, 7 చేయవచ్చును. నడిమి నాలుక నుండి క్రమముగా మిగిలిన నాలుకలు రచించవలయును ముందు నూలు కుడి వైపున భుజము పైన చేయవలయును.అచ్చటినుండి డమరుకము ...చెయ్యి మనికట్టు వెలుపల38, 40 అంగులములుండవలయును. ఎడమ చెయ్యి కుడివైపునకు జాచబడినదియును 40 అంగులములుండవలయును. డమరుక హస్తము యొక్క మనికట్టును. అక్కిలి నూలును సమానముగా నుండవలయును. డమరుకము యొక్క నడుమును సూచీహస్తముతో పైకెత్తి పట్టుకొనబడియుండవలయును సూచీముఖహస్తమున గాతర్జని వ్రేలిని చాచి బొటనవ్రేలితో మిగిలినమూడు వ్రేళ్ళను కలిపినది "సూచీముఖోఽభ వేదూర్ధ్వం కటకాముఖ తర్జనీ అహమేక ఇతి బ్రహ్మ నిర్దేశమకరోద్వ్యతః। తస్మాత్పరాత్పరాజ్జాతో సూచిరస్యఋషీరవిః దేవజాతి శ్వేతవర్ణో విశ్వకర్మాధిదేవతా॥ పూర్వకాలమున బ్రహ్మనేనొకడనేయని నిర్దేశించునపుడు బ్రహ్మ వలన సూచీహస్తము పుట్టెను. ఇది దేవజాతి దీనికి ఋషి సూర్యుడు వర్ణము శ్వేతము. అధిదేవత విశ్వకర్మ (అభినయ దర్పణము) తర్జని ముందు సూచీ ముఖము యొక్క పై భాగముండవలయును, తర్జని తగులగూడదు. దానిని చీకటి యందురు. డమరుకము యొక్క నడుము నడిమి వ్రేలిపైనగాని ఉంగరపువ్రేలిపైనగాని యుండవచ్చును. డమరుకము పొడవు 8 అంగులములు విస్తారము 5 అంగులములు నడుము 3½అంగులములు కలిగి పద్మమువలె నుండవలయును. దానికి రెండు

పై వుల మూతలు చర్మముతో నుండవలయును. ఆ రెండు మూత లను వాలుతో చుట్టును బిగించి యుండవలయును.

శ్లో॥ సూచ్యగ్రాత్కర్ణసీమాంతం చత్వారింశతిమాత్రకం
తపంచచత్వారింశద్వా పంచాశన్మాత్రకంతువా॥ 23
పార్శ్వసూత్రంసమంసూచ్యా వాన్యాస్తామధ్యమాంగులమ్
దక్షిణేపూర్వహస్తంతు అభయంపరికల్పయేత్ ॥ 24
ప్రాక్సూత్రాదుభయేహస్తే మధ్యంభానుద్వయాంగులం
వన్మధ్యమాంగులాంతంతు హిక్కాసూత్రసమంభవేత్॥ 25
సూత్రాత్కూర్పరసీవ్రంతు చత్వారింశద్ద్విమాత్రకం
అభయంప్రకోష్ఠమధ్యేతు భుజంగవలయంన్యసేత్॥ 26
ప్రకోష్ఠమధ్యనాహంస్యాత్ సపాదంతస్యదీర్ఘకం
తత్సూత్రాదుపరిఖ్యాతం ఫణంభాన్వంగులంభవేత్॥ 27
సప్తాంగులంవిశాలంతు ఘనమేకాంగులంభవేత్
పురఃస్థితాన్సమీక్షేత్తుజిహ్వానీవ్రసమన్వితం॥ 28
భుజంగవలయంహేచ్యం కల్పయేచ్ఛిల్పవిత్తమః
సూత్రాత్కట్యంతరంసవ్యే పార్శ్వే ద్వాదశమాత్రకమ్॥ 29
సూత్రాన్మధ్యోదరంవామే నవాంగులముదాహృతం
నవమాత్పిండసూత్రంతు సూత్రాదష్టాదశాంగులమ్॥ 30
సూత్రాత్కుంచితజాన్వోస్తు అంతరంతుదశాంగులమ్
నవాంగులంచాష్టమాత్రం జానునీవ్రంయథాక్రమమ్॥ 31
భానురుద్రదశాంగుల్యం నతమానంతుకల్పయేత్॥
స్థితాంఘ్రిజానుంచోర్ధ్వామం జానునీవ్రంతదాకులమ్॥ 32
త్రిపంచమనుమాత్రంవా జానుద్వ్యంతంతథైవచ
స్థితాంఘ్రినలకామధ్యా ద్వామపార్ష్ణ్యంతరంబుధః॥ 33
సవేదచత్వారింశచ్ఛ సాంగులంప్రవిధీయతే

సప్తాష్టపంచచత్వారింశ త్స్వాంగులంతునతంభవేత్॥ 34
స్థితజానూర్ధ్వతంపార్ష్ణ్యా చతుస్త్రింశతిమాత్రకం
త్రయ స్త్రింశతిమాత్రంవా జానుపార్ష్ణ్యంతరంద్విజ॥ 35
ఉద్ధృతాంఘ్రిస్తుజానూర్ధ్వం నాభిసూత్రసమంభవేత్
కూర్పరం డోలహ స్తంస్యా న్నాలసూత్రం దశాంగులమ్॥ 36
ఏకాదశాంగులంవాఽథ కల్ప్యేవంకూర్పరాంతకం
తద్ధస్తే మణిబంధస్తు వామజానుతుద్వ్యంతరమ్॥ 37
దశాంగులంవాకర్తవ్యం నవాంగులముదాహృతం
డోలహస్తంవింధ్య స్త దంగులాగ్రంవిశేషతః 38
వామపాదేతుజంఘాది ద్వ్యంతరంత్ర్యంగులంభవేత్
నవాంగులాంతరంవాఽపి రుద్రాంగులమథాపివా॥ 39
డోలహస్తాద్భయాంతంతు ద్వ్యంతరంతుదశాంగులమ్॥
అన్యోన్యయుక్తనీవ్రాణి యథాసౌందర్యమాచరేత్॥ 40

తా॥ సూచీ హస్తము చివర నుండి కర్ణ ప్రదేశము వఱకు 40 అంగులములు లేక 45, 50 అంగులము లుండవచ్చును. ప్రక్కనూలుతో సమానముగా సూచి నడిమి వ్రేలుండవలయును. కుడి వైపు ముందు చెయ్యి అభయమును చేయవలయును. ముందు నూలు నుండి రెండు చేతుల నడుమ 24 అంగులములు అది నడిమి వ్రేలి వఱకును, ఆక్కిలి నూలుతో సమానముగను ఉండవలయును. నూలు నుండి మోచెయ్యి నిర్గమమును, 42 అంగులములు అభయ హస్తము యొక్క ముంజేతి యందు భుజంగవలయమును రచించవలయును. ముంజెయ్యి నడుమ నాహము $1\frac{1}{4}$ యును దానిని యముడివి ఆ నూలు నుండి పైన చేయవలయును. పాము పడగ పొడవు 1౹ అంగులములును, వెడలుపు 7 అంగులములును, మందము 1 అంగులమును ముందుకువచ్చి ఆడుచున్నట్లును నాలుకలు ముందుకు కనుపడుచు

భుజంగవలయముండవలయును. నూలు నుండి చంకల నడుమ కుడి ప్రక్క 12 అంగులములు, నూలు నుండి పొట్ట నడుము యెడమ ప్రక్క 9 అంగులములు తొమ్మిది నుండి పొట్ట నూలు నూలు నుండి 18 అంగుళములు, నూలు నుండి వంచిన మోకాలు సందు 10 అంగులములు లేక 9, 8 అంగులములు మోకాలి నిర్గమముండవచ్చును. వంపు 12,11,10 అంగులములు చేయవచ్చును. నిలిచిన కాని మోకాలును, తొడ యెడమ ప్రక్కయును మోకాలి నిర్గమమును కలిసి యుండవలయును 15, 14 అంగులములు మోకాళ్ళ రెంటి కడపటి వఱకుండవలయును. నిలుచున్న కాలిచీలమండ పై భాగము నడుము నుండి యెడమకాలి చీలమండలోపల 44, 45 అంగులములుండదగును. వంపు 47, 48, 45 అంగులము లుండవలయును. నిలిచిన కాలి మోకాలుపై కెత్తబడిన కాలిచీలమండ సందు 34, 33 అంగులములుండవచ్చును. పైకెత్తబడిన కాలి మోకాలిపైన నాభిసూత్రముతో సమానముగా నుండవలయును. మోచెయ్యి క్రిందికి వంచిన చెయ్యి సందు నాలసూత్రము 10 అంగులములు 11 అంగులములును చేయవచ్చును. ఆ చెయ్యి యొక్క మనికట్టు నుండి యెడమ మోకాలి సందు 9, 10 అంగులము లుండవచ్చును. వాలిన చెయ్యి వ్రేళ్లతో గూడ వాలి యుండవలయును. ఎడమ పాదము పిక్క మొదలు సందు 9, 11 అంగులములుండవచ్చును. వాలిన చెయ్యి అభయహస్తము సందు 10 అంగులములు ఒక అవయవము నుండి మఱియొక అవయవము యొక్క నిర్గమము అందమునుబట్టి చేయవలయును.

శ్లో॥ కేశాంతాద్బాహుపర్యంతస్యాత్తుంగమష్టాదశాంగులం
సప్తదశాంగులంవాఽథ షోడశాంగుల మేవవా॥ 41
తదర్ధం వా త్రిపాదం వా తస్యవిస్తార మేవహి
సవికీర్ణ జటాభారం పంచషట్ సప్తనందవా॥ 42

రుద్రసంఖ్యాతువావిప్ర ఉభయోఃపార్శ్వయోస్తథా
ద్వాత్రింశాంగులమారభ్య చైకషష్ట్యంగులాంతకమ్॥ 43
అంగులాంగులవృద్ధ్యాతు జటాదీర్ఘముదాహృతం
అధోజటాదీర్ఘమేవం తస్మాదూర్ధ్వంతుమూర్ధకే॥ 44
కనిష్ఠాంగులపరీణాహం జటానాహముదాహృతం
జటాంతపుష్పమాలాభి రలంకృత్యవిశేషతః॥ 45
నాగంచైవార్కపుష్పంచ ధుత్తూరకుసుమంతథా
హరిత్‌శిరీషకంచైవ కరోటిరత్నబంధనమ్॥ 46
రుహంధృత్వాతుముకుటే దక్షిణేచంద్రశేఖరం
సింధూరాకృతిమాళిస్తు అష్టమాలావిలంబితమ్॥ 47
భస్మోద్ధూళితసర్వాంగం కించిత్ప్రహసితాననం
యజ్ఞోపవీతసంయుక్తం ఉరఃసూత్రసమన్వితమ్॥ 48
దేవాంగనోరుదేమధ్యే బాహుధామేఽగ్రనిర్గతిః
ప్రభామండలమాశ్రిత్యో దరబంధాగ్రకోద్విజ॥ 49
వ్యాఘ్రచర్మాంబరోపేతం ఊర్ధ్వగతివసానకం
డోలాబాహూర్ధ్వతోబంధం వ్యాఘ్రచర్మంద్విజోత్తమ॥ 50
లంబనంబాహుమూలేతు భానుత్రయోదశాంగులం
తదర్ధంవాత్రిపాదంవా విస్తారంతత్రమండలమ్॥ 51
పాదౌనూపురసంయుక్తౌ సర్వాభరణభూషితౌ
హస్తపాదాంగులంసర్వం రత్నహేమాంగుళీయతమ్॥ 52
మధ్యాంగులంవిసృజ్యాతు శేషంపైముద్రికాన్వితం
దక్షిణంకుంచితంపాద మపరస్యోపరిస్మృతమ్॥ 53
తిర్యక్పాదతలన్యాసా న్నృత్తంకుర్యాన్మహేశ్వరః
హిమపాదంతతోద్ధృత్య సతిర్యగ్దక్షిణాన్వితమ్॥ 54

ద్రోలవా స్తమధాత్యంత మపస్మారమిహోచ్యతే
త్రిచతుష్పంచమాత్రంవా అపస్మారస్యదీర్ఘకమ్॥ 55
అష్టచత్వారింశాంశంతు అపస్మారోదయంకురు
ఉష్ణీషంచైకభాగేన కేశాంతంచద్విధాభవేత్॥ 56
హృదయంనాభిపర్యంతం తత్సమంపరికీర్తితం
నాభిమేఢ్రస్యమూలాంత మానంషణ్మాత్రకంభవేత్॥ 57
సప్తాంగులంచోరుదీర్ఘం జానుదీర్ఘంయుగాంగులం
జంఘాదిచోరుతుల్యంస్యా ద్వ్యంతరంచరణోదయమ్॥ 58
మస్వాంశేతుకరంహిత్వా మధ్యమాంగులిసీమకం
శేషంయుక్త్యాతుకర్తవ్యం శాయయేత్తుఅధోముఖమ్॥ 59
శంభోఃసవ్యశరీరస్థా వుభౌపాదాతుకీర్తితం
అపస్మారోదరోచ్ఛంతు ధర్మనందాష్టమాత్రకమ్॥ 60
తన్ముఖంతుసముద్ధృత్య బాలలీలాసమన్వితం
వ్యాలంవైవామహస్తేన దక్షిణేతస్యచేంద్రియమ్॥ 61
సస్యశ్యామనిభాకార మపస్మారంద్విజోత్తమ॥

తా॥ కేశాంతము నుండి భుజము ప్రక్క యెత్తు 18 అంగులములు లేక 17, 16 అంగులము లుండవచ్చును. అందులో సగముగాని ముప్పాతిక వంతుగాని దాని విస్తారమును చేయవలయును. లెస్సగా శేగిన వెండ్రుకలు గల జడ 5,6 7,9,11 అంగులములుండవలయును. రెండు పైపులను 32 అంగులములు మొదలు 61 అంగులము వఱకు 1-1 అంగులమును పెంచుచు జడ యొక్క పొడవును చేయవచ్చును. దిగువ జడ యొక్క పొడవు యిట్లుచేసి ఆ పైన తలమీాద రచించవలయును. చిటికెన ప్రేలి లావున జడ యొక్క లావుండవలయును. జడపై పూలదండలును, పాము, జిల్లేడుపువ్వు, ఉమ్మెత్త పువ్వు, గరిక,పచ్చని గడ్డి, ఒరిసెనపువ్వు, తలపుఱ్ఱె, రత్నములు పొదిగిన బంగారపు బిళ్ల

ముకుటముననుకుడిపైపున చంద్రుడును, జటామాళి యెఱ్ఱని రంగు తోను, దానికి 8 దండలును, శరీరమంతయును విభూతి పూయబడి యుండుటయును కొంచెము నవ్వుతో గూడిన ముఖమును, జందెమును ఉరస్సూత్రమును భుజము నుండి ముందుకు నిర్గమము చుట్టును కాంతి మండలమును ముందు ఉదర బంధమును, పులితోలు వస్త్రమును. పైకి లేచుచున్న ఉత్తరీయమును అడ్డముగా ద్రిప్పిన యెడమ చేతిపైన యెత్తుబడిన కుడిచేయియును. పులితోలును, భుజము మొదలున దిగువకు జారినది 12, 13 అంగులములును, అందులో సగము గాని ముప్పాతికవంతుగాని విస్తారముతో మండలమును చేయవలయును. పాదములకు అందెలును, సమస్తమైన భూషణములును, కాలివ్రేళ్ళకును చేతివ్రేళ్ళకును నడిమివ్రేలిక దప్పరత్నముల్లుగల యుంగరములును. కుడికాలు వంచిఅపస్మారముపైన నుంచవలయును. రెండవకాలు అడ్డముగా దిరిగి నృత్యము చేయుచున్నట్లుండవలయును. ఎడమకాలు అడ్డముగా కుడివైపునకు దిరుగుచున్నట్లును, ఆ పైన డోల హస్తమును రచించవలయును. అపస్మారమును రచించు పద్ధతిని చెప్పుచున్నాడు. 3, 4, 5 అంగులములు పొడవుచేయవచ్చును. అందులో లేక 4రె అంగులములవఱకు పొడవును చేయవచ్చును. ఉష్ణీషం 1 భాగం కేశాంతము 1 భాగమును తొమ్మి బొడ్డువఱకును, బొడ్డు నుంచి మేఢ్రము వఱకు 6 అంగులములు చొప్పున చేయవలయును. తొడ పొడవు 7 అంగులములు మోకాలు నిడివి 2 అంగులములు పిక్క తొడతో సమానము పాదము 2 అంగులములు చెయ్యి 14 అంగులములు అక్కిలి నుండి నడిమివ్రేలి చివరకు మిగిలినవి ఆలోచించి చేయవలయును. మొగము క్రిందకున్నట్లుగా పడియుండునట్లు అపస్మారమును రచించవలయును. శివుని యొక్క కుడి వైపు శరీరము ననుసరించి రెండు కాళ్లుండవలయును. అపస్మారము యొక్క పొట్ట యెత్తు 10, 9, 8 అంగులములు చేయవలయును. ముఖమును యెత్తి ప్రక్కకు చూచుచున్నట్లు పిల్లవాని ముఖమువలె

సు దరముగా రచించవలయును, ఎడమచేత పాశమును కుడిచేత తన శరీరమును తాకి గాని లేక గుప్పిలిపట్టిగాని యుంటవచ్చును. ఆకుపచ్చని రంగుతో అపస్మారరూపముండవలయును

శ్లో॥ కలాంశంపద్మపీఠోచ్ఛ్రం విస్తారంచచతుర్గుణః 62
సపాదంసార్ధంపాదో ద్విగుణంవాతదాయతం
ఊర్ధ్వపద్మమధోపద్మం పిండికాంచోక్తవద్భవేత్॥ 63
ప్రభామండలసంయుక్త మనేనవిధినాకురు
గుణాంగులఃసమారభ్య శతమాత్రావసానకమ్॥ 64
తావదేవాంగులాఖ్యాతు లైకోనశతోదయమ్
ఏకాంగులంసమారభ్యైకైకైకయవవర్ధనమ్॥ 65
పశ్చాత్ సంఖ్యాశతంఖ్యాతో దండఃస్యాత్ ప్రథమస్యతు
తత్తదష్టాంశహీనంతు ఊర్ధ్వోర్ధ్వంతుక్రమాత్ కృశమ్॥ 66
ఏకద్విత్రిచతుఃపంచ షట్సప్తవసుమాత్రకం
పునఃపునస్తథాసంఖ్య ముపకుర్యాత్ ప్రకల్పయేత్॥ 67
కర్తురిచ్ఛావశాత్తేషు దండసంఖ్యాంతుతత్కురు
నానాదలలతాభిశ్చ నానాపుష్పైశ్చశోభితమ్॥ 68
తస్యోపరిష్టాదలినం హస్తంవైశిఖరంబుధః
కర్తవ్యంపరితోవిప్ర దలస్యాభ్యంతరాన్వితమ్॥ 69
భానుమండలంవాధీమాన్ ప్రభామండలవర్తనమ్
తస్యవామేఉమాదేవీం ప్రాగుక్తవిధినాకురు 70
ఏతస్యప్రథమంప్రోక్తం సర్వలోకహితావహమ్॥

తా॥ పద్మపీఠము యెత్తు 16 భాగములు విస్తారము ఎత్తుకు 4 రెట్లును, పాదపు విస్తారము పైన $\frac{1}{4}$ వంతుగాని, $\frac{1}{2}$ వంతుగాని, $\frac{3}{4}$ వంతుగాని యెక్కువ చేయువలయును. ఊర్ధ్వపద్మము, అధోపద్మము,

మధ్య గర్భము ఇది శాస్త్రమున జెప్పబడినట్లు చేయవలయును. కాంతి మండలముతో గూడుకొని యుండవలయును. 3 అంగులములు మొదలుకొని 100 అంగులముల వఱకు 1. 1 అంగులమును పెంచుచు పాదవును 98 విధములుగా చేయవచ్చును. 1 అంగులము మొదలు కొని 1. 1 యన పెంపుతో నూరు విధములుగా దండమును చేయ వచ్చును. ఇది మొదటిది ఆ పైన ఒక్కొక్క దానిలో 8వ వంతు తగ్గించుచు వరుసగా పైన సన్నము ను చేయుచుండవలయును. 1, 2, 3, 4, 5, 6, 7. 8 అంగులములు పైన పైన ఒక్కొక్క భాగమును తగ్గించుచు రచించవలయును. కర్త యొక్క ఇష్టానుసారముగా దండము యొక్క సంఖ్యను కల్పించవచ్చును. అనేకమైన దలములును, తీగెలును, పూలును, అందముగా రచించవచ్చును. లత యొక్క పై భాగమున 1 హస్తము శిఖరమును చేయవలయును. చుట్టును దలము లును ఆ లోపల ప్రతిమను రచించవలయును. సూర్యమండలమువలె గాని లేక సామాన్యమైన కాంతిమండలమువలెగాని మండలమును రచించవచ్చును. ఆ దేవుని యొక్క యెడమ వైపున పార్వతియును, అరూపము శాస్త్రమున జెప్పబడిన లక్షణములతోను రచించవలయును తొమ్మిది విధములైన నృత్తములతో మొదటిదియగు పార్వతీ సహిత శివరూప నృత్తము దీనిని శివకామసుందర నృత్తమనియును, నటరాజ నృత్తమనియును ఆనంద తాండవమనియును జెప్పుదురు.

(అనుబంధము 25 నుండి 28 వఱకు గల పటములు చూడుడు)

## 38 (2)వ భేదము

### జాహ్నవీధవేత్

శ్లో॥ తదేవదక్షిణేపార్శ్వే జటాగ్రేచవిభాజితే
శంభోర్దేహాంతరంచైవ షోడశాంగులసమ్మితమ్
స్త్రీమానోక్తాంగసంయుక్తం హృదయాలింగసంయుతమ్॥ 72
ఏవంమానవిధింయుక్తం నృత్తంయుక్త్యాద్వితీయకమ్॥

తా॥ పై జెప్పబడిన దానినే కుడిపై పున శివుని దేహమున 16 అంగులముల మితముతో స్త్రీ రూపము యొక్క కొలతల ప్రకారము ఆొమ్మును అనుకొని యున్నట్లు రచించుట రెండవ విధము.

## 39. (3 వ భేదము

శ్లో॥ తదేవ వామపాదంతు అపస్మారోపరిస్థితమ్॥ 73
ఉద్ధృతం దక్షిణం పాదం వామపాదం ప్రసారితమ్
లలాటమధ్యవామే తు వామనాసాపుటాంతికే॥ 74
లంబయేద్బ్రహ్మసూత్రం తు స్థితపాదస్య గుల్ఫకే
శేషం ప్రాగివ కర్తవ్యం యథా నృత్తం తృతీయకమ్॥ 75

తా॥ ఎడమ కాలును అపస్మారముపై నుంచి కుడికాలును ఎత్తి యెడమ కాలును చూచి నొసలు యొక్క నడుమ యెడమ పైపున ముక్కుపుట యొక్క అంతమున బ్రహ్మ సూత్రమును చేసి నిలుచున్న కాలి యొక్క చీలమండ నుండి బ్రహ్మ సూత్రమును స్థిర పఱచి మిగిలిన కొలతలన్నియును పూర్వము చెప్పిన ప్రకారము రచించవలయును, ఇది మూడవ విధము.

## 40. (4) వ భేదము

శ్లో॥ అవకీర్ణ జటాభార జటాముకుటసంయుతమ్
జటామండలసంయుక్తం విశేషంచాథ్యనృత్తవత్॥ 76
చతుర్థం నృత్తమేతద్ధి సర్వప్రాణిహితావహమ్॥

తా॥ చెదరిన జడలును, జటామకుటమును జటామండలమును గలిగి మొదటి నృత్త రూపముతో రచింపబడినది నాల్గవ భేదము.

## 41. (5) వ భేదము

శ్లో॥ కర్ణాంతముద్ధృతం సవ్య పాదం వామంతుకుంచితమ్॥ 77
భుజాష్టకసమాయుక్తమేతత్ పంచకనృత్తకమ్॥

తా॥ కుడికాలు చెవి వఱకు ఎత్తబడి యెడమ కాలు నంచి చుట్టును ఎనిమిది భుజములతో గూడి యుండబడినది అయిదవ భేదము

## 42. (6. 8) భేదములు

శ్లో॥ అభయంశూలపాశంచ డమరుందక్షిణేకరే॥ 78

కపాలంచాగ్నిపాత్రంచ హస్తంచంద్రకలోపమమ్
గజహస్తోపమంహస్తం ప్రసార్యదక్షిణానుగమ్॥ 79

యద్వత్ ప్రథమనృత్తంస్యాత్ సర్వసూత్రంప్రసారయేత్
యత్తుపంచమనృత్తంస్యా దేవమేవేతినృత్యతే॥ 80

దోర్భ్యఃషోడశసంయుక్తం వామేగౌరీసమాయుతం
హస్తాభ్యాముద్ధృతంస్కంధం స్తనంతస్యప్రసారితమ్॥ 81

అభయంశూలపాశంచ ఖడ్గండమరుకధ్వజమ్
వేతాలంసూచిహస్తంచ దక్షమష్టకరంభవేత్॥ 82

అనలంగజహస్తాభం ఖేటకంవిస్మయంతథా
ఘంటాచైవకపాలంచ ఛురికాంసూచిమేవచ॥ 83

వామేత్వష్టభుజాఖ్యాతం శేషంపంచమనృత్తవత్
ఏవంషష్టాష్టమంఖ్యాతం రాజరాష్ట్రసుఖావహామ్॥ 84

తా॥ కుడివైపున నాలుగు చేతులలో అభయము, శూలము, పాశము, డమరుకమును, ఎడమ వైపున నాలుగు చేతులలో కపాలం, అగ్నిపాత్రము, చంద్రకలాహస్తమును, ఏనుగుతొండమువలె దక్షిణమునకు జాచిన చెయ్యియును ఇట్లు మొదటి నృత్తమువలె సమస్తమైన కొలతలును చేసిన యెడల ఆఱవ భేదము. మఱియు పదునాఱు చేతులును, ఎడమవైపున గౌరియును, రెండు చేతులతో ఎత్తబడిన మూపును, క్రిందిచెయి దిగువకు వంగిన స్తనమును, అభయము,

శూలము, పాశము, ఖడ్గము, డమరుకము, ధ్వజము, బేతాళము, సూచీహస్తము, కుడివైపునను, అగ్ని ఏనుగు తొండమువలె జాపబడిన చెయ్యి, ఖడ్గము, ఆశ్చర్యము, ఘంట, కపాలము, చురకత్తి సూచి హస్తము, ఇట్లు ఎడమవైపు చేతులయందును శిల్పరత్నమున ఇందలి ఖడ్గమునకు బదులు చక్రము చెప్పబడియున్నది. మిగిలినవి అయిదవ నృత్తమునందు జెప్పబడిన పద్ధతులతో రచించిన యెడల ఎనిమిదవ భేదమగును.

(అనుబంధము 29వ పటము చూడుడు)

## 43. (7)వ భేదము

శ్లో॥ త్రినేత్రమష్టహస్తంచసువికీర్ణజటాధరం
కుంచితంవామపాదంతు అపస్మారోపరిస్థితమ్॥ 85
వామపార్శ్వశిరస్తస్య వికీర్ణాంఘ్రిశ్చదక్షిణే
ఉద్ధృతందక్షిణాంగుష్ఠమగ్రగంసంహితసంగమమ్॥ 86
పూర్వసూత్రంతథాఽంగుష్ఠ నీవ్రంభాన్వంగులంభవేత్
అభయంశూలపాశౌ చడమరుందక్షిణేకరే॥ 87
కపాలంచాగ్నిపాత్రంచ తథావిస్మయహస్తకం
గజముహస్తోపమంవామే చతుర్థేచైవమేవహి॥ 88
గజహస్తోపమంసవ్యం వామంవ్యాలసమంతువా
లలాటస్యతుమధ్యేతు వామేతుస్థానమధ్యమే॥ 89
వామాంఘ్రినలకామధ్యే లంబయేద్బ్రహ్మసూత్రకం
తత్సూత్రాద్వామజాన్వంతం నీవ్రంచైవనవాంగులమ్॥ 90
నతమానందశాంశంస్యా ద్వామేగౌరీసమాయుతం
సప్తమంనృత్తమాఖ్యాతం జగద్దుఃఖవినాశకమ్॥ 91

తా॥ మూడు కన్నులును, ఎనిమిది చేతులును, చెదరిన జడలును, ఎడమకాలు వంచబడినదిగను, అపస్మారముపై నుంచబడినది

యును తన యొక్క తల యెడమ ప్రక్కను, చెదరిన వెంట్రుకలును కాలును దక్షిణమునను, ఎత్తబడిన కుడికాలి బొటనవ్రేలు చక్కగా అపస్మారముపై నుండుటయును, ముందువైపు నూలు నుండి బొటన వ్రేలి యొక్క నిర్గమము 12 అంగులములును, అభయము, శూలము పాశము, డమరుకము, ఈ నాలుగు కుడిచేతులయందును, తలపుర్రె, నిప్పుగిన్నె, విస్మయ హస్తము, ఏనుగు తొండమువంటి హస్తము. ఈ నాలుగు ఎడమవైపు చేతులయందును, ఇట్లు నాల్గవ భేదమున జెప్ప బడిన రీతిని మిగిలిన యంశములను గూడ రచించవలయును. లేక గజహస్తమువంటి చెయ్యి కుడివైపునను, ఎడమచెయ్యి వ్యాలముతో సమానముగాగాని చేయవచ్చును. నొసలు యొక్క నడుమను, ఎడమ ప్రక్కను, నిలుకడ యందు నడుమను, ఎడమకాలి యొక్క చీల మండ పై భాగము నడుమను, బ్రహ్మసూత్రమును చక్కగానుంచి ఆ సూత్రము నుండి యెడమ మోకాలి వఱకు నిర్గమము 9 అంగు లములును, వంపు 10 భాగములును, ఎడమ వైపున పార్వతియును రచించవలయును. దీనిని సప్తమ నృత్త మందురు. ఇది లోకము యొక్క దుఃఖములను బోగొట్టును.

## 44. (9)వ భేదము

శ్లో॥ తమేవంషడ్భుజంభేద మభయండమరుంతథా
శూలందక్షిణపార్శ్వేతు కపాలంవిస్మయంతథా॥ 92
గజహస్తోపమంవామే సూత్రంప్రాపయదష్టకం
చతుర్భుజంత్రినేత్రంవా జటామకుటమండనమ్॥ 93
అభయండమరుంసవ్యే వామేఽగ్నిర్గజహస్తవత్
అపస్మారంవినాపీఠే వామాంఘ్రికుంచితంస్థితమ్॥ 94
తత్తత్పురఃస్థితంపీఠే సవ్యపాదకనిష్ఠకే
తత్పాదంకుంచితంయుక్త్యా సూత్రంయుక్త్యాతుకల్పయేత్॥ 95

సనమ్యంస్నృత్తమాఖ్యాతం గంగాధరమతఃపరమ్
ఇత్యంశుమద్భేదేకాశ్యపశిల్పేనృత్తమూర్తిలక్షణంనామ
పంచషష్టితమఃపటలః -

తా॥ పై జెప్పిన దానినే ఆఱుచేతులును, అందు అభయము, డమరుకము, శూలము, కుడివైపునను, కపాలము, విస్మయము, గజ హస్త రూపము ఎడమవైపునను, ఇట్లు ఎనిమిది సూత్రములతో రచించవచ్చును. లేక నాలుగు చేతులు మూడు కన్నులును, జటా ముకుటమును, కుడివైపున అభయము డమరుకము ఎడమవైపున అగ్నియు ను, గజహస్త రూపహస్తమును, అపస్మారము లేకుండ పీఠమున నుండునట్లు రచించవచ్చును. ఎడమకాలు వంచి నిలువబడుటయును, అన్ని భేదములలోను వాని వాని పీఠమున కుడికాలి చిటికెన వ్రేలు ముందువైపున ఆనునట్లును మడమ మెత్తబడి యుండునట్లును ఆ కాలు కొంచెము వంగినట్లును ఆలోచనతో రచించవలయును. ఇది తొమ్మిదవ నృత్యభేదము తరువాత గంగాధర లక్షణమును చెప్పబోవు చున్నాడు.

(అనుబంధము 30 నుండి 33 వఱకు గల పటములు చూడుడు)

## 45. గంగాధర లక్షణము

కాశ్యప శిల్పము 66 వ పటలము

శ్లో॥ గంగాధరమహంవక్ష్యే సంక్షేపేణాధునాశ్రుణు
స్వస్తికందక్షిణంపాదం వామపాదంతుకుంచితమ్॥ 1

లలాటమధ్యమాత్సర్వం నీత్వానవయవాంతకం
దక్షిణేచాక్షిసీమాంతే సవ్యనాసాపుటాంతరే॥ 2

హిక్కామధ్యమనాభిస్తు సవ్యేద్వ్యంగులకంభవేత్
దక్షిణేమేఢ్రమూలంస్యాన్మధ్యేవేదాంగులాంతరే॥ 3

పార్ష్ణ్యోశ్చ మధ్యమేచైవ హిక్కాసూత్రం ప్రలంబయేత్
యుగాంశంనతమానంతు పాదాంగుష్ఠద్వయాంతరే।
అష్టాదశాంగులంప్రోక్తం త్రయాంశంపార్ష్ణికాంతరమ్
విశ్లిష్టంస్యాజ్జటాబంధం వామేత్వీషన్నతాననమ్॥ 5
దక్షిణేపూర్వహస్తంతు కురుదేవీస్తనాశ్రితం
వామేనపూర్వహస్తేన దేవీమాలింగనంకురు॥ 6
దక్షిణేపరహస్తేతు జటాజాహ్నవిసంయుతం
ఉష్ణీషాంతంసముద్ధృత్య వామేకృష్ణమృగంధ్రువమ్॥ 7
దేవస్యవామపార్శ్వేతు దేవీవహితకాననం
స్వస్తికంవామపాదంతు దక్షిణంకుంచితంభవేత్॥ 8
సమజంఘనతంసూత్రం కల్పయేచ్ఛిల్పవిత్తమః
ప్రసార్యదక్షిణంహస్తం వామహస్తంతుపుష్పకమ్॥ 9
అథవాదక్షిణహస్తే ప్రకోష్ఠస్యత్రివర్గకమ్
శ్రోణిహస్తతలంలంబ్య స్వప్నస్థితిమివక్రమాత్॥ 10
సర్వాభరణ సంయుక్తం సర్వాలంకారసంయుతమ్
భగీరథందక్షిణేతు పార్శ్వేమునివరాన్వితమ్॥ 11
గంగాధరంహరంప్రోక్తం తతోపైత్రిపురాంతకమ్॥ 12

ఇత్యంశుమద్భేదేకాశ్యపశిల్పే గంగాధరమూర్తి లక్షణంనామ షట్షష్టితమఃపటలః

తా॥ గంగాధరమూర్తి లక్షణమును చెప్పుచున్నాడు, కుడి కాలు అడ్డముగా మోకాలి మీదను, ఎడమకాలు వంచియును, నొసలు యొక్క నడుమ నుండి అంతయును 9 యవలును కుడి కంటి యొక్క ప్రక్కను, కుడి ముక్కుపుట యొక్క అంతమునను. అక్కిలి నడుమను బొడ్డు కుడివైపున 2 అంగులములును కుడిపైపున మేఢ్ర మూలమున నడుమ 4 అంగులముల సందును, చీలమండల నడుము

అక్కిలి సూత్రమును ప్రసరింపచేయవలయును. వంపు 4 భాగములును, కాలిబొటనవ్రేళ్ళ రెంటి సందు 18 అంగులములును, చీలమండల రెంటి నడుమసందు 3 అంగులములును పీడిన జటాబంధమును ముఖము కొంచెము యెడమ వైపునకు వంగినట్లును కుడివైపున ముందు చెయ్యి పార్వతి యొక్క స్తనమును అనుకొని నట్లును, ఎడమవైపు ముందు చెయ్యి పార్వతిని పట్టుకొనినట్లును, కుడివైపున వెనుక చెయ్యి జడముడి యందున్న గంగను పట్టుకొనినట్లు యెత్తబడి యుండవలయును. ఎడమవైపు వెనుక చెయ్యి వేడిని పట్టికొనినట్లును, యెత్తబడి యుండవలయును. ఎడమవైపు వెనుక చెయ్యి లేడిని పట్టికొనినట్లును, శివుని యొక్క ఎడమవైపున పార్వతి తలదగ్గఱలో నుండవలయును. పార్వతి యొక్క కుడికాలు ముడిచి యుండవలయును, ఎడమకాలు మోకాలిమీద అడ్డముగా నుంచవలయును. రెండు పిక్కలకు దిగువ సూత్రము నుంచవలయును. కుడిచెయ్యి చాచి యుండవలయును. ఎడమచేతియందు పుష్పము నుంచవలయును. లేక కుడిచేతియందు ఒకదానిపై మఱియొకటి చొప్పున మూడు పద్మములు గాని రచించవచ్చును. చెయ్యి పిఱుదుకు అని యుండవలయును. కొంచెము చలనముగల స్వభావముతో నుండవలయును. ఆభరణములతోను, అలంకారములతోను భగీరథుడు కుడివైపునను పార్శ్వమున ఋషులను రచించవలయును. గంగాధరమూర్తి లక్షణము చెప్పబడెను. త్రిపురాంతక లక్షణమును చెప్పబోవుచున్నాడు.

## 46. త్రిపురాంతక లక్షణము

### అందు మొదటి విధము

### కాశ్యప శిల్పము 67 వ పటలము

శ్లో॥ త్రిపురాంతకమూర్త్యాస్తు లక్షణంవక్ష్యతేక్రమాత్
త్రిచతుష్పంచమాత్రంస్యాన్నతమానంయథాక్రమమ్॥ 1

ఆభంగం సమభంగంచ అతిభంగమితి త్రిధా
ప్రతిమోచ్ఛ్రనతం భాగం మానమేవం హి కల్పయేత్ ॥ 2
పాదాంగుష్ఠద్వయోశ్చైవ ద్వ్యంతరం షోడశాంగులం
ఆభంగం తద్విజానీయా దష్టాదశాంగులం సమమ్ ॥ 3
వింశత్యంగులమాఖ్యాత మతిభంగమితి స్మృతం
తత్ త్రిభాగైకభాగం తు పార్ష్ణ్యోశ్చ ద్వ్యంతరం భవేత్ ॥ 4
ఉష్ణీషాద్వామపార్శ్వే తు నేత్రాంతే తత్పుటాంతకే
హనోర్వామే సమాలంబ్య దక్షిణే స్తనచూచుకే ॥ 5
నాభేర్దక్షిణపార్శ్వే తు వామోరు సమపార్శ్వకే
దక్షిణాంఘ్రేస్తు పార్ష్ణ్యోస్తు వామపార్శ్వే తు లంబయేత్ ॥ 6
ఆభంగం సూత్రమాఖ్యాతం సమభంగమథః శృణు
లలాటమధ్యనాసాగ్రే పాదయోః పార్ష్ణిమధ్యమే ॥ 7
లంబయేత్పూర్వసూత్రం తు ద్వ్యంతరం త్వేవమూహ్యతాం
తత్సూత్రాద్వామపార్శ్వే తు హిక్కాసూత్రం శివాంగులమ్ ॥ 8
అర్ధాంగులం తు తత్సూత్రం వామే మేఢ్రం తు మధ్యమే
తత్సూత్రాద్దక్షిణే నాభి మేఢ్రమధ్యం యుగాంగులమ్ ॥ 9
తత్సూత్రాద్వామజాన్వంత మర్ధమాత్రం విధీయతే
సమభంగమితిఖ్యాత మతిభంగమథోచ్యతే ॥ 10
ఉష్ణీషాద్వామపార్శ్వే తు నేత్రాంతే చ పుటాంతకే
దక్షిణే స్తనమధ్యాంతం తత్సూత్రం తు గుణాంగులమ్ ॥ 1
నాభిమధ్యే తు వామే తు సూత్రనీవ్రం గుణాంగులమ్
తత్సూత్రం వామజాన్వంత మర్ధమాత్రం విధీయతే ॥ 12
వామాంఘ్రిపార్ష్ణిసవ్యే తు పార్శ్వసూత్రం ప్రలంబయేత్
స్పర్శనం వేశనం నీవ్రం సమపాదస్థానకోక్తవత్ ॥ 13

ఏవం త్రిభంగసూత్రేషు సంమిశ్రంతునకారయేత్
ఉత్తమంచాతిభంగంస్యాత్సమభంగంతితుమధ్యమం॥ 14
ఆభంగమధమంఖ్యాతం త్రిపురాంతకమూర్తితః
దక్షిణంస్వస్తికంపాదం వామపాదంతుకుంచితమ్॥ 15
దక్షిణేపూర్వహస్తేతు ద్వేనాభీసూత్రసంతతం
సింహాకర్ణంతుతద్ధస్తం బాణమధ్యంతుపిండితమ్। 16
బాణాయామంతుతత్సప్త త్ర్యంగులంతువిధీయతే
కనిష్ఠాంగువిపరీణాహం దేవేశస్యకరాస్థితౌ॥ 17
ఆస్యంపంచాంగులవ్యాస మాస్యచ్ఛంవ్యాససదృశం
ఆస్యతుంగంసమంపూజ్యంతుంగమన్యాంగుపీతతమ్॥ 18
వామహస్తేధనుర్ధృత్వా కటాంతాత్తత్కచోర్ధ్వకం
ఏకద్విత్ర్యంగులంవాఽపి తస్యోర్ధ్వృత్యాసతంతువా॥ 19
శతాంగులంతుతుంగంవా పంచసప్తనవాంగులం
హీనంవాఽప్యధికంవాఽపి నవధాధనుషాఽన్వితమ్॥ 20

తా॥ త్రిపురాంతకమూర్తి లక్షణమును చెప్పుచున్నాడు. తల యొక్క వంపు 3, 4, 5 అంగులములు చేయవచ్చును. ఆ భంగము సమభంగము, అతిభంగము అను మూడు విధములు ప్రతిమ యెత్తులో పై జెప్పిన వంపులను బట్టి యెత్తులో తగ్గించుచు రచించవలయును. రెండు కాలి బొటన వ్రేళ్ళ సందు 16 అంగులములు ఆ భంగమునను, 18 అంగులములు సమభంగమునను, 20 అంగులములు అతిభంగమునను జేయవలయును. ఒక్కొక్క దానిని 3 భాగములు చేసి అందు 1 భాగము చీలమండలసందు చేయుచుండవలయును. ఉష్ణీషము నుండి యెడమ ప్రక్క కంటి ప్రక్కను, ముక్కుపుట ప్రక్కను తాలువు యెడమ పక్కను. కుడిపైపు స్తనమునందలి ముక్కునకును, సూత్రమును చేయవలయును. బొడ్డుకు కుడి ప్రక్కను, ఎడమతొడ ప్రక్కను, కుడికాలి యొక్క చీలమండకు ఎడమ ప్రక్కను నూలును సరిచూచుకొనవలయును. దీనిని ఆ భంగసూత్రమందురు. నొసలు యొక్క నడుము నుండి ముక్కు చివర పాదముల యొక్క చీలమండల

నడుము వఱకు ఒక్కటే సూత్రమునుంచి రెండు వైపుల సమాన మైన కొలతలతో రచింపబడునది. సమసూత్ర పద్ధతి. ముందు వైపున యిట్లు నూలును పట్టి ఆ సందులను ప్రతిమాలక్షణమున జెప్పబడిన ప్రకారము రచించుచు ఆ నూలుకు ఎడమప్రక్క అక్కిలి సూత్రము 1 అంగులము ఆ నూలు నుండి $\frac{1}{2}$ అంగుళము ఎడమప్రక్క మేఢ్రము యొక్క నడుముండవలయును. ఆ సూత్రమునకే కుడిప్రక్క బొడ్డు మేఢ్రము సందు 4 అంగులములుండవలయును. ఆ నూలును బట్టియే యెడమ మోకాలి వఱకు $\frac{1}{3}$ అంగులము కలిగియుండవలయును. దీనిని సమభంగమందురు. ఉష్ణీషము నుండియెడమప్రక్కకన్నుచివర, ముక్కుపుటచివర. కుడిప్రక్క స్తనము యొక్క మధ్యప్రదేశము. ఆ సూత్రము నుండి 3 అంగులములు బొడ్డు నడుము యెడమప్రక్క సూత్ర నిర్గమము 3 అంగులములు ఆ నూలు నుండియే యెడమ మోకాలు $\frac{1}{2}$ అంగులము ఎడమకాలి చీలమండ కుడిప్రక్క నుండి పార్శ్వసూత్రమును చాచ వలయును. నూలుకు అనుకొనుట స్థలముండుట ముందుకువచ్చుట ఈ మూడు విధములును, సమపాదస్థానకమున జేసినట్లే చేయవలయును. త్రిభంగములు వేఱువేఱుగా జేయవలయునే కాని ఒకదాని కొలతను మఱియొకదానికి బెట్టరాదు. అతిభంగము ఉత్తమము, సమలు భంగము మధ్యమము, ఆ భంగము అధమము, అని తెలియవల యును. త్రిపురాంతకమూర్తికి యిన్ని విధములలోనే దైన జేయ దగును. కుడికాలు అడ్డముగాను, ఎడమకాలు వంపును, కుడివైపున ముందు చెయ్యి నాభి సూత్రమునుండి 2 అంగులములును, ఆ చెయ్యి సింహకర్ణమువలెను. బాణము యొక్క నడుమ లావుగను, బాణము యొక్క పొడవు 21 అంగులములును, కనిష్ఠాంగులము వెడల్పును — దేవేశ్వరుని హస్తములను బట్టి రచించదగును. ముఖము విస్తారము 5 అంగులములును, పొడవు కూడ అదియే ప్రమాణమును కలిగి యుండవలయును. ముఖము యెత్తు సమానముగా నుండుట శ్రేష్ఠము

ఇతరమైన అంగుళియందు మెత్తు విస్తారముకంటే అధికమును కలదు. ఎడమచేత ధనుస్సునుబట్టికొని చంకవఱకుచెయ్యి మెత్తిగాని 1, 2, 3 అంగులములు పైకెత్తియయినను గాని, మెత్తు 100 అంగులములుగాని, 5. 7. 9 అంగులములు తగ్గించిగాని లేక యెక్కువ చేసిగాని యిట్లు 9 విధములుగా ధనుస్సును పట్టినట్లు రచింపవదగును.

శ్లో॥ పూర్ణముష్టితునాహంస్యా న్మధ్యమాగ్రాకృశౌకుతు
అగ్రంమధ్యాంగులవ్యాసం వృత్తకర్ణేవిచిత్రకం॥ 21
బాణనాహంత్రిభాగైకం రజ్జునాహంతుతంతునా
ధనుర్దీర్ఘాష్టభాగేతు సప్తాంశంరజ్జుదీర్ఘకమ్॥ 22
తద్దీర్ఘస్యానుకూలంతు ధనుర్వక్రముదాహృతం
త్రివక్రసహితంవాఽథ బాలచంద్రోభవేత్తథా॥ 23
ధనురాకృతిరేవంస్యా ల్లోహజందారుజంతువా
కర్తరీపరహస్తాద్వా టంకంకృష్ణమృగాన్వితమ్॥ 24
టంకందక్షిణహస్తేతు వామహస్తేమృగోధృతః
జటామకుటసంయుక్తం సర్వాభరణభూషితమ్॥ 25
ప్రవాలసదృశప్రఖ్యం వామేగౌరీసమాయుతం
త్రిపురాంతకమూర్తిస్తు ప్రథమంలక్షణాంచితమ్॥ 26

తా॥ గుప్పిలి నడుము లావును చివర సన్నముగను ఉండునట్లు రెండు చేతులకును చేయవలయును. నడిమివ్రేలుపైన కొంచెము వంచబడి యుండవలయును. బాణము యొక్క లావు 3 భాగములు చేసి అందు 1 భాగము త్రాడును చేయవలయును. విల్లు యొక్క పొడవు 8 భాగములు చేసి దాని త్రాడు 7 భాగములు చేయవలయును. దాని ననుసరించిన వంపు బాలచంద్రునివలెగాని లేక నడుము కొంత భాగము చక్కగా నుండి రెండు చివరలు లోపలికి వంగిగాని యుండవచ్చును. విల్లును లోహముతోగాని దారువుతో

గాని రచించవచ్చును. వెనుక రెండు చేతులును కర్తరీ హస్తములు చేయవలయును. టంకము, నల్లయిఱ్ఱి యుండవలయును. కుడిచేతులో టంకమును, ఎడమచేతిలో నల్లయిఱ్ఱియును కలిగియుండవలయును. జడలముడియును, అన్ని విధములైన సొమ్ములును, పగడముతో సమానమైన కాంతియును, ఎడమవైపున గౌరియులు గల రూపము త్రిపురాంతక రూపములలో మొదటిదియని తెలియవలయును.

## 47. రెండవ విధము

శ్లో॥ దేవస్యవామపాదంతు అపస్మారోపరిస్థితం
శేషంప్రాగివకర్తవ్యం ద్వితీయంలక్షణంభవేత్॥ 27

తా॥ ఈశ్వరుని యొక్క యెడమకాలు అపస్మారముపై నుంచి పూర్వోక్త ప్రకారము రచింపబడెనేని రెండవ పద్ధతి యగును.

## 48. మూడవ పద్ధతి

శ్లో॥ స్వస్తికంవామపాదంతు దక్షిణంకుంచితంభవేత్
శేషంప్రాగివకర్తవ్యం సూత్రాదితపార్శ్వకం॥ 28
తృతీయంలక్షణంప్రోక్తం చతుర్థంలక్షణంశృణు॥

తా॥ కుడికాలు వంపును ఎడమకాలు అడ్డముగాను ఉంచి పూర్వమువలెనే రచించు మఱియొక ప్రక్కకు దిరిగినట్లు రచించబడినది మూడవ పద్ధతి యగును.

## 49. నాలుగవ పద్ధతి

శ్లో॥ తదేవవామపాదంతు అపస్మారశిరఃస్థితః॥ 29
ప్రాగ్వైవావశేషంతు చతుర్థంలక్షణంహితం॥

తా॥ పూర్వము చెప్పబడిన దానినే యెడమకాలు అపస్మారం యొక్క తలపై నుంచి రచింపబడెనేని నాలుగవ పద్ధతి యగును.

## 50. ఐదవ పద్ధతి

శ్లో॥ కటౌబాణధరేహస్తే మధ్యరేఖాకలాంగులం॥ 30

తిధ్యంశంమనుమాత్రంవా త్రయోదశాంగులంతువా
భానురుద్రాంగులంవాఽథ ద్వ్యంతరంషడ్విదంభవేత్॥ 31
తత్పరంకూర్పరంనీవ్రం శ్రోణిపార్శ్వాంతథాభవేత్
కక్షొర్ధ్వమర్ధరంహస్తం మణిబంధాంతరంతతః 32
తత్పరేకూర్పరోద్ధారం హృదయాంతముదాహృతం
ఏకద్విత్రిచతుష్టంచ మాత్రంతన్మానకంతువా॥ 33
సర్వేషామపిసామాన్యం ద్వ్యంతరంకధితంమతం
తదేవపూర్వహస్తాద్వా కటకౌహృదయస్థితౌ॥ 34
వామేదక్షిణహస్తంతు క్రమాద్ద్వంద్వద్వయోర్మదా
బాణమూలంధృతంసవ్యం వామంబాణాగ్రకంధృతమ్॥ 35
పరహస్తేదక్షిణేటంకం ధనుఃస్యాద్వామహస్తకే
సవ్యేపార్శ్వేభృగుర్వాఽథ వామేగౌరీసమాయుతమ్॥ 36
అపస్మారంవినాపాదం నతసూత్రంచపార్శ్వయోః
ఏవంచతుర్భుజోపేతా మూర్తిఃపంచవిధాభవేత్॥ 38

**తా॥** మొలయందు బాణమును బట్టిన చెయ్యి నడుమరేఖ 16,15.14.13.12.11 అంగులములుండవచ్చును. ఇవి ఆఱు విధములు దాని వెనుక మోచెయ్యి నిర్గమము పిఱుదు ప్రక్కనుండవలయును. చంకనుండి విల్లును బట్టిన చెయ్యి తరువాత మనికట్టు సందు దాని వెనుక మోచెయ్యి పై యెత్తు ఱొమ్మువఱకుగాని 1.2.3.4 5 అంగులములు అధికముగాగాని, సామాన్యముగా అందఱును ఱొమ్ము యెత్తుననే యుంచుచుందురు. ముందు చేతులు రెండును కటకాముఖ హస్తములుగ (బొటనవ్రేలితో తర్జని మధ్యమ వ్రేళ్ళ ఆనించి అన్ని వ్రేళ్లను లోపలికి వంచబడినవి) ఱొమ్మున నుండవలయును, ఎడమప్రక్క కుడిచెయ్యి జాపి వరుసగా జంట చేయవలయును కుడిచేతితో బాణము యొక్క మొక్క మొదలును, ఎడమచేతితో బాణము యొక్క చివరను, పట్టి యుండవలయును. వెలుక చేతుల

కుడిప్రక్క టంకమును, ఎడమప్రక్క విల్లును కలిగియుండవలయును. కుడిప్రక్క భృగుమహర్షియును, ఎడమప్రక్క గౌరియును, పాదము క్రింద అపస్మారము లేకుండను, ప్రక్కలయందు ఒరిగిన నూళ్లును ఇట్లు నాలుగు చేతులు గల త్రిపురాంతకమూర్తిని ఐదు విధములుగా రచించవచ్చును. ఇవి సమభంగమునందలి భేదములు **అతిభంగ** విధములను చెప్పబోవుచున్నాడు.

## 51. ఆఱవ పద్ధతి

శ్లో॥ అతిభంగంతతోభేద మష్టహస్తసమన్వితం
బాణంచపరశుంఖడ్గం యజ్ఞంవైదక్షిణేకరే॥ 38
ధనుశ్చవిస్మయంఖేటం మృగహస్తమథాపివా
వామహస్తమిదంఖ్యాతం పూర్వహస్తాత్కరాంతకమ్॥ 39
యథాశోభంతథాతుంగం కల్పయేద్గౌరిసంయుతం
షష్ఠమప్యేవమాఖ్యాతం సప్తమంచాధునోచ్యతే॥ 40

తా॥ అతిభంగ స్థానకమున త్రిపురాంతక లక్షణమును చెప్పుచున్నాడు. ఎనిమిది చేతులును, కుడిపైపున బాణము, గండ్రగొడ్డలి, కత్తి, అగ్నిపాత్రము, ఎడమ చేతులలో, విల్లు, విస్మయము (అయిదు వేళ్ళను చాచి కొంచెము లోపలికి వంచి అరచెయ్యి క్రిందికి చూపబడినది.) పెద్దకత్తి జింక కలిగి యుండవలయును. లేక యెడమచేత జింకయును, కుడిచేత గొడ్డలియును, చేయవచ్చును. ముందు చేతులు మొదలు 8 చేతులును అందముగాను తగిన యెత్తునను రచించవలయును ఎడమ ప్రక్క పార్వతిని రచించవలయును. ఇది ఆఱవ పద్ధతి.

## 52. ఏడవ పద్ధతి

### శిల్పరత్నం 22వ అధ్యాయము

శ్లో॥ సప్తమేదక్షిణేబాణం చక్రంశూలంతతఃపరం॥ 84

టంకంవజ్రంతథావామే ధనుషంసూచివిస్మయే ——
ఖేటాని సర్వంపూర్వవదాచరేత్ ॥ 85

తా॥ కుడిచేతులలో బాణము, చక్రము, శూలము, ఎడమ చేతులలో టంకము, వజ్రము, ధనుస్సు సూచివిస్మయ హస్తములును కలిగియుండవలయును. ఇది యేడవ పద్ధతి.

## 53. ఎనిమిదవ పద్ధతి

శ్లో॥ బాణంచక్రంతథాశూలం టంకంవజ్రంచదక్షిణే
ధనుఃశంఖంతథాసూచీం విస్మయంఖేటకంతథా॥ 41

వామేపంచకరంఖ్యాత మతిభంగస్తథోపరి
తథైవదక్షిణంజానుం వామోపరినిథాపయేత్ ॥ 42

తత్పూర్వేవామపాదంతు తవేస్యస్యరథోపరి
రథంతుముకులోపేతం ముకులంరజ్జునాఽఽవృతం॥ 43

ముకులాభ్యంతరేబ్రహ్మా చతుర్వక్త్రంచతుర్భుజం
తస్యదక్షిణహస్తాద్వా వేణుదండకమండలుమ్॥ 44

కుండికాపద్మపాశంచ వామహస్తద్వయోధృతం
తథస్యముకులాధస్తాద్ వృషభంశ్వేతవర్ణకమ్॥ 45

రథంపూర్వేణమార్గేణ కల్పయేచ్ఛిల్పవిత్తమః
త్రిపురాంతకమాఖ్యాత మష్టభేదంద్విజోత్తమ॥ 46

ప్రవాలసదృశంప్రఖ్యం సత్వరాజసమిశ్రితం
సర్వాభరణసంయుక్తం చైకవక్త్రంత్రినేత్రకమ్॥ 47
తస్యవామేస్థితాందేవీం ప్రాగుక్తవిధినాకురు
సామాన్యలక్షణంకార్యం త్రిపురాంతకమూర్తినః॥ 48

ఇత్యంశుమద్భేదే కాశ్యపశిల్పే త్రిపురాంతకమూర్తి
లక్షణంనామసప్తషష్టితమఃపటలః

తా॥ కుడిచేతులలో బాణము, చక్రము, శూలము, టంకము, వజ్రము, ఐదును ఎడమ చేతులలో ధనుస్సు శంఖము, సూచీహస్తం (చూపుడు వ్రేలిని పొడవుగా చాచి మధ్యమ వ్రేలిని బొటనవ్రేలికి ఆనించి చివర రెండు వ్రేళ్ళను లోపలికి వంచబడినది) ఆశ్చర్యము (ఐదు వ్రేళ్ళను చాచి కొంచెము లోపలికి వంచి అరచెయ్యి క్రిందికి జూపబడినది). పెద్దకత్తి ఐదును అతిభంగమును కుడిమోకాలు యెడమ కాలిపై నుండవలయును. దానిముందు యెడమ కాలుండవలయును. రథముపై ప్రదేశమున పాదముండవలయును. రథము నందు మొగ్గయును, ఆ మొగ్గకు చుట్టును త్రాడును, ఆ మొగ్గ లోపల బ్రహ్మ నాలుగు మోములు, నాలుగు చేతులు, అందు కుడిచేతులలో వెదురు కఱ్ఱ కమండలువు ఎడమ రెండు చేతులలో గిన్నె, తామరకాండ, రథము యొక్క మొగ్గకు దిగువ తెల్లని యెద్దు, తూర్పుముఖముగా బోవుచున్నట్లును రచించవలయును. ఇట్లు త్రిపురాంతకమూర్తి లక్షణములు 8 చెప్పబడియున్నవి. పగడమువంటి కాంతియును, సత్వరాజస గుణములు కలిగియుండుట సమస్త భూషణములును, ఏకముఖమును మూడు కన్నులును ఎడమవైపున పార్వతియును శ్రీ దేవి లక్షణముల ప్రకారము రచించవలయును.

## 54. కళ్యాణమూర్తి లక్షణము

### కాశ్యప 68వ పటలము

శ్లో॥ అథకల్యాణమూర్తేస్తు లక్షణంవక్ష్యతేఽధునా
లలాటమధ్యవామేతు వామనేత్రావసానకే॥ 1
వామనాసాపుటాంతేచ హిక్కామధ్యేచలంబనేత్
దక్షిణంనాభిమధ్యేతు దేవహస్తాంగులంభవేత్॥ 2

సీత్వాస్థితాంఘ్రిగుల్ఫఃస్యా న్మధ్యేసూత్రంప్రలంబయేత్
ద్వ్యంతరంసతమానంచ సమభంగంయథాక్రమమ్॥ 3

స్వస్తికంవామపాదంతు దక్షిణంకుంచితంభవేత్
దక్షిణంపూర్వహస్తంతు గౌరీదక్షిణహస్తధృత్॥ 4

వరదంవామహస్తంతు పరహస్తద్వయోఃపరం
దక్షిణేపరశుంవాఽథ వామేకృష్ణమృగంతథా॥ 5

జటామకుటసంయుక్తం సర్వాభరణభూషితం
దేహంప్రవాళవర్ణాభం పార్శ్వేతస్యవిశేషతః॥ 6

సవ్యశ్యామనిభాదేవీ ప్రాగ్వన్మానాదిసంయుతా
ఉత్పలంవామహస్తేతు ధృత్వాదక్షిణహస్తకమ్॥ 7

శంభోర్ణస్తేనసంగ్రాహ్యం లజ్జాలంబసమన్వితం
పార్వతీమనుగాశ్రీభూః సర్వాభరణభూషితాః 8

హస్తాభ్యాంసంస్పృశేద్వేద్యాం గౌర్యాథస్తుకటంద్విజః
దేవాగ్రేకారయేత్కుండే హోమకర్మప్రజాపతిః 9

శంభోర్వైస్తనసీమాంతం ప్రజేశస్యోదయంభవేత్
చతుర్భుజంచతుర్వక్త్రం సర్వాభరణభూషితమ్॥ 10

అజినంచాక్షమాలాంచ వామహస్తేఽథరేపరే
దక్షిణంపూర్వహస్తంతు ధృతవామకరఃక్రమాత్॥ 11

ఉత్తరాభిముఖాసీనః పద్మపీఠేప్రజాపతిః
ప్రాగాస్యాదేవిదేవేశౌ దేవిదేవస్యదక్షిణే॥ 12

దక్షిణాభిముఖోవిష్ణు ర్హోమస్యోత్తరదిక్స్థితః
శంభోర్వైనాసీమాంతం శ్రీస్థాయామంస్తనాంతకమ్॥ 13

తయోర్మధ్యేఽష్టవాభక్త్వా నవధాకేశతోదయం
శ్యామవర్ణసమాయుక్తం శంఖచక్రౌపరేకరే॥ 14

హిరణ్యకలశద్వంద్వం పూర్వహస్తద్వయోపరి
సంగృహ్యావర దేహస్తే సుతీర్థోదకపూర్వకమ్॥ 51
అనాదిగోత్రభూతాయ పరమేశాయశంభవే
ఆదిగోత్రాముమాంగౌరీం తస్మైవాస్మిన్ దదామ్యహమ్॥ 16
ఇత్యుక్త్వావర దేహస్తే దద్యాత్తీర్థోదకంవిధిః
అష్టలోకేశవిద్యేశాః సిద్ధయక్షగణాదయః॥ 17
ఋషయశ్చైవగంధర్వా మాతరశ్చాన్యదేవతాః
తత్తచ్ఛక్తిసమోపేతా హృదయాంజలిసంయుతాః॥ 18

ఇత్యంశుమద్భేదే కాశ్యపశిల్పే కల్యాణ మూర్తి లక్షణం నామాష్టషష్టితమఃపటలః

తా॥ కల్యాణమూర్తి లక్షణమును చెప్పుచున్నాడు. నొసలు నడుమ ఎడమప్రక్క ఎడమ కన్ను చివర ముక్కు యెడమ పుటను అనుకొని అక్కిలి నడుమునకు సూలును లంబము చేయవలయును. బొడ్డు కుడిప్రక్క దేవుని హస్తము యొక్క ప్రేళ్లుండవలయును. కాలి యొక్క చీలమండల రెంటి నడుమ సూలును లంబము చేయవలయును. రెంటి యందు వంపులను సమభంగమున జేసినట్లు చేయవలయును. ఎడమకాలు అడ్డముగాను, కుడికాలువంపుగాను చేయవలయును. కుడివైపుముందు చెయ్యి దేవి యొక్క కుడిచేతిని పట్టికొని యుండవలయును. ఎడమచెయ్యి వరదహస్తమును ఆపైన దక్షప్రజాపతి యొక్క రెండు చేతులును, వెనుక కుడిచెయ్యి గండ్రగొడ్డలితోను, వెనుకవైపు యెడమచెయ్యి జింకతోను, కూడి యుండవలయును. జటామకుటమును, సమస్తమైన ఆభరణములును. పగడము వంటి వన్నెతో దేవుండును. తనయొక్క కుడిప్రక్క దేవి పచ్చని గుంకవంటి రంగుతోను, మధ్యమదశ తాలము ననుసరించిన కొలతలతోను. అన్ని నగలు మొదలయిన వానితోను ఎడమచేత కలువ

పుష్పని శివుని హస్తముతో బట్టికొనబడిన కుడిచేతితోను, శివునికి వివాహ వేషముతోను కుడిప్రక్క సిగ్గుతో తలవంచినట్లును ఆమె వెంట శ్రీదేవి భూదేవి సర్వాభరణములతో గూడియుండినట్లునూ వివాహవేదికయందు వధూవరులు తూర్పుముఖముగను వారిముందు కుండమును, ప్రజాపతిహోమకర్మము చేయుచును, శివుని స్తనము యెత్తున ప్రజాపతి శిరమును, నాలుగుముఖములు నాలుగుచేతులు సమస్తాభరణములు, జింకల చర్మము అక్షమా యెడమచేతులక్రిందను, కుడిచెయ్యి ముందు ధరించబడిన యెడమ చెయ్యియును, ఉత్తర ముఖమును గలిగి పద్మపీఠమున కూర్చుండిన బ్రహ్మయును, అగ్ని యొక్క కాంతి ముందు దేవుని యొక్క యెడమవైపున దేవియును దక్షిణముఖముతో విష్ణువు హోమము యొక్క ఉత్తరదిశయందు శివుని యొక్క నాసిక యెత్తున గాని, లేక స్తనముల యెత్తునగాని యుండవలయును. ఆ రెండు కొలతల నడుమ విష్ణువు యొక్క యెత్తును 9 భేదములుగా రచించవచ్చును ఆకుపచ్చరంగును శంఖము చక్రము వెనుక చేతులయందును, ముందు రెండు చేతులలో రెండు బంగారు చెంబులు తీర్థోదకములతోను నుండవలెను. దక్షప్రజాపతి అందొక కలశమును దీసికొని అనాది గోత్రసంభూతుడవైన యో మహేశ్వరుడా ! ఆదిగోత్ర సంజాతమైన ఉమాదేవిని నీకు యిచ్చుచున్నాను. అని శివుని వరదహస్తమందు తీర్థోదకమును విడుచుచుండవలయును. దిక్పాలురును, లోకపాలు డగు గణపతియును, సిద్ధులు, యక్షులు, ఋషులు, గంధర్వులు దేవతలు నిండియుండినట్లు రచింపబడినది. కల్యాణమూర్తి లక్షణము.

## 55. అర్ధనారీశ్వర లక్షణము

### కాశ్యప శిల్పము 69వ పటలము

శ్లో॥ అర్ధనారీశమూర్తేస్తు లక్షణంవక్ష్య తేఽధునా
చతుర్భుజంవద్భుజంచ ద్విభుజంపరికీర్తితమ్॥ 1

సభంగంస్థానకస్యోక్త సూర్గేణైవానతోదయః
స్వస్తికందక్షిణంపాద మితరంకుంచితంభవేత్॥ 2
వామార్ధంపార్వతీరూపం దక్షిణార్ధంమహేశ్వరమ్
అభయంపరశుంసవ్యే హస్తేవామగతంభుజంశివాంశకే। 3
వృషస్యమూర్ధ్నికన్యస్త కూర్పరంవామహస్తకే
తదన్యద్వామహస్తంతు కటకంపుష్పసంయుతమ్॥ 4
ద్విభుజేవరదంసవ్యే వామహస్తేతుపుష్పధృత్
శివస్యాభరణంసవ్యే వామేస్త్రీభూషణాంచితమ్॥ 5
పుస్తకందక్షిణేపార్శ్వే వామేస్త్రీణాంపయోధరం
అథవాకుంచితంసవ్యం పాదంవామంతుస్వస్తికమ్॥ 6
సవ్యంశూలధరంహస్తం వామేపుష్కరకంధృతం
వరదందక్షిణంహస్త మన్యోక్షిశిరపూర్వకమ్॥ 7
కపాలందక్షిణేహస్తే వామహస్తంప్రసారితం
దక్షిణేరౌద్రదృష్టిఃస్యా ద్వామేపార్శ్వేతుశీతలమ్॥ 8
దుకూలంచోరుమధ్యాంతం సవ్యంగుల్ఫాంతమన్యవ్యం
ఏవంవిస్తారతఃప్రోక్త మర్ధనారీశ్వరంపరమ్॥ 9
ఇత్యంశుమద్భేదే కాశ్యపశిల్పేఽర్ధనారీశ్వరలక్షణం నామైకోనసప్తతితమఃపటలః-

## మయమతం

శ్లో॥ పాశాంకుశౌజపవటీమభయంచబిభ్రద్
బాలేందుచూడమరుణాంబుజగంత్రినేత్రం
బంధూకకాంచననిభోభయపార్శ్వమవ్యా
దర్ధాంబికేశమనిశంరుచిరంవపుర్వః॥

శ్లో॥ సిందూరకాంచనసమోభయపార్శ్వమర్ధ
నారీశ్వరంగిరిసుతాహారభూషచిహ్నం॥

పాశాభయాక్షవలయేష్టదహస్తమేవం
స్మృత్వాన్యసేత్ సకలవాంఛితవస్తుసిద్ధ్యై॥
అరుణకనకవర్ణం పద్మసంస్థంచగౌరీ
హరనియమితచిహ్నంసౌమ్యతానూనిపాతం॥
భవంగుభవదభీష్టప్రాప్తయేపాశటంకా
భయవరదవిచిత్రంరూపమర్ధాంబివేశమ్॥
(ఇవి శిల్పరత్న ఉత్త 25వ అ. 76.77.78 శ్లో నున్నవి)

అపరా 213వ సూ

శ్లో॥ అర్ధనారీశ్వరంవక్ష్యే ఉమాదేహార్ధధారిణం
వామాంగేన స్తనంకుర్యాత్ కర్ణేవైతాడపత్రకమ్॥ 21
పాలికావామహస్తేతు దక్షిణేకుండలంతథా
ముకుటార్ధేచవామాంకిక్యం జటాభారంచదక్షిణే॥ 22
అర్ధేచైవస్త్రియోరూపం సర్వాభరణభూషితం
పురుషందక్షిణేభాగే కపాలకటిమేఖలమ్॥ 23
త్రిశూలంరాక్షసూత్రంచ తద్దక్షిణకరోర్ధృతమ్
కమండలుందరీకాంచ గణేశంవామత స్తథా॥ 24

తా॥ అర్ధనారీశ్వర లక్షణమును చెప్పుచున్నాడు. నాలుగు చేతులును, ఆఱు చేతులును, రెండు చేతులును, ఇట్లు మూడు విధములు కలవు సమభంగము స్థానకమున జెప్పబడిన కొలతల ననుసరించి చేయవలయును. కుడికాలు నిలువబడియును, ఎడమకాలు తగ్గుదలయును, ఎడమవైపు సగము పార్వతి రూపమును, కుడివైపు సగము శివరూపమును, కుడిచేతులు మూడైన-చో అభయము, గండగొడ్డలి, అగ్ని మూడు చేతులలోను, ఎద్దుయొక్క తలపై నుంచబడిన మోచెయ్యియును, ఎడమచెయ్యి కటకాముఖ హస్తమును (చూపుడు వ్రేలిని నడిమి వ్రేలితోను బొటనవ్రేలితోను చేర్చి మిగిలిన రెండు

(వ్రేళ్ళను కొంచెము లోపలికి వంచిపట్టబడినది) లేక పుష్పమును పట్టి కొనినట్లును రచించవచ్చును. రెండు చేతులైనచో కుడివైపు వరద హస్తమును ఎడమవైపు పుష్పమును బట్టికొనినట్లును, రచించవల యును. కుడివైపున శివుని భూషణములును, ఎడమవైపున స్త్రీ భూష ణములును, కుడిప్రక్క పుస్తకమును, ఎడమప్రక్క స్తనమును, లేక కుడికాలు కొంచెము తగ్గుదలయును, ఎడమకాలు నిలువబడియును, కుడి చేత శూలమును, ఎడమచేత పద్మమును, కుడిచెయ్యి వరదమును ఎడమచెయ్యి కంటిపై ముందును, కుడిచేత కపాలమును. ఎడమ చెయ్యి చాచబడియును, కుడి కన్ను కోపముతో గూడిన చూపును ఎడమకన్ను శాంత దృష్టియును, కుడివైపున తొడ యొక్క సగము వఱకు సన్నని వస్త్రమును, ఎడమవైపు చీలమండ వఱకు చీరెయును రచించినయెడల అర్ధనారీశ్వర లక్షణమగును.

శిల్పరత్నం

హావభావలవితార్ధనారికం భీషణార్ధమథవామహేశ్వరం
పాశసోత్పలకపాలశూలినం చింతయేజ్జషవిభావిభూతయే॥
అనిధ్యానలక్షణమున చెప్పబడి యున్నది.

## 56. గజహమూర్తి లక్షణము

కాశ్యప శిల్పము 70వ పటలము

శ్లో॥ అథవక్ష్యేవిశేషేణ గజహామూర్తిలక్షణం
లలాటమధ్యనాసాగ్రం వామేత్తుస్తనమధ్యమాత్ ॥ 1
వామద్విపిండమధ్యాత్తు పూర్వసూత్రంప్రసారయేత్
తత్సూత్రాద్దక్షిణేవామే పాదపార్ష్ణ్యంతరంద్విజ॥ 2
సాష్టత్రింశతిమాత్రంవా షట్త్రింశత్యంగులంతువా
తత్సూత్రాద్వామతఃసవ్య పాదాంగుష్ఠాంతరంద్విజ॥ 3

ఏకవింశతిమాత్రంవా ఏకోనవింశ దేవవా
చతుర్ద్వా సాష్టహస్తంవా సర్వాభరణసంయుతమ్॥ 4
చతుర్భుజంచేత్పాశంచ గజచర్మచదక్షిణే
గజాస్యంగజచర్మ స్యాద్వామపార్శ్వకరద్వయమ్॥ 5
చతుర్ద్వార్త్యేవమాఖ్యాత మష్టహస్తమథోచ్యతే
గజాస్యంతుసకంపాశం గజచర్మచదక్షిణె॥ 6
గజశృంగంకపాలంచ గజచర్మచవిస్మయమ్
వామపార్శ్వేతుచత్వారో హస్తాహ్యేవంప్రకీర్తితమ్॥ 7
శంభోర్వామాంఘ్ర్యధస్తాత్తు గజస్యైరతుమస్తకం
ముకుటస్యోపరిష్టాత్తు గజపుచ్ఛంప్రకాశయేత్॥ 8
పార్శ్వయోర్గజయోయాంతు యథాయుక్త్యాతుకారయేత్
ప్రభామండలవచ్ఛేషం గజచర్మప్రకల్పయేత్॥ 9
శూలఖడ్గధరంచర్మ గజశృంగంచదక్షిణె
కపాలంఖేటకంపాశం గజచర్మచవామకే॥ 10
లలాటమధ్యనాసాగ్రం దక్షిణస్తనమధ్యమాత్
సవ్యపీఠస్యమధ్యంతు లంబయేద్బ్రహ్మసూత్రకమ్॥ 11
స్వస్తికంవామపాదంతు గజస్యమస్తకోపరి
ఉద్ధృతందక్షిణంపాదం వామముత్కుటికంభవేత్॥ 12
తదంఘ్రిపార్ష్ణ్యోస్స్ఫిక్పిండాద్ద్వ్యంతరంచతురంగులం
తజ్జానువామకస్య అసిసూత్రసమంనయేత్॥ 13
ఏవంద్వివిధనీత్వాతు గజహామూర్తిరుచ్యతే
అక్షసూత్రానుమా దేవీ శంభోర్వామేచయాన్వితమ్॥ 14
ఏవంహికల్పితంబింబం రాజావిజయమాప్నుయాత్॥ 15

ఇత్యంశుమద్భేదే కాశ్యపశిల్పే గజహమూర్తి లక్షణంనామ సప్తరితమఃపటలః

తా॥ గజాంతకమూర్తి లక్షణమును చెప్పుచున్నాడు. నాసలు నడుము, ముక్కు చివర, యెడమ స్తనము యొక్క నడుమునుండి ఎడమనుండి రెండు పిఱుదుల నడుముగా ముందు నూలు చాచవలెను. ఆ నూలునుండి కుడిప్రక్క యెడమప్రక్క కాలిచీలమండల సందు 38.36 అంగులములుండవలెను. ఆ నూలు నుండి యెడమ ప్రక్క కుడికాలు యొక్క బొటనవ్రేలుసందు 21 అంగులములు లేక 19 అంగులములు చేయవచ్చును. 4 చేతులు లేక 8 చేతులు అన్ని నగలతోను అలంకరింపబడియుండవలయును. నాల్గు చేతులయిన యెడల పాశము, గజచర్మము, కుడిప్రక్కను. ఏనుగు మొగము, ఏనుగు చర్మము ఎడమ చేతులలోను రచించవలయును. ఎనిమిదిచేతులయిన-చో ఏనుగు మొగము, అభయము, పాశము, ఏనుగుచర్మము, కుడిచేతులలోను, ఏనుగుదంతము, తలపుర్రె, ఏనుగుకొలు, ఆశ్చర్య హస్తము (అయిదువ్రేళ్లు ఆనించి లోపలికివంచి అరచెయ్యి క్రిందికి జూపబడినది) ఎడమచేతులలోను రచించవలెను. ఈశ్వరుని యొక్క యెడమకాలిక్రింద యేనుగు తలయును జటామకుటముపైన యేనుగు తోక యందలి చివర కుచ్చును, ఇరుప్రక్కలను తగిన అలంకారములు రచించవలయును, కాంతిమండలమువలె మిగిలిన ప్రదేశమున యేనుగు చర్మమును కల్పించవలెను. శూలము, ఖడ్గము, చర్మము, ఏనుగుదంతములు ఇవి కుడి ప్రక్కను, కపాలము, ఖేటకము, పాశము ఏనుగుచర్మము ఇవి యెడమ ప్రక్కను రచించవలయును. నాసలు నడుము ముక్కు చివర కుడివైపు స్తనము యొక్క నడుము. కుడి పీఠముయొక్క నడుము. వీటికి బ్రహ్మ సూత్రమును చేయవలయును. ఎడమకాలు నిలువుగాను, కుడికాలు యెత్తి యేనుగు తలపై నుంచినట్లును, ఎడమ మోకాలిని కొంచెము ఉబ్బరముగా రచించవలయును. ఆ కాలి

యొక్క చీలమండకును పిఱుదుకు నడుమనందు 4 అంగులములు ఆ మోకాలి యొక్క యెడమ భాగము ఆపి సూత్రముతో సమానముగా నుండవలయును. ఇట్లు రెండు విధములుగా జాంతకమూర్తిని కల్పించవచ్చును ఈశ్వరుని యొక్క నేత్ర సూత్రముతో సమానమైన యెత్తున పార్వతిని యెడమనైపున నిర్మించవలయును. ఇది గజహా మూర్తి లక్షణము.

## 57. పాశుపతమూర్తి లక్షణము

### కాశ్యప శిల్పము 71వ పటలము

శ్లో॥ అథవక్ష్యే విశేషేణ పాశుపతస్యలక్షణం
సమపాదస్థానకం ప్రోక్తం చంద్రశేఖరమూర్తివత్॥ 1

త్రినేత్రంచచతుర్బాహుం మూర్ధ్వకేశంమహాధనుం
అభయంశూలహస్తంచ దక్షిణేతుకరద్వయే॥ 2

వరదంచాక్షమాలాచ వామపార్శ్వకరద్వయే
ప్రవాలసదృశప్రఖ్యం సౌమ్యనేత్రంతుశీతలమ్॥ 3

సర్వాభరణసంయుక్తం కించిత్ప్రహసితాననం
నిళోృత్స్వవస్త్రబింబార్ధం స్థానకంవాఽఽసనంతువా॥ 4

తదేవాగ్నిసమంవర్ణం రక్తాక్షకుటిలభ్రువం
తీక్షనేత్రైస్త్రిభిస్సంయుక్తం వ్యాలయజ్ఞోపవీతినం॥ 5
ణ

జ్వాలానలశిఖాకార మతిరక్తస్తువాసధృత్
శూలంత్వధోముఖంధృత్వా కపాలంవరదాభయమ్॥ 6

అథవాఽభయంవినాశూలం మూలంధృత్వాతుతత్కరే
శూలాగ్రంవరదేనైవ సవ్యతిర్యగ్గతేధ్రువమ్॥ 7

దక్షిణవరదేహస్తే టంకంఖడ్గంతువామకే
కౌతుకంపాశుపతనం వలిలిఁగేతుపూజ్యతే॥ 8

ధ్యానపూజానిమిత్తాయామే తన్మూర్తింవరామ్యహం
ఏతన్మూర్తింసకృద్ధ్యాయే త్సర్వశత్రువినాశనమ్॥ 9
ఏవంతురౌద్రమూర్తింతు ప్రతిమాంనైవకారయేత్॥ 10
ఇత్యంశుమద్భేదే కాశ్యపశిల్పే పాశుపతమూర్తిలక్షణం నామైక సప్తతితమః పటలః

తా॥ పాశుపతమూర్తి లక్షణమును చెప్పుచున్నాడు. సమపాద స్థానకముతో చంద్రశేఖరమూర్తివలె రచించవలయును. మూడు కన్నులును నాలుగు చేతులును, తలపై జటామకుటమును చేతగొప్ప విల్లును, అభయము, శూలము, కుడిచేతులతోను, వరదము, అక్షమాల యెడమచేతులలోను, పగడముతో సమానమైన యెఱుపువన్నెయును శాంతముతో గూడినచూపును, సమస్తమైన భూషణములును, కొంచెము నవ్వుతో గూడిన మొగమును, ఎల్లప్పుడు నుత్సవము చేయుటకు ప్రతిమను నిలుచున్నట్లుగాని, కూర్చున్నట్లుగాని రచింప వలయును. అపాయమునుండి రక్షింపబడుటకు పాశుపతమూర్తి నేఅగ్ని వంటి యెఱుపును, వంగిన కనుబొమలును, ఉగ్రమైన చూపును, సర్వాయజ్ఞోపవీతమును, మండుచున్న యగ్నివంటి రూపమును, మిక్కిలి యెఱ్ఱని వస్త్రమును ధరించియును, క్రిందికి జూపబడిన త్రిశూలమును, ఒక చేత కపాలమును, ఒకటి వరద హస్తమును, ఒకచెయ్యి అభయహస్తమును చేయవలయును. లేక అభయహస్తమునుమాని, శూలము యొక్క మొదలుపట్టికొని, శూలము యొక్క చివర వరద హస్తముతో అడ్డముగాబట్టి గాని, కుడిప్రక్క వరదహస్తము, టంకము యెడమచేతగాని, కౌతుకపాశుపతమును (పటముపై చిత్రించిన రూపమును) లింగముయొక్క వెనుకకుగాని ప్రక్కనుగాని యుంచిపూజించ వచ్చును. ధ్యానమునకును తాత్కాలిక పూజకును మాత్రమే యిట్టి మూర్తిని రచించవలయునుగాని యెల్లప్పుడు పూజించుట కీరూపమును రచింపరాదు. ఇట్టి రూపమును ఒకానొకప్పుడు ధ్యానించి

మాత్రముననే సర్వవిధ ప్రయోగశస్త్ర వినాశమగునని తెలియ వలయును.

## 58. కంకాలమూర్తి లక్షణము

### కాశ్యప శిల్పము 72 వ పటలము

శ్లో॥ అథకంకాలమూర్తేస్తు లక్షణంవక్ష్యతేఽధునా
పాదౌతుపాదుకోపేతౌ భిక్షుకంకాలలక్షిణమ్॥ 1

రక్షార్థంపరివారార్థం మోక్షార్థంతువిధీయతే
స్థానకంగమనంగ్రాహ్యం ద్వావింశంతుప్రవక్ష్యతే॥ 2

స్థానకంమూలబేరంచ గమనంచోత్సవంభవేత్
దారుజాలోహజావాఽథ సుధామృణ్మయశర్కరా॥ 3

శిలాచచిత్రంవాకుర్యా త్ప్రతిమాంవాయథావిధిః
ఏవంచప్రతిమాం కుర్యాన్మానోన్మానప్రమాణవిత్। 4

ప్రమాణమంగైర్వాకృత్వా మానంసంగ్రాహ్యబుద్ధిమాన్
అంగుళైర్యవసంయుక్తై ర్హస్తతాలవితస్తిభిః 5

ఆయాదిశుభంసంగ్రాహ్యం మానంశుద్ధ్యర్థకంభవేత్
పాదాధిష్ఠానమానంవా ద్వారతుంగసమేఽపివా॥ 6

మూలలింగసమోత్తుంగం సార్థంద్విత్రియవంతువా
తయోర్మధ్యేష్టభాగంతు నవధాతుంగమానకమ్॥ 7

ఉత్సవోద్యమమానేన సమస్తవిధిరుచ్యతే
వామపాదస్థితశ్చైవ దక్షిణంగమ్యంవక్షతే 8

పాదౌపాదకృతౌచైవ భవేద్దక్షిణకుంచితమ్
పార్శ్వేర్థ్వద్విగ్భవేత్పూర్వం బ్రహ్మసూత్రంప్రలంబయేత్॥ 9

పూర్వహస్తధృతంవాఽపి దక్షిణేకర్ణకేధృతం
హిరణ్యస్యధృతంవాఽపి తర్జన్యంగుష్ఠస్పృక్ యయా॥ 10

యోనిసీమావసానేన దూర్వాకారఇదాఽపివా
అథవామకరేపాత్రం నాభిసీమావసానకమ్॥ 11
డమరుంపూర్వహస్తేతు హనుసీమావసానకం
వామేశూలస్యహస్తంవా శిఖిపింఛార్ధసంయుతమ్॥ 12
కంకాలంచతదగ్రేతు బంధయేద్ధృదయోపరి
బాహుసీమావసానేన తత్కన్యాచ్చ్యవికంభవేత్॥ 13

ఏకద్విత్రిచతుర్మాత్రం తతాధిక్యాదిమేవహి
స్థానకేపూర్వసూత్రంవా భంగమానమధఃక్రమణ॥ 14
లలాటవామపార్శ్వేతు నేత్రాంతేచపుటాంతకే
హనోర్వామేషుహిక్కాయాం హృదయేకలాకోలకమ్॥ 15

తా॥ కంకాలమూర్తి యొక్క లక్షణమును చెప్పుచున్నాడు. రెండు కాళ్ళయందు పావకోళ్లు సన్యాసివలెనుండు యెముకలగూడు వంటి శరీరము గలవాడు. ఉగ్రదేవతాది భయములయందును, సహాయము కొఱకును, మోక్షమునకును కంకాలమూర్తిని చేయుదురు. స్థానకము గమనము ఇట్టి భేదములు 20 చెప్పబడుచున్నవి. ప్రధాన విగ్రహమును స్థానకముగా రచించవలయును. ఉత్సవ విగ్రహములు గమన రూపములో చేయవలయును. చందనాది దారువులతోను, సువర్ణాది లోహములతోను, సున్నముతోను, మట్టితోను, మైనముతోను, రాతితోను, వస్త్రము మొదలయినవానిమీద పటముగను, శాస్త్రోక్త ప్రకారము రచించవలెను. మొదట ప్రతిమ యెత్తును తరువాత తదితర అవయవములు మొదలయిన కొలతలును నిర్ణయించవలయును. అంగులములు, హస్తములు, తాలములు, వితస్తులు, మొదలగు కొలతలను షడ్వర్గ శుద్ధిగ శుభమైన మానమును నిర్ణయించవలయును. [illegible]ను పీఠమును బట్టిగాని, ద్వారము యెత్తును బట్టిగాని, ప్రధాన లింగము యెత్తును బట్టిగాని సమానము. ఒకటిన్నర భాగము

2 3 యవలు ఇట్లు ఈ రెండు కొలతల మధ్య 8 భాగములు చేసి మొత్తము 9 విధములైన యెత్తు కలుగజేయవచ్చును. ఉత్సవమునకు రచింపబడు విగ్రహములు అన్ని విధములైనవి చేయవచ్చును. ఎడమ కాలు నిలుకడయును, కుడికాలు నడుచుచున్నట్లును, కాళ్ళయందు పావకోళ్ళను, కుడికాలువంపును, కాలిచీలముండల రెంటి సందునను, మూడవకన్ను యొక్క నడుమను నూలుపట్టిదానినుండి సమస్తమైన అక్కొలతలు మొదలయి చేయవలయును. ముందుచేతులలో కుడివైపున నాగలియును, ఎడమచేత బంగారమును తర్జని బొటన వ్రేళ్ళు మాత్రమే తగులునట్లు పట్టికొని యుండవలయును, యోని ప్రదేశము చివర గఱికపోచవలె నుండవలయును. లేక యెడమచేత పాత్రమును బొడ్డుయెత్తున పట్టికొనినట్లును, ఢమరుకమును ముందు చేతితో చెక్కిలియొడి భాగము వఱకును, ఎడమచేత త్రిశూలమును గాని, నెమిలి యీకలకుంచె సగముగాని యుంచి కంకాల రూపము ముందు హృదయమున గట్టవలయును. భుజము యొక్క అంతమున— 1,2 3.4 అంగులములు అధికమైన నుండవచ్చును, స్థానకమున ముందు వైపు నూలు నుంచి భంగముల యొక్క కొలతలు తెలిసికొనవలయును. నొసలు యొక్క యెడమ ప్రక్కను, కంటియొక్క తుదను, ముక్కుపుటయొక్క తుదను, దవడ యొక్క పై భాగమున కెడమ ప్రక్కను, అక్కిలి యందును అొమ్మన 4 అంగులములును చేయవచ్చును.

శ్లో॥ నాభేశ్చదక్షిణేసూత్రం పఞ్చాంగులమితిత్రయం
యోనినీవ్రంతుసూత్రంవా దక్షిణేయుగమాత్రకమ్॥ 16
వామపాదస్థితంవాఽపి ద్విపాదాంతరమధ్యమే
స్థానకం హ్యేవమాఖ్యాతం గమనేషువిధీయతే॥ 17
గమనేషుతుసూత్రంవా లలాటేవామపార్శ్వకే
వామాంఘ్రిగుల్ఫమధ్యేతు ద్విపార్శ్వసూత్రకంభవేత్॥ 18

సూత్రంలలాటమధ్యేచ దక్షిణేతుద్వయాంగులమ్
వామేచపుటపార్శ్వేతు హిక్కాహృదయమధ్యమే॥ 19
నాభివామేద్వయాంగుల్యం యోనివామేయుగాంగులం
వామాంఘ్రిగుల్ఫస్పృశంస్యాద్ గమనస్యతుసూత్రకమ్॥ 20
అథంగస్యేక్షమార్గేణ నతమాత్రంచబుద్ధిమాన్
గమనేసూత్రకంవాఽపి హస్తయోర్న్యవమేవవా॥ 21
సవ్యహస్తత్రిణంకుర్యాత్సూత్రద్వ్యంతరమంశకమ్
ద్వావింశాంగులంవాఽపి త్రయోవింశతిరేవచ॥ 22
మణిబంధేమధ్యమాంతు బాహ్యేచైవతథైవహి
నీవ్రంతత్రివిధంచైవ పాత్రేవామకరేఽపివా॥ 23
కలాసప్తదశంచాష్ట మానతశ్చాపినీవక్రం
నాభిసీమావసానేతు కూర్పరంతస్యనీవ్రకమ్॥ 24
పంచాంగులమథోవాఽపి తిథిషోడశమేనవా
దక్షిణంత్రిణకంహస్తే యోనిసీమావసానకే॥ 25
ఏకద్విత్రిచతుర్మాత్రం మృగసూత్రంప్రలంబయేత్
జ్ఞానముద్రాసింహకర్ణా యథాసౌందర్యమాచరేత్॥ 26
వామహస్తేపరేశూలం బాహుసీమావసానకే
పూర్వసూత్రంతథైవస్యా చ్ఛిఖాబద్ధస్యనీవక్రమ్॥ 27
చత్వారింశతిమాత్రంవా శూలంతుఖడ్గతోమరే
శూలాగ్రేఘూతుతుకోపివా కంకాలంబంధయేత్సుధీః॥ 28
దక్షిణేపరహస్తేన డమరుంకటకేఽపివా
కటకందీర్ఘవిస్తారౌ వవాంశైరితికేఽపివా॥ 29
మండంత్రీణంగుణాంగుల్యం పద్మాకారంద్విపార్శ్వకే
వలయద్వయసంయుక్తం తర్జనీభుజతోభవేత్॥ 30
తర్జన్యాంగుహ్యమేవంహి హనుసీమావసానకం
మణిబంధస్యనీవ్రంతు పూర్వసూత్రంతథైవచ॥ 31

చత్వారింశతిమే వాహ్యే మంశాధికమథాపిచ
వా మేకపాలమాత్రం వా భాన్వంశంరసనిర్వకమ్॥ 32
ఘనమేకాంగులం వాఽపి సువృత్తం నిర్వాణం భవేత్
మకరకుండలమేవంహి శంఖపత్రంతు వామకే॥ 33
జటామండలమేవోక్తం వికీర్ణం కేశమండలం
దక్షిణేతు శేఖరం వా ప్రాజనిర్వామకేఽపి వా॥ 34
కరోటిమండబంధంచ ధుత్తూరకుసుమావృతౌ
జపాపుష్పం తథైవోక్త మర్కపుష్పైశ్చదూర్వకైః॥ 35
పినాకమజగవంస్యాత్కౌ రుద్రాక్షమాలికా
నాగకంకణం ప్రకోష్ఠే నానారత్నవిభూషితమ్॥ 36
వ్యాఘ్రచర్మాంబరధరం రౌద్రవక్త్ర ప్రభాసితం
భస్మోద్ధూళితదివ్యాంగం కించిత్ప్రహసితాననమ్॥ 37
ఏతత్కంకాలనామాస్థి వామస్కంధోపరిన్యసేత్
అనేకభూతైర్జాయాభిః సేవితం వందితంచ తైః॥ 38

తా॥ బొడ్డు యొక్క కుడి ప్రక్క నూలుకు 1 అంగులములు లేక 3 అంగులములు యోని నిర్గమము సూత్రము యొక్క కుడి ప్రక్క 4 అంగులములు ఎడమ కాలు స్థిరముగా నుండి రెండు కాళ్ళ నడుమ స్థానకము పద్ధతితో ప్రతిమను రచించవలయును. ఇది స్థానకము గమనమును జెప్పుచున్నాడు. నొసలు యొక్క యెడమ ప్రక్క యెడమ కాలి చీలుమండ నడుమునుండి రెండు వైపుల నూలుండవలయును. నొసలు నడుము కుడి ప్రక్క 2 అంగులములు ఎడమ ప్రక్క ముక్కుపుట ప్రక్కను అక్కిలి బొమ్మ నడుముగాను బొడ్డుకు ఎడమ ప్రక్క 2 అంగులములు యోని కెడమ ప్రక్క 4 అంగులములు ఎడమ కాలి చీలమండను తాకి యుండవలయును. ఇది

గమనమున నూలు పట్టు విధము. ఆ భంగమున జెప్పబడిన ప్రకారము ఒంపులు రచించవలయును. గమనమున నూలును చేతుల యొక్క నిర్గమమును కుడిచేత గడ్డియును నూలునుండి సందు 1 అంగులము 20-22-23 అంగులములు మనికట్టు వఱకును, అక్కడినుండి నడిమిప్రేలి వఱకు అరచెయ్యని యిట్లు 3 విధములుగా రచించవచ్చును. ఎడమచేతియందు పాత్రయును 34 అంగులముల లోతును, 8 అంగులముల నిర్గమమును బొడ్డు వఱకు మోచెయ్యి నిర్గమమును, 5 అంగులములు క్రిందను 15, 16 అంగులములును కుడిపైపున గడ్డి హస్తమునందు యోని ప్రదేశము వఱకును 1, 2, 3, 4 అంగులములు మృగసూత్రమును లంబము చేయవలయును. జ్ఞానముద్రయును సింహకర్ణమును (అనగా బొటనవ్రేలితో చూపుడువ్రేలిని చేర్చి మిగిలిన మూడువ్రేళ్ళను ఎడముగా చాచబడినది. జ్ఞానముద్ర నడిమివ్రేలు అనామికవ్రేలు ఈ రెంటి కొనలను బొటనవ్రేలితో జేర్చి తర్జని వ్రేలును చిటికెన వ్రేలును జాచిపట్టినది సింహకర్ణమగును) అందముగా రచించ వలయును. వెనుకచెయ్యి యెడమవైపున శూలము భుజము వఱకుండ వలయును. ముందు చెయ్యి కూడ అటులనే శిఖాబద్ధ నిర్గమము శూలము పొడవు 40 అంగులములుండవలయును. కత్తి, చిల్లకోన, శూలముపైన కంకాలమును గట్టవలయును. కుడివైపు వెనుక చెయ్యి డమరుకము లేక కడియము కలిగియుండవలయును. కడియము యొక్క పొడవు వెడల్పు 9 అంగులములు కడియము యొక్క మారుదల 3 అంగులములు పద్మమువలె నుండి దాని నడుమ తర్జనివ్రేలు నిలువబడి యుండవలయును. వ్రేలి చుట్టును చక్రముండ వలయును. తర్జని వ్రేలితో చక్రమును పట్టికొని చెక్కిళ్ళ పైభాగముతో సమాన సూత్రమున నుండవలయును. మనికట్టు యొక్క నిర్గమము ముందు నూలున 40 అంగులములు లేక 1 అంగులమధికముగను, నుండ

వచ్చును. ఎడమచేత తలపుఱ్ఱె గిన్నె 12 అంగుల విస్తారమును నిర్గమము 6 అంగులములును, మందము 1 అంగులమును గుండ్రముగను రంధ్రములు లేకుండను రచించవలయును. కుడిచెవికి మకర కుండలమును, ఎడమ చెవికి శంఖపత్రమును, చెదరిన తలవెంట్రుకలతో గూడిన కేశపాశమును, కుడివైపున సిగదండయును ఎడమ వైపున — తల పుఱ్ఱెయును, ఉమ్మెత్త పూలును, దాసనపువ్వు, జిల్లేడు పూలు గటిక యుండవలయును. త్రిశూలమును, ధనుస్సును చేతుల యందును, మెడలో రుద్రాక్షల తావలయును. ముంజేతుల యందు నాగ కంకణములును, అనేక రత్న భూషణములును, పులి తోలు మొలకట్టును, కోపముతో గూడిన ముఖమును, విభూతితో నిండిన మేనును, కొంచెము నవ్వుతో గూడిన మొగమును. ఇది కంకాల రూపము దీనిని మొదమ మూపున నుంచవలయును. దేవ యోనిజాతి స్త్రీ పురుష గణములచే సేవింపబడుచు నమస్కరింప బడుచునుండు దేవుడు.

శ్లో॥ బలిపాత్రధృతంభూత మగ్రేమాంసనస్థితం
దత్వాత్వన్నంతుతత్పాత్రే నిధాయోత్కృతిజాయయా॥ 39
కించిత్ప్రకాశితం యోనిసంయుక్తంజీర్ణవాససా
సంభూతామనసోపేతా జాయాఃసర్వత్రనైకశః॥ 40
దక్షిణేకటిపార్శ్వేతు ఛురికాశ్చైవబంధయేత్
ఛురికాహేమసంకాశా ముపబంధసమంచితా॥ 41
ఉభయోఃపార్శ్వయోర్హస్తే నానానాగైర్విభూషితమ్
ఋషిభిర్దేవగంధర్వైః సిద్ధవిద్యాధరాదిభిః 42
హృదయంకలిసంయుక్తం సంభ్రాంతమనసాంచితైః
సర్వనిత్యంసదానందం సేవితాద్యైఃసుపూజితమ్॥ 43
వీథింసమ్మార్జయేద్వాయః పర్జన్యోజలసేచనం
పుష్పవృష్టిక్రుతో దేవాఋషయఃస్తోత్రపాఠకాః॥ 44

ఋగ్యజుస్సామాథర్వాణః స్తుతింకుర్యుఃపరేపరే
చర్మబంధంఘనాంసంచ వీణాసుషిర మేవచ॥ 45
శంఖధ్వనిసమాయుక్తం పంచవాద్యంసమారభేత్
తుంబురునారదాద్యైశ్చ జయవాద్యంసలక్షణమ్॥ 46
చంద్రాదిత్యాదివద్రాజచ్చామరాదివ్యయోషితః
సర్వలోకోపకారార్థ మింద్రస్యసవనాదిషు॥ 47
ఆహూతాగమనాదేవా యోనిసీమావసానకం
పంచతాలేనభూతంచ మానోన్మానప్రమాణకమ్॥ 48
భూతేతుశిరసఃపాత్రం ద్విహస్తంస్పర్శవవా
పాత్రవిస్తారకేవాఽపి వింశతిరంగులంతువా॥ 49
నిమ్నమానందశాంగుల్యం ఘనమేకాంగులంభవేత్
హిరణ్యందక్షదిగ్భాగే జానుసీమావసానకమ్॥ 50
మూర్ధ్నాదిపదాంతేచ హిరణ్యాంతుంగమేవచ
దేవస్యపూర్వసూత్రేతు స్పర్శమానంతథైవహి॥ 51

య॥ శివుని ముందు భూతము మాంసపు బలి పాత్రమును అన్నముతో గూడ తన భార్య కిచ్చుచున్నట్లును దానిని తీసికొను నప్పుడు కొంచెము చిరిగిన చీరె వలన యోని భాగము కొంత కనుపడుచున్నట్లును ఇట్లు భూతము లెన్నియో కూడియున్నట్లును ఆ భూతములకు కుడిప్రక్క మొలయందు చిన్న కత్తియును, రెండు వైపులను చేతులయందును పాములును కలిగియుండవలయును. ఋషులును, దేవతలును, గంధర్వులును సిద్ధులును, విద్యాధరులును, స్థిర చిత్తముతోను సంభ్రమముతోను స్థిరుడును సదానందుడును అగు పరమేశ్వరుని పూజించుచు ప్రార్థించుచున్నట్లును, వాయువు వీధిని చిమ్ముచును, మేఘము నీరు చల్లుచును, దేవతలు పూలవాన కురిపించుచును, ఋషులు వేద మంత్రములతో స్తోత్రపాఠములు పఠించు

చును, చర్మబంధవాద్యము, కాంస్యవాద్యము, వీణావాద్యము, సుషిర వాద్యము, శంఖధ్వని యిట్లుపంచ విధనాదములును, తుంబురు నారదులు మొదలగువారు జయవాద్యములును, సూర్యచంద్రులవలె దేవాంగనలు వింజామరులు వీచుచుండ సమస్త లోకములకు క్షేమము కొఱకు దివ్యలోకాధిపతి యజ్ఞము చేయుచు పిలువగా వచ్చిన దేవతలును వీరందఱు శివుని యొక్కకటి ప్రదేశము యెత్తున రచింపబడవలయును. భూతములను పంచతాలములతోను ఆభూతముల తలపై పాత్రయును ఆ పాత్రను రెండు చేతులతో బట్టికొని నట్లును, పాత్ర విస్తారము 20 అంగులములును, లోతు 10 అంగులములును, మందము 1 అంగులమును చేయవలయును. శివుని యొక్క కుడివైపున బంగారమును మోకాలి యెత్తునను చేయవలయును. బంగారపు రాశిని శివుని తల యెత్తు మొదలు పాదము యెత్తు వఱకు రచించవచ్చును. దేవుని యొక్క ముందు నూలు నుండి సమానముగా బంగారు రాశిని తగులునట్లు చేయవలయును.

శ్లో॥ నాసాగ్రేలంబయేత్ సూత్రం వామాంగుష్ఠస్యమూలకే
జటాగ్రేవింశదంగుల్యం త్రయోవింశదథాంగులమ్॥ 52
స్పర్శనంకుక్షినాసాగ్ర మంగుష్ఠమూలంలంబయేత్
సూత్రవామేతునీవ్రాంత మష్టాంగుల్యంశరాంగులమ్॥ 53
తత్సూత్రాద్దక్షిణాంగుష్ఠే నీవ్రకంతునవాంగులం
దశరుద్రాంగులంవాఽథ ద్వాదశాంగులమేవచ॥ 54
సూత్రస్థానంతునిమ్నంవా సవ్యపార్శ్వంతరేఽపివా
ద్వావింశదంగులంవాఽపి త్రయోవింశతిమేవవా॥ 55
సూత్రాత్పార్శ్వంతుసీమాంతం దక్షిణాంగుష్ఠనిమ్నకం
ఏకద్విత్రిచతుష్పంచ రసాంగుల్యంతునీవ్రకమ్॥ 56

పీఠేదక్షిణపార్శ్వేతు వేదపంచరసాంగులమ్
పాదుకాయామకంవాఽపి పాదతలావనకమ్॥ 57
ఉత్సేధేనగుణాంగుల్య మూర్ధ్వమానంతుపద్మకం
తర్జన్యంగుష్ఠయోర్మధ్యే ముకులాకృతిబంధయేత్॥ 58
ద్వ్యంగులంముకులోత్సేధం సువృత్తంసుందరంభవేత్
కైలాసశిఖరేరమ్యే శ్రీగంధే దేవనాయకమ్॥ 59
ఋషీణాంసంగమే ప్రీత్యా భగవాన్ పరమేశ్వరః
దండకారణ్యలీలాయాం మునీనాంసర్వశాంతయే॥ 60
తేషాంస్త్రీణాంచపారంధ్ర్యై విధూతాయచవీలయా॥
భిక్షాస్వరూపంనగ్నేన కటిసూత్రవివర్జితః॥ 61
ఇత్యయంపరమేశానః కైలాసంత్రైవినీయతం
భిక్షాంకరోమ్యహంవిప్ర కంకాలస్యతుమోక్షణమ్॥ 62
కాశ్యప ఉవాచ "త్యక్త్వానైవర్ధితంచాస్య
కంకాలస్యఫలంకథం ,,
శివ ఉవాచ "ఇదానీంపురతోవిప్ర
కథ్యతేతత్సవిస్తరమ్॥ 63
తదహంభువనాదీని యాచేఽభయపురస్కరః
కంపితస్తుసమస్తాని భువనాన్యధివాసితః॥ 64
ప్రార్థయేద్యస్తుమాంభిక్షాం మాసంభయనివృత్తయే
అండానాంసుస్థితార్థంచ సర్వలోకోపకారకమ్॥ 65
కంకాలమోచనాంతంతు తద్ధనైవమహంద్విజ
భిక్షాంతేమోచయేదేత త్కంకాలమభయంభవేత్॥ 66
కాశ్యప ఉవాచ "ఏవంకంకాలమాఖ్యాతం
హారిరర్థహారంశృణు॥ ఇత్యంశుమద్భేదే కాశ్యపశిల్పే కంకాల
మూర్తి లక్షణం నామ ద్విసప్తతి తమః పటలః

తా॥ ముక్కు చివర నుండి నూలును క్రిందికి యెడమకాలి బొటనవ్రేలి మొదలు వఱకు విడువవలయును. జడయొక్క పైన 20 అంగులములు, 23 అంగులములు చేయవచ్చును. పొట్ట, ముక్కు చివర, బొటనవ్రేలి మొదలు తగులునట్లు లంబమును చేయవలయును, నూలు యొక్క యెడమప్రక్క నిర్గమము 8 అం. మొ 5 అం.వఱకు చేయవచ్చును. ఆ నూలు నుండి కుడి బొటనవ్రేలు యొక్క నిర్గమం 9 అంగులములు 10, 11, 12 అంగులములు చేయవచ్చును. నూలు 23 అంగులములు యొక్క ప్రదేశము పల్లమును, కుడిప్రక్క లోపల 22 అంగులములు చేయవచ్చును. ఆ నూలు నుండి ప్రక్క కటి ప్రదేశము వఱకు కుడి బొటనవ్రేలు పల్లముగను 1, 2, 3, 4, 5, 6 అంగులములు నిర్గమమును, పీఠమున కుడి ప్రక్క 4, 5, 6 అంగులములు పావకోటి యొక్క పొడవును, అరకాలి యొక్క అడుగు భాగము వఱకును, ఎత్తు 3 అంగులములు పైన పద్మము తర్జని బొటనవ్రేలి నడుమ మొగ్గవలె రచించవలయును. పద్మము యొక్క యెత్తు 2 అంగులములు గుండ్రంగాను అందముగాను రచించవలయును. మనోహరమైన కైలాసశిఖరమున శ్రీగంధ వృక్షము క్రింద దేవనాయకుడైన పరమేశ్వరుడు ఋషులతో గలిసి యుండుటకు ప్రేమతో దండకారణ్యమున మునులకు సర్వశాంతి నిమిత్తము లీలామానుషరూపముతో స్త్రీలలోను కకుటుంబినిని చెఱుపు చేయుటకు మొలత్రాడుకూడ లేని దిగంబర సన్యాసిగ భిక్షకు బోయెను. ఓ బ్రాహ్మణుడా నేనుభిక్షాటనము చేయుచున్నాను. కంకాలేశ్వరుని వలనమోక్షమును పొందుటకుకశ్యపుడను చున్నాడు. కంకాలునియొక్కఫలమునునీవు సంపూర్ణముగా జెప్పుము. శివుడనుచున్నాడు. ఇప్పుడు దానిని సవిస్తరముగా జెప్పుచున్నాను.

కృష్ణ నేను సమస్తలోకములకు అభయమును పురస్కరించుకొని యాచించెదను. సమస్తము వడకును, భువనములన్నియునుచలించును.

అట్టి సమయమున నెవ్వరు నన్ను భిక్షాటన రూపమున స్మరింతురో వారి భయములను దొలగింతును బ్రహ్మాండము యొక్క చలనమును నిర్వర్తించి అన్ని లోకములకు నుపకారమొనర్తును కంకాలి మోచనాంతమున సమస్త భయములు తొలగి సంతోషమున నుందురు. భిక్షాంతమున నేను కంకాల రూపమును వీడుదును. కంకాల లక్షణము చెప్పబడినది.

శిల్ప ఉ - 22 వ. అ

శ్లో॥ శ్మశానస్థామానీబహువిధపిశాచైఃపరివృతః
కపర్దీకౌపీనీసుసితభసితోద్ధూళితతనుః
త్రిశూలాగ్రేకృత్వానిఖిలనృపయక్ష్మాహ్వయహరం
కపాలాగ్నౌజుహ్వద్దహతుదురితంకిన్నరశివః॥ 198

తా॥ శ్మశానమున పిశాచములచే జుట్టికొనబడిన మాసిరూపమును. జటాజూటము, కౌపీనము, తెల్లని భస్మము గల దేహము త్రిశూలము యొక్క చివర వలన సమస్తమైన రాజయక్ష్మములను హరింప చేయునట్టి కిన్నర శివుడు నా యొక్క పాపములను తన కపాలాగ్నియందు దహింపచేయును గాక.

## 59. హరిహరమూర్తి లక్షణము

కాశ్యప శిల్పము 73 వ పటలము

శ్లో॥ అథవక్ష్యేవిశేషేణ హర్యర్ధహరలక్షణం
అర్ధచంద్రస్వస్తికంస్థానం స్థానకంసమపాదకమ్॥ 1

దక్షిణంచాభయంవామే కటకంపూరితంస్త్రితం
పరశుందక్షిణేవామే శంఖాయుధధరంపరమ్॥ 2

సవ్యేవామేచముకుటే జటాకిరీటమండితం
ప్రవాలంశ్యామరూపంతు తచ్ఛోభాభరణాన్వితమ్॥ 3

దక్షిణేతూగ్రదృష్టిః స్యాద్వామేదృష్టిః సుశీతలా
కించిత్ప్రకాశితార్ధంచ దృష్ట్వాతుతల్లలాటకే॥ 4
సర్వాభరణసంయుక్తం దిగంబరసమన్వితం
శిరశ్చక్రసమాయుక్తం తస్యలక్షణముచ్యతే॥ 5
రుద్రాంశకవిశాలంతు తద్భాగాంశేనబంధితం
ఘనంసువృత్తచక్రంచ పద్మాకృతిరథాపివా॥ 6
శిరశ్చక్రవిశాల స్వనస్తభాగైక భాగికం
శిరశ్చక్రస్యనాలస్య విస్తారంద్విజసత్తమ 7
చక్రతారత్రిభాగైకం చక్రాదాశిరసోఽంతకం
అగ్రేలలాటపట్టస్య శిరశ్చక్రస్యనాలకమ్॥ 8
చక్రంతర్జనీమాలంబ్య పుష్పమాలాచమధ్యమాత్
సర్వేషాం దేవదేవీనా మేవమేవసమాచరేత్॥ 9
ఇత్యంశుమద్భేదే కాశ్యపశిల్పేహర్యర్ధహారలక్షణంనామత్రి
సప్తతి తమః పటలః

మయమతం ధ్యేయోజటామకుటచంద్రకలార్ధమూర్ధా
త్రీక్షస్తరక్ష్వజినపీతదుకూలవాసాః మేశాచ్యుతస్త్రిశిఖ
చక్రకపాలశంఖాన్ చిభ్రత్సితాసితవపుర్ద్యుతి రాత్మ
భూమః

(ఈ శ్లోకము శిల్పరత్న ఉత్తర 25 ప్ర. కక్షరు)

తా॥ హరిహరమూర్తి లక్షణమును చెప్పుచున్నాడు. చక్కగా నిలువబడిన స్థానముతో సమపాదములు గలది స్థానకము కుడిపైపున అభయ హస్తమును ఎడమపైపున కడియము చెవి కమ్మ నాశ్రయించి యుండవలయును. కుడిచేత గండ్రగొడ్డలి. ఎడమచేత శంఖము కుడి యెడమలు సమానముగా జడలలో గల్పించబడిన దిక్కును సగము

కిరీట రూపమును పగడపువన్నె శివరూపమును ఆకుపచ్చవన్నె విష్ణు రూపమును కుడివైపున కోపముగల చూపును, ఎడమవైపున శాంతము గల చూపును, కొంచెము కనుపడుచున్న నొసటి కన్నును సమస్త మైన యాభరణములును దిగంబర రూపమును సగము, తలయందు చక్రమును దాని లక్షణము విస్తారము 11 భాగములును, 7 భాగము లలో 1 భాగము దాని యొక్క నాలమును, ఎడమప్రక్క చక్రం 3 భాగములలో 1 భాగము గుండ్రముగాను యెత్తుగల తలయును, ముందు నొసట పట్టమును, శిరశ్చక్రమునకు నాలమును, ఆ చక్రము తర్జని వ్రేలున నుండవలయును. మెడలో పుష్పమాలయును, సగము రుద్రాక్ష మాలయును రచించవలయును. సమస్తమైన పురుష దేవతలకును స్త్రీ దేవతలకును ఇట్లు రచించవలయును. ఇది హరిహరమూర్తి లక్షణము. దీనినే శంకర నారాయణ రూపమనియు చెప్పుదురు.

## 60. భిక్షాటనమూర్తి లక్షణము

### కాశ్యపశిల్పము 74 వ పటలము

శ్లో॥ అథవక్ష్యే విశేషేణ భిక్షాటనమహేశ్వరం
పాదౌ పాదుకసంయుక్తౌ వామపాదంతుస్వస్తికమ్॥ 1

ఈషదుద్ధృతసవ్యంతు పాదంతుంగంనవోత్సకమ్
లలాటమధ్యమాసవ్యే నవాష్టౌవాయవాంతరే॥ 2

నాసాగ్రేత్వధరేవామే హిక్కామధ్యంతువామకే
హృన్మధ్యనాభిసవ్యేతు షోడశంతుయవాంతరమ్॥ 3

స్వస్త్యంఘ్రిగుల్ఫమధ్యేతు పూర్వసూత్రంప్రలంబయేత్
అభంగంసనతంకార్యం సమభంగమథాపివా॥ 4

పాదౌపాదుకసంయుక్తౌ పాదుకారహితౌతువా
సువికీర్ణజటాభారం జటామండలమేవవా॥ 5

వివృతబంధజటంవాఽధ నగ్నరూపంసత్రాననం
లలాటపట్టసంయుక్తం కరోటూర్ధ్వంతు శేఖరమ్॥ 6
సర్వాభరణసంయుక్తం కటిసూత్రవివర్జితం
శుద్ధశ్వేతనిభంప్రోక్తం మానంనాగవిభూషితమ్॥ 7
దక్షిణేపూర్వహస్తంతు మృగస్యాసన్నికంభవేత్
వామేతుపూర్వహస్తంతు వరదంస్యాత్కపాలధృత్॥ 8
దక్షిణేపరహస్తేతు డమరుంచధరేద్విజ
వామేతుశిఖిపింఛంచ కర్తవ్యంశీతలంధృతమ్॥ 9
సితవస్త్రోత్తరీయంతు నాగేనకటివేష్టనమ్
శ్వేతయజ్ఞోపవీతంతు నీలకంఠంత్రిపుండ్రధృత్॥ 10
పద్మపీఠోపరిష్ఠాత్తు శేషంకంకాలమూర్తివత్॥ 11
ఇత్యంశుమద్భేదేకాశ్యపశిల్పే భిక్షాటనమూర్తిలక్షణంనామ చతుఃసప్తతితమః పటలః.

తా॥ భిక్షాటనమూర్తి లక్షణమును చెప్పుచున్నాడు. కాళ్ళకు పావకోళ్లును ఎడమకాలు నిలువుగాను, కుడికాలు కొంచెము పైకెత్తి నడుచుచున్నట్లును, నొసలు నడుము కుడిప్రక్క 8, 9 యవలును, ముక్కుచివర, క్రింది పెదవి యెడమప్రక్క అక్కిలి నడుము ఎడమ బొమ్మలమధ్య భాగము, బొడ్డు నడుము 16 యవలును, స్వస్తిక పాదము యొక్క చీలమండ నడుము ఇట్లు మునుదును చాచవలయును. నూలునుఆ భంగమునందు వంపుతో గూడరచించవలయును.తరువాత సమభంగమును చెప్పుచున్నాడు. కాళ్ళయందు పావకోళ్ళును, గాని, పావకోళ్ళు లేకుండగాని, చెదరిన తలవెంట్రుకలుగాని, జడలు గుండ్రముగాగాని, జారిన జడలుగాని, దిగంబర రూపమున్న, వంచిన తలయును, నొసట పట్టమును, తల పుర్రెలో సగము తలయందును సమస్తమైన భూషణములును, మొలత్రాడు లేకుండను, తెల్లని పెండి

వలె ప్రకాశించు శరీరమును. గర్వమును, సర్పభూషణములును, కుడి వైపు ముందు చెయ్యి మృగముతో గూడినదియును, ఎడమవైపు ముందు చెయ్యి వరదముగాని, కపాలమును ధరించిగాని యుండవల యును. కుడివైపు వెనుక చెయ్యి డమరుకమును ఎడమవైపు వెనుక చెయ్యి నెమలిపింఛమును కలిగియుండవలయును. తెల్లని యుత్తరీయ మును, పామును నడుమునకు జుట్టికొనియును, తెల్లని జందెమును, నీలవర్ణము గల మెడయును, త్రిపుండ్రములును, పద్మపీఠముపైన నుండునట్లును, మిగిలినవి పూర్వము చెప్పబడిన కంకాల లక్షణమున నున్నట్లు రచించవచ్చును.

## 61. చండేశానుగ్రహ మూర్తి లక్షణము

కాశ్యప శిల్పము 75వ పటలము

శ్లో॥ అథవక్ష్యేవిశేషేణ చండేశానుగ్రహంపరం
ఉమాసహితవత్సర్వం వామేకించిన్నతాననమ్॥ 1

దక్షిణేత్వభయంవర్జ్యం తథాత్వాభరణంభవేత్
తద్వామేకటకంన్యస్య అధస్తాచ్చండమూర్తినామ్॥ 2

హృదయాంజలిసంయుక్తో హస్తౌతదభిసంయుతం
ఆసనాదిసుఖాసీనం చండేశంవర్ణసన్నిభమ్॥ 3

దేవీదేవేశ్వరామధ్యే స్కందమూర్తింవినాబుధః
చండేశానుగ్రహాంఖ్యాతం దక్షిణంకీర్తితంపరమ్॥ 4

ఇత్యంశుమద్భేదే కాశ్యపశిల్పే చండేశానుగ్రహోనామ
పంచసప్తతితమఃపటలః

తా॥ చండేశానుగ్రహ మూర్తి లక్షణమును చెప్పుచున్నాడు. సోమేశ్వరునివలెనే అన్నియును చేయవలయును. ఎడమవైపు కొంచెము వంగిన తలయును, కుడివైపున అభయ ముక్కర లేదు.

ఆభరణము లుండవలయును. ఎడమచేతియందు కడియమును. దిగువ చండమూర్తి అంజలిన దోసిలి పట్టిన చేతులతో ఎదురుగా నుండినట్లును చండేశుడు బంగారు చాయయును. పార్వతీశ్వరుల నడుమ కుమారస్వామిని రచించరాదు. కుడిప్రైపున నుండవచ్చును. ఇట్లు చండేశానుగ్రహామూర్తి లక్షణము చెప్పబడెను.

## 62. దక్షిణామూర్తి లక్షణము అందు ధర్మ వ్యాఖ్యాన జ్ఞాన వీణాధర భేదములు

### కాశ్యప శిల్పము 76 వ పటలము

శ్లో॥ అథవక్ష్యేవిశేషేణ దక్షిణామూర్తిలక్షణం
లంబయేద్దక్షిణంపాదం వామాంఘ్రినలకాగ్రకమ్॥ 1
సవ్యోర్వగ్రంవిధాతవ్యం వామపాదంతుశాయయేత్
లలాటదక్షిణేసవ్యే నేత్రాంతంతత్పుటాంతకే॥ 2
యవత్రయాంతరంనీత్వా లంబ్యనాభేస్తుమధ్యమే
మేఢ్రమూలంతుమధ్యేస్యా త్పూర్వసూత్రంప్రలంబయేత్ 3
నతమధ్యర్ధమాత్రంస్యా చ్చతుర్భుజసమన్వితం
దక్షిణేపూర్వహస్తేతు అక్షమాలాధరంపరం॥ 4
వరదంపూర్వహస్తేస్యా దష్టహస్తమథా వా
వామజానూపరిష్టాచ్ఛ వరదేతలపృష్ఠకమ్॥ 5
వామజానూపరిష్ఠాత్తు దండకేయూర్పరాన్న్యసేత్
వామేచాపరహస్తంతు వహ్నిర్వావ్యాలమేవవా॥ 6
అర్ధేందువక్త్రంసర్వాంగం మమదాస్యతికోపమం
వికీర్ణమూర్ధజంవాపి జటామండలమేవవా॥ 7
వామేధుత్తూరనాగాచ దక్షిణేచంద్రశేఖరం
హసితంవక్త్రసంయుక్తం సర్వాభరణభూషితమ్॥ 8
సితవస్త్రోత్తరీయంచ సితయజ్ఞోపవీతినం

త్రినేత్రంధవళంవామే సవ్యేమకరకుండలమ్॥ 9
కర్ణౌతుపత్రశంఖంస్యాత్కుండపైర్వాధమండితమ్
రుద్రాక్షైఃకంఠమాలాభిర్వ్యాలమాలాభిశ్చభూషితమ్॥ 10
వ్యాఘ్రచర్మాంబరోపేతం సర్వక్లేశవివర్జితమ్
నారదోజమదగ్నిశ్చ వసిష్ఠోభృగుదక్షిణే॥ 11
భరద్వాజశ్శునక శ్చాగస్త్యోవామపార్శ్వకే
వందితంకిన్నరాద్యైస్తు వటవృక్షసమాశ్రితైః॥ 12
అపస్మారోపరిష్టాత్తు లంబపాదతలంన్యసేత్
సూత్రంతత్పాదపార్ష్ణోస్తువేదంస్యాన్మనుమాత్రకమ్॥ 13
సూత్రంతత్పాదజానోస్తు ద్వ్యంతరంభానుమాత్రకం
శ్యామవర్ణమపస్మారం నాగలీలాసమన్వితమ్॥ 14
ధర్మవ్యాఖ్యానమిత్యేవం కల్పయేచ్ఛిల్పవిత్తమః
తదేవవామపాదేన కుక్కుటాసనసంయుతమ్॥ 15
పూర్వహస్తద్వయోర్వీణా ధృతంయుక్త్యాద్విజోత్తమ
శేషంప్రాగివకర్తవ్య మేతద్వీణాధరంపరమ్॥ 16
తదేవవీణాహీనంతు జ్ఞానముద్రాభయాన్వితం
వామంప్రసారితంహస్తం వామజానూర్ధ్వకూర్పరమ్॥ 17
దక్షిణేతుపరేచాక్ష మాలాంవామేఽబ్జముత్పలం
శుద్ధశ్వేతనిభంవర్ణం శేషంపూర్వవదాచరేత్॥ 18
జ్ఞానమూర్తిరితిఖ్యాతం సర్వాలంకారసంయుతమ్॥

తా॥ దక్షిణామూర్తి లక్షణమును చెప్పుచున్నాడు. కుడికాలు చాచి యుండవలెను. ఎడమకాలు చీలమండ పై భాగము వఱకు పై కెత్తబడి యుండవలయును. కుడి తొడ చివర ఎడమకాలిని అడ్డముగా త్రిప్పవలయును. నొసలు కుడి ప్రక్క కుడి కన్ను, కుడి ముక్కు పుట, 3 యవలు సందుంచి బొడ్డు నడుముగా నూలును చాచ

వలెను మేఢ్రమూలమున నడుముగా ముందు నూలును చాచవలెను. వంపు 1 $\frac{1}{2}$ అంగులము నాలుగు చేతులు కుడిప్రక్క ముందు చెయ్యి జపమాల ధరించి యుండవలయును. ముందు చెయ్యి వరదహస్తమును చేసి యెనిమిది చేతులైనను చేయవచ్చును. ఎడమ మోకాలిపైన వరద హస్తము యొక్క అడుగు భాగము ఆనియుండవలయును. ఎడమ మోకాలిపైన యోగదండమును మోచెయ్యి నుంచవచ్చును. ఎడమ వెనుక చెయ్యి అగ్నిని పట్టికొనిగాని, పామునుబట్టికొనిగాని యుండ వచ్చును. నొసలు అర్థచంద్రునివలెను — — చెదరిన తలవెండ్రుకలును, గుండ్రని జడలుగాని, ఎడమవైపున ఉమ్మెత్తపువ్వు సర్పము కుడివైపున చంద్రుడును గల జడముడియును, నవ్వుతో గూడిన ముఖమును, సమస్తమైన యలంకారములును, తెల్లని యుత్తరీయ మును, తెల్లని జన్నిదమును, మూడు కన్నులును తెలుపు వన్నె యును, కుడి యెడమ చెవుల యందు మకరకుండలములుగాని లేక పత్రము శంఖము కుండలములుగాని, మెడయందు రుద్రాక్షమాల, కంఠమాల, హృదయమాల, మొదలయినవియును, పులితోలు మొలకును, అన్ని దుఃఖములను బోగొట్టునట్టి రూపమును, కుడి వైపున నారదుడు జమదగ్ని, వసిష్ఠుడు, భృగువు ఎడమవైపున భరద్వాజుడు శౌనకుడు, అగస్త్యుడు, మఱ్ఱిచెట్టు క్రింద నుండి నట్లును కిన్నరులు మొదలగువారిచే శివుడు నమస్కరింపబడుచున్నట్లును, అపస్మారము పైన నిలువకాలునుంచి నూలు ఆ కాలి యొక్క చీల మండ ప్రక్క 4 అంగులములును, రెండవకాలు 14 అంగులములును, ఆ నూలు నుండి మోకాళ్లు రెంటి సందు 12 అంగులములును, అప స్మారము ఆకుపచ్చరంగును, పామును చేతబట్టికొనినట్లును, రచించ వలయును. ఇది ధర్మవ్యాఖ్యాన దక్షిణామూర్తి లక్షణము. దీనినే యెడమకాలితో కుక్కుటాసనముగను, ముందు చేతుల రెంటితో వీణను బట్టికొనినట్లును, మిగిలిన పనులన్నియును ముందు చెప్పిన

ప్రకారము రచించిన మొదల వీణాధర దక్షిణామూర్తి లక్షణమగును. పై జెప్పిన దానినే వీణ లేకుండ జ్ఞానముద్ర (నడిమివ్రేలు మొదలు మూఁడువ్రేళ్ళను ఎడముగా జాచి చూపుడు వ్రేలిని బొటనవ్రేలితో జేర్చి పట్టినది) అభయహస్తము ఎడమవైపున చాచినచెయ్యి యెడమ మోకాలి పైన నుండవలయును. కుడివైపున వెనుకచేతియందు అక్షమాల ఎడమవైపు వెనుక చేతియందు పద్మముగాని, కలువపువ్వుగాని యుండవచ్చును. తెల్లని వెండివలె నుండు దేహమును, మిగిలినవి మునుపటివలెనే రచించవలయును. ఇది జ్ఞానదక్షిణామూర్తి రూప లక్షణమని చెప్పబడును.

## 63. యోగదక్షిణామూర్తి భేదములు

శ్లో॥ అన్యోన్యాంఘ్రితలంవిప్ర స్ఫిక్పిండాధః ప్రకల్పయేత్ । 19
జ్ఞానముద్రాహృదిస్థానే త్వభ్యంతరధృతంకరం
వరదంవామహస్తేతు మేఢ్రపీఠోపరిన్యసేత్ । 20
దక్షిణేచాబ్జమాలాంవా మాలాబ్జంవామహస్తకే
నాసాగ్రంతుసమీక్ష్యైషా వార్జవంసూత్రభేదతః॥ 21
అపరేతుజటాలంబ మృషిభిఃసేవితంపరమ్
యోగమూర్తిరితిఖ్యాతం ధ్యానేదుఃఖనివృత్తిదమ్॥ 22
లంబయేద్దక్షిణంపాదం వామముత్కుటికాసనం
యోగపట్టంతథాబధ్వా దేహంచోత్కుటికాంఘ్రికే॥ 23
ప్రసార్యవామహస్తంతు వామజానూపరిద్విజ
ప్రాగిన్నైవకృతం శేషం తదపియోగమూర్తివత్॥ 24
ఊరూమూర్ధ్నిసమాయుక్తౌ అన్యోన్యంపాదపార్ష్ణికౌ
యోగపట్టికయోపేతం జంఘామధ్యేద్విజోత్తమ॥ 25
ప్రసార్యపూర్వహస్తౌతు జానూపరినిధాపితౌ
అపరేదక్షిణేచాక్ష మాలావామేకమండలుః॥ 26

జటామండలసంయుక్తం కరోట్యాచంద్రశేఖరం
నీలగ్రీవసమాయుక్తం శంఖకుందేందుసన్నిభమ్॥ 27
అపరేచార్ధ్వయేద్వృక్షః నానాసర్పవిభూషితః
హ్యాన్మాలాకంఠమాలాఢ్యా దూర్వావత్యోవిరాజితమ్॥ 28
వటవృక్షంసమాశ్రిత్య ఋషిభిః సేవితంపదం
యోగమూర్తిరితిఖ్యాతం సర్వపాపహరంపరం॥ 29
ఏవంచానేకభేదేన దక్షిణామూర్తిలక్షణమ్॥ 30
ఇత్యంశుమద్భేదేకాశ్యపశిల్పే దక్షిణామూర్తి లక్షణం నామ షట్ సప్తతితమః పటలః

తా॥ కుడి పిఱుదు క్రింద యెడమ పాదమును, ఎడమ పిఱుదు క్రింద కుడి పాదమును, కుడిచేతి తర్జని వ్రేలును బొటనవ్రేలితో జేర్చి మిగిలిన మూడు వ్రేళ్ళను ఎడముగా జాచినది జ్ఞానముద్ర అట్టి జ్ఞాన ముద్రను అరొమ్మున కెదురుగా నుంచవలయును. ఎడమచెయ్యి వరద హస్తమును మేఢ్రపీఠముపైన నుంచవలయును. వెనుక కుడి చెయ్యి పద్మమాలను, వెనక యెడమచేతియందు పద్మమును ముక్కు చివరను చూచుచున్నట్లును, ఆ చూపు సమదృష్టిగను, వెనక జడ జారినట్లును, మహర్షులు సేవించుచున్నట్లును, రచింపబడు రూపము ధ్యానము వలన దుఃఖములను బోగొట్టునట్టి యోగదక్షిణామూర్తి యనబడును. మఱియు కుడికాలునుచాచి యెడమకాలు అడ్డముగా ద్రిప్పి కుడికాలుమీద నుంచి శరీరమును యోగపట్టెముతో గట్టి యెడమచేతిని యెడమ మోకాలి యందుంచి మిగిలిన వన్నియును పూర్వము చెప్పబడినట్లు రచించవలయును. ఇది రెండవ పద్ధతి.

కుడితొడపై యెడమ పాదమును ఎడమ తొడపై కుడి పాదమును, పిక్కల నడుమ యోగపట్టిక నుంచి ముందు చేతులు రెంటిని

మోకాళ్లపై నుంచి వెనుక కుడిచెయ్యి జపమాలతోను, ఎడమచెయ్యి కమండలువుతోను, జడగుండ్రముగను, ఆజడ యందు తలపుర్రెయును అర్ధచంద్రుడును, మెడయందు నలుపును, శంఖమువలెను మొల్ల పువ్వులవలెను చంద్రునివలెను, తెల్లని శరీరమును, వెనుకవైపున వృక్షమును ఆ వృక్షమునందనేక సర్పములును, ఆమ్మ వటకును, కంఠము వటకును, గల హారములును, ఆమ్మిన గటికతో గూడిన హారమును మఱ్ఱిచెట్టు క్రింద మహర్షులచే సేవింపబడుచు నుండిన ట్లు రచింపబడిన రూపము సమస్త పాపములను పోగొట్టునట్టి యోగ దక్షిణామూర్తి రూపము మూడవది. ఇట్లనేక భేదములతో దక్షిణా మూర్తి లక్షణము చెప్పబడినది

శిల్పరత్నం ఉత్త 22 అ.

శ్లో॥ ''ముద్రాంభద్రార్థదాత్రీం సపరశుహరిణం
బాహుభిర్బాహుమేకం జాన్వాసక్తందధానో భుజగవర
సమాబద్ధ కక్ష్యోవటాధః ఆసీనశ్చంద్రఖండప్రతిఘటితజటః
క్షీరగౌరస్త్రినేత్రో దద్యాదాద్యైః
శుకాద్యైర్మునిభిరభివృతో భావశుద్ధింభవోవః॥
(అనుబంధము 34వ పటము చూడుడు)

## 64. కాలహామూర్తి లక్షణము

కాశ్యప శిల్పము 77వ పటలము

శ్లో॥ అథవక్ష్యేవిశేషేణ కాలహామూర్తిలక్షణం
వసునందంతుదశాంశంవా భాగమానంద్విజోత్తమ॥ 1
సూత్రంభాన్వంగులంవాథ నేత్రసూత్రంమయోచ్యతే
లలాటదక్షిణేసవ్యే నేత్రమధ్యేతథైవచ॥ 2
హిక్కాసూత్రంచవామేతు వామస్తనాక్షందక్షిణే
నాభిమధ్యేతువామేతు సూత్రాంతరంయవాష్టకమ్॥ 3

మేఢ్రమూలస్యమధ్యేతు వామేషడంగులంన్యసేత్
స్థితాంఘ్రిగుల్ఫమధ్యేతు పూర్వసూత్రంప్రలంబయేత్॥ 4

దేవస్యదక్షిణంపాదం పద్మపీఠోపరిస్థితం
ప్రథమంనృత్తమూర్తిస్తు దక్షిణేస్థితపాదవత్॥ 5

వామపాదంతలోద్ధృత్య కుంచితంతలముద్ధృతం
అంగుష్ఠముద్ధృతంచాగ్రే కాలస్యహృదయంన్యసేత్॥ 6

సుదృష్టిస్స్యాత్త్రినేత్రంచ జటామకుటమండితః
చతుర్భుజసమాయుక్త మష్టహస్తమథాపివా॥ 7

దక్షిణేపూర్వహస్తంతు శూలంకర్ణాంతముద్ధృతం
దక్షిణేపరహస్తంతు పరశుంవరదంతథా॥ 8

వామేపూర్వకరంనాభి సీమాంతంసూచ్యధోగతం
సూచ్యగ్రంపూర్వసూత్రాంతం కలాపంచాంగులంతువా॥ 9

కర్ణశూలధరేహస్తే మణిబంధాంతరంబుధః
వామేతుపరహస్తంతు విస్మయంపరికల్పయేత్॥ 10

హిక్కాసూత్రంసమంటకం కరద్వయాంతరంముఖం
ఉష్ణీషాంతంసముద్ధృత్య విస్మయేఽనామికాగ్రకమ్॥ 11

కంఠాంతంమణిబంధాంతం శూలహస్తేసమాంతరం
చతుర్హస్తాఖ్యమాఖ్యాత మష్టహస్తమథశ్రుణు॥ 12

శూలంపరశువజ్రౌచ ఖడ్గందక్షిణహస్తకే
విస్మయంబేటకంపాశం సూచిహస్తంతువామకే॥ 13

శుద్ధవిద్రుమసంకాశం సర్వాభరణసంయుతమ్
అధస్తాత్కారయేత్కాలం ద్విభుజంపాశహస్తకం॥ 14

కరండమకుటోపేతం సండష్ట్రింవికృతాననం
అసృగ్ధారాసమాయుక్తం మహాభయసమన్వితమ్॥ 15

వికీర్ణకేశకంఠ్యపృష్ఠ్యాశ్రాయ యేదూర్ధ్వవక్త్రకం
కాలారిమూర్తిమేవంహి ప్రోక్తంలింగోద్భవంతథా॥ 16
ఇత్యంశుమద్భేదే కాశ్యపశిల్పే కాలహామూర్తిలక్షణంనామ
సప్తసప్తతితమఃపటలః

తా॥ కాలాంతకమూర్తి లక్షణమును చెప్పుచున్నాడు. 8, 9, 10 అంగులములు భాగములు చేయవచ్చును. సూత్రమునుండి 12 అంగులములు నేత్ర సూత్రము చెప్పుచున్నాను. నొసలు యొక్క కుడి ప్రక్కను, కన్నుల నడుమను, అక్కిలి సూత్రము యెడమ ప్రక్కను, ఎడమ స్తనము యొక్క కన్నుకు కుడిప్రక్కను, బొడ్డు నడుముకు ఎడమప్రక్క నూలునుండి సందు 8 యవలును, లింగస్థానము మొదలు నడుము యెడమప్రక్క 6 అంగులములును, పూనిక చేసిన కాలి యొక్క చీలమండ నడుమను, ముందు నూలును చాంచవలయును. దేవుని యొక్క కుడికాలు పద్మపీఠముపై నుండవలయును. నృత్తమూర్తులలో మొదటి రూపము యొక్క కుడికాలువలెను, ఎడమ కాలుపైకెత్తి అరకాలును కొంచెము వంచవలయును. ఎత్తబడిన కాలి యొక్క బొటనవ్రేలు యముని యొక్క రొమ్మును తగిలి యుండవలయును. మూడు కన్నులును చక్కగా తెఱచి యుండవలయును. జటామకుటమును, నాలుగు చేతులును, లేక యెనిమిది చేతులును, ముందుప్రైపు కుడిచెయ్యి శూలమును బట్టికొని చెవి వఱకు ఎత్తబడి యుండవలయును. వెనుక కుడిచెయ్యి గండ్రగొడ్డలి లేక వరదము, ఎడమప్రైపు ముందు చెయ్యి బొడ్డుతో సమానముగా క్రిందకు వంచిన సూచీ ముఖమును చేయవలయును. అనగా చూపుడు వ్రేలిని పొడవుగా జాచి మిగిలిన నాలుగు వ్రేళ్ళను లోపలికి వంచవలయును, సూచీ ముఖము యొక్క చివర ముందు నూలు వఱకు 2 నుండి 5 అంగులముల వఱకు జేయవచ్చును. చెవితో సమానముగా నున్న శూలముతో గూడిన చెయ్యి మనికట్టు సందు చేయవలయును

ఎడమవైపు వెనుకచెయ్యి ఆశ్చర్యహస్తము (చేతివ్రేళ్ళన్నియును ఆనించి లోపలికివంచి అరచెయ్యిని బోర్లించబడినది) టంకమును అక్కలితో సమానముగా రచించవలయును. రెండు చేతుల సందులో ముఖము ఉష్ణీషము వఱకు యెత్తి యుండవలయును. విస్మయ హస్తమున అనామికవ్రేలుపై నుండవలయును. మెడవఱకును మనికట్టు వఱకును శూలమును బట్టిన చెయ్యి సమానమైన సందు కలిగి యుండవలయును. నాలుగు చేతుల పద్ధతి చెప్పబడినది. ఎనిమిది చేతులయిన యెడల శూలము, గండ్రగొడ్డలి, వజ్రము, ఖడ్గము, కుడిప్రైపు చేతులయందును, , ఆశ్చర్యహస్తము, పెద్దకత్తి. పాశము, సూచిహస్తము ఎడమవైపు చేతులయందును రచించవలెను, మంచి పగడమువలె ప్రకాశించుచున్న యెఱ్ఱని రంగును, సమస్తమైన భూషణములును, క్రింద పడియున్న యముడు రెండు చేతులు, ఒక చేతియందు పాశము, కరండ ముకుటము, కోఱలును వికారమైన ముఖమునుండి నెత్తురు కారుచున్నట్లును, మిక్కిలి భయముతో నున్నట్లును, చెదరిన తలవెంద్రుకలును వెల్లకిలపడి యున్నట్లును కాలాంతకమూర్తిని రచించవలయును.

శిల్ప ఉ, 22 వ. అ

శ్లో॥ వామేనోద్యత్తరుణహరిణం పాణినావామభాసా
బిభ్రద్బభ్రుద్యుతిరపిసరేణాకఠోరంకుఠారం
వక్షోదేశే త్రిశిఖశిఖరేణాత్తకృత్త్వాంతకాంతం
తిష్ఠన్నిత్యోజయతిశశినాబద్ధకోటీరభారః॥ 197

తా॥ కుడిచేతగండగొడ్డలి యెడమచేతజింక యమునిఱొమ్ముపై గ్రుచ్చబడిన త్రిశూల మొకచేతియందును అభయహస్త మొకచేతను జడలముడియందు చంద్రుడును గల రూపము కాలారి యనబడును. తరువాత లింగోద్భవమూర్తి లక్షణమును చెప్పబోవుచున్నాడు.

కాశ్యప శిల్పము 78వ పటలము

## 65, లింగోద్భవమూర్తి లక్షణము

శ్లో॥ అథవక్ష్యేవిశేషేణ లింగోద్భవమిదంశ్రుణు
లింగాకారస్యమధ్యేతు చంద్రశేఖరమూర్తివత్॥ 1
నలకాంఘ్రితలాద్వ్రాప లింగేశూలసమన్వితం
విధాతాహంసరూపేణ ఊర్ధ్వగోవామపార్శ్వతః॥ 2
విష్ణుర్వరాహరూపేణ దక్షిణాంశేత్వధోగతః
విష్ణుర్దక్షిణపార్శ్వేతు వామపార్శ్వేపితామహః॥ 3
హృదయాంజలిసంయుక్తౌ స్థితౌతులింగముచ్యతే
రక్తశ్యామహిరణ్యాభం లింగంవిష్ణుంపితామహం 4
వీక్ష్యమాణౌపరంలింగ మిదంలింగోద్భవంస్మృతమ్॥ 5

ఇత్యంశుమద్భేదేకాశ్యపశిల్పే లింగోద్భవ లక్షణం నామాష్ట సప్తతితమః పటలః

తా॥ లింగోద్భవమూర్తి లక్షణమును చెప్పుచున్నాడు. లింగాకారము నడుమ చంద్రశేఖరమూర్తివలె శివుడును శివునియొక్క పాదము నుండిగాని పిక్కకు దిగువభాగమునుండిగాని లింగమున శూలముష, బ్రహ్మహంస రూపముతో పైకి బోవుచున్నట్లుఎడమప్రక్కను విష్ణువువరాహ రూపముతో క్రిందికి బోవుచున్నట్లు కుడిప్రక్కను, మఱియు విష్ణువు కుడిప్రక్క ఆకుపచ్చ వన్నెయును, బ్రహ్మ యెడమ ప్రక్క యెఱుపు వన్నెయును, కలిగి ఱొమ్ముల కెదురుగా దోసిలి బట్టి యుండినట్లును, వారిద్దరి నడుమ లింగము బంగారు చాయతోను రచింపబడినది లింగోద్భవ లక్షణమగును.

## 66. అంతరాల యమునను ప్రస్తరముపైనను శివరూప భేద స్థానములు

కాశ్యప శిల్పము 60వ పటలము

శ్లో॥ అధవక్ష్యే విశేషేణ సకలస్థానముత్తమం
శాంకరేన్నృత్తమూర్తిస్తు ఆగ్నేయాంవృషవాహనం॥ 6
ఉమాస్కందయుతంవిప్ర నైరృత్యాంపరికల్పయేత్
కంకాలంవాయుదిగ్భాగే భిక్షాటనంజయంతికే॥ 7
సుఖాసనంతుసత్యాంశే విధ్యంశేత్రిపురాంతకమ్
(వితథేవాప్యూషస్థానే న్యసేత్పాశుపదంతథా)
సుగ్రీవేహరిరర్ధంస్యాద్గంధర్వేచంద్రశేఖరమ్ 8
గంగాధరంతుశోషాంశే ముఖ్యేకాలారిమూర్తికం
ఆదితౌత్వర్ధనారీస్యా దైంద్రేకల్యాణసుందరమ్॥ 9
చండేశ్వరదంపర్జన్యే యామ్యేవాదక్షిణేశ్వరం
వారుణేలింగముద్భూతం సౌమ్యేతుగజహారిణమ్॥ 10
ఇత్యూర్ధ్వమాలయంప్రోక్త మంతరాలస్యకల్పయేత్
మూలమధ్యేతుసంవీక్ష్య సకలంస్థాపనంకురు॥ 11

తా॥ అంతరాలయమునను ప్రస్తరముపై శివరూప భేదములకు స్థానములను చెప్పుచున్నాడు. ఈశాన్యమున నృత్తమూర్తి, ఆగ్నేయమున వృషవాహనమూర్తి, నైరృతియందు సోమస్కంద మూర్తి వాయువ్యమున కంకాలమూర్తి, జయంత స్థానమున భిక్షాటన మూర్తి, సత్యస్థానమున సుఖాసనమూర్తి, బ్రహ్మస్థానమున త్రిపురాంతకమూర్తి వితథస్థానమునపాశుపతమూర్తి సుగ్రీవస్థానమున హరిహరమూర్తి, గంధర్వస్థానమున చంద్రశేఖరమూర్తి, శోషస్థానమున గంగాధరమూర్తి ముఖ్యస్థానమున కాలారిమూర్తి, అదితిస్థానమున అర్ధనారీశ్వరమూర్తి, ఇంద్రస్థానమున కల్యాణసుందరమూర్తి పర్జన్య స్థానమున చండేశానుగ్రహమూర్తి, దక్షిణమున దక్షిణామూర్తి, పడమరలింగోద్భవ ఉత్తరమునగజాంతకమూర్తి,ఇట్లుస్థానములను తెలిసికొని స్థాపించవలయును.

## 67. శివపంచవక్త్రధ్యానము

అపరా. 204వ సూత్రము

శ్లో॥ ప్రాలేయామలబిందు కుందధవళఁగోక్షీర ఫేనప్రభమ్
భస్మాభ్యంగమనంగ దేహదమనం జ్వాలావళీలోచనమ్
బ్రహ్మేంద్రాదిమరుద్గణైఃస్తుతిపరైః సంసేవితంయోగిభిః
వందేఽహంసకలంకలంకరహితం స్థాణోర్ముఖంపశ్చిమమ్॥ 15

"గౌరంకుంకుమపింజరంసుతిలకం వ్యాలోలగండస్థలమ్
భ్రూవిక్షేపకటాక్షవీక్షణలసద్బింబంసకర్ణోత్పలమ్
స్నిగ్ధంబింబఫలాధరంప్రహసనం నీలాలకాలంకృతమ్
వందేపూర్ణశశాంకమండలనిభం వక్త్రంహరస్యోత్తరమ్॥ 16

"కాలాభ్రభ్రమరాంజనద్యుతినిభం వ్యావృత్తపింగేక్షణమ్
బాలేందుద్వయనిఃసృతంసుదశనం ప్రోద్భిన్నదంష్ట్రాంకురమ్
సర్వప్రోతకపాలశుక్తిశకలం వ్యాకీర్ణమాశేఖరమ్
వందేదక్షిణమీశ్వరస్యకుటిలం భ్రూభంగరౌద్రంముఖమ్॥ 17

"సంవర్తాగ్నితటిత్ప్రతప్తకనక ప్రస్పర్ధితేజోఽరుణమ్
గంభీరధ్వనినిఃసృతం సుదశనం ప్రోద్భాసితామ్రాధరమ్
బాలేందుద్యుతిలోలపింగలజటా భారప్రబద్ధోరగమ్
వందేసిద్ధసురాసురేంద్రసునుతం తత్పూరుషస్యాఽననమ్॥ 18

"వ్యక్తావ్యక్తగుణోత్తరంచ వరదం షట్త్రింశతత్త్వాధికమ్
తస్మాదుత్తరతత్త్వమక్షరమితి ధ్యేయంసదాయోగిభిః
వందేతామసవర్జితేనమనసా సూక్ష్మాతిసూక్ష్మంపరమ్
శాంతంపంచమమీశ్వరస్యవదనం ఖవ్యాపితేజోమయమ్॥ 19

తా॥ తెల్లని కాంతి గల దేహమును ఎఱ్ఱని కన్నులును, బ్రహ్మేంద్రాదులచే సేవింపబడుచున్నదియునగు సద్యోజాతమను జాతమను పేరు గల శివుని పశ్చిమ ముఖమునకు నమస్కారము.

ఎఱ్ఱని కాంతి గల దేహము చలించుచున్న కపోలము పైకి లేవబడిన కనుబొమలతో గూడిన క్రీగంటి చూపును. దొండపండువంటి పెదవి నగుమోము నల్లని ముంగురులు నిండు చంద్రునివంటి కోఱలును మోము అగు వామదేవకును పేరుగల శివుని ఉత్తర ముఖమునకు నమస్కారము. నల్లని శరీరమును తిరుగుచున్న మూఁడని కన్నులును, తలపుఱ్ఱెల దండయును, కోపముతో గూడిన మొగమునుఅగు అఘోరమను పేరు గల శివుని దక్షిణ ముఖమునకు నమస్కారము. ప్రళయాగ్నివలెను, మెఱుపువలెను బాగుగా కాచిన బంగారము వలెను ప్రకాశించుచున్న పసుపుతో గూడిన యెఱ్ఱని కాంతియును, బాల చంద్రునితో గూడి కదలుచున్న యెఱ్ఱని జడయును అందు సర్పమును, మంచి దంతములు, ఎఱ్ఱని పెదవులును, సిద్ధులు సురలు దైత్యులు ఇంద్రుడు మొదలగు వారిచే స్తుతింపబడుచున్న తత్పురుషమను పేరు గల శివుని తూర్పు ముఖమునకు నమస్కారము. తెలియబడుచున్నదియును, తెలియబడనిదియును అగు స్వభావము గలదియును ముప్పదియాఱు తత్త్వములకు పై నుండి నాశము లేనిదై యెల్లప్పుడును తమోగుణరహితులైన యోగులచే ధ్యానింపబడుచున్న సూక్ష్మాతి సూక్ష్మమును పైన నుండునదియును ఆకాశమునంతయును వ్యాపించిన తేజోమయమును శాంతమును గల యీశానమను పేరుగల శివుని యూర్ధ్వముఖమునకు నమస్కారము.

శిల్పరత్నము 22వ అధ్యాయము

శ్లో॥ ఈశానాహ్వయమూర్ధ్వదిగ్వరముఖంవంశామహేనిర్మలమ్
పూర్వంతత్పురుషంచకుంకుమనిభంయామ్యంత్వఘోరంహరం
వామంమేరుజపాప్రసూనసదృశం యద్వామదేవంవిదుః
సద్యోజాతమహాప్రభంచపశమంగోక్షీరఫేనప్రభమ్॥

తా॥ ఈశాన ముఖము పై భాగము తెలుపు, తత్పురుష

ముఖము తూర్పు ఎరుపు, అఘోర ముఖము దక్షిణము నీలము, వామ దేవముఖము ఉత్తరము పసుపు. సద్యోజాతముఖము పడమర తెలుపు అని దెలియవలయును.

## 68. ఏకాదశరుద్రులలో (మొదటి) సద్యోజాతరుద్రుడు

అపరాజిత 212 వసూ.

శ్లో॥ శుక్లాంబరధరం దేవం శుక్లమాల్యానువేపనమ్
శుక్లోష్ణీషం శుక్లనేత్రం శుక్లయజ్ఞోపవీతినమ్॥ 8
జటాభారసమాయుక్తం బావేందుకృతశేఖరమ్
త్రిలోచనం సౌమ్యముఖం శ్వేతకుండలభూషితమ్॥ 9
దివ్యదేహం మహాకాయం నవయౌవనమండితం
మహాభుజం మహోత్సాహం వరదాభయపాణికమ్॥ 10

శిల్పరత్నం "సద్యోవేదాక్షమాలాభయవరదకరః కుంద మందార గౌరః" అని యున్నది.

తా॥ తెల్లని వస్త్రము తెల్లని పూలదండలు తెల్లని కిరీటము, తెల్లని కన్నులు తెల్లని జందెము జడలు ముడివేయబడి చంద్రునితో గూడిన కిరీటమును, మూడు కన్నులు శాంత రూపము తెల్లని కుండలములు చక్కని రూపము గొప్ప తనువు. దీర్ఘములును బలిష్ఠములును అయిన చేతులును వరద అభయహస్తములును యువప్రాయమును గలవాడు పదునొకరుద్రులలో మొదటివాడగు సద్యోజాతరుద్రుడని తెలియవలయును.

## 69. (రెండవ) వామదేవ రుద్రుడు

శ్లో॥ రక్తాంబరధరం దేవం రక్తయజ్ఞోపవీతినం
రక్తోష్ణీషం రక్తనేత్రం రక్తమాల్యానులేపనమ్॥ 11
జటాయాం కృతచంద్రంచ త్రినేత్రం తుంగనాసికం
మహారక్తం మహాబాహుం శూలఖట్వాంగధారిణమ్॥ 12

రక్తాస్యం రక్తనయనం రక్తకుండలధారిణం
సర్వాలంకారసంయుక్తం సర్వాభరణభూషితమ్॥ 13

తా॥ ఏకాదశ రుద్రులలో రెండవవాడగు వామదేవరుద్రుని లక్షణమును చెప్పుచున్నాడు. ఎఱ్ఱనివస్త్రము, ఎఱ్ఱనిజందెము, ఎఱ్ఱని కిరీటము, ఎఱ్ఱని కన్నులు ఎఱ్ఱని పూలదండలు జడముడియందు చంద్రుడు, మూడుకన్నులు, ఎత్తయిన ముక్కు ఎఱ్ఱని శరీరము గొప్ప భుజములు ఎఱ్ఱని కుండలములు సమస్తమైన భూషణములు కలవాడు వామదేవరుద్రుడని తెలియవలయును.

శిల్పరత్నం

"వామః కాశ్మీరవర్ణో ఉభయవరదపరశ్వక్షమాలో విలాసీ" అని చెప్పబడి యున్నది.

## 70, (మూడవ) అఘోర రుద్రుడు

శ్లో॥ కరాలదంష్ట్రింవికటాస్యం సర్పశీర్షం త్రిలోచనం
ముండమాలాధరం దేవం సర్పకుండలమండితమ్॥ 14

భుజంగకేయూరధరం సర్పహారోపవీతినం
గోనసంకటిసూత్రంచ గవేవృశ్చికమాలికాం॥ 15

నీలోత్పలదలశ్యామ మతసీపుష్పసన్నిభం
భృంగభ్రూభంగజటిలం శశాంకకృతశేఖరమ్॥ 16

తక్షకంకర్కోటకంచ పాయూనే త్రేపురాకృతౌ
అఘోరసంజ్ఞకం హేతుం కాలరూపమివాపరమ్॥ 17

మహావీర్యంమహోత్సాహ మష్టబాహుంమహాబలం
రిపుసైన్యంత్రాసయంతం నివేశోయత్రభూతలే॥ 18

ఖట్వాంగంచకపాలంచ ఖేటకంపాశమేవచ
వామహస్తచతుష్కేణ శస్త్రాణిచచతుష్టయమ్ం॥ 19

త్రిశూలంకలశంఖడ్గం దండంచైవారిమర్దనం
కరేష్వపై దక్షిణేషు చైతదస్త్రచతుష్టయమ్॥ 20

శిల్పరత్నం

"అక్షస్రగ్ఖేదపాశాంకుశడమరుకఖట్వాంగ శూలాన్కపాలం
బిభ్రాణో భీమదంష్ట్రో౽ంజనరుచిదశ్చాతనుర్భీతిదశ్చాప్యఘోరః
అని చెప్పబడి యున్నది.

తా॥ భయంకరమైన కోరలును, వికృతమైన ముఖమును, తలపై పాములును, మూడు కన్నులును, తలపుర్రెల దండయును, పాముల చెవి పోగులును, భుజముల యందు పాముల చుట్లలును, పాముల దండలును పాముల జందెములును, కొండ చిలువ మొలత్రాడును, మెడయందు తెల్లదండయును, నల్లకలువవంటి దేహవర్ణమునునల్లయగిసె పుష్పమువంటి ప్రకాశము,నల్లని కనుబొమలు విఱిచియుండుట జడముడి తలయందు చంద్రుడు సర్పరాజగు తక్షకుడు ముడ్డి యందును కర్కోటకమను పాము కనులముందును, గల అఘోరనామముగల కాలునివంటి రూపము గల మహాబలవంతుడును, మిక్కిలి సంతోషముగలవాడును, ఎనిమిది చేతులును, మహాపరాక్రమమును, శత్రువులకు భయంకరముగను, ఖట్వాంగము, కపాలము, ఖేటకము, పాశము ఈ 4ను ఎడమచేతులయందును త్రిశూలము, కలశము, ఖడ్గము, దండము ఈఖను కుడిచేతుల యందును కలిగినవాడు ఏకాదశ రుద్రులలో మూడవవాడగు అఘోరరుద్రుడని తెలియవలయును.

శిల్పరత్నం ఉత్త 22. వ అ. శ్లో

శ్లో॥ కాలాభ్రాభః కరాగ్రైః పరశుడమరుకౌఖడ్గఖేటౌచబాణే
ష్వాసౌశూలంకపాలందధభయవరోభీషణాస్యస్త్రినేత్రః

రక్తాకారాంబరాహిప్రవరఘటితగాత్రో౽రినాగగ్రహాదీన్
ఖాదన్నిష్టార్థదాయీ భవదభిమతచ్ఛిత్తయేస్యాదఘోరః 189

## 71. (నాలుగవ) తత్పురుష రుద్రుడు

శ్లో॥ పీతాంబరధరం దేవం పీతయజ్ఞోపవీతినం
మాతులుంగంకరే వామే అక్షసూత్రంచదక్షిణే॥ 21

తా॥ ఏకాదశ రుద్రులలో నాల్గవ వాడగు తత్పురుషరుద్రుని లక్షణమును చెప్పుచున్నాడు. పసుపువన్నె గల వస్త్రములును, పసుపువన్నె గల జందెమును ఎడమచేత మాదీఫలమును, కుడిచేత జపమాలయును మిగిలినవన్నియును మొదటి రుద్రునివలెనే రచించవలయును.

శిల్పరత్నం "విద్యుద్వర్ణో౽థ వేదాభయవరకుఠారాన్ దధత్
పూరుషాఖ్యః" అని రచించబడియున్నది.

## 72. (అయిదవ) ఈశాన రుద్రుడు

శ్లో॥ శుద్ధస్ఫటికసంకాశం జటాచంద్రవిభూషితం
త్రినేత్రంశూలహస్తంచ వామేధృతకపాలకమ్॥ 22

తా॥ తెల్లని పటికపు తాలివంటి రూపమును జడయందు చంద్రుడును, మూడు కన్నులును, కుడిచేతియందు శూలమును ఎడమచేతియందు తలపుర్రెయును మిగిలిన వన్నియును మొదటి రుద్రునివలెనే చేయవలెను. ఇది ఏకాదశ రుద్రులలో ఐదవవాడగు ఈశాన రుద్రుని రూపమని తెలియువలయును.

శిల్పరత్నం

"ముక్తాగౌరో౽భయేష్టాధికరకములో౽ఘోరతఃపంచవక్త్ర
స్త్ర్యక్షో ధ్యేయో౽oబుజన్మోద్భవమురరిపురుద్రేశ్వరాఃస్యుః
శివాంశాః అని వచింపబడియున్నది.

## 73. (ఆఱవ) షడ్భుజమృత్యుంజయరుద్రుడు

శ్లో॥ కపాలమాలినం శ్వేతం శశాంకకృత శేఖరం
వ్యాఘ్రచర్మధరం రుద్రం నాగేంద్రోరువిభూషితమ్॥ 23
త్రిశూలంచాక్షసూత్రంచ బిభ్రద్దక్షిణేకరే
కపాలంకుండికాంవామే యోగముద్రాంకరద్వయే। 24

తా॥ తెలుపు వన్నెయును తలపుర్రెల దండయును, చంద్రుడు జటాబంధమునను, పులితోలు వస్త్రమును, పాములు భూషణములును, కుడిచేతులయందు త్రిశూలము అక్షమాల ఎడమచేతులయందు కపాలమును, కుండికయును, రెండు చేతులయందు యోగ ముద్రయును కలవాడు. ఏకాదశ రుద్రులలో ఆఱవ వాడగు షడ్భుజ మృత్యుంజయ రుద్రుడని తెలియవలెను.

## 74. (ఏడవ) విజయం రుద్రుడు

శ్లో॥ ఏకవక్త్రంత్రినేత్రంచ శశాంకకృత శేఖరం
బృహల్లలాటకాపోలం కంబుగ్రీవంసుశోభనమ్॥ 25
చతుర్భుజంమహాబాహుం శూలపంకజభృత్కరం
దివ్యరూపధరం దేవం వరదాభయపాణికమ్॥ 26

తా॥ ఏకాదశ రుద్రులలో ఏడవవాడగు విజయరుద్రుని లక్షణమును చెప్పుచున్నాడు. ఒక్క ముఖమును మూడు కన్నులునూ, చంద్రునితో గూడిన జటామకుటమును, గొప్ప నొసలును చెక్కిళ్లును శంఖము వంటి మెడయును నాలుగు చేతులు బలము గలవియును, శూలము, పద్మము, వరదము, అభయము కలనాల్గు చేతులును, మనోహరమైన రూపమును గలవాడు విజయరుద్రుడని యెఱుంగవలయును.

## 75. (ఎనిమిదవ) కిరణాక్ష రుద్రుడు

శ్లో॥ చతుర్భుజంమహావక్షః శుక్లాక్షంసూత్రపాణికం
పుస్తకాభయహస్తంచ వరదాక్షంత్రిలోచనమ్॥ 27

తా॥ ఏకాదశ రుద్రులలో ఎనిమిదవవాడగు కిరణాక్షరుద్రుని లక్షణమును చెప్పుచున్నాడు. నాలుగు చేతులును గొప్పవక్షఃస్థలమును తెల్లని కన్నులును, జపమాలయును, పుస్తకమును, అభయహస్తమును, రుద్రాక్షయును నాలుగు చేతుల యందును, మూడు కన్నులును, మిగిలినవి మొదటి రుద్రునివలెనే రచించవలయును. ఇట్టి రూపము కలవాడు కిరణాక్ష రుద్రుడని తెలియవలయును.

కాశ్యప శిల్పము 48వ పటలము

శ్లో॥ కాలాగ్నిరుద్రమూర్తేస్తు లక్షణంవక్ష్యేఽధునా
చతుర్భుజంత్రినేత్రంచ జ్వాలామాలోపశోభితం 132
ఖడ్గఖేటకసంయుక్తంశశాంకార్ధధృతంపరంరక్తవస్త్రధరంరౌద్రం
సర్వాభరణభూషితమ్॥ 133
రక్తోర్ధ్వకేశంయుక్తం సింహాసనోపరిస్థితం॥

## 76. (తొమ్మిదవ) అఘోరాస్త్ర రుద్రుడు

శ్లో॥ జ్వలత్పావకసంకాశం ఖడ్గహస్తంత్రిశూలినం
మహాక్రోధకరందేవం మాయాకృతమహాగ్రహమ్॥ 28

తా॥ మండుచున్న అగ్నివంటి తేజస్సును హస్తములయందు ఖడ్గమును త్రిశూలమును, మిగుల కోపము గల స్వభావమును, మాయతో గూడిన కోపమును గల రూపమును మిగిలిన లక్షణములు పూర్వము వలెనే యని తెలియవలయును. ఇది యేకాదశ రుద్ర రూపములలో తొమ్మిదవదియగు అఘోరాస్త్రరుద్రుని లక్షణమని యెఱుగవలయును.

## 77. (పదియవ) శ్రీకంఠరుద్రుడు

శ్లో॥ చిత్రసూత్రవస్త్రధరం చిత్రయజ్ఞోపవీతినం
చిత్రరూపంమహాసత్త్వం చిత్రైశ్వర్యసమన్వితమ్॥ 29
చతుర్బాహుంచైకవక్త్రం సర్వాలంకారభూషితం
ఖడ్గంధనుఃశరంఖేటం శశాంకకృత శేఖరమ్ 30

తా॥ ఏకదశ రుద్రులలో పదియవ వాడగు శ్రీకంఠరుద్రుని లక్షణమును చెప్పుచున్నాడు చిత్రవస్త్రము చిత్రయజ్ఞోపవీతముచిత్రరూపము గొప్ప బలముగల శరీరము చిత్రములైన భూషణములు నాలుగుచేతులయందు ఖడ్గము, ధనుస్సు, బాణము, ఖేటము, ధరించియుండుట చంద్రుడు జటాజూటముననుగలది శ్రీకంఠ రుద్రరూపమని యెఱుంగవలయును.

కాశ్యప 48వ పటలము

శ్లో॥ చతుర్భుజంత్రినేత్రంచ నీలోత్పలసమప్రభం 134
కరండముకుటోపేతం సర్వాభరణభూషితం
అభయంవరదోపేతం దితశూత్పతంపరం 135
రక్తవస్త్రసమాయుక్తం పద్మపీఠోపరిస్థితం
శ్రీకంఠాహ్వముాఖ్యాతం నాగదేవస్త్వధోచ్యతే॥ 136

## 78. (పదునొకండవ) మహాదేవ రుద్రుడు

కాశ్యప 48వ పటలం

శ్లో॥ త్రిలోచనశ్చతుర్బాహుః శుక్లాక్షఃసుకరద్వయః
దక్షిణపాణినాపూర్ణం వంశామృతరసంపిబత్॥ 31
ధృతముక్తాక్షసూత్రశ్చ మహాదేవోధనోర్జితః
మహైశ్చర్యప్రదాయింద రుద్రశ్చైకాదశఃస్మృతః॥ 32

తా॥ ఏకాదశ రుద్రులలో కడపటివాడగు మహాదేవరుద్రుని లక్షణమును చెప్పుచున్నాడు. మూడు కన్నులును, నాలుగుచేతులును, తెల్లని కన్నులును, ధనుస్సున బాణమును సంధించిన రెండు హస్తములును, కుడిచేత పూర్ణ కలశమును ఆ కలశము నుండి చెఱకు రసమును అమృతమును పానము చేయుచున్నట్లును, ముత్యముల జప మాల యెడమ హస్తముననుం, కలిగి యైశ్చర్యమును గలిగించునట్టి రూపము గలవాడు మహాదేవరుద్రుడని యెఱుంగవలయును.

## 79. ద్వాదశకలామూర్తి సదాశివ లక్షణము

శ్లో॥ పద్మాసనస్థితంశాంతం యోగాసనకరద్వయం
పంచవక్త్రిమభీఃశక్తి శూలఖట్వాంగధృక్తరమ్॥ 33
భుజంగసూత్రడమరు బీజపూరధరంశుభం
ఇచ్ఛాజ్ఞానక్రియంచైవ త్రినేత్రంజ్ఞానసాగరమ్॥ 34

తా॥ పద్మాసనమును శాంతరూపమును రెండు చేతులయందు జ్ఞానహస్తమును (నాలుగు వ్రేళ్ళను చాచి బొటనవ్రేలిని వంచిపట్టిన చేతులను భుజమూలముల కెదురుగ నిక్కించినది) ఐదు ముఖములును, అభయము, శక్తి, శూలము, ఖట్వాంగము, కుడివైపు నాలుగు చేతుల యందును సర్పము, పాశము, డమరుకము, మాదీఫలము, ఎడమవైపు నాలుగు చేతుల యందును, ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులు గల జ్ఞానబోధ స్వభావమును మూడు కన్నులును గల రూపము పది రెండు కళలు గల సదాశివుడని యెఱుంగవలయును.

## 80. శ్రీ పంచాక్షరి

శిల్పరత్నం ఉత్తరభాగము 22వ అధ్యాయము

శ్లో॥ బిభ్రద్దోర్భిఃకుఠారంమృగమభయవరౌసుప్రసన్నో మహేశః
సర్వాలంకారదీప్తఃసరసిజనిలయోవ్యాఘ్రచర్మాత్తవాసాః
ధ్యేయోముక్తాపరాగామృతరసకలితాద్రిప్రభఃపంచవక్త్ర
స్త్ర్యక్షఃకోటీరఘటితతుహినరోచిష్కలాతుంగమాలిః॥ 180

తా॥ గండగొడ్డలి జింక అభయము వరదము కల నాలుగు చేతులును, సంతోషముతో గూడిన మొగమును సమస్తమైన భూషణములును, పద్మపీఠమును, పులితోలు మొలయందును దయారసముతో గూడిన తెల్లని శరీరమును, ఐదు ముఖములును, మూడు కన్నులతో గూడిన ముఖములును, చంద్రునితో గూడిన జటా

జూటమును గల మహేశ్వర రూపము శ్రీపంచాక్షరియని యెఱుంగ వలయును.

## 81 మృత్యుంజయ లక్షణము

శిల్పరత్నం ఉత్తర భాగము 22వ అ.

శ్లో॥ శుభ్రాంభోజపుటేందుమండలగతం త్ర్యక్షం త్రిశూలత్రయీ
టంకాక్షాహిత్రిసూత్రసంయుతచతుర్బాహుం హిమాద్రిప్రభమ్
ముద్రాపంచకభూషితం త్రినయనం నాగోత్తరీయం శివమ్
వందే వ్యాఘ్రవరాజినాంబరధరం కోటీరచంద్రోజ్జ్వలమ్॥ 185
శూలాహిటంకఘంటాసిసృణికులిశపాశాగ్న్యభీర్దధానం
దోర్భిః శీతాంశురేఖాప్రతిఘటితజటాభారమౌళిం త్రినేత్రం
నానాకల్పాభిరామాపఘనమభిమతార్థప్రదం సుప్రసన్నం
పద్మస్థం పంచవక్త్రం స్ఫటికమణినిభం పార్వతీశం నమామి॥ 186

తా॥ తెల్లని తామరపువ్వు నడుమనున్నవాడును, మూడు కన్నులును, టంకము అక్షమాల సర్పము త్రిసూత్రము కల నాలుగు చేతులును, తెల్లని కాంతియును, పంచముద్రలతో గూడినవాడును, పామునువల్లె వాటుగా వేసికొనినవాడును పులితోలు మొలయందు గట్టినవాడును, జడలముడియందు చంద్రుడు గలవాడును, మృత్యునాశకరుడును అగు శివునకు నమస్కరించెదను. పద్మపీఠమును తెల్లని మేనును ఐదు మోములును, శూలము, సర్పము, టంకము, ఘంట, ఖడ్గము, అంకుశము, వజ్రము, పాశము, అగ్ని, అభయము కల పది చేతులును, జటామకుటమునందు చంద్రకళయును మూడు కన్నులును, అన్ని అవయవములయందును భూషణములు గలవాడును సంతోషముతో గూడియున్నవాడును మృత్యువును నశింపచేయువాడును అగు పార్వతీనాథునకు నమస్కరించెదను.

శ్లో॥ అథవామల కమల పుంటాంతరితం శిశువేషభూషణం రుద్రం
ధ్యాత్వాజపాద్ యథావత్ కృతకృత్యో మృత్యునాశనం
హృష్టమ్॥ (190)

తా॥ తెల్లని పద్మము యొక్క మధ్య ప్రదేశమున పసి బాలునివలె సమస్తమైన యాభరణములతో గూడియున్నవాడును సంతోషము గలవాడును మృత్యునాశనకరుడును అగు శివునకు నమస్కారము.

## 82. ప్రసాద శివ లక్షణము

శిల్పరత్నం ఉత్తర భాగము 22 వ అ.

శ్లో॥ దేవం నమామి శిరసా పరశుత్రిశూల
విద్యాకపాలపరిమండిత బాహుదండం
వ్యాఘ్రాజినాంబరధరం భసితావదాత
వేషోజ్జ్వలం ధృతజటాఘటితేందుబింబమ్॥ 183
వందే త్రిశూలస్ఫటికాక్షమాలా
విద్యాప్రసాదోద్యత బాహుమీశం
సితోపవీతం భసితావదాతం
కోటీరమూర్ధోజ్జ్వలచంద్రశేఖరమ్॥ 184

తా॥ చక్కని రూపము, పులితోలు మొలకట్టు, ఒడలెల్ల బూది, జటామకుటమున చంద్రకల, పరశువు, త్రిశూలము, పుస్తకము, కపాలము, నాలుగుచేతులయందును గల శంకరునకు నమస్కారము. త్రిశూలము స్ఫటికాక్షమాల పుస్తకము వరదహస్తము జడముడియందు చంద్రుడును తెల్లని జందెము, మేనెల్లభస్మము గలిగిన శివునకు నమస్కారము ఈ రెండును అనుగ్రహము గల శివ రూపములు.

## 83. శైవమష్టాక్షరము

శిల్పరత్నం ఉత్త. 22.వ అ.

శ్లో॥ వామాఙ్కన్యస్తవామేతరకమలాయా స్తథా వామబాహు న్యస్తా
రక్తోత్పలాయాః స్తనవిధృతలసద్వామబాహుః ప్రియాయాః
సర్వాకల్పాభిరామో ధృతపరశుమృగేష్టః కరైః కాంచనాభో
ధ్యేయః పద్మాసనస్థః స్మరలలితతనుః సంపదే పార్వతీశః॥ 187

తా॥ పద్మాసనముపై సుఖాసీనుఁడును మన్మథుని వంటి చక్కదనమును ఎడమతొడయందు పార్వతి రెండు చేతులయందు ఎఱ్ఱతామలపూలతోను, ఆ పార్వతిని యెడమ చేతితో పట్టికొనినట్లును, గండగొడ్డలి జింక శూలము చేతులయందును బంగారువంటి దేహచ్ఛాయమును గల రూపము అష్టాక్షరశివమంత్రాధిష్ఠానదేవుఁడగు శివుడని తెలియవలయును.

## 84. చింతామణి శంకరుఁడు

శిల్పరత్నం ఉత్తర 23వ. అ.

శ్లో॥ అహిశశధరగంగాబద్ధతుంగాత్తమౌలి
స్త్రిదశగణనతాంఘ్రిశ్చాప్సరస్త్రీవిలాసః
భుజగపరశుశూలాసీఖడ్గవహ్నికపాలం
శరమపిధనుషం వై బిభ్రదవ్యాచ్చిరంవః॥ 191

తా॥ జటాజూటమున చంద్రుడు సర్పము గంగయును ఎనిమిది చేతులలో సర్పము, గండగొడ్డలి, శూలము, ఖడ్గము అగ్నికపాలము శరము ధనుస్సు ధరించి యుండుటయు దేవతలు పాదములకు నమస్కరించును. దేవతాస్త్రీలరంభ మొదలగు వారి నాట్య వినోదమును కల శంకరుడు చింతామణి నామము కలవాడగును.

## 85. వైద్యనాదమూర్తి లక్షణము

అపరా. 212. వ సూ.

శ్లో॥ క్షీరోదార్ణవమధ్యస్థ ముద్భవేఽమృతరూపిణం
విషజీర్ణంభుజంగానాం తస్యచాదౌసముద్భవమ్॥ 43

సర్వాశ్చర్యభయంరూపం విభోధాద్విషహారకం
దారిద్ర్యనుష్ఠహారంచ ధర్మార్థకామమోక్షదమ్॥ 44
ముక్తామండలశోభాఢ్యం తప్తకాంచనప్రభమ్
హారకేయూరసంయుక్తం ప్రభామండలమండితమ్॥ 45
త్రినేత్రంషడ్భుజంశుభ్రం జటాఖండేందుభూషితం
వ్యాఘ్రాజినంసితంసౌమ్యం నాగయజ్ఞోపవీతినమ్॥ 46
త్రిశూలంచాక్షసూత్రంచ కపాలంకుండికాంతథా
వామేసౌమ్యేచబిభ్రాణం వ్యాలవ్యాప్తైకరాతథా॥ 47
పద్మాసనస్థితందేవం వైద్యనాథంహరంప్రభుం
వనమాలాదిసంయుక్తం సూర్యకోటిసమప్రభమ్॥ 48
మహాకేయూరసంయుక్తం ప్రభామండలమండితమ్
వైద్యనాథంవిజానీయాత్ శక్త్యారోగ్యప్రదాయకమ్॥ 49

తా॥ పాలసంద్రము యొక్క నడుమ అమృతమువలె జన్మించిన వాడును, పాముల యొక్క విషమునుచో గొట్టువాడును, ఎల్లరకును ఆశ్చర్యమును కలిగించునట్టి రూపము కలవాడును, దారిద్ర్యమును, కుష్ఠమును, విషమును, పోగొట్టువాఁడును ధర్మము, అర్థము, కామము మోక్షము అను నాలుగు విధములయిన ఫలముల నిచ్చువాఁడును, మంచిముత్తెములతో ప్రకాశించుచున్నవాఁడును కాఁచిన మేలిమి బంగారముతో సమానమైన మెడల చాయగలవాఁడును మెడలో హారములును, భుజములయందు కేయూరములును, కాంతి మండలము యొక్క నడుచుచున్నవాఁడును మూఁడుకన్నులును, ఆఱు చేతులును, తెల్లని చంద్రకలశము జటాజూటమునగలవాఁడును పులి తోలు మొలకుగట్టినవాఁడును, తెల్లనిరూపమును శాంతస్వభావమును పాము జందెము గలవాఁడును త్రిశూలముఅక్షమాల కపాలము చెంబు ఈ నాలుగు కుడిచేతుల యందును బిభ్రాణము, సర్పములు గల

రెండు చేతులు వరదము ఈ నాలుగు ఎడమ చేతులయందును పద్మపీఠముపై నుండిన వాడును వనమాల మొదలగు హారములును అనేకమంది సూర్యులతో సమానము గల కాంతియును బాహువులును గలవాడును బలమును ఆరోగ్యమను ఇచ్చువాడును అగు వైద్యనాథమూర్తి లక్షణమిదియని యెఱుంగవలయును.

## 85. అనుష్టుప్ శివ లక్షణము

శిల్పరత్నం ఉత్తర 22వ అ.

శ్లో॥ అచ్ఛస్వచ్ఛారవిందస్థితిరుభయకరాంతఃస్థితం
పూర్ణకుంభందోర్భ్యాం వేదాక్షమాలేనిజకరకమలాభ్యాం ఘు
టేనిత్యపూర్ణో ద్వాభ్యాంతౌచ స్రవంతౌశిరసిశశికలాబం
ధురేప్లావయంతౌ దేహం దేవోదధానః ప్రవిశతువిశదాకల్ప
జాః శ్రియాంవః॥ 193

తా॥ తెల్లని తామరపుష్పముపై నిలిచి రెండు చేతులలో పూర్ణకలశములును పుస్తకమును అక్షమాలయును కలిగి తలయందు గల చంద్రుని అమృతకిరణములచే తడుచుచున్న చేతులును కల శంకరుడు మీకు శుభముల నిచ్చుచుండుగాక ఇది అనుష్టుప్ శివ రూప లక్షణము.

## 86. సంవాద శివ లక్షణము

శిల్ప ఉ. 22. వ అ.

శ్లో॥ ధవళనలినరాజుచ్చంద్రమధ్యేనిషణ్ణం
కరవిలసితపాశంసాంకుశంసాభయంచ
నవకంమమలేందుక్షీరగౌరంత్రినేత్రం
ప్రణమతేసురవక్త్రింమంత్రసంవాదయంతమ్॥ 194

తా॥ తెల్లని తామర పువ్వువలె నొప్పుచున్న చంద్రమండలమున నడుమ పాలవంటి తెలుపు గల రూపమును మూఁడు కన్ను

లును పాశము, అంకుశము, అభయము, వరదము అగు నాలుగు చేతులును శాంతదృష్టియును గల శంకరునకు నమస్కరింపుడు ఇది సంవాద శివలక్షణము.

## 87. శక్తి పంచాక్షరి లక్షణము

శిల్ప ఉ. 22 వ అ

శ్లో॥ మూ వేకల్ప ద్రుమస్య ద్రుతనకనిభం చారుపద్మాసనస్థం
వామాంకారూఢ గౌరీనిబిడకుచభరాభోగగాఢోపగూఢం
సర్వాలంకారకాంతం సరపరశుమృగాభష్టబాహుం త్రినేత్రం
వందే బాలేందుమౌలింగుహగజవదనాఖ్యాముపాశ్లిష్ట
పార్శ్వమ్॥ 195

తా॥ కల్పవృక్షము క్రింద బంగారు చాయతో పద్మాసనముపై కూర్చుండి యెడమ తొడమీద పార్వతియును, ఎడమ చేతితో గట్టిగా పట్టికొనినట్లును సమస్తమైన యలంకారములతోను. వరదము పరశువు జింక అభయము కలచేతులును కుడిప్రైపున కుమారస్వామిని గణపతి పట్టికొనినట్లును మొత్తము 8 చేతులును మూడు కన్నులును జటాజూటమున బాలచంద్రుడును గలది శక్తి పంచాక్షరీ శివరూపమని యెఱుంగవలయును.

శ్లో॥ వందేహరంవరదశూలకపాలహస్తం
సాభీతిముద్రిసుతయోజ్వలదేహకాంతి
వామోరుపీఠగతయానిజవామహస్త
న్యస్తారుణోత్పలయుజాపరిరబ్ధదేహమ్॥ 196

తా॥ మఱియొక పద్ధతి చెప్పుచున్నాడు. తెల్లనిదేహ కాంతియును వరదము శూలము కపాలము అభయము కలహస్తములు నాలుగును ఎడమతొడపై పార్వతియును ఆమె దేహము ఎఱ్ఱని

కాంతితోను, గల రూపము శక్తి పంచాక్షరీ శంకరరూపమనియును చెప్పుదురు.

## 88. రక్షోఘ్న శివలక్షణము

శిల్ప. ఉ. 23 వ. అ

శ్లో॥ త్రిశూలంపరశుంచైవ కపాలండమరుంతథా
బిభ్రాణముగ్రవపుషం త్రినేత్రంచంద్రశేఖరమ్॥ 199
దంష్ట్రాకరాలనినదద్ భ్రుకుటీకుటిలాననం
దహంతంభువనత్రయమ్॥ 290
భూతప్రేతపిశాచాదీన్ భక్షయంతంమహాబలం
ఏవంధ్యాత్వాజపేన్నిత్యం రక్షోహాగ్నింసమాహితః॥ 201

తా॥ త్రిశూలము గండగొడ్డలి కపాలము డమరుకము కల నాలుగు చేతులును, భయంకరరూపమున మూఁడుకన్నులును, తలయందు చంద్రుడును, కోఱలును కనుబొమలు చిట్లించిన మొగమును, మండుచున్న యగ్నివంటి రూపమును మూఁడు లోకములను దహింపజేయుచున్నట్లును భూతము ప్రేతము పిశాచము అనుదుష్ట గ్రహములు మొదలగు వానిని మ్రింగివేయుచున్నట్లును, గొప్ప బలముతో గూడిన శరీరమును ప్రలయాగ్నితో గూడినవాడును అగు శివ స్వరూపమును రక్షోఘ్నలక్షణమని యెరుంగవలయును.

## 89. దిక్పాలకయుక్త త్రిపురాంతకమూర్తి లక్షణము

అపరా. 213 వ సూ.

శ్లో॥ వరంవజ్రాంకుశౌచైవ కుండీంధత్తేకరైస్తుయః
గజారూఢఃసహస్రాక్ష ఇంద్రోవై పూర్వతఃస్థితః॥ 9
వరదఃశక్తిహస్తశ్చ సమృణాలకమండలుః
జ్వాలాపుంజనిభోదేవో మేషారూఢోహుతాశనః॥ 10

లేఖనీంపుస్తకంధత్తే కుక్కుటండండమేవచ
సుమహామహిషారూఢోయమఃకృష్ణాంగఈరితః॥ 11
ఖడ్గంచఖేటకంహస్తే కర్త్రీంచైవారిమస్తకం
దంష్ట్రాలంబముఖంకుర్యాచ్ఛవారూఢంచనిరృతిమ్॥ 12
వరంపాశంచకమలం కరైర్బిభ్రత్కమండలుం
కర్తవ్యోమకరారూఢో వరుణఃపశ్చిమేతథా॥ 13
వరంధ్వజంపతాకాంచ దధద్ధస్తైఃకమండలుమ్
మృగారూఢోహరిద్వర్ణః పవనోవాయుదిక్పతిః॥ 14
గదాంనిధింబీజపూరంక రైర్బిభ్రత్కమండలుం
గజారూఢఃప్రకర్తవ్యో ధనదశ్చోత్తరేతథా॥ 15
వరదంచత్రిశూలంచ నాగేంద్రంబీజపూరకం
వృషారూఢశ్చకర్తవ్య ఈశానోధవలద్యుతిః॥ 16
ఏకవక్త్రందశభుజం నృత్యంతంత్రిపురాంతకం
సింహచర్మపరిధానం మృగచర్మోత్తరీయకమ్॥ 17
రక్తాంబరధరందేవం సూర్యకోటిసమప్రభం
కపాలమాలాభరణం శశాంకకృతశేఖరమ్॥ 18
ఖట్వాంగఖేటకధరం ధృతఖడ్గకపాలకం
త్రిశూలాదితకంఠాచ శరశార్ఙ్గవిధారిణం॥ 19
పాశాంకుశధరందేవం కుండలాభ్యామలంకృతం
హారంసంస్థాప్యనృత్యంతం వలయాకారసంస్థితమ్॥ 20

తా॥ వరదము, వజ్రము, అంకుశము, కమండలువు, నాలుగు చేతులలోను ఏనుగుపై నెక్కి వేయి కన్నులతో నింద్రుడు తూర్పునను, వరదము, శక్తి, తామరకాండ, కమండలువు నాలుగు చేతులలోను మంటతో సమానమైన కాంతి గల దేహమునుపొట్టేలుపైనెక్కి

అగ్నియును, గంట్లము, పుస్తకము, కుక్కుటము, దండము, నాలుగు చేతులలోను గొప్ప మహిషముపై నెక్కియముడును ఖడ్గము ఖేటకము కర్త్రి శత్రుశీర్షము గల నాలుగు చేతులును కోఱలు కనుపడు చున్న ముఖమును శవముపై నెక్కియుండినట్లు నిర్‌ృతియును, వరదము పాశము, పద్మము, కమండలువు నాలుగుచేతుల యందునుమకరముపై నుండి వరుణుడును, వరదము, ధ్వజము, పతాక కమండలువుకలిగివేదిపైన ఆకుపచ్చ వన్నెతో వాయువును, గద, నిధి, ఫలము,కమండలువు కలిగి యేనుఁగుపైనెక్కి కుబేరుఁడును వరదము, త్రిశూలము, నాగేంద్రము, ఫలము, నాలుగు చేతులలోను వృషభవాహనము తెలుపు వన్నె కలిగి యీశానుఁడును వీరి నడుమ ఒక్క ముఖమును మూఁడు కన్నులును పది చేతులును, సింహచర్మమును మొలకుచుట్టి వేడి చర్మమును పైన గప్పికొని యెఱ్ఱని వస్త్రములను ధరించి కపాలమాల ధరించి సమస్తాభరణము దాల్చి జటామకుటమున చంద్రుని ధరించి ఖట్వాంగము, ఖేటకము, ఖడ్గము, కపాలము, త్రిశూలము, శరము ధనుస్సు, పాశము, అంకుశము, అభయము, కలవది చేతులును చెవులకు కుండలములును వలయాకార నృత్యమును గలిగి వేయిమంది సూర్యులైనను సాటిరాని కాంతితో ప్రకాశించుచున్న రూపము. దిక్పాల సహిత త్రిపురాంతకమూర్తి యనబడును.

## 90. కృష్ణశంకరమూర్తి లక్షణము

అపరా. 213వ సూ

శ్లో॥ కృష్ణశంకరకంవక్ష్యే కృష్ణార్ధేనతుసంస్థితం
కృష్ణార్ధేముకుటంకుర్యా జ్జటాభారంచదక్షిణే॥ 28
కుండలందక్షిణేకర్ణే వామేమకరకుండలమ్
అక్షమాలాంత్రిశూలంచక్రంవై శంఖమేవచ॥ 29

తా॥ కృష్ణశంకరమూర్తి లక్షణమును చెప్పుచున్నాడు. సగము కృష్ణరూపమును సగము శివరూపమును గలది యనుట. ఎడమ

వైపున కిరీటమును కుడివైపు జటాబంధమును కుడిచెవి యందు కుండలమును ఎడమ చెవియందు మకరకుండలమును, త్రిశూలము అక్షమాల కుడిచేతులలోను శంఖము చక్రము ఎడమచేతులలోను రచించవలయును కుడివైపున తెల్లని రూపమును, ఎడమవైపున నల్లని రూపమును రచించవలయును.

## 91. హరిహరపితామహ లక్షణము

అపరా. 213 వ. సూ

శ్లో॥ ఏకపీఠసమారూఢ మేకదేహనివాసినం
షడ్భుజంచచతుర్వక్త్రం సర్వాలంకారసంయుతమ్॥ 30
అక్షసూత్రంత్రిశూలంచ గదాంచైవతుదక్షిణే
కమండలుంచఖట్వాంగం చక్రంవామభుజేతథా॥ 31

తా॥ ఒక్కటే పీఠమున ఒక్కటే శరీరముగాను, ఆరుచేతులును, నాలుగు తలలును, సమస్తమైన యలంకారములును, అక్షమాల, త్రిశూలము, గద, కుడిచేతులలోను, కమండలువు, ఖట్వాంగము, చక్రము ఎడమ చేతులలోను గల రూపము హరిహరపితామహులగును.

## 92. హరిహరహిరణ్యగర్భ లక్షణము

అపరా. 213వ సూ.

శ్లో॥ చతుర్వక్త్రంచాష్టబాహుం చతుష్పైకనివాసనం
బుజ్వాగతో ముఖః కార్యః పద్మహస్తోదివాకరః॥ 32
ఖట్వాంగత్రిశూలహస్తో రుద్రోదక్షిణతఃశుభః
కమండలుంచాక్షసూత్ర మపరేస్యాత్ పితామహః॥ 33
వామేతుసంస్థితశ్చైవం శంఖచక్రధరోహరిః
ఏవంవిధంప్రకర్తవ్యం సర్వకామఫలప్రదమ్॥ 34

తా॥ నాలుగు తలలు ఎనిమిది చేతులు గల ఒక్కటే శరీరం ఏ వైపున ఒరుగు లేకుండ చక్కగా నిలిచినట్లును ముందు వైపున పద్మములను రెండు చేతులతో ధరించిన సూర్యుడును, కుడివైపున ఖట్వాంగము త్రిశూలము కల శివరూపమును వెనుకవైపున కమండలువు అక్షమాల చేతులయందు గల బ్రహ్మరూపమును ఎడమ వైపున శంఖము చక్రము గల విష్ణురూపమును రచించిన యెడల హరిహరహిరణ్య గర్భరూపమగును. ఇందు సూర్యునితో గూడ నాలుగు రూపములు చెప్పబడియుండి ముగ్గురినే వచించుచున్నాడు.

శిల్ప ఉత్తర 25 వ అ.

శ్లో॥ హేమాంభోజేనిషణ్ణం ప్రవదమృతఘటా చక్రశంఖాకరాబ్జై
ష్వత్శుస్రక్కుండికాఖ్యైశిరసిశశికలాం
ధారయంతంసుభూషం హేమాభంపీతవస్త్రం
రవిశశిదహనత్రీక్షణంచిత్స్వరూపం సర్వజ్ఞంసర్వగంతం
హరిహరవిధిజంవిశ్వరూపంనమామి॥
(అనుష్టుప్ త్రయం) అని శ్రీ(మమారుడు) తాత్పర్యము వ్రాయపలెను

# 93. గణపతి ప్రతిమారులు

అపరా. 220 వ. సూ.

శ్లో॥ అవిఘ్నో విఘ్నరాజశ్చ సువక్త్రోబలవానథ
గజకర్ణశ్చగోకర్ణః సౌమ్యశ్చాభయదాయకః॥ 14
సర్వేతువామనాకారాః సౌఖ్యదాఃపురుషాననాః
తర్జనీపరశుఃపద్మం దండోహ స్తేష్వవిఘ్నకః॥ 15
తర్జనీదంసవ్యేసభ వేద్విఘ్నరాజకఃపూర్వద్వారో భయభాగే
సర్వవిఘ్నవినాశకః॥ 16

తర్జనీఖడ్గఖేటౌతు దండోహస్తేఃసువక్త్రికః
తర్జనీదండపసవ్యే బలవాంశ్చసబాధితః॥ 17

తర్జనీబాణచాపౌచ దండకఃగజకర్ణకః
తర్జనీదండాపసవ్యే గోకర్ణఃపశ్చిమస్థితః॥ 18

తర్జనీపద్మాంకుశాశ్చ దండశ్చైవసుసౌమ్యకః
శస్త్రాపసవ్యేచతథా భవేదభయదాయకః॥ 19

ద్వారపక్షౌసర్వదిక్షు స్థాప్యావిఘ్నవినాశనాః
ఇత్యష్టౌచప్రతీహారా నృపాణాంశాంతిమిచ్ఛతా॥ 20

తా॥ గణపతి దేవాలయమున ద్వారపాలకులు ఎనిమిదిమంది అందఱును వామనాకారము గలవారే. తూర్పు వాకిటి దక్షిణమున అవిఘ్నుడు తర్జని, పరశువు, దండము నాలుగుచేతులయందు కలిగియుండును. ఉత్తరమున విఘ్నరాజు తర్జని, దండము ఎడమచేతుల లోను పరశువు పద్మము కుడిచేతులలోను కలిగియుండును. దక్షిణ ద్వారము యొక్క కుడిపైపున సువక్త్రుడు తర్జని, ఖడ్గము, ఖేటము, దండము కలిగియుండును. ఎడమవైపున బలవంతుడు తర్జని, దండము ఎడమ చేతులలోను ఖడ్గము, ఖేటము, కుడిచేతులలోను కలిగియుండును పశ్చిమ ద్వారము యొక్క కుడివైపున గజకర్ణుడు తర్జని, బాణము. ధనుస్సు, దండము, కలిగియుండును. ఎడమవైపున గోకర్ణుడు తర్జని దండము, ఎడమచేతులలోను, ధనుస్సు, బాణము కుడిచేతులలోను కలిగియుండును. ఉత్తర ద్వారము యొక్క కుడివైపున సౌమ్యుడు తర్జని, పద్మము, అంకుశము, దండము కలిగియుండును. ఎడమవైపున అభయుడు అంకుశము దండము పద్మము తర్జని కలిగియుండును. ఇట్లుండుట గ్రామమునకు శాంతి కలిగియుండును.

# 94. వినాయక లక్షణము (ఉత్తమ పంచతాలము)

కాశ్య. 47 వ పటలము

శ్లో॥ అథవక్ష్యే విశేషేణ వినాయకస్యలక్షణం
పాదాద్యుష్ణీషసీమాంతం చతుఃషష్ట్యంశకంభవేత్ ॥ 1
మూర్ధ్నోమస్తకసీమాంత మంగులద్వయముచ్యతే
తస్మాద్వై నేత్రసూత్రాంతం
చతుర్మాత్రముదాహృతమ్ (తతోఽష్టమాత్రమానంతు
హానుసీమాంతమాతతం గలంతుచతురంశంస్యా
దాశాంశంహృదయంతతః తతో నాభిస్తతో మేఢ్రం
నవాంశమితికథ్యతే) 2
ఊరూపదర్ధమాత్రంస్యా జ్జానుదీర్ఘంగుణాంగులం
జంఘాచోరుసమందీర్ఘం గుణాంశంపత్తోదయమ్॥ 3
సప్తాంగులంతలాయామ మంగుష్ఠాగ్రావసానకం
పాదాంగుష్ఠాయతంద్వ్యంశం సార్ధాంశంతుకనిష్ఠికా॥ 4
తర్జన్యాదికనిష్ఠాంతం ప్రత్యేకంయవహీనకమ్
త్రయోదశాంగులంబాహూ ప్రకోష్ఠావానవాంగులమ్॥ 5
చతుర్మాత్రంతలాయామ మగ్న్యంశంమధ్యమాంగులం
తర్జన్యనామికేద్వేచ ఏకవింశత్యవాయతే॥ 6
కనిష్ఠాంగుష్ఠయోశ్చైవ దీర్ఘంసప్తదశంయవమ్
ద్వాదశాష్టనవాష్టౌచ సప్తసంఖ్యాయవంక్రమాత్ ॥ 7
అంగుష్ఠాదికనిష్ఠాంతం వ్యాసమిత్యభిధీయతే
తత్తద్వ్యాసత్రిపాదంస్యా న్నఖవ్యాసముదాహృతమ్॥ 8
నఖవ్యాసత్రిపాదంస్యా న్నఖదీర్ఘాయవృత్తవత్
వేదంకరతలవ్యాసం మణిబంధోత్రికంభవేత్ ॥ 9

ప్రకోష్ఠకలయుగాంగుల్యం బాహువ్యాసంషడంశకమ్
బాహామూలంతువస్వంశం మస్తకోఽష్టాంగులాంతకమ్॥ 10

సప్తాంగులంతుతన్నిమ్నం ముఖమధ్యేదశాంగులమ్
హస్తమూలంషడంగుల్యం ద్వావింశత్యస్యదీర్ఘకమ్॥ 11

తదంగులాగ్రవిస్తారం సార్ధమాత్రంద్విజోత్తమ
క్రమేణకృశతాహస్తే తన్మధ్యేసుషిరద్వయమ్॥ 12

వామదంతాయతంవేద మాత్రమిత్యభిధీయతే
దక్షిణేదంతమూలంస్యా ద్వేమాఖ్యమతలంభవేత్ ॥ 13

అధరస్యతునిష్క్రాంతం లంబనద్వయమంగులం
నేత్రాయామంవిశాలంచ షడవ్యంపరికీర్తితమ్॥ 14

కర్ణంభూతాంగులవ్యా ముత్సేధంచైవతద్భవేత్
అర్ధాంగులంఘనంతస్య కర్ణమూలంద్వయాంగులమ్॥ 15

యద్వద్గజాననంతద్వ త్కర్తవ్యంతుముఖంద్విజ
బాహుపర్యంతవిస్తారం ద్వాత్రింశదంగులంభవేత్॥ 16

ఏకోనవింశదంగుల్యం కట్యంతరముదాహృతం
స్తనాంతరందశాంగుల్యం హిక్కాయాశ్చద్వయోర్బహిః 17

స్తనాగ్రంద్వియవవ్యాసం ద్వ్యంగులంస్తనమండలమ్
స్తనాధస్స్థవిశాలంతు త్రిపంచాంగులముచ్యతే॥ 18

ద్వావింశదంగులంఖ్యాతం మధ్యోదరవిశాలకం
నాభినిమ్నవిశాలంతు అధ్యర్ధాంగులముచ్యతే॥ 19

లింగాయామంగుణాంగుల్యం తస్యార్ధంతస్యవిస్తృతం
ముష్కాయామవిశాలంతు గుణాంగులముదాహృతమ్॥ 20

ఊరువ్యాసంతుభాన్వంశం జానువ్యాసంనవాంగులమ్
జంఘామూలవిశాలంతు సప్తమాత్రముదాహృతమ్॥ 21

నలకావిస్తృతకంచాపి సార్ధంత్ర్యంగులముచ్యతే
తదగ్రంస్యాత్తథాసార్ధం షణ్మాత్రమితివిద్యతే । 22
పార్ష్ణ్యాయామవిశాలంతు గుణాంగులముదాహృతమ్
ద్వాదశాష్టౌచసప్తంచ షట్కపంచయవంక్రమాత్ ॥ 23
అంగుష్ఠాదికనిష్ఠాంతం పాదాంగులవిశాలకమ్
సత్రిపాదంనఖవ్యాసం తదర్ధాయతమండలమ్ ॥ 24
స్థానకంవాఽఽసనంవాఽపి పద్మపీఠేవిశేషతః
స్వదంతందక్షిణేహస్తేక వామహస్తేకపిత్థకే ॥ 25
మోదకంగజహస్తేతు అంకుశందక్షిణేకరే
వామహస్తేతుపాశంవా నాగంచైవాక్షమాలికా ॥ 26
త్రినేత్రంహేమసంకాశం దుకూలవసనాన్వితం
అభంగంసమభంగంవా స్థానకేతుప్రకల్పయేత్ ॥ 27
ఆసనంస్యాసనంచేత్తు వామపాదంతుశాయితమ్
మానాంతరేమూర్ధ్నిపాదే పాదౌతుకటకంవినా ॥ 28
ఈషద్వక్రతనుర్వామే కర్తవ్యంతువిశేషతః
వ్యాలయజ్ఞోపవీతంతు కిరీటముకుటాన్వితమ్ ॥ 29
హారంముకుటకూటంవా జటామాళికమేవవా
సర్వాభరణసంయుక్తం మహాకాయంమహోదరమ్ ॥ 30
ఏవంవినాయకంఖ్యాతం శ్రుణుషణ్ముఖలక్షణమ్ ॥ 31
ఇతికాశ్యపేవినాయకలక్షణంసప్తచత్వారింశఃపటలః

తా॥ వినాయకుని యొక్క లక్షణములను చెప్పుచున్నాడు. పాదము మొదలుకొని కిరీటముపై భాగము వఱకు 64 అంగులములు పైన తలయొక్క పై భాగము వఱకు 2 అంగులములు అక్కడి నుండి నేత్ర సూత్రము వఱకు 4 అంగులములు (హనుసీమ 8 అం కంఠము 4 అం. ఱొమ్ము 10 అం. నాభివఱకు 9అం. మేఢ్రము వఱకు9 అం)

తొడలు 6½ అంగులములు మోకాలు నిడివి 3 అంగులములు పిక్క పొడవు తొడతో సమానము. పాదము యెత్తు 3 అంగులములు. పాదము పొడవు బొటనవ్రేలి వఱకు 7 అంగులములు బొటనవ్రేలి పొడవు 2 అంగులములు చిటికెనవ్రేలి పొడవు 1½ అంగులములు బొటనవ్రేలుగా మిగిలిన నాలుగువ్రేళ్లు యెత్తు తక్కువగా నుండవలయును. భుజములు 13 అంగులములు ముంజేతులు 9 అంగులములు అరచేతులు 4 అంగులములు నడిమివ్రేలు 3 అంగులములు తర్జనీవ్రేలును, అనామికవ్రేలును 21 యవల పొడవు చిటికెనవ్రేలును బొటనవ్రేలును పొడవు 17 యవలు తర్జనివ్రేలు లావు 8 యవలు మధ్యమవ్రేలు లావు 9 యవలు అనామిక వ్రేలు లావు 8 యవలు చిటికెనవ్రేలు లావు 7 యవలు ఒక్కొక్క వ్రేలి లావులో ముప్పాతికవంతు గోరును చేయవలయును. ఆ విస్తారములో ముప్పాతికవంతు గోరు పొడవును గుండ్రముగా రచించవలయును. అరచెయ్యి వెడల్పు 4 అంగులములు మనికట్టు యొక్క విస్తారము 3 అంగులములు ముంజెయ్యి లావు 4 అంగులములు భుజముల యొక్క విస్తారము 6 అంగులములు భుజములు మొదలు విస్తారము 8 అంగులములు తొండము ప్రక్క మొదలుకొని యుండవలయును. లోతు 7 అంగులములు ముఖము నడుమ విస్తారము 10 అంగులములు తొండము మొదలు 6 అంగులములు దానిని డివి 22 అంగులములు చివర విస్తారము 1½ అంగులమును మందము 1 అంగులము తొండము క్రమముగా చివరకు సన్నమై యుండవలయును, దాని నడుమ రెండు రంధ్రములుండవలయును, దాని నడుమ రెండు రంధ్రము లుండవలయును. ఎడమదంతము పొడవు 4 అంలములు కుడిదంతము మొదలు మాత్రమే కనపడుచుండవలయును. ఎడమ దంతము క్రిందికి దిగి యుండవలయును. పెదవి యొక్క నిర్గమము రెండు వైపుల 1 అంగు

లము కన్ను యొక్క పొడవు వెడల్పు 6 యవలు చెవి విస్తారము 5 అంగులములు ఎత్తు 5 అంగులములు చెవి మొదలు మందము $\frac{1}{2}$ అంగులము విస్తారము 2 అంగులములు ఏనుగు ముఖమువలె ముఖమును రచించవలయును. భుజముల వఱకు వెడల్పు 32 అంగులములు చంకల లోపలకు కొలత 19 అంగులములు చన్నుల సందు 10 అంగులములు అక్కుళ్ల యొక్క వెలుపలికి రావలయును. చనుమొనలలావు 2 యవలు చన్నుల వృత్తము 2 అంగులములు స్తనములకు దిగువ విస్తారము 15 అంగులములు పొట్ట నడుమ విస్తారము 22 అంగులములు బొడ్డు లోతు విస్తారము $1\frac{1}{2}$ అంగులము మేఢ్రము పొడవు 3 అంగులములు లావు $1\frac{1}{2}$ అంగులము వృషణములు పొడవు లావు 3 అంగులములు తొడల విస్తారము 12 అంగులములు మోకాలి విస్తారము 9 అంగులములు పిక్క మొదలు విస్తారము 7 అంగులములు చీలమండకుపై భాగమున విస్తారము $2\frac{1}{2}$ అంగులములు దాని పైన విస్తారము $8\frac{1}{2}$ అంగులములు చీలమండ పొడవు వెడల్పు 3 అంగులములు కాలిబొటన వ్రేలిలావు 12 యవలు రెండవ వ్రేలు 8 యవలు మూడవ వ్రేలు 7 యవలు నాల్గవ వ్రేలు 6 యవలు ఐదవవేలు 5 యవలు చేయవలయును. ఒక్కొక్క దానిలో ముప్పాతికవంతు గోరు వెడల్పును సగమువంతు గోరు పొడవును గుండ్రముగాను చేయవలయును. నిలుచున్నట్లుగాని, కూర్చున్నట్లుగాని పద్మము పీఠముపై నుండునట్లు రచించవలయును. తన దంతమును కుడిచేతను, ఎడమ చేత వెలగపండును, తొండము నమోదకమును కుడిచేత అంకుశమును, ఎడమచేత పాశమును, కుడిచేత సర్పమును, ఎడమచేత అక్షమాలయును మూడు కన్నులును, బంగారు చాయయును, సన్నని వస్త్రములు ధరించియును, అభంగముగాని, సమభంగముగాని, నిలుచున్నట్లు రచించవలయును. ఆసనమైనచో సుఖాసనమును కల్పింపవలయును. ఎడమ కాలును అడ్డముగా నుంచవలయును, కొలత ప్రకా

రము తలనుండి పాదము వఱకు క్రమముగా రచించవలయును. పాదములకు కడియములక్కఱలేదు. కొంచెము యెడమవైపున కొరగినట్లును సర్ప యజ్ఞోపవీతమును కిరీటమునుగాని జటామౌళికమునుగాని రచించవచ్చును. మెడలో హారములును, సమస్తమైన యాభరణములును, గొప్ప శరీరమును, పెద్ద పొట్టయును రచించవలయును. ఇది వినాయకుని లక్షణము శిల్పరత్నం ఉత్తర భాగం 14వ అధ్యాయమున 1 మొదలు 24 శ్లోకముల వఱకు ఉత్తమ పంచతాళము ప్రకారము విఘ్నేశ్వర లక్షణమును జెప్పినాడుగాని శ్లోకముల యందేమి మార్పు లేనందున వ్రాయలేదు.

శిల్ప సంగ్రహము

శ్లో॥ నాగాననంచతుర్బాహుం త్రినేత్రంమకుటోజ్జ్వలం
కర్ణచామరసంయుక్తం ఇక్షుదండంసమోదకమ్॥ 15
లంబోదరంశూలపాశంపూంజి యజ్ఞోపవీతినండదరేనాగ 16
బంధించి ఏకదంతము పాస్మహే॥

(అనుబంధము 35, 36 పటములు చూడుడు)

## 95 అపరాజిత పద్ధతి

అపరా 112 వ సూ

శ్లో॥ గజాననంచతుర్బాహుం త్ర్యక్షంపురుషరూపిణం
ఏకదంతంమహాచండం వ్యాలయజ్ఞోపవీతినమ్॥ 35
స్వదంతందక్షిణేహస్తే పరశుంచాపరేకరే
ఉత్పలంచోర్ధ్వతో వామే తస్యాధో మోదకంస్థితమ్॥ 36
సిందూరరక్తంకుంభంచ కుంకుమారుణవిగ్రహం
కుర్యాచ్ఛమూషకారూఢం సిద్ధిదంసర్వకామదమ్। 37

తా॥ ఏనుఁగు మొగమును నాలుగు చేతులును, మూడు

కన్నుల్లును, మనుష్య రూపమును ఒక్కటే దంతమును సర్ప యజ్ఞోపవీతమును, కుడిచేత తన దంతమును రెండవచేత గండగొడ్డలియును ఎడమచేత పద్మమును దానికి దిగువచేత మోదకమును చందిరము వంటి మెఱుపు గల కుంభమును. కుంభను మిగుల ఎఱ్ఱనయిన దేహమును ఎలుక వాహనమును గలిగియుండిన రూపము గణపతి యని తెలియవలయును.

"గణనాథశ్చషట్కాలో యథా శైవం ప్రకీర్తితాః"
(అపరా 235 వసూ 15వ శ్లో)

## 96. శ్రీ కుమార పద్ధతి

శిల్పరత్నం ఉత్తర భాగం 14 వ అ.

శ్లో॥ అశ్వ్యంగులంతు కేశోచ్చం సప్తాంశంముఖమానకం
గ్రీవోచ్చంతుయుగాంశంస్యాత్ తస్మాచ్చూచుకమంశతః॥ 25
తస్మాన్నాభిస్తతో మేఢ్రం సప్తభాగేనకల్పయేత్॥
భాన్వంశమూరుదీర్ఘంచ జానుదీర్ఘంద్విభాగతః॥ 26
జంఘాదీర్ఘంద్వాదశాంశం ద్వ్యంశంపాదతలోన్నతం
దశాంశంతుతలాయామం మన్వంశం బాహుమానకమ్॥ 27
ప్రకోష్ఠాయతమాశాంశం తలాయామంయుగాంశకమ్
తత్సమంమధ్యమాయామ మన్యత్ సర్వంపురోక్తవత్॥ 28

తా॥ తలవెంట్రుకలు 2 భాగములు ముఖము 7 భాగములు, మెడయెత్తు 4 భాగములు మెడ నుండి ఱొమ్ము వఱకు 7 భాగములు అక్కడి నుండి బొడ్డు 7 భాగములు బొడ్డు నుండి మేఢ్రము 7 భాగములు తొడ పొడవు 12 భాగములు మోకాల్లు పొడవు 2 భాగములు, పిక్క పొడవు 12 భాగములు పాదము యెత్తు 2 భాగములు పాదము పొడవు 10 భాగములు భుజము పొడవు 14 భాగములు

ముంజెయ్యి పొడవు 10 భాగములు అరచెయ్యి పొడవు 4 భాగములు దానితో సమానము నడిమిమ్రేలు మిగిలినవన్నియును మును పటివలెనే చేయవచ్చును. మొత్తము పొడవు 62 భాగములు.

## 97. మధ్యమ పంచతాల విఘ్నేశ్వర పద్ధతి

శిల్పరత్నం ఉత్తర 14వ అ

శ్లో॥ విఘ్నేశంశరతాలకైర్విరచయేత్
త్ర్యక్షంమహాభాననమ్ గూఢాభుగ్నగలంస్థితంసముపవిష్టం
వాతిపీనాంగకమ్ ఉష్ణీషాన్ముఖమేక కేనసదలా భ్యాంతాలకా
భ్యాంతతఃకట్యంతంచరణౌకరాశ్చకరణీయాఃసార్ధతస్తాలతః॥29
ఇవి శిల్పరత్నే ఉత్తరభాగేపంచతాలలక్షణంనామ చతుర్దశోఽధ్యాయః ఇది అసంపూర్తిగ నుండుటచే తాత్పర్యమనవసరము.

## 98. మహాగణపతి లక్షణము

శిల్ప ఉత్తర 25వ అ.

శ్లో॥ మందారాద్యైఃకల్పకవృక్షవిశేషైర్విశిష్టతరఫలదైః
శిశిరితచతురాశాంతర్బాలాతపచంద్రికాకులేచతకే॥ 39
ఐక్షవజలనిధిలహరీకణజాలకవాహినా చగంధవహేన
సంసేవితేచసురతరుసుమనః శ్రితమధుపపక్షచలనపరేణ॥ 40
రత్నమయేమణి వజ్రప్రవాల ఫలపుష్పపల్లవస్యసతః
మహతోఽధస్తాదృతుభిర్యుగపత్ సంసేవితస్యకల్పతరోః॥ 41
సింహముఖపాదపీఠగలిపిమయపద్మేత్రిషట్కోణోల్లసితే
ఆసీనస్త్వేకరదోబృహదుదరోదశభుజోఽరుణాంగజవదనః॥ 42
బీజాపూరగదేక్షుకార్ముకరుహాచక్రాబ్జపాశోత్పల
వ్రీహ్యగ్రస్వవిషాణరత్నకలశప్రోద్యత్కరాంభోరుహాః
ధ్యేయోవల్లభయాచపద్మకరయాశ్లిష్టోజ్జ్వలద్భూషయా
విశ్వోత్పత్తివినాశసంస్థితికరోవిఘ్నోవిశిష్టార్థదః॥ 43

కరపుష్కరధృతకలశ స్రుతమణిముక్తా ప్రవాలవర్షేణ
అవిరతధారాం వికిరన్ పరితఃసాధకసమగ్రసంపత్త్యై॥ 44

మదజలలోలుపమధుకరసూలాం నిజకర్ణతాలతాడనయా
నిర్వాసయన్ ముహుర్ముహురమరైరసురైశ్చ సేవితో
యుగపత్ ॥ 45

అగ్రేఽథబిల్వమభితశ్చరమారమేశౌ
తద్దక్షిణేవటజుషౌగిరిజావృషాంకౌ
పృష్ఠేఽథపిప్పలజుషౌరతిపుష్పబాణౌ
సవ్యేప్రియంగుమభితశ్చమహీవరాహౌ॥ 46
ధ్యేయాచపద్మయుగచక్రదరైఃపురోక్తా
పాశాంకుశాఖ్యపరశ్రుతిశిఖైరథాన్యౌ
యుగ్మోత్పలేక్షుమయచాపశరైస్తృతీయా
పంత్యౌశుకాహ్వకలమాగ్రగగదారథాంగైః॥ 47
ధ్యేయాఃషట్కోణాశ్రిషుపరితః పాశాంకుశాభయేష్టకరాః
సప్రమదాగణపతయోరక్తాకారాఃప్రభిన్నమదవివశాః 48
అగ్రాశ్రౌపామోదఃప్రమోదసుముఖౌ(చ)తమభితోఽశ్రి
యుగే
పృష్ఠేచదుర్ముఖాఖ్యస్త్వముమభితోవిఘ్నవిఘ్నకరౌ॥ 49
సవ్యాపసవ్యభాగేతస్యధ్యేయౌచశంఖపద్మనిధీ
మాక్షికమాణిక్యాభౌవర్షంతౌధారయాధనానిసదా॥ 50
సిద్ధిసమృద్ధీచాన్యేకాంతిర్మదనవతీమదద్రవయా
ద్రావిణీవసుధారాఖ్యేమధుమత్యపి
విఘ్ననిధియుగప్రమదాః॥ 51

తా॥ మందారము మొదలగు కల్ప వృక్షజాతుల యొక్క
ఫలములయొడను చల్లదనమును గలిగిన నలుదెసల నమమచేత యెండ

వంటి వెన్నెలచోట చెఱకురససముద్రము నందలి యలల యొక్క
తుంపురలతో గూడిన మలయమారుతముచేతను కల్పవృక్షముయొక్క
పుష్పముల యందుండిన తుమ్మెదలు కదలుచుండుటయును రత్న
మయములైన ఫలపుష్ప పల్లవములు అనగా మాణిక్యములవంటి ఫల
ములును, వజ్రములవంటి పుష్పములును, పగడమువంటి గురుటాకు
లును గల వృక్షము క్రిందను మఱియు అన్ని ఋతువులయందు
ఫలించునట్టియు పూయునట్టియు వృక్షముల స్థితి దాని యందేక
కాలముననే కనిపించుననుట సింహాముఖములు గల పాదపీఠమున అక్ష
రములతో గూడిన పద్మమునకు మూడుచుట్లగా ఆఱు కోణములును
అన్ని గదులయందు వరుసగా అచ్చులును హల్లులు గలసి 54 అక్ష
రములును దానిపై ఒక్క దంతమును, పెద్దపొట్టయును, పది చేతు
లును, ఎఱ్ఱని శరీరమును, ఏనుగుమొగమును, కుడిచేతుల దిగువనుండి
వరుసగా ఫలము గద చెఱుకుగడ, గఱిక, చక్రము 5ను ఎడమచేతులపై
నుండి వరుసగా శంఖము, పాశము, కలువ వరికంకులు తెనదంతము, ఈ
5ను తొండము నందు రత్నకలశమును పద్మమును చేతబట్టికొనిన
భార్యతో గూడిన వాడును సమస్తమైన ఆభరణములు గలవాడును.
విశ్వము యొక్క పుట్టుక. ఉనికి నాశము ఈ మూడింటికిని అధికారి
యును అగు మహా గణపతిని ధ్యానించెదను. తొండము నందలి
రత్నకలశమునుండి కురియుచున్న మెడ తెగని మాణిక్యములు,
ముత్యములు, పగడములు పచ్చలు, నీలములు, మొదలైనవి అంతటను
గమ్ముకొనుచు ఉపకరణములను కలుగజేయుచుండును. మదజలము
నందాసక్తి గల తుమ్మెద చాలును తన చెవులకదలింపుచేత పారదోలు
చున్నట్లును, దేవతలోక నైపునను, దానవులోక నైపునను
సేవించుచున్నట్లును, ముందుమారేడుచెట్టును లక్ష్మీనారాయణులును,
దక్షిణమున మఱ్ఱిచెట్టును పార్వతీశ్వరులును వెనుక రావిచెట్టును
రతీమన్మథులును, ఉత్తరమున ప్రేంకణపు చెట్టును
భూవరాహములును, సేవించుచున్నట్లును విఘ్నపు చేతులలో

రెండు పద్మములును చక్రము శంఖమును శివుని చేతులలో పాశము, అంకుశము, గండగొడ్డలి త్రిశూలము మన్మథుని చేతులలో రెండు కలువలను చెఱకుగడలయును అశోకపుష్పమును వరాహము చేతులలో చిలుక వరికంకులు, గద, చక్రము కలిగియుండవలయును. షట్కోణములచుట్టును పాశము, అంకుశము, అభయము, వరదము గల పత్నీ సహితగణపతి యొక్క తనువును, ముందటి కోణమున ఆమోదుఁడు దాని చుట్టు కోణముల యందు ప్రమోదుఁడును సుముఖుఁడును వెనుక కోణమున దుర్ముఖుఁడును అతని చుట్టు కోణములయందు అవిఘ్నుఁడును విఘ్నకరుఁడును కుడి యెడమల యందు శంఖము, పద్మం అను నిధులును పసుపువన్నె యొుపు వన్నె గల ధారతో ధన వర్షం కురియుచున్నట్లును, సిద్ధి, సమృద్ధి, కాంతి, మదనావతి అనువారలు కలశముతో ధనవర్షమును కురిపించుచున్నట్లును గల స్వరూపము మహా గణపతి లక్షణమని యెఱుంగవలయును.

(అనుబంధము 37వ పటము చూడుడు)

## 98/2 లక్ష్మీగణపతి లక్షణము

### శిల్ప సంగ్రహము

శ్లో॥ మూషకక్షేత్రసమారూఢో రమావామాంకసంస్థితం
నీలమేఘసమాభాసం గణనాథముపాస్మహే॥ 17

తా॥ మూషకము యొక్క శరీరముపై నున్నవాడును. ఎడమ తొడ యందు లక్ష్మీదేవికలవాడగు నీలవర్ణము గల వాడును అగు గణపతిని లక్ష్మీగణపతియని తెలియవలయును.

(అనుబంధము 38వ పటము చూడుడు)

## 99, బీజగణపతి లక్షణము

### శిల్ప ఉత్త 25 వ

శ్లో॥ రక్తోరక్తాంగరాగాంశుకకుసుమయుతస్తుందిలశ్చంద్రమౌలి
ర్నేత్రైర్యుక్తస్త్రిభిర్వామనకరచరణో బీజపూరాత్తనాసః

హస్తాగ్రాత్ క్లుప్తపాశాంకుశరదవరదో నాగవక్త్రోఽహిభూషో
దేవఃపద్మాసనో వో భవతునతసురో భూతయే విఘ్నరాజః॥ 52

తా॥ ఎఱ్ఱని వాఁడును, ఎఱ్ఱని వస్త్రములు, ఎఱ్ఱని గంధము, ఎఱ్ఱని పుష్పములు, పెద్దపొట్ట. చంద్రుడు కిరీటమునను, మూఁడు కన్నులును, కాళ్లు చేతులు కురుచలును, తొండమున ఫలమును, నాలుగు చేతులయందు పాశము, అంకుశము దంతము వరదము కలవాఁడును ఏనుగుతలయును సర్వభూషణములును, పద్మపీఠమును దేవతలచే పూజింపబడువాఁడును అగు గణపతిని బీజగణపతియని తెలియవలయును. మఱియు

శ్లో॥ ధృతపాశాంకుశకల్పకలతికాస్వరదశ్చబీజపూరయుతః
శశిశకలకలితమౌలి స్త్రిలోచనోఽరుణతనుశ్చగజవదనః॥ 53

భాసురభూషణదీప్తో బృహదుదరఃపద్మవిష్టరేలలితః
ధ్యేయోఽసాయతదోఃపత్సరసిరుహఃసంపదేసదామనుజైః॥ 54

తా॥ పాశము, అంకుశము, కల్పలత, దంతము ఫలము కిరీటమున చంద్రకళల మూఁడుకన్నులు ఎఱుపువన్నె ఏనుగు మొగము సమస్త భూషణములు, పెద్దపొట్ట, పద్మపీఠము, కురుచ చేతులు పాదములు కలవాడు ఇంకను (మయమతమున)

శ్లో॥ రక్తాక్షమాలాంపరశుంచదంతం భక్ష్యంచదోర్భిఃపరితోదధానం
హేమాపదాతంత్రిదృశంగజాస్యం లంబోదరంతం 55
శిరసానమామి॥

తా॥ ఎఱ్ఱని అక్షమాల పరశువు దంతము ఉండ్రాయి నాలుగు చేతులలోను, బంగారమువంటి ఛాయయును, మూఁడుకన్నులును,

ఏనుగు మొగమును, పెద్దపొట్టయును కలిగియుండు దేవునకు సాష్టాంగ నమస్కారమును చేయుదును.

శ్లో॥ నమామిపాశాంకుశదంతభక్ష్య సంలక్షితం త్ర్యక్షముదారకుక్షిం
నాగాననం నాగకృతోత్తరీయ ముత్తప్తహేమప్రభ మేక
కదంతమ్॥ 56

తా॥ పాశము, అంకుశము, దంతము, భక్ష్యము, మూఁడు కన్నులు పెద్దపొట్ట, ఏనుగు మొగము, సర్పయజ్ఞోపవీతము బాగుగా కాచిన బంగారువంటి వన్నెయును ఒక్కటే దంతమును కల గణపతికి నమస్కరించెదను లేక

శ్లో॥ విఘ్నేశం సపరశ్వధాక్షవటికాదంతోల్లసల్లడ్డుకై
ర్దోర్భిః పాశసృణీస్వదంతవరదా
ఢ్యైర్వాచతుర్భిర్యుతం శుండాగ్రాహితబీజపూరముురుకుక్షిం
త్రీక్షణం సంస్మరేత్
సిందూరాభమిభాస్యమిందుశకలాద్యైకల్పమజ్జాసనమ్॥ 57

తా॥ గండగొడ్డలి, అక్షమాల, దంతము, ఉండ్రాయి లేక పాశము అంకుశము, దంతము, వరదము, తొండము చివరఫలము, పెద్దపొట్ట, మూఁడుకన్నులు, సిందూరవర్ణము ఏనుఁగు మొగము చంద్రఖండము కిరీటమునను, పద్మాసనమును కల విఘ్నేశ్వరుని ధ్యానింపుడు.

## 100. హేరంబ లక్షణము

శిల్ప ఉత్త 25. వ అ

శ్లో॥ సింహోపరిస్థితం దేవం పంచవక్త్రం గజాననం
దశబాహుం త్రినేత్రంచ జాంబూనదసమప్రభమ్॥ 58
ప్రసాదాభయదాతారం పాత్రంపూరిత మోదకం
స్వదంతంసవ్యహస్తేన బిభ్రతంచరథాంగకమ్॥ 59

కరకంచాక్షసూత్రంచ పరశుంముద్గరంతథా
పాశాంకుశకరాంశక్తిం దేవంలంబోదరంశుభమ్॥ 60
పీవరంచైకదంతంచ తుంబురూణాంగణాన్వితమ్॥

తా॥ సింహవాహనమును అయిదు తలలును ఏనుగు మొగములును, పదిచేతులును, మూఁడు కన్నులును బంగారువంటి శరీరకాంతియును వరద అభయ హస్తమును పాత్ర మోదక దంత చక్ర హస్తములు కుడివైపునను చెంబు అక్షమాల గండగొడ్డలి, చిన్న గద, కల చేతులు ఎడమవైపునను పాశము అంకుశము ధరించిన శక్తితోడ యందును, పెద్దపొట్టయును బలిసిన శరీరమును ఒక్కటే దంతమును, తుంబురులు చుట్టును గలది హేరంబరూపమని తెలుపఁగవలయును.

(అనుబంధము 39వ పటము చూడుడు.)

## 101. శక్తిగణపతిలక్షణము

శిల్ప ఉత్త 25వ అ.

శ్లో॥ ద్వాభ్యాంబిభ్రాజమానంద్రుకతనకమహాశృంఖలాభ్యాంకరా భ్యాం
బీజాపూరాదికుంభద్విశభుజలలితంపంచబీజస్వరూపం
సంధ్యాసిందూరవర్ణంస్తనభరనమితంతుందిలంసన్నితంబం
కంఠాదూర్ధ్వంకరీంద్రంయువతిమయమధోనౌమిదేవంగణేశమ్॥
4

తా॥ రెండు చేతులయందు బంగారు కడియములును, పది చేతులయందు ఫలము మొదలగునవియును ఐదు తలలును, ఎఱ్ఱని దేహమును స్తనములును, పెద్దపొట్టయును, ఏనుఁగుతలయును చుట్టు శక్తులును గల గణేశ్వరుని నుతించెదను.

కాశ్యప శిల్పము 48వ పటలము

శ్లో॥ ఏకదంతశ్చతుర్బాహు స్త్రినేత్రత్రయసమన్వితః॥ 111

క్షౌమవస్త్రధరశ్శాంతో బంధూకకుసుమప్రభః
జటామకుటసంయుక్తః సర్వాభరణభూషితః॥ 112
అభయవరదోపేతౌ టంకశూలసమన్వితః
విఘ్నేశంపూర్వవత్ కృత్వా స్థాపయేద్దేశికోత్తమః 113

(తాత్పర్యమవసరము లేదు)

## 102. బాలగణపతి లక్షణము

శిల్ప ఉత్త 25 వ. అ.

శ్లో॥ బాలప్రసూతమాత్రో౽యం మంబికాంకేనివేశితః॥ 61
అతిరక్తోగజముఖో ద్విరదోరత్నభూషితః
చషకంపుష్కరేబిభ్రత్ సృణిపాశౌకరద్వయే॥ 62
ద్వాభ్యాంకల్పలతాందోర్భ్యాం డోలయన్ రత్నవర్షిణీం
ఏవంధ్యాత్వాజపేన్మంత్రం బాలాఖ్యంగణనాయకమ్॥ 63

తా॥ పార్వతి యొక్క తొడపై కూర్చుండిన పసిపిల్లవాడు మిక్కిలి యెఱుపు ఏనుగు మొగము రెండు దంతములు రత్నభూషణములు తొండము యొక్క చివర చెంబు రెండు చేతులలో అంకుశము, పాశమును, రెండు చేతులలో కల్పవృక్షపు తీగెలును, ఆ తీగెలు కదలునప్పుడు రత్నములు క్రింద పడుచున్నట్లును రచింపబడునది బాలగణపతి లక్షణమని తెలియవలయును.

## 103. రుద్రగణేశ్వర లక్షణము

అపరా 212 వ. సూ.

శ్లో॥ వరంచాపంసృణిర్దంతం పరశుందక్షిణేకరే
కపాలంశరాక్షమాలం పాశందండంచవామకే॥ 38
పంచవక్త్రంత్రినేత్రంచ హారంరుద్రగణేశ్వరం
వృషభవాహనోపేతం సర్వకామార్థసాధనమ్॥ 39

తా॥ వరదము, ధనుస్సు, అంకుశము, దంతము, పరశువు, కుడి చేతులలోను, తలపుష్టె, బాణము అక్షమాల. పాశము, దండము ఎడమ చేతులలోను ఐదు మొగములును మూడుకన్నులును, వృషభ వాహనమును కలవాడు రుద్రగణపతియని తెలియవలయును. (హరి హరమూర్తియని అపరాజిత పృచ్ఛ)

## 104. షణ్ముఖ లక్షణము

### కాశ్యప 48వ పటలము

శ్లో॥ పంచతాలోక్తమానేన స్కందంకుర్యాద్విలక్షణం
మానోన్మానాదికంసర్వం ప్రోక్తంవైస్కందలక్షణే॥ 1
ద్విభుజంవాచతుర్హస్తం షడ్భుజంభానుహస్తకం
శక్తింబాణంచఖడ్గంచ చక్రంప్రాసాభయంతథా॥ 2
సవ్యేవామేతుపింఛంతు ఖడ్గఖేటంకంతథా
ధనుర్దండంహలంచైవ భానుహస్తాన్వితేస్థితమ్॥ 3
షడ్భుజస్యద్వయంఖడ్గం శక్తిర్దక్షిణపార్శ్వకే
ఖేటకంచాక్షమాలాచ కుక్కుటంవామహస్తకే॥ 4
చతుర్భుజేఽభయంశక్తిం దక్షిణేతుకరద్వయంకుక్కుటంచాక్ష
మాలాచ వామహస్తేధృతేగుహః॥ 5
ద్విభుజంకుక్కుటంవామే శక్తిర్దక్షిణహస్తకే
అనుక్తంతుయత్సర్వం ఉమాస్కందసహోక్తవత్॥ 6
స్కందలక్షణమాఖ్యాతం జ్యేష్ఠావిధిమతఃపరమ్॥

తా॥ కుమారస్వామిని పంచతాలమున జెప్పబడినట్లు రచించ వలయును. రెండు భుజములు నాలుగు భుజములు ఆరు భుజములు పది రెండు భుజములు రచించవచ్చును. శక్తి, బాణము, ఖడ్గము, చక్రము, ఈటె, అభయము ఈ ఆరును కుడివైపునను నెమలి పింఛము ఖడ్గము ఖేటము, ధనుస్సు, దండము, హలము ఈ ఆరును

ఎడమవైపునను రచించవలయును. ఆరుచేతులయినచో రెండు ఖడ్గములును, శక్తి కుడివైపునను, ఖేటము, అక్షమాల కుక్కుటము అక్షమాల యెడమవైపునను రచించవలయును. నాలుగు చేతులయిన యెడల అభయము శక్తి కుడివైపునను, కుక్కుటము అక్షమాల యెడమ వైపునను రచించవలయును. రెండు చేతులయిన యెడల ఎడమచేత కుక్కుటమును కుడిచేత శక్తియును నుండవలయును. ఇందు చెప్పబడిన విషయములు సోమస్కంద లక్షణమునుండి గ్రహించవలయును.

అపరా. 212. వ. సూ

శ్లో॥ షడ్వక్త్రం ద్వాదశభుజం లోచనత్రయసంయుతం
శిఖ్యారూఢం మాంసలంచ కుమారం మన్మథాకృతిం॥ 40
శరం శక్తించ ఖడ్గంచ అంకుశం దండమేవచ
అక్షసూత్రం షడేతాని వామకేషుకరేషుచ॥ 41
శృంగం ధనుః పాశఖేటం వరదంచ కమండలుం
దక్షిణేషుకరేష్వేవ మస్త్రాణాం షట్కమేవచ॥ 42

తా॥ ఆరు ముఖములును పది రెండు భుజములును మూడు కన్నులును నెమిలి వాహనమును బలిసిన శరీరమును చక్కని రూపమును బాణము, శక్తి, ఖడ్గము, అంకుశము, దండము, అక్షమాల ఈ ఆరును ఎడమవైపునను, కొమ్ము ధనుస్సు, పాశము, ఖేటము, వరదము కమండలువు ఈ ఆరును కుడివైపునను రచించవలయును.

శిల్ప ఉత్త 25 వ అ.

శ్లో॥ విలిఖేత్ షణ్ముఖం దేవం మయూరవరవాహనమ్॥ 128
తరుణాదిత్యసంకాశం బాలభూషణభూషితం
స్థానీయే ఖర్వటే వాపి కుమారో లిఖ్యతే యదా॥ 129
భుజాద్వాదశ కుర్వీత ఖర్వటే చతురో భుజాన్
గ్రామే వనే ద్విబాహుః స్యాల్లేఖనీయో విచక్షణైః॥ 130

తా॥ కుమారస్వామికి మయూర వాహనమును ఎఱ్ఱని కాంతి గల శరీరమును బాలభూషణములును రచించవలయును. పట్టణమున పది రెండు చేతులును, కొండ దిగువ గ్రామమున నాలుగు చేతులును, గ్రామమున రెండు చేతులును రచించవలయును.

శ్లో॥ సిందూరారుణవిగ్రహంసురగణానందప్రదంసుందరం
దేవందివ్యవినోదధామమరుణాకల్పప్రకారోజ్జ్వలం
నానావిభ్రమభూషణవ్యతికరంస్మేరప్రభాసుందరం
వందేశక్త్యభయాదధానముదితాభీష్టప్రభావంగుహమ్॥ 64

శ్లో॥ సిందూరారుణకాంతిమిందువదనం కేయూరహారాదిభి
ర్దివ్యైరాభరణైర్విభూషితతనుంస్వర్గాదిసౌఖ్యప్రదం
అంభోజాభయశక్తికుక్కుటధరం రక్తాంగరాగాంశుకం
సుబ్రహ్మణ్యముపాస్మహే ప్రణమతాంభీతిప్రణాశోద్యతమ్॥ 65
స్ఫురన్మకుటపత్రకుండలవిభూషితంచంపక
ప్రజాకవితకంధరంకరయుగేనశక్తింపవిం
గుహంఘుస్పృణభాసురంస్మరతుపీతవాసోవసమ్॥ 66

తా॥ చెందిరము వంటి మెరుపు గల వాఁడును దేవతలు సంతోషపడునంతటి మందము గలవాఁడును ఎఱ్ఱని పుష్పమాలలు గల వాఁడును శక్తి అభయములు కలిగినవాడును కోరికల నిచ్చునట్టి కుమారస్వామికి నమస్కరించెదను.

ఎఱ్ఱని దేహమును, చంద్రునివంటి ముఖమును బాహుపురులు హారములు కలవాఁడును, శంఖము, అభయము, శక్తి, కుక్కుటము ధరించినవాడును, ఎఱ్ఱని వస్త్రములు గలవాఁడును అగును బ్రహ్మణ్యుని ధ్యానించెదము.

కిరీటము, మకర కుండలములు, చంపక పుష్పములహారము శక్తి వజ్రము లేక నడుమున వామహస్తమును పీతాంబరములును ఎఱ్ఱని దేహమును గల స్కందుని స్మరించెదను.

## 105. వీరభద్ర లక్షణము

శిల్ప. ఉత్త. 25 వ అ.

శ్లో॥ గోక్షీరాభందధానంపరశుడమరుకౌఖడ్గఖేటౌకపాలం
శూలంచాభీతిదానేత్రినయనలసితం వ్యాఘ్రచర్మాంబరాఢ్యం
వేతాలారూఢముగ్రంకపిశతరజటాబద్ధశీతాంశుఖండం
ధ్యాయేదోర్భోగీంద్రభూషంనిజగణసహితంసంతతంవీరభద్రమ్॥ 84

శ్లో॥ సితపంకజమధ్యసంస్థమేనంసుసితంవ్యాఘ్రనఖాదిబాలచిహ్నైః
ఉపలక్షితబాలభావమాశాపరిధానంకమనీయగాత్రయష్టిమ్॥ 85

తా॥ తెల్లని దేహమును గండగొడ్డలి, డమరుకము, ఖడ్గము, ఖేటము, కపాలము, శూలము, అభయము, వరదము, కల యెనిమిది చేతులును, మూడుకన్నులును పులితోలు వస్త్రమును బేతాళ వాహనమును, రౌద్రదృష్టియును, పసుపు మిగిలిన యెఱుపు వన్నె గల జడముడియందు బాలచంద్రుడును, సర్పభూషణములును, ప్రమథ గణము చుట్టును గల వీరభద్రుని ధ్యానించవలయును.

తెల్లని పద్మపీఠమున నుండిన తెల్లని శరీరము గల బాలుడును పులిగోరు పతకమును అన్నియును బాలలక్షణములును దిగంబరుడును చక్కని శరీరమును గల రూపమును రచించవలయును.

# 106. క్షేత్రపాల లక్షణము

## కాశ్యప శిల్పము 48వ పటలము

శ్లో॥ త్రివిధంక్షేత్రపాలంతు సాత్త్వికంరాజసంతమః॥ 68
శ్వేతంరక్తంతథాకృష్ణం సాత్త్వికాదిగుణంభవేత్
ద్విభుజంచతుర్భుజంశాంతం రాజసంషడ్భుజాన్వితమ్॥ 69
తామసంచాష్టదోర్దండం త్రినేత్రంసమపాదకం
స్థానకంపద్మపీఠంతు భద్రపీఠంతువాతథా॥ 70
శూలందక్షిణహస్తేతు కపాలమితరేధృతమ్
ద్విభుజంహ్యేవమాఖ్యాతం చతుర్హస్తమథోచ్యతే॥ 71
పరహస్తంతుసవ్యేతు ఖట్వాంగంఖడ్గమన్యకే
అథవాపూర్వహస్తేతు అభయంవరదాన్వితమ్॥ 72
పూర్వవత్ పరహస్తాద్వాఘంటికేవామహస్తకే
సాత్త్వికంహ్యేవమాఖ్యాతం రాజసంశ్రుణుసువ్రత॥ 73
శూలంఖడ్గంచఘంటాంచ దక్షిణేతుకరత్రయే
ఖేటకంచకపాలంచ నాగపాశంతువామకే॥ 74
తామసేతుధనుర్బాణం దక్షిణేఽదక్షిణేధృతమ్
శేషంరాజసవత్ ఖ్యాతం రక్తకేశోర్ధ్వమండలమ్॥ 75
ఉగ్రదృష్టిసమాయుక్తంనానానాగవిభూషితం
త్రినేత్రంనగ్నరూపంచ క్షేత్రపాలంప్రకల్పయేత్॥ 76

తా॥ క్షేత్రపాలుఁడు మూఁడు విధములు సాత్త్వికము రాజసము తామసము వరుసగా తెలుపు, ఎఱుపు, నలుపు వన్నెలు 2-4 చేతులు సాత్త్వికము 6 చేతులు రాజసము 8 చేతులు తామసము మూఁడుకన్నులు సమపాదములతో నిలిచియుండుట సాత్త్వికమున కుడిచేత శూలము ఎడమచేత కపాలము 4 చేతులయిన యెడల కుడివైపున పరదము

శూలము, ఎడమవైపున డమరుకము, కపాలము లేక ముందు చేతులు రెండును వరదము అభయమును వెనుక చేతులు రెండు శూలమును కపాలమును లేక యెడమచేత ఘంటియును, మూడు కన్నులును దిగంబర రూపమును పద్మపీఠమునగాని భద్రపీఠముగాని రచించవచ్చును, అన్నిటియందును ఇట్లే.

రాజసమున శూలము, ఖడ్గము, ఘంట కుడిచేతులయందును, ఖేటకము, కపాలము, నాగపాశము, ఎడమ చేతుల యందును 6 చేతులు రచించవలయును. మిగిలినవి పూర్వమువలెనే తామసమున ఖేటకము కపాలము, నాగపాశము, ధనుస్సు ఎడమచేతుల యందును శూలము ఖడ్గము, ఘంట, బాణము, కుడిచేతులయందును (8) చేతులు ఎఱ్ఱని తలవెండ్రుకలును కోపముతో గూడిన చూపు అనేక సర్పములు ఆభరణములు కల రూపము క్షేత్రపాలుడని యెఱుంగవలెను.

(శిల్పరత్నముందీ శ్లోకములె కొన్ని కలవు)

శిల్ప. ఉత్త. 25. వ అ

శ్లో॥ వ్యాలంబాగ్రజటాధరంత్రినయనంనీలాంజనాద్రిప్రభం
దోర్ద్వంద్వాత్తకపాలశూలమరుణస్రగ్వస్త్రగంధోల్బణమ్
ఘంటామేఖలఘుర్ఘరధ్వనిమిళద్ధుంకారభీమంవిభుం
వందేసంహితసర్పకుండలధరంతంక్షేత్రపాలంసదా॥ 101

దంతాగ్రదంతురమహీశ్వరభోగభూష
మాశాంబరంకరధృతోగ్రగదాకపాలం
వృత్తోగ్రచక్షుషముదగ్రపిశంగకేశంసత్
క్షేత్రపాలమనిశంతమహంనమామి॥ 163

తా॥ వ్రేలాడుచున్న తలవెండ్రుకలును, మూడు కన్నులును, నల్లని దేహమును, కపాలము, శూలము రెండు చేతులలోను, ఎఱ్ఱని వస్త్రములును, ఎఱ్ఱనియై పూతయును మొలనున్న ఘంటలు

ప్రోగుచున్న, హుంకారమును పాములు సొమ్ములును గల క్షేత్రపాలు నకు నమస్కరించెదను. మఱియు దంతములగ పదునట్లు తెలచిన నోరును, సర్పభూషణములును, దిగంబర రూపమును గద, కపాలము రెండు చేతుల యందును మిగుల క్రూరదృష్టియును భయంకరమై పైకి రేగిన యెఱ్ఱని తల వెండ్రుకలును, గల కాలభైరవునకు నమ స్కరించెదను.

## 107. విశ్వకర్మ లక్షణము
## 168. (మానసారంని) త్రిమూర్తి లక్షణము

మానసారము 51. వ. అ

శ్లో॥ బ్రహ్మావిష్ణుమహేశానాం లక్షణంవక్ష్యతేఽధునా
హిరణ్యరజతేనైవ తామ్రేణైవోపలేనవా॥ 1
దారుజేనాపిసుధయా శర్కరాభాసమృద్భిశ్చ
ఏతేస్తునవద్రవ్యై శ్చోత్తమాదిత్రయంత్రయమ్॥ 2
చలంచాప్యచలంచాపి నవద్రవ్యైస్తునిర్మితః
లోహజంమృత్ సుధాచైవ శర్కరాభాసమృత్తికౌ॥ 3
చలద్రవ్యమితిప్రోక్త మన్యేషాంచాచలంవిదుః
చిత్రాంగమర్ధచిత్రాంగ మాభాసాంగంత్రిధోచ్యతే॥ 4
సర్వాంగదృశ్యమానంయ చ్చిత్రమేవంప్రకథ్యతే
అర్ధాంగదృశ్యమానంత దర్ధచిత్రమితిస్మృతమ్॥ 5
అర్ధార్ధసందృశ్యమాన మాభాసమితికథ్యతే
అభాసంపంచవర్ణేన పట్టభిత్త్యావాకల్పయేత్॥ 6
చిత్రంయచ్చోత్తమంప్రోక్త మర్ధచిత్రంతుమధ్యమం
ఆభాసమధమంప్రోక్తం కుర్యాదేవంతుసర్వదా॥ 7
ఉత్తమంసర్వసిద్ధిస్యా న్మధ్యమంగమోక్షకం
అధమంభోగసిద్ధిస్యా దీశ్వరేణైవకీర్తితమ్॥ 8

స్థావరంజంగమంచైవ వివిధం బేరముచ్యతే
జంగమంచోత్సవంభవేత్సర్వంస్థావరమిష్యతే॥ 9
ఉత్తమంలోహజంబింబం పీటాఖాసంతుచోత్తమం
స్థానకంచాసనంశయనం వైశాఖంవైష్ణవంతథా॥ 10
నృత్తాదిసర్వబేరాణాం ద్రవ్యముక్తంసనాతనం
తత్తద్ద్రవ్యైస్తుబింబానాం భిన్నపీఠంప్రకల్పయేత్॥ 11
లంబాసనేచశయనే శిలాపీఠంతుభిన్నకం
ఏకకావేకృతంసర్వం సుధామృత్కటుశర్కరైః॥ 12
బేరాణాంద్రవ్యమిత్యుక్తం మూర్తిధ్యానంప్రవక్ష్యతే॥

తా॥ బ్రహ్మ విష్ణు మహేశ్వరుల యొక్క రూప నిర్మాణ లక్షణములను చెప్పుచున్నాడు. బంగారము, వెండి

## 107. విశ్వకర్మ లక్షణము

శ్లో॥ దివ్యసింహాసనాసీనం మునిబృందనిషేవితం
ఉపాస్యమానమమరైః స్తూయమానంమహర్షిభిః॥
పంచవక్త్రందశభుజం బ్రహ్మచారివ్రతేస్థితం
లక్ష్మీసరస్వతీభ్యాంచ సంక్షాళితపదద్వయమ్॥
వక్షఃస్థలేచబిభ్రాణం బ్రహ్మవిద్యాముమాతనుం
హారకేయూరకటక కుండలాద్యైఃసుశోభితమ్॥
భస్మాంగరాగం దేవేశం వరదంసుస్మితాననం
ఏవంధ్యాయేన్మహాదేవం విశ్వకర్మాణమవ్యయమ్॥

తా॥ దివ్యసింహాసనమున నున్నవాడును, మునులచే సేవింపబడుచున్నవాడును దేవతలచే నుపాసింపబడుచున్నవాడును మహర్షులచే స్తోత్రము చేయబడుచున్నవాడును ఐదు ముఖములును, పది చేతులును, బ్రహ్మచర్యవ్రతమును లక్ష్మి చేతను సరస్వతి చేతను

కొలుగబడుచున్న పాదములును, ఆోమ్మైన బ్రహ్మ విద్యా దేవతను ధరించినవాడును, హారములు బాహుపురులు కాళ్ళకు చేతులకు కడియములను చెవులకు కుండలములును విభూతిని ధరించిన వాడును, దేవతలకు ప్రభువును వరదహస్తము నవ్వుచున్న ముఖము కలవాడును గొప్ప రూపము గలవాడును శాశ్వతుడును అగు విశ్వకర్మను ధ్యానించవలయును.

శ్లో॥ పంచాననోదశభుజో వ్రతబంధదీక్షః
కేయూరహారమణికుండలచండతేజాః
భస్మాంకితో మణిమయాసనసంస్థితోఽసౌ
సర్వేశ్వరో వసతు మేహృది విశ్వకర్మా॥

పై శ్లోకార్థమునకు సమానమే కనుక తాత్పర్యము వ్రాయలేదు.

శ్లో। పంచాస్యః కమలాసనో వ్రతధరః శ్రీ భారతీసేవితో టంకం
చాపిహాసంతి కాంధమసి కాంకుద్దాలి కాంకర్కటం
మేరుంధారణి కాంతధాకరణి కాంశస్త్రాదికోశంధనుం
ధత్తే యోదశ పాణిభిః సుచిరైరో వ్యవిశ్వకర్మాస్వయమ్॥
కేయూరైః కటకై ద్విభూషితకరం హారావళీభిర్యుతం
నానారత్నకిరీటకుండలధరం పీతాంబరాలంకృతం
హాసోల్లాసభరైః ప్రసన్నవదనం దాతుం వరాన్ సాదరం
సాంగం వేదమధీత్య భూతిలసితం వందేతమీశం ముదా॥

తా॥ ఐదుముఖములు, పద్మాసనము, బ్రహ్మచర్యవ్రతము, శ్రీవాణీసేవితపాదములు సుత్తె, పట్టుకారు, గొట్టము, కుంపటి, ఉలి, బాడిస, గుద్దలి నాగలి వేడిచల్లార్చునట్టి జలపాత్రము, కమండలువు (ఇవి దశాయుధములు పద్మపురాణ భూఖండమున విశ్వకర్మో పాఖ్యానమున చెప్పబడి యున్నవి) అను సామగ్రియును, బాహుపురులు పాదములకు హస్తములకు కడియములు హారములు రత్నకిరీటము,

కుండలములు, పీతాంబరము, సంతోషము గల ముఖము భస్మలేపనం కలది విశ్వకర్మరూపమని తెలియావలయును.

శ్లో॥ పంచాస్యంతశ బాహూంచ పద్మపీఠేసుఖాసనం
శ్వేతాంగం హేమవస్త్రంతు చిత్రవస్త్రోత్తరీయకమ్॥
ఢక్కాంశంఖంధనుర్వీణాపద్మహాస్తంతువామకే
అథవావరదంకుర్యాచ్చక్రంబాణంత్రిశూలకమ్॥
సర్పరాజంచాక్షమాలా సవ్యహస్తేధృతంతువా
అధవాచాభయంకుర్యాన్నానాలంకారసంయుతమ్॥
స్మితాస్యంరత్నమకుటంకుండలాద్యైఃసుశోభితం
తమర్చయేన్మహాదేవం విశ్వకర్మాణమీశ్వరమ్॥
(విశ్వకర్మ సంహిత)

తా॥ ఐదు తలలు, పదిచేతులు, పద్మపీఠమున, సుఖాసనము తెలుపువన్నె, పసుపువన్నె గల వస్త్రము చిత్ర వర్ణములు గల ఉత్తరీయము, డమరుకము, శంఖము, ధనుస్సు, వీణ, పద్మము లేక వరదము ఎడమవైపునను, చక్రము, శరము, త్రిశూలము, సర్పము, అక్షమాల లేక అభయము కుడివైపునను చేయవలయును. సమస్తమైన భూషణములును, నవ్వుచున్న ముఖములును, రత్నకిరీటములును, కర్ణకుండలములు, కల రూపము విశ్వకర్మ పరమేశ్వరుడని తెలియావలయును ఉత్తమ దశాల ప్రమాణమును బట్టి రచించవలయును.

(అనుబంధము 40వ పటము చూడుము)

రాగి, ఱాయి, కర్ర, సున్నము, మైనము పటము, మన్ను ఈ తొమ్మిది విధములగు వస్తువులతో ఉత్తమమున మూడు విధములును మధ్యమమున మూడు విధములును అధమమున మూడు విధములును ఇట్లు 9 విధములుగాను చలము, అచలము అను పద్ధతులతోనుచేయుదురు. లోహజము మృత్తు, సుధ, శర్కర అభాసము ఇవి చల ద్రవ్య

ములు ఆాయి, దారువు, రత్నము ఇవి అచల ద్రవ్యములు, చిత్రాంగము, అర్ధచిత్రాంగము అభాసము అని మూఁడువిధములుసమస్తమైన యవయవములను స్పష్టముగా జూపించబడునది చిత్రాంగము సగము రూపము మాత్రమే కనుపించునది అర్ధచిత్రాంగము సగములో సగము మాత్రమే కనుపించునది ఆభాసము ఆభాసమనునది గుడ్డమీఁదనైనను గోడమీదనైనను అయిదు రంగులతో రచించవలయును.అన్ని అవయవములుకనుపించునదిఉత్తమముసమస్తమైనఫలములనిచ్చును.అర్ధచిత్రము మధ్యమము భోగములను మోక్షమును ఇచ్చును. అభాసము అధమమున మూఁడు విధములును ఇట్లు 9 విధములుగాను చలము, అచలము అను పద్ధతులతోను చేయుదురు. లోహజము, మృత్తు, సుధ, శర్కర, అభాసము ఇవి చలద్రవ్యములు, ఆాయి, దారువు, రత్నము ఇవి అచల ద్రవ్యములు, చిత్రాంగము. అర్ధచిత్రాంగము, అభాసము అని మూఁడు విధములు సమస్తమైన యవయవములను స్పష్టముగా జూపించబడునది చిత్రాంగము సగము రూపము మాత్రమే కనుపించునది అర్ధచిత్రాంగము సగములో సగము మాత్రమే కనుపించునది అభాసము అభాసమనునది గుడ్డమీాదనైనను గోడమీాద నైనను అయిదు రంగులతో రచించవలయును. అన్ని అవయవములు కనుపించునది ఉత్తమము సమస్తమైన ఫలముల నిచ్చును. అర్ధచిత్రము మధ్యమము భోగములను మోక్షమును ఇచ్చును.) ఆభాసము అధమము భోగముల నిచ్చును. విగ్రహము అనగా స్థావరము జంగమము అను వానిలో ననేక భేదములున్నవి, జంగమము అనునది యుత్సవమునకు దగును. అన్నియును స్థావరములు బంగారు మొదలగు మూఁడు లోహముల బింబములు ఉత్తమము పీఠభాగము కూడ ఉత్తమ జాతిలోనే యుండవలయును. స్థానకము (నిలువు) ఆసనము (కూర్చుండుట)శయనం (పరుండుట)వైశాఖము(పాదవిన్యాసభేదము) (పాదపైవ విన్యాస భేదము) నాట్యరూప ప్రతిష్ఠలకు శాశ్వత,

మైన ద్రవ్యముతో రచించవలయును. విగ్రహమును చేసిన జాతి కాకుండినను మఱియొక జాతితోనైనను పీఠమును కల్పించవచ్చు. స్థానకమునను, ఆసనమునను, శయనమునను, వేఱయిన శిలాపీఠము కల్పించవచ్చును. ఒకసారి చేయబడునవి యన్నియును, సున్న మున్ను, మొఱము వీనితో జేయవచ్చును. ప్రతిమల యొక్క ద్ర మును ఇట్లు చెప్పబడియున్నది. ప్రతిమ యొక్క రూపమును గూ చెప్పబోవుచున్నాడు.

శ్లో॥ చతుర్భుజంచతుర్వక్త్రం ద్విపాదంచాష్టలోచనం॥
అష్టకర్ణసమాయుక్తం తనుశ్చైకాకృతి స్తథా
ఉత్తమందశతాలేన మానయేత్వంగమానకమ్॥
స్థానకంచాసనంవాపి చీరబేరధరంతెథా
వరదాభయహస్తంచ జటామకుటమండితమ్॥
కుండికాచాక్షమాలాచ వామేఽవామేకరేక్రమాత్
స్రుక్స్రువధారణంవాపి ప్రాగ్వరదాభయాన్వితమ్॥
మకరలాంఛితపుష్పంకుండలంవాదకర్ణయోః
యజ్ఞసూత్రోత్తరీయాది సూత్రాదోదరబంధనమ్॥
హారోపగ్రీవసంయుక్తం బాహుమాలావిభూషితం
కేయూరకటకాద్యైశ్చ కుర్యాత్తుమణిబంధనమ్॥
కటకత్రయసంయుక్తం నలకంఠకటకాన్వితం
కటిసూత్రాదిపట్టంస్యా న్నీవ్యంచలనసంయుతమ్॥
రత్నాంగులీయకౌహస్తౌ పాదంజాలసరత్నకం
లలాటేవృత్తతిలకంస్యాచ్చందనాగరుమేవచ॥
సర్వాంగంహేమవర్ణంస్యా న్నలకాంతంతుచీరయుక్
పార్శ్వయోఃశక్తిలోపేతం దక్షిణేతుసరస్వతీ॥

వానుపార్శ్వేతుసావిత్రీ సర్వాభరణభూషితం
ఏవంపితామహంప్రోక్తంసః కుర్యాచ్ఛాస్త్రవిద్ బుధః॥ 22

తా॥ నాలుగు చేతులు, నాలుగు ముఖములు, రెండు పాదములు. ఎనిమిది కన్నులు ఎనిమిది చెవులు ఒక్కటే శరీరము, ఉత్తమ దశతాలమున జెప్పబడిన కొలతల ప్రకారము చేయవలయును. నిలుచున్నట్లుగాని కూర్చుండినట్లుగాని, వస్త్రముతో గూడియున్నట్లును, వరదము అభయము ఎడమకుడి చేతులును, చెంబు, అక్షమాల ఎడమ కుడి దిగువ చేతులును, జటామకుటమును స్రుక్కు, స్రువము, వరదము, అభయము మకరలాంఛితపుష్పముగాని కుండలముగాని చెవికిని జందెము, ఉత్తరీయము, ఉదరబంధనము, హారము, ఉపగ్రీవము, బాహుమాల, బాహుపురి కాలి కడియము చేతికడియము కాలియందు మూడు కడియములును, మొలనూలున పట్టును, కుచ్చెళ్లు అందమైన అంచులతోను, చేతివ్రేళ్ళకు రత్నములు గల యుంగరములును, కాలి కడియములకు గూడ రత్నములును, నొసట గుండ్రని బొట్టును, చందనము అగరుగాని, శరీరమంతయును బంగారపు వన్నెయును, ధోవతి చీలమండ వఱకును ఇరువైపుల స్త్రీదేవతలు కుడిపైపున సరస్వతియును, ఎడమవైపున సావిత్రియును సమస్తమైన అలంకారముతో గూడియును ఉండవలయును. ఇట్టిది బ్రహ్మలక్షణమని యెఱుంగవలయును

శ్లో॥ చతుర్భుజంద్వినేత్రంచ కిరీటమకుటాన్వితం
పీతాంబరధరంయుక్తం శ్యామవర్ణాంగశోభితమ్॥ 23
సర్వవక్షఃస్థవేకుర్యాత్తదూర్ధ్వే శ్రీవత్సలాంఛనమ్
ఉత్తమదశతాలేనచాంగమానంచమానయేత్॥ 24
కటకంవాగదాధరం -చోర్ధ్వమాశ్రితమేవచం
అథవావరదహస్తంస్యాత్పురతో వామహస్తకే॥ 25

దక్షిణేత్వభయంపూర్వసవ్యేచాపరేచక్రయుక్
అపరేవామహస్తేతుపాంచజన్యావధారణమ్॥ 26
తత్సమంకర్ణపత్రంస్యా త్కుర్యాన్మకరకుండలమ్
ప్రసన్నవదనంతుంగ నాసిదీర్ఘాక్షిశోభితమ్॥ 27
హారోపగ్రీవసంయుక్తం యజ్ఞోసూత్రో త్తరీయకమ్
రత్నోదరబంధంస్యాద్ బాహువమాలావిభూషితమ్॥ 28
కటకంకటిసూత్రంచ కేయూరంరత్నపూరితం
రత్నాంగులీయకైర్యుక్తం పాదజాలవిభూషితమ్॥ 29
నలకాంతమంచలంస్యా త్పీతాంబరవిలంబనమ్
శిరశ్చక్రంశిరఃపృష్ఠేయుక్తంసర్వాంగభూషణమ్॥ 30
ద్వయోర్జంఘావసానంస్యాద్ వనమాలామనోహరం
ఏవంతువిష్ణుమూర్తిఃస్యాచ్ఛక్తియుక్తంతుపార్శ్వయోః॥ 31
శ్రీభూమిందక్షిణేవామే స్థావరేజంగమేఽపివా
కుర్యాదాసనంవాపి స్థానకంచాపిసవచ॥ 32

తా॥ నాలుగు చేతులు, రెండు కన్నులు, కిరీటము, పచ్చని వస్త్రము ఆకువచ్చవన్నెయును, ఱొమ్మున శ్రీవత్సమనుగుర్తు ఉత్తమ దశతాలము యొుక్క కొలత ప్రకారము రూపమునునిర్మించవలయును ఎడమ పైచెయ్యి కటకాముఖహస్తము (అన్ని వ్రేళ్ళను వంచి నుధ్య వ్రేలిని బొటనవ్రేలికి ఆనించి చూపుడు వ్రేలిని రెండు వ్రేళ్ల దగ్గ అకు చేర్చబడినది) గాని లేక గదగాని, దిగువ చెయ్యి వరద హస్త మును, కుడపైచెయ్యి అభయమును, దిగువ చెయ్యి చక్రమును కలిగి యుండవలయును. కొందరు ఎడమపై చెయ్యి శంఖమును రచింతురు. ఆ శంఖముతో నమానముగా చెవులయందు కరపత్రములుగాని మకరకుండలములుగాని రచింపవలయును. నవ్వుతో గూడిన ముఖము ఎత్తయినముక్కు నిడుదలైన కన్నులు హారము ఉపగ్రీవము జంబెను

ఉత్తరీయము రత్నములతో గూడినయుదరబంధము బాహుమూల కాలి కడియములును మొలత్రాడును బాహుపురులు రత్నములతో గూడినవియును రత్నములు గల యుంగరములును, చీలమండల వఱకు దోవతి యొక్క అంచులను తలవెనుక శిరశ్చక్రమును అన్ని యవయవములయందు భూషణములును, మోకాళ్ళ దిగువ వరకువనమాలయును. ఇరువైపుల స్త్రీ దేవతలు కుడిన లక్ష్మీదేవియును, ఎడమను భూదేవియును, ప్రతిష్ఠా విగ్రహములుగాగాని యుత్సవ విగ్రహములుగాగాని, కూర్చున్నట్లుగాని, నిలుచున్నట్లుగాని, రచింపబడినది విష్ణుమూర్తి లక్షణమని యెరుంగవలయును.

శ్లో॥ చతుర్భుజం త్రినేత్రంచ జటామకుటమండితం
వ్యాఘ్రచర్మాంబరంజానో రూర్ధ్వేచసమలంకృతమ్॥ 33
సీవ్యంచలంచసంయుక్తం రక్తవర్ణాంగశోభితం
హారోపగ్రీవవక్షస్తు బాహుమాలావలంబనమ్॥ 34

కిరీటంరత్నబంధంస్యాద్ రుద్రబంధమథాపివా
పత్రోదరంచబంధంవా రత్నోదరనిబంధనమ్॥ 35
కటకంకటిసూత్రంస్యాత్ కేయూరంపూరిమాన్వితం
బాహుమూలాభిదామైశ్చ సర్వాభరణభూషితమ్॥ 36
వామేతులంబపత్రంస్యాదవామేనక్రకుండలమ్
ప్రాగభయహస్తంసవ్యేవరదంవామహస్తకే॥ 37
అపరేవామసవ్యేతు హరిణముద్రాంగధారణమ్
మకుటంవామపార్శ్వేతు చంద్రరేఖాసమన్వితమ్॥ 38
దక్షిణేచార్కపుష్పైశ్చ నానంగంగాజటాంతరే
దూత్వాఖః స్వర్ణసుందరం పుష్కరంస్యాన్మకుటాంతరే॥ 39
మధ్యేచాన్వితవక్త్రం స్యాల్లలాటేచైకనేత్రయుక్
గ్రీవస్యవామపార్శ్వేతు కాలకూటసమన్వితమ్॥ 40

యజ్ఞసూత్రోత్తరీయంచ సర్వరత్నాంగులీయకే
స్థానకంచాసనంవాపి పాదంనూపురశోభితమ్॥ 41
ఏవంతురుద్రమూర్తిఃస్యాద్ వామభాగేతుపార్వతీ
ఉత్తమదశతాలేన మానయేత్వంగమానకమ్॥ 42
దేవీనామపిసర్వేషాంమధ్యమందశతాలకం
పద్మపీఠంమహాపీఠం త్రిమూర్తీనాంచయోజయేత్॥ 43
ప్రపాచతోరణంవాపి కల్పవృక్షంచసంయుతం
ఏవంతురుద్రవిష్ణ్వాదీన్ కుర్యాత్తద్విధివత్తతః॥ 44
సర్వాలంకారసంయుక్తం దేవంధ్యాత్వాత్రిమూర్తినం
అన్యమనుక్తంసర్వేషాం శాస్త్రమార్గేణయోజయేత్॥ 45
ఉత్తమదశతాలవశాత్తుయత్ బ్రహ్మవిష్ణుశివసకలాంగకైః
స్థావరేచజంగమకేయదుక్తం శిల్పిభిఃకురుచోక్తంమునివరైః॥ 46
ఇతిమానసారేవాస్తుశాస్త్రేత్రిమూర్తిలక్షణవిధానంనామ
ఏకపంచాశదధ్యాయః

తా॥ నాలుగుచేతులును, మూఁడుకన్నులును జటామకుటము, పులితోలు వస్త్రము మోకాలిపైనను, కుచ్చెళ్ళు మంచి అంచుతోను ఎఱ్ఱని వన్నెయును, హారము, ఉపగ్రీవము, బాహుమాల, కిరీటము నందు రత్నములు లేక జటాబంధమైనను రచించవచ్చును. ఉదరబంధము పత్రములతోగాని రత్నములతోగాని రచించవచ్చును. మొలత్రాడు కాలికి కడియము బాహుపురి మొదలైన సమస్త భూషణములును రచించవలయును. చెవులకు యెడమను లంబపత్రమును కుడిన మకర కుండలమును కుడిముందు చెయ్యి అభయమును, ఎడమ ముందు చెయ్యి వరదమును, వెనుక కుడిచెయ్యి జ్ఞానముద్రయును, వెనుక యెడమచేతియందు లేడియును, కిరీటము యొక్క యెడమప్రక్క బాలచంద్రుడును, కుడిప్రక్క జిల్లేడు పూలును జడలో సర్పమును

గంగయును, కిరీటమున గటిక, బంగారు వన్నెయును ఎరుపు వన్నెయును గల పద్మమును ముఖము చిరునవ్వుతోను నొసటకన్ను మెడయందు యెడమపైపున కాలకూటము, జందెము, ఉత్తరీయము, రత్నములతో గూడిన యుంగరములు, నిలుచున్నట్లుగాని, కూర్చుండినట్లుగాని, పాదములకు కడియములును, ఇట్లు శివరూపమును రచించవలయును. ఎడమవైపున పార్వతియును శివరూపము ఉత్తమ దశతాలముతోను దేవి రూపము మధ్యమ దశతాలమానముతోను రచించవలయును. పద్మము పీఠముగాని, మహాపీఠముగాని త్రిమూర్తులకు చేయవచ్చును. మండపముగాని, తోరణముగాని, కల్పవృక్షముగాని రచించవలయును. బ్రహ్మ, విష్ణు, శివ ప్రతిమలను శాస్త్రోక్తప్రకారముగాను సమస్తమైన యలంకారములతోను, రచించవలయును. ఇందు చెప్పబడని యంశములను ప్రతిమామాన లక్షణముల ననుసరించి చేయవలయును. ప్రతిష్ఠా విగ్రహములకును ఉత్సవ విగ్రహములకును ఇట్లు చేయవలయునని పూర్వము మహర్షులచే జెప్పబడియున్నది.

## 109. (కశ్యపుని) ఏకాదశ రుద్రులు

### కాశ్య - 48 వ పటలము

శ్లో॥ చతుర్భుజాస్త్రినేత్రాశ్చ జటామకుటమండితాః
శ్యామవస్త్రధరాః సర్వే శుక్లవర్ణాః ప్రకీర్తితాః॥ 62

సమపాదస్థానకాశ్చ పద్మపీఠోపరిస్థితాః
సర్వాభరణసంయుక్తాః సర్వపుష్పైరలంకృతాః॥ 63

అభయం పరశుం సవ్యే కృష్ణం వరద వామకే
మహాదేవః శివో రుద్రః శంకరో నీలలోహితః॥ 64

ఈశానో విజయశ్చైవ భీమో దేవదేవో భవోద్భవః
కపాలీశస్త్వితి జ్ఞేయా రుద్రాస్త్వేకాదశః స్మృతాః॥ 5

సోమంసింహాసనాసీనం కుందశంఖనిభద్యుతిం
ప్రభామండలసంయుక్తం ద్విభుజంసౌమ్యవక్త్రకమ్॥ 66
ఆసీనంవాస్థితంవాపి కుముదోత్పలహస్తకం
హేమయజ్ఞోపవీతాంగం సర్వాభరణభూషితమ్॥ 67
శుక్లవస్త్రధరంశాంతం సర్వపుష్పైరలంకృతం
ఈశో వైద్విభుజశ్శాంతః సర్వాభరణభూషితః
జటాముకుటసంయుక్తం శుక్లవస్త్రద్యుతిఃస్థితః॥ 77
శుక్లయజ్ఞోపవీతశ్చ శుక్లపద్మోపరిస్థితః
శూలందక్షిణహస్తేతు కపాలంవామహస్తకే॥ 78
ఈశఏవంసమాఖ్యాత స్తతో వై భాస్కరః క్రమాత్

తా॥ నాలుగు చేతులు, మూఁడుకన్నులు, జటాముకుటము, ఆకుపచ్చ వస్త్రము, తెల్లని శరీరము, సమపాదమున నిలకడ, పద్మ పీఠము, సమస్తమైన యాభరణములును, సమస్తమైన పుష్పములును, కుడివైపున అభయము, గండగొడ్డలి, ఎడమవైపున జింక, వరదము' కల చేతులును కలవారు పదునొకండు రుద్రులు మహాదేవ, శివ, రుద్ర, శంకర నీలలోహిత ఈశాన విజయ, దేవదేవ, భవ, ఆభవ, కపాలి అను పేర్లు గలవారు. పార్వతీసహితుఁడును, సింహాసనమున గూర్చుండినవాఁడును, తెల్లని శరీరమును. కాంతిమండలము నందున్న వాఁడును రెండు చేతులును శాంతము గల ముఖము, కూర్చుండినట్లు గాని, నిలుచున్నట్లుగాని, తెల్లతామర పుష్పమును చేతబట్టికొని యును. బంగారు జన్నిదమును సమస్తమైన భూషణములును, తెల్లని వస్త్రము శాంతము అన్ని పుష్పములతో నలంకరింపబడినట్టియు ... ఈశ్వరుఁడు రెండు భుజములును, శాంతరూపము సమస్తాభరణములు, జటాముకుటము, తెల్లని వస్త్రము, నిలుచున్నవాఁడు తెల్లని జన్ని

దము తెల్లని పద్మముపై నున్నవాఁడు కుడిచేత శూలము ఎడమచేత కపాలము కలవాఁడు ఈశుడని యెఱుఁగవలయును.

(ఇందుకొంత భాగము శిథిలమైనది)

శ్లో॥ భీమశ్చతుర్భుజోరౌద్ర సర్వాభరణభూషితః
అభయంవరదంచైవ శూలంపాశంచధారయేత్॥ 130
సితవస్త్రధారుశ్చైవ ఉగ్రదృష్టిఃసదంష్ట్రిక॥
ఉగ్రశ్చతుర్భుజోరౌద్రో రక్తవస్త్రసమన్వితః 146
కరండముకుటోపేతఃసర్వాభరణభూషితః
అభయంవరదోపేతం టంకశూలధృతఃపరః 147
స్థానకంభద్రపరేతుశుక్లవస్త్రధరంశుచిః॥
కాలాగ్నిరుద్రమూర్తేస్తులక్షణంవక్ష్యతేధునా
చతుర్భుజంత్రినేత్రంచ జ్వాలామాలోపశోభితం॥ 132
ఖడ్గఖేటకసంయుక్తం శశాంకార్ధధృతంపరం
రక్తవస్త్రధరంరౌద్రం సర్వాభరణభూషితం॥ 133
రక్తోర్ధ్వకేశసంయుక్తం సింహాసనోపరిస్థితమ్॥
చతుర్భుజం త్రినేత్రంచ ... పద్మపీఠో పరిస్థితమ్॥ 135
శ్రీకంఠోహ్యేవమాఖ్యాతో నాగదేవస్త్వథోచ్యతే॥ 136

## 100. బ్రహ్మకు ద్వారపాలకులు

అపరా. 220. వ సూత్రము విశ్వకర్మోవాచ

శ్లో॥ బ్రహ్మణోఽష్టప్రతీహారాన్ కథయిష్యామ్యనుక్రమాత్
పురుషాకారగంభీరాః సుకూర్చాముకుటోజ్జ్వలాః॥ 1
పద్మంస్రుక్ పుస్తకందండః వామేస్యాత్ సత్యనామకః
శస్త్రాపసవ్యయోగేన దక్షిణేధర్మశోభవేత్॥ 2
ఆజ్యపద్మాగమాదండః వామేచైవప్రియోద్భవః
దండాగమస్రుక్ ఫలకం యజ్ఞః స్యాత్ సర్వకామదః॥ 3

అక్షసూత్రంగదాఖేటం దండో విజయనామకః
అధోహస్తాపసవ్యేన ఫలయుక్ యక్షభద్రకః॥ 4
అక్షపాశాంకుశదండాభవఃస్యాత్సర్వకామదః
దండాంకుశపాశపద్మం విభవఃసర్వశాంతిదః॥ 5

తా॥ బ్రహ్మ యొక్క ద్వారపాలకులను చెప్పుచున్నాడు. మనుష్య రూపమును గొప్ప బలముగల శరీరమును దట్టకటయును కిరీటమును గలవారు ఎనిమిది మంది తూర్పు వాకిట కుడివైపున సత్యుడు పద్మము స్రుక్కు ఎడమవైపున పుస్తకము దండము చేతుల యందు గల్గియుండును. ఎడమవైపున ధర్మకుడు పుస్తకము దండము కుడిచేతుల యందును, గలిగి యుండును. పద్మము స్రుక్కు యెడమ దక్షిణద్వారము యొక్క కుడివైపున ప్రియోద్భవుడు కుడిచేతుల చేతుల యందును యందు జపమాల, పద్మము, ఎడమచేతులయందు కలిగియుండును, ఎడమవైపున యజ్ఞుడు కుడిచేతులయందు దండము పుస్తకము దండము పుస్తకము, ఎడమచేతులయందు స్రుక్కు, ఫలకము కలిగియుండును. పశ్చిమ ద్వారమునకు కుడివైపున విజయుడు కుడి చేతులలో అక్షమాల, గద, ఎడమచేతులలో ఖేటము, దండము కలిగి యుండును. ఎడమవైపున యక్షభద్రుడు కుడిచేతులలో గద, ఫలముక్ష ఎడమచేతులలో ఖేటము, ఫలము, ఉత్తర ద్వారమునకుడివైపునభవుడు అమాల పాశము కుడిచేతులలోను, ఎడమవైపున విభవుడు దండము అంకుశము కుడిచేతులలోను పాశము, పద్మము ఎడమచేతులలోను కలిగి యుండును.

## 111. బ్రహ్మ లక్షణము

కాశ్య 48 వ పటలము

శ్లో॥ చతుర్వక్త్రశ్చతుర్బాహు ర్నవతాలసమప్రభః॥ 98

జటామకుటసంయుక్తః పింగాక్షః సర్వభూషణః
కృష్ణాజనోత్తరీయశ్చ యజ్ఞసూత్రసమన్వితః॥ 99
శుక్లవస్త్రధరః శాంతః కటిసూత్రః సమేఖలః
శుక్లమాల్యానులేపశ్చ కర్ణాకుండలమండితౌ॥ 100
దక్షిణేచాక్షమాలాంచ కూర్చంచైవతుధారయేత్
కమండలుంకుశం వామే దక్షిణేస్రుక్ స్రువౌతథా॥ 101
అజ్యస్థాలీంకుశాంశ్చైవ వామహస్తేతుధారయేత్
అభయవరదాపూర్వ హస్తావాఽథద్విజోత్తమ॥ 102
ఆసనేతూభయాంచాంఘ్రీ బోధయేత్తుపరస్పరం
మేఢ్రమూలోపరిష్టాత్తు వామహస్తమధోముఖమ్॥ 103
సవ్యహస్తంచతత్సూత్రే తత్రన్యస్త్వాసమస్థితం
దక్షిణేచాక్షమాలాంచ వామహస్తేకమండలుమ్॥ 104
సరస్వతిదక్షభాగే సావిత్రీవామపార్శ్వకే
ఆసీనావాస్థితావాఽపి పద్మపీఠోపరిద్విజ॥ 105

తా॥ నాలుగు ముఖములు, నాలుగు చేతులు. ఎర్రని శరీరం జటాముకుటము, గోరోజనమువంటి కన్నులు, సమస్తమైన భూషణములు, జింక చర్మము ఉత్తరీయము, జందెము, తెల్లని వస్త్రము శాంత స్వభావము, మొలత్రాడు మేఖలములతో, తెల్లని దండలు గంధము, చెవులకు కుండలములు, కుడిచేతులలో అక్షమాల, దర్భకట్ట ఎడమ చేతులలో కమండలువు దర్భ లేక కుడిచేతులలో స్రుక్కు, స్రువము ఎడమ చేతులలో ఆజ్యస్థాలి కుశ రచించవచ్చును లేక ముందరి చేతులలో అభయము, వరదము కలిగియుండవచ్చును. పీఠమున రెండు పాదములును ఒకదాని నొకటి అనుకొని యుండవచ్చును. మేఢ్ర మూలము యొక్క పై భాగమున ఎడమచెయ్యి

వరదము కుడిచెయ్యి దానితో సమాన సూత్రమున అభయమును, కుడిచేత అక్షమాల, ఎడమచేత కమండలువు కుడివైపున సరస్వతి ఎడమవైపున సావిత్రి పద్మపీఠమున గూర్చుండినట్లుగాని, నిలుచున్నట్లుగాని రచించవచ్చును. ఇది బ్రహ్మయొక్క లక్షణము.

### మయమతము

శ్లో॥ ఆషాఢదండస్ఫటికాక్షమాలా సువర్ణకుండీసరసీరుహాణి
బిభ్రాణమారక్తజటాకలాపం చతుర్ముఖంపీతరుచంనమామి॥
(శిల్పరత్నమున గలదు)

తా॥ మోదుగకోల, స్ఫటికపు జపమాల, బంగారు కమండలువు, పద్మము నాలుగు చేతుల యందును మిగుల నెర్రనయిన జడలును నాలుగు ముఖములును పసుపు వన్నెయును గల బ్రహ్మకు నమస్కరించెదను.

### సమరాం 77 వ. అ

"బ్రహ్మానలార్చిఃప్రతిమఃకర్తవ్యఃసుమహాద్యుతిః 2
స్థూలాంగం శ్వేతపుష్పశ్చ శ్వేతవేష్టనవేష్టితః
కృష్ణాజినోత్తరీలాశ్చ శ్వేతరాసాశ్చతుర్ముఖః॥ 3
దండఃకమండలుశ్చాస్య కర్తవ్యౌవామహస్తయోః
అక్షసూత్రధరస్తద్వత్ మౌంజామేఖలయావృతః॥ 4
కార్యోవర్ధయతవానస్తు జగద్దక్షిణపాణినా
ఏవంకృతేతులోకేక్షేమంభవతిసర్వతః॥ 5

### అపరా 214వ సూత్రము విశ్వకర్మోవాచ

శ్లో॥ ఋగ్వేదాదివిభేదేన కృతాదియుగభేదతః
విప్రాదివర్ణభేదేన చతుర్వక్త్రశ్చతుర్భుజః 1

బ్రహ్మాపితామహశ్చైవ విరంచిఃకమలాసనః
ఏకైకస్యయథా ప్రోక్తా మూర్తిఃస్యాత్పరమేష్ఠినః॥ 2
అక్షసూత్రంకరేదక్షే శుచిస్రస్యోర్ధ్వతఃస్థితా
పుస్తకంవామహస్తేచ తస్యాధస్తాత్ కమండలుః॥ 3
కమలాసనమూర్తిఃస్యాత్సర్వవర్ణహితప్రదా
కలాయుగేభవేచ్చైవం కర్తృకప్రవరాదిషు॥ 4

తా॥ ఋగ్వేదము మొదలగు నాలుగు భేదములతోను కృత యుగము మొదలు నాలుగు భేదములతోను, బ్రాహ్మణాది వర్ణ భేదములతోను బ్రహ్మ, పితామహ, విరంచి, కమలాసన, నామములు నిర్ణయింపబడినవి. అందు ఒక్కొక్క రూప లక్షణములను చెప్పుచున్నాడు. కమలాసన మూర్తికి కుడిచేతులయందు అక్షమాల దానిపైన అగ్నిపాత్రము ఎడమచేతులయందు పుస్తకము దాని దిగువ కమండలువు కలిగి యుండవలయును. కలియుగమున ముఖ్యమైనదని తెలియవలయును.

శిల్ప ఉత్త 25 వ అ.

శ్లో॥ విశేచ్చతుర్ముఖందేవం చతుర్బాహుంశుభేక్షణం
రత్నకుండలసంయుక్తం లంబకూర్చోపవీతినం॥ 123
కృష్ణాభినధరంగౌరం శుక్లాంబరవిరాజితం
దక్షిణంవరదంహస్తం తద్రాన్యంశుభధారిణం॥ 124
కమండలుధరంవామం తథాన్యంసంయుతంశుభా
బిభ్రాణంచతురోవేదాన్ పురతశ్చాస్యవిన్యసేత్॥ 125
వామేపార్శ్వేతుసావిత్రీ దక్షిణేతుసరస్వతీ
ఆఖ్యస్థాపింపురోభాగేమహర్షిశ్చసమన్వితః॥ 126
హంసారూఢంవిఖాతేక్వాపి క్వచిచ్చకమలాసనమ్
సృష్టాఅంసర్వలోకానాం బ్రహ్మాణంపరికల్పయేత్॥ 271

శ్లో॥ అక్షసూత్రంపుస్తకంచ శుచిశ్చైవకమండలుః
విరంచేఃసాభవేన్మూర్తి ద్వాపరేసుఖదాయినీ॥ 5

తా॥ విరంచియొక్క లక్షణమును చెప్పుచున్నాడు. అక్షమాల, పుస్తకము, అగ్నిపాత్రము కమండలువు ఈ నాలుగును వరుసగా కుడి చేతులలో రెండును ఎడమ చేతులలో రెండును కలిగియుండుట ద్వాపరమున ముఖ్యము.

శ్లో॥ కమండలుశ్చాక్షసూత్రం స్రువశ్చపుస్తకంతథా
పితామహస్యమూర్తిఃస్యాత్ త్రేతాయాంసుఖదాయినీ॥ 6

తా॥ పితామహ లక్షణమును చెప్పుచున్నాడు. కమండలువు, అక్షమాల, స్రువము, పుస్తకము కుడిచేతులనుండి వరుసగా నాలుగు కలిగియుండుట త్రేతాయుగమున ముఖ్యము.

శ్లో॥ పుస్తకంచాక్షసూత్రంచ స్రువశ్చైవకమండలుః
బ్రహ్మణఃసాభవేన్మూర్తిః కృతేతుసుఖదాయినీ॥ 7

బ్రహ్మసుచతుర్వక్త్రః సుభావః కర్ణసంస్థితకుండలః
కిరీటమాలాశోభాఢ్యసమాంసగలకేశకః॥ 8

తప్తకాంచనవర్ణాభో మణిరత్నహారోజ్జ్వలః
ముక్తాకటకకేయూర సర్వాభరణభూషితః॥ 9

తా॥ బ్రహ్మ యొక్క లక్షణమును చెప్పుచున్నాడు. నాలుగు ముఖములును, చెవులకు కుండలములును, కిరీటమును, హారములును, గడ్డమున వెంట్రుకలును, బంగారువంటి శరీరకాంతియును, రత్నహారములును, ముత్యముల దండలును, కడియములు బాహుపురులు సమస్తమైన యాభరణములు కలిగి కుడిచేతులలో పుస్తకము, అక్షమాల, ఎడమచేతులలో స్రువము, కమండలువు కల రూపము కృతయుగమున పూజింపబడినది యని తెలియవలయును.

## 112. చంద్రార్క పితామహ లక్షణము

అపరా. 213 వ సూ.

శ్లో॥ షడ్భుజంచచతుర్వక్త్రం సర్వాభరణభూషితం
కమండలుంచాక్షసూత్ర ముభయోఃకంజధృత్కరా॥ 35
మృణాలమూర్ధ్వకరయోః కర్తవ్యంశుభలక్షణం
సర్వాభరణసంయుక్తం సర్వకామఫలప్రదమ్॥ 36

తా॥ ఆఱు చేతులు నాలుగు ముఖములు, సమస్తమైన భూషణములు, కమండలువు, అక్షమాల, రెండు పద్మములు, తామరకాడలు రెండు, ఇట్లు ఆఱు చేతులలో నుండవలయును. ఇట్టి రూపమును చంద్రార్కపితామహుడందురు.

(అనుబంధము 41వ పటము చూడుడు)

## 113. సూర్యునకు ద్వారపాలకులు

అపరా 230 వ. సూ

శ్లో॥ దండీచపింగళశ్చైవ హ్యానందోనందకస్తథా
చిత్రోవిచిత్రోజ్ఞాతవ్యాః కిరణాక్షఃసులోచనః॥ 6
సర్వేతేపురుషాకారాః కర్తవ్యాఃశాంతిమిచ్ఛతా
అష్టౌస్యుశ్చచతుర్ద్వాఃసు సవ్యదక్షిణతఃక్రమాత్॥ 7
తర్జనీకరణశ్చైవ తామ్రచూడశ్చదండకః
దండీనామతథావామో శ్రుణుపింగలకస్యచ॥ 8
శక్తిశ్చకరణేస్థానే తామ్రచూడోఽపదేశకః
పూర్వవత్ తర్జనీదండౌ పింగలఃపూర్వదక్షి॥ 9
తర్జన్యాద్వేవజతుండా వానందకఇతిస్మృతః
తర్జనీదండాపసవ్యే సంభవేన్నందకస్తథా॥ 10

ద్వేతర్జన్యౌపద్మదండౌవామతశ్చిత్రకఃస్మృతః
తర్జనీదండాపసవ్యే విచిత్రో దక్షిణేస్థితః॥ 11

తర్జన్యౌకరణీదండః కిరణాక్షస్తథైవచ
తర్జనీదండాపసవ్యే ప్రతీహారఃసులోచనః 12

ఇత్యష్టౌచప్రతీహారాః సర్వవిఘ్నప్రణాశనాః
సర్వేతేజోమయానిత్యం సూర్యదేవప్రుత్యాత్మకాః॥ 13

తా॥ సూర్యుని యొక్క ద్వారపాలకులను ఎనిమిది మందిని చెప్పుచున్నాడు, తూర్పు వాకిట కుడివైపున దండి, తర్జని, కరణి. తామ్రచూడహస్తము (నడిమిత్రేలను బొటన త్రేలికి ఆనించి చూపుడుత్రేలిని లోపలికి వంచబడినది) దండము ఇట్లు నాలుగు చేతుల యందుండును లేక తర్జని దండము ధరించవచ్చును వీరందరు మనుష్య రూపముతోనే యుందురు. ఎడమవైపున పింగళుడు, తర్జని, శక్తి, తామ్రచూడహస్తము దండము కలిగియుండును. దక్షిణపు వాకిట కుడివైపున ఆనంధుడు, తర్జని, తర్జని, పద్మము దండము నాలుగుచేతులయందుండును ఎడమవైపున నందకుడు తర్జని, పద్మము తర్జని, దండము నాలుగుచేతుల యందుండును పడమటి వాకిట కుడి వైపున చిత్రకుడు, తర్జని, పద్మము, తర్జని, దండము నాలుగుచేతుల యందుండును ఎడమవైపున విచిత్రుడు తర్జని, తర్జని. పద్మము దండము, నాలుగుచేతుల యందుండును ఉత్తరపు వాకిట కుడివైపున కిరణాక్షుడు, తర్జని, తర్జని, కరణి, దండము నాలుగుచేతుల యందుండుంట ఎడమవైపున సులోచనుడు తర్జని, కరణి, తర్జని, దండము నాలుగుచేతుల యందుండును ఈయెనమండ్రుగుడు తేజోమయులై యుందురు సమస్త విఘ్నములను నశింపచేయుదురు,

# 114. భాస్కర లక్షణము

కాశ్యప 48వ పటలము

శ్లో॥ ద్విభుజాఃపద్మహస్తాశ్చ రక్తపద్మాసనేస్థితాః॥ 79
రక్తమండలసంయుక్తాః కరండముకుటాన్వితాః
రక్తాంబరధరాఃసర్వే సర్వాభరణభూషితాః॥ 80
షన్నవీరసమాయుక్తాః భాస్కరాద్వాదశఃస్మృతాః
వికర్తనోవివస్వాంశ్చ మార్తండోభాస్కరోరవిః॥ 81
లోకపాలఃప్రకాశశ్చ లోకసాక్షీత్రివిక్రమః
ఆదిత్యశ్చతథాసూర్యః అంశుమాలీదివాకరః 82
ఏతేవైద్వాదశాదిత్యా ఉత్తరాదిక్రమాత్ స్థితాం॥

తా॥ రెండు చేతులు, ఆ రెండు చేతుల యదదు పద్మములు ఎర్రని తామర పుష్పముపై నిలిచియుండుట రక్తమండలము కరండ ముకుటము ఎర్రని వస్త్రములు. సమస్తాభరణములు శరీరము వస్త్రము లతో గూడి యుండుట గలవారు పదిరెండు మంది భాస్కరులు, వికర్తనుడు, వివస్వంతుడు, మార్తండుడు, భాస్కరుడు, రవి, లోక పాలుడు, ప్రకాశుడు, లోకసాక్షి, త్రివిక్రముడు, ఆదిత్యుడు, సూర్యుడు, అంశుమాలి అనువారము ఉత్తరము నుండి వరుసగా నుందురు.

శిల్ప, 25. వ. అ

శ్లో॥ రక్తారుణాంభోజధరకరాభ్యా మాదీప్తభామండలమధ్య సంస్థం।
సూర్యంపిశంగాంశుకగంధమాల్యా
మాదీప్తదివ్యాభరణంనమామి॥ 80

(మయమతమునను గలదు)

తా॥ ఎఱ్ఱని తామర పూలు రెండు చేతుల యందును ప్రకాశించుచున్న కాంతిమండలము నడుమనుండువాడును. ఎఱ్ఱని వస్త్రములు, ఎఱ్ఱ నిమ్మపూత, ఎఱ్ఱని పూలదండలు కలవాఁడును సువర్ణ రత్నమయమైన సమస్తాభరణములు కలవాడును. అగు సూర్యునకు నమస్కరించెదను.

## 115. సౌర మష్టాక్షరము

శిల్పరత్నం 25. అ.

శ్లో॥ అరుణసరోరుహసంస్థ స్త్రిదృగరుణోఽరుణసరోజయుగలధరః
కవితాభయవరదకరో ద్యుతిబింబోఽమితభూషణ
స్త్వనోఽవతువః॥ 81

తా॥ ఎఱ్ఱని దామరపువ్వుపైనుండినవాడును, మూడుకన్నులు గలవాఁడును, రెండు ఎఱ్ఱని దామరపూలు చేతులయందు గల వాఁడును అభయ వరదహస్తములు గలవాఁడును సమస్తమైన భూషణములు గలవాఁడును కాంతిమండలము యొక్క నడుమనుండిన వాడును అగు సూర్యభగవానుడు మిమ్ములను రక్షించుగాక.

## 116. గ్రహసహిత సూర్యమూర్తి లక్షణము

అపరా. 214 వ. సూ.

శ్లో॥ ఆదిత్యస్య ప్రవక్ష్యామి మూర్తిమష్టగ్రహాన్వితం
రక్తవర్ణో మహాతేజాః సితపద్మోపరిస్థితః॥ 10
సర్వలక్షణసంయుక్తః సర్వాభరణభూషితః
ద్విభుజశ్చైకవక్త్రశ్చ శ్వేతపంకజధృత్కరః 11
తేజోవర్తులబింబస్య మధ్యస్థోరక్తవాసనః
ఇదమాదిత్యరూపంస్యాత్ సర్వపాపప్రణాశనమ్॥ 12
శ్వేతవర్ణో భవేత్ సోమో రక్తోహ్యంగారకస్తథా
బుధశ్చపీతవర్ణాభ స్తాదృగ్రూపంగురో స్తథా॥ 13

గోక్షీరధవళశ్శుక్రః కృష్ణవర్ణశ్శనైశ్చరః
రాజావర్తనిభోరాహుర్ధూమ్రః కేతుస్సదాభవేత్ ॥ 14

సోమఃకమలహస్తస్స్యాత్ కుజోదండకమండలూ
యోగాసనస్థశ్చబుధోగురుశ్చాక్షకమండలూ॥ 15

అక్షంకమండలుంశుక్రః శనిర్దండకమండలూ
అర్ధకాయస్థితోరాహుః కేతుఃకరపుటాకృతిః॥ 16

సప్తాశ్వరథఆదిత్యశ్చంద్రోదశహయస్స్మృతః
మేషారూఢోఽంగారకశ్చ బుధస్సర్పాసనస్థితః 17

హంసారూఢంగురుంవిద్యాత్ శుక్రందర్దురవాహనం
శనించమహిషారూఢం రాహుండప్టైకుండమధ్యగమ్॥ 18

సర్పశీర్షాకృతింకేంతు శనిందంష్ట్రాకరాలకం
కిరీటమాలాశోభాఢ్యాః సర్వాభరణభూషితాః॥ 19

ఇవి సూత్ర సంతాన గుణకీర్తి ప్రకాశప్రోక్త శ్రీభువనదేవాచార్యోక్తాపరాజితపృచ్ఛాయాం బ్రహ్మసూర్యాదినవగ్రహాధికారో నామ చతుర్థశోత్తరద్విశతతమం సూత్రమ్.

తా॥ చంద్రుడు మొదలగు నెనిమిది గ్రహములతో గూడిన సూర్యుని యొక్క లక్షణమును చెప్పుచున్నాడు. తూర్పు ముఖమును, ఎరుపు వన్నెయును, గొప్ప తేజస్సును, తెల్లని పద్మముపై

నున్న వాడును, సమస్తమైన శుభలక్షణములును, అన్ని విధములైన ఆభరణములుగలవాడును, రెండు చేతులును ఒక్క తలయును, చేతులయందు పద్మములును, గుండ్రని తేజస్సు గల బింబము యొక్క నడుమనున్నవాడును, ఎర్రని వస్త్రములును, కలవాడు సూర్యుడని తెలియవలయును. చంద్రుడు పడమర ముఖము తెలుపువన్నె అంగారకుడు దక్షిణ ముఖము ఎరుపువన్నె, బుధుడు ఉత్తరముఖము పసుపు వన్నె, గురుడు తూర్పు ముఖము పసుపు వన్నె, శుక్రుడు తూర్పు ముఖము తేలుపువన్నె, శని పడమరముఖం నలుపువన్నె, రాహువు నైరృతి ముఖము నలుపువన్నె, కేతువు దక్షిణ ముఖము ధూమ్ర వర్ణము. చంద్రునికి చేతులయందు పద్మము లుండును. కుజునికి చేతులయందు దండము కమండలువు ఉండును. బుధుడు యోగాసనమున నుండును. బృహస్పతి అక్షమాల కమండలువు కలిగి యుండును. శుక్రుడు అక్షమాల కమండలువు కలిగి యుండును. శని దండము, కమండలువు కలిగి యుండును. రాహువు సగము శరీరము మాత్రమే కలిగి యుండును కేతువు పగడవలె నుండును. సూర్యునకు ఏడు గుర్రములు గల రథము చంద్రుడు పది గుర్రములు గల తేరు. అంగారకుడు మేకపోతుపై నుండును. బుధుడు సర్పాసనముపై నుండును. బృహస్బతి హంసపై నుండును. శుక్రుడు కప్పపై నుండును. శని దున్నపోతుపై నుండును. శని రాహువు కుండము యొక్క నడుమనుండును. కేతువు పాము పడగ ఆకారమున నుండును. శని భయంకరమైన కోఱలు కలిగి యుండును. కిరీటములు హారములు మొదలయిన భూషణములు అందరికిని కలిగి యుండవలయును.

శిల్ప. ఉత్త. 25. అ అ.

శ్లో॥ రక్తవర్ణో మహాతేజా ద్విబాహుః పద్మభృద్రవిః
సప్తభిస్తురగైర్యుక్తే సర్పరజ్జుసమన్వితే॥ 238

ఏకచక్రేరథేతిష్ఠన్ పాదాక్రాంతసరోరుహః
మాణిక్యకుండలోపేతః పద్మరాగకిరీటకః॥ 139

రక్తాంబరధరోరమ్యః సువ్యక్తాంగో మనోహరః
అనూరుఃసారథిఃకార్యః ప్రతీహారౌచపార్శ్వయోః॥ 140

దండపింగలనామానౌ ఖడ్గఖేటకధారిణౌ॥

తా॥ సూర్యుడు ఎరుపు వన్నె గొప్ప తేజస్సు రెండు చేతులలో పద్మములు ఏడు గుర్రములును ఒంటి చక్రమును గల రథము సర్పము త్రాడు పద్మపీఠము మాణిక్య కుండలములు మాణిక్య కిరీటం ఎఱ్ఱని వస్త్రములు, చక్కని రూపము అనూరుడు రథసారథి దండుడు పింగళుడు అనువారలు ఖడ్గమును ఖేటకమును బూని సూర్యున కిరు వైపుల నుండుటయును గలది సూర్య లక్షణము.

(అనుబంధము 42వ పటము చూడుడు)

## 117. చంద్ర లక్షణము

శిల్ప. ఉత్త. 25వ. అ

శ్లో॥ చంద్రశ్చ్వేతేవిధాతవ్యః శ్వేతాంబరసమావృతః॥ 141
దశ శ్వేతాశ్వ సంయుక్త మారూఢస్యందనంశుభం

ద్విభుజోదక్షిణేపాణౌ గదాంబిభ్రత్ పృథూదరీమ్॥ 143
వామస్తువరదోహస్తః శశాంకస్యనిరూప్యతే॥

తా॥ చంద్రుడు తెలుపు తెల్లని గుఱ్ఱములు పది గల రథము రెండు చేతులు కుడిచేత గద కలవాడు.

## 118. అంగారక లక్షణము

శిల్ప ఉత్త. 25 అ.

శ్లో॥ ధరాపుత్రస్యవక్ష్యామి లక్షణంచిత్రకర్మణి
చతుర్భుజోమేషగమ శ్చాంగారకసముద్యుతిః॥ 143

దక్షిణంపుస్తకంహస్తం వరదంపరికల్పయేత్
ఊర్ధ్వంశక్తిసమాయుక్తం హామాశక్తిగదాధరా॥ 144

తా॥ అంగారకుడు నాలుగు చేతులును కుడివైపున పుస్తకము, వరదము, పైన శక్తి దిగువ గద యెడమవైపునను మేషవాహనమును రచించవలయును.

## 119. బుధ లక్షణము

శిల్ప. ఉత్త. 25 అ.

శ్లో॥ సింహారూఢంసంప్రవక్ష్యే కర్ణికారసమప్రభం
పీతమాల్యాంబరధరం స్వర్ణభూషావిభూషితమ్॥ 145

వరదంఖడ్గసంయుక్తం ఖేటకేనసమన్వితం
గదయాచసమాయుక్తం బిభ్రాణందోశ్చతుష్టయమ్॥
ఏవంలిఖేచ్చంద్రసూనుం బుధంగ్రహపతింవరమ్ 146

తా॥ బుధునకు సింహ వాహనము పసుపువన్నె పసుపువస్త్రం బంగారు నగలు, వరదము ఖడ్గము, ఖేటకము గద నాలుగు చేతుల యందును రచించవలయును.

## 120. గురు లక్షణము, శుక్రలక్షణము

శిల్ప. ఉత్త. 25. అ.

శ్లో॥ తతోదేవగురుర్లేఖ్యః శుక్రశ్చభృగునందనః
చతుర్భిర్బాహుభిర్యుక్తశ్చిత్రకర్మవిశారదైః॥ 148
వరదాసాక్షసూత్రౌచ కమండలుధరౌతథా
దండినౌచతథాబాహూ బిభ్రాణౌపరికల్పయేత్॥ 149

తా॥ బృహస్పతి శుక్రుడు నాలుగు చేతులతోను వరదము, అక్షమాల, కమండలువుతో యోగదండము కలిగి యుండవలయును.

## 121. శనైశ్చర లక్షణము

శిల్ప. ఉత్త. 25. అ

శ్లో॥ స్థౌరింనీలసమాభాసం గృధ్రారూఢంచతుర్భుజం
వరదంవామసంయుక్తం చాపంశూలంశరంవిలిఖేత్॥ 150

తా॥ శని నీలవర్ణమును, గద్దపైనెక్కినవాడును నాలుగు చేతులు వరదము, ధనుస్సు, ఎడమచేతులలోను శూలము, బాణము కుడిచేతులలోను రచించవలయును.

## 122. రాహుకేతువుల లక్షణములు

శిల్ప. ఉత్త. 25. అ

శ్లో॥ సింహాసనగతంరాహుం కరాలవదనంవిభాత్
వరదంఖడ్గసంయుక్తం ఖేటశూలధరంక్రమాత్ ॥ 151
ధూమ్రాద్విబాహవఃసర్వే వరదాశ్చగదాధరాః
గృధ్రపృష్ఠసమారుఢా లేఖనీయాస్తుకేతవః॥ 152

తా॥ రాహువు భయంకరమైన ముఖమును వరదము ఖడ్గము ఖేటము, శూలము గల నాలుగు చేతులును సింహాసనముపైనను లేక రాహుకేతువు లిరుద్దరును ధూమ్రవర్ణమును రెండు చేతులును వరదము గద రెండు చేతులయందును గద్దపైనెక్కియున్నట్లును రచించవలయును,

## 123. గ్రహస్థానములు-రూపములు

శ్లో॥ ప్రాగాదిదిశసంస్థాః శశిగురుబుధభార్గవాఃక్రమేణస్యుః
ఆగ్నేయాదిస్వ్రశిషుధరణిజ మందాహి కేతవఃప్రాజ్యాః॥ 153
శుభ్రసితపీతశుక్లా రక్తాసితధూమ్రకృష్ణకాఃక్రమశః
చంద్రాదాద్యాః కేత్వాంతా వామోరువ్యస్తవామకరలసితాః॥
154

అపరకరాభయముద్రా
వికృతముఖోఽహిఃకరాహితాంజలియుక్
దంష్ట్రోగ్రాస్యోమందః సువర్ణసదృశాంకుశాదిభూషశ్చ॥ 155
అరుణసరోరుహసంస్థ స్త్రిదృగరుణోఽరుణసరోజయుగళధారః
కవితాభయవరదకరో ద్యుతిబింబోఽసితభూషణ స్త్వినోఽ
వతువః॥ 156

తా॥ (తూ) చంద్రుడు (ద) గురువు (ప) బుధుడు (ఉ) శుక్రుడు (ఆ) కుజుడు (నై) శని (వా) రాహువు (ఈ) కేతువు చంద్రుడు తెలుపు, గురువు తెలుపు, బుధుడుపసుపు, శుక్రుడు తెలుపు, కుజుడు ఎరుపు నలుపు శని రాహువు ధూమ్రవర్ణము కేతువు నలుపుఅందరును ఎడమతొడయందు ఎడమచేయి నుంచవలయును. కుడిచెయ్యి అభయము అందు రాహువునకు వికారమైన ముఖము అంజలిబద్ధుడును పెద్ద కోరలు గలవాడు శని బంగారు నగలు సూర్యుడు మూడు కన్నులును రెండు చేతులయందు పద్మములును ధరించి చుట్టును కాంతిమండలమును గలిగియుండును.

—•—

# 124. గృధా లక్షణము

శిల్ప. ఉత్త. 25. అ

శ్లో॥ గృధ్రాశ్చ కిరీటినః కార్యా నవతాలప్రమాణకాః
రత్నకుండలకేయూర హారాభరణభూషితాః॥ 157

ఇది శ్రీమద్విశ్వకర్మ వంశమూలర్షి పంచకమధ్యమామహాభౌవనసగోత్ర
పవిత్ర స్వర్ణాచ్ఛమాంబా వేంకట శివార్యపౌత్ర, లక్ష్మాంబా
కోటయ సుధీమణి పుత్ర శ్రీమద్గాయత్రీ విరాడ్విశ్వకర్మ వర
ప్రసాదజనిత కవితాసుధారసపాత్ర పదవాక్యప్రమాణ నిధాన
విమర్శకాచార్య- శిల్పకళాకోవిద- సర్వతంత్ర స్వతంత్ర-
స్థపతి తిలకాది బిరుద విరాజమాన, సుబ్రహ్మణ్యాభి
ధాన విరచిత నానావస్తు శిల్పాగమశాస్త్ర పరిశీల
నాత్మకాంధ్రతాత్పర్య సహిత భారతీయ మహా
శిల్పము నందు శిలాలక్షణము గల లింగ
లక్షణము, లింగభేదములు, లింగపీఠ
లక్షణము-లింగపీఠ భేదములు వృషభ
లక్షణము, ప్రతీహారులు శివరూప
భేదములు, గణపతి భేదములు
షణ్ముఖ లక్షణములు, వీర
భద్ర లక్షణములు,
బ్రహ్మలక్షణములు,
సూర్య లక్షణములు,
గ్రహముల లక్షణములు గల
నవమ కళ

